# భారత సంవిధానము

**(21 జనవరి, 2021 వరకు సవరించబడినది)**

# 2021

**భారత ప్రభుత్వము**

**న్యాయ మరియు న్యాయ పాలన మంత్రిత్వ శాఖ**

**శాసనాధికార విభాగము**

# భారత సంవిధానము

## (సంవిధాన నూట నాల్గవ సవరణ చట్టము, 2019 వరకు సవరించబడినది)

## విషయసూచి

## భాగము – 3

## మౌలిక హక్కులు

### సాధారణ విషయములు

12. నిర్వచనము.

13. మౌలిక హక్కులకు అసంగతముగనున్న లేక వాటిని న్యూనవరచు (స్థాయిని తగ్గించు) శాసనములు.

### సమానత్వమునకు హక్కు

14. శాసనదృష్టిలో సమానత్వము.

15. మతము, జాతి, కులము, లింగభేదము, లేక జన్మస్థాన కారణములను బట్టి విచక్షణ చేయుటపై నిషేధము.

16. పబ్లికు ఉద్యోగము విషయములో సమానావకాశము.

17. అస్పృశ్యతా నిర్మూలన.

18. బిరుదుల రద్దు.

### స్వాతంత్ర్యమునకు హక్కు

19. వాక్స్వాతంత్ర్యము మొదలైనవాటి విషయమున రక్షణ.

20. అపరాధములకై నేరస్థాపన విషయమున రక్షణ.

21. ప్రాణము మరియు వైయక్తిక స్వాతంత్ర్యముల రక్షణ.

21ఏ. విద్యాహక్కు.

22. కొన్ని సందర్భములలో అరెస్టు మరియు నిరోధము నుండి రక్షణ.

### శోషణ నుండి రక్షణకు హక్కు

23. మనుష్యుల క్రయ విక్రయములపై మరియు బలవంతపు చాకిరీలపై నిషేధము.

24. కార్ఖానాలు మొదలైన వాటిలో బిడ్డలను ఉద్యోగములో నుంచుటపై నిషేధము.

### మతస్వాతంత్ర్యమునకు హక్కు

25. అంతరాత్మననుసరించు స్వాతంత్ర్యము, స్వేచ్ఛాయుత మతావలంబన, ఆచరణ, ప్రచారములు.

26. మత వ్యవహార నిర్వహణ స్వాతంత్ర్యము.

27. ఏదేని ప్రత్యేకమైన మతమును వర్థిల్ల జేయుటకు పన్నుల చెల్లింపును గూర్చిన స్వాతంత్ర్యము.

28. కొన్ని విద్యాసంస్థలలో మతబోధ లేక మత సంబంధమైన ఆరాధన జరుగునప్పుడు హాజరగుటను గూర్చిన స్వాతంత్ర్యము.

## సాంస్కృతిక మరియు విద్యావిషయక హక్కు

29. అల్ప సంఖ్యాక వర్గముల యొక్క హితముల రక్షణ.

30. విద్యా సంస్థలను స్థాపించుటకు మరియు నిర్వహించుటకు అల్ప సంఖ్యాక వర్గములకుగల హక్కు

31. ఆస్తి యొక్క నిర్బంధ అర్జన (లుప్తము చేయబడినది)

## కొన్ని శాసనముల వ్యావృత్తి

31ఏ. ఎస్టేట్లు మొదలగువాటి అర్జన కొరకు నిబంధించు శాసనముల వ్యావృత్తి.

31బీ. కొన్ని చట్టములకు మరియు వినియమములకు మాన్యత కలుగజేయుట.

31సీ. కొన్ని ఆదేశిక సూత్రములను అమలుపరచు శాసనముల వ్యావృత్తి.

31డీ. జాతి వ్యతిరేక కలాపములను గూర్చిన శాసనముల వ్యావృత్తి (లుప్తము చేయబడినది)

## సంవిధానిక ప్రత్యుపాయములకు హక్కు

32. ఈ భాగముచే ప్రదత్తము చేయబడిన హక్కులను అమలుపరచుటకు ప్రత్యుపాయములు.

32-ఏ. (లుప్తము చేయబడినది)

33. ఈ భాగము ద్వారా ప్రదత్తమైన హక్కులను సాయుధ బలములకు వర్తింపజేయునప్పుడు వాటిని మార్చుటకు పార్లమెంటుకు అధికారము.

34. ఏదేని ప్రాంతములో సైనిక శాసనము అమలులోనున్నప్పుడు ఈ భాగము ద్వారా ప్రదత్తమైన హక్కులపై నిర్బంధన.

35. ఈ భాగము యొక్క నిబంధనలను అమలుపరచుటకు శాసన నిర్మాణవ

## భాగము – 3

## రాజ్య విధానము యొక్క ఆదేశిక సూత్రములు

36. నిర్వచనము.

37. ఈ భాగములోగల సూత్రముల వర్తింపు.

38. రాజ్యము ప్రజల శ్రేయస్సును పెంపొందించు సాంఘిక వ్యవస్థను చేకూర్చుట.

39. రాజ్యము అనుసరించవలసిన విధానమును గూర్చిన కొన్ని సూత్రములు.

## భాగము – 4ఏ

## మౌలిక కర్తవ్యములు



## భాగము – 5

## సంఘము

### అధ్యాయము –1 – కార్యపాలకవర్గము

### రాష్ట్రపతి మరియు ఉపరాష్ట్రపతి

**మంత్రి పరిషత్తు**

## భారతదేశ అటార్నీ జనరలు

76. భారతదేశ అటార్నీ జనరలు.

## ప్రభుత్వము యొక్క కార్యకలాపముల నిర్వహణము

77. భారత ప్రభుత్వము యొక్క కార్యకలాప నిర్వహణము.

78. రాష్ట్రపతికి సమాచారమును అందజేయుట మున్నగు విషయములను గురించి ప్రధానమంత్రి కర్తవ్యములు.

## అధ్యాయము–2 – పార్లమెంటు

## సాధారణ విషయములు

79. పార్లమెంటు యొక్క సంఘటన.

80. రాజ్యసభ సంరచన.

81. లోకసభ సంరచన.

82. ప్రతి జనగణన పిమ్మట తిరిగి సర్దుబాటు.

83. పార్లమెంటు యొక్క సదనముల కాలావధి.

84. పార్లమెంటు సభ్యత్వమునకు కాలావధి.

85. పార్లమెంటు యొక్క అధివేశనములు, అధివేశనావసానము మరియు విఘటన.

86. సదనములలో ప్రసంగించుటకును, వాటికి సందేశములను పంపుటకును, రాష్ట్రపతికి గల హక్కు.

87. రాష్ట్రపతి విశేష ప్రసంగము.

88. సదనములను గూర్చి మంత్రులకు మరియు అటార్నీ జనరలుకు గల హక్కులు.

## పార్లమెంటు అధికారులు

89. రాజ్యసభ యొక్క సభాపతి మరియు ఉపసభాపతి.

90. ఉపసభాపతి పదవిని ఖాళీ చేయుట, ఆ పదవికి రాజీనామా ఇచ్చుట మరియు ఆ పదవి నుండి తొలగింపబడుట.

91. సభాపతి పదవికి చెందిన కర్తవ్యములను నిర్వర్తించుటకుగాని, సభాపతిగా వ్యవహరించుటకుగాని, ఉపసభాపతి లేక ఇతర వ్యక్తికిగల అధికారము.

92. సభాపతిని లేక ఉపసభాపతిని పదవి నుండి తొలగించుటకు తీర్మానము పర్యాలోచింపబడుచున్నప్పుడు ఆయన అధ్యక్షత వహించకుండుట.

93. లోక్‌సభ అధ్యక్షుడు మరియు ఉపాధ్యక్షుడు.

94. అధ్యక్ష లేక ఉపాధ్యక్ష పదవిని ఖాళీ చేయుట, ఆ పదవికి రాజీనామా ఇచ్చుట మరియు ఆ పదవి నుండి తొలగింపబడుట.

95. అధ్యక్ష పదవికి చెందిన కర్తవ్యములను నిర్వర్తించుటకుగాని, అధ్యక్షుడుగా వ్యవహరించుటకుగాని, ఉపాధ్యక్షునికి లేక ఇతర వ్యక్తికి గల అధికారము.

96. అధ్యక్షుని లేక ఉపాధ్యక్షుని పదవి నుండి తొలగించుటకు తీర్మానము పర్యాలోచింపబడుచున్నప్పుడు ఆయన అధ్యక్షత వహించకుండుట.

97. సభాపతి, ఉపసభాపతి మరియు అధ్యక్షుని, ఉపాధ్యక్షుని యొక్క జీతములు మరియు బత్తెములు.

98. పార్లమెంటు యొక్క సచివాలయము.

## కార్యకలాప నిర్వహణము

99. సభ్యులచే ప్రమాణము లేక ప్రతిజ్ఞ.

100. సదనములలో ఓటింగు, ఖాళీలున్నప్పటికిని వ్యవహరించుటకు సదనములకు గల అధికారము మరియు కోరము.

## సభ్యుల నిరర్హతలు

101. స్థానములను ఖాళీ చేయుట.

102. సభ్యత్వమునకు నిరర్హతలు.

103. సభ్యుల నిరర్హతలకు సంబంధించిన ప్రశ్నలపై నిర్ణయము.

104. 99వ అనుచ్ఛేదము క్రింద ప్రమాణము లేక ప్రతిజ్ఞ చేయుటకు పూర్వముగాని, అర్హత లేనప్పుడుగాని లేక నిరర్హుడైనప్పుడుగాని ఉపవిష్టుడైనందుకు (కూర్చున్నందుకు) మరియు ఓటు చేసినందుకు శాస్తి.

## పార్లమెంటుకు, దాని సభ్యులకు గల అధికారములు, విశేషాధికారములు మరియు ఉన్ముక్తతలు.

105. పార్లమెంటు సదనములకు, దాని సభ్యులకు, కమిటీలకు గల అధికారములు, విశేషాధికారములు మున్నగునవి.

106. సభ్యుల జీతములు, బత్తెములు.

## శాసన నిర్మాణ ప్రక్రియ

107. బిల్లులను ప్రవేశ పెట్టుటకును, పాస్ చేయుటకును నిబంధనలు.

108. కొన్ని సందర్భములలో ఉభయ సదనముల సంయుక్త ఉపవేశనము.

109. ధన సంబంధమైన బిల్లులను గూర్చిన విశేష ప్రక్రియ.

| | |
|---|---|
| 129. | సర్వోన్నత న్యాయాస్థానము రికార్డు న్యాయస్థానముగ నుండుట. |
| 130. | సర్వోన్నత న్యాయాస్థానము యొక్క స్థానము. |
| 131. | సర్వోన్నత న్యాయాస్థానము యొక్క ఆరంభిక అధికారిత. |
| 131ఏ. | (లుప్తము చేయబడినది). |
| 132. | కొన్ని కేసులలో ఉన్నత న్యాయస్థానము నుండి చేయబడిన అప్పీళ్ళలో సర్వోన్నత న్యాయాస్థానము యొక్క అప్పీలు అధికారిత. |
| 133. | సివిలు విషయములలో ఉన్నత న్యాయస్థానముల నుండి చేయబడిన అప్పీళ్ళలో సర్వోన్నత న్యాయాస్థానము యొక్క అప్పీలు అధికారిత. |
| 134. | క్రిమినలు విషయములలో సర్వోన్నత న్యాయాస్థానము యొక్క అప్పీలు అధికారిత. |
| 134ఏ. | సర్వోన్నత న్యాయాస్థానమునకు అప్పీలుకై ధ్రువ పత్రము. |
| 135. | అస్తిత్వములోనున్న శాసనము క్రింద ఫెడరల్ న్యాయస్థానమునకు గల అధికారిత మరియు అధికారములు సర్వోన్నత న్యాయస్థానముచే వినియోగింపబడదగి యుండుట. |
| 136. | అప్పీలు చేసికొనుటకు సర్వోన్నత న్యాయాస్థానముచే విశేష అనుజ్ఞ. |
| 137. | సర్వోన్నత న్యాయాస్థానముచే ఇవ్వబడిన తీర్పులు, లేక ఉత్తర్వుల పునర్విలోకన. |
| 138. | సర్వోన్నత న్యాయాస్థానము యొక్క అధికారితను విస్తృత పరచుట. |
| 139. | కొన్ని అధిలేఖలను (రిట్లను) జారీ చేయు అధికారములను సర్వోన్నత న్యాయాస్థానమునకు ప్రదత్తము చేయుట. |
| 139ఏ. | కొన్ని కేసుల అంతరణ. |
| 140. | సర్వోన్నత న్యాయాస్థానమునకు గల సహాయక అధికారములు. |
| 141. | సర్వోన్నత న్యాయాస్థానముచే ప్రఖ్యానించబడిన శాసనము, న్యాయస్థానములన్నింటికి అనుసరణీయమై యుండుట. |
| 142. | సర్వోన్నత న్యాయస్థానము యొక్క డిక్రీలను, ఉత్తరువులను, అమలు పరచుట, మరియు వెల్లడి మున్నగు వాటిని గూర్చిన ఉత్తరువులు. |
| 143. | సర్వోన్నత న్యాయాస్థానము యొక్క అభిప్రాయము గైకొనుటకు రాష్ట్రపతికి గల అధికారము. |
| 144. | సివిలు మరియు న్యాయిక ప్రాధికారులు, సర్వోన్నత న్యాయాస్థానమునకు సహాయకులుగా వ్యవహరించుట. |
| 144ఏ. | (లుప్తము చేయబడినది) |
| 145. | న్యాయస్థానపు నియమావళి మున్నగునవి. |
| 146. | సర్వోన్నత న్యాయస్థానము యొక్క అధికారులు, సేవకులు మరియు వ్యయములు. |
| 147. | అర్థాన్వయము. |

### అధ్యాయము–5 – భారతదేశ కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు.

148. భారతదేశ కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు.

149. కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు యొక్క కర్తవ్యములు మరియు అధికారములు.

150. లెక్కలను గూర్చి ఆదేశముల నిచ్చుటకు కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలుకు గల అధికారము.

151. ఆడిట్ రిపోర్టులు.

## భాగము – 6

## రాజ్యములు

### అధ్యాయము–1 – సాధారణ విషయములు

152. నిర్వచనము.

### అధ్యాయము–2 – కార్యపాలక వర్గము

### గవర్నరు

153. రాజ్య గవర్నర్లు.

154. రాజ్యము యొక్క కార్యపాలకాధికారము.

155. గవర్నరు నియామకము.

156. గవర్నరు పదవీ కాలావధి.

157. గవర్నరుగా నియమింపబడుటకు అర్హతలు.

158. గవర్నరు పదవీ షరతులు.

159. గవర్నరుచే ప్రమాణము లేక ప్రతిజ్ఞ.

160. కొన్ని యాదృచ్ఛిక పరిస్థితులలో గవర్నరు యొక్క కృత్యముల నిర్వహణ.

161. కొన్ని సందర్భములలో క్షమాపణలు మొదలైన వాటిని మంజూరు చేయుటకు మరియు దండనోత్తరువులను సస్పెండు చేయుటకు, పరిహరించుటకు లేక లఘూకరించుటకు గవర్నరుకు గల అధికారము.

162. రాజ్య కార్యపాలకాధికారము యొక్క విస్తరణ.

### మంత్రి పరిషత్తు

163. గవర్నరుకు సహాయపడుటకును, సలహానిచ్చుటకును మంత్రి పరిషత్తు.

164. మంత్రులను గూర్చిన ఇతర నిబంధనలు.

**రాజ్యము యొక్క అడ్వకేటు జనరలు**

165. రాజ్యము యొక్క అడ్వకేటు జనరలు.

**ప్రభుత్వ కార్యకలాపముల నిర్వహణము**

166. రాజ్య ప్రభుత్వము యొక్క కార్యకలాప నిర్వహణము.

167. గవర్నరుకు సమాచారము అందజేయుట, మున్నగు విషయములను గురించి ముఖ్యమంత్రి కర్తవ్యములు.

## అధ్యాయము–3 – రాజ్యశాసన మండలి

**సాధారణ విషయములు**

168. రాజ్యములలో శాసనమండలుల సంఘటన.

169. రాజ్యములలో శాసన పరిషత్తుల ఉత్సాదన (రద్దు) లేక ఏర్పాటు.

170. శాసనసభల సంరచన.

171. శాసన పరిషత్తు సంరచన.

172. రాజ్య శాసనమండలుల కాలావధి.

173. రాజ్య శాసనమండలులలో సభ్యత్వమునకు అర్హత.

174. రాజ్య శాసనమండలి యొక్క అధివేశనములు, అధివేశనావసానము మరియు విఘటన.

175. సదనము లేక సదనములలో ప్రసంగించుటకును, వానికి సందేశములను పంపుటకును, గవర్నరుకు గల హక్కు.

176. గవర్నరు యొక్క విశేష ప్రసంగము.

177. సదనములను గూర్చి మంత్రులకు మరియు అడ్వకేటు జనరలుకు గల హక్కులు.

**రాజ్య శాసనమండలి అధికారులు**

178. శాసనసభ యొక్క అధ్యక్షుడు మరియు ఉపాధ్యక్షుడు.

179. అధ్యక్ష లేక ఉపాధ్యక్ష పదవిని ఖాళీ చేయుట, ఆ పదవికి రాజీనామా ఇచ్చుట మరియు ఆ పదవి నుండి తొలగింపబడుట.

180. అధ్యక్ష పదవికి చెందిన కర్తవ్యములను నిర్వర్తించుటకుగాని, అధ్యక్షుడుగా వ్యవహరించుటకు గాని, ఉపాధ్యక్షునికి, లేక ఇతర వ్యక్తికి గల అధికారము.

181. అధ్యక్షుని లేక ఉపాధ్యక్షుని పదవి నుండి తొలగించుటకు తీర్మానము పర్యాలోచింపబడుచున్నప్పుడు ఆయన అధ్యక్షత వహించకుండుట.

182. శాసన పరిషత్తు యొక్క సభాపతి మరియు ఉపసభాపతి.

183. సభాపతి లేక ఉపసభాపతి పదవిని ఖాళీ చేయుట, ఆ పదవికి రాజీనామా ఇచ్చుట మరియు ఆ పదవి నుండి తొలగింపబడుట.

184. సభాపతి పదవికి చెందిన కర్తవ్యములను నిర్వర్తించుటకుగాని సభాపతిగా వ్యవహరించుటకుగాని ఉపసభాపతికి లేక ఇతర వ్యక్తికి గల అధికారము.

185. సభాపతి లేక ఉపసభాపతిని పదవి నుండి తొలగించుటకు తీర్మానము పర్యాలోచింపబడుచున్నప్పుడు ఆయన అధ్యక్షత వహించకుండుట.

186. అధ్యక్షుని, ఉపాధ్యక్షుని మరియు సభాపతి, ఉపసభాపతి యొక్క జీతములు మరియు భత్యములు.

187. రాజ్య శాసనమండలి యొక్క సచివాలయము.

## కార్యకలాప నిర్వహణము

188. సభ్యులచే ప్రమాణము లేక ప్రతిజ్ఞ.

189. సదనములలో ఓటింగు, ఖాళీలున్నప్పటికిని వ్యవహరించుటకు సదనములకు అధికారము మరియు కోరము.

## సభ్యుల నిరర్హతలు

190. స్థానములను ఖాళీ చేయుట.

191. సభ్యత్వమునకు నిరర్హతలు.

192. సభ్యుల నిరర్హతలను గూర్చిన ప్రశ్నలపై నిర్ణయము.

193. 188వ అనుచ్ఛేదము క్రింద ప్రమాణము, లేక ప్రతిజ్ఞ చేయుటకు పూర్వముగాని, అర్హత లేనప్పుడుగాని లేక నిరర్హుడైనప్పుడుగాని ఉపవిష్టుడైనందుకు మరియు ఓటు చేసినందుకు శాస్తి.

## రాజ్య శాసనమండలులకు మరియు వాటి సభ్యులకు గల అధికారములు, విశేషాధికారములు మరియు ఉన్ముక్తతలు.

194. రాజ్య శాసన మండలుల సదనములకు, వాటి సభ్యులకు మరియు కమిటీలకు గల అధికారములు, విశేషాధికారములు మున్నగునవి.

195. సభ్యుల జీతములు మరియు భత్యములు.

## శాసన నిర్మాణ ప్రక్రియ

196. బిల్లులను ప్రవేశ పెట్టుటకు, పాస్ చేయుటకును నిబంధనలు.

197. ధన సంబంధమైనవి కానట్టి బిల్లులను గూర్చి రాజ్య శాసన పరిషత్తు యొక్క అధికారములపై నిర్బంధన.

198. ధన సంబంధమైన బిల్లులను గూర్చిన విశేష ప్రక్రియ.

## విత్తీయ విషయములలో ప్రక్రియ



## సాధారణ ప్రక్రియ



## అధ్యాయము–4 – గవర్నరు యొక్క శాసన నిర్మాణాధికారములు.



## అధ్యాయము–5 – రాజ్యములలో ఉన్నత న్యాయస్థానములు

219. ఉన్నత న్యాయస్థానపు న్యాయాధీశులచే ప్రమాణము లేక ప్రతిజ్ఞ.

220. స్థాయీ న్యాయాధీశునిగా ఉన్న తరువాత న్యాయవాద వృత్తిని ఆచరించుటపై నిర్బంధన.

221. న్యాయధీశుల జీతములు మున్నగునవి.

222. ఒక ఉన్నత న్యాయస్థానము నుండి మరొక ఉన్నత న్యాయ స్థానమునకు న్యాయాధీశుని బదిలీ.

223. కార్యకారి ముఖ్య న్యాయమూర్తి నియామకము.

224. అదనపు మరియు కార్యకారి న్యాయధీశుల నియామకము.

224ఏ. ఉన్నత న్యాయస్థానము యొక్క ఉపవేశనములందు పదవీ విరమణ చేసిన న్యాయాధీశుల నియామకము.

225. ప్రస్తుతమున్న ఉన్నత న్యాయస్థానముల యొక్క అధికారిత.

226. ఉన్నత న్యాయస్థానములు కొన్ని అధిలేఖలను (రిట్లను) జారీ చేయుటకు అధికారము.

226ఏ. (లుప్తము చేయబడినది)

227. న్యాయస్థానములన్నిటి పైన ఉన్నత న్యాయస్థానము యొక్క అధీక్షణాధికారము.

228. ఉన్నత న్యాయస్థానమునకు కొన్ని కేసుల అంతరణ.

228ఏ. (లుప్తము చేయబడినది)

229. ఉన్నత న్యాయస్థానముల అధికారులు సేవకులు మరియు వ్యయములు.

230. ఉన్నత న్యాయస్థానముల అధికారితను సంఘ రాజ్యక్షేత్రములను విస్తరింపజేయుట.

231. రెండు లేక రెంటికి మించిన రాజ్యములకు ఒకే ఉమ్మడి ఉన్నత న్యాయస్థానము యొక్క స్థాపన.

232. (లుప్తము చేయబడినది).

## అధ్యాయము-6 – అధీనస్థ న్యాయస్థానములు

233. జిల్లా న్యాయాధీశుల నియామకము.

233ఏ. కొందరు జిల్లా న్యాయాధీశుల నియామకమును, మరియు వారిచే నొసగబడిన తీర్పులు మొదలగు వాటిని మాన్యమొనర్చుట.

234. న్యాయిక సేవావర్గములలో జిల్లా న్యాయాధీశులు కాక ఇతర వ్యక్తుల భర్తీ.

235. అధీనస్థ న్యాయస్థానములపైన నియంత్రణ.

236. అర్థాన్వయము.

237. ఏదేని తరగతి లేక కొన్ని తరగతుల మెజిస్ట్రేట్లకు ఈ అధ్యాయము యొక్క నిబంధనల వర్తింపు.

## భాగము – 7 (లుప్తము చేయబడినది)
## మొదటి అనుసూచి యొక్క భాగము ‘బీ’ రాజ్యములు

238. (లుప్తము చేయబడినది).

## భాగము – 8
## సంఘ రాజ్య క్షేత్రములు

239. సంఘ రాజ్య క్షేత్రముల పాలనము.

239ఏ. కొన్ని సంఘ రాజ్య క్షేత్రములకు స్థానిక శాసనమండలులను లేక మంత్రి పరిషత్తులను లేక రెంటిని ఏర్పాటు చేయుట.

239ఏఏ. ఢిల్లీకి సంబంధించి ప్రత్యేక నిబంధనలు.

239ఏబీ. సంవిధానిక యంత్రాంగము విఫలమైన సందర్భములో నిబంధనలు.

239బీ. శాసన మండలి యొక్క విరామ కాలములో అధ్యాదేశములను ప్రఖ్యాపన చేయుటకు పాలకునకు గల అధికారము.

240. కొన్ని సంఘ రాజ్యక్షేత్రముల కొరకు వినియమములను చేయుటకు రాష్ట్రపతికి గల అధికారము.

241. సంఘ రాజ్యక్షేత్రముల కొరకు ఉన్నత న్యాయస్థానములు.

242. (లుప్తము చేయబడినది).

## భాగము –9
## పంచాయితీలు

243. నిర్వచనములు.

243ఏ. గ్రామ సభ.

243బీ. పంచాయతీల సంఘటన.

243సీ. పంచాయతీల సంరచన.

243డీ. సీట్ల ప్రత్యేకీకరణ.

243ఈ. పంచాయతీల కాలావధి మొదలగునవి.

243ఎఫ్. సభ్యత్వమునకు నిరర్హతలు.

243జీ. పంచాయతీల యొక్క అధికారములు, ప్రాధికారము యొక్క భాధ్యతలు.

243హెచ్. పంచాయతీలకు పన్నులు విధించు అధికారములు మరియు వాటి నిధులు.

## భాగము – 9ఏ

## పురపాలికలు

243జడ్ జీ. నిర్వాచక విషయములో న్యాయస్థానముల జోక్యముపై ప్రతిబంధకము.

## భాగము – 9బీ

## సహకార సంఘములు

243జడ్ హెచ్. నిర్వచనములు.

243జడ్ ఐ. సహకార సంఘముల నిగమనము.

243జడ్ జే. బోర్డు సభ్యుల మరియు దాని కార్యనిర్వాహకుల సంఖ్య మరియు పదవీ కాలావధి.

243జడ్ కే. బోర్డు సభ్యుల ఎన్నిక.

243జడ్ ఎల్. బోర్డు రద్దు, తాత్కాలికముగా నిలిపి ఉంచుట మరియు మధ్యకాలీన నిర్వహణ.

243జడ్ ఎమ్. సహకార సంఘముల లెక్కల ఆడిటు.

243జడ్ ఎన్. సర్వసభ్య సమావేశములను నిర్వహించుట.

243జడ్ ఓ. సమాచారమును పొందుటకు సభ్యుని హక్కు.

243జడ్ పి. రిటర్నులు.

243జడ్ క్యూ. అపరాధములు మరియు శాస్తులు.

243జడ్ ఆర్. బహుళ రాజ్య సహకార సంఘములకు వర్తింపు.

243జడ్ ఎస్. సంఘ రాజ్య క్షేత్రములకు వర్తింపు.

243జడ్ టీ. ప్రస్తుతమున్న శాసనముల కొనసాగింపు.

## భాగము – 10

## అనుసూచి మరియు జనజాతి ప్రాంతములు

244. అనుసూచిత ప్రాంతముల మరియు జనజాతి ప్రాంతముల పాలనము.

244ఏ. అస్సాములోని కొన్ని జనజాతి ప్రాంతములను కలిపి ఒక స్వాయత్త రాజ్యమును ఏర్పాటు చేయుట మరియు దాని కొరకు స్థానిక శాసనమండలిని లేక మంత్రి పరిషత్తును, లేక రెండింటిని ఏర్పాటు చేయుట.

## భాగము – 11

## సంఘమునకు మరియు రాజ్యములకు మధ్య సంబంధములు

## అధ్యాయము–1 – శాసన నిర్మాణమును గూర్చిన సంబంధములు

### శాసన నిర్మాణ అధికారముల పంపిణీ

245. పార్లమెంటు మరియు రాజ్య శాసనమండలులచే చేయబడు శాసనముల విస్తరణ.

246. పార్లమెంటుచే లేక రాజ్య శాసనమండలులచే చేయబడు శాసనము విషయ వస్తువు.

247. కొన్ని అదనపు న్యాయస్థానముల స్థాపనకై నిబంధనలు చేయటుకు పార్లమెంటుకు గల అధికారము.

248. శాసన నిర్మాణమునకు అవశిష్ట అధికారములు.

249. రాజ్యసూచిలోని ఏదేని విషయమును గూర్చి జాతీయ హితము దృష్ట్యా శాసనములను చేయుటకు పార్లమెంటుకు గల అధికారము.

250. అత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము అమలులో నున్నప్పుడు రాజ్యసూచిలోని ఏ విషయమునకు సంబంధించియైనను శాసనములను చేయుటకు పార్లమెంటుకు గల అధికారము.

251. 249, 250 అనుచ్ఛేదముల క్రింద పార్లమెంటుచే చేయబడిన శాసనములకును, రాజ్య శాసనమండలులచే చేయబడిన శాసనములకును, మధ్య అసంగత.

252. రెండు లేక రెంటికి మించిన రాజ్యముల కొరకు వాని సమ్మతిపై శాసనములను చేయుటకు పార్లమెంటుకు గల అధికారము, మరియు ఏ ఇతర రాజ్యముచేనైనను అట్టి శాసనములు అంగీకరింపబడుట.

253. అంతర్జాతీయ కరారులను అమలుపరచుటకు శాసనములను చేయుట.

254. పార్లమెంటుచే చేయబడిన శాసనములకును, రాజ్య శాసన మండలులచే చేయబడిన శాసనములకును మధ్య అసంగతత.

255. సిఫారసులు మరియు పూర్వ మంజూరీలను గూర్చిన అపేక్షితములు ప్రక్రియకు సంబంధించిన విషయములుగా మాత్రమే ఎంచబడుట.

## అధ్యాయము–2 – పరిపాలక సంబంధములు

### సాధారణ విషయములు

256. రాజ్యముల మరియు సంఘము యొక్క బాధ్యత.

257. కొన్ని సందర్భములలో రాజ్యములపై సంఘము యొక్క నియంత్రణ.

257ఏ. (లుప్తము చేయబడినది).

258. కొన్ని సందర్భములలో రాజ్యములకు అధికారములు మున్నగు వానిని ప్రదత్తము చేయుటకు సంఘమునకు గల అధికారము.

258ఏ. సంఘమునకు కృత్యములను అప్పగించుటకు రాజ్యములకు గల అధికారము.

259. (లుప్తము చేయబడినది).

260. భారతదేశము వెలుపలి రాజ్యక్షేత్రములకు సంబంధించి సంఘము యొక్క అధికారిత.

261. పబ్లికు కార్యములు, రికార్డులు మరియు న్యాయిక చర్యలు.

**జల సంబంధ వివాదములు**

262. అంతర్ రాజ్య నదుల లేక నదీలోయల యొక్క జలములకు సంబంధించిన వివాదముల న్యాయ నిర్ణయము.

**రాజ్యముల మధ్య సమన్వయము**

263. అంతర్ రాజ్య పరిషత్తును గూర్చిన నిబంధనలు.

**భాగము–12**

**విత్తము, ఆస్తి, కాంట్రాక్టులు మరియు దావాలు**

**అధ్యాయము–1 – విత్తము**

**సాధారణ విషయములు**

264. అర్థాన్వయము.

265. శాసన ప్రాధికారముననుసరించి తప్ప పన్నులు విధింపబడకుండుట.

266. భారతదేశము యొక్కయు రాజ్యముల యొక్కయు సంచిత నిధులు మరియు పబ్లికు ఖాతాలు.

267. ఆకస్మికతానిధి.

**సంఘమునకును–రాజ్యములకును మధ్య రెవిన్యూల పంపిణీ**

268. సంఘముచే విధింపబడి రాజ్యములచే వసూలు చేయబడి, వినియోగింపబడు సుంకములు.

268ఏ. (లుప్తము చేయబడినది)

269. సంఘముచే విధింపబడి మరియు వసూలు చేయబడి రాజ్యములకు కేటాయింపబడు పన్నులు.

270. సంఘముచే విధింపబడి మరియు వసూలు చేయబడి సంఘమునకు రాజ్యములకు మధ్య పంచబడెడు పన్నులు.

271. సంఘము నిమిత్తమై కొన్ని సుంకములపైనను, పన్నులపైనను సర్చార్జీ.

272. (లుప్తము చేయబడినది)

273. జనపనారపై మరియు జనపనార వస్తువులపై ఎగుమతి సుంకమునకు బదులుగా అనుదానములు.

274. రాజ్యములకు హితము గల పన్నుల విధింపునకు సంబంధించిన బిల్లులకు రాష్ట్రపతి యొక్క పూర్వ సిఫారసు ఆవశ్యకత.

275. కొన్ని రాజ్యములకు సంఘము నుండి అనుదానములు.

276. వృత్తులు, వ్యాపారములు, ఆజీవికలు మరియు ఉద్యోగములపై పన్నులు.

277. వ్యావృత్తి.

278. (లుప్తము చేయబడినది).

279. ''నికర ఆదాయము'' లెక్కింపు మున్నగునవి.

280. విత్తీయ కమీషను.

281. విత్తీయ కమీషను యొక్క సిఫారసులు.

## వివిధ విత్తీయ నిబంధనలు

282. సంఘముచేగాని, రాజ్యముచేగాని దాని రెవిన్యూల నుండి భరింపబడదగు వ్యయము.

283. సంచిత నిధుల యొక్కయు, ఆకస్మికతా నిధుల యొక్కయు, పబ్లికు ఖాతాకు జమ కట్టబడిన ధనముల యొక్కయు, అభిరక్ష మున్నగునవి.

284. పబ్లికు సేవకులచే మరియు న్యాయస్థానములచే పుచ్చుకొనబడిన దావాదారుల డిపాజిట్ల యొక్కయు, ఇతర ధనము యొక్కయు అభిరక్ష.

285. సంఘము యొక్క ఆస్తిని రాజ్యపు పన్ను విధింపు నుండి మినహాయించుట.

286. సరుకుల క్రయ విక్రయములపై పన్ను విధించుటను గూర్చిన నిర్బంధనలు.

287. విద్యుచ్ఛక్తి మీద పన్నుల మినహాయింపు.

288. కొన్ని సందర్భములలో జలము, లేక విద్యుచ్ఛక్తి విషయమున రాజ్యములచే పన్ను విధింపు నుండి మినహాయింపు.

289. రాజ్యము యొక్క ఆస్తిని మరియు రాబడిని సంఘము పన్ను విధింపు నుండి మినహాయించుట.

290. కొన్ని వ్యయములు మరియు పింఛనుల విషయములో సర్దుబాటు

290ఏ. కొన్ని దేవస్వపు నిధులకు వార్షిక చెల్లింపు.

291. (లుప్తము చేయబడినది).

### అధ్యాయము-2 – అప్పు చేయుట.

292. భారత ప్రభుత్వము అప్పు చేయుట.

293. రాజ్యములు అప్పు చేయుట.

### అధ్యాయము-3 – ఆస్తి, కాంట్రాక్టులు, హక్కులు, దాయిత్వములు, బాధ్యతలు మరియు దావాలు

294. ఆస్తికి, సంపత్తికి, హక్కులకు, దాయిత్వములకు మరియు బాధ్యతలకు కొన్ని సందర్భములలో ఉత్తరాధికారము.

295. ఆస్తులకు, సంపత్తికి, హక్కులకు, దాయిత్వములకు మరియు బాధ్యతలకు ఇతర సందర్భములలో ఉత్తరాధికారము.

296. రాజ్యగామిత్వము, లేక వ్యపగమనము లేక స్వామిహీనత్వముచే ప్రాప్తమైన ఆస్తి.

297. జల ప్రాంగమణములు లేక మహోద్వీపీయ విధానములో గల విలువైన వస్తువులు మరియు అనన్య ఆర్థిక పరిధిలోని వనరుల సంగమునందు నిహితమగుట.

298. వ్యాపారము మొదలగునవి సాగించుటకు అధికారము.

299. కాంట్రాక్టులు.

300. దావాలు మరియు చర్యలు.

### అధ్యాయయము -4
### ఆస్తి హక్కు.

300ఏ. శాసన ప్రాధికారము ద్వారా తప్ప వ్యక్తుల ఆస్తి హరింపబడకుండుట.

## భాగము – 13
## భారతదేశ రాజ్యక్షేత్రము లోపల వ్యాపారము, వాణిజ్యము మరియు సంసర్గము

301. వ్యాపార, వాణిజ్య మరియు సంసర్గములలో స్వేచ్ఛ.

302. వ్యాపార, వాణిజ్య, సంసర్గములపై, నిర్బంధనలు విధించుటకు పార్లమెంటుకు గల అధికారము.

303. వ్యాపార మరియు వాణిజ్యముల విషయమున సంఘము యొక్కయు, రాజ్యముల యొక్కయు, శాసన నిర్మాణాదికారములపై నిర్బంధనలు.

304. రాజ్యముల మధ్య వ్యాపార, వాణిజ్య మరియు సంసర్గములపై నిర్బంధనలు.

305. అస్తిత్వములో నున్న శాసనముల యొక్కయు రాజ్య ఏకాధి పత్యము కొరకు నిబంధించు శాసనము యొక్కయు వ్యావృత్తి.

306. (లుప్తము చేయబడినది).

307. 301 నుండి 304 వరకు గల అనుచ్ఛేదముల ప్రయోజనములను నెరవేర్చుటకు ప్రాధికారి నియామకము.

## భాగము – 14

## సంఘమునకు మరియు రాజ్యములకు అధీనమైన సేవా వర్గములు

### అధ్యాయము–1 – సేవా వర్గములు

308. అర్థాన్వయము.

309. సంఘమునకు లేక రాజ్యమునకు సేవ చేయు వ్యక్తుల భర్తీ మరియు వారి సేవా షరతులు.

310. సంఘమునకు లేక రాజ్యమునకు సేవా చేయు వ్యక్తుల పదవీ కాలము.

311. సంఘము క్రింద లేక రాజ్యము క్రింద సివిలు హోదాలో నియమించబడిన వ్యక్తుల బర్తరపు, తొలగింపు లేక పదస్థాయి తగ్గింపు.

312. అఖిల భారత సేవా వర్గములు.

312ఏ. కొన్ని సేవా వర్గములలోని అధికారుల సేవా షరతులను మార్చుటకు, లేక ప్రతిసంహరించుటకు పార్లమెంటుకు గల అధికారము.

313. పరివర్తన కాలిక నిబంధనలు.

314. (లుప్తము చేయబడినది).

### అధ్యాయము–2 – పబ్లికు సేవా కమీషనులు

315. సంఘమునకు మరియు రాజ్యములకు పబ్లికు సేవా కమీషనులు.

316. సభ్యుల నియామకము మరియు వారి పదావధి.

317. పబ్లికు సేవా కమీషను సభ్యుని తొలగింపు మరియు తాత్కాలిక నిలుపుదల.

318. కమీషను సభ్యుల యొక్క మరియు సిబ్బంది యొక్క సేవా షరతులను గూర్చి వినియమములు చేయు అధికారము.

319. కమీషను సభ్యులు అట్టి సభ్యులుగ ఉండకుండాపోయిన తరువాత ఇతర పదవుల యందుండుటపై నిషేధము.

320. పబ్లికు సేవా కమీషనుల కృత్యములు.

321. పబ్లికు సేవా కమీషను కృత్యములను విస్తృతపరచుటకు అధికారము.

322. పబ్లికు సేవా కమీషనుల ఖర్చులు.

323. పబ్లికు సేవా కమీషనుల రిపోర్టులు.

## భాగము – 14ఏ

## ట్రిబ్యునళ్లు

323ఏ. పరిపాలక ట్రిబ్యునళ్ళు.

323బీ. ఇతర విషయముల కొరకై ట్రిబ్యునళ్ళు.

## భాగము – 15

## ఎన్నికలు

324. ఎన్నికల యొక్క అధీక్షణ, ఆదేశ, నియంత్రణలు ఒక ఎన్నికల కమీషనులో నిహితమై యుండుట.

325. మత, జాతి, కుల లేక లింగభేద కారణములను బట్టి ఏ వ్యక్తియు ఓటర్ల జాబితాలో చేర్చబడుటకు అపాత్రుడు కాకుండుట లేక అట్టి కారణములను బట్టి ఏదైనా విశేష జాబితాలో చేర్చబడుటకు క్లెయిము చేయరాకుండుట.

326. లోక్ సభ మరియు రాజ్య శాసన సభలకు ఎన్నికలు వయోజన వోటు హక్కు ప్రాతిపదికపై నుండుట.

327. శాసన మండలుల ఎన్నికలను గూర్చి నిబంధనలు చేయుటకు పార్లమెంటుకు గల అధికారము.

328. శాసనమండలుల ఎన్నికలను గూర్చి నిబంధనలు చేయుటకు రాజ్య శాసనమండలికి గల అధికారము.

329. ఎన్నికల విషయములలో న్యాయస్థానముల జోక్యమునకు ప్రతి బంధకము.

329ఏ. (లుప్తము చేయబడినది).

## భాగము – 16

## కొన్ని వర్గములకు సంబంధించిన విశేష నిబంధనలు

330. అనుసూచిత కులములకును, అనుసూచిత జనజాతులకును, లోక్ సభలో స్థానములను ప్రత్యేకించుట.

331. లోక్‌సభలో ఆంగ్లో ఇండియను సమాజమునకు ప్రాతినిధ్యము.

332. రాజ్య శాసనసభలలో అనుసూచిత కులములకును, అనుసూచిత జనజాతులకును స్థానములను ప్రత్యేకించుట.

333. రాజ్యముల శాసనసభలలో ఆంగ్లో ఇండియను సమాజమునకు ప్రాతినిధ్యము.

334. స్థానములను ప్రత్యేకించుట మరియు విశేష ప్రాతినిధ్యము ఎనుబది సంవత్సరముల తరువాత అంతమగుట.

335. సేవావర్గములకు మరియు పదస్థానములకు అనుసూచిత కులముల యొక్కయు అనుసూచిత జన జాతుల యొక్కయు క్లెయిము.

336. కొన్ని సేవావర్గములలో అంగ్లో ఇండియను సమాజము కొరకు విశేష నిబంధన.

337. ఆంగ్లో ఇండియను సమాజము యొక్క మేలు కొరకు విద్యా సంబంధమైన అనుదానములను గూర్చిన విశేష నిబంధన.

338. అనుసూచిత కులములవారి కొరకు జాతీయ కమీషను.

338ఏ. అనుసూచిత జనజాతులవారి కొరకు జాతీయ కమీషను.

338బీ. వెనుబడిన తరగతుల వారికి జాతీయ కమీషను.

339. అనుసూచిత ప్రాంతముల పరిపాలనపైనను, అనుసూచిత జనజాతుల శ్రేయస్సుపైనను సంఘము యొక్క నియంత్రణ.

340. వెనుకబడిన వర్గముల పరిస్థితులను దర్యాప్తు చేయుటకై ఒక కమీషను నియామకము.

341. అనుసూచిత కులములు.

342. అనుసూచిత జనజాతులు.

342ఏ. సామాజికముగా మరియు విద్యావిషయకముగా వెనుకబడిన తరగతులు

## భాగము – 17

## రాజభాష

### అధ్యాయము–1 – సంఘము యొక్క భాష

343. సంఘము యొక్క రాజభాష.

344. రాజభాష విషయమున కమీషను మరియు పార్లమెంటు కమిటీ.

### అధ్యాయము–2 – ప్రాంతీయ భాషలు

345. రాజ్యము యొక్క రాజభాష లేక రాజభాషలు.

346. ఒక రాజ్యము మరొక రాజ్యము మధ్యను, ఒక రాజ్యము మరియు సంఘము మధ్యను ఉత్తర ప్రత్యుత్తరములకై రాజభాష.

347. ఒక రాజ్యము యొక్క జనాభాలో ఒక భాగము వారు మాట్లాడు భాషకు సంబంధించిన విశేష నిబంధన.

## అధ్యాయము–3 – సర్వోన్నత న్యాయస్థానము, ఉన్నత న్యాయస్థానము మున్నగువాటి యొక్క భాష

348. సర్వోన్నత న్యాయస్థానము నందును, ఉన్నత న్యాయస్థానములందును చట్టములు, బిల్లులు మున్నగువాటి కొరకు ఉపయోగించవలసిన భాష.

349. భాషకు సంబంధించిన కొన్ని శాసనములను చేయుట కొరకు విశేష ప్రక్రియ.

## అధ్యాయము–4 – విశేష ఆదేశములు

350. వ్యధల నివారణ కొరకైన విన్నపములలో ఉపయోగించవలసిన భాష.

350ఏ. ప్రాథమిక దశలో మాతృభాషలో విద్యాబోధన సౌకర్యములు.

350బీ. భాషా విషయక అల్పసంఖ్యాకుల కొరకు విశేషాధికారి.

351. హిందీ భాషను అభివృద్ధిపరచుటకు ఆదేశము.

## భాగము – 18

## ఆత్యయిక నిబంధనలు

352. ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము.

353. ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము యొక్క ప్రభావము.

354. ఆత్యయికతను గూర్చి అధిప్రఖ్యానము అమలులో నున్నప్పుడు రెవిన్యూలను పంచుటకు సంబంధించిన నిబంధనల వర్తింపు.

355. బాహ్య దురాక్రమణ నుండియు, అంతఃకల్లోలము నుండియు, రాజ్యములను రక్షించుట సంఘము యొక్క కర్తవ్యము.

356. రాజ్యములలో సంవిధాన యంత్రాంగము విఫలమైన సందర్భములలో నిబంధనలు.

357. 356వ అనుచ్ఛేదము క్రింద జారీ చేయబడిన అధిప్రఖ్యానము క్రింద శాసన నిర్మాణాధికారములను వినియోగించుట.

358. ఆత్యయిక పరిస్థితులలో 19వ అనుచ్ఛేదము యొక్క నిబంధనలను తాత్కాలిక నిలుపుదల చేయుట.

359. భాగము 3 ద్వారా ప్రదత్తము చేయబడిన హక్కుల అమలును ఆత్యయిక పరిస్థితులలో తాత్కాలిక నిలుపుదల చేయుట.

359ఏ. (లుప్తము చేయబడినది).

360. విత్తీయ ఆత్యయిక పరిస్థితిని గూర్చిన నిబంధనలు.

## భాగము – 19

## వివిధ విషయములు

361. రాష్ట్రపతికి, గవర్నర్లకు మరియు రాజప్రముఖులకు రక్షణ.

361ఏ. పార్లమెంటు మరియు రాజ్యశాసనమండలుల యొక్క కార్యకలాపముల ప్రచురణకు రక్షణ.

361బీ. ప్రతి ఫలమునిచ్చు రాజకీయ పదవిలో నియమించబడుటకు అనర్హత.

362. (లుప్తము చేయబడినది).

363. కొన్ని సంధులు మరియు కరారులు మున్నగువాని నుండి ఉత్పన్నమగు వివాదములలో, న్యాయస్థానముల జోక్యమునకు ప్రతి బంధకము.

363ఏ. ఇండియాలోని దేశీయ రాజ్యముల రాజ్యాధీశులకు ఈయబడిన గుర్తింపు అంతమగుట మరియు రాజభరణముల రద్దు.

364. పెద్ద ఓడరేవుల, మరియు విమానాశ్రయముల విషయములో విశేష నిబంధనలు.

365. సంఘముచే ఇవ్వబడిన ఆదేశములను పాటించనియెడల, లేక అమలుపరచని యెడల కలుగు పరిణామము.

366. నిర్వచనములు.

367. అర్థాన్వయము.

## భాగము – 20

## సంవిధానము యొక్క సవరణ.

368. సంవిధానమును సవరించుటకు పార్లమెంటుకు గల అధికారము మరియు అందుకైన ప్రక్రియ.

## భాగము – 21

## తాత్కాలిక పరివర్తనకాలిక మరియు విశేష నిబంధనలు

369. రాజ్య సూచిలోని కొన్ని విషయములను గూర్చి, అవి ఉభయ సామాన్య సూచిలో ఉండినటులనే శాసనములను చేయుటకు పార్లమెంటుకు గల తాత్కాలిక అధికారము.

370. జమ్మూ కాశ్మీరు రాజ్యమును గూర్చిన తాత్కాలిక నిబంధనలు.

371. మహారాష్ట్ర మరియు గుజరాతు రాజ్యమును గూర్చిన విశేష నిబంధనలు.

371ఏ. నాగాల్యాండు రాజ్యమును గూర్చిన విశేష నిబంధన.

371బీ. అస్సాం రాజ్యమును గూర్చిన విశేష నిబంధన.

371సీ. మణిపూరు రాజ్యమును గూర్చిన విశేష నిబంధన.

## భాగము–22

## సంగ్రహనామము, ప్రారంభము, హిందీ భాషలో ప్రాధీకృత పాఠము మరియు రద్దులు

394ఏ. హిందీ భాషలో ప్రాధీకృత పాఠము.

395. రద్దులు.

## అనుసూచీలు

**ఒకటవ అనుసూచి**

1. రాజ్యములు.

2. సంఘ రాజ్య క్షేత్రములు.

**రెండవ అనుసూచి**

భాగము ఏ. రాష్ట్రపతిని మరియు రాజ్య గవర్నర్లను గూర్చిన నిబంధనలు.

భాగము బీ. (లుప్తము చేయబడినది).

భాగము సీ. లోక సభాధ్యక్షుడు మరియు ఉపాధ్యక్షుడు, రాజ్యసభ సభాపతి మరియు ఉపసభాపతి, ఒక రాజ్యము యొక్క శాసన సభాధ్యక్షుడు మరియు ఉపాధ్యక్షుడు, శాసన పరిషత్తు యొక్క సభాపతి మరియు ఉపసభాపతులను గూర్చిన నిబంధనలు.

భాగము డీ. సర్వోన్నత న్యాయస్థానము యొక్క మరియు ఉన్నత న్యాయస్థానముల యొక్క న్యాయాధీశులను గూర్చిన నిబంధనలు.

భాగము ఈ. భారతదేశ కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలును కూర్చిన నిబంధనలు.

**మూడవ అనుసూచి**

ప్రమాణముల లేక ప్రతిజ్ఞల ప్రరూపములు.

**నాలుగవ అనుసూచి**

రాజ్యసభలో స్థానముల కేటాయింపు.

**ఐదవ అనుసూచి**

అనుసూచిత ప్రాంతముల మరియు అనుసూచిత జనజాతుల పరిపాలనను మరియు నియంత్రణను గూర్చిన విషయములు.

భాగము ఏ. సాధారణ విషయములు.

భాగము బీ. అనుసూచిత ప్రాంతముల మరియు అనుసూచిత జనజాతుల పరిపాలన మరియు నియంత్రణ.

భాగము సీ. అనుసూచిత ప్రాంతములు.

భాగము డీ. అనుసూచిత సవరణ.

**ఆరవ అనుసూచి:**

అస్సాము, మేఘాలయ, త్రిపుర మరియు మిజోరాం రాజ్యములలోని జనజాతి ప్రాంతముల పరిపాలనను గూర్చిన నిబంధనల

**ఏడవ అనుసూచి:**

సూచి I – సంఘ సూచి.

సూచి II – రాజ్య సూచి.

సూచి III – ఉభయ సామాన్య సూచి.

**ఎనిమిదవ అనుసూచి:** భాషలు.

**తొమ్మిదవ అనుసూచి:** కొన్ని చట్టములు మరియు వినియమముల మాన్యత.

**పదియవ అనుసూచి:** పార్టీ ఫిరాయింపు కారణముపై నిరర్హతకైన నిబంధనలు.

**పదకొండవ అనుసూచి:** పంచాయితీల అధికారములు, ప్రాధికారము మరియు బాధ్యతలు.

**పన్నెండవ అనుసూచి:** పురపాలికల అధికారములు, ప్రాధికారము మరియు బాధ్యతలు మొదలగున్నవి.

## అనుబంధములు

**అనుబంధము:** I

**అనుబంధము:** II

**అనుబంధము:** III

**అనుబంధము:** IV

# భారత సంవిధానము

**ప్రస్తావన: భారతదేశ ప్రజలమగు మేము**, భారతదేశమును
**సార్వభౌమ్య సామ్యవాద లౌకిక ప్రజాస్వామ్య గణతంత్ర**
**రాజ్యముగ** నెలకొల్పుటకు మరియు అందలి పౌరులెల్లరకు
సామాజిక, ఆర్థిక, రాజకీయ, **న్యాయమును**,
భావము, భావప్రకటన, విశ్వాసము, .
ధర్మము, ఆరాధన – వీటి **స్వాతంత్ర్యమును,**
అంతస్తులోను, అవకాశములోను **సమానత్వమును**
చేకూర్చుటకు; మరియు వారందరిలో
వ్యక్తి గౌరవమును, జాత్యైక్యతను,
అఖండతను తప్పక ఒనగూర్చు **సౌభ్రాతృత్వమును**
పెంపొందించుటకు; సత్యనిష్ఠాపూర్వకముగ తీర్మానించుకొని,

ఈ 1949వ సంవత్సరము నవంబరు ఇరువదియారవ
దినమున **మా సంవిధాన సభయందు ఇందుమూలముగ,**
**ఈ సంవిధానమును అంగీకరించి, అధిశాసనము**
**చేసి మాకు మేము ఇచ్చుకొన్నవారమైతిమి.**

## భాగము – 1

## సంఘము మరియు దాని రాజ్యక్షేత్రము

**సంఘము పేరు మరియు దాని రాజ్య క్షేత్రము.**

1. (1) ఇండియా, అనగా భారతదేశము, రాజ్యముల సంఘమై యుండును.

[1] [(2) అందలి రాజ్యములు, రాజ్య క్షేత్రములు, ఒకటవ అనుసూచియందు నిర్దిష్టమైనట్లుండును.]

(3) భారతదేశ రాజ్యక్షేత్రమునందు–

(ఎ) రాజ్యముల యొక్క రాజ్యక్షేత్రములు;

[2][(బి) ఒకటవ అనుసూచియందు నిర్దిష్టమైయున్న సంఘ రాజ్యక్షేత్రములు, మరియు]

(సి) ఆర్జింపబడు ఇతర రాజ్యక్షేత్రములు చేరియుండును.

**క్రొత్త రాజ్యములను చేర్చుకొనుట లేక స్థాపించుట.**

2. పార్లమెంటు తాను సబబని తలచు నిబంధనలు మరియు షరతులపై, శాసనము ద్వారా క్రొత్త రాజ్యములను సంఘములో చేర్చుకొన వచ్చును లేక స్థాపించవచ్చును.

2ఏ. [3][సిక్కిం సంఘముతో కలిసి ఉండవలెను.] సంవిధాన (ముప్పది ఆరవ సవరణ) చట్టము, 1975, పరిచ్ఛేదము 5 ద్వారా 26.04.1975 నుండి రద్దు చేయబడింది.

**క్రొత్త రాజ్యములను ఏర్పరచుట మరియు ఇప్పుడు ఉన్న రాజ్యముల విస్తీర్ణమును, సరిహద్దులను, లేక పేర్లను మార్చుట.**

3. పార్లమెంటు శాసనము ద్వారా,–

(ఎ) ఏదేని రాజ్యము నుండి రాజ్య క్షేత్రమును వేరువరచియైనను, రెండు లేక రెంటికి మించిన రాజ్యములను లేక రాజ్యభాగములను కలిపియైనను, ఏదేని రాజ్య క్షేత్రమును ఏదేని రాజ్యభాగముతో కలిపియైనను, ఒక క్రొత్త రాజ్యమును ఏర్పరచవచ్చును;

(బి) ఏదేని రాజ్యము యొక్క విస్తీర్ణమును పెంచవచ్చును;

(సి) ఏదేని రాజ్యము యొక్క విస్తీర్ణమును తగ్గించవచ్చును;

(డి) ఏదేని రాజ్యము యొక్క సరిహద్దులను మార్చవచ్చును;

(ఇ) ఏదేని రాజ్యము యొక్క పేరును మార్చవచ్చును;

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ఖండము (2)కు బదులుగా 01.11.1956 నుండి ఉంచబడినది.
2. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ఉప-ఖండము (బి)కు బదులుగా 01.11.1956 నుండి ఉంచబడినది.
3. సంవిధాన (ముప్పది ఐదవ సవరణ) చట్టము, 1974 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 2ఏ పరిచ్ఛేదము 01.03.1975 నుండి చొప్పించబడినది.

[1][అయితే అందుకైన బిల్లును పార్లమెంటు యొక్క ఏ సదనములోను రాష్ట్రపతి సిఫారసుపై తప్ప ప్రవేశపెట్టరాదు మరియు సదరు బిల్లులోని ప్రతిపాదన [2][* * *] ఏదేని రాజ్యము యొక్క విస్తీర్ణమును గాని, సరిహద్దులనుగాని, పేరునుగాని మార్చునదైన యెడల, రాష్ట్రపతి ఆ బిల్లును ఆ రాజ్య శాసన మండలికి దాని అభిప్రాయములను అందుకై నిర్ధిష్టపరచిన గడువులోగాని రాష్ట్రపతి అనుమతించిన అదనపు గడువులోగాని వ్యక్తపరచుటకు పంపి, అట్లు నిర్ధిష్టపరచిన లేక అనుమతించిన గడువు ముగిసిననే తప్ప, అట్టి బిల్లును పార్లమెంటు యొక్క ఏ సదనములోను ప్రవేశపెట్టరాదు.]

[3][**విశదీకరణ–1:–** ఈ అనుచ్ఛేదములో (ఎ) నుండి (ఇ) వరకు గల ఖండములలో ''రాజ్యము'' అను పదమునందు సంఘ రాజ్యక్షేత్రము చేరియుండును; అయితే వినాయింపులో ''రాజ్యము'' అను పదము సంఘ రాజ్యక్షేత్రము నందు చేరియుండదు.

**విశదీకరణ–2:–** ఖండము (ఎ) ద్వారా పార్లమెంటుకు ప్రదత్తమైన అధికారములో, ఏదేని రాజ్యభాగమును, లేక సంఘ రాజ్యక్షేత్ర భాగమును ఏదేని మరొక రాజ్యముతో లేక మరొక సంఘ రాజ్యక్షేత్రముతో కలుపుట ద్వారా క్రొత్త రాజ్యమునుగాని, క్రొత్త సంఘ రాజ్య క్షేత్రమునుగాని ఏర్పరచు అధికారము చేరియుండును.]

**2వ మరియు 3వ అనుచ్ఛేదముల క్రింద చేయబడిన శాసనములలో ఒకటవ మరియు నాల్గవ అనుసూచీల సవరణకును, అనుపూరక, ఆనుషంగిక; పారిణామిక విషయములకును, నిబంధన చేయుట.**

4. (1) 2వ లేక 3వ అనుచ్ఛేదములో నిర్దేశింపబడిన ఏదేని శాసనము యొక్క నిబంధనలను అమలుపరచుటకు, ఒకటవ మరియు నాల్గవ అనుసూచీలలో ఆవశ్యకముకాగల సవరణ నిబంధనలు సదరు శాసనము నందుండవలెను, మరియు అందు పార్లమెంటుచే ఆవశ్యకమని భావింపబడు అనుపూరక, ఆనుషంగిక మరియు పారిణామిక నిబంధనలు కూడా (పార్లమెంటులోను, అట్టి శాసనములచే ప్రభావితమైన రాజ్యము యొక్క, లేక రాజ్యముల యొక్క శాసన మండలి, లేక శాసనమండలులలోను ప్రాతినిధ్యమును గూర్చిన నిబంధనలతో సహా) ఉండవచ్చును.

(2) పైన చెప్పబడిన ఏ శాసనమైనను 368వ అనుచ్ఛేదము నిమిత్తము ఈ సంవిధానము యొక్క సవరణగా భావింపబడరాదు.

---

1. సంవిధాన (అయిదవ సవరణ) చట్టము, 1955 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా వినాయింపు కొరకు ఉంచబడినది. (w.e.f. 24-12-1955)
2. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''ఒకటవ అనుసూచి యొక్క భాగము-ఏ లేక భాగము-బీలో నిర్ధిష్టపరచిన'' అను పదములు మరియు అక్షరములు 01.11.1956 నుండి వదిలివేయబడినవి.
3. సంవిధాన (పదునెనిమిదవ సవరణ) చట్టము, 1966 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది. (w.e.f. 27-8-1966)

## భాగము – 2
## పౌరసత్వము

5. ఈ సంవిధాన ప్రారంభమున ఎవరేని వ్యక్తి భారతదేశ రాజ్య క్షేత్రమున నివాస స్థలము కలిగియుండి, మరియు,– **సంవిధాన ప్రారంభమున పౌరసత్వము.**

(ఎ) భారత దేశ రాజ్యక్షేత్రములో జన్మించి యుండినచో, లేక

(బి) ఆ వ్యక్తి యొక్క తండ్రిగాని తల్లిగాని భారతదేశ రాజ్యక్షేత్రములో జన్మించి యుండినచో, లేక

(సి) సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము ఐదు సంవత్సరములకు తక్కువ కాకుండా ఆ వ్యక్తి భారతదేశ రాజ్యక్షేత్రములో సాధారణముగ నివసించుచుండినచో, అతడు భారతదేశ పౌరుడగును.

6. 5వ అనుచ్ఛేదములో ఏమియున్నప్పటికినీ, ఇప్పుడు పాకిస్తానులో చేరియున్న రాజ్య క్షేత్రము నుండి భారతదేశ రాజ్య క్షేత్రమునకు వలస వచ్చిన వ్యక్తి,– **పాకిస్తాను నుండి భారత దేశమునకు వలసవచ్చిన కొందరు వ్యక్తుల పౌరసత్వ హక్కులు.**

(ఎ) (ఆదిలో అధిశాసించబడినట్టి) ఇండియా ప్రభుత్వ చట్టము, 1935లో నిర్వచింపబడిన ఇండియాలో అతడుగాని, అతని తల్లిదండ్రులలో నెవరైనగాని, అతని అవ్వ, తాతలలో నెవరైనగాని జన్మించి యుండినచో, మరియు

(బి)(i) అట్టి వ్యక్తి 1948, జూలై పందొమ్మిదవ దినమునకు పూర్వము వలసవచ్చిన సందర్భములో, అతడు వలస వచ్చిన తేదీ నుండి భారతదేశ రాజ్య క్షేత్రములో సాధారణముగ నివసించుచుండినచో, లేక

(ii) అట్టి వ్యక్తి 1948, జూలై పందొమ్మిదవ దినమున గాని అటు పిమ్మట గాని అట్లు వలసవచ్చిన సందర్భములో, పౌరులను రిజిస్టరు చేయుటకై భారతదేశ అధినివేశ ప్రభుత్వముచే నియమించబడిన అధికారికి, అందుకై విహితవరచబడిన ప్రరూపములోను, రీతిలోను, ఈ సంవిధాన ప్రారంభమునకు పూర్వము దరఖాస్తు పెట్టుకొనిన మీదట, ఆ అధికారిచే భారతదేశ పౌరుడుగ రిజిస్టరు చేయబడి యుండినచో, అట్టి వ్యక్తి ఈ సంవిధాన ప్రారంభమున భారతదేశ పౌరుడుగ భావింపబడును:

అయితే ఏ వ్యక్తియైనను, అతడు దరఖాస్తు పెట్టుకొనిన తేదీన అవ్యవహితపూర్వము కనీసము ఆరు మాసములు, భారతదేశ రాజ్యక్షేత్రములో నివసించి యుండిననే తప్ప, అట్లు రిజిస్టరు చేయబడరాదు.

7. 5వ మరియు 6వ అనుచ్ఛేదములలో నేమియున్నప్పటికిని, భారతదేశ రాజ్య క్షేత్రము నుండి, ఇప్పుడు పాకిస్తానులో చేరియున్న రాజ్య క్షేత్రమునకు 1947, మార్చి మొదటి దినము తరువాత వలస వెళ్ళిన వ్యక్తి భారతదేశ పౌరుడుగ భావింపబడరాదు: **పాకిస్తానుకు వలస పోయిన కొందరి పౌరసత్వ హక్కులు.**

అయితే, పాకిస్తానులో ఇప్పుడు చేర్చబడియున్న రాజ్య క్షేత్రమునకు అట్లు వలస వెళ్ళిన తరువాత, భారతదేశములో పునరావాసమునకుగాను, లేక భారదేశమునకు శాశ్వతముగా

తిరిగివచ్చుటకుగాను, శాసన విహితమైన ఏదేని ప్రాధికారముచేగాని ప్రాధికారము క్రిందగాని ఒసగబడిన అనుజ్ఞా పత్రము క్రింద భారతదేశ రాజ్యక్షేత్రమునకు తిరిగివచ్చిన వ్యక్తికి, ఈ అనుచ్ఛేదములోని దేదియు వర్తించదు మరియు అట్టి ప్రతి వ్యక్తి 6వ అనుచ్ఛేదము యొక్క ఖండము (బి) నిమిత్తము 1948, జూలై పందొమ్మిదవ దినము తరువాత భారతదేశ రాజ్య క్షేత్రమునకు వలస వచ్చినట్లు భావింపబడవలెను.

8. 5వ అనుచ్ఛేదములో నేమి యున్నప్పటికిని, ఒక వ్యక్తిగాని అతని తల్లిదండ్రులలో నెవరైనగాని, అతని అవ్వ తాతలలో నెవరైనగాని, (ఆదిలో అధిశాసించబడినట్టి) ఇండియా ప్రభుత్వ చట్టము, 1935లో నిర్వచింపబడిన ఇండియాలో జన్మించియుండి, అట్లు నిర్వచింపబడిన ఇండియా వెలుపలి ఏ దేశమందైనను సాధారణముగ నివసించుచున్నచో, తనను భారతదేశ పౌరునిగ రిజిస్టరు చేయవలసినదని, భారతదేశ అధినివేశ ప్రభుత్వముచే, లేక భారత ప్రభుత్వముచే విహితపరచబడిన ప్రరూపములోను, రీతిలోను, ఈ సంవిధాన ప్రారంభమునకు పూర్వముగాని లేదా పిమ్మటగాని, అతడు తత్సమయమున నివసించుచున్న దేశము నందలి భారతదేశపు రాజదౌత్య, లేక వాణిజ్య ప్రతినిధికి దరఖాస్తు పెట్టుకొనిన మీదట, అట్టి రాజ్యదౌత్య, లేక వాణిజ్య ప్రతినిధిచే భారతదేశ పౌరుడుగ రిజిస్టరు చేయబడినచో, అతడు భారతదేశ పౌరుడుగ భావింపబడవలెను.

**భారతీయ మూలము కలిగి భారతదేశం వెలుపల నివసించు కొందరు వ్యక్తుల పౌరసత్వ హక్కులు.**

9. ఏ వ్యక్తియైనను ఏదేని విదేశీ రాజ్యము యొక్క పౌరసత్వమును తనంతట తాను ఆర్జించి యుండినచో 5వ అనుచ్ఛేదమును బట్టి భారతదేశ పౌరుడు కారాదు లేక 6వ అనుచ్ఛేదమును బట్టిగాని, 8వ అనుచ్ఛేదమును బట్టిగాని, భారతదేశ పౌరుడుగ భావింపబడరాదు.

**తమంతట తాము విదేశీ రాజ్యము యొక్క పౌరసత్వమును ఆర్జించు వ్యక్తులు పౌరులు కాకుండుట.**

10. ఈ భాగములోని పూర్వగామి నిబంధనలలో దేని క్రిందనైనను భారతదేశ పౌరుడగు, లేక అట్టి పౌరుడుగ భావింపబడు ప్రతి వ్యక్తియు, పార్లమెంటుచే చేయబడు ఏదేని శాసనము యొక్క నిబంధనలకు అధ్యధీనమై, అట్టి పౌరుడుగ కొనసాగవలెను.

**పౌరసత్వ హక్కుల కొనసాగింపు.**

11. పౌరసత్వ ఆర్జన, మరియు సమాప్తిని గూర్చియు, పౌరసత్వమునకు సంబంధించిన అన్ని ఇతర విషయములను గూర్చియు, ఏదేని నిబంధన చేయుటకు పార్లమెంటుకు గల అధికారమును ఈ భాగము యొక్క పూర్వగామి నిబంధనలో నున్న దేదియు న్యూనపరచదు.

**పార్లమెంటు శాసనము ద్వారా పౌరసత్వ హక్కును క్రమ బద్ధము చేయుట**

## భాగము – 3

## మౌలిక హక్కులు

### సాధారణ విషయులు

12. ఈ భాగములో సందర్భము అన్యధా అపేక్షించిననే తప్ప, ‘‘రాజ్యము’’ అను పదములో భారతదేశం యొక్క ప్రభుత్వము మరియు పార్లమెంటు, ప్రతి రాజ్యము యొక్క ప్రభుత్వము మరియు శాసనమండలి మరియు భారతదేశ రాజ్యక్షేత్రములోనున్న లేక భారత ప్రభుత్వము యొక్క నియంత్రణలోనున్న సమస్త స్థానిక లేక ఇతర ప్రాధికారులు చేరియుండును.

**నిర్వచనము.**

13. (1) ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము భారతదేశ రాజ్యక్షేత్రములో అమలులోనున్న శాసనములన్నియు, ఈ భాగములోని నిబంధనలకు ఎంతవరకు అసంగతముగ నుండునో అంతవరకు ప్రభావశూన్యమగును.

**మౌలిక హక్కులకు అసంగతముగనున్న లేక వాటిని న్యూనపరచు శాసనములు.**

(2) రాజ్యము ఏ శాసనమునెనైను, ఈ భాగముచే ప్రదత్తమైన వక్కులను తీసివేయునట్లుగా లేక కుంచించునట్లుగా చేయరాదు, మరియు ఈ ఖండము ఉల్లంఘన మేరకు ప్రభావశూన్యమగును.

(3) ఈ అనుచ్ఛేదములో, సందర్భము అన్యధా అపేక్షించిననే తప్ప,–

(ఎ) ''శాసనము'' అను పదమునందు ఏదైనా అధ్యాదేశము, ఉత్తరువు, ఉపవిధి, నియమము, వినియమము, అధిసూచన మరియు భారత దేశ రాజ్యక్షేత్రములో శాసనమువలె అమలు కలిగియున్న ఆచారము, లేక వాడుక చేరియుండును;

(బి) ''అమలులోనున్న శాసనములు'' అను పదబంధములో, ఈ సంవిధాన ప్రారంభమునకు పూర్వము భారతదేశ రాజ్యక్షేత్రమునందలి ఏదేని శాసన మండలిచే లేక ఇతర సమర్థ ప్రాధికారిచే, పాస్ చేయబడి, లేక కావింపబడి, అంతకుముందు రద్దుకాని శాసనములు అట్టి ఏ శాసనమైనను, అందలి ఏ భాగమైనను, అప్పుడు పూర్తిగాగాని, కొన్ని ప్రత్యేక ప్రాంతములలోగాని అమలులో లేనప్పటికిని చేరియుండును.

[1][(4) ఈ అనుచ్ఛేదములోనున్న దేదియు, 368వ అనుచ్ఛేదము క్రింద ఈ సంవిధానములనకు చేయబడిన ఏదేని సవరణకు వర్తించదు.]

## సమానత్వమునకు హక్కు

**శాసన దృష్టిలో సమానత్వము.**

14. రాజ్యము భారతదేశ రాజ్యక్షేత్రమునందు శాసన దృష్టిలో సమానత్వమును లేక శాసనముల వలన సమాన రక్షణను ఏ వ్యక్తికిని నిరాకరించరాదు.

**మతము, జాతి, కులము, లింగ బేధము లేక జన్మస్థాన కారణములను బట్టి విచక్షణ చేయుట పై నిషేధము.**

15. (1) రాజ్యము, కేవలము మత, జాతి, కుల, లింగభేద, జన్మస్థాన కారణములనుబట్టి కాని, వాటిలో వేనినిబట్టి కాని ఏ పౌరునికి విరుద్ధముగను విచక్షణ చేయరాదు.

(2) ఏ పౌరుడును, కేవలము మత, జాతి, కుల, లింగభేద, జన్మస్థాన కారణములను బట్టి లేక, వాటిలో వేనినిబట్టి ....

(ఎ) దుకాణములలో, సార్వజనిక ఉపాహారశాలలో, హోటళ్ళలో, సార్వజనిక వినోదస్థలములలో ప్రవేశించు విషయమున; లేక

(బి) పూర్తిగానైనను, కొంతవరకైనను రాజ్య నిధులతో నిర్వహించబడుచున్న, లేక సార్వజనిక ఉపయోగార్థము అంకితము చేయబడిన బావులను, చెఱువులను, స్నాన ఘట్టములను, రోడ్లను, విహార స్థలములను ఉపయోగించుకొను విషయమున

ఎట్టి అశక్తతకు, బాధ్యతకు, నిర్బంధమునకు, లేక షరతుకు లోనగునట్లు చేయబడరాదు.

(3) ఈ అనుచ్ఛేదములోనున్నదేదియు స్త్రీలకు మరియు బిడ్డలకు ఏదేని విశేష నిబంధనను చేయుట నుండి రాజ్యమును నివారించదు.

---

1. సంవిధాన (ఇరువది నాలుగవ సవరణ) చట్టము, 1971 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 05.11.1971 నుండి చొప్పించబడినది.

[1][(4) సాంఘికముగా మరియు విద్యా విషయకముగా వెనుకబడిన పౌరవర్గముల పురోభివృద్ధికై, లేక అనుసూచిత కులముల మరియు అనుసూచిత జనజాతులకై, ఏదేని విశేష నిబంధనను చేయుట నుండి ఈ అనుచ్ఛేదములోగాని, 29వ అనుచ్ఛేదము యొక్క ఖండము (2)లో గాని, ఉన్న దేదియు రాజ్యమును నివారించదు.]

[2][(5) సాంఘికముగా మరియు విద్యా విషయకముగా వెనుకబడిన ఏవేని పౌర వర్గముల పురోభి వృద్ధికై లేక అనుసూచిత కులముల లేక అనుసూచిత జనజాతులకై, 30వ పరిచ్ఛేదవు ఖండము (1)లో నిర్దేశింపబడిన అల్ప సంఖ్యాకుల విద్యా సంస్థేతరములైన, రాజ్యము ద్వారా సహాయము పొందినవైనను లేక సహాయము పొందని ప్రైవేటు విద్యా సంస్థలతో సహ విద్యా సంస్థలలో వారి ప్రవేశమునకు సంబంధించినంత వరకు శాసనము ద్వారా ఏదేని విశేష నిబంధన చేయుట నుండి ఈ అనుచ్ఛేదములోగాని, 19వ అనుచ్ఛేదము యొక్క ఖండము (1)లోని ఉప-ఖండము (జి)లో గాని ఉన్నదేదియు రాజ్యమును నివారించదు.]

[3][(6) ఈ అనుచ్ఛేదము లేదా 19వ అనుచ్ఛేదము యొక్క ఖండము (1)లోని ఉప-ఖండము (జి) లేదా 29వ అనుచ్ఛేదము యొక్క ఖండము (2)లో ఉన్నదేదియు,-

(ఎ) ఖండములు (4) మరియు (5)లలో పేర్కొనబడిన తరగతులకు కానట్టి ఆర్థికముగా వెనుకబడిన ఏవేని ఇతర పౌర వర్గముల పురోభివృద్ధి కొరకైన ఏదేని విశేష నిబంధనను చేయుట నుండి; మరియు

(బి) ఖండములు (4) మరియు (5)లలో పేర్కొనబడిన తరగతులు కానట్టి, ఆర్థికముగా వెనుకబడిన ఏవేని పౌరవర్గముల పురోభివృద్ధికై 30వ పరిచ్ఛేదవు ఖండము (1)లో నిర్దేశింపబడిన అల్ప సంఖ్యాకుల విద్యా సంస్థేతరములైన, రాజ్యము ద్వారా సహాయము పొందిననూ లేక సహాయము పొందని ప్రైవేటు విద్యా సంస్థలతో సహా, విద్యా సంస్థలలో వారి ప్రవేశమునకు సంబంధించినంత వరకు ప్రస్తుతమున్న ప్రత్యేకింపులకు అదనముగా ఉండు ప్రత్యేకింపు విషయములో ప్రతి శ్రేణిలోని మొత్తము సీట్లలో గరిష్టముగా పది శాతమునకు అధ్యధీనమై, శాసనము ద్వారా ఏదైనా నిబంధన చేయుట నుండి నిరోధించదు.

**విశదీకరణ:-** ఈ అనుచ్ఛేదము మరియు 16వ అనుచ్ఛేదము ప్రయోజనము నిమిత్తము, ''ఆర్థికముగా వెనుకబడిన తరగతులు'' కుటుంబ ఆదాయము మరియు ఇతర ఆర్థిక పరమైన అననుకూలతల యొక్క ఆధారంగా ఆయా సమయమునందు రాజ్యముచే అధిసూచించబడునట్లుండును.]

---

1 . సంవిధాన (ఒకటవ సవరణ) చట్టము, 1951 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా చేర్చబడినది. (w.e.f. 18.06.1951)

2. సంవిధాన (తొంబది మూడవ సవరణ) చట్టము, 2005 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 20.01.2006 నుండి చొప్పించబడినది.

3. సంవిధాన (నూట మూడవ సవరణ) చట్టము, 2019 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 14.1.2019వ తేదీ నుండి చొప్పించబడినది.

16. (1) రాజ్యమునకధీనమైన ఏదేని పదవిలో ఉద్యోగమునకు లేక నియామకమునకు సంబంధించిన విషయములలో పౌరులందరకు సమానావకాశము ఉండవలెను.

**పబ్లికు ఉద్యోగము విషయములో సమానావకాశము.**

(2) కేవలము మత, జాతి, కుల, లింగభేద, అనువంశత, జన్మస్థాన, నివాసస్థాన కారణములనుబట్టి కాని, వాటిలో వేనినిబట్టి కాని ఏ పౌరుడును రాజ్యమునకధీనమైన ఏ ఉద్యోగమునకైనను, పదవికైనను, అపాత్రుడు కారాదు, లేక ఆ ఉద్యోగ విషయమునను, పదవి విషయమునను ఏ పౌరునికైనను విరుద్ధముగ విచక్షణ చేయబడరాదు.

(3) [1][ఏదేని రాజ్య ప్రభుత్వమునకుగాని, సంఘ రాజ్యక్షేత్ర ప్రభుత్వమునకుగాని, అందలి ఏదేని స్థానిక, లేక ఇతర ప్రాధికారికిగాని, అధీనమైయున్న,] ఒక తరగతి, లేక కొన్ని తరగతుల ఉద్యోగముల విషయమున, లేక ఏదేని పదవిలో నియామకముచేయు విషయమున, అట్టి ఉద్యోగమునకు, లేక నియామకమునకు పూర్వము [2][ఆ రాజ్యములో లేక సంఘ రాజ్యక్షేత్రములో నివాసము ఆవశ్యకమని] విహితవరచు ఏదేని శాసనము చేయుట నుండి ఈ అనుచ్ఛేదములోనున్న దేదియు, పార్లమెంటును నివారించదు.

(4) పౌరులలో వెనుకబడిన వర్గమువారికెవరికైనను రాజ్యమునకధీనమైన సేవావర్గములలో తగినంత ప్రాతినిధ్యము లేదని రాజ్యము అభిప్రాయపడిన యెడల, అట్టివారి కొరకు నియామకములను, లేక పదస్థానములను ప్రత్యేకించుటకై ఏదేని నిబంధన చేయుట నుండి ఈ అనుచ్ఛేదములోనున్న దేదియు రాజ్యమును నివారించదు.

[3][(4-ఏ) ఈ అనుచ్ఛేదములోనున్నదేదియు, అనుసూచిత కులములు మరియు అనుసూచిత జనజాతుల వారికి ఆ రాజ్య సర్వీసులలో చాలినంతగా ప్రాతినిధ్యము వహించుట లేదని అభిప్రాయపడినప్పుడు, రాజ్య సర్వీసులోని ఏదేని తరగతి లేక తరగతుల పదవులకు [4][పారిణామిక సీనియారిటీతో పదోన్నతి విషయములలో] ప్రత్యేకించుట కొరకు ఏదేని నిబంధనను చేయుట నుండి రాజ్యమును నివారించదు.]

---

1. సంవిధాన (తొంబది మూడవ సవరణ) చట్టము, 2005 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 20.01.2006 నుండి చొప్పించబడినది.
2. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''ఒకటవ అనుసూచిలో నిర్దిష్టపరచబడిన ఏదేని రాజ్యమునకుగాని, దాని రాజ్యక్షేత్రములోని అనుదానికి బదులుగా 01.11.1956 నుండి ఉంచబడినది.
3. సంవిధన (డెబ్బది ఏడవ సవరణ) చట్టము, 1995 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 17.06.1995 నుండి చొప్పించబడినది.
4. సంవిధాన (ఎనబది ఐదవ సవరణ) చట్టము, 2001 యొక్క 2వ పరిచ్ఛేదము కొన్ని పదములకు బదులుగా ద్వారా 09.06.2000 నుండి ఉంచబడినది.

[1][(4-బీ) ఒక ఏడాదిలో రిజర్వేషన్ యొక్క ఏదేని నిబంధనను అనుసరించి, ఖండము (4) లేక ఖండము (4-ఏ) క్రింద ప్రత్యేక తరగతి ఖాళీలుగా చేయబడిన ఖాళీలలో భర్తీ చేయబడని వాటిని తదుపరి సంవత్సరము, లేక సంవత్సరములలో భర్తీ చేయుటకై పర్యాలోచన చేయుట నుండి ఈ అనుచ్ఛేదములో నున్న దేదియు రాజ్యమును నివారించదు మరియు అట్టి తరగతి ఖాళీలను మొత్తం ఖాళీల సంఖ్యతో యాభై శాతం గరిష్ఠ పరిమితి రిజర్వేషన్‌ను నిర్ధారించుటను, ఏ సంవత్సరములో అవి భర్తీ చేయబడుచున్నవో, ఆ సంవత్సరములోని ఖాళీలతో కలిపి పర్యాలోచించరాదు.]

(5) ఏదేని మతమునకు లేదా మత శాఖకు చెందిన సంస్థ యొక్క వ్యవహారములకు సంబంధించిన పదవిని నిర్వహించు వ్యక్తి, లేక ఆ సంస్థ యొక్క పాలకవర్గ సభ్యుడు, ఫలానా మతమును అవలంభించినవాడై యుండవలెనని లేక ఫలానా మత శాఖకు చెందినవాడై యుండవలెనని, నిబంధించు ఏదేని శాసనము యొక్క అమలుకు ఈ అనుచ్ఛేదములో నున్నదేదియు భంగము కలిగించదు.

[2][(6) ఈ అనుచ్ఛేదములోనున్నదేదియు, ఖండము (4)లో పేర్కొనబడిన తరగతులు కానట్టి, ఆర్థికముగా వెనుకబడిన తరగతుల పౌరులకు నియామకములు మరియు పదవులలో ప్రస్తుతమున్న ప్రత్యేకింపుకు అదనంగా మరియు ప్రతి శ్రేణిలోని మొత్తము పదవులలో గరిష్ఠముగా పది శాతమునకు అధ్యధీనమై, ఏదైనా నిబంధన చేయుట నుండి నివారించదు.]

17. ''అస్పృశ్యత'' నిర్మూలింపబడినది, మరియు ఏ రూపముననైనను దాని ఆచరణ నిషేధింపబడినది. ''అస్పృశ్యత'' నుండి ఉత్పన్నమగు ఏ అశక్తత అమలు జరుపుట శాసన రీత్యా శిక్షింపదగు అపరాధమగును. **అస్పృశ్యతా నిర్మూలన.**

18. (1) రాజ్యము సైనిక, లేక విద్యా సంబంధమైన ఘనతను సూచించునది కానట్టి మరే బిరుదునైనను ప్రదత్తము చేయరాదు. **బిరుదుల రద్దు.**

(2) భారతదేశ పౌరుడెవరును ఏ విదేశీ రాజ్యము నుండియు ఎట్టి బిరుదును స్వీకరించరాదు.

(3) భారతదేశ పౌరుడు కాని ఏ వ్యక్తియు, తాను రాజ్యమునకధీనమైన ఏదేని లాభాయుత లేక విశ్వాసయుత పదవిలో ఉన్నంత కాలము, రాష్ట్రపతి సమ్మతి లేకుండ ఏ విదేశీ రాజ్యము నుండియు, ఎట్టి బిరుదును స్వీకరించరాదు.

(4) రాజ్యమునకధీనమైన ఏదేని లాభాయుత లేక విశ్వాసయుత పదవిలోనున్న వ్యక్తి, రాష్ట్రపతి సమ్మతి లేకుండ ఏ విదేశీ రాజ్యము నుండి గాని, ఏ విదేశీ రాజ్యము క్రింద గాని, ఎట్టి బహుమతిని, లేక ఉపలబ్ధిని, లేక ఏ విధమగు పదవిని స్వీకరించరాదు.

---

1. సంవిధాన (ఎనబది ఒకటవ సవరణ) చట్టము, 2000 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.
2. సంవిధాన (నూట మూడవ సవరణ) చట్టము, 2019 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 14.1.2019వ తేదీ నుండి చొప్పించబడినది.

## స్వాతంత్ర్యమునకు హక్కు

19. (1) పౌరులందరు ఈ క్రింది హక్కులు కలిగియుందురు; **వాక్స్వాతంత్ర్యము మొదలైన వాటి విషయమున రక్షణ.**

(ఎ) వాక్ స్వాతంత్ర్యమునకు మరియు భావప్రకటనా స్వాతంత్ర్యమునకు;

(బి) శాంతియుతముగను మరియు ఆయుధములు లేకుండను సమావేశమగుటకు;

(సి) అసోసియేషనులు, లేక సంఘములు [1][లేక సహకార సంఘములు] ఏర్పాటు చేయుటకు;

(డి) భారతదేశ రాజ్యక్షేత్రము అంతటను స్వేచ్ఛగా సంచరించుటకు;

(ఇ) భారతదేశ రాజ్య క్షేత్రమునందు ఏ భాగములోనైనను నివసించుటకు మరియు స్థిర నివాసమేర్పరచుకొనుటకు; [2][మరియు]

(ఎఫ్) [3][* * * *]

(జి) ఏదేని వృత్తిని అవలంబించుటకు, లేక ఏదేని ఉపజీవికను, వ్యాపారమును, లేక వర్తకమును సాగించుటకు.

[4][(2) అస్తిత్వములో నున్నదైనను, చేయబడునదైనను ఏదేని శాసనము, ఖండము (1) ఉప-ఖండము (ఎ) ద్వారా ప్రదత్తమైన హక్కును వినియోగించుటపై యుక్తమైన నిర్బంధనలను విధించునదైన యెడల, అట్టి నిర్బంధనలు, [5][భారతదేశము యొక్క సార్వభౌమత మరియు అఖండత], రాజ్యభద్రత, విదేశీ రాజ్యములతో స్నేహ సంబంధములు, ప్రజాశాంతి, సభ్యత లేక నైతికత-వీటికి సంబంధించిన హితముల దృష్ట్యాకాని, న్యాయస్థాన దిక్కారము, పరువు నష్టము, లేక ఏదేని అపరాధ ప్రేరణ వీటి సంబంధమున విధించబడినచో అంతమేరకు ఆ శాసనము యొక్క అమలకు, సదరు ఉప-ఖండములో నున్నదేదియు భంగము కలిగించదు, లేక ఆ శాసనము చేయుట నుండి ఈ ఉప-ఖండములో నున్నదేదియు రాజ్యమును నివారించదు.]

(3) అస్తిత్వములో నున్నదైనను, చేయబడునదైనను ఏదేని శాసనము సదరు ఖండము యొక్క ఉప-ఖండము (బి) ద్వారా ప్రదత్తమైన హక్కును వినియోగించుటపై యుక్తమైన నిర్బంధనలను

---

1. సంవిధాన (తొంబది ఏడవ సవరణ) చట్టము, 2011, యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ఉంచబడినది. (12.01.2012 నుంచి ఉంచబడినది)
2. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 20.06.1979 నుండి చొప్పించబడినది.
3. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 20.06.1979 నుండి లుప్తము చేయబడినది.
4. సంవిధాన (ఒకటవ సవరణ) చట్టము, 1951 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా ఖండము (2)కు బదులుగా గత కాలిక ప్రభావముతో ఉంచబడినది.
5. సంవిధాన (పదహారవ సవరణ) చట్టము, 1963 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 05.10.1963 నుండి చొప్పించబడినది.

విధించునదైన యెడల, అట్టి నిర్బంధనలు, [1][భారతదేశము యొక్క సార్వభౌమత మరియు అఖండత, లేక] ప్రజాశాంతి-వీటికి సంబంధించిన హితముల దృష్ట్యా విధించబడినచో అంతమేరకు ఆ శాసనము యొక్క అమలుకు, సదరు ఉప-ఖండములో నున్నదేదియు భంగము కలిగించదు లేక ఆ శాసనమును చేయట నుండి ఆ ఉప-ఖండములో నున్నదేదియు రాజ్యమును నివారించదు.

(4) అస్తిత్వములో నున్నదైనను, చేయబడినదైనను ఏదేని శాసనము సదరు ఖండము యొక్క ఉప-ఖండము (సి) ద్వారా ప్రదత్తమైన హక్కును వినియోగించుటపై యుక్తమైన నిర్బంధనలను విధించునదైన యెడల, అట్టి నిర్బంధనలు, [1][భారతదేశము యొక్క సార్వభౌమత మరియు అఖండత, లేక] ప్రజాశాంతి లేక నైతికత వీటికి సంబంధించిన హితముల దృష్ట్యా విధించబడినచో అంతమేరకు, ఆ శాసనము యొక్క అమలుకు సదరు ఉప-ఖండములో నున్నదేదియు భంగము కలిగించదు, లేక ఆ శాసనము చేయుట నుండి ఆ ఉప-ఖండములో నున్నదేదియు రాజ్యమును నివారించదు.

(5) అస్తిత్వములో నున్నదైనను, చేయబడిన దైనను ఏదేని శాసనము సదరు ఖండము యొక్క [2][ఉప-ఖండములు (డి), మరియు (ఇ)] ద్వారా ప్రదత్తమైన ఏదేని హక్కును వినియోగించుటపై యుక్తమైన నిర్బంధనలను విదించునదైన యెడల, అట్టి నిర్బంధనలు జనసామాన్యము యొక్క హితము కొరకుగాని, ఏదేని అనుసూచిత జనజాతి యొక్క హితముల రక్షణ కొరకుగాని విదించబడినచో అంతమేరకు ఆ శాసనము యొక్క అమలుకు సదరు ఉప-ఖండములలో నున్నదేదియు భంగము కలిగించదు, లేక ఆ శాసనమును చేయుట నుండి ఆ ఉప-ఖండములలో నున్నదేదియు రాజ్యమునున నివారించదు.

(6) అస్తిత్వములో నున్నదైనను, చేయబడునదైనను ఏదేని శాసనము సదరు ఖండము యొక్క ఉప-ఖండము (జి) ద్వారా ప్రదత్తమైన ఏదేని హక్కును వినియోగించుటపై యుక్తమైన నిర్బంధనలను విధించునదైన యెడల, అట్టి నిర్బంధనలు జనసామాన్యము యొక్క హితము కొరకు విధించబడినచో, అంతమేరకు ఆ శాసనము యొక్క అమలుకు సదరు ఉప-ఖండములో నున్నదేదియు భంగము కలిగించదు, లేక ఆ శాసనమును చేయుట నుండి ఆ ఉప-ఖండములో నున్నదేదియు రాజ్యమును నివారించదు, మరియు ప్రత్యేకించి, అస్తిత్వములో నున్నదైనను, చేయబడునదైనను ఏదేని శాసనము, [3][ఈ క్రింద తెలిపిన వాటికి సంబంధించినదైన యెడల, అంత మేరకు ఆ శాసనము యొక్క అమలుకు, సదరు ఉప-ఖండములో నున్నదేదియు భంగము కలిగించదు, లేక ఆ శాసనమును చేయుట నుండి ఆ ఉప-ఖండమలో నున్నదేదియు రాజ్యమును నివారించదు, అవేవనగా:-

---

1. సంవిధాన (పదహారవ సవరణ) చట్టము, 1963 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 05.10.1963 నుండి చొప్పించబడినది.
2. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ఉప-ఖండములు (డి), (ఇ) మరియు (ఎఫ్) 20.06.1979 నుండి ఉంచబడినవి.
3. సంవిధాన (ఒకటవ సవరణ) చట్టము, 1951 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా కొన్ని పదములకు ఉంచబడినది.

(i) ఏదేని వృత్తిని అవలంబించుటకు, లేక ఏదేని ఉపజీవికను, వ్యాపారమును, లేక వర్తకమును సాగించుటకు ఆవశ్యకమగు వృత్తి సంబంధమైన, లేక సాంకేతిక అర్హతలు, లేక

(ii) పూర్ణత: లేక భాగత: పౌరులను అపవర్జించియైనను, అన్యథాయైనను, రాజ్యముచే, లేక రాజ్యమునకు చెందిన, లేక రాజ్యము యొక్క నియంత్రణలోనున్న, ఏదేని కార్పొరేషనుచే ఏదేని వ్యాపారము, వర్తకము, పరిశ్రమ, లేక సేవసాగించబడుట].

**అపరాధములకై నేరస్థాపన విషయమున రక్షణ.**

20. (1) ఏ వ్యక్తియు, అపరాధమని ఆరోపించబడిన కార్యమును చేసిన సమయమున అమలులోనున్న శాసనము యొక్క అతిక్రమణకు తప్ప, ఏ అపరాధమునకును నేరస్థాపితుడు కారాదు, మరియు అపరాధము చేసిన సమయమున అమలులోనున్న శాసనము క్రింద విధించబడియుండెడి దానికంటే మించిన శాస్తికి లోనుచేయబడరాదు.

(2) ఏ వ్యక్తియు ఒకే అపరాధమునకు ఒక సారికి మించి అభియోగమునకు మరియు శిక్షకు గురి చేయబడరాదు.

(3) ఏదైన అపరాధము చేసినట్లు అభియుక్తుడైన ఏ వ్యక్తియు తనకు వ్యతిరేకముగ సాక్ష్యము నొసగుటకు బలవంతము చేయబడరాదు.

**ప్రాణ మరియు వ్యక్తిగత స్వాతంత్ర్య రక్షణ.**

21. శాసనము ద్వారా స్థాపితమైన ప్రక్రియ ప్రకారము తప్ప, ఏ వ్యక్తి యొక్క ప్రాణము లేక వ్యక్తిగత స్వాతంత్ర్యము హరించబడరాదు.

**విద్యా హక్కు**

*[1][21ఏ. రాజ్యము శాసనము ద్వారా నిర్ధారించునట్టి రీతిలో ఆరు నుండి పదునాలుగు సంవత్సరముల వయస్సులోని పిల్లలందరికీ నిశ్శుల్క మరియు నిర్బంధ విద్యను కల్పించవలెను.]

**కొన్ని సందర్భములలో అరెస్టు మరియు నిరోధము నుండి రక్షణ.**

22. (1) అరెస్టు చేయబడిన ఏ వ్యక్తియు, అట్టి అరెస్టుకు గల కారణములను గూర్చి వీలైనంత త్వరితముగ తెలియజేయబడకుండ అభిరక్షలో నిరోధించబడరాదు మరియు తాను కోరిన న్యాయవాది సలహా పొందుటకును, అట్టి న్యాయవాదిచే ప్రతివాదన చేయించుకొనుటకును గల హక్కు అతనికి నిరాకరించబడరాదు.

(2) అరెస్టు చేయబడి, అభిరక్షలో నిరోధించబడిన ప్రతి వ్యక్తి, అట్లు అరెస్టు చేయబడిన తరువాత, అరెస్టు చేయబడిన స్థలము నుండి అక్కడికి అత్యంత సమీపమున గల మెజిస్ట్రేటు న్యాయస్థానమునకు అతనిని తీసికొని పోవుటకు ఆవశ్యకమైన కాలమును మినహాయించి, ఇరువది నాలుగు గంటల లోపల అట్టి మెజిస్ట్రేటు సమక్షమున హాజరు పరచబడవలెను మరియు అట్టి ఏ వ్యక్తియు, మెజిస్ట్రేటు యొక్క ప్రాధికారము లేకుండ, సదరు కాలావధికి మించి అభిరక్షలో నిరోధించబడరాదు.

*1. సంవిధాన (ఎనుబది ఆరవ సవరణ) చట్టము, 2002 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 01.04.2010 నుండి చొప్పించబడినది (ఎస్.ఓ.427 (ఈ), తేదీ:16.02.2010).

(3) ఖండములు (1) మరియు (2)లో నున్న దేదియు ఈ క్రింది వ్యక్తికి వర్తించదు:-

(ఎ) తత్సమయమున, శత్రు దేశీయుడైన ఎవరేని వ్యక్తి, లేక

(బి) నివారక నిరోధమును నిబంధించు ఏదేని శాసనము క్రింద అరెస్టు చేయబడిన, లేక నిరోధింపబడిన ఎవరేని వ్యక్తి.

**[1](4) నివారక నిరోధము కొరకు నిబంధించు శాసనము ఏదియు,

(ఎ) ఉన్నత న్యాయస్థానపు న్యాయాధీశునిగా నియమింపబడిన లేక నియమింపబడుటకు అర్హత కలిగిన వ్యక్తులతో కూడిన సలహా బోర్డు తన అభిప్రాయములో సదరు మూడు మాసములకు మించి నిరోధించుటకు తగినంత కారణము కలదని సదరు కాలావధి ముగియుటకు పూర్వము రిపోర్టు చేసిననే తప్ప:

అయితే, ఈ ఖండములో నున్నదేదియు, ఖండము (7) యొక్క ఉప-ఖండము (బి) క్రింద పార్లమెంటు చేసిన ఏదేని శాసనము ద్వారా విహితమైన గరిష్ట కాలావధికి మించి ఏ వ్యక్తినైనను నిరోధించుటకు ప్రాధికారము నొసగదు; లేక

(బి) అట్టి వ్యక్తి ఖండము (7) యొక్క ఉప-ఖండములు (ఎ) మరియు (బి)ల క్రింద పార్లమెంటుచే చేయబడిన ఏదేని శాసనము యొక్క నిబంధనల ననుసరించి నిరోధించబడిననే తప్ప;

ఒక వ్యక్తిని మూడు మాసములకంటే ఎక్కువ కాలావధికి నిరోధించుటకు ప్రాధికారము నొసగదు.

(5) నివారక నిరోధమును నిబంధించు ఏదేని శాసనము క్రింద చేయబడిన ఉత్తరువుననుసరించి, ఎవరేని వ్యక్తి నిరోధించబడినపుడు, అట్లు ఉత్తరువు చేయు ప్రాధికారి అట్టి ఉత్తరువును చేయుటకు గల కారణములను వీలైనంత త్వరితముగ ఆ వ్యక్తికి తెలియవరచవలెను, మరియు ఆ ఉత్తరువుకు విరుద్ధముగా విన్నవించుకొనుటకు అతనికి శీఘ్రతమమైన అవకాశమును కలిగించవలెను.

(6) ఖండము (5)లో నిర్దేశింపబడిన ఉత్తరువును చేయు ప్రాధికారి ఏ సంగతులను వెల్లడించుట ప్రజాహితమునకు విరుద్ధమని తలచునో, అట్టి సంగతులను అతడు వెల్లడించవలెనని సదరు ఖండములోని దేదియు అపేక్షించరాదు.

(7) పార్లమెంటు శాసనము ద్వారా ఈ క్రింది విషయములను విహితము చేయవచ్చును:-

[2](ఎ) ఖండము (4) యొక్క ఉప-ఖండము (ఎ)లోని నిబంధనల ననుసరించి సలహా బోర్డు యొక్క అభిప్రాయమును పొందకుండా నివారక నిరోధమును నిబంధించు ఏదేని శాసనము

---

**1. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా ఆదిలోనున్న ఖండమునకు బదులుగా ఇది ఉంచబడినట్లు భావించవలెను.

2. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా ఖండము (ఎ) వదిలివేయబడి ఖండము (బి), (ఎ)గా పునరక్షరము చేయబడినది. (ప్రస్తుతం అమలులో లేదు అమలు తేదీ తరువాత అధిసూచంచబడును).

క్రింద ఏదేని తరగతికి లేక తరగతులకు చెందిన కేసులలో ఒక వ్యక్తిని మూడు మాసములకు మించిన కాలావధికి నిరోధించుటకైన పరిస్థితులను;

[1](బి) నివారక నిరోధమును నిబంధించు ఏదేని శాసనము క్రింద, ఏదేని తరగతికి లేక తరగతులకు చెందిన కేసులలో, ఎవరేని వ్యక్తి యొక్క నిరోధమునకు గరిష్ఠ కాలావధి; మరియు

(సి) ఖండము [2](4) యొక్క ఉప-ఖండము (ఎ) క్రింద పరిశీలనలో సలహా బోర్డు అనుసరించవలసిన ప్రక్రియ.

## శోషణ నుండి రక్షణకు హక్కు

**మనుష్యుల క్రయ విక్రయములపై మరియు బలవంతపు చాకిరీలపై నిషేధము.**

23. (1) మనుష్యుల క్రయవిక్రయము, వెట్టి మరియు తాదృశమైన బలవంతపు చాకిరీలు నిషేధింపబడినవి. ఈ నిబంధన యొక్క ఉల్లంఘన శాసన రీత్యా శిక్షింపదగు అపరాధమగును.

(2) ఈ అనుచ్ఛేదములో నున్నదేదియు సార్వజనిక ప్రయోజనముల కొరకు నిర్బంధ సేవను విధించుట నుండి రాజ్యమును నివారించదు, మరియు అట్టి సేవను విధించుటలో రాజ్యము కేవలము మతము, జాతి, కులము, లేక వర్గ కారణములనుబట్టికాని, వాటిలో వేనిని బట్టి కాని, విచక్షణ చేయరాదు.

**కర్మాగారాలు మొదలైన వాటిలో బిడ్డలను ఉద్యోగములోనుంచుట పై నిషేధము.**

24. పదునాలుగు సంవత్సరములలోపు వయస్సుగల ఏ బిడ్డయు, ఏ కర్మాగారములోగాని, గనిలోగాని పనిచేయుటకు ఉద్యోగములో ఉంచబడరాదు లేక అపాయకరమైన ఏదేని ఇతర ఉద్యోగములలో ఉంచబడరాదు.

## మత స్వాతంత్రపు హక్కు

**అంతరాత్మననుసరించి స్వాతంత్ర్యము, స్వేచ్ఛాయుత మతావలంబన, ఆచరణ, ప్రచారములు.**

25. (1) ప్రజా శాంతికి, నైతికతకు, ఆరోగ్యమునకు మరియు ఈ భాగము యొక్క ఇతర నిబంధనలకు అధ్యధీనమై, అంతరాత్మననుసరించి స్వాతంత్ర్యమునకును, స్వేచ్ఛగా మతమును అవలంబించుటకును, ఆచరించుటకును, ప్రచారము చేయుటకును, జనులందరు సమానముగ హక్కు కలిగి యుందురు.

(2) ఈ అనుచ్ఛేదమునందున్న దేదియు–

(ఎ) మతాచరణకు సంబంధించిన ఏదేని ఆర్థిక, విత్తీయ, రాజకీయ, లేక ఇతర లౌకిక కార్యకలాపమును క్రమబద్ధపరచునదై, లేక పరిమితపరచునదై;

---

1. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా ఖండము (సి) ఖండము (బి)గా పునరక్షరము వేయబడినది. (ప్రస్తుతం అమలులో లేదు అమలు తేదీ తరువాత సూచించబడును.)

2. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 'ఖండము (4) యొక్క ఉప-ఖండము (ఎ),' అను పదములు బ్రాకెట్లు తిరిగి ఉంచబడినవి. (ప్రస్తుతము అమలులో లేదు అమలు తేదీ తరువాత సూచించబడును).

(బి) సాంఘిక సంక్షేమమునకును, సంస్కరణకును, లేక సార్వజనిక స్వభావముగల హిందూ మత సంస్థలలో హిందువులలోని అన్ని వర్గములకును, శాఖలకును ప్రవేశము కలుగజేయుచు నిబంధన చేయునదై;

అస్తిత్వములోనున్న ఏదేని శాసనము యొక్క అమలుకు భంగము కలిగించదు లేక అట్టి ఏ శాసనమునైనను చేయుట నుండి రాజ్యమును నివారించదు.

**విశదీకరణ–I:–** కృపాణధారణ, కృపాణవహనము సిక్కు మతావలంబనములో చేరియున్నట్లు భావింపబడవలెను.

**విశదీకరణ–II:–** ఖండము (2) యొక్క ఉప-ఖండము (బి)లో హిందువులను గూర్చిన నిర్దేశమునందు, సిక్కు, జైన, లేక బౌద్ధ మతావలంబ వ్యక్తులను గూర్చిన నిర్దేశము చేరియున్నట్లు అన్వయించబడవలెను మరియు హిందూ మత సంస్థలను గూర్చిన నిర్దేశము తదనుసారముగ అన్వయించబడవలెను.

**మత వ్యవహార నిర్వహణ స్వాతంత్ర్యము.**

26. ప్రజాశాంతికి, నైతికతకు మరియు ఆరోగ్యమునకు, అధ్యధీనమై ప్రతి మత శాఖ లేక అందలి ఏ ఉపశాఖయైనను, ఈ క్రింది హక్కును కలిగియుండును.

(ఎ) మత మరియు ధార్మిక ప్రయోజనముల కొరకు సంస్థలను స్థాపించుట మరియు పోషించుట;

(బి) మత విషయములలో స్వీయ వ్యవహారములను నిర్వహించుకొనుట;

(సి) స్థిరాస్తిని మరియు చరాస్తిని కలిగియుండుట, మరియు అర్జించుట; మరియు

(డి) అట్టి ఆస్తిని శాసనముననుసరించి నిర్వహించుట.

**ఏదేని ప్రత్యేకమైన మతమును అభివృద్ధి జేయుటకు పన్నుల చెల్లింపును గూర్చిన స్వాతంత్ర్యము.**

27. ఏదేని ప్రత్యేకమైన మతమును, లేక మత శాఖను అభివృద్ధి జేయుటకు, లేక పోషించుటకు అగు ఖర్చులను భరించుటకై ఏ పన్నుల వలన రాబడి నిర్దిష్టముగా కేటాయించబడునో ఆ పన్నులను చెల్లించుటకు ఏ వ్యక్తియు బలవంత పెట్టబడరాదు.

**కొన్ని విద్యా సంస్థలలో మత బోధ, లేక మత సంబంధమైన ఆరాధన జరుగునప్పుడు హాజరగుటను గూర్చిన స్వాతంత్ర్యము.**

28. (1) రాజ్య నిధుల నుండి సంపూర్ణముగ పోషించబడుచున్న ఏ విద్యాసంస్థలోను ఎట్టి మతబోధకైనను ఏర్పాటు చేయరాదు.

(2) ఖండము (1)లో నున్నదేదియు, రాజ్యముచే నిర్వహించబడుచుండి, మతబోధ జరుగవలెనని ఆపేక్షించు ధర్మాదాయము, లేక ట్రస్టు క్రింద స్థాపించబడిన ఏ విద్యా సంస్థకును వర్తించరాదు.

(3) రాజ్యముచే గుర్తింపబడిన లేక రాజ్య నిధుల నుండి సహాయమును పొందుచున్న ఏదేని విద్యాసంస్థలో హాజరగుచున్న ఏ వ్యక్తినైనను అట్టి సంస్థలో చేయబడు ఏదేని మత బోధలో పాల్గొనవలసినదని కాని, అట్టి సంస్థలో లేక దానికి సంబంధించిన ఏదేని ఆవరణలో జరుపబడు ఏదేని మత సంబంధమైన ఆరాధనకు హాజరుకావలెనని కాని, అందుకు ఆ వ్యక్తి కాని, ఆ వ్యక్తి మైనరైనచో అతని సంరక్షకుడుగాని సమ్మతించిననే తప్ప కోరరాదు.

## సాంస్కృతిక మరియు విద్యా విషయక హక్కులు

**అల్పసంఖ్యాకవర్గముల యొక్క హితముల రక్షణ.**

29. (1) భారతదేశ రాజ్యక్షేత్రములో లేక అందలి ఏ భాగములో నివసించుచున్న పౌరులలోని ఏదేని వర్గమువారు తమ విశిష్ట భాష, లిపి, లేక సంస్కృతిని కలిగియుండినచో, వారు దానిని కాపాడుకొనుటకు హక్కు కలిగియుందురు.

(2) రాజ్యముచే పోషింపబడుచున్న, లేక రాజ్య నిధుల నుండి సహాయము పొందుచున్న, ఏ విద్యా సంస్థలోనైనను, కేవలము మతము, జాతి, కులము, భాష కారణములను బట్టి కాని, వాటిలో దేనిని బట్టికాని, ఏ పౌరునికైనను ప్రవేశము నిరాకరించబడరాదు.

**విద్యాసంస్థలను స్థాపించుటకు మరియు నిర్వహించుటకు అల్పసంఖ్యాక వర్గములకు గల హక్కు.**

30. (1) మత ప్రాతిపదికపైగాని, భాషా ప్రాతిపదికపైగాని ఏర్పడిన అల్ప సంఖ్యాక వర్గముల వారందరును, తమకు అభీష్టమైన విద్యాసంస్థలను స్థాపించుకొనుటకును, నిర్వహించుకొనుటకును హక్కు కలిగియుందురు.

[1] [(1ఏ) ఖండము (1)లో నిర్దేశింపబడిన అల్ప సంఖ్యాక వర్గముచే స్థాపింపబడి, నిర్వహింపబడుచున్న, ఒక విద్యా సంస్థ యొక్క ఏదేని ఆస్తిని నిర్బంధముగా అధ్యార్జించుటను నిబంధించు ఏదేని శాసనమును చేయుటలో అట్టి ఆస్తి అధ్యార్జన కొరకు, అట్టి శాసనము ద్వారా నియతము చేయబడిన లేక దాని క్రింద నిర్ధారించబడిన మొత్తము ఆ ఖండము క్రింద హామీయివ్వబడిన హక్కును పరిమిత పరచకుండునట్లు లేక రద్దు పరచకుండునట్లు రాజ్యము కట్టుదిట్టము చేయవలెను.]

(2) విద్యాసంస్థలకు సహాయము చేయు సందర్భములలో మత ప్రాతిపదికపై లేక భాషా ప్రాతిపదికపై ఏర్పడిన అల్ప సంఖ్యాక వర్గము యొక్క నిర్వహణలో నున్నదను కారణమునుబట్టి ఏ విద్యా సంస్థకు విరుద్ధముగను రాజ్యము విచక్షణ చేయరాదు.

[2](.................................)

31. [ఆస్తి యొక్క నిర్బంధ అధ్యార్జన] సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 6వ పరిచ్ఛేదము ద్వారా 20.06.1979 నుండి రద్దు చేయబడినది.

### [2] [కొన్ని శాసనముల వ్యావృత్తి]

**ఎస్టేటు మొదలగు వాటి అధ్యార్జన కొరకు నిబంధించు శాసనము వ్యావృత్తి.**

[3]31ఏ. [4] [(1) 13వ అనుచ్ఛేదములో ఏమి యున్నప్పటికిని–

---

1. సంవిధాన ( నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 20.06.1979 నుండి చొప్పించబడినది.
2. సంవిధాన ( నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా ''ఆస్తిహక్కు'' అను ఉపశీర్షిక (20.06.1979) నుండి వదిలివేయబడినది.
3 . సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 ద్వారా 03.01.1977 నుండి చొప్పించబడినది.
4 . సంవిధాన (ఒకటవ సవరణ) చట్టము, 1951 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా గతకాలిక ప్రభావముతో చొప్పించబడినది.

(ఎ) రాజ్యముచే ఏదేని ఎస్టేటు యొక్క లేక అందలి ఏవేని హక్కుల యొక్క గాని అధ్యార్జన కొరకు, లేక అట్టి హక్కుల నిర్వాపన (అంతముచేయుట), లేక మార్పు కొరకు, లేక

(బి) ప్రజాహితమునకు లేక ఆస్తి యొక్క సముచిత నిర్వహణను చేకూర్చుటకుగాని, రాజ్యము, ఏదేని ఆస్తి యొక్క నిర్వహణను పరిమితకాలము వరకు చేపట్టుట కొరకు, లేక

(సి) ప్రజాహితమునకు లేక ఏదేని కార్పొరేషనుల సముచిత నిర్వహణను చేకూర్చుటకు రెండు లేక అంతకుమించిన కార్పొరేషనుల యొక్క విలీనీకరణ కొరకు, లేక

(డి) కార్పొరేషనుల యొక్క నిర్వాహక ఏజెంట్ల, కార్యదర్శుల మరియు కోశాధికారుల, నిర్వాహక ఆదేశకుల (మేనేజింగు డైరెక్టర్ల), ఆదేశకుల, లేక నిర్వాహకుల హక్కులను లేక కార్పోరేషనుల యొక్క వాటాదారుల ఓటింగు హక్కులను నిర్వాపన (అంతముచేయుట) చేయుట కొరకు లేక మార్పు చేయుట కొరకు, లేక

(ఇ) ఏదేని ఖనిజమునకైన కౌలు, లేక ఖనిజ తైలమును వెదకుటకైన, లేక వెలికితీయుటకైన కరారు, కౌలు, లేక లైసెన్సును బట్టి ప్రాప్తించు ఏవేని హక్కులను నిర్వాపన (అంతముచేయుట) చేయుట కొరకు, లేక మార్పు చేయుట కొరకు లేక అట్టి కరారు, కౌలు లేక లైసెన్సును సమయాత్పూర్వమే సమాప్తము చేయుట కొరకు, లేక రద్దుచేయుట కొరకు,

నిబంధించునట్టి శాసనమును దేనిని గాని, [1] [14వ అనుచ్ఛేదము లేక 19వ అనుచ్ఛేదము] ద్వారా ప్రదత్తమైన హక్కులలో దేనికైనను అసంగతముగనున్నదను, లేక అట్టి హక్కులలో దేనినైనను తీసివేయునను, లేక కుంచించునను కారణమునుబట్టి ప్రభావశూన్యమగునవి భావించరాదు:

అయితే అట్టి శాసనము, ఒక రాజ్య శాసనమండలిచే చేయబడినదైన యెడల, రాష్ట్రపతి పర్యాలోచన కొరకై ప్రత్యేకింపబడి ఆయన అనుమతిని పొందిననే తప్ప, ఈ అనుచ్ఛేదము యొక్క నిబంధనలు దానికి వర్తించవు:]

[2][అంతేకాక రాజ్యముచే ఏదేని ఎస్టేటు అధ్యార్జింపబడుటకు ఏదేని శాసనము నిబంధన చేయునెడల, మరియు ఆ ఎస్టేటులో చేరిన ఏదేని భూమి ఒక వ్యక్తి యొక్క స్వంత సేద్యము క్రిందనున్న యెడల అట్టి అధ్యార్జనకు సంబంధించిన శాసనములో మార్కెటు విలువకు తగ్గని రేటు చొప్పున నష్టపరిహారము చెల్లించుటకు నిబంధనలున్ననే తప్ప, తత్సమయమున అమలులోనున్న ఏదేని శాసనము క్రింద అతనికి వర్తించెడి గరిష్ట పరిమితిలోపున ఉన్న భూమిలోని ఏదేని భాగముగాని, దానిపై గల లేక దానికి చెందియున్న ఏదేని భవనముగాని, కట్టడముగాని, రాజ్యముచే అధ్యార్జించబడుట శాసన సమ్మతము కాదు.]

---

1. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా ''14వ అనుచ్ఛేదము, 19వ అనుచ్ఛేదము లేక 31వ అనుచ్ఛేదము'' అనుపదములకు 20.06.1979 నుండి ఉంచబడినది.
2. సంవిధాన (పదిహేడవ సవరణ) చట్టము, 1964 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 20.06.1964 నుండి చొప్పించబడినది.

(2) ఈ అనుచ్ఛేదములో,-

[1][(ఎ) ఏదేని స్థానిక ప్రాంతము విషయమున, ''ఎస్టేటు'' అను పదము, ఆ ప్రాంతము నందు అమలులోనున్న భూమి కౌళ్లకు సంబంధించి అస్తిత్వములోనున్న శాసనములో ఆ పదమునకుగాని, స్థానీయ తుల్యపదమునకుగాని ఏ అర్థము కలదో ఆ అర్థమునే కలిగియుండును, మరియు అందు ఈ క్రిందివి కూడ చేరియుండును:-

(i) ఏదేని జాగీరు, ఇనాం, లేక మౌఫి, లేక ఇతరమైన తాదృశ అనుదానము మరియు [2](తమిళనాడు), కేరళ రాజ్యములలో ఏదేని జన్మమ్ హక్కు;

(ii) రైతువారీ సెటిల్‌మెంటు క్రింద కలిగియున్న ఏదేని భూమి;

(iii) బంజరు భూమి, అటవీ భూమి, పచ్చికబయళ్ల భూమి, లేక కర్షకులు, లేక వ్యవసాయ కూలీలు, మరియు చేతి వృత్తుల వారు ఆక్రమించుకొనిన భవనములు మరియు ఇతర కట్టడములు ఉన్న స్థలములతో సహా, వ్యవసాయ లేక తత్సహాయక ప్రయోజనముల కొరకు ఎవరేని కలిగియున్న లేక ఎవరికేని కౌలుకు ఇవ్వబడిన ఏదేని భూమి.

(బి) ఎస్టేటు విషయమున ''హక్కులు'' అను పదము నందు ప్రాప్రయిటరు, సబ్ ప్రాప్రయిటరు, అవర ప్రాప్రయిటరు, ధారణాధికారి, [3][రైతు, లేక రైతు క్రింది రైతుః లేక ఇతర మధ్యస్థునియందు నిహితమైయుండు ఏవైన హక్కులు, మరియు భూమిశిస్తును గూర్చిన ఏవైన హక్కులు, లేక విశేషాధికారములు చేరియుండును.]

**కొన్ని చట్టములకు మరియు వినియమములకు శాసనిక మాన్యత కలుగజేయుట.**

[4][31బీ.31ఏ అనుచ్ఛేదములోగల నిబంధనల సాధారణతకు భంగము కలుగకుండ, తొమ్మిదవ అనుసూచిలో నిర్దిష్టపరచబడిన ఏవేని చట్టములు, వినియమములు, వాటి యొక్క ఏవేని నిబంధనలు, అట్టి చట్టము, వినియమము లేక నిబంధనను ఈ భాగములోని ఏవేని నిబంధనల ద్వారా ప్రదత్తమైన ఏవేని హక్కులకు అసంగతముగనున్నదను, లేక ఆ హక్కులలో దేనినైనను తీసివేయుచున్నదను, లేక కుంచించుచున్నదను ఆధారముపై ప్రభావశూన్యమైనదనిగాని, ఎప్పుడైనను ప్రభావశూన్యమై యుండినదనిగాని భావించరాదు మరియు ఏదేని న్యాయస్థానము లేక ట్రిబ్యునలు యొక్క ఏదేని తీర్పు, డిక్రీ, లేక ఉత్తర్వు దానికి విరుద్ధముగానున్నప్పటికిని, సదరు ప్రతియొక్క చట్టము మరియు వినియమము, దానిని రద్దు, లేక సవరణ చేయుటకు ఏదేని సమర్ధ శాసనమండలికి గల అధికారమునకు అధ్యధీనమై, అమలునందు కొనసాగవలెను.]

---

1. అదే చట్టపు 2వ పరిచ్ఛేదము ద్వారా ఉప-ఖండము (ఎ)కు బదులుగా గత కాలిక ప్రభావముతో ఉంచబడింది.
2. మదరాసు రాజ్యపు (పేరు మార్పు) చట్టము, 1968 (1968లోని 53వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా ''మదరాసు''కు బదులుగా 14.01.1969 నుండి ఉంచబడినది.
3. సంవిధాన (నాలుగవ సవరణ) చట్టము, 1955 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా గతకాలిక ప్రభావముతో చొప్పించబడినది.
4. సంవిధాన (ఒకటవ సవరణ) చట్టము, 1951 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.

**కొన్ని ఆదేశిక సూత్రములను అమలుపరచు శాసనముల వ్యావృత్తి.**

[1][31సీ.13వ అనుచ్ఛేదములో ఏమియున్నప్పటికిని, [2] [భాగము 4లో పేర్కొనబడిన సూత్రములన్నింటిని గాని వాటిలో కొన్నింటిని గాని] సాధించుట కొరకైన రాజ్య విధానమును అమలుపరచు ఏ శాసనమునైనను [3][14వ అనుచ్ఛేదము లేక 19వ అనుచ్ఛేదము] ద్వారా ప్రదత్తమైన ఏవేని హక్కులకు అసంగతముగ నున్నదను, లేక ఆ హక్కులలో దేనినైనను తీసివేయుచున్నదను, లేక కుంచించుచున్నదను కారణమునుబట్టి ప్రభావ శూన్యమైనదని భావించరాదు, [4] [మరియు ఆ శాసనమందు అది అట్టి విధానమును అమలుపరచుట కొరకైనదను ప్రఖ్యానమున్నచో అది అట్టి విధానమును అమలుపరచదను కారణమునుబట్టి ఏ న్యాయస్థానములోను ప్రష్టవ్యము కారాదు:]

అయితే అట్టి శాసనము రాజ్య శాసన మండలిచే చేయబడిన యెడల రాష్ట్రపతి పర్యాలోచన కొరకై ప్రత్యేకింపబడి ఆయన అనుమతిని పొందిననే తప్ప, దానికి ఈ అనుచ్ఛేదము యొక్క నిబంధనలు వర్తించవు.]

[5]31డీ. [జాతి వ్యతిరేక కార్యకలాపములకు సంబంధించిన శాసనముల వ్యావృత్తి] సంవిధాన (నలుబది–మూడవ సవరణ) చట్టము, 1977 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 13.04.1978 నుండి రద్దు చేయబడినది.

### సంవిధానిక ప్రత్యుపాయములకు హక్కు

**ఈ భాగముచే ప్రదత్తము చేయబడిన హక్కులను అమలు పరచుటకు ప్రత్యుపాయములు.**

32. (1) ఈ భాగము ద్వారా ప్రదత్తమైన హక్కులను అమలు పరచుటకు సముచిత చర్యల ద్వారా సర్వోన్నత న్యాయస్థానమును అర్థించు హక్కుకు హామి ఈయబడినది.

(2) ఈ భాగము ద్వారా ప్రదత్తమైన ఏవేని హక్కులను అమలు పరచుట కొరకు ఆదేశములను, లేక ఉత్తరువులను లేక బందీ ప్రత్యక్ష (హెబియస్ కార్పస్), పరమాదేశ (మాండమస్), ప్రతిషేధ (ప్రొహిబిషన్), అధికారపృచ్ఛ (కోవారంటో) మరియు ఉత్ప్రేషణ (సర్షియోరారి) స్వభావముగల

---

1. సంవిధాన (ఇరువది యైదవ సవరణ) చట్టము, 1971 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 20.4.1972 నుండి చొప్పించబడినది.
2. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా ''39వ అనుచ్ఛేదము యొక్క ఖండము (బి) లేక ఖండము (సి)లో నిర్దిష్టమైన సూత్రములు అను పదములు, బ్రాకెట్లు, అక్షరములు మరియు అంకెలకు బదులు బ్రాకెట్లలోనున్న పదములు 3.1.1977 నుండి ఉంచబడినవి. మినర్వమిల్స్ లిమిటెడ్ మరియు ఇతరులు వర్సెస్ యూనియన్ ఆఫ్ ఇండియా మరియు ఇతరులు (1980) 2 ఎస్.సి.సి 591లో సర్వోన్నత న్యాయస్థానము 4వ పరిచ్ఛేదము 4వ పరిచ్ఛేదము అమాన్యమైనదిగా ప్రఖ్యానించినది.
3. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ చట్టము, 1978 యొక్క 8వ పరిచ్ఛేదము ద్వారా ''అనుచ్ఛేదము 14, అనుచ్ఛేదము 19 లేక అనుచ్ఛేదము 31, అను పదములు మరియు అంకెలకు బదులు అనుచ్ఛేదము 14, అనుచ్ఛేదము 19 అను పదములు మరియు అంకెలు 20.6.1979 నుండి ఉంచబడినవి.
4. ఏ.ఐ.ఆర్.1973 సుప్రీమ్ కోర్టు, 1461: 1973 (సప్లిమెంటు) యస్.సి.ఆర్.1లో రిపోర్టు చేయబడిన కేశవానంద భారతి కేసులో స్క్వేరు బ్రాకెట్లలోనున్న భాగము అమాన్యమైనదని సుప్రీంకోర్టు అభిప్రాయపడినది.
5. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా 3.1.1977 నుండి చేర్చబడినది.

అధిలేఖల (రిట్ల)తో సహా అధిలేఖలను, వీటిలో సముచితమైన దానిని జారీచేయుటకు సర్వోన్నత న్యాయస్థానము అధికారము కలిగియుండును.

(3) ఖండములు (1) మరియు (2) ద్వారా సర్వోన్నత న్యాయస్థానమునకు ప్రదత్తమైన అధికారములకు భంగము కలుగకుండ ఖండము (2) క్రింద సర్వోన్నత న్యాయస్థానముచే వినియోగింపబడదగు అధికారములన్నిటినిగాని వాటిలో దేనినైననుగాని ఏదేని ఇతర న్యాయస్థానమునకు దాని అధికారిత యొక్క స్థానిక హద్దులలో వినియోగించు అధికారమును, శాసనము ద్వారా పార్లమెంటు ఒసగవచ్చును.

(4) ఈ అనుచ్ఛేదముచే హామీ ఈయబడిన హక్కు ఈ సంవిధానముచే అన్యథా నిబంధింపబడినట్లు తప్ప, సస్పెండు చేయబడరాదు.

[1]32ఏ. [రాజ్య శాసనముల యొక్క సంవిధానిక మాన్యతను (32వ అనుచ్ఛేదము క్రింది చర్యలలో పరిగణనలోనికి తీసుకొనరాదు] సంవిధాన (నలుబది – మూడవ సవరణ) చట్టము, 1977 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 13.04.1978 నుండి రద్దు చేయబడినది.

**ఈ భాగము ద్వారా ప్రదత్తమైన హక్కులను సాయుధ బలములు మొదలగు వాటికి వర్తింపచేయునప్పుడు మార్చుటకు పార్లమెంటుకు గల అధికారము.**

[2][33. ఈ భాగము ద్వారా ప్రదత్తమైన హక్కులలో వేటినైనను–

(ఎ) సాయుధ బలములకు చెందిన సభ్యులకు; లేక

(బి) ప్రజాశాంతిని కాపాడు భారము వహించిన సాయుధ బలములకు చెందిన సభ్యులకు; లేక

(సి) గుప్త సమాచారము కొరకు లేక ఎదురు గుప్త సమాచారము కొరకు రాజ్యముచే స్థాపించబడిన ఏదేని బ్యూరోలో లేదా ఇతర వ్యవస్థలో నియమించబడిన వ్యక్తులకు; లేక

(డి) (ఎ) నుండి (సి) వరకు గల ఖండములలో నిర్దేశింపబడిన ఏదేని సాయుధబలము, బ్యూరో లేక వ్యవస్థ కొరకై ఏర్పాటు చేసిన టెలీకమ్యూనికేషను వ్యవస్థలలో నియమించబడిన లేదా వాటికి సంబంధించిన వ్యక్తులకు,

వర్తింపజేయుటలో, వారి సముచిత కర్తవ్య నిర్వహణను, వారి మధ్య క్రమశిక్షణను కట్టుదిట్టము చేయుటకై ఆ హక్కులు ఎంతమేరకు పరిమిత పరచబడవలెనో లేక రద్దు చేయబడవలెనో పార్లమెంటు శాసనము ద్వారా నిర్ధారణ చేయవచ్చును.]

**ఏదేని ప్రాంతములో సైనిక శాసనము అమలులో నున్నప్పుడు ఈ భాగము ద్వారా ప్రదత్తమైన హక్కులపై నిర్బంధన.**

34. ఈ భాగమునందు పూర్వగామి నిబంధనలలో ఏమియున్నప్పటికిని భారతదేశ రాజ్య క్షేత్రములోని ఏదేని ప్రాంతములో సైనిక శాసనము అమలులో నుండి యున్నచో సంఘము యొక్క, లేక ఒక రాజ్యము యొక్క సేవలోనున్న ఎవరేని వ్యక్తి అచట శాంతిని కాపాడుటకు, లేక తిరిగి నెలకొల్పుటకు

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 6వ పరిచ్ఛేదము ద్వారా 1.2.1977 నుండి చేర్చబడినది.
2. ఆదిలో ఉండిన 33వ అనుచ్ఛేదమునకు బదులు సంవిధాన (యాభైయవ సవరణ) చట్టము, 1984 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా నుండి ఉంచబడినది.

సంబంధించి చేసిన ఏదేని కార్యమును గూర్చి పార్లమెంటు శాసనము ద్వారా అతనికి క్షతిపూర్తి చేయవచ్చును, లేక అట్టి ప్రాంతములో సైనిక శాసనము క్రింద చేయబడిన ఏదేని దండనోత్తరువును, విధింపబడిన ఏదేని శిక్షను, ఉత్తరువు చేయబడిన సమపహరణను (జప్తు), లేక చేసిన ఏదేని ఇతర కార్యమును మాన్య మొనర్చవచ్చును.

35. ఈ సంవిధానమునందేమియున్నప్పటికిని– **ఈ భాగము యొక్క నిబంధనలను అమలు పరచుటకు శాసన నిర్మాణము.**

(ఎ) (i) 16వ అనుచ్ఛేదము యొక్క ఖండము (3), 32వ అనుచ్ఛేదము యొక్క ఖండము (3), 33 మరియు 34వ అనుచ్ఛేదముల క్రింద పార్లమెంటు చేయు శాసనము ద్వారా నిబంధింపబడదగిన విషయములలో దేనిని గూర్చియైనను శాసనములను చేయుటకు, మరియు

(ii) ఈ భాగము క్రింద అపరాధములుగ ప్రఖ్యానించబడిన కార్యములకు శిక్షను విహితము చేయుటకొరకైన శాసనములను చేయుటకు, పార్లమెంటు అధికారము కలిగియుండును, రాజ్య శాసన మండలి ఆ అధికారము కలిగియుండదు, మరియు పార్లమెంటు ఈ సంవిధాన ప్రారంభమునకు పిమ్మట వీలైనంత త్వరితముగా ఉప-ఖండము (ii)లో నిర్దేశించబడిన కార్యములకు శిక్షను విహితము చేయుటకు శాసనములను చేయవలెను.

(బి) ఖండము (ఎ) యొక్క ఉప-ఖండము (i)లో నిర్దేశింపబడిన ఏదేని విషయమును గూర్చినదైన, లేక ఆ ఖండము యొక్క ఉప-ఖండము (ii)లో నిర్దేశించబడిన కార్యమునకు దేనికైనను శిక్షను నిబంధించునదై, ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహితపూర్వము భారతదేశ రాజ్యక్షేత్రమునందు అమలులోనున్న ఏదేని శాసనము, అందలి నిబంధనలకును, 372వ అనుచ్ఛేదము క్రింద దానియందు చేయబడు అనుకూలానుసరణకును మరియు మార్పులకును అధ్యధీనమై, పార్లమెంటుచే మార్పు లేక రద్దు లేక సవరణ చేయబడు వరకు అమలునందు కొనసాగవలెను.

**విశదీకరణ:–** ఈ అనుచ్ఛేదమునందు ''అమలులోనున్న శాసనము'' అను పదబంధము, 372వ అనుచ్ఛేదములో ఆ పదబంధమునకు ఏ అర్థము కలదో ఆ అర్థమునే కలిగియుండును.

## భాగము – 4

## రాజ్య విధానము యొక్క ఆదేశిక సూత్రములు

36. ఈ భాగములో సందర్భము అన్యధా అపేక్షించిననే తప్ప, 'రాజ్యము' అను పదము, భాగము 3లో ఆ పదమునకు ఏ అర్థము కలదో ఆ అర్థమునే కలిగియుండును. **నిర్వచనము.**

37. ఈ భాగములోని నిబంధనలు ఏ న్యాయస్థానముచేగాని అమలు జరుపదగినవి కావు, కాని ఇందు పేర్కొనబడిన సూత్రములు దేశ పరిపాలనకు మూలాధారములగును, మరియు శాసనములను చేయుటలో వాటిని వర్తింపజేయుట రాజ్యము యొక్క కర్తవ్యమై యుండవలయును. **ఈ భాగములోగల సూత్రముల వర్తింపు.**

**రాజ్యము ప్రజల శ్రేయస్సును పెంపొందించు సాంఘిక వ్యవస్థను చేకూర్చుట.**

38. [1][(1)] జాతీయ జీవనములోని అన్ని రంగములలో సాంఘిక, ఆర్థిక మరియు రాజకీయ న్యాయమును ఉజ్జీవింపజేయు సాంఘిక వ్యవస్థను, వీలైనంతవరకు కట్టుదిట్టముగా చేకూర్చుట ద్వారాను, దానిని రక్షించుట ద్వారాను, రాజ్యము ప్రజల శ్రేయస్సును పెంపొందించుటకు పాటుపడవలెను.

[2][(2) రాజ్యము, ప్రత్యేకించి, రాబడిలో అసమానతలను తగ్గించుటకు పాటుపడవలెను, మరియు విభిన్న ప్రాంతములందు నివశించుచున్న, లేక విభిన్న వృత్తులను చేపట్టిన వ్యక్తుల మధ్యమాత్రమే కాకుండా ప్రజావర్గముల మధ్య కూడా హోదా, సౌకర్యములు మరియు అవకాశములందు అసమానతలను తొలగించుటకు ప్రయత్నించవలెను.]

**రాజ్యము అనుసరించవలసిన కొన్ని విధాన సూత్రములు.**

39. రాజ్యము ఈ క్రింది వాటిని చేకూర్చుటకై ప్రత్యేకించి తన విధానమును రూపొందించవలెను, అవేవనగా–

(ఎ) స్త్రీ, పురుష భేదము లేకుండా పౌరులు తగిన జీవనోపాధి సాధనములకు హక్కు కలిగియుండుట;

(బి) జనులందరి ఉమ్మడి మేలును అత్యుత్తమముగ సమకూర్చునట్లు సమాజపు భౌతిక వనరుల స్వామ్యమును మరియు నియంత్రణను పంపిణీచేయుట;

(సి) ఆర్థిక వ్యవస్థ యొక్క ప్రవృత్తి వలన జనసామాన్యమునకు హానికరమగునట్లుగా ఐశ్వర్యము, ఉత్పాదన సాధనములు కేంద్రీకృతము కాకుండుట;

(డి) స్త్రీ పురుషులుభయులకు సమానమైన పనికి సమానమైన వేతనము లభించుట;

(ఇ) స్త్రీ పురుష కార్మికుల ఆరోగ్యము, శరీరధారుఢ్యము మరియు పిల్లల సుకుమారత్వము దురుపయోగము చేయబడకుండుట, మరియు పౌరులు ఆర్థికావశ్యకత వలన తమ వయస్సునకు లేక శరీరధారుఢ్యమునకు సరిపడని పనులలో చేరుటకు బలవంత పెట్టబడకుండుట.

[3][(ఎఫ్) పిల్లలకు ఆరోగ్యకరమైన రీతిలో, గౌరవ ప్రదమైన మరియు స్వేచ్ఛాయుతమైన పరిస్థితులలో అభివృద్ధి చెందు అవకాశములను మరియు సౌకర్యములను కల్పించుట; మరియు బాల్య, యౌవనములను శోషణ నుండి మరియు నైతిక మరియు భౌతిక పరిత్యజనము నుండి కాపాడుట.]

---

1. సంవిధాన (నలుబది నాల్గవ సవరణ) చట్టము, 1978 యొక్క 9వ పరిచ్ఛేదము ద్వారా ఆదిలోవున్న సంవిధానపు 38వ అనుచ్ఛేదమును ఖండము (1)గా తిరిగి అంకె వేయబడినది. (20.6.1979 నుండి అమలులోనికి వచ్చినది).
2. అదే చట్టపు 9వ పరిచ్ఛేదము ద్వారా 20.6.1979వ తేదీ నుండి చొప్పించబడినది.
3. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా ఖండము (ఎఫ్)కు బదులుగా ఇది ఉంచబడినది. (3.1.1977 నుండి అమలులోనికి వచ్చినది).

[1][39ఏ.శాసన వ్యవస్థ ప్రవృత్తి సమానావకాశ ప్రాతిపదికపై న్యాయమును చేకూర్చు రీతిలో నిర్వహించబడునట్లు రాజ్యము కట్టుదిట్టము చేయవలెను; మరియు ప్రత్యేకముగ, ఏ పౌరునకైనను ఆర్థిక లేక ఇతర అశక్తతల కారణమున న్యాయమును పొందు అవకాశములు అలభ్యము కాకుండునట్లు కట్టుదిట్టము చేయుటకై తగిన శాసన నిర్మాణమును, లేక పథకముల ద్వారా గాని, ఏదేని ఇతర విధముగా గాని ఉచిత న్యాయవాద సహాయమును సమకూర్చవలెను.]

**సమాన న్యాయము, ఉచిత న్యాయవాద సహాయము.**

40. గ్రామ పంచాయితీలను వ్యవస్థీకరించి స్వపరిపాలనా యూనిట్లుగా అవి పనిచేయుటకు వాటికి అవశ్యకమగు అధికార ప్రాధికారముల నొసగుటకు రాజ్యము చర్యలను గైకొనవలెను.

**గ్రామ పంచాయతీల వ్యవస్థీకరణ.**

41. రాజ్యము, దాని ఆర్థికస్థోమత మరియు అభివృద్ధి పరిమితుల మేరకు పనిచేయు హక్కును, విద్యనేర్చుకొను హక్కును మరియు నిరుద్యోగము, వృద్ధాప్యము, అనారోగ్యము, అంగవైకల్యము మరియు ఇతర విధములైన అకారణ దారిద్ర్యము కలిగిన సందర్భములో ప్రజా సహాయమును పొందు హక్కును చేకూర్చుటకై కట్టుదిట్టమైన ఏర్పాటు చేయవలెను.

**పనికి, విద్యకు కొన్ని సందర్భములలో ప్రజా సహాయమునకు హక్కు.**

42. రాజ్యము, పనిచేయు విషయమున న్యాయమైన మరియు మానవోచితమైన పరిస్థితులను, ప్రసూతి సహాయమును, చేకూర్చుటకు ఏర్పాటు చేయవలెను.

**పని విషయమున న్యాయమైన మరియు మానవోచితమైన పరిస్థితులకు మరియు ప్రసూతి సహాయమునకు ఏర్పాటు.**

43. రాజ్యము, తగిన శాసన నిర్మాణము ద్వారా లేక ఆర్థిక వ్యవస్థాపన ద్వారా లేక మరేవిధముగానైన, వ్యవసాయ, పారిశ్రామిక లేక ఇతర కార్మికులందరికి పనిని, జీవనభృతిని, మరియు సముచిత జీవనస్థాయిని విశ్రాంతి మరియు సాంఘిక, సాంస్కృతిక అవకాశముల పూర్తి వినియోగమును చేకూర్చునట్టి పని పరిస్థితులను, కల్పించుటకు ప్రయత్నించవలెను, మరియు ప్రత్యేకించి, గ్రామీణ ప్రాంతములలో వైయక్తిక ప్రాతిపదికపై లేక సహకార ప్రాతిపదికపై కుటీర పరిశ్రమలను పెంపొందింపచేయుటకు ప్రయత్నించవలెను.

**కార్మికులకు జీవనభృతి మొదలగునవి.**

[2][43ఏ.రాజ్యము తగిన శాసన నిర్మాణము ద్వారా లేక ఏదేని ఇతర విధముగా ఏదేని పరిశ్రమలో నిమగ్నమైన సంస్థల వ్యవసాపన లేక ఇతర వ్యవస్థల నిర్వహణలో కార్మికులు పాల్గొనునట్లు చర్యలు తీసికొనవలెను.]

**పరిశ్రమల నిర్వహణలో కార్మికులు పాల్గొనుట.**

[1][43బీ.రాజ్యము, సహకార సంఘములు స్వచ్ఛందముగా రూపొందించుటకు, స్వాయత్తముగా కృత్యములు నిర్వహించుటకు, ప్రజాస్వామ్య నియంత్రణ మరియు వృత్తిపరమై యాజమాన్యమును ప్రోత్సహించుటకు ప్రయత్నించవలెను.]

**సహకార సంఘముల ప్రవర్ధనము (ప్రోత్సాహము).**

**పౌరులందరకు ఏక రూపమైన సివిలు స్మృతి.**

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 8వ పరిచ్ఛేదము ద్వారా 3.1.1977 నుండి చొప్పించబడినది.
2. సంవిధాన (నలుబది ఏడవ సవరణ) చట్టము, 1976 యొక్క 9వ పరిచ్ఛేదము ద్వారా 15.2.2012 నుండి ఉంచబడినది.

44. భారతదేశ రాజ్య క్షేత్రమునందంతటను పౌరులకు ఏక రూపమైన సివిల స్మృతిని చేకూర్చుటకు రాజ్యము ప్రయత్నించవలెను.

[2][45. బాలలందరు వారు ఆరు సంవత్సరముల వయస్సు పూర్తి చేయునంత వరకు వారికి బాల్యప్రారంభములో సంరక్షణ మరియు విద్యను ఏర్పాటు చేయుటకు రాజ్యము ప్రయత్నించవలెను.]

**ఆరు సంవత్సరముల లోపు బాలలందరికి బాల్య ప్రారంభములో సంరక్షణ మరియు విద్యను ఏర్పాటు చేయుట.**

46. ప్రజలలో బలహీన వర్గముల, ప్రత్యేకించి అనుసూచిత కులముల మరియు అనుసూచిత జనజాతుల విద్యావిషయక మరియు ఆర్థిక హితమును రాజ్యము విశేష శ్రద్ధతో పెంపొందించవలెను, మరియు సాంఘిక అన్యాయము నుండియు సకల విధములగు శోషణలనుండియు వారిని రక్షించవలెను.

**అనుసూచిత కులముల, అనుసూచిత జనజాతుల మరియు ఇతర బలహీన వర్గముల యొక్క విద్యావిషయక మరియు ఆర్థిక హితములను పెంపొందించుట.**

47. రాజ్యము, ప్రజల ఆహారపుష్టి యొక్క స్థాయిని, జీవనస్థాయిని పెంచుట మరియు ప్రజారోగ్యమును మెరుగుపరచుట, తన ప్రాథమిక కర్తవ్యములలోనివిగా పరిగణించవలెను మరియు ప్రత్యేకించి, వైద్య ప్రయోజనములకై తప్ప, మద్యపానీయములను మరియు ఆరోగ్యమునకు భంగము కలిగించు ఔషధములను, సేవించుటను నిషేధించటకు రాజ్యము ప్రయత్నించవలెను.

**ఆహారపుష్టి స్థాయిని, జీవన స్థాయిని, పెంచుటలో మరియు ప్రజారోగ్యమును మెరుగుపరచుటలో రాజ్యము యొక్క కర్తవ్యము.**

48. రాజ్యము, ఆధునిక మరియు శాస్త్రీయ పద్ధతులననుసరించి వ్యవసాయమును, పశు సంవర్ధనమును, వ్యవస్థీకరించవలెను, మరియు ప్రత్యేకించి, ఆవుల, దూడల, ఇతర పాడిపశువుల, భారవాహక పశువుల జాతులను పరిరక్షించి మెరుగుపరచుటకును, వాటి వధను నిషేధించుటకును, రాజ్యము చర్యలను గైకొనవలెను.

**వ్యవసాయ మరియు పశు సంవర్ధనము యొక్క వ్యవస్థీకరణ.**

[1][48ఏ. రాజ్యము పరిసరములను కాపాడి అభివృద్ధి చేయుటకును, దేశములోని అడవులను వన్యప్రాణులను సంరక్షించుటకును ప్రయత్నించవలెను.]

**పరిసరముల రక్షణ మరియు అభివృద్ధి మరియు అడవుల వన్య ప్రాణుల సంరక్షణ.**

---

1. సంవిధాన (తొంబది ఏడవ సవరణ) చట్టము, 2011 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 15.02.2012 నుండి చొప్పించబడినది.
2. సంవిధాన (ఎనుబది ఆరవ సవరణ) చట్టము, 2002 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 01.04.2010 నుండి ఉంచబడినది పాత అనుచ్ఛేదము 45, ఈ క్రింది విధముగా ఉండెను.

   ''45 పిల్లలకు నిశ్శుల్క మరియు నిర్బంధవిద్యకై ఏర్పాటు.– ఈ సంవిధాన ప్రారంభము నుండి పది సంవత్సరముల గడువు లోపల పిల్లలందరకు పదానుల్గు సంవత్సరముల వయస్సు పూర్తి అగు వరకు నిశ్శుల్క, నిర్బంధ విద్యను ఏర్పాటు చేయుటకు రాజ్యము ప్రయత్నించవలెను.''.

49. [2] [పార్లమెంటుచే చేయబడిన శాసనము ద్వారాగాని లేదా దాని క్రిందగాని] జాతీయ ప్రాముఖ్యముగలవని ప్రఖ్యానించబడిన కళాత్మక, లేక ఐతిహాసిక ప్రయోజనముగల ప్రతి యొక్క స్మారక చిహ్నమును, లేక స్థలమును, లేక వస్తువును సందర్భానుసారముగా కొల్లగొట్టుట విరూపనము, వినాశనము, తొలగింపు, వ్యయనము, లేక ఎగుమతి చేయుట నుండి రక్షించుట రాజ్యము యొక్క బాధ్యతయైయుండును.

**జాతీయ ప్రాముఖ్యముగల స్మారక చిహ్నములను రక్షించుట.**

50. రాజ్యము యొక్క పబ్లికు సేవలలో న్యాయపాలికను కార్యపాలక వర్గము నుండి వేరుపరుచుటకు రాజ్యము చర్యలను గైకొనవలెను.

**న్యాయపాలికను కార్యపాలక వర్గము నుండి వేరువరచుట.**

51. రాజ్యము ఈ క్రింది వాటికై ప్రయత్నించవలెను–

**అంతర్జాతీయ శాంతి భద్రతలను పెంపొందించుట.**

(ఎ) అంతర్జాతీయ శాంతిభద్రతలను పెంపొందించుట;

(బి) జాతుల (దేశముల) మధ్య న్యాయమైన మరియు గౌరవప్రదమైన సంబంధములను నెలకొల్పుట;

(సి) సువ్యవస్థిత ప్రజానీకముల పరస్పర వ్యవహారములందు అంతర్జాతీయ శాసనముపట్ల, సంధి బాధ్యతలపట్ల, గౌరవమును పెంపొందించుట; మరియు

(డి) అంతర్జాతీయ వివాదముల పరిష్కారము మధ్యవర్తిత్వము ద్వారా జరుగుటను ప్రోత్సహించుట.

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 10వ పరిచ్ఛేదము ద్వారా 03.01.1977 నుండి చొప్పించబడినది.

2. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 27వ పరిచ్ఛేదము ద్వారా ''పార్లమెంటుచే శాసనము ద్వారా ప్రఖ్యానించబడిన'' అనుదానికి బదులుగా ఉంచబడినది.

# [1]భాగము – 4ఏ

## మౌలిక కర్తవ్యములు

51ఏ. ప్రతి భారత పౌరునికి,– మౌలిక కర్తవ్యములు.

(ఎ) సంవిధానమునకు కట్టుబడియుండుట మరియు దాని ఆదర్శములను, సంస్థలను, జాతీయ పతాకమును, జాతీయ గీతమును గౌరవించుట;

(బి) జాతీయ స్వాతంత్ర్యపోరాటమునకు స్ఫూర్తినిచ్చిన ఉన్నతాదర్శములను జ్ఞప్తియందుంచుకొని వాటిని పాటించుట;

(సి) భారతదేశ సార్వభౌమతను, ఐక్యతను, మరియు అఖండతను సమర్థించి కాపాడుట;

(డి) దేశమును రక్షించుట మరియు కోరినప్పుడు జాతీయ సేవచేయుట;

(ఇ) భారత ప్రజలందరి మధ్య, మత, భాష మరియు ప్రాంతము లేక వర్గ వైవిధ్యముల నధిగమించి సామరస్యమును, సోదర భావమును పెంపొందించుట; మరియు స్త్రీల గౌరవమును న్యూనపరచు ఆచారములను విడనాడుట;

(ఎఫ్) మన సమ్మిశ్ర సంస్కృతి యొక్క సుసంపన్న సంప్రదాయమును గౌరవించి పరిరక్షించుట;

(జి) అడవులు, సరస్సులు, నదులు, మరియు వన్యప్రాణులతో సహా ప్రకృతి సిద్ధమైన పరిసరములను కాపాడి అభివృద్ధి చేయుట, మరియు ప్రాణికోటిపట్ల కరుణను కలిగియుండుట;

(హెచ్) వైజ్ఞానిక దృక్పథమును, మానవతావాదమును, జిజ్ఞాసను మరియు సంస్కరణాసక్తిని పెంపొందించుకొనుట;

(ఐ) పబ్లికు ఆస్తిని సంరక్షించుట మరియు హింసను విడనాడుట;

(జె) జాతి (దేశ ప్రజల) కృషి మరియు సాధనల ఉన్నత స్థాయిలను నిరంతరము అందుకొనునట్లుగా వ్యష్ఠి మరియు సమష్ఠి కార్యరంగములన్నింటిలో శ్రేష్టతకై పాటుపడుట;

[2][(కె) తల్లి, తండ్రి లేక సంరక్షుడు ఆరు మరియు పదునాలుగు సంవత్సరముల మధ్య వయస్సు కలిగిన తన పిల్లలకు లేక పోషితునికి విద్యావకాశములను కలుగజేయుట కర్తవ్యమై యుండవలెను.]

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 11వ పరిచ్ఛేదము ద్వారా భాగము 4–ఏ, 03.01.1977 నుండి చేర్చబడినది.
2. సంవిధాన (ఎనుబది ఆరవ సవరణ) చట్టము, 2002 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 01.04.2010 నుండి చొప్పించబడినది. (ప్రస్తుతం అమలులో లేదు, అమలు తేదీ తరువాత సూచించబడును).

# భాగము – 5

# సంఘము

## అధ్యాయము–1 – కార్యపాలక వర్గము

### రాష్ట్రపతి మరియు ఉపరాష్ట్రపతి

52. భారతదేశమునకు ఒక రాష్ట్రపతి ఉండవలెను. **భారత రాష్ట్రపతి.**

53. (1) సంఘము యొక్క కార్యపాలకాధికారము రాష్ట్రపతి యందు నిహితమైయుండవలెను; ఆయన దానిని స్వయముగా లేక తనకు అధీనస్థులగు అధికారుల ద్వారా ఈ సంవిధానముననుసరించి వినియోగించవలెను. **సంఘము యొక్క కార్యపాలకాధికారము.**

(2) పూర్వగామి నిబంధన యొక్క సాధారణతకు భంగము కలుగకుండ, సంఘము యొక్క రక్షణ బలములపై సర్వాధిపత్యము రాష్ట్రపతి యందు నిహితమైయుండవలెను మరియు దాని వినియోగము శాసనము ద్వారా క్రమబద్ధము చేయబడవలెను.

(3) ఈ అనుచ్ఛేదములోనిదేదియు–

(ఎ) అస్తిత్వములోనున్న ఏదేని శాసనము ద్వారా ఏదేని రాజ్య ప్రభుత్వమునకుగాని, ఇతర ప్రాధికారికిగాని, ప్రదత్తము చేయబడిన ఏవేని కృత్యములను రాష్ట్రపతికి అంతరణ చేయునదిగా భావింపబడరాదు, లేక

(బి) రాష్ట్రపతి మినహా ఇతర ప్రాధికారులకు శాసనము ద్వారా కృత్యములను ప్రదత్తము చేయుట నుండి పార్లమెంటును నివారించదు.

54. రాష్ట్రపతి ఈ క్రింది వారితో కూడిన నిర్వాచక గణము యొక్క సభ్యులచే ఎన్నుకొనబడవలెను– **రాష్ట్రపతి ఎన్నిక.**

(ఎ) పార్లమెంటు ఉభయ సదనములలోని ఎన్నుకొనబడిన సభ్యులు, మరియు

(బి) రాజ్య శాసనసభలలోని ఎన్నుకొనబడిన సభ్యులు.

[1][**విశదీకరణ:–** ఈ అనుచ్ఛేదము మరియు అనుచ్ఛేదము 55లోని ''రాజ్యము'' అను పదములో ఢిల్లీ జాతీయ రాజధాని రాజ్య క్షేత్రము మరియు పాండిచ్చేరి సంఘ రాజ్యక్షేత్రము చేరియుండును.]

55. (1) రాష్ట్రపతి యొక్క ఎన్నికలో వివిధ రాజ్యముల ప్రాతినిధ్య ప్రమాణము, ఆచరణీయమైనంత మేరకు, ఏకరూపముగా నుండవలెను. **రాష్ట్రపతిని ఎన్నుకొనురీతి.**

(2) రాజ్యముల మధ్య అట్టి ఏకరూపతను చేకూర్చుటకుగాను మరియు మొత్తము రాజ్యములకును సంఘమునకును మధ్య సమత్వమును చేకూర్చుటకుగాను, అట్టి ఎన్నికలలో

---

1. సంవిధాన (డెబ్బయ్యవ సవరణ) చట్టము, 1992 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా (01.06.1995 నుండి) చొప్పించబడినది.

*ఇప్పటి పుదుచ్చేరి పాండిచ్చేరి (పేరు మార్పిడి) 2006 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా (01.10.2006 నుండి) ఉంచబడినది.

పార్లమెంటులోని మరియు ప్రతి రాజ్య శాసన సభలోని ఎన్నుకొనబడిన ప్రతి సభ్యుడు ఇచ్చుటకు హక్కు కలిగియున్న ఓట్ల సంఖ్యను ఈ క్రింది రీతిగా నిర్ధారణ చేయవలెను.

(ఎ) రాజ్యము యొక్క జనసంఖ్యను ఆ రాజ్య శాసనసభలోని ఎన్నుకొనబడిన మొత్తము సభ్యుల సంఖ్యతో భాగించగా వచ్చు లబ్దములో వేయి యొక్క గుణిజములు ఎన్నియుండునో అన్ని ఓట్లను రాజ్య శాసనసభకు ఎన్నుకొనబడిన ప్రతి సభ్యుడు కలిగియుండవలెను.

(బి) వేయి యొక్క సదరు గుణిజములను లెక్కించిన పిమ్మట శేషము అయిదు వందలకు తగ్గనిచో ఉప-ఖండము (ఎ)లో నిర్దేశింపబడిన ప్రతి సభ్యునకుగల ఓట్ల సంఖ్యకు అదనముగా ఒక ఓటును చేర్చవలెను.

(సి) ఉప-ఖండములు (ఎ) మరియు (బి)ల క్రింద రాజ్య శాసనసభలోని సభ్యులకు నియతమైన ఓట్ల మొత్తపు సంఖ్యను పార్లమెంటు ఉభయ సదనములలో ఎన్నుకోనబడిన సభ్యుల మొత్తము సంఖ్యతో భాగించగా ఏ సంఖ్య వచ్చునో అన్ని ఓట్లను పార్లమెంటు ఉభయ సదనములలోని ఎన్నుకోబడిన ప్రతి సభ్యుడు కలిగియుండవలెను, సగమునకు మించిన భిన్నమును ఒకటిగా పరిగణించవలెను. ఇతర భిన్నములను ఉపేక్షించవలెను.

(3) రాష్ట్రపతి ఎన్నిక ఏకల అంతరణీయ ఓటు ద్వారా అనుపాతిక ప్రాతినిధ్య పద్ధతిననుసరించి జరుగవలెను మరియు అట్టి ఎన్నికలో పోలింగు రహస్యపు బ్యాలెటు పద్దతిలో జరుగవలెను.

[1][**విశదీకరణ:-** ఈ అనుచ్ఛేదములో ''జనసంఖ్య'' అను పదబంధమునకు కట్టకడపటిదియు అందుకు సంబంధించిన అంకెలు ప్రచురించబడినదియు అగు జనగణనతో అభినిశ్చితమైన జనసంఖ్య అని అర్థము:

అయితే, ఈ విశదీకరణలో కట్టకడపటిదియు అందుకు సంబందించిన అంకెలు ప్రచురించబడినట్టిదియు అగు జనగణనకు గల నిర్దేశమును, [2][2026వ] సంవత్సరము పిమ్మట చేయబడు మొదటి జనగణనకు సంబంధించిన అంకెలు ప్రచురించబడు వరకు 1971వ సంవత్సరపు జనగణనకు నిర్దేశమైనట్లు అన్వయించుకొనవలెను.]

**రాష్ట్రపతి పదావధి.**

56. (1) రాష్ట్రపతి తన పదవిలో ప్రవేశించిన తేదీ నుండి అయిదు సంవత్సరముల కాలావధి వరకు పదవి యందుండవలెను.

అయితే-

(ఎ) రాష్ట్రపతి తన చేవ్రాలుతో ఉపరాష్ట్రపతికి లేఖ వ్రాయుట ద్వారా తన పదవికి రాజీనామా ఇవ్వవచ్చును.

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 12వ పరిచ్ఛేదము ద్వారా 3.1.1977 నుండి పాత విశదీకరణ బదులుగా ఉంచబడినది.
2. సంవిధాన (ఎనుబది నాలుగవ సవరణ) చట్టము, 2001 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ''2000'' అను పదమునకు బదులుగా 21.2.2002 నుండి ఉంచబడినది.

(బి) రాష్ట్రపతిని సంవిధానాతిక్రమణము కావించినందుకు 61వ అనుచ్ఛేదములో నిబంధించబడిన రీతిగా మహాభియోగము ద్వారా పదవి నుండి తొలగించవచ్చును.

(సి) రాష్ట్రపతి తన పదావధి ముగిసినప్పటికిని, తన ఉత్తరాధికారి ఆ పదవిలో ప్రవేశించు వరకు పదవిలో కొనసాగవలెను.

(2) ఖండము (1) యొక్క వినాయింపులోని ఖండము (ఎ) క్రింద ఉపరాష్ట్రపతికి పంపబడిన రాజీనామా పత్రమును ఆయన లోక్‌సభ అధ్యక్షునికి తక్షణమే పంపవలెను.

**తిరిగి ఎన్నికకు పాత్రత.**

57. రాష్ట్రపతి పదవియందున్న లేక ఆ పదవి యందుండిన ఏ వ్యక్తియైనను, ఈ సంవిధానములోని ఇతర నిబంధనలకు అధ్యధీనమై ఆ పదవికి తిరిగి ఎన్నుకొనబడుటకు పాత్రుడై యుండును.

**రాష్ట్రపతిగా ఎన్నికకు అర్హతలు.**

58. (1) ఏ వ్యక్తి గాని –

(ఎ) ఆయన భారతదేశ పౌరుడై యున్ననే తప్ప.

(బి) ఆయనకు ముప్పదియైదు సంవత్సరముల వయస్సు పూర్తియైననే తప్ప, మరియు

(సి) ఆయన లోక్‌సభ సభ్యుడుగా ఎన్నుకొనబడుటకు అర్హుడైయున్ననే తప్ప, రాష్ట్రపతిగా ఎన్నుకబడుటకు పాత్రుడుకాడు.

(2) ఏ వ్యక్తియైనను భారత ప్రభుత్వము క్రింద లేక ఏదేని రాజ్య ప్రభుత్వము క్రింద లేక సదరు ప్రభుత్వములో దేని యొక్క నియంత్రణకైనను అధ్యధీనమై యున్న ఏదేని స్థానిక లేక ఇతర ప్రాధికారి క్రిందగాని, లాభాయుతమైన ఏదేని పదవియందున్నచో ఆ వ్యక్తి, రాష్ట్రపతిగా ఎన్నుకొనబడుటకు పాత్రుడు కాడు.

**విశదీకరణ:–** ఈ అనుచ్ఛేదపు నిమిత్తము ఎవరేని వ్యక్తి సంఘము యొక్క రాష్ట్రపతిగా, లేక ఉపరాష్ట్రపతిగా, లేక ఏదేని రాజ్యము యొక్క గవర్నరు [1][.............]గా, లేక సంఘము యొక్క, లేక ఏదేని రాజ్యము యొక్క మంత్రిగానున్న కారణమునుబట్టి మాత్రమే లాభయుతమైన పదవియందున్నట్లు భావించబడరాదు.

**రాష్ట్రపతి పదవీ షరతులు.**

59. (1) రాష్ట్రపతి, పార్లమెంటు యొక్క, లేక ఏదేని రాజ్య శాసనమండలి యొక్క ఏ సదనములోగాని సభ్యుడుగా ఉండరాదు, మరియు పార్లమెంటు యొక్క, లేక ఏదేని రాజ్య శాసనమండలి యొక్క ఏ సదనములోని సభ్యుడైనను రాష్ట్రపతిగా ఎన్నుకొనబడినచో, ఆయన రాష్ట్రపతి పదవిలో ప్రవేశించిన తేదీ నుండి ఆ సదనములోని తన స్థానమును ఖాళీ చేసినట్లు భావించవలెను.

(2) రాష్ట్రపతి లాభాయుతమైన ఏదేని ఇతర పదవియందు ఉండరాదు.

(3) రాష్ట్రపతి, అద్దె చెల్లించకుండ తన అధికారిక నివాస గృహములను ఉపయోగించుకొనుటకు హక్కు కలిగియుండును మరియు పార్లమెంటు శాసనము ద్వారా నిర్ధారణచేయు ఉపలబ్దులకు, బత్తెములకు, మరియు విశేషాధికారములకు, మరియు తద్విషయమున అట్లు నిబంధన

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా, ''లేక రాజప్రముఖ్‌గా లేక ఉప రాజప్రముఖ్‌గా'' అను పదములుర వదిలివేయబడినవి.

చేయబడువరకు, రెండవ అనుసూచిలో నిర్దిష్టపరచబడిన ఉపలబ్దులకు, బత్తెములకు, మరియు విశేషాధికారములకు ఆయన హక్కు కలిగియుండును.

(4) రాష్ట్రపతి యొక్క ఉపలబ్దులు మరియు బత్తెములు ఆయన పదావధిలో తగ్గించబడరాదు.

**రాష్ట్రపతిచే ప్రమాణము లేక ప్రతిజ్ఞ.**

60. ప్రతి రాష్ట్రపతి మరియు రాష్ట్రపతిగా వ్యవహరించు లేక రాష్ట్రపతి కృత్యములను నిర్వహించు ప్రతి వ్యక్తి, తన పదవిలో ప్రవేశించుటకు పూర్వము భారతదేశ ముఖ్య న్యాయమూర్తి సమక్షమున లేక ఆయన హాజరు లేనపుడు సర్వోన్నత న్యాయస్థాన న్యాయాధీశులలో అందుబాటులోనున్న వారిలో అందరికంటె సీనియరు న్యాయధీశుని సమక్షమునగాని ఈ క్రింది ప్రరూపములో ప్రమాణము లేక ప్రతిజ్ఞ చేసి దానిపై చేవ్రాలు చేయవలెను.

‘‘ఏ.బి. అను నేను భారతదేశ రాష్ట్రపతి పదవిని శ్రద్ధాపూర్వకముగ నిర్వహింతుననియు (లేక రాష్ట్రపతి యొక్క కృత్యములను శ్రద్ధా పూర్వకముగ నిర్వహింతుననియు) నా సంపూర్ణ సామర్థ్యము మేరకు సంవిధానమును మరియు శాసనమును పరిరక్షించి, సంరక్షించి, రక్షింతుననియు, భారతదేశ ప్రజల సేవయందును, వారి క్షేమమునందును నిరతుడనయ్యెదననియు దైవసాక్షిగా ప్రమాణము చేయుచున్నాను/ సత్యనిష్ఠతో ప్రతిజ్ఞ చేయుచున్నాను.’’.

**రాష్ట్రపతిపై మహాభియోగము తెచ్చుటకు ప్రక్రియ.**

61. (1) సంవిధానాతిక్రమణము కావించినాడని రాష్ట్రపతిపై మహాభియోగము జరుపబడ–వలసినప్పుడు పార్లమెంటు యొక్క ఏ సదనముచేనైనను ఆరోపణ చేయబడవలెను.

(2) అట్టి ఆరోపణ ఏదియు–

(ఎ) అట్టి ఆరోపణచేయు ప్రతిపాదనగల తీర్మానమును ప్రస్తావించవలెనను ఉద్దేశము తమకు గలదని ఆ సదనము యొక్క మొత్తము సభ్యుల సంఖ్యలో నాల్గవ వంతుకు తక్కువ కాని మంది చేవ్రాలు చేసి వ్రాత పూర్వకముగ నోటీసు ఇచ్చిన పిమ్మట కనీసము పదునాలుగు దినములు గడిచిన తరువాత ప్రస్తావించిననే తప్ప, మరియు

(బి) అట్టి తీర్మానము ఆ సదనము యొక్క మొత్తము సభ్యుల సంఖ్యలో మూడింట రెండు వంతులకు తక్కువకాని అధిక సంఖ్యాకులచే పాస్ చేయబడిననే తప్ప, చేయబడరాదు.

(3) పార్లమెంటు యొక్క ఏ సదనమైనను అట్లు ఆరోపణ చేసినప్పుడు, రెండవ సదనము ఆ ఆరోపణను దర్యాప్తు చేయవలెను లేక దర్యాప్తు చేయించవలెను మరియు అట్టి దర్యాప్తు జరుగునప్పుడు హాజరగుటకును, ప్రతినిధిని పంపుటకును రాష్ట్రపతికి హక్కు ఉండును.

(4) దర్యాప్తు ఫలితముగ, రాష్ట్రపతిపై చేయబడిన ఆరోపణ స్థిరపడినదని ప్రఖ్యానించు తీర్మానము, ఆ ఆరోపణను దర్యాప్తు చేసిన లేక చేయించిన, సదనము యొక్క సభ్యుల మొత్తము సంఖ్యలో మూడింట రెండు వంతులకు తక్కువకాని అధిక సంఖ్యాకులచే ఆమోదించబడినచో, అట్లు ఆమోదించబడిన తేదీ నుండి ఆ తీర్మానము రాష్ట్రపతిని పదవి నుండి తొలగించు ప్రభావము కలిగియుండును.

**రాష్ట్రపతి పదవి ఖాళీ అయినప్పుడు దానిని పూరించుటకు ఎన్నిక జరువ వలసిన కాలము మరియు ఆకస్మికముగా ఏర్పడిన ఖాళీని పూరించుటకు ఎన్నుకొనబడు వ్యక్తి యొక్క పదావధి.**

62. (1) రాష్ట్రపతి యొక్క పదావధి ముగియుటచే ఏర్పడు ఖాళీని పూరించుటకు జరుగవలసిన ఎన్నిక, ఆ పదావధి ముగియుటకు పూర్వమే పూర్తి చేయబడవలెను.

(2) మరణము, రాజీనామా లేక తొలగింపు కారణముగా లేక అన్యథా రాష్ట్రపతి పదవియందు ఏర్పడిన ఖాళీని పూరించుటకు జరుగవలసిన ఎన్నిక, ఆ ఖాళీ ఏర్పడిన తరువాత సాధ్యమైనంత త్వరితముగను ఎట్టి సందర్భములోను, ఖాళీ ఏర్పడిన తేదీ నుండి ఆరు మాసములు దాటకుండగను జరుపబడవలెను మరియు ఆ ఖాళీని పూరించుటకు ఎన్నుకొనబడిన వ్యక్తి 56వ అనుచ్ఛేదము యొక్క నిబంధనలకు అధ్యధీనమై, తాను పదవిలో ప్రవేశించిన తేదీ నుండి అయిదు సంవత్సరముల సంపూర్ణ కాలావధి వరకు పదవియందుండుటకు హక్కు కలిగియుండును.

**భారత ఉపరాష్ట్రపతి.**

63. భారతదేశమునకు ఒక ఉపరాష్ట్రపతి ఉండవలెను.

**ఉపరాష్ట్రపతి పదవిరీత్యా రాజ్యసభకు సభాపతిగా నుండుట.**

64. ఉపరాష్ట్రపతి, పదవిరీత్యా రాజ్యసభకు సభాపతియై యుండును. ఆయన లాభాయుతమైన ఏ ఇతర పదవియందును ఉండరాదు:

అయితే ఉపరాష్ట్రపతి 65వ అనుచ్ఛేదము క్రింద రాష్ట్రపతిగా వ్యవహరించు, లేక రాష్ట్రపతి యొక్క కృత్యములను నిర్వహించు ఏ కాలావధిలోనైనను ఆయన రాజ్యసభ యొక్క సభాపతి పదవికి చెందిన కర్తవ్యములను నిర్వర్తించరాదు, మరియు 97వ అనుచ్ఛేదము క్రింద రాజ్యసభ యొక్క సభాపతికి చెల్లించబడదగు ఎట్టి జీతమునకు లేక బత్తెమునకు ఆయన హక్కు కలిగియుండడు.

**రాష్ట్రపతి పదవిలో ఆకస్మిక ఖాళీ ఏర్పడినప్పుడు, రాష్ట్రపతి హాజరు లేనప్పుడును ఉపరాష్ట్రపతి రాష్ట్రపతిగా వ్యవహరించుట, లేక ఆయన కృత్యములను నిర్వహించుట.**

65. (1) మరణము, రాజీనామా లేక తొలగింపు కారణముగా లేక అన్యథా రాష్ట్రపతి పదవిలో ఖాళీ ఏర్పడినప్పుడు అట్టి ఖాళీని పూరించుటకు ఈ అధ్యాయము యొక్క నిబంధనలననుసరించి ఎన్నుకొనబడిన క్రొత్త రాష్ట్రపతి తన పదవిలో ప్రవేశించు తేదీ వరకు, ఉపరాష్ట్రపతి రాష్ట్రపతిగా వ్యవహరించవలెను.

(2) రాష్ట్రపతి, హాజరులో లేకుండుట, అస్వస్థత లేక మరే దేని కారణము వలన తన కృత్యములను నిర్వహించజాలని యెడల, ఆయన తన కర్తవ్యములను తిరిగి చేపట్టు తేదీ వరకు ఉపరాష్ట్రపతి రాష్ట్రపతి కృత్యములను నిర్వహించవలెను.

(3) ఉపరాష్ట్రపతి, అట్లు రాష్ట్రపతిగా వ్యవహరించు, లేక రాష్ట్రపతి యొక్క కృత్యములను నిర్వహించు కాలావధిలోను, ఆ కాలావధికి సంబంధించియు రాష్ట్రపతికిగల సర్వాధికారములను ఉన్ముక్తతాధికారములను కలిగియుండును, పార్లమెంటు శాసనము ద్వారా నిర్ధారణచేయు ఉపలబ్ధులకు బత్తెములకు మరియు విశేషాధి కారములకు మరియు అట్లు నిబంధన చేయబడు వరకు రెండవ అనుసూచిలో నిర్దిష్టపరచబడిన ఉపలబ్ధులకు, బత్తెములకు మరియు విశేషాధికారములకు ఆయన హక్కు కలిగియుండును.

66. (1) ఉపరాష్ట్రపతి [1][పార్లమెంటు ఉభయసదనముల సభ్యులతో కూడిన నిర్వాచక గణము యొక్క సభ్యులచే] ఏకల అంతరణీయ ఓటు ద్వారా అనుపాతిక ప్రాతినిధ్య పద్ధతిననుసరించి ఎన్నుకొనబడవలెను, మరియు అట్టి ఎన్నికలలో ఓటింగు రహస్యపు బ్యాలెటు పద్ధతిని జరుగవలెను. **ఉపరాష్ట్రపతి ఎన్నిక.**

(2) ఉపరాష్ట్రపతి పార్లమెంటు యొక్క లేక ఏదేని రాజ్య శాసనమండలి యొక్క ఏ సదనములోగాని సభ్యుడుగా ఉండరాదు మరియు పార్లమెంటు యొక్క, లేక ఏదేని రాజ్య శాసనమండలి యొక్క ఏ సదనములోని సభ్యుడైనను ఉపరాష్ట్రపతిగా ఎన్నుకోబడినచో, ఆయన ఉపరాష్ట్రపతి పదవిలో ప్రవేశించిన తేదీ నుండి ఆ సదనములోని తన స్థానమును ఖాళీ చేసినట్లు భావించబడవలెను.

(3) ఏ వ్యక్తిగాని –

(ఎ) ఆయన భారతదేశ పౌరుడైయున్ననే తప్ప,

(బి) ఆయనకు ముప్పదియైదు సంవత్సరముల వయస్సు పూర్తి అయిననే తప్ప, మరియు,

(సి) ఆయన రాజ్యసభ సభ్యుడుగా ఎన్నుకొనబడుటకు అర్హుడై యున్ననే తప్ప, ఉపరాష్ట్రపతిగా ఎన్నుకొనబడుటకు పాత్రుడు కాడు.

(4) ఏ వ్యక్తియైనను, భారత ప్రభుత్వము క్రిందగాని, ఏదేని రాజ్య ప్రభుత్వము క్రిందగాని, సదరు ప్రభుత్వములలో దేని యొక్క నియంత్రణకైనను అధ్యధీనమైయున్న ఏదేని స్థానిక లేక ఇతర ప్రాధికారి క్రిందగాని, లాభాయుతమైన ఏదేని పదవియందున్నచో, ఆ వ్యక్తి ఉపరాష్ట్రపతిగా ఎన్నుకొనబడుటకు పాత్రుడుకాడు.

**విశదీకరణ:–** ఈ అనుచ్ఛేదపు నిమిత్తము, ఎవరేని వ్యక్తి సంఘము యొక్క రాష్ట్రపతిగా, లేక ఉపరాష్ట్రపతిగా, లేక ఏదేని రాజ్యము యొక్క గవర్నరుగా, [2][............] లేక సంఘము యొక్క, లేక ఏదేని రాజ్యము యొక్క మంత్రిగా ఉన్న కారణములనుబట్టి మాత్రమే లాభయుతమైన పదవి యందున్నట్లు భావించరాదు.

67. ఉపరాష్ట్రపతి, తనపదవిలో ప్రవేశించిన తేదీ నుండి అయిదు సంవత్సరముల కాలావధి వరకు పదవియందుండును. **ఉపరాష్ట్రపతి పదావధి.**

అయితే–

(ఎ) ఉపరాష్ట్రపతి, తన చేవ్రాలుతో రాష్ట్రపతికి లేఖ వ్రాయుట ద్వారా తన పదవికి రాజీనామా ఇవ్వవచ్చును.

---

1. సంవిధాన (పదకొండవ సవరణ) చట్టము, 1961 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ''సంయుక్త సమావేశమున సమావేశమై పార్లమెంటు ఉభయ సదనముల సభ్యులచే'' అను పదములకు బదులుగా19.12.1961 నుండి ఉంచబడినది.
2. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజప్రముఖ్ లేక ఉపరాజప్రముఖ్‌గా'' అనుపదములు 1.11.1956 నుండి లుప్తము చేయబడినవి.

(బి) ఉపరాష్ట్రపతి రాజ్యసభలో అప్పుడు సభ్యులుగానున్న వారందరిలో అధిక సంఖ్యాకులచే ఆమోదించబడి లోక్‌సభ చే అంగీకరించబడిన తీర్మానము ద్వారా పదవి నుండి తొలగించబడవచ్చును కాని ఈ ఖండము నిమిత్తము తీర్మానమేదియు, దానిని ప్రస్తావించవలెనను ఉద్దేశము కలదను నోటీసు ఇచ్చి కనీసము పదునాలుగు దినములు గడచిననే తప్ప ప్రస్తావించబడరాదు.

(సి) ఉపరాష్ట్రపతి తన పదావధి ముగిసినప్పటికిని తన ఉత్తారాధికారి ఆ పదవిలో ప్రవేశించువరకు పదవిలో కొనసాగవలెను.

**ఉపరాష్ట్రపతి పదవి ఖాళీ అయినప్పుడు దానిని పూరించుటకు ఎన్నిక జరుపవలసిన కాలము, మరియు ఆకస్మికముగా ఏర్పడిన ఖాళీని పూరించుటకు ఎన్నుకొనబడు వ్యక్తి యొక్క పదావధి.**

68. (1) ఉపరాష్ట్రపతి యొక్క పదావధి ముగియుటచే ఏర్పడు ఖాళీని పూరించుటకు జరుపవలసిన ఎన్నిక, ఆ పదావధి ముగియుటకు పూర్వమే పూర్తిచేయబడవలెను.

(2) మరణము, రాజీనామా లేక తొలగింపు కారణముగా లేక అన్యథా ఉపరాష్ట్రపతి పదవియందు ఏర్పడిన ఖాళీని పూరించుటకు జరుపవలసిన ఎన్నిక, ఆ ఖాళీ ఏర్పడిన తరువాత సాధ్యమైనంత త్వరితముగా జరుపబడవలెను మరియు ఆ ఖాళీని పూరించుటకు ఎన్నుకొనబడిన వ్యక్తి 67వ అనుచ్ఛేదము యొక్క నిబంధనలకు అధ్యధీనమై, తాను పదవిలో ప్రవేశించిన తేదీ నుండి అయిదు సంవత్సరముల సంపూర్ణ కాలావధి వరకు పదవియందుండుటకు హక్కు కలిగియుండును.

**ఉపరాష్ట్రపతిచే ప్రమాణము లేక, ప్రతిజ్ఞ.**

69. ప్రతి ఉపరాష్ట్రపతి తన పదవిలో ప్రవేశించుటకు పూర్వము, రాష్ట్రపతి సమక్షమునగాని, తద్విషయమున ఆయనచే నియమింపబడిన వ్యక్తి సమక్షమునగాని ఈ క్రింది ప్రరూపములో ప్రమాణము లేక ప్రతిజ్ఞ చేసి దానిపై చేవ్రాలు చేయవలెను:

''ఎ.బి. అను నేను శాసనము ద్వారా స్థాపితమైన భారత సంవిధానము పట్ల యదార్థమైన శ్రద్ధానిష్ఠలను కలిగియుందుననియు, మరియు నేను వహింపనున్న కర్తవ్యములను శ్రద్ధాపూర్వకముగ నిర్వహింతుననియు దైవసాక్షిగ ప్రమాణము చేయుచున్నాను/ సత్యనిష్ఠతో ప్రతిజ్ఞ చేయుచున్నాను.''.

**ఇతర యాదృశ్చిక పరిస్థితులలో రాష్ట్రపతి యొక్క కృత్యముల**

70. ఈ అధ్యాయములో నిబంధించబడని ఎట్టి యాదృచ్ఛిక పరిస్థితిలోనైనను, రాష్ట్రపతి యొక్క కృత్యములను నిర్వహించుటకు పార్లమెంటు తాను సబబని తలచు నిబంధన చేయవచ్చును.

**రాష్ట్రపతి లేక ఉపరాష్ట్రపతి యొక్క ఎన్నికకు చెందిన, లేక సంబంధించిన విషయములు.**

[1][71. (1) రాష్ట్రపతి లేక ఉపరాష్ట్రపతి యొక్క ఎన్నిక నుండి ఉత్పన్నమైన లేక ఎన్నికకు సంబంధించిన అన్ని సందేహములు మరియు వివాదములు సర్వోన్నత న్యాయస్థానముచే పరిశీలించబడి, నిర్ణయించబడవలెను అట్టి నిర్ణయము అంతితమమైనదై యుండును.

(2) రాష్ట్రపతిగా లేక ఉపరాష్ట్రపతిగా ఒక వ్యక్తి యొక్క ఎన్నిక చెల్లదని సర్వోన్నత న్యాయస్థానము ప్రఖ్యానించినచో, సర్వోన్నత న్యాయస్థానము ఆ నిర్ణయము చేసిన తేదీన గాని అంతకు పూర్వముగాని, సందర్భానుసారముగ, రాష్ట్రపతి పదవికి లేక ఉపరాష్ట్రపతి పదవికి చెందిన అధికారములను

1. సంవిధాన (ముప్పది తొమ్మిదవ సవరణ) చట్టము, 1975 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 10.8.1975 నుండి ఉంచబడినదానికి బదులు సంవిధాన (నలుబది నాల్గవ సవరణ) చట్టము, 1978 యొక్క 10వ పరిచ్ఛేదము ద్వారా ఇది వుంచబడినది (20.6.1979 నుండి అమలులోనికి వచ్చినది).

వినియోగించుటలోను, కర్తవ్యములను నిర్వర్తించుటలోను ఆయనచే చేయబడిన కార్యములు ఆ ప్రఖ్యానము కారణముగ అమాన్య మొనర్చబడరాదు.

(3) ఈ సంవిధానము యొక్క నిబంధనలకు అధ్యధీనమై రాష్ట్రపతి లేక ఉపరాష్ట్రపతి యొక్క ఎన్నికకు చెందిన లేక సంబంధించిన విషయమును పార్లమెంటు శాసనము ద్వారా క్రమబద్ధము చేయవచ్చును.

(4) రాష్ట్రపతిగా లేక ఉపరాష్ట్రపతిగా ఒక వ్యక్తి యొక్క ఎన్నిక అతనిని ఎన్నుకొనెడి నిర్వాచక గణము యొక సభ్యులలో ఏ కారణమువలనైనను ఏదేని ఖాళీయున్నదను కారణమును బట్టి ప్రష్టవ్యము (ప్రశ్నాగతము) కారాదు.]

**కొన్ని సందర్భములలో క్షమావణలు మొదలైన వాటిని మంజూరు చేయుటకు మరియు దండనోత్తరువును సస్పెండు చేయుటకు, పరిహరించుటకు లేక లఘూకరించుటకు రాష్ట్రపతి యొక్క అధికారము.**

72. (1) రాష్ట్రపతి ఈ క్రింది సందర్భములలో నేర నిర్ణీతుడైన వ్యక్తికి క్షమావణలను, తాత్కాలిక నిలుపుదలను, వాయిదాలను లేక పరిహరణలను మంజూరు చేయుటకు లేక ఆ వ్యక్తిపై విధించబడిన దండనోత్తరువును సస్పెండు చేయుటకు, పరిహరించుటకు లేక లఘూకరించుటకు అధికారమును కలిగియుండును:-

(ఎ) శిక్ష లేక దండనోత్తరువు సైనిక న్యాయస్థానముచే విధించబడిన అన్ని సందర్భములలో;

(బి) సంఘము యొక్క కార్యపాలకాధికారములో చేరియున్న విషయమునకు సంబంధించిన ఏదేని శాసనమునకు విరుద్ధమగు అపరాధమునకై శిక్ష లేక దండనోత్తరువు విధించబడిన అన్ని సందర్భములలో;

(సి) దండనోత్తరువు మరణదండనోత్తరువైన అన్ని సందర్భములలో;

(2) ఏదేని సైనిక న్యాయస్థానముచే ఇవ్వబడిన దండనోత్తరువును సస్పెండు చేయుటకు, పరిహరించుటకు, లేక లఘూకరించుటకు సంఘమునకు చెందిన సాయుధ బలముల యొక్క ఎవరేని అధికారికి శాసనము ద్వారా ప్రదత్తము చేయబడిన అధికారమునకు ఖండము (1) యొక్క ఉప-ఖండము (ఎ)లో నున్న దేదియు, భంగము కలిగించదు.

(3) మరణ దండనోత్తరువును సస్పెండు చేయుటకు, పరిహరించుటకు లేక లఘూకరించుటకు తత్సమయమున అమలులోనున్న ఏదేని శాసనము క్రింద ఒక రాజ్య గవర్నరు [1][* * *] చే వినియోగించబడదగు అధికారమునకు ఖండము (1) యొక్క ఉప-ఖండము (సి)లో నున్న దేదియు భంగము కలిగించదు.

**సంఘము యొక్క కార్యపాలకాధికార విస్తరణ.**

73. (1) ఈ సంవిధాన నిబంధనలకు అధ్యధీనమై సంఘము యొక్క కార్యపాలకాధికారములో, ఈ క్రిందివి చేరియుండును:

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజప్రముఖ్'' అను పదములు 01.11.1956 నుండి లుప్తము చేయబడినవి.

(ఎ) ఏ విషయములను గురించి శాసనములను చేయుటకు పార్లమెంటు అధికారము గలదో ఆ విషయములు; మరియు

(బి) ఏదేని సంధి, లేక కరారునుబట్టి భారత ప్రభుత్వముచే వినియోగించబడదగు హక్కుల యొక్క, ప్రాధికారము యొక్క మరియు అధికారిత యొక్క వినియోగము:

అయితే ఈ సంవిధానములోగాని, పార్లమెంటుచే చేయబడిన ఏదేని శాసనములోగాని అభివ్యక్తముగాని నిబంధించబడినట్లు తప్ప [1][* * *] ఏదేని రాజ్యములో ఏ విషయములను గురించి శాసనములను చేయుటకు ఆ రాజ్య శాసనమండలికి కూడ అధికారము కలదో ఆ విషయములు ఉపఖండము (ఎ)లో నిర్దేశించబడిన కార్యపాలకాధికారములో చేరియుండవు.

(2) ఏ విషయముల గురించి ఒక రాజ్యము కొరకు శాసనములు చేయుటకు పార్లమెంటుకు అధికారము కలదో ఆ విషయములలో ఆ రాజ్యము, మరియు ఆ రాజ్యపు ఎవరేని అధికారి లేక ప్రాధికారి, ఈ సంవిధానము యొక్క ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము చలాయించ గలిగియుండెడినట్టి కార్యపాలకాధికారమును, లేక కృత్యములను, ఈ అనుచ్ఛేదములో నేమి యున్నప్పటికిని పార్లమెంటుచే అన్యధా నిబంధించబడునంత వరకు ఆ రాజ్యము, మరియు ఆ రాజ్యపు ఎవరేని అధికారి లేక ప్రాధికార చలాయించు చుండుట కొనసాగించవచ్చును.

## మంత్రి పరిషత్తు

**రాష్ట్రపతికి సహాయ పడుటకును సలహా నిచ్చుటకును మంత్రి పరిషత్తు.**

74. [2][(1) రాష్ట్రపతికి సహాయపడుటకును, సలహానిచ్చుటకును ప్రధానమంత్రి ఆధిపత్యమున ఒక మంత్రి పరిషత్తు ఉండవలెను. రాష్ట్రపతి తన కృత్యములను నిర్వహించుటలో అట్టి సలహాననుసరించి వ్యవహరించవలెను:]

[3] [అయితే రాష్ట్రపతి సాధారణముగాగాని, అన్యధాగాని అట్టి సలహాలను పున:పర్యాలోచించవలసినదిగా మంత్రి పరిషత్తును కోరవచ్చును మరియు రాష్ట్రపతి అట్టి పున:పర్యాలోచన తర్వాత యివ్వబడిన సలహాననుసరించి వ్యవహరించవలెను.]

(2) రాష్ట్రపతికి మంత్రులచే ఏదేని సలహా ఈయబడినదా, అట్లయినచో అది ఏది, అను ప్రశ్న ఏ న్యాయస్థానమునందును పరిశీలించబడరాదు.

**మంత్రులను గూర్చిన ఇతర నిబంధనలు.**

75. (1) ప్రధానమంత్రి రాష్ట్రపతిచే నియమించబడవలెను. ఇతర మంత్రులు ప్రధానమంత్రి సలహాపై రాష్ట్రపతిచే నియమించబడ వలెను.

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''ఒకటవ అనుసూచి యొక్క భాగము – ఏ లేక భాగము – బీలో నిర్దిష్టపరచబడిన'' అను పదములు మరియు అక్షరములు లుప్తము చేయబడినవి.
2. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 13వ పరిచ్ఛేదము ద్వారా ఖండము (1)కి బదులుగా 3.1.1977 నుండి ఉంచబడినది.
3. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 11వ పరిచ్ఛేదము ద్వారా 20.6.1979 నుండి చొప్పించబడినది.

[1][(1ఏ) మంత్రి పరిషత్తులో ప్రధానమంత్రితో సహా మొత్తము మంత్రుల సంఖ్య లోక్‌సభ లోని మొత్తము సభ్యుల సంఖ్యలో పదిహేను శాతమునకు మించరాదు.

(1బీ) పదవ అనుసూచి యొక్క 2వ పేరా క్రింద పార్లమెంటు ఉభయ సదనములలోని ఏదేని రాజకీయ పార్టీకి చెందియుండి, ఆ సదనము యొక్క సభ్యునిగా ఉండుటకు నిరర్హుడైన ఒక సభ్యుడు అతని అనర్హత ప్రారంభపు తేదీ నుండి అట్టి సభ్యునిగా అతని పదవీ కాలావది ముగియు నంతవరకు లేదా అతను అట్టి కాలావధి ముగియకముందే పార్లమెంటు ఉభయ సదనములలో ఏ సదనము యొక్క ఏదేని ఎన్నికకు పోటీ చేసి ఎన్నికైనట్లుగా ప్రఖ్యానింపబడు తేదీ వరకు, వీటిలో ఏది ముందుగా వచ్చునో అంత వరకు, ఖండము (1) క్రింద మంత్రిగా నియోజితుడగుటకు కూడ నిరర్హుడగును.]

(2) మంత్రులు రాష్ట్రపతి అభీష్టముండునంతవరకు పదవి యుందుందురు.

(3) మంత్రి పరిషత్తు లోక్‌సభకు సమష్టిగా ఉత్తరదాయియై యుండును.

(4) ఒక మంత్రి తన పదవిలో ప్రవేశించుటకు పూర్వము, పదవి యొక్క రహస్యగోపనమును గూర్చిన ప్రమాణములను మూడవ అనుసూచిలో అందు నిమిత్తమై పొందుపరచబడియున్న ప్రరూపములననుసరించి రాష్ట్రపతి అతనిచే చేయించవలెను.

(5) పార్లమెంటు యొక్క ఏ సదనములోగాని వరుసగా ఆరు మాసముల కాలావధివరకు సభ్యుడుగా లేని మంత్రి, ఆ కాలావధి ముగియగనే మంత్రిపదవిని కోల్పోవును.

(6) మంత్రుల జీతములు, బత్తెములు పార్లమెంటు ఆయా సమయములందు శాసనము ద్వారా నిర్ధారణ చేయునట్టివై ఉండును. పార్లమెంటు అట్లు నిర్ధారణ చేయువరకు అవి రెండవ అనుసూచిలో నిర్దిష్టపరచబడినట్లు ఉండును.

## భారతదేశ అటార్నీ జనరలు

76. (1) సర్వోన్నత న్యాయస్థానము యొక్క న్యాయాధీశుడుగా నియమించబడుటకు అర్హుడైన వ్యక్తిని రాష్ట్రపతి భారతదేశపు అటార్నీ జనరలుగా నియమించవలెను. **భారతదేశ అటార్నీ జనరలు.**

(2) ఆయా సమయములందు శాసనిక విషయములలో రాష్ట్రపతిచే తనకు నిర్దేశించబడు వాటిపై భారత ప్రభుత్వమునకు సలహానిచ్చుటయు, రాష్ట్రపతిచే తనకు అప్పగించబడు శాసనిక స్వభావము గల ఇతర కర్తవ్యములను నిర్వర్తించుటయు. ఈ సంవిధానము ద్వారాగాని, దాని క్రిందగాని, తత్సమయమున అమలులోనున్న ఏదేని ఇతర శాసనము ద్వారాగాని, దాని క్రిందగాని తనకు ప్రదత్తము చేయబడిన కృత్యములను నిర్వహించుటయు అటార్నీ జనరలు యొక్క కర్తవ్యమై యుండును.

(3) అటార్నీ జనరలు తన కర్తవ్యములను నిర్వర్తించుటలో భారతదేశ రాజ్య క్షేత్రములోని న్యాయస్థానములన్నింటిలో వాదనాధికారమును కలిగియుండును.

---

1. సంవిధాన (తొంబది ఒకటవ సవరణ) చట్టము, 2003 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 01.01.2004 నుండి చొప్పించబడినది.

(4) అటార్నీ జనరలు రాష్ట్రపతి అనుగ్రహముండునంత వరకు పదవియందుండును; మరియు రాష్ట్రపతి నిర్ధారణ చేయు ప్రతి మూల్యమును పొందవలెను.

## ప్రభుత్వము యొక్క కార్యకలాప నిర్వహణ

**భారత ప్రభుత్వము యొక్క కార్యకలాప నిర్వహణము.**

77. (1) భారత ప్రభుత్వమునకు చెందిన కార్యపాలక చర్యయంతయు రాష్ట్రపతి పేర తీసికొనబడినట్లు అభివ్యక్తపరచబడవలెను.

(2) రాష్ట్రపతి పేర చేయబడిన, మరియు వ్రాసి ఈయబడిన ఉత్తరువులు మరియు ఇతర పత్రములు, రాష్ట్రపతిచేయు [1][నియమావళిలో నిర్దిష్ట పరచబడు] రీతిగా అధిప్రమాణితము చేయబడ వలెను. అట్లు అధిప్రమాణితము చేయబడిన ఉత్తరువు యొక్క లేక పత్రము యొక్క మాన్యత, అది రాష్ట్రపతిచే చేయబడినట్టి, లేక వ్రాసి ఈయబడినట్టి ఉత్తరువు లేక పత్రము కాదనెడి కారణమును బట్టి ప్రశ్నించబడరాదు.

(3) రాష్ట్రపతి భారత ప్రభుత్వమునకు చెందిన కార్యకలాపములను మిక్కిలి సుకరముగ జరుపుటకును, ఆ కార్యకలాపములను మంత్రులకు కేటాయించుటకును నియమావళిని చేయవలెను.

(4) [2][* * * * *]

**రాష్ట్రపతికి సమాచారమును అందచేయుట మున్నగు విషయములను గురించి ప్రధాన మంత్రి కర్తవ్యములు.**

78. ఈ క్రింద తెలుపబడినవి ప్రధానమంత్రి కర్తవ్యములై యుండును:-

(ఎ) సంఘము యొక్క వ్యవహారములలో పరిపాలనకు సంబంధించి మంత్రి పరిషత్తు యొక్క సమస్త నిర్ణయములను, మరియు శాసన నిర్మాణమునకై చేయబడిన ప్రతిపాదనలను, రాష్ట్రపతికి తెలియజేయుట;

(బి) సంఘము యొక్క వ్యవహారముల పరిపాలనకును, శాసన నిర్మాణమునకై చేయబడిన ప్రతిపాదనలకును, సంబంధించిన విషయములలో రాష్ట్రపతి కోరు సమాచారమును అందజేయుట; మరియు

(సి) ఏ విషయమైనను ఒక మంత్రిచే నిర్ణయించబడి మంత్రి పరిషత్తుచే పర్యాలోచించబడి యుండని యెడల, ఆ విషయమును మంత్రి పరిషత్తు యొక్క పర్యాలోచనకు సమర్పించవలసినదిగా రాష్ట్రపతి అపేక్షించినచో దానిని అట్లు సమర్పించుట.

---

1. ఆయా సమయములందు సవరించబడిన అధిసూచన నెం.ఎస్.ఓ.2297 నవంబరు 3, 1958 తేదీనాటి అసాధారణ భారత రాజపత్రము 1958 భాగము II పరిచ్ఛేదము 3, పేజీ 1315 చూడుము.
2. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 14వ పరిచ్ఛేదము ద్వారా ఖండము (4) 3.1.1977 నుండి చేర్చబడి, సంవిధాన (నలుబది నాల్గవ సవరణ) చట్టము, 1978 యొక్క 12వ పరిచ్ఛేదము ద్వారా 20.6.1979 నుండి లుప్తము చేయబడినది.

## అధ్యాయము 2 – పార్లమెంటు

### సాధారణ విషయములు

79. సంఘమునకు రాష్ట్రపతితోను, క్రమముగా రాజ్యసభ మరియు లోక్‌సభ అని అనబడు రెండు సదనములతోను కూడిన ఒక పార్లమెంటు ఉండవలెను. **పార్లమెంటు యొక్క సంఘటన.**

80. (1) [1][[2]* * *] రాజ్య సభ ఈ క్రిందివారితో కూడి యుండవలెను:– **రాజ్యసభ సంరచన.**

(ఎ) ఖండము (3) యొక్క నిబంధనల ననుసరించి రాష్ట్రపతిచే నామ నిర్దేశము చేయబడు పన్నెండు మంది సభ్యులు: మరియు

(బి) రాజ్యముల యొక్కయు [3][సంఘ రాజ్యక్షేత్రముల యొక్కయు] రెండు వందల ముప్పది యెనిమిది మందికి మించని ప్రతి నిధులు

(2) రాజ్యసభలో రాజ్యముల యొక్కయు, [3][సంఘ రాజ్యక్షేత్రముల యొక్కయు] ప్రతినిధులచే పూరించబడవలసిన స్థానముల కేటాయింపు నాల్గవ అనుసూచియందు గల తద్విషయక నిబంధనల ననుసరించి యుండవలెను.

(3) ఖండము (1) యొక్క ఉప–ఖండము (ఎ) క్రింద రాష్ట్రపతిచే నామనిర్దేశము చేయబడు సభ్యులు ఈ క్రింది వాటిని పోలిన విషయములందు విశేష జ్ఞానమునుగాని, ఆచరణానుభవమునుగాని కలిగిన వ్యక్తులై యుండవలెను; అనగా,–

సాహిత్యము, విజ్ఞాన శాస్త్రము, కళ మరియు సాంఘిక సేవ.

(4) రాజ్య సభకు, [4][* * *] ప్రతి రాజ్యము యొక్క శాసనసభలోని ఎన్నుకొనబడిన సభ్యులచే ఏకల అంతరణీయ ఓటు ద్వారా అనుపాతిక ప్రాతినిధ్య పద్ధతిననుసరించి ఆ రాజ్యము యొక్క ప్రతినిధులు ఎన్నుకొనబడవలెను.

(5) రాజ్యసభకు, [5][సంఘ రాజ్యక్షేత్రముల] యొక్క ప్రతినిధులు, పార్లమెంటు శాసనము ద్వారా విహితపరచు రీతిలో ఎంపిక చేయబడవలెను.

---

1. సంవిధాన (ముప్పది యైదవ సవరణ) చట్టము, 1974 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా రాజ్యసభను 1.3.1975 నుండి ఉంచబడినది.
2. సంవిధాన (ముప్పది యారవ సవరణ) చట్టము, 1975 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా 26.4.1975 నుండి 10వ అనుసూచి యొక్క 4వ పేరా యొక్క నిబంధనలకు అధ్యధీనమై అను పదబంధము లుప్తముచేయబడినది.
3. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 1.11.1956 నుండి చేర్చబడినది.
4. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా ''ఒకటవ అనుసూచి యొక్క భాగము – ఏ, లేక భాగము – బీలో నిర్దిష్టపరచబడిన'' అను పదములు మరియు అక్షరములు 01.11.1956 నుండి లుప్తము చేయబడినవి.
5. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా ''ఒకటవ అనుసూచి యొక్క భాగము 'సి'లో నిర్దిష్టపరచబడిన రాజ్యముల'' అను పదములకు బదులుగా 1.11.1956 నుండి ఉంచబడినవి.

[1]81. (1) [2][331వ అనుచ్ఛేదము యొక్క నిబంధనలకు అధ్యధీనమై] [3][* * *] లోక్‌సభ ఈ క్రింది వారితో కూడి యుండవలెను:– **లోకసభ సంరచన.**

(ఎ) రాజ్యములలోని ప్రాదేశిక నియోజకవర్గముల ప్రత్యక్ష ఎన్నిక ద్వారా ఎంపిక చేయబడిన [4][అయిదువందల ముప్పది మందికి మించని సభ్యులు;]

(బి) పార్లమెంటు శాసనము ద్వారా నిబంధించిన రీతిగా ఎంపిక చేయబడి సంఘ రాజ్య క్షేత్రములకు ప్రాతినిధ్యము వహించు [5][ఇరువది మందికి] మించని సభ్యులు.

(2) ఖండము (1)లోని ఉప–ఖండము (ఎ) నిమిత్తము –

(ఎ) ఒక రాజ్యపు స్థానముల సంఖ్యకును దాని జన సంఖ్యకును గల నిష్పత్తి, ఆచరణీయమైనంత మేరకు అన్ని రాజ్యములకు ఒకే రీతిగ ఉండునట్లు లోక్‌సభ లోని స్థానములు ప్రతి యొక్క రాజ్యమునకు కేటాయించబడవలెను; మరియు

(బి) ప్రతి ప్రాదేశిక నియోజకవర్గపు జన సంఖ్యకును ఆ నియోజకవర్గమునకు కేటాయించబడిన స్థానముల సంఖ్యకును గల నిష్పత్తి, ఆచరణీయమైనంతమేరకు రాజ్యమునందంతటను ఒకే రీతిగనుండునట్లు ప్రతి రాజ్యము ప్రాదేశిక నియోజక వర్గములుగా విభజించబడవలెను:

[6][అయితే, ఏదేని రాజ్యమునందలి జన సంఖ్య అరువది లక్షలకు (6 మిలియన్లు) మించనంత

మించనంత

వరకు, ఆ రాజ్యమునకు లోక్‌సభ స్థానములను కేటాయించు నిమిత్తము ఈ ఖండము యొక్క ఉప–ఖండము (ఎ)లోని నిబంధనలు వర్తించవు.]

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 1.11.1956 నుండి అనుచ్ఛేదములు 81 మరియు 82 బదులుగా ఉంచబడినది.
2. సంవిధాన (ముప్పది అయిదవ సవరణ) చట్టము, 1974 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 1.3.1975 నుండి ''331వ అనుచ్ఛేదము యొక్క నిబంధనలకు అధ్యధీనమై'' అని అర్థము.
3. సంవిధాన (ముప్పది అరవ సవరణ) చట్టము, 1975 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా ''పదవ అనుసూచి యొక్క 4వ పేరా'' అను పదబంధము మరియు అంకెలు 26.4.1975 నుండి లుప్తము చేయబడినవి.
4. గోవా డామన్ మరియు డయ్యు పునర్వ్యవస్థీకరణ చట్టము, 1987 (1987లోని 18వది) యొక్క 63వ పరిచ్ఛేదము ద్వారా ''అయిదు వందల ఇరువది ఐదు మందికి మించని సభ్యులు'' అను దానికి బదులుగా 30.5.1987 నుండి ఉంచబడినది.
5. సంవిధాన (ముప్పది ఒకటవ సవరణ) చట్టము, 1973 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ''ఇరువది మందికి'' అను పదబంధమునకు బదులుగా 17.10.1973 నుండి ఉంచబడినది.
6. సంవిధాన (ముప్పది ఒకటవ సవరణ) చట్టము, 1973 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 17.10.1973 నుండి చొప్పించబడినది.

(3) ఈ అనుచ్ఛేదములో ''జనసంఖ్య'' అను పదమునకు కట్టకడవటిదియు అందుకు సంబంధించిన అంకెలు ప్రచురణ చేయబడినట్టిదియు అగు జనగణనలో అభినిశ్చితమైన జనసంఖ్య అని అర్థము:

[1][అయితే ఈ ఖండములో కట్టకడవటిదియు అందుకు సంబంధించిన అంకెలు ప్రచురణ చేయబడినట్టిదియు అగు జనగణనకు గల నిర్దేశమును [2][2026]వ సంవత్సరము పిమ్మట చేయబడు మొదటి జనగణనకు సంబంధించిన అంకెలు ప్రచురించబడు వరకు,

[3][(i) ఖండము (2) యొక్క ఉప-ఖండము (ఎ) మరియు ఆ ఖండమునకు గల వినాయింపు నిమిత్తము, 1971వ సంవత్సరపు జనగణనకు నిర్దేశమైనట్లు; మరియు

(ii) ఖండము (2) యొక్క ఉప-ఖండము (బి) నిమిత్తము [4][2001]వ సంవత్సరపు జనగణనకు నిర్దేశమైనట్లు అన్వయించుకొనవలెను.]]

82. ప్రతియొక్క జనగణన పూర్తియైన పిమ్మట రాజ్యములకు లోక్‌సభ స్థానముల కేటాయింపు, మరియు ప్రాదేశిక నియోజక వర్గములుగ ప్రతి రాజ్యము యొక్క విభజన, పార్లమెంటు శాసనము ద్వారా నిర్ధారణ చేయునట్టి ప్రాధికారిచే, మరియు అట్టి రీతిలో, తిరిగి సర్దుబాటు చేయబడవలెను: **ప్రతి జనగణన పిమ్మట తిరిగి సర్దుబాటు.**

అయితే అట్లు తిరిగి చేయబడిన సర్దుబాటు, అప్పుడు అస్తిత్వములోనున్న లోక్‌సభ విఘటితమగు వరకు, ఆ సభలోని ప్రాతినిధ్యమునకు భంగము కలిగించరాదు:

[5][అంతేగాక అట్లు తిరిగి చేయబడిన సర్దుబాటు రాష్ట్రపతి ఉత్తరువు ద్వారా నిర్దిష్టపరచు తేదీన అమలులోనికి వచ్చును, మరియు అట్టి సర్దుబాటు అమలులోనికి వచ్చువరకు ఆ సదనమునకు చెందిన యేదేని ఎన్నికను అట్టి సర్దుబాటునకు పూర్వము ఉన్న ప్రాదేశిక నియోజకవర్గముల ప్రాతిపదికపై జరుపవచ్చును;

అంతేగాక ఇంకనూ [6][2026]వ సంవత్సరము పిమ్మట చేయబడిన మొదటి జనగణనకు సంబంధించిన అంకెలు ప్రచురించబడు వరకు ఈ అనుచ్ఛేదము క్రింద

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 15వ పరిచ్ఛేదము ద్వారా వినాయింపు (3.1.1977) నుండి చేర్చబడినది.
2. సంవిధాన (ఎనుబది నాలుగవ సవరణ) చట్టము, 2001 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా ''2000'' అనుదానికి బదులుగా 21.2.2002 నుండి ఉంచబడినది.
3. అదే చట్టపు 3వ పరిచ్ఛేదము ద్వారా కొన్ని పదములకు బదులుగా ఉండబడినది.
4. సంవిధాన (ఎనుబది – ఏడవ సవరణ) చట్టము, 2003 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ''1991''కి బదులుగా ఉంచబడినది.
5. సంవిధాన (నలుబది – రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 16వ పరిచ్ఛేదము ద్వారా 3.1.1977 నుండి చొప్పించబడినది.
6. సంవిధాన (ఎనుబది నాల్గవ సవరణ) చట్టము, 2001 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా ''2000''లకు బదులుగా 21.2.2002 నుండి ఉంచబడినవి.

[1][(i) 1971వ సంవత్సర జనగణన ప్రాతిపదికపై తిరిగి సర్దుబాటు చేయబడునట్లు లోక్‌సభ లో రాజ్యములకు స్థానముల కేటాయింపును చేయుటను;

(ii) ప్రతియొక్క రాజ్యమును [2] (2001)వ సంవత్సర జనగణన ప్రాతిపదికపై తిరిగి సర్దుబాటు చేయబడు ప్రాదేశిక నియోజక వర్గములుగ విభజించుటను తిరిగి సర్దుబాటు చేయుట ఆవశ్యకము కాదు.]

**పార్లమెంటు యొక్క సదనముల కాలావధి.**

83. (1) రాజ్యసభ విఘటనకు లోనుకాదు, కాని పార్లమెంటు శాసనము ద్వారా తద్విషయమున చేయు నిబంధనలననుసరించి రాజ్యసభ సభ్యులలో వీలైనంత దగ్గరి సంఖ్యలో గల మూడవవంతు మంది ప్రతి రెండవ సంవత్సరము ముగిసిన మీదట వీలైనంత త్వరితముగ పదవి నుండి విరమించవలెను.

(2) లోక్‌సభ, దాని మొదటి సమావేశమునకై నియతమైన తేదీ నుండి [3] [అయిదు సంవత్సరముల పాటు] ఆలోపున విఘటన చేయబడిననే తప్ప, కొనసాగవలెను. అంతకు మించి కొనసాగరాదు. సదరు [3][అయిదు సంవత్సరముల] కాలావధి యొక్క ముగింపు ఆ సదనము యొక్క విఘటనగా ప్రవర్తితము కావలెను:

అయితే ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము అమలులోనున్నప్పుడు, ఒక్కొక్కసారి ఒక్కొక్క సంవత్సరమునకు మించకుండునట్లును, ఏ సందర్భములోనైనను సదరు అధిప్రఖ్యానము యొక్క అమలు ఆగిపోయిన తరువాత ఆరు మాసములకు మించకుండునట్లును సదరు కాలావధిని పార్లమెంటు శాసనము ద్వారా పొడిగించవచ్చును.

**పార్లమెంటు సభ్యత్వమునకు అర్హత.**

84. ఏ వ్యక్తియైనను–

---

1. సంవిధాన (ఎనుబది నాల్గవ సవరణ) చట్టము, 2001 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా కొన్ని పదములకు బదులుగా 21.2.2002 నుండి ఉంచబడినది.
2. సంవిధాన (ఎనుబది ఏడవ సవరణ) చట్టము, 2003 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా ''1991''కి బదులుగా 22.06.2003 నుండి ఉంచబడినది.
3. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 17వ పరిచ్ఛేదము ద్వారా ''అయిదు సంవత్సరములు'' అను పదములకు బదులు ''ఆరు సంవత్సరములు'' అను పదములు 3.1.1977 నుండి ఉంచబడి, సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 13వ పరిచ్ఛేదవు (1)వ ఉప–పరిచ్ఛేదము ద్వారా తిరిగి ''ఆరు సంవత్సరములు' అనుపదములకు బదులు ''అయిదు సంవత్సరములు'' అను పదములు 20.6.1979 నుండి ఉంచబడినవి.

[1][(ఎ) తాను భారతదేశ పౌరుడైయుండి, ఎన్నికల కమీషనుచే తద్విషయమై ప్రాధికృతుడైన వ్యక్తి సమక్షమున, మూడవ అనుసూచిలో అందు నిమిత్తము పొందుపరచబడిన ప్రరూపముననుసరించి, ప్రమాణము లేక ప్రతిజ్ఞ చేసి దానిపై చేవ్రాలు చేసినవే తప్ప;]

(బి) రాజ్య సభలోని స్థానము విషయములో, ముప్పది సంవత్సరముల వయస్సుకు తక్కువ కాకుండను, లోక్‌సభ లోని స్థానము విషయములో ఇరువది ఐదు సంవత్సరముల వయస్సుకు తక్కువ కాకుండను ఉన్ననే తప్ప; మరియు

(సి) పార్లమెంటుచే చేయబడిన ఏదేని శాసనము ద్వారా గాని, దాని క్రిందగాని, తద్విషయమున విహితము చేయబడు ఇతర అర్హతలను కలిగియున్ననే తప్ప; పార్లమెంటులోని స్థానమును పూరించుటకై ఎంపిక చేయబడుటకు అర్హుడు కాడు.

**పార్లమెంటు యొక్క అధివేశనములు, అధివేశనావసానము మరియు విఘటన.**

[2][85. (1) రాష్ట్రపతి ఆయా సమయములందు, పార్లమెంటు యొక్క ప్రతి సదనమును ఆయన సబబని తలచు సమయముననను, స్థలముననను సమావేశమగుటకు ఆహ్వానించవలెను, కాని దాని ఒక అధివేశనములోని కడపటి ఉపవేశనమునకును దాని మరుసటి అధివేశనములోని మొదటి ఉపవేశనమునకును నియతమైన తేదీకి మధ్య ఆరు మాసముల అంతరము ఉండరాదు.

(2) రాష్ట్రపతి ఆయా సమయములందు–

(ఎ) ఆ సదనముల యొక్క, లేక ఆ సదనములలో దేని యొక్క యైనను, అధివేశనావసానము చేయవచ్చును;

(బి) లోక్‌సభ ను విఘటన చేయవచ్చును.]

**సదనములలో ప్రసంగించుటకు మరియు సందేశములను పంపుటకును రాష్ట్రపతికి గల హక్కు.**

86. (1) రాష్ట్రపతి, పార్లమెంటు యొక్క ఏ సదనములోనైనను, కలిసి సమావేశమైన ఉభయ సదనములలోనైనను, ప్రసంగించ వచ్చును; మరియు అందు నిమిత్తము సభ్యుల హాజరును కోరవచ్చును.

(2) రాష్ట్రపతి, పార్లమెంటు యొక్క ఏ సదనమునకైనను, పార్లమెంటులో అప్పటికి పెండింగులోనున్న బిల్లును గూర్చి లేక అన్యథా సందేశములను పంపవచ్చును, మరియు ఏ సదనమునకు అట్టి సందేశము పంపబడునో ఆ సదనము, ఏ విషయమును పర్యాలోచించుటకు ఆ సందేశము ద్వారా ఆపేక్షించబడినదో ఆ విషయమును గూర్చి వీలైనంత త్వరితముగ పర్యాలోచించవలెను.

---

1. సంవిధాన (పదహారవ సవరణ) చట్టము, 1963 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా ఖండము (ఎ)కు బదులుగా 05.10.1963 నుండి ఉంచబడినది.
2. సంవిధాన (ఒకటవ సవరణ) చట్టము, 1951 యొక్క 6వ పరిచ్ఛేదము ద్వారా 85వ అనుచ్ఛేదముకు బదులుగా 18.6.1951 నుండి ఉంచబడినది.

87. (1) రాష్ట్రపతి [1][లోక్‌సభ యొక్క ప్రతి సాధారణ ఎన్నికల తరువాతి మొదటి అధివేశనము యొక్క ప్రారంభమునను, ప్రతి సంవత్సరము మొదటి అధివేశనము] యొక్క ప్రారంభమునను, కలిపి సమావేశమైన పార్లమెంటు యొక్క ఉభయ సదనములను సంబోధించి, పార్లమెంటును ఆహ్వానించిన కారణములను తెలియజేయవలెను.

**రాష్ట్రపతి విశేష ప్రసంగము.**

(2) ఉభయ సదనముల ప్రక్రియలను క్రమబద్ధము చేయు నియమావళి ద్వారా, రాష్ట్రపతి ప్రసంగములో నిర్దేశించబడిన విషయములను చర్చించుటకై కాలమును కేటాయించుటకు [2][* * *] చేయబడవలెను.

88. (1) ప్రతి మంత్రి మరియు భారతదేశ అటార్నీ జనరలును ఉభయ సదనములలో దేనియందైనను, ఆ సదనముల సంయుక్త ఉపవేశనములోనైనను, ఆయన సభ్యుడుగా పేర్కొనబడిన పార్లమెంటు యొక్క ఏ కమిటీలోనైనను మాట్లాడుటకును, అన్యథా వాటి కార్యకలాపములలో పాల్గొనుటకును హక్కు కలిగి యుండును, కాని ఈ అనుచ్ఛేదమును పురస్కరించుకొని ఆయన అందు ఓటు చేయుటకు హక్కు కలిగి యుండడు.

**సదనములను గురించి మంత్రులకు, అటార్నీ జనరలుకు గల హక్కులు.**

## పార్లమెంటు అధికారులు

89. (1) భారతదేశ ఉపరాష్ట్రపతి పదవిరీత్యా రాజ్యసభ యొక్క సభాపతియై యుండును.

**రాజ్యసభ యొక్క సభాపతి మరియు ఉప సభాపతి.**

(2) రాజ్యసభ వీలైనంత త్వరగా ఆ సభ యొక్క సభ్యులలో నొకరిని ఉప సభాపతిగా ఎంపిక చేసుకొనవలెను, మరియు ఉప సభాపతి పదవి ఖాళీయైనప్పుడెల్లను సభ మరొక సభ్యుని ఉప సభాపతిగా ఎంపిక చేసుకొనవలెను.

90. రాజ్యసభ యొక్క ఉప సభాపతి పదవియందున్న సభ్యుడు–

**ఉపసభాపతి పదవిని ఖాళీ చేయుట, ఆ పదవికి రాజీనామా ఇచ్చుట మరియు ఆ పదవి నుండి తొలగింపబడుట.**

(ఎ) సభలో సభ్యత్వమును కోల్పోయినచో తన పదవిని ఖాళీ చేయవలెను;

(బి) తన చేవ్రాలుతో సభాపతికి లేఖ వ్రాయుట ద్వారా ఎప్పుడైనను తన పదవికి రాజీనామా ఇవ్వవచ్చును; మరియు

(సి) సభలో అప్పుడున్న సభ్యులందరిలో అధిక సంఖ్యాకులచే పాస్ చేయబడిన ఆ సభ యొక్క తీర్మానము ద్వారా పదవి నుండి తొలగించబడవచ్చును:

అయితే ఖండము (సి) నిమిత్తమగు తీర్మానమేదియు, దానిని ప్రస్తావించవలెనను ఉద్దేశము కలదని నోటీసు ఇచ్చి కనీసము పదునాలుగు దినములు గడచిననే తప్ప, ప్రస్తావించబడరాదు.

91. (1) సభాపతి పదవి ఖాళీగా నున్నప్పుడు, లేక ఉపరాష్ట్రపతి రాష్ట్రపతిగ వ్యవహరించుచున్న, లేక రాష్ట్రపతి కృత్యములను నిర్వహించుచున్న ఏదేని కాలావధిలో సభాపతి పదవికి చెందిన కర్తవ్యములు ఉప

**సభాపతి పదవికి చెందిన కర్తవ్యములను నిర్వర్తించుటకు గాని, సభాపతిగా వ్యవహరించుటకుగాని, ఉపసభాపతి లేక ఇతర వ్యక్తికి గల అధికారము.**

---

1. సంవిధాన (ఒకటవ సవరణ) చట్టము, 1951 యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా ''ప్రతి అధివేశనము''కు బదులు ఉంచబడినది.
2. సంవిధాన (ఒకటవ సవరణ) చట్టము, 1951 ''మరియు ఆ సదనము యొక్క ఇతర కార్య కలాపముపై అట్టి చర్య యొక్క'' అను పదములు 18.6.1951 నుండి లుప్తము చేయబడినవి.

సభాపతిచే లేక ఉప సభాపతి పదవి కూడ ఖాళీగానున్నచో రాష్ట్రపతి అందు నిమిత్తము నియమించిన రాజ్యసభ సభ్యునిచే నిర్వర్తించబడవలెను.

(2) రాజ్యసభ యొక్క ఏదేని ఉపవేశనమునందు సభాపతి హాజరులోలేనప్పుడు ఉపసభాపతి, లేక ఉపసభాపతి కూడ హాజరులోలేనపుడు సభ యొక్క ప్రక్రియా నియమావళిచే నిర్ధారణ చేయబడు వ్యక్తి, లేక అట్టి ఏ వ్యక్తియు హాజరులోలేనప్పుడు సభచే నిర్ధారణ చేయబడు ఎవరేని ఇతర వ్యక్తి సభాపతిగ వ్యవహరించవలెను.

**సభాపతి లేక ఉప సభాపతిని పదవి నుండి తొలగించుటకు తీర్మానము పర్యాలోచించబడు చున్నప్పుడు ఆయన అధ్యక్షత వహించకుండుట.**

92. (1) ఉపరాష్ట్రపతిని పదవి నుండి తొలగించుటకు తీర్మానమేదైనను పర్యాలోచనలోనున్నప్పుడు సభాపతి, లేక ఉప సభాపతిని పదవి నుండి తొలగించుటకు తీర్మానమేదైనను పర్యాలోచనలో నున్నప్పడు ఉప సభాపతి, రాజ్యసభ యొక్క ఏదేని ఉపవేశనమునందు ఆయన హాజరైయున్నప్పటికిని, అధ్యక్షత వహించరాదు. అట్టి ప్రతి ఉపవేశనమునకు 91వ అనుచ్ఛేదములోని ఖండము (2) యొక్క నిబంధనలు, సందర్భానుసారముగ సభాపతి లేక ఉపసభాపతి హాజరులోలేనట్టి ఉపవేశనమునకు వర్తించునటులనే, వర్తించును.

(2) ఉపరాష్ట్రపతిని పదవి నుండి తొలగించుటకు తీర్మానమేదైనను రాజ్యసభలో పర్యాలోచనలోనున్నప్పుడు ఆ సభలో మాట్లాడుటకును అన్యథా దాని కార్యకలాపములలో పాల్గొనుటకును, సభాపతి హక్కు కలిగియుండును, కాని 100వ అనుచ్ఛేదములో ఏమియున్నప్పటికిని, అట్టి తీర్మానముపైగాని, ఆ కార్యకలాపములో ఏదేని ఇతర విషయము పైగాని, ఓటు చేయుటకు ఆయనకు బొత్తిగా హక్కు ఉండదు.

**లోక్‌సభ అధ్యక్షుడు మరియు ఉపాధ్యక్షుడు.**

93. లోక్‌సభ వీలైనంత త్వరితముగ ఆ సదనము యొక్క సభ్యులలో ఇద్దరిని క్రమముగా అధ్యక్ష, ఉపాధ్యక్ష పదవులకు ఎంపిక చేసుకొనవలెను మరియు అధ్యక్ష పదవిగాని, ఉపాధ్యక్ష పదవిగాని ఖాళీయైనప్పుడెల్లను, ఆ సభ మరొక సభ్యుని, సందర్భానుసారముగా అధ్యక్షుడుగ లేక ఉపాధ్యక్షుడుగ ఎంపిక చేసుకొనవలెను.

**అధ్యక్ష లేక ఉపాధ్యక్ష పదవిని ఖాళీ చేయుట, ఆ పదవికి రాజీనామా ఇచ్చుట మరియు ఆ పదవి నుండి తొలగింపబడుట.**

94. లోక్‌సభ యొక్క అధ్యక్ష లేక ఉపాధ్యక్ష పదవియందున్న సభ్యుడు:–

(ఎ) లోక్‌సభ లో సభ్యత్వమును కోల్పోయినచో తన పదవిని ఖాళీ చేయవలెను;

(బి) అట్టి సభ్యుడు అధ్యక్షుడైనచో ఉపాధ్యక్షునికి, ఉపాధ్యక్షుడైనచో అధ్యక్షునికి తన చేవ్రాలుతో లేఖ వ్రాయుట ద్వారా ఎప్పుడైనను తన పదవికి రాజీనామా ఇవ్వవచ్చును; మరియు

(సి) లోక్‌సభ లో అప్పుడు సభ్యులుగానున్న వారందరిలో అధిక సంఖ్యాకులచే పాస్ చేయబడిన ఆ సభ యొక్క తీర్మానము ద్వారా పదవి నుండి తొలగించబడవచ్చును:

అయితే ఖండము (సి) నిమిత్తము తీర్మానమేదియు దానిని ప్రస్తావించవలెనను ఉద్దేశము కలదని నోటీసు ఇచ్చి కనీసము పదునాల్గు దినములు గడచిననే తప్ప ప్రస్తావించబడరాదు:

అంతేగాక, లోక్‌సభ విఘటన జరిగినప్పుడెల్లను, అట్టి విఘటనంతరము జరుగు లోక్‌సభ మొదటి సమావేశమునకు అవ్యవహిత పూర్వము వరకు అధ్యక్షుడు తన పదవిని ఖాళీ చేయరాదు.

**అధ్యక్ష పదవికి చెందిన కర్తవ్యములను నిర్వర్తించుటకు గాని,**

95. (1) అధ్యక్ష పదవి ఖాళీగానున్నప్పుడు, ఆ పదవికి చెందిన కర్తవ్యములు ఉపాధక్షునిచే లేక ఉపాధ్యక్ష పదవి కూడా ఖాళీగానున్నచో, రాష్ట్రపతి అందునిమిత్తము నియమించు లోక్‌సభ సభ్యునిచే నిర్వర్తించబడవలెను.

(2) లోక్‌సభ యొక్క ఏదేని ఉపవేశమునందు అధ్యక్షుడు హాజరులోలేనప్పుడు ఉపాధ్యక్షుడు, లేక ఉపాధ్యక్షుడు కూడా హాజరులోలేనప్పుడు లోక్‌సభ యొక్క ప్రక్రియా నియమావళిచే నిర్ధారణ చేయబడు వ్యక్తి, లేక అట్టి ఏ వ్యక్తియు హాజరు లేనప్పుడు లోక్‌సభ చే నిర్ధారణ చేయబడు ఎవరేని ఇతర వ్యక్తి, అధ్యక్షుడుగా వ్యవహరించవలెను.

**అధ్యక్షుని లేక ఉపాధ్యక్షుని, పదవి నుండి తొలగించుటకు తీర్మానము పర్యాలోచింపబడు చున్నప్పుడు ఆయన అధ్యక్షత వహించకుండుట.**

96. (1) అధ్యక్షుని పదవి నుండి తొలగించుటకు తీర్మానమేదైనను పర్యాలోచనలోనున్నప్పుడు అధ్యక్షుడు, లేక ఉపాధ్యక్షుని పదవి నుండి తొలగించుటకు తీర్మానమేదైనను పర్యాలోచనలోనున్నప్పుడు ఉపాధ్యక్షుడు, లోక్‌సభ యొక్క ఏదేని ఉపవేశనమునందు ఆయన హాజరై యున్నప్పటికిని అధ్యక్షత వహించరాదు. అట్టి ప్రతి ఉపవేశనమునకు 95వ అనుచ్ఛేదములోని ఖండము (2) యొక్క నిబంధనలు సందర్భానుసారముగ, అధ్యక్షుడు లేక ఉపాధ్యక్షుడు హాజరులో లేనట్టి ఉపవేశనమునకు వర్తించునటులనే వర్తించును.

(2) అధ్యక్షుని పదవి నుండి తొలగించుటకు తీర్మానమేదైనను లోక్‌సభ లో పర్యాలోచనలో నున్నప్పుడు ఆ సభలో మాట్లాడుటకును అన్యథా దాని కార్యకలాపములో పాల్గొనుటకును అధ్యక్షుడు హక్కు కలిగియుండును. 100వ అనుచ్ఛేదములో ఏమియున్నప్పటికిని అట్టి తీర్మానముపై గాని అట్టి ఆ కార్యకలాపములో ఏదేని ఇతర విషయముపై గాని మొదటిసారి మాత్రమే ఓటు చేయుటకు ఆయన హక్కు కలిగియుండును, కాని వోట్లు సమానమై యుండునెడల ఓటు వేయుటకు ఆయనకు హక్కు ఉండదు.

**సభాపతి, ఉప సభాపతి మరియు అధ్యక్షుని, ఉపాధ్యక్షుని యొక్క జీతములు మరియు భత్యములు.**

97. రాజ్య సభ యొక్క సభాపతికిని, ఉపసభాపతికిని, మరియు లోక్‌సభ యొక్క అధ్యక్షునకును, ఉపాధ్యక్షునకును, క్రమముగా వారికి పార్లమెంటు శాసనము ద్వారా నియతము చేయు జీతములు, బత్తెములు చెల్లించబడవలెను మరియు తద్విషయమున నిబంధన చేయబడు వరకు, రెండవ అనుసూచిలో నిర్ధిష్టపరచవలసిన జీతములు మరియు బత్తెములు చెల్లించబడవలెను.

**పార్లమెంటు యొక్క సచివాలయము.**

98. (1) పార్లమెంటు యొక్క ప్రతి సదనమునకు వేరు వేరుగా సచివాలయ సిబ్బంది యుండవలెను:

అయితే ఈ ఖండములో నున్న దేదియు పార్లమెంటు యొక్క ఉభయసదనములకు చెందు ఉమ్మడి పదవులు సృష్టించుటను నివారించునదిగా అన్వయించబడరాదు.

(2) పార్లమెంటు యొక్క ఉభయ సదనముల సచివాలయ సిబ్బంది యొక్క భర్తీని మరియు ఆ సిబ్బందిలో నియమించబడిన వ్యక్తుల సేవా షరతులను, పార్లమెంటు శాసనము ద్వారా క్రమబద్ధము చేయవచ్చును.

(3) ఖండము (2) క్రింద పార్లమెంటుచే నిబంధన చేయబడు వరకు, రాష్ట్రపతి సందర్భానుసారముగ, లోక్‌సభ యొక్క అధ్యక్షునితో లేక రాజ్యసభ యొక్క సభాపతితోగాన సంప్రదించి లోక్‌సభకు లేక రాజ్య సభకు చెందిన సచివాలయ సిబ్బంది యొక్క భర్తీని, మరియు ఆ

సిబ్బందిలో నియమించబడిన వ్యక్తుల సేవా షరతులను క్రమబద్ధము చేయు నియమావళిని చేయవచ్చును మరియు అట్లు చేయబడిన నియమావళి సదరు ఖండము క్రింద చేయబడు ఏదేని శాసనము యొక్క నిబంధనలకు అధ్యధీనమై ప్రభావము కలిగియుండవలెను.

## కార్యకలాప నిర్వహణము

99. పార్లమెంటు ఉభయ సదనములలోని ప్రతిసభ్యుడు తన స్థానమును స్వీకరించుటకు పూర్వము రాష్ట్రపతి సమక్షమునగాని, తద్విషయమున ఆయనచే నియమించబడిన వ్యక్తి సమక్షమునగాని మూడవ అనుసూచిలో అందు నిమిత్తము పొందుపరచబడిన ప్రరూపముననుసరించి, ప్రమాణము లేక ప్రతిజ్ఞ చేసి దానిపై చేవ్రాలు చేయవలెను. **సభ్యులచే ప్రమాణము లేక ప్రతిజ్ఞ.**

100. (1) ఈ సంవిధానములో అన్యథా నిబంధింపబడినట్లు తప్ప ఉభయ సదనములలో దేని ఉపవేశనములోగాని, సదనముల సంయుక్త ఉపవేశనములోగాని, అన్ని ప్రశ్నలు, అధ్యక్షుడు లేక సభాపతి మినహా లేక సభాపతిగాగాని అధ్యక్షుడుగాగాని వ్యవహరించుచున్న వ్యక్తి మినహా హాజరై యుండి ఓటు చేయు సభ్యులలో అధిక సంఖ్యాకుల ఓట్లచే నిర్ధారణ చేయబడవలెను. **సదనములలో ఓటింగ్ ఖాళీలున్నప్పటిని వ్యవహరించుటకు సదనములకు గల అధికారము మరియు కోరము.**

సభాపతిగాని, అధ్యక్షుడుగాని, లేక ఆ స్థానములో వ్యవహరించుచున్న వ్యక్తిగాని, మొదటిసారి ఓటు చేయరాదు కాని ఓట్లు సమానమై యుండునెడల ఆయన నిర్ణాయక ఓటును కలిగి యుండవలెను మరియు అట్టి ఓటును వేయవలెను.

(2) పార్లమెంటు యొక్క ఏ సదనమునందైనను సభ్యత్వ స్థానంలలో ఖాళీ ఏదేని ఉన్నప్పటికిని ఆ సదనము వ్యవహరించు అధికారమును కలిగియుండును, మరియు పార్లమెంటు యొక్క ఏవేని కార్యకలాపములలో ఉపవిష్టుడగుటకు, లేక వోటు చేయుటకు, లేక అన్యథా పాల్గొనుటకు హక్కు కలిగియుండని ఎవరేని వ్యక్తి ఆ కార్యకలాపములలో ఉపవిష్టుడయ్యెననిగాని, వోటు చేసెననిగాని, అన్యథా పాల్గొనెననిగాని, ఆ తరువాత కనుగొనబడినప్పటికిని, ఆ కార్యక్రమములు మాన్యత కలిగినవై యుండును.

[1][ (3) పార్లమెంటు శాసనము ద్వారా అన్యథా నిబంధించునంత వరకు పార్లమెంటు ఉభయ సదనములలో దేని సమావేశమునకైనను కావలసిన కోరము ఆ సదనము యొక్క మొత్తము సభ్యుల సంఖ్యలో పదవ భాగమై యుండవలెను.

(4) ఒక సదనము యొక్క సమావేశము నందెప్పుడైనను కోరము లేనిచో, కోరము సమకూరు వరకు ఆ సమావేశమును స్థగితమొనర్చుట లేక సమావేశమును సస్పెండు చేయుట సభాపతి అధ్యక్షుని లేక అట్లు ఆ స్థానమున వ్యవహరించు వ్యక్తి యొక్క కర్తవ్యమై యుండవలెను.]

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976, పరిచ్ఛేదము 18 ద్వారా ఖండములు (3) మరియు (4) లుప్తము చేయబడినవి (తేదీ ఇంకనూ అధిసూచించబడలేదు.)

## సభ్యుల నిరర్హతలు

101. (1) ఒకే వ్యక్తి పార్లమెంటు యొక్క ఉభయ సదనములలోను సభ్యుడై యుండరాదు. ఉభయ సదనములకు సభ్యుడుగా ఎంపిక చేయబడిన వ్యక్తి, ఆ ఉభయ సదనములలో నొక దానియందలి స్థానమును ఖాళీ చేయుటకు పార్లమెంటుచే శాసనము ద్వారా నిబంధన చేయబడవలెను.

**స్థానములను ఖాళీ చేయుట.**

(2) ఒకే వ్యక్తి పార్లమెంటులోను [1][......] ఏదేని రాజ్య శాసనమండలి యొక్క ఒక సదనములోను సభ్యుడై యుండరాదు మరియు ఏ వ్యక్తియైనను పార్లమెంటుకును [2][రాజ్య] శాసనమండలి యొక్క ఒక సదనమునకును సభ్యుడిగ ఎంపిక చేయబడినచో ఆ రాజ్య శాసనమండలిలోని తన స్థానమునకు అంతకుముందు రాజీనామా ఇచ్చియుండిననే తప్ప, పార్లమెంటులో ఆ వ్యక్తి యొక్క స్థానము రాష్ట్రపతిచే చేయబడిన [3][నియమావళి] యందు నిర్దిష్టపరచబడు కాలావధి ముగియగనే ఖాళీ అగును.

(3) పార్లమెంటు యొక్క ఉభయ సదనములలో దేని సభ్యుడైనను–

(ఎ) [4][102వ అనుచ్ఛేదము యొక్క ఖండము (1) లేక ఖండము (2)లో] పేర్కొనబడిన నిరర్హతలలో దేనికైనను లోనైనచో, లేక

[5][(బి) సందర్భానుసారముగ సభాపతికి, లేక అధ్యక్షునికి తన చేవ్రాలుతో లేఖ వ్రాయుటద్వారా తన స్థానమునకు రాజీనామా ఇచ్చుటయు, అట్టి రాజీనామాను సందర్భానుసారముగ సభాపతి లేక అధ్యక్షుడు స్వీకరించుటయు జరిగినచో]

అటు పై అతని స్థానము ఖాళీ అగును:

[6][అయితే ఉప-ఖండము (బి)లో నిర్దేశించబడిన ఏదేని రాజీనామా విషయములో సందర్భానుసారముగ, సభాపతి లేక అధ్యక్షుడు తనకు అందిన సమాచారమునుబట్టి కాని, అన్యథాకాని, మరియు తాను సబబని తలచు పరిశీలన జరిపిన పిమ్మట, ఆ రాజీనామా

---

1. ''ఒకటవ అనుసూచి యొక్క భాగము – ఏ, లేక భాగము – బీలో నిర్దిష్టపరచబడిన'' అనుపదములు మరియు అక్షరములు సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా 1.11.1956 నుండి వదిలివేయబడినవి.
2. అదే చట్టము ద్వారా ''అట్టి రాజ్యము'' అను పదములకు బదులు ఉంచబడినవి.
3. ఏకకాల సభ్యత్వ నిషేధ నియమములు, 1950 చూడుము, న్యాయ మంత్రిత్వ శాఖ ప్రచురించిన అధిసూచన నెం.ఎఫ్.46/50–సి, తేదీ 26.1.1950, ఇండియా గెజెట్, అసాధారణ పేజీ 678.
4. సంవిధాన (యాబది రెండవ సవరణ) చట్టము, 1985 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ''అనుచ్ఛేదము 102 యొక్క ఖండము (1)''కి బదులుగా 1.3.1985 తేదీ నుండి ఉంచబడినది.
5. సంవిధాన (ముప్పది మూడవ సవరణ) చట్టము, 1974 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ఉప-ఖండము (బి)కి బదులుగా 19.05.1974 నుండి ఉంచబడినది.
6. సంవిధాన (ముప్పది మూడవ సవరణ) చట్టము, 1974 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 19.05.1974 నుండి చొప్పించబడినది.

స్వచ్ఛందముగా చేసినదికాదని, లేక నిజమైనది కాదని, అభిప్రాయపడినచో ఆయన ఆ రాజీనామాను స్వీకరించరాదు.]

(4) పార్లమెంటు యొక్క ఉభయ సదనములలో దేని సభ్యుడైనను ఆ సదనము యొక్క అనుజ్ఞ లేకుండా, దాని సమావేశములన్నింటికి అరువది దినముల కాలావధి వరకు హాజరు కానిచో, ఆయన స్థానము ఖాళీయైనట్లు ఆ సదనము ప్రఖ్యానించవచ్చును:

అయితే, సదరు అరువది దినముల కాలావధిని పరిగణన చేయుటలో, ఆ సదనము అధివేశనావసానము చేయబడియున్న, లేక వరుసగ నాలుగు దినములకు మించి స్థగితమొనర్పబడియున్న (వాయిదావేయబడియున్న) ఏదేని కాలావధిని లెక్కింపరాదు.

**సభ్యత్వమునకు నిరర్హతలు.**

102. (1) ఒక వ్యక్తి పార్లమెంటు యొక్క ఉభయ సదనములలో సభ్యత్వమునకు దేనికైనను సభ్యుడుగ ఎంపిక చేయబడుటకు, మరియు అట్టి సభ్యుడుగ నుండుటకు ఈ క్రింది పరిస్థితులలో నిరర్హుడగును:-

[1] [(ఎ) భారత ప్రభుత్వము క్రిందగాని, ఏదేని రాజ్య ప్రభుత్వము క్రిందగాని, లాభాయుతమైన ఏ పదవియందున్న వ్యక్తికి నిరర్హత కలుగదని పార్లమెంటుచే శాసనము ద్వారా ప్రఖ్యానించబడినచో ఆ పదవి మినహా అన్యమైన ఏదేని లాభాయుత పదవియందు అతడున్నచో;]

(బి) అతడు అస్వస్థ చిత్తుడైయుండి, అట్లని సమర్థ న్యాయస్థానముచే ప్రఖ్యానింపబడినచో;

(సి) అతడు విముక్తికాని దివాలాదారైనచో;

(డి) అతడు భారతదేశ పౌరుడుకానిచో లేక విదేశీ రాజ్యము యొక్క పౌరసత్వమును తనంత తాను ఆర్జించియున్నచో, లేక ఏదేని విదేశీ రాజ్యము పట్ల నిష్ఠను, లేక అనుషక్తిని కలిగియుండుటకు ఒప్పుకొనియున్నచో;

(ఇ) పార్లమెంటుచే చేయబడిన ఏదేని శాసనము ద్వారా గాని, దాని క్రింద గాని అతడు అట్లు నిరర్హుడుగా చేయబడినచో:

[2][**విశదీకరణ:-** ఈ ఖండము నిమిత్తము], ఒక వ్యక్తి సంఘము యొక్క, లేక ఏదేని రాజ్యము యొక్క మంత్రిగాని నున్న కారణమునుబట్టియే భారత ప్రభుత్వము క్రింద, లేక ఏదేని అట్టి రాజ్య ప్రభుత్వము క్రింద లాభాయుత పదవియందున్నట్లు భావింపబడరాదు.

[1][(2) పదియవ అనుసూచి క్రింద ఒక వ్యక్తి అట్లు నిరర్హుడైనచో అతడు పార్లమెంటు యొక్క ఉభయ సభలలో దేనిలోనైనను సభ్యునిగా ఉండుటకు నిరర్హుడగును.]

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 పరిచ్ఛేదం 19 ద్వారా బదులుగా ఉంచబడినది. (తేదీ ఇంకనూ అధిసూచించబడలేదు)
2. సంవిధాన (యాబది రెండవ సవరణ) చట్టము, 1985 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా ''(2) ఈ అనుచ్ఛేదపు నిమిత్తము'' అనుదానికి బదులుగా 1.3.1985 నుండి ఉంచబడినది.

[2][103.(1) పార్లమెంటు యొక్క ఉభయ సదనములలో దేని సభ్యుడైనను 102వ అనుచ్ఛేదపు ఖండము (1)లో పేర్కొనబడిన నిరర్హతులలో దేనికైనను లోనైనాడాయను ప్రశ్న ఏదైన ఉత్పన్నమైనచో, ఆ ప్రశ్న రాష్ట్రపతి నిర్ణయమునకై నిర్దేశింపబడవలెను, మరియు రాష్ట్రపతి యొక్క నిర్ణయము అంతిమమైనదై యుండును. **సభ్యుల నిరర్హతలకు సంబంధించిన ప్రశ్నలపై నిర్ణయము.**

(2) అట్టి ఏదేని ప్రశ్నపై ఏదేని నిర్ణయమును చేయుటకు పూర్వము, రాష్ట్రపతి ఎన్నికల కమీషను యొక్క అభిప్రాయమును గైకొని అట్టి అభిప్రాయానుసారము వ్యవహరించవలెను.॰

104. ఏ వ్యక్తియైనను, తాను 99వ అనుచ్ఛేదములోని అవసరమును పాటించుటకు పూర్వము, లేక పార్లమెంటు యొక్క ఉభయ సదనములలో దేని సభ్యత్వమునకైనను తాను అర్హుడుకాడని గాని, నిరర్హుడైనాడనిగాని, పార్లమెంటుచే చేయబడిన ఏదేని శాసనము యొక్క నిబంధనల ద్వారా తాను పార్లమెంటు యొక్క ఏ సదనమునందును సభ్యుడుగ ఉపవిష్టుడగుట నుండి, లేక ఓటు వేయుట నుండి నిషేధింపబడినాడనిగాని, తెలిసియుండియు అట్లు ఉపవిష్టుడైనచో లేక ఓటు వేసినచో, ఆయన ఆ విధముగా ఉపవిష్టుడైన, లేక ఓటు వేసిన ప్రతిదినమునకు అయిదువందల రూపాయమల చొప్పున శాస్తికి పాత్రుడగును దానిని సంఘమునకు బాకీయున్న ఋణమువలె ఆయన నుండి వసూలు చేయవలెను. **99వ అనుచ్ఛేదము క్రింద ప్రమాణము, లేక ప్రతిజ్ఞ చేయుటకు పూర్వము గాని, అర్హత లేనప్పుడు గాని, నిరర్హుడైనప్పుడు గాని, ఉప విష్టుడై నందుకు మరియు ఓటు చేసి నందుకు శాస్తి.**

## పార్లమెంటు మరియు దాని సభ్యులకుగల అధికారములు, విశేషాధికారములు మరియు ఉన్ముక్తతలు

105. (1) ఈ సంవిధాన నిబంధనలకును, పార్లమెంటు యొక్క ప్రక్రియను క్రమబద్ధము చేయు నియమములకును, స్థాయీ ఉత్తరువులకును అధ్యధీనమై పార్లమెంటులో వాక్స్వాతంత్ర్యము ఉండవలెను. **పార్లమెంటు సదనములకు, దాని సభ్యులకు, కమిటీలకు గల అధికారములు, విశేషాధికారములు మున్నగునవి.**

(2) పార్లమెంటు సభ్యుడెవరైనను, పార్లమెంటులో, లేక దానికి చెందిన ఏదేని కమిటీలో, తాను చెప్పిన ఏ విషయమును గూర్చి గాని, తాను ఇచ్చిన ఏ ఓటును గూర్చిగాని, ఏ న్యాయస్థానమునందును, ఎట్టి చర్యలకును పాత్రుడుకారాదు. పార్లమెంటు యొక్క ఉభయ సదనములలో దేని ప్రాధికారముచేగాని, ప్రాధికారము క్రిందిగాని, ఏదేని రిపోర్టు పత్రము, ఓట్లు లేక కార్యకలాపముల యొక్క ప్రచురణ విషయమున ఏ వ్యక్తియు అట్లు పాత్రుడు కారాదు.

[3][(3) ఇతర విషయములలో పార్లమెంటులోని ప్రతిసదనము యొక్కయు, ప్రతి కమిటీల యొక్కయు, సదనమునందలి సభ్యులయొక్కయు, అధికారములు, విశేషాధికారములు మరియు ఉన్ముక్తతలు ఆయా సమయములందు పార్లమెంటుచే శాసనము ద్వారా నిర్వచింపబడునట్లు

---

1. అదే చట్టము ద్వారా 1.3.1985 నుండి చొప్పించబడినది.
2. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 20వ సవరణ పరిచ్ఛేదము ద్వారా ఆదిలోనున్న దానికి బదులు 3.1.1977 నుండి క్రొత్త అనుచ్ఛేదము ఉంచబడి, తిరిగి సంవిధాన (నలుబది నాల్గవ సవరణ) చట్టము, 1978 యొక్క 14వ పరిచ్ఛేదము ద్వారా దానికి బదులు 20.6.1979 నుండి ఉంచబడినది.
3. సంవిధానము (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 15వ పరిచ్ఛేదము ద్వారా కొన్ని పదములకు బదులుగా 20.6.1979 నుండి ఉంచబడినది.

ఉండవలెను, మరియు అట్లు నిర్వచింపబడువరకు అవి సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 15వ పరిచ్ఛేదము అమలులోనికి వచ్చుటకు అవ్యవహిత పూర్వము ఆ సదనమునకును, దాని సభ్యులకును మరియు కమిటీలకును ఏవియుండునో, అవే అయివుండవలెను.]

(4) ఖండములు (1), (2) మరియు (3)ల లోని నిబంధనలు పార్లమెంటు యొక్క సభ్యులకు వర్తించునటులనే, ఈ సంవిధానమును పురస్కరించుకొని పార్లమెంటు యొక్క ఏదేని సదనములోగాని, దానికి చెందిన ఏదేని కమిటీలోగాని, మాట్లాడుటకును, అన్యథా దాని కార్యకలాపములలో పాల్గొనుటకు, హక్కుగల వ్యక్తుల విషయమున కూడా వర్తించవలెను.

**సభ్యుల జీతములు, బత్తెములు.**

106. పార్లమెంటు యొక్క ఉభయ సదనముల సభ్యులు, పార్లమెంటుచే ఆయా, సమయములందు శాసనము ద్వారా నిర్ధారణ చేయబడు జీతములను మరియు బత్తెములను, పొందుటకు హక్కు కలిగియుందురు. తద్విషయమున అట్లు నిబంధన చేయబడువరకు, ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము భారత అధినివేశము యొక్క సంవిధాన సభకు చెందిన సభ్యులకు వర్తించునట్టి రేట్లు చొప్పున మరియు అట్టి షరతుల పైన బత్తెములను పొందుటకు వారు హక్కు కలిగియుందురు.

## శాసన నిర్మాణ ప్రక్రియ

**బిల్లులను ప్రవేశపెట్టుటకును, పాస్ చేయుటకును నిబంధనలు.**

107. (1) 109 మరియు 117 అనుచ్ఛేదములలోని ధన సంబంధమైన బిల్లులను మరియు ఇతర విత్తీయ బిల్లులను గూర్చిన నిబంధనలకు అధ్యధీనమై, ఏ బిల్లయినను పార్లమెంటు యొక్క ఉభయ సదనములలో దేనియందైనను ఆరంభింపబడవచ్చును.

(2) 108 మరియు 109 అనుచ్ఛేదములలోని నిబంధనలకు అధ్యధీనమై, ఏ బిల్లయినను సవరణ లేకుండగాని, పార్లమెంటు యొక్క ఉభయ సదనములచే అంగీకరించబడిన సవరణలతో మాత్రమేగాని, ఆ ఉభయ సదనములచే అంగీకరించబడిననే తప్ప, పార్లమెంటు యొక్క ఉభయ సదనములచే పాస్ చేయబడినట్లు భావింపబడరాదు.

(3) పార్లమెంటులో పెండింగులోనున్న బిల్లు పార్లమెంటు సదనముల అధివేశనావసాన కారణమును బట్టి వ్యపగతము (కాలగతి) కారాదు.

(4) లోక్‌సభ చే పాస్ చేయబడక రాజ్యసభలో పెండింగులోనున్న బిల్లు, లోక్‌సభ విఘటన చేయబడినను, వ్యపగతము(కాలగతి) కారాదు.

(5) లోక్‌సభ లో పెండింగులోనున్న, లేక లోక్‌సభ చే పాస్ చేయబడి రాజ్యసభలో పెండింగులోనున్న బిల్లు, 108వ అనుచ్ఛేదము యొక్క నిబంధనలకు అధ్యధీనమై, లోక్‌సభ విఘటన చేయబడినప్పుడు వ్యపగతము కావలెను.

**కొన్ని సందర్భములలో ఉభయ సదనముల సంయుక్త ఉప వేశనము.**

108. (1) ఏదేని బిల్లు ఒక సదనముచే పాస్ చేయబడిన రెండవ సదనమునకు పంపబడిన తరువాత–

(ఎ) ఆ బిల్లు రెండవ సదనముచే త్రోసివుచ్చబడినచో; లేక

(బి) ఆ బిల్లులో చేయవలసిన సవరణలను గూర్చి ఆ సదనములు తుదకు ఏకీభవించనిచో; లేక

(సి) ఆ బిల్లు రెండవ సదనమునకు అందిన తేదీ నుండి ఆ సదనముచే పాస్ చేయబడక ఆరు మాసములకు మించిన కాలము గడిచినచో, లోక్‌సభ విఘటన చేయబడిన కారణమును బట్టి ఆ బిల్లు వ్యపగతమై యుండిననే తప్ప, ఆ బిల్లును సమాలోచించి దానిపై ఓటు చేయుటకు ఉభయసదనములను సంయుక్త ఉపవేశనమున సమావేశమగుటకై ఆహ్వానించు తన ఉద్దేశమును, రాష్ట్రపతి ఆ సదనములు ఉపవిష్టమై యుండినచో వాటికి సందేశము ద్వారాను, అవి ఉపవిష్టమైయుండనిచో బహిరంగ అధిసూచన ద్వారాను అధిసూచించవచ్చును:

అయితే ఈ ఖండములో నున్న దేదియు ధనసంబంధమైన బిల్లుకు వర్తించదు.

(2) ఖండము (1)లో నిర్దేశింపబడిన ఆరు మాసముల కాలావధిని లెక్కించుటలో, ఆఖండము యొక్క ఉప–ఖండము (సి)లో నిర్దేశింపబడిన సదనము అధివేశనావసానము చేయబడియున్న, లేక వరుసగ నాలుగు దినములకు మించి స్థగితమొనర్చబడియున్న, ఏదేని కాలావధిని లెక్కింపరాదు.

(3) రాష్ట్రపతి ఖండము (1) క్రింద సదనములను సంయుక్త ఉపవేశనమున సమావేశమగుటకు ఆహ్వానించు తన ఉద్దేశమును అధిసూచించిన యెడల ఆ బిల్లు విషయమును ఏ సదనముగాని ముందుకు సాగరాదు. కాని రాష్ట్రపతి తాను అధిసూచన చేసిన తేదీ తరువాత ఎప్పుడైనను ఆ ఆధిసూచనలో నిర్దిష్టపరచబడిన ప్రయోజనము కొరకు సంయుక్త ఉపవేశనమున సమావేశమగుటకు ఉభయ సదనములను ఆహ్వానింపవచ్చును. ఆయన అట్లు చేసినచో ఆ సదనములు తదనుసారము సమావేశము కావలెను.

(4) ఉభయ సదనములకు చెందిన సభ్యులలో ఆ సదనముల సంయుక్త ఉపవేశనములో హాజరైయుండి ఓటు చేయు మొత్తము సభ్యులలో అధిక సంఖ్యాకులచే, ఆ బిల్లు ఆ సంయుక్త ఉపవేశనములో అంగీకరింపబడిన సవరణలు ఏవైన ఉన్నచో వాటితో సహా పాస్ చేయబడినచో, అది ఈ సంవిధాన నిమిత్తము ఉభయ సదనములచే పాస్ చేయబడినట్లు భావింపబడవలెను:

అయితే, సంయుక్త ఉపవేశనములో–––

(ఎ) ఆ బిల్లు ఒక సదనముచే పాస్ చేయబడి రెండవ సదనముచే సవరణలతో పాస్ చేయబడక, దానిని ఆరంభించిన సదనమునకు త్రిప్పి పంపబడియుండినచో, అట్లు పంపబడుటలో జరిగిన ఆలస్యము వలన ఆవశ్యకమైన సవరణలు ఏవేని ఉన్నచో అవి తప్ప, ఏ ఇతర సవరణనుగాని ఆ బిల్లుకు ప్రతిపాదించరాదు;

(బి) ఆ బిల్లు సవరణలతో అట్లు పాస్ చేయబడి త్రిప్పి పంపబడియుండినచో పూర్వోక్తమైన సవరణలు మాత్రమే ఆ బిల్లుకు ప్రతిపాదించబడవలెను మరియు ఏ విషయములను గూర్చి సదనములు ఏకీభవించలేదో వాటి సుసంగతమగు ఇతర సవరణలు ప్రతిపాదించబడవచ్చును;

ఈ ఖండము క్రింద ఏ సవరణలు గ్రాహ్యములగునను (అనుమతించబడునను) విషయమును గూర్చి, అధ్యక్షత వహించు వ్యక్తి యొక్క నిర్ణయము అంతిమమై యుండును.

(5) సంయుక్త ఉపవేశనమున సమావేశమగుటకు సదనములను ఆహ్వానించు ఉద్దేశమును రాష్ట్రపతి అధిసూచించిన తరువాత లోక్‌సభ యొక్క విఘటన జరిగినప్పటికిని, ఈ అనుచ్ఛేదము క్రింద సంయుక్త ఉపవేశనము జరుపబడవచ్చును, అందులో ఆ బిల్లు పాస్ చేయబడవచ్చును.

**ధన సంబంధమైన బిల్లులను గూర్చిన విశేష ప్రక్రియ.**

109. (1) ధన సంబంధమైన బిల్లు రాజ్యసభలో ప్రవేశపెట్టబడరాదు.

(2) ధన సంబంధమైన బిల్లును లోక్‌సభ పాస్ చేసిన పిమ్మట దానిని రాజ్యసభ సిఫారసుల కొరకు పంపవలెను. రాజ్యసభ ఆ బిల్లు తనకు అందిన తేదీ నుండి పదునాలుగు దినముల కాలావధిలో, దానిని తన సిఫారసులతో లోక్‌సభ కు త్రిప్పి పంపవలెను. అటుపై రాజ్యసభ చేసిన సిఫారసులను అన్నింటినిగాని, వాటిలో వేటినిగాని, లోక్‌సభ స్వీకరించవచ్చును. లేక త్రోసివుచ్చ వచ్చును.

(3) రాజ్యసభ యొక్క సిఫారసులలో వేటినైనను లోక్‌సభ స్వీకరించినచో ఆ ధనసంబంధమైన బిల్లు రాజ్యసభచే సిఫారసు చేయబడి లోక్‌సభ చే స్వీకరించబడిన సవరణలతో ఉభయ సదనములచే పాస్ చేయబడినట్లు భావింపబడవలెను.

(4) రాజ్యసభ యొక్క సిఫారసులలో వేటిని కూడా లోక్‌సభ స్వీకరించనిచో, ఆ ధన సంబంధమైన బిల్లు లోక్‌సభ పాస్ చేయబడిన రూపములో రాజ్యసభచే సిఫారసు చేయబడిన సవరణలలో ఏవియు లేకుండ, ఉభయ సదనములచే పాస్ చేయబడినట్లు భావింపబడవలెను.

(5) లోక్‌సభ చే పాస్ చేయబడి రాజ్యసభ సిఫారసుల కొరకు పంపబడినచో ధనసంబంధమైన బిల్లు, సదరు పదునాలుగు దినముల కాలావధిలో లోక్‌సభ కు త్రిప్పిపంపబడినచో, ఆ బిల్లు లోక్‌సభచే పాస్ చేయబడిన రూపములో సదరు కాలావధి ముగియగనే ఉభయసదనములచే పాస్ చేయబడినట్లు భావింపబడవలెను.

**ధన సంబంధమైన బిల్లుల నిర్వచనము.**

110. (1) ఏదేని బిల్లులో ఈ క్రింది విషయములన్నింటిని గూర్చిన, లేక వాటిలో దేనినైనను గూర్చిన నిబంధనలు మాత్రమే ఉన్నచో, ఆ బిల్లు ఈ అధ్యాయపు నిమిత్తము ధనసంబంధమైన బిల్లుగ భావింపబడవలెను; అవి ఏవనగా:–

(ఎ) ఏదేని పన్ను యొక్క విధింపు, ఉత్సాదన (రద్దు), పరిహరణ, మార్పు లేక క్రమబద్ధీకరణ;

(బి) భారత ప్రభుత్వముచే అప్పు చేయబడుటనుగాని, ఏదేని హామీ ఇవ్వబడుటనుగాని, క్రమబద్ధము చేయుట లేక భారత ప్రభుత్వముచే వహింపబడిన, లేక వహింపబడగల విత్తసంబంధమైన ఏవేని బాధ్యతలను గూర్చిన శాసనమును సవరించుట;

(సి) భారత సంచిత నిధి, లేక ఆకస్మికతానిధి యొక్క అభిరక్ష, అట్టి ఏదేని నిధికి ధనమును చెల్లించుట, లేక దాని నుండి ధనమును తిరిగి తీసుకొనుట;

(డి) భారత సంచిత నిధి నుండి ధనమును వినియోజనము చేయుట;

(ఇ) ఏదేని వ్యయమును భారత సంచితనిధిపై ప్రభారమైన వ్యయముగ ప్రఖ్యానించుట, లేక అట్టి ఏదేని వ్యయము యొక్క మొత్తమును పెంచుట;

(ఎఫ్) భారత సంచిత నిధికి లేక భారత ప్రభుత్వ ఖాతా లేక ధనమును స్వీకరించుట లేక అట్టి ధనము యొక్క అభిరక్ష లేక విడుదల లేక సంఘము యొక్క లేక ఏదేని రాజ్యము యొక్క ఖాతాల ఆడిటు; లేక

(జి) (ఎ) నుండి (ఎఫ్) వరకు గల ఉప-ఖండములలో నిర్దిష్ట పరచబడిన విషయములలో దేనికైనను ఆనుషంగికమైన ఏదేని విషయము.

(2) జుర్మానాలను లేక ధనసంబంధమైన ఇతర శాస్తులను విధించుట కొరకుగాని, లైసెన్సు ఫీజు, లేక చేసిన సేవకైన ఫీజును అభ్యర్థించుట, లేక చెల్లించుట కొరకుగాని, నిబంధనలు కలిగియున్నదను కారణ మాత్రమున, లేక ఎవరేని ప్రాధికారిచే, లేక ఏదేని స్థానిక నికాయముచే స్థానిక ప్రయోజనములకు గాను ఏదేని పన్ను విధించబడుట, ఉత్పాదన చేయబడుట, పరిహరించబడుట, మార్చబడుట లేక క్రమబద్ధము చేయబడుట కొరకు నిబంధనలు కలిగియున్నదను కారణ మాత్రమున, ఏదేని బిల్లు ధన సంభంధమైన బిల్లుగ భావింపబడరాదు.

(3) ఏదేని బిల్లు, ధనసంబంధమైన బిల్లు అగునా, కాదా అను ప్రశ్న ఉత్పన్నమైనచో దానిపై లోకసభాధ్యక్షుని నిర్ణయము అంతిమమై యుండును.

(4) ధనసంబంధమైన ప్రతి బిల్లుపై, 109వ అనుచ్ఛేదము క్రింద రాజ్యసభకు పంపబడినప్పుడును, 111వ అనుచ్ఛేదము క్రింద రాష్ట్రపతి అనుమతి కొరకు సమర్పించబడినప్పుడు, అది ధనసంబంధమైన బిల్లు అని లోకసభాధ్యక్షునిచే సంతకము చేయబడిన ధృవీకరణ పత్రము ఉండవలెను.

**బిల్లులకు అనుమతి.**

111. పార్లమెంటు సదనములచే ఏదేని బిల్లు పాస్ చేయబడినప్పుడు, అది రాష్ట్రపతికి సమర్పించబడవలెను. రాష్ట్రపతి ఆ బిల్లుకు అనుమతినిచ్చుచున్నాననిగాని, అనుమతిని నిలుపు చేయుచున్నాననిగాన, ప్రఖ్యానించవలెను:

అయితే రాష్ట్రపతి, ఏదేని బిల్లు అనుమతి కొరకు తనకు సమర్పింపబడిన పిమ్మట అది ధన సంబంధమైన బిల్లు కానిచో, సదనములు ఆ బిల్లునుగాని, దానిలోని ఏవైనా నిర్దిష్ట నిబంధనలనుగాని, పున: పర్యాలోచించవలెననియు, ప్రత్యేకముగ, తన సందేశములో తాను సిఫారసు చేయు ఏవేని సవరణలను ప్రవేశపెట్టుట వాంఛనీయమాయని పర్యాలోచించ వలెననియు, కోరు సందేశముతో సహా ఆబిల్లును సాధ్యమైనంత త్వరితముగా సదనములకు త్రిప్పి పంపవచ్చును. బిల్లు అట్లు త్రిప్పి పంపబడినప్పుడు, సదనములు ఆ బిల్లును తదనుసారము పున: పర్యాలోచించవలెను, మరియు ఆ

బిల్లు సవరణతోగాని, సవరణ లేకుండాగాని, సదనములచే మరల పాస్ చేయబడి, రాష్ట్రపతి అనుమతి కొరకు సమర్పించబడినచో, రాష్ట్రపతి ఆ బిల్లుకు తన అనుమతిని నిలుపు చేయరాదు.

## విత్తీయ విషయములలో ప్రక్రియ

112. (1) రాష్ట్రపతి, ప్రతి విత్తీయ సంవత్సరము విషయమున ఆ సంవత్సరమునకు అంచనా వేయబడిన భారత ప్రభుత్వ ఆదాయ వ్యయముల వివరణను పార్లమెంటు ఉభయ సదనముల సమక్షమున ఉంచు ఏర్పాటు చేయించవలెను. ఆ వివరణ ఈ భాగములో ''వార్షిక విత్తీయ వివరణ'' అని నిర్దేశించబడినది. **వార్షిక విత్తీయ వివరణ.**

(2) వార్షిక విత్తీయ వివరణలో పొందుపరచబడిన వ్యయము యొక్క అంచనాలలో–

(ఎ) భారత సంచిత నిధిపై ప్రభారమైన వ్యయము అని ఈ సంవిధానముచే తెలుపబడిన వ్యయమును భరించుటకు కావలసిన డబ్బులను; మరియు

(బి) భారత సంచిత నిధి నుండి చేయుటకు ప్రతిపాదించబడిన ఇతర వ్యయమును భరించుటకు కావలసిన డబ్బులను, వేరువేరుగా తెలుపవలెను, మరియు రెవెన్యూ ఖాతా నుండి చేయబడిన వ్యయమును ఇతర వ్యయము నుండి వేరుపరచవలెను.

(3) ఈ క్రింది వ్యయము భారత సంచిత నిధిపై ప్రభారమైన వ్యయమైయుండును:–

(ఎ) రాష్ట్రపతి యొక్క ఉపలబ్ధులు, బత్తెములు, మరియు ఆయన పదవికి సంబంధించిన ఇతర వ్యయము;

(బి) రాజ్యసభ సభాపతి, మరియు ఉపసభాపతి యొక్క లోక్‌సభ అధ్యక్షుని మరియు ఉపాధ్యక్షుని యొక్క జీతములు మరియు బత్తెములు;

(సి) వడ్డీ, ఋణోన్మోచన భారములు (ఋణ విమోచనా నిధి) మరియు విమోచన భారములతో సహా భారత ప్రభుత్వము తీర్చవలసిన ఋణభారములు మరియు అప్పులు సేకరించుటకును, ఋణము చెల్లించు ఏర్పాటుకును, విమోచనకును సంబంధించిన యితర వ్యయము;

(డి)(i) సర్వోన్నత న్యాయస్థానము యొక్క న్యాయాధీశులకు, లేక వారికి సంబంధించి చెల్లించవలసిన జీతములు, బత్తెములు మరియు పింఛనులు;

(ii) ఫెడరల్ న్యాయస్థానము యొక్క న్యాయాధీశులకు, లేక వారికి సంబంధించి చెల్లించవలసిన పింఛనులు;

(iii) భారతదేశ రాజ్యక్షేత్రములో చేరిన ఏదేని ప్రాంతమునకు సంబంధించిన అధికారితను వినియోగించు, లేక సంవిధాన ప్రారంభమునకు పూర్వము [1] [భారతదేశ

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''ఒకటవ అనుసూచి యొక్క భాగము – ఏ లో నిర్దిష్టపరచబడిన రాజ్యపు స్థానంలో నుండిన ప్రావిన్సు''కు బదులుగా 1.11.1956 నుండి ఉంచబడినది.

అధినివేశము నందుండిన ఏదేని గవర్నరు ప్రావిన్సు] విషయమున ఎప్పుడైనను అధికారితను వినియోగించిన ఏదేని ఉన్నత న్యాయస్థానము యొక్క న్యాయాధీశులకు, లేక వారికి సంబంధించి చెల్లించవలసిన పింఛనులు;

(ఇ) భారతదేశ కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలుకు లేక ఆయనకు సంబంధించి చెల్లించవలసిన జీతములు, బత్తెములు మరియు పింఛను;

(ఎఫ్) ఏదేని న్యాయస్థానము యొక్క, లేక మధ్యవర్తిత్వ ట్రిబ్యునలు యొక్క ఏదేని తీర్పుగాని, డిక్రీగాని, అధినిర్ణయముగాని అమలుపరచుటకు కావలసిన ఏదేని డబ్బు;

(జి) అట్లు ప్రభారమైనదని ఈ సంవిధానముచే గాని, శాసనము ద్వారా పార్లమెంటుచే గాని, ప్రఖ్యానింపబడిన ఏదేని ఇతర వ్యయము.

**అంచనాలను గూర్చి పార్లమెంటులో అనుసరించవలసిన ప్రక్రియ.**

113. (1) భారత సంచిత నిధిపై ప్రభారమైన వ్యయమునకు సంబంధించినంతమేరకు, ఆ అంచనాలు పార్లమెంటు యొక్క ఓటుకు సమర్పించబడరాదు. కాని అట్టి ఏవేని అంచనాలను గూర్చి పార్లమెంటు యొక్క ఏ సదనమునందైనను చర్చించుటను ఈ ఖండములో నున్నదేదియు నివారించునదిగా అన్వయింపబడరాదు.

(2) ఇతర వ్యయమునకు సంబంధించినంతవరకు సదరు అంచనాలు, అనుదానములకై చేయబడు అభ్యర్థనల రూపములో లోక్‌సభ కు సమర్పించవలెను. ఏదేని అభ్యర్థనలకు అనుమతినిచ్చుటకుగాని, అనుమతిని నిరాకరించుటకుగాని, లేక ఏదేని అభ్యర్థనయందు నిర్దిష్టపరచబడిన మొత్తమును తగ్గించి ఆ అభ్యర్థనకు అనుమతినిచ్చుటకు గాని లోక్‌సభ కు అధికారము ఉండును.

(3) రాష్ట్రపతి సిఫారసు పై తప్ప, అనుదానమునకై ఏ అభ్యర్థనయు చేయబడరాదు.

**వినియోజన బిల్లులు.**

114. (1) 113వ అనుచ్ఛేదము క్రింద లోక్‌సభ చే అనుదానములు చేయబడిన తరువాత వీలైనంత త్వరితముగా భారత సంచిత నిధి నుండి ఈ క్రింది వాటికి కాలవలసిన ధనములన్నింటి వినియోజనము గూర్చి నిబంధించుటకైన బిల్లు ప్రవేశ పెట్టబడవలెను–

(ఎ) లోక్‌సభ చే అట్లు చేయబడిన అనుదానములు; మరియు

(బి) భారత సంచిత నిధిపై ప్రభారమైన వ్యయము; కాని ఇది అంతకు పూర్వమే పార్లమెంటు సమక్షమున ఉంచబడిన వివరణములో తెలుపబడిన మొత్తమునకు మించి ఏ సందర్భములోను ఉండరాదు.

(2) అట్టి ఏ బిల్లుకును, అట్లు చేయబడిన ఏదేని అనుదానపు మొత్తమును హెచ్చించు, లేక తగ్గించు, లేక దాని గమ్యమును మార్చు, లేక భారత సంచిత నిధిపై ప్రభారమైన ఏదేని వ్యయపు మొత్తమును హెచ్చించు, లేక తగ్గించు ప్రభావముగల సవరణ, పార్లమెంటు యొక్క ఏ సదనములోను ప్రతిపాదించబడరాదు. ఈ ఖండము క్రింద ఏదేని సవరణ అగ్రాహ్యమైనదాయను

(అనుమతించబడదను) దానిని గూర్చి అధ్యక్షత వహించు వ్యక్తి యొక్క నిర్ణయము అంతిమమై యుండవలెను.

(3) 115 మరియు 116 అనుచ్ఛేదములలోని నిబంధనలకు అధ్యధీనమై, ఈ అనుచ్ఛేదము యొక్క నిబంధనలననుసరించి పాస్ చేయబడిన శాసనము ద్వారా చేయబడిన వినియోజనము క్రింద తప్ప భారత సంచిత నిధి నుండి ధనమేదియు తిరిగి తీసుకొనబడరాదు.

**అనుపూరక, అదనపు లేక అతిరిక్త అనుదానములు.**

115.(1)(ఎ) 114వ అనుచ్ఛేదములోని నిబంధనలననుసరించి చేయబడిన శాసనము ద్వారా వర్తమాన విత్తీయ సంవత్సరమునందు ఏదైన ప్రత్యేక సేవార్థము వ్యయము చేయుటకై ప్రాధికారమీయబడిన మొత్తము ఆ సంవత్సరపు ప్రయోజనముల కొరకు చాలదని కనుగొనబడినచో, లేక వర్తమాన విత్తీయ సంవత్సరమునందు వార్షిక విత్తీయ వివరణములో తలంపబడని ఏదేని నూతన సేవ కొరకు అనుపూరక, లేక అదనపు వ్యయమునకు అక్కర కలిగినప్పుడు, లేక

(బి) ఏదేని విత్తీయ సంవత్సరములో ఏదేని సేవపై ఆ సంవత్సరమునకుగాను ఆ సేవ కొరకు అనుదానము చేయబడిన మొత్తము కంటే అతిరిక్తముగా ధనము ఖర్చు పెట్టబడినచో;

రాష్ట్రపతి, సందర్భానుసారముగా, ఆ వ్యయమునకై అంచనా వేయబడిన మొత్తమును తెలుపు మరొక వివరణను, పార్లమెంటు ఉభయ సదనముల సమక్షమున ఉంచు ఏర్పాటు చేయించవలెను, లేక అట్టి అతిరిక్త వ్యయమునకైన అధ్యర్థన లోక్‌సభ యందు సమర్పించబడు ఏర్పాటు చేయించవలెను.

(2) వార్షిక విత్తీయ వివరణకును, దాని యందు పేర్కొనబడిన వ్యయమునకును లేక అనుదానపు అధ్యర్థనకును మరియు, అటి వ్యయమునకుగాని, అనుదానమునకుగాని కావలసిన ధనమును భారత సంచిత నిధి నుండి వినియోజనము చేయు ప్రాధికారము నొసగుటకై చేయబడు శాసనమునకును సంబంధించి, 112, 113, 114 అనుచ్ఛేదములలోని నిబంధనలు ఎట్టి ప్రభావము కలిగియుండునో అట్టి ప్రభావమునే ఆ నిబంధనలు ఈ అనుచ్ఛేదము క్రింది ఏదేని వివరణకును, వ్యయమునకును, లేక అధ్యర్థనకును, మరియు అట్టి వ్యయమునకునుగాని, అట్టి అధ్యర్థనను గూర్చిన అనుదానమునకు గాని కావలసిన ధనమును భారత సంచిత నిధి నుండి వినియోజనము చేయు ప్రాధికారము నొసగుచు చేయబడు శాసనమునకును, సంబంధించి కూడ కలిగియుండవలెను.

**'ఖాతాకు ఓట్లు', 'వరవతికి ఓట్లు' మరియు అసాధారణ అనుదానములు.**

116. (1) ఈ అధ్యాయము యొక్క పూర్వగామి నిబంధనలలో ఏమియున్నప్పటికిని లోక్‌సభ ఈ క్రింది అనుదానము చేయుటకు అధికారము కలిగియుండును:–

(ఎ) ఏదేని అనుదానమును ఓటు చేయుటకు 113వ అనుచ్ఛేదములో విహితము చేయబడిన ప్రక్రియ పూర్తియగులోపున, మరియు అట్టి వ్యయమునకు సంబంధించి 114వ అనుచ్ఛేదములోని నిబంధనలననుసరించి శాసనము పాస్ చేయబడులోపున, ఏదేని విత్తీయ సంవత్సరములోని భాగమునకు అంచనా వేయబడిన వ్యయమును గూర్చి అగ్రిమముగా (ముందస్తుగా) ఏదేని అనుదానమును చేయుటకు;

(బి) ఏదేని సేవ యొక్క విస్తృతినిబట్టిగాని, దాని అనిశ్చిత స్వభావమునుబట్టిగాని, దానిని గురించిన అభ్యర్థన సామాన్యముగా వార్షిక విత్తీయ వివరణలో ఈయబడు వివరములతో తెలుపబడజాలనప్పుడు అట్టి ఆశించని అభ్యర్థనకు కావలసిన ధనమును భారతదేశపు వనరుల నుండి అనుదానము చేయుటకు;

(సి) ఏదేని విత్తీయ సంవత్సరమునందు వర్తమాన సేవలలో భాగముగా లేనట్టి ఏదేని అసాధారణ అనుదానమును చేయుటకు,

మరియు సదరు అనుదానములు ఏ ప్రయోజనముల కొరకు చేయబడినవో వాటి కొరకు భారత సంచిత నిధి నుండి ధనములను తిరిగి తీసుకొనుటకై శాసనము ద్వారా ప్రాధికారమిచ్చుటకు పార్లమెంటు అధికారము కలిగియుండవలెను.

(2) వార్షిక విత్తీయ వివరణలో పేర్కొనబడిన ఏదేని వ్యయమునకై అనుదానమును చేయుటకును, మరియు అట్టి వ్యయము కొరకు కావలసిన ధనములను భారత సంచిత నిధి నుండి వినియోజనము చేయుటకు ప్రాధికారము నొసగుటకై చేయబడు శాసనమునకును సంబంధించి 113 మరియు 114 అనుచ్ఛేదములలోని నిబంధనలు ఎట్టి ప్రభావము కలిగియుండునో అట్టి ప్రభావమునే ఆ నిబంధనలు ఖండము (1) క్రింద ఏదేని అనుదానము చేయుటకు మరియు ఆ ఖండము క్రింద చేయబడవలసిన ఏదేని శాసనమునకు సంబంధించి కూడా కలిగియుండవలెను.

**విత్తీయ బిల్లులను గూర్చిన విశేష నిబంధనలు.**

117. (1) 110వ అనుచ్ఛేదము యొక్క ఖండము (1)లోని (ఎ) నుండి (ఎఫ్) వరకు గల ఉప-ఖండములలో నిర్దిష్టపరచబడిన విషయములలో దేనికొరకైనను నిబంధనచేయు బిల్లు లేక సవరణ, రాష్ట్రపతి సిఫారసుపై తప్ప, ప్రవేశపెట్టబడరాదు, లేక ప్రస్తావించబడరాదు, అట్టి నిబంధనను చేయు బిల్లు రాజ్యసభలో ప్రవేశపెట్టరాదు:

అయితే, ఈ ఖండము క్రింద ఆవశ్యకమగు సిఫారసు ఏదియు, ఏదేని పన్నును తగ్గించుటకు లేక ఉత్సాదన (రద్దు) చేయుటకు నిబంధన చేయు సవరణను ప్రస్తావించుట కొరకు ఆవశ్యకము కారాదు.

(2) జుర్మానాలను లేక ధన సంబంధమైన ఇతర శాస్తులను విధించుట కొరకుగాని, లైసెన్సు ఫీజు లేక చేసిన సేవలకైన ఫీజును అభ్యర్థించుట లేక చెల్లించుట కొరకుగాని, నిబంధనలు కలిగియున్నదను కారణమాత్రమున లేక ఎవరేని స్థానిక ప్రాధికారిచే, లేక ఏదేని స్థానిక నికాయముచే, స్థానిక నికాయముచే, స్థానిక ప్రయోజనములకు గాను ఏదేని పన్ను విధించబడుట, ఉత్సాదన(రద్దు) చేయబడుట, పరిహరించబడుట, మార్చబడుట లేక క్రమబద్ధము చేయబడుట కొరకు నిబంధనలు కలిగియున్నదను కారణమాత్రమున, ఒక బిల్లు లేక సవరణ పైన చెప్పబడిన విషయములలో దేనికొరకైనను నిబంధన చేయునదిగా భావింపబడరాదు.

(3) ఏ బిల్లును శాసనము చేసి అమలులోనికి తెచ్చినచో భారత సంచిత నిధి నుండి వ్యయము చేయవలసివచ్చునో ఆ బిల్లును, రాష్ట్రపతి, పార్లమెంటు యొక్క ఏ సదనమునకైనను పర్యాలోచించుటకై సిఫారసు చేసిననే తప్ప, ఆ సదనముచే అది పాస్ చేయబడరాదు.

## సాధారణ ప్రక్రియ

118. (1) ఈ సంవిధాన నిబంధనలకు అధ్యధీనమై (లోబడి) పార్లమెంటు యొక్క ప్రతి సదనము తన ప్రక్రియను[1] మరియు కార్యకలాప నిర్వహణమును క్రమబద్ధము చేయుట కొరకు నియమావళిని చేయవచ్చును. **ప్రక్రియా నియమావళి.**

(2) ఖండము (1) క్రింద నియమావళి చేయబడు వరకు, ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము భారతదేశము అధినివేశము యొక్క శాసనమండలిని గూర్చి అమలులో నుండిన ప్రక్రియా నియమావళి మరియు స్థాయీ ఉత్తరువులు సందర్భానుసారముగా రాజ్యసభ సభాపతిచే లేక లోక్‌సభాధ్యక్షునిచే వాటిలో చేయబడునట్టి మార్పులకును, అనుకూలాను సవరణములకును అధ్యధీనమై, పార్లమెంటుకు సంబంధించిన ప్రభావము కలిగియుండవలెను.

(3) రాష్ట్రపతి, రాజ్యసభ సభాపతితోను, లోకసభాధ్యక్షునితోను, సంప్రదించిన మీదట, ఉభయ సదనముల సంయుక్త ఉపవేశనములకును, వాటి మధ్య పరస్పర సంసూచనలకును సంబంధించిన ప్రక్రియను గూర్చి నియమావళిని చేయవచ్చును.

(4) ఉభయ సదనముల సంయుక్త ఉపవేశనమున లోకసభాధ్యక్షుడు, లేక ఆయన హాజరులో లేనప్పుడు ఖండము (3) క్రింద చేయబడు ప్రక్రియా నియమావళిచే నిర్ధారణ చేయబడు వ్యక్తి అధ్యక్షత వహించవలెను.

119. విత్తీయ కార్యకలాపము సకాలములో పూర్తియగుట కొరకు పార్లమెంటు ఏదేని విత్తీయ విషయమునకు లేక భారత సంచితనిధి నుండి ధన వినియోజనము కొరకైన ఏదేని బిల్లుకు సంబంధించి, ప్రతి సదనము యొక్క ప్రక్రియను, మరియు దానిలో కార్యకలాప నిర్వహణమును, పార్లమెంటు శాసనము ద్వారా క్రమబద్ధము చేయవచ్చును. అట్లు చేయబడిన ఏదేని శాసనము యొక్క ఏదేని నిబంధన, 118వ అనుచ్ఛేదము యొక్క ఖండము (1) క్రింద పార్లమెంటు యొక్క ఏదేని సదనముచే చేయబడిన ఏదేని నియమమునకుగాని, ఆ అనుచ్ఛేదము యొక్క ఖండము (2) క్రింద పార్లమెంటుకు సంబంధించి ప్రభావము కలిగియుండెడి ఏదేని నియమమునకు, లేక స్థాయీ ఉత్తర్వుకు, అసంగతముగనున్నచో, అట్లు అసంగతమునున్నంతమేరకు అట్టి నిబంధనయే చెల్లుబాటు కలిగి యుండవలెను. **పార్లమెంటులో విత్తీయ కార్యకలాపమునకు సంబంధించిన ప్రక్రియను శాసనము ద్వారా క్రమబద్ధ వరచుట.**

120. (1) భాగము 17లో ఏమియున్నప్పటికిని, 348వ అనుచ్ఛేదము యొక్క నిబంధనలకు అధ్యధీనమై, పార్లమెంటులోని కార్యకలాపములు హిందీలోగాని లేక ఇంగ్లీషులోగాని జరువబడ వలెను: **పార్లమెంటులో వాడవలసిన భాష.**

అయితే, హిందీలోగాని లేక ఇంగ్లీషులోగాని, తన భావములను సరిగా వ్యక్తపరచజాలని ఎవరేని సభ్యుడు సదనములో తన మాతృభాషలో ప్రసంగించుటకు, సందర్భానుసారముగ రాజ్యసభ సభాపతి లేక లోక్‌సభాధ్యక్షుడు లేక అట్లు వ్యవహరించుచున్న వ్యక్తికి అనుజ్ఞ నీయవచ్చును.

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 ద్వారా బ్రాకెట్లు మరియు పదములు (సదనము యొక్క సమావేశము ఏర్పాటుకు కోరమ్‌తో సహా) చేర్చబడినది (తేదీ ఇంకనూ అధిసూచించబడలేదు).

(2) పార్లమెంటు శాసనము ద్వారా అన్యథా నిబంధించిననే తప్ప, ఈ సంవిధాన ప్రారంభము నుండి పదునైది సంవత్సరముల కాలావధి ముగిసిన తరువాత ఈ అనుచ్ఛేదమునుండి ''లేక ఇంగ్లీషులోగాని'', అను మాటలు రద్దు అయినట్లుగ ఈ అనుచ్ఛేదము ప్రభావము కలిగియుండ వలెను.

**పార్లమెంటులో చర్చపై నిర్బంధన.**

121. సర్వోన్నత న్యాయస్థానము యొక్క, లేక ఉన్నత న్యాయస్థానము యొక్క ఎవరేని న్యాయాధీశుని తొలగించుటకై ప్రార్ధించుచూ ఇటు పిమ్మట ఇందు నిబంధింపబడిన రీతిలో రాష్ట్రపతికి సమర్పింపబడెడి విన్నపము యొక్క ప్రస్తావనై తప్ప, అట్టి న్యాయాధీశుని యొక్క కర్తవ్య నిర్వహణయందలి అతని నడవడికి సంబంధించి పార్లమెంటులో ఎట్టి చర్చ జరుగరాదు.

**పార్లమెంటు యొక్క కార్యకలాపములను గూర్చి న్యాయస్థానములు పరిశీలన జరుపకుండుట.**

122. (1) ప్రక్రియలో ఏదేని క్రమరాహిత్యము కలదను కారణమును బట్టి పార్లమెంటులోని ఏవేని కార్యకలాపముల యొక్క మాన్యత ప్రష్టవ్యము (ప్రశ్నగతం) కారాదు.

(2) పార్లమెంటులో ప్రక్రియను, కీలక కార్యకలాపమున నిర్వహణను క్రమబద్ధపరచుటకు, లేక సువ్యవస్థను (శాంతిని) కాపాడుటకు, ఈ సంవిధానముచే లేక దాని క్రిందగాని, అధికారములు పార్లమెంటు యొక్క ఏ అధికారియందు లేక సభ్యునియందు నిహితమైయున్నవో ఆ అధికారి, లేక సభ్యుడు అట్టి అధికారములు వినియోగ విషయమున ఏ న్యాయస్థానపు అధికారితకును లోనుకారాదు.

## అధ్యాయము –3
## రాష్ట్రపతి యొక్క శాసన నిర్మాణాధికారములు

**పార్లమెంటు యొక్క విరామ కాలములో అధ్యాదేశములను ప్రఖ్యాపన చేయుటకు రాష్ట్రపతికి గల అధికారము.**

123. (1) పార్లమెంటు ఉభయ సదనములు అధివేశనములో నున్నప్పుడు తప్ప, ఎప్పుడైనను వెంటనే తాను చర్య తీసుకొనవలసిన పరిస్థితులు కలవని రాష్ట్రపతి సంతృప్తి చెందినచో, ఆ పరిస్థితులనుబట్టి ఆవశ్యకమని తనకు తోచు అధ్యాదేశములు ఆయన ప్రఖ్యాపన చేయవచ్చును.

(2) ఈ అనుచ్ఛేదము క్రింద ప్రఖ్యాపన చేయబడిన అధ్యాధేశమునకు పార్లమెంటుచే చేయబడు చట్టమునకుండునట్టి ప్రాబల్య ప్రభావములుండును. కాని అట్టి ప్రతి అధ్యాదేశము–

(ఎ) పార్లమెంటు ఉభయ సదనముల సమక్షమున ఉంచబడవలెను. పార్లమెంటు తిరిగి సమావేశమైనప్పటి నుండి ఆరు వారముల కాలావధి ముగియగనే ఆ అధ్యాదేశము యొక్క అమలు ఆగిపోవును లేక ఆ కాలావది ముగియుటకు ముందే ఆ అధ్యాదేశమును ఆమోదింపక అట్లు తీర్మానములు ఉభయ సదనములచే పాస్ చేయబడినచో, ఆ తీర్మానములలో రెండవ తీర్మానము పాస్ చేయబడిన మీదట, ఆ అధ్యాదేశము యొక్క అమలు ఆగిపోవును; మరియు

(బి) రాష్ట్రపతిచే ఎప్పుడైనను ఉపసంహరింపబడవచ్చును.

**విశదీకరణ:** పార్లమెంటు సదనములు వేరువేరు తేదీలలో తిరిగి సమావేశమగుటకు ఆహ్వానింపబడిన యెడల, ఈ ఖండపు నిమిత్తము, ఆరు వారముల కాలావధిని ఆ తేదీలలో కడపటి దాని నుండి గణింపవలెను.

(3) ఈ సంవిధానము క్రింద శాసనము చేయుటకు పార్లమెంటుకు సమర్థత లేనట్టి ఏదేని నిబంధన ఈ అనుచ్ఛేదము క్రింది అధ్యాదేశములో చేయబడినచో, అంతమేరకు ఆ అధ్యాదేశము ప్రభావశూన్యము కావలెను.

[1][(4) ....................]

## అధ్యాయము – 4
## సంఘము యొక్క న్యాయపాలిక

124. (1) భారతదేశమునకు, భారతదేశ ముఖ్య న్యాయమూర్తితోను పార్లమెంటు శాసనము ద్వారా ఏడుగురి కంటె ఎక్కువ మందిని విహితము చేయు వరకు [2][ఏడుగురికి] మించని అన్య న్యాయాధీశులతోను, కూడిన ఒక సర్వోన్నత న్యాయస్థానము ఉండవలెను. **సర్వోన్నత న్యాయస్థానము యొక్క స్థాపన మరియు సంఘటన.**

(2) సర్వోన్నత న్యాయస్థానము యొక్క ప్రతి న్యాయాధీశుని నియామకమును, [3][124ఏ అనుచ్ఛేదములో నిర్దేశించిన జాతీయ న్యాయ నియామకముల కమీషను యొక్క సిఫారసుపై,] రాష్ట్రపతి, తన చేవ్రాలు మరియు ముద్ర గల అధిపత్రము ద్వారా చేయవలెను. సర్వోన్నత న్యాయస్థానము యొక్క ప్రతి న్యాయాధీశుడు తనకు అరువదియైదు సంవత్సరముల వయస్సు పూర్తియగు వరకు ఆ పదవియందుండవలెను:

[4][* * * *]

[1][అయితే,]

---

1. సంవిధాన (ముప్పది ఎనిమిదవ సవరణ) చట్టము, 1975 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా గతకాలిక ప్రభావముతో చొప్పించబడి, సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 16వ పరిచ్ఛేదము ద్వారా 20.06.1979 నుండి లుప్తము చేయబడినది.
2. ఇప్పుడు ''ముప్పది మూడు'' మంది. సర్వోన్నత న్యాయస్థానపు (న్యాయాధీశుల సంఖ్య) సవరణ చట్టము, 2019 (37 of 2019) యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 09.08.2019 నుండి అమలులోకి వచ్చినది.
3. సంవిధాన (తొంభై తొమ్మిదవ సవరణ) చట్టము, 2014 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ''సర్వోన్నత న్యాయస్థానము యొక్కయు, రాజ్యములలోని ఉన్నత న్యాయస్థానముల యొక్కయు న్యాయాధీశులలో అందు నిమిత్తము ఎవరిని సంప్రదించుట ఆవశ్యకమని రాష్ట్రపతి భావించినచో వారిని సంప్రదించిన తరువాత'' అను పదములకు బదులుగా 13.4.2015వ తేదీ నుండి ఉంచబడినది. అయితే, సర్వోన్నత న్యాయస్థానములో నమోదైన న్యాయవాదుల సంఘం వర్సెస్ భారత ప్రభుత్వపు ఏ.ఐ.ఆర్.2016 ఎస్.సీ. 117లో నివేదించడిన కేసులో, సర్వోన్నత న్యాయస్థానము 16.10.2015వ తేదీ నాటి తన ఉత్తరువులో ఈ సవరణను కొట్టివేసినది.
4. అదే చట్టపు 2వ పరిచ్ఛేదము ద్వారా, మొదటి వినాయింపు 13.4.2015వ తేదీ నుండి లుప్తము చేయబడినది. సవరణకు ముందు మొదటి వినాయింపు ఈ క్రింది విధంగా ఉన్నది:–
   అయితే, భారతదేశ ముఖ్య న్యాయమూర్తి కాక అన్యుడగు ఏ న్యాయాధీశుని నియమాకము విషయమునందైనను, భారతదేశ ముఖ్య న్యాయమూర్తితో సర్వదా సంప్రదించవలెను.

అంతేకాక, –

(ఎ) ఏ న్యాయాధీశుడైనను తన చేవ్రాలుతో రాష్ట్రపతికి లేక వ్రాయుట ద్వారా తన పదవికి రాజీనామా ఇవ్వవచ్చును.

(బి) ఏ న్యాయాధీశుడైనను ఖండము (4)లో నింబంధింపబడిన రీతిలో అతని తన పదవి నుండి తొలగింపబడవచ్చును.

[2][(2ఏ) సర్వోన్నత న్యాయస్థానవు న్యాయాధీశుని వయస్సు పార్లమెంటు శాసనము ద్వారా నిబంధించునట్టి ప్రాధికారిచేతను, అట్టి రీతిలోను నిర్ధారణ చేయబడవలెను.]

(3) ఏ వ్యక్తియైనను, ఆయన భారతదేశ పౌరుడైయుండి, మరియు,–

(ఎ) కనీసము అయిదు సంవత్సరములు ఒక న్యాయస్థానములో గాని, వరుసగా అట్టి రెండు లేక అంతకు మించిన న్యాయస్థానమలలోగాని, న్యాయాధీశుడుగా ఉండియుండిననే తప్ప; లేక

(బి) కనీసము పది సంవత్సరములు ఒక ఉన్నత న్యాయస్థానములో గాని, వరుసగా అట్టి రెండు, లేక అంతకు మించిన న్యాయస్థానములో గాని, అడ్వకేటుగా ఉండియుండిననే తప్ప; లేక

(సి) రాష్ట్రపతి అభిప్రాయములో సుప్రసిద్ధ న్యాయవేత్త అయిననే తప్ప, సర్వోన్నత న్యాయస్థానవు న్యాయాధీశుడుగా నియమింపబడుటకు అర్హుడుకారాదు.

**విశదీకరణ–(i):–** ఈ ఖండములో ''ఉన్నత న్యాయస్థానము'' అనగా భారతదేశ రాజ్య క్షేత్రము యొక్క ఏదేని భాగములో అధికారితను వినియోగించు, లేక ఈ సంవిధాన ప్రారంభమునకు పూర్వము ఎప్పుడైనను అధికారితను వినియోగించిన, ఉన్నత న్యాయస్థానము అని అర్థము.

**విశదీకరణ–(ii):–** ఈ ఖండవు నిమిత్తము ఒక వ్యక్తి అడ్వకేటుగా నుండిన కాలావధిని లెక్కించుటలో, ఆయన అడ్వకేటు అయిన తరువాత ఒక జిల్లా న్యాయధీశుని పదవికి తక్కువకాని న్యాయిక పదవియందుండిన కాలావధిని చేర్చవలెను.

(4) నిరూపింపబడిన దుర్వర్తన లేక అసమర్థత కారణమును బట్టి సర్వోన్నత న్యాయస్థానవు న్యాయాధీశునెవరినైనా తొలగించవలెనని పార్లమెంటు యొక్క ప్రతి సదనము, అందలి మొత్తము సభ్యులలో అధిక సంఖ్యాకులచే, మరియ హాజరైయుండి ఓటు చేయు సభ్యులలో మూడింట రెండు వంతులకు తక్కువకాని అధిక సంఖ్యాకులచే బలపరచబడిన విన్నపమును అదే అధివేశనము నందు రాష్ట్రపతికి సమర్పించిన తరువాత ఆయనచే చేయబడిన ఉత్తరువు ద్వారా తప్ప అట్టి న్యాయాధీశుడు పదవి నుండి తొలగింపబడరాదు.

---

1. సంవిధాన (తొంబై తొమ్మిదవ సవరణ) చట్టము, 2014 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా, ''అయితే, ఇంకనూ'' అనువదములకు బదులుగా 13.4.2015 నుండి ఉంచబడినది.
2. సంవిధాన (పదిహేనవ సవరణ) చట్టము, 1963 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.

(5) ఖండము (4) క్రింద విన్నపము సమర్పించుట కొరకును, ఒక న్యాయాధీశుని దుర్వర్తననుగాని, అసమర్థతనుగాని దర్యాప్తు చేసి నిరూపించుట కొరకును, వలయు ప్రక్రియను పార్లమెంటు శాసనము ద్వారా క్రమబద్ధము చేయవచ్చును.

(6) సర్వోన్నత న్యాయస్థానపు న్యాయాధీశునిగా నియమింపబడిన ప్రతి వ్యక్తియు, తన పదవిలో ప్రవేశించుటకు పూర్వము రాష్ట్రపతి సమక్షమునగాని, తద్విషయమున ఆయనచే నియమింపబడిన వ్యక్తి సమక్షమునగాని, మూడవ అనుసూచిలో అందు నిమిత్తము పొందుపరచబడిన ప్రరూపము ననుసరించి ప్రమాణమును లేక ప్రతిజ్ఞను చేసి దానిపై చేవ్రాలు చేయవలెను.

(7) సర్వోన్నత న్యాయస్థానపు న్యాయాధీశుని పదవి యందుండిన ఏ వ్యక్తియు భారతదేశ రాజ్యక్షేత్రమునందలి ఏ న్యాయస్థానమునందు, న్యాయవాదిత్వమును చేపట్టరాదు, లేక న్యాయవాదిగా వ్యవహరించరాదు.

**జాతీయ న్యాయవర నియామకముల కమీషను.**

[1][124ఏ. (1) జాతీయ న్యాయవర నియామకముల కమీషను అని పిలువబడు ఒక కమీషను ఉండవలెను, అది ఈ క్రింది వారితో కూడి ఉండవలెను, వారెవరనగా:-

(ఎ) భారత దేశ ముఖ్య న్యాయమూర్తి, ఛైర్‌పర్సన్, పదవిరీత్యా;

(బి) భారత దేశ ముఖ్య న్యాయమూర్తికి తరువాత సర్వోన్నత న్యాయస్థానము యొక్క ఇతర సీనియరు న్యాయాధీశులు ఇద్దరు – సభ్యులు, పదవిరీత్యా;

(సి) శాసన మరియు న్యాయము యొక్క అధికారములోనున్న కేంద్ర మంత్రి – సభ్యుడు, పదవిరీత్యా;

(డి) ప్రధాన మంత్రి, భారతదేశ ముఖ్య న్యాయమూర్తి మరియు లోక్‌సభ లోని ప్రతిపక్షనేత లేదా ప్రతిపక్షములో అటువంటి నేత లేనప్పుడు, లోక్‌సభ లోని అతి పెద్ద ప్రతిపక్ష పార్టీ యొక్క నేతతో కూడిన కమిటీచే నామనిర్దేశము చేయబడు ప్రసిద్ధ వ్యక్తులు ఇద్దరు – సభ్యులు:

అయితే, ఒక ప్రసిద్ధ వ్యక్తి, అనుసూచిత కులములు, అనుసూచిత జనజాతులు, ఇతర వెనుకబడిన తరగతులు, అల్ప సంఖ్యాక వర్గాలకు చెందిన లేదా మహిళా వ్యక్తుల నుండి నామనిర్దేశము చేయబడవలెను:

అయితే ఇంకనూ, ప్రసిద్ధ వ్యక్తి మూడు సంవత్సరముల కాలావధికి నామానిర్దేశము చేయబడవలెను మరియు పునర్నామ నిర్దేశమునకు అర్హతను కలిగి ఉండడు.

---

1. సంవిధాన (తొంభై తొమ్మిదవ సవరణ) చట్టము, 2014 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 13.4.2015వ తేదీ నుండి చొప్పించబడినది. అయితే, సర్వోన్నత న్యాయస్థానములో నమోదైన న్యాయవాదుల సంఘం వర్సెస్ భారత ప్రభుత్వపు కేసులో (ఏ.ఐ.ఆర్. 2016 ఎస్.సీ. 117 లో నివేదించడన) సర్వోన్నత న్యాయస్థానము 16.10.2015వ తేదీ నాటి తన ఉత్తరువులో ఈ సవరణను కొట్టివేసినది.

(2) జాతీయ న్యాయపర నియామకముల కమీషను యొక్క ఏదైనా చర్య లేదా ప్రొసీడింగులను ప్రశ్నగతము చేయరాదు లేదా కమీషను ఏర్పాటులోని లోపము లేదా ఏదైనా ఖాళీ ఉన్నదను కారణ మాత్రముననే అవి శాసన మాన్యతను కోల్పోవు.

124బీ. (ఎ) భారతదేశ ముఖ్య న్యాయమూర్తి, సర్వోన్నత న్యాయస్థాన న్యాయాధీశులు, ఉన్నత న్యాయస్థాన ముఖ్య న్యాయమూర్తులు మరియు ఉన్నత న్యాయస్థాన ఇతర న్యాయాధీశుల నియామకము కొరకు వ్యక్తులను సిఫారసు చేయుట; **కమీషను కృత్యములు.**

(బి) ఒక ఉన్నత న్యాయస్థానము నుండి ఏదైనా ఇతర ఉన్నత న్యాయస్థానమునకు ముఖ్య న్యాయమూర్తి మరియు ఇతర న్యాయధీశుల బదిలీకి సిఫారసు చేయుట;

(సి) సిఫారసు చేయబడిన వ్యక్తి సామర్థ్యము మరియు అఖండతను కలిగి ఉండునట్లు చూచుట;

జాతీయ న్యాయపర నియామకముల కమీషను యొక్క కర్తవ్యమై ఉండవలెను.

124సీ. పార్లమెంటు, శాసనము ద్వారా, భారతదేశ ముఖ్య న్యాయమూర్తి మరియు సర్వోన్నత న్యాయస్థానపు ఇతర న్యాయధీశులు మరియు ఉన్నత న్యాయస్థానముల ముఖ్య న్యాయమూర్తులు మరియు ఇతర న్యాయధీశుల నియామకములకైన ప్రక్రియను క్రమబద్ధము చేయవచ్చును మరియు వాటి కృత్యములను నిర్వర్తించుటకు, నియామకము కొరకైన ఎంపిక యొక్క రీతి మరియు తాను అవసరమని భావించునట్టి ఇతర విషయములకై వినియమములను చేయుటకు కమీషనుకు అధికారమొసగవచ్చును.] **శాసనమును చేయుటకు పార్లమెంటుకు అధికారము.**

125. [1][(1) సర్వోన్నత న్యాయస్తానపు న్యాయాధీశులకు పార్లమెంటు శాసనము ద్వారా నిర్ధారణ చేయబడునట్టి జీతములు మరియు తద్విషయమున నిబంధన చేయబడినంతవరకు రెండవ అనుసూచిలో నిర్వచించబడిన జీతములు చెల్లింపబడవలెను.] **న్యాయాధీశుల జీతములు మున్నగునవి.**

(2) ప్రతి న్యాయాధీశుడు, పార్లమెంటుచే చేయబడిన శాసనము ద్వారాగాని దాని క్రిందగాని, ఆయా సమయములందు నిర్ధారణ చేయబడు విశేషాధికారములను, బత్తెములను, గైరు హాజరీ సెలవు, మరియు పింఛనులను గూర్చిన హక్కులను కలిగియుండును, మరియు అట్లు నిర్ధారణ చేయబడు వరకు, ఆయన రెండవ అనుసూచిలో నిర్దిష్టపరచబడిన విశేషాధికారములు, బత్తెములు మరియు హక్కులను కలిగి యుండును:

అయితే ఒక న్యాయాధీశుని నియామకము తరువాత, ఆయన విశేషాధికారములు గాని, బత్తెములుగాని, గైరుహాజరీ సెలవు, లేక పింఛను గూర్చి ఆయనకుగల హక్కులనుగాని, ఆయనకు అననుకూలముగా మార్చరాదు.

126. భారతదేశ ముఖ్యన్యాయమూర్తి పదవి ఖాళీగానున్నప్పుడు, లేక ముఖ్య న్యాయమూర్తి హాజరులో లేని కారణమునగాని, అన్యథా గాని, తన పదవీ కర్తవ్యములను నిర్వర్తించబడనప్పుడు, ఆ **కార్యకారి ముఖ్య న్యాయమూర్తి నియామకము.**

---

1. సంవిధాన (యాబది నాలుగవ సవరణ) చట్టము, 1986 యొక్క 2వ పరిచ్ఛేదము 1.4.1986 నుండి ఖండము (1)కి బదులుగా ఉంచబడినది.

న్యాయస్థానమునకు చెందిన ఇతర న్యాయాధీశులలో నుండి రాష్ట్రపతి అందు నిమిత్తము నియమించు న్యాయాధీశునిచే ఆ పదవీ కర్తవ్యములు నిర్వర్తించబడవలెను.

**తదర్థక న్యాయాధీశుల నియామకము.**

127. (1) ఎప్పుడైనను సర్వోన్నత న్యాయస్థానము యొక్క ఏదేని అధివేశనము జరుపుటకు, లేక కొనసాగించుటకు ఆవశ్యకమైన కోరము పూర్తియగుటకు ఆ న్యాయస్థానపు న్యాయాధీశులు అందుబాటులో లేనిచో, [1][భారతదేశ ముఖ్య న్యాయమూర్తిచే తనకు చేయబడిన నిర్దేశముపై జాతీయ న్యాయవర నియామకముల కమీషను, రాష్ట్రపతి యొక్క పూర్వ సమ్మతితోను,] అందుకు సంబంధించిన ఉన్నత న్యాయస్థానపు ముఖ్యన్యాయమూర్తితో సంప్రదించిన తరువాతను, సర్వోన్నత న్యాయస్థానపు న్యాయాధీశునిగా నియమింపబడుటకు తగిన అర్హతలు కలిగి భారతదేశ ముఖ్య న్యాయమూర్తిచే పేర్కొనబడునట్టి ఉన్నత న్యాయస్థానపు న్యాయాధీశుని ఒకరిని ఆవశ్యకమగునంత కాలావధి వరకు సర్వోన్నత న్యాయస్థానము యొక్క ఉపవేశనములలో తదర్థక న్యాయాధీశునిగా హాజరగుటకు భారతదేశ ముఖ్య న్యాయమూర్తి లిఖిత పూర్వకముగా కోరవచ్చును.

(2) అట్లు పేర్కొనబడిన న్యాయాధీశునికి అన్యమైన తన పదవీకర్తవ్యముల కంటె ముందుగా సర్వోన్నత న్యాయాస్థానము యొక్క ఉపవేశనములకు తాను హాజర కావలసిన సమయమున, మరియు అట్టి కాలావధి వరకు, హాజరగుట కర్తవ్యమై యుండవలెను. ఆయన అట్లు హాజరైయున్నప్పుడు సర్వోన్నత న్యాయస్థానపు న్యాయాధీశునికి గల అధికారిత, అధికారములు మరియు విశేషాధికారములు అన్నింటిని కలిగి యుండి సర్వోన్నత న్యాయస్థానపు న్యాయాధీశుని కర్తవ్యములను నిర్వహించవలెను.

**సర్వోన్నత న్యాయస్థానము యొక్క ఉపవేశనములందు, పదవీ విరమణ చేసిన న్యాయాధీశుల హాజరి.**

128. ఈ అధ్యాయమునందేమి యున్నప్పటికిని, [2][జాతీయ న్యాయవర నియామకముల కమీషను] ఎప్పుడైనను, రాష్ట్రపతి యొక్క పూర్వ సమ్మతితో సర్వోన్నత న్యాయస్థానమునందుగాని, ఫెడరల్ న్యాయస్థానమునందుగాని, ఉన్నత న్యాయస్థానమునందుగాని, [3][న్యాయధీశుని పదవియందుండి సర్వోన్నత న్యాయస్థానపు న్యాయాధీశునిగా నియమింపబడుటకు తగిన అర్హతలు కలిగిన ఏ వ్యక్తినైనను], సర్వోన్నత న్యాయస్థానపు న్యాయాధీశునిగా ఉపవిష్టుడై వ్యవహరించవలెనని కోరవచ్చును. అట్లు కోరబడిన ప్రతి వ్యక్తి, అట్లు ఉపవిష్టుడై వ్యవహరించుచున్నప్పుడు రాష్ట్రపతి ఉత్తరువు ద్వారా

---

1. సంవిధాన (తొంభై తొమ్మిదవ సవరణ) చట్టము, 2014 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా, ''భారతదేశ ముఖ్య న్యాయమూర్తి, రాష్ట్రపతి యొక్క పూర్వ సమ్మతితో'' అను పదములకు బదులుగా 13.4.2015వ తేదీ నుండి ఉంచబడినది. అయితే, సర్వోన్నత న్యాయస్థానములో నమోదైన న్యాయవాదుల సంఘం వర్సెస్ భారత సంఘ రాజ్యక్షేత్రపు కేసులో (ఏ.ఐ.ఆర్. 2016 ఎస్.సీ. 117 లో నివేదించబడిన), సర్వోన్నత న్యాయస్థానము 16.10.2015వ తేదీ నాటి తన ఉత్తరువులో ఈ సవరణను కొట్టివేసినది.
2. సంవిధాన (99వ సవరణ) చట్టము, 2014, 5వ పరిచ్ఛేదము ద్వారా 'భారత దేశ ముఖ్య న్యాయమూర్తి'' అను పదములకు బదులుగా 13.04.2015 నుండి ఉంచబడినది. అయితే, సర్వోన్నత న్యాయస్థానములో నమోదైన న్యాయవాదుల సంఘం వర్సెస్ భారత సంఘ రాజ్యక్షేత్రపు కేసులో, సర్వోన్నత న్యాయస్థానము 16.10.2015వ తేదీ నాటి తన ఉత్తరువులో ఈ సవరణను కొట్టివేసినది.
3. సంవిధాన (పదిహేనవ సవరణ) చట్టము, 1963 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 05.10.1963 నుండి చొప్పించబడినది.

నిర్ధారణ చేయు బత్తెములకు హక్కు కలిగి యుండును, మరియు ఆ న్యాయస్థానపు న్యాయాధీశునికి గల అధికారితను, అధికారములను మరియు విశేషాధికారములను అన్నింటిని కలిగియుండును, కాని ఆయన అన్యథా, ఆ న్యాయస్థానపు న్యాయాధీశునిగా భావింపబడరాదు:

అయితే ఈ అనుచ్ఛేదములో నున్నదేదియు పైనచెప్పబడిన ఏ వ్యక్తిగాని, ఆయన సమ్మతించిననే తప్ప, ఆ న్యాయస్థానపు న్యాయాధీశునిగా ఉపవిష్టుడు కావలెనని మరియు వ్యవహరించవలెనని అపేక్షించునదిగా భావింపబడరాదు.

**సర్వోన్నత న్యాయస్థానము, రికార్డు న్యాయస్థానముగా నుండుట.**

129. సర్వోన్నత న్యాయస్థానము రికార్డు న్యాయస్థానముగ ఉండవలెను. అది తన ధిక్కారమునకై శిక్షించు అధికారముతో సహా అట్టి న్యాయస్థానపు అధికారములన్నింటిని కలిగియుండును.

**సర్వోన్నత న్యాయస్థానము యొక్క స్థానము.**

130. సర్వోన్నత న్యాయస్థానము ఢిల్లీలోగాని, భారతదేశ ముఖ్యన్యాయమూర్తి రాష్ట్రపతి ఆమోదముతో ఆయా సమయములందు నియతపరచు ఇతర స్థలములోగాని, ఉపవేశనము కావలెను.

**సర్వోన్నత న్యాయస్థానము యొక్క ఆరంభిక అధికారిత.**

131. ఈ క్రింది వివాదములో శాసనిక హక్కు యొక్క అస్తిత్వము, లేక విస్తృతి ఆధారపడియున్న ఏదైనా (ఆ ప్రశ్న శాసనికమైనదైనను, వాస్తవ సంగతి విషయకమైనదైనను) ఇమిడియున్నచో, మరియు అంతమేరకు, అట్టి ఏ వివాదములోనైనను ఈ సంవిధాన నిబంధనలకు అధ్యధీనమై ఇతర ఏ న్యాయస్థానముగాని కలిగియుండక సర్వోన్నత న్యాయస్థానము మాత్రమే ఆరంభిక అధికారితను కలిగి యుండును:-

(ఎ) భారత ప్రభుత్వమునకు మరియు ఒకటి లేక అంతకెక్కువ రాజ్యములకు మధ్య వివాదము; లేక

(బి) భారత ప్రభుత్వముకు మరియు ఏదేని రాజ్యము లేక ఏవేని రాజ్యములు ఒక పక్షముగాను, మరియు ఇతర ఏదేని రాజ్యము లేక ఏవేని రాజ్యములు మరొక పక్షముగాను, ఉన్నవివాదము;

(సి) రెండు లేక అంతకెక్కువ రాజ్యముల మధ్య వివాదము:

[1][అయితే, ఈ సంవిధాన ప్రారంభమునకు పూర్వమే చేసుకోబడి, లేక వ్రాసి ఈయబడి, అట్టి ప్రారంభము తరువాత అమలులో కొనసాగుచుండిన, లేక అట్టి వివాదము సదరు అధికారితలో చేరియుండదగు నిబంధనను కలిగియున్న ఏదేని సంధి, కరారు, ప్రసంవిధ, ఒప్పందము, సనదు లేక తత్సదృశ్యమగు అన్యపత్రము నుండి ఉత్పన్నమగు వివాదము సదరు అధికారితలో చేరియుండరాదు.]

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 5వ పరిచ్ఛేదములోని వినాయింపు 01.11.1956 నుండి బదులుగా ఉంచబడినది.

[1][131ఏ. (కేంద్ర శాసనముల యొక్క సంవిధానిక మాన్యత గల ప్రశ్నలకు సంబంధించి సర్వోన్నత న్యాయస్థానముకు మాత్రమేగల అధికారిత.] సంవిధాన (43వ సవరణ) చట్టము, 1977, 4వ పరిచ్ఛేదము ద్వారా 13.04.1978 నుండి లుప్తము చేయబడినది

**కొన్ని కేసులలో ఉన్నత న్యాయస్థానము నుండి చేయబడిన అప్పీళ్లలో సర్వోన్నత న్యాయస్థానము యొక్క అప్పీలు అధికారిత.**

132. (1) భారత దేశ రాజ్య క్షేత్రమునందలి ఉన్నత న్యాయస్థానము యొక్క తీర్పు, డిక్రీ, లేక అంతిమ ఉత్తరువుపై, అది సివిలు చర్యలోనిదైనను, క్రిమినలు చర్యలోనిదైనను, ఇతర చర్యలోనిదైనను, ఆ కేసులో ఈ సంవిధానము యొక్క అర్థాన్వయమును గూర్చిన సారభూతమైన శాసనిక ప్రశ్న ఇమిడియున్నదని [2][134-ఏ అనుచ్ఛేదము క్రింద ఉన్నత న్యాయస్థానము ధృవీకరించినచో] సర్వోన్నత న్యాయస్థానమునకు అప్పీలు చేసుకొననగును.

[3][(2) .................. ]

(3) అట్టి ధృవ పత్రము ఇవ్వబడినచో [4][............] ఆ కేసులోని ఎవరేని పక్షకారు పూర్వోక్తమైనట్టి ఏదేని ప్రశ్న తప్పుగా నిర్ణయించబడినదను కారణమును బట్టి [1][.........] సర్వోన్నత న్యాయస్థానమునకు అప్పీలు చేసుకొననగును.

**విశదీకరణ:-** ఈ అనుచ్ఛేదపు నిమిత్తము 'అంతిమ ఉత్తరువు' అను పదము నందు, ఏ వాదాంశము అప్పీలుదారుకు అనుకూలముగ నిర్ణయించబడి యుండినదో ఆ కేసు యొక్క అంతిమ పరిష్కారము చేయబడజాలి యుండునో, ఆ వాదాంశమును నిర్ణయించు ఉత్తరువు చేరియుండును.

**కొన్ని సివిలు విషయములలో ఉన్నత న్యాయస్థానముల నుండి చేయబడిన అప్పీళ్లలో సర్వోన్నత న్యాయస్థానము యొక్క అప్పీలు అధికారిత పరిధి.**

133. [5][(1) భారతదేశ రాజ్యక్షేత్రములోని ఏదేని ఉన్నత న్యాయస్థానము యొక్క సివిలు చర్యలోని ఏదేని నిర్ణయము, డిక్రీ, లేక అంతిమ ఉత్తరువుపై [6][134ఏ అనుచ్ఛేదము క్రింద ఈ క్రింది విధముగ ఉన్నత న్యాయస్థానము ధృవీకరించినచో] సర్వోన్నత న్యాయస్థానమునకు అప్పీలు చేసుకొననగును.

(ఎ) ఆ కేసులో సాధారణ ప్రాముఖ్యముగల సారభూతమైన శాసనిక ప్రశ్న ఇమిడియున్నదని; మరియు

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 23వ పరిచ్ఛేదము ద్వారా (1.2.1977 నుండి) చొప్పించబడినది.
2. సంవిధాన (నలుబది నాల్గవ సవరణ) చట్టము, 1978 యొక్క 17వ పరిచ్ఛేదము ద్వారా ''ఉన్నత న్యాయస్థానము ధృవీకరించినవి'', అను పదములను 1.8.1979 నుండి బదులుగా ఉంచడమైనది.
3. పై చట్టపు అదే పరిచ్ఛేదము ద్వారా ఖండము (2) 1.8.1979 నుండి లుప్తము చేయబడినది.
4. పై చట్టపు అదే పరిచ్ఛేదము ద్వారా కొన్ని పదములు 1.8.1979 నుండి లుప్తము చేయబడినది.
5. సంవిధాన (ముప్పది సవరణ) చట్టము, 1972, యొక్క రెండవ పరిచ్ఛేదము ద్వారా 27.2.1973 నుండి బదులుగా ఉంచబడినది.
6. సంవిధాన (నలుబది నాల్గవ సవరణ) చట్టము, 1978 యొక్క పరిచ్ఛేదము 18 ద్వారా ''ఉన్నత న్యాయస్థానము ధృవీకరించినచో'' అనుపదములకు బదులు ''134 అనుచ్ఛేదము క్రింద ఉన్నత న్యాయస్థానము ధృవీకరించినచో'' అను పదములు బదులుగా 01.08.1979 నుండి ఉంచబడినవి.

(బి) సదరు ప్రశ్న, ఆ ఉన్నత న్యాయస్థానము యొక్క అభిప్రాయములో, సర్వోన్నత న్యాయస్థానముచే నిర్ణయింపబడుట ఆవశ్యకమైనదని.]

(2) 132వ అనుచ్ఛేదములో ఏమియున్నప్పటికిని, ఉప-ఖండము (1) క్రింద సర్వోన్నత న్యాయస్థానమునకు అప్పీలు చేసుకొను ఎవరేని పక్షకారు ఈ సంవిధానము యొక్క అర్థాన్వయమును గూర్చి సారభూతమైన శాసనిక ప్రశ్న తప్పుగ నిర్ణయింపబడినదని, అట్టి అప్పీలుకు గల ఆధారములలో నొకటిగా వాదించవచ్చును.

(3) ఈ అనుచ్ఛేదములో ఏమియున్నప్పటికిని పార్లమెంటు శాసనము ద్వారా అన్యథా నిబంధించిననే తప్ప, ఉన్నత న్యాయస్థానము నందు ఒకే ఒక న్యాయాధీశుడు చేసిన నిర్ణయము, డిక్రీ, లేక అంతిమ ఉత్తరువుపై సర్వోన్నత న్యాయస్థానమునకు అప్పీలు ఉండదు.

**క్రిమినలు విషయములలో సర్వోన్నత న్యాయస్థానము యొక్క అప్పీలు అధికారిత పరిధి.**

134. (1) భారతదేశ రాజ్యక్షేత్రములోని ఒక ఉన్నత న్యాయస్థానము యొక్క ఏదేని క్రిమినలు చర్యలోని ఏదేని తీర్పు, అంతిమ ఉత్తరువు లేక దండనోత్తరువుపై ఈ క్రింది సందర్భములలో సర్వోన్నత న్యాయస్థానమునకు అప్పీలు చేసుకొననగును:-

(ఎ) అభియుక్తుని దోషముక్తుని చేసిన ఉత్తరువు అప్పీలులో ఆ ఉన్నత న్యాయస్థానము విపర్యయపరచి అతనికి మరణ దండనను విధించినచో; లేక

(బి) ఆ ఉన్నత న్యాయస్థానము తన ప్రాధికారమునకు అధీనస్థమైన ఏదేని న్యాయస్థానము నుండి ఏదేని కేసును తన సమక్షమున విచారణ జరుగుటకు ఉపసంహరించుకొని అట్టి విచారణలో అభియుక్తునికై నేర స్థాపన చేసి అతనికి మరణదండనను విధించి యుండినచో; లేక

(సి) ఆ కేసు సర్వోన్నత న్యాయస్థానమునకు అప్పీలు చేయదగినదని [1] [134-ఏ అనుచ్ఛేదము క్రింద] ఉన్నత న్యాయస్థానము ధృవకీంచినచో:

అయితే ఉప-ఖండము (సి) క్రింద అప్పీలు, 145 అనుచ్ఛేదములోని ఖండము (1) క్రింద తద్విషయమున చేయబడు నిబంధనలకును ఉన్నత న్యాయస్థానము ఏర్పరచు, లేక అపేక్షించు షరతులకును అధ్యధీనమై, చేసుకొననగును.

(2) భారతదేశ రాజ్యక్షేత్రములోని ఒక ఉన్నత న్యాయస్థానము యొక్క క్రిమినలు చర్యలోని ఏదేని నిర్ణయము, అంతిమ ఉత్తరువును లేక దండనోత్తరువుపై అప్పీళ్ళను గ్రహించుటకు మరియు ఆకర్ణించుటకు పార్లమెంటు శాసనము ద్వారా, అందు నిర్దిష్టపరచబడునట్టి షరతులకును, పరిమితులకును అధ్యధీనమైన అదనపు అధికారములను సర్వోన్నత న్యాయస్థానమునకు ప్రదత్తము చేయవచ్చును.

**సర్వోన్నత న్యాయస్థానము అప్పీలుకై ధృవపత్రము.**

[1][134ఏ. 132వ అనుచ్ఛేదపు ఖండము (1) లేక 133వ అనుచ్ఛేదపు ఖండము (1), లేక 134వ అనుచ్ఛేదపు ఖండము (1)లో నిర్దేశింపబడిన తీర్పు, డిక్రీ, అంతిమ ఉత్తరువు, దండనోత్తరువు ఇచ్చు

1. సంవిధాన (నలుబది నాల్గవ సవరణ) చట్టము, 1978 యొక్క 19వ పరిచ్ఛేదము ద్వారా 1.8.1979 నుండి ''ధృవీకరణ'' అను పదబంధమునకు బదులుగా ఉంచబడినది.

లేక చేయు ప్రతి ఉన్నత న్యాయస్థానము, అట్లు ఇచ్చిన, లేక చేసిన పిమ్మట వీలైనంత త్వరితముగా ఆ కేసు విషయములో 132వ అనుచ్ఛేదవు ఖండము (1), 133 అనుచ్ఛేదవు ఖండము (1) లేక సందర్భానుసారముగా 134వ అనుచ్ఛేదవు ఖండము (1)లోని ఉప-ఖండము (సి)లో నిర్దేశింపబడిన ధ్రువ పత్రము ఇవ్వబడవచ్చునా అను ప్రశ్నను-

(ఎ) అట్లు చేయుట సబబని తాను భావించినచో తనంతతానే నిర్ధారణ చేయవచ్చును, మరియు

(బి) అట్టి తీర్పు, డిక్రీ, అంతిమ ఉత్తరువు, లేక దండనోత్తరువు ఈయబడిన, లేక చేయబడిన పిమ్మట వెంటనే వ్యధిత పక్షకారుచే లేక అతని తరపున వాగ్రూపమున (మౌఖికంగా) ఆ దరఖాస్తు చేయబడినచో, అట్లు నిర్ధారణ చేయవలెను.]

**అస్తిత్వములోనున్న శాసనము క్రింద ఫెడరల్ న్యాయ స్థానమునకు గల అధికారితపరిధి మరియు అధికారములు సర్వోన్నత నాాయసానముచే**

135. పార్లమెంటు శాసనము ద్వారా అన్యథా నిబంధన చేయు వరకు 133వ లేక 134వ అనుచ్ఛేదములలోని నిబంధనలు వర్తించని ఏదేని విషయమును గూర్చి, అస్త్విములోనున్న ఏదేని శాసనము క్రింద ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము ఫెడరల్ న్యాయస్థానముచే అధికారితపరిధి, మరియు అధికారములు వినియోగివబడదగి యుండినచో ఆ విషయమును గూర్చి కూడా సర్వోన్నత న్యాయస్థానము అధికారితపరిధిని మరియు అధికారములను కలిగియుండును.

**అప్పీలు చేసుకొనుటకు సర్వోన్నత న్యాయస్థానముచే విశేష అనుజ్ఞ.**

136. (1) ఈ అధ్యాయములో ఏమి యున్నప్పటికిని భారతదేశ రాజ్య క్షేత్రములోని ఏ న్యాయస్థానముచేనైనను, లేక ఏ ట్రిబ్యునలుచేనైనను ఏదేని వ్యాజ్యములో, లేక విషయములో ఇవ్వబడిన ఏదేని తీర్పు, డిక్రీ, నిర్ధారణ, దండనోత్తరువు లేక ఉత్తరువుపై అప్పీలు చేసుకొనుటకు సర్వోన్నత న్యాయస్థానము తన వివేచనానుసారము విశేష అనుజ్ఞ ఇవ్వవచ్చును.

(2) ఖండము (1)లో నున్న దేదియు, సాయుధ బలములకు సంబంధించిన ఏదేని శాసనముచేగాని, దాని క్రిందగాని, సంఘటితమైనను ఏదేని న్యాయస్థానము, లేక ట్రిబ్యునలుచే ఇవ్వబడిన ఎట్టి తీర్పు, నిర్ధారణ, దండనోత్తరువు లేక ఉత్తరువునకు వర్తించరాదు.

**సర్వోన్నత న్యాయస్థానముచే ఇవ్వబడిన తీర్పుల లేక ఉత్తర్వుల పునర్విలోకన.**

137. పార్లమెంటుచే చేయబడిన ఏదేని శాసనము యొక్క నిబంధనలకు, లేక 145వ అనుచ్ఛేదము క్రింద చేయబడిన ఏవేని నియమములకు అధ్యధీనమై, సర్వోన్నత న్యాయస్థానము తనచే చెప్పబడిన ఏదేని తీర్పును, లేక ఇవ్వబడిన ఏదేని ఉత్తరువును, పునర్విలోకన చేయుటకు అధికారము కలిగియుండును.

**సర్వోన్నత న్యాయస్థానము యొక్క అధికారితాపరిధిని విస్తృతవరచుట.**

138. (1) సర్వోన్నత న్యాయస్థానము సంఘ సూచిలోని ఏవేని విషయములను గూర్చి పార్లమెంటు శాసనము ద్వారా ప్రదత్తము చేయు తదుపరి అధికారితపరిధిని మరియు అధికారములను కలిగియుండును.

---

1. అదే చట్టపు 20వ పరిచ్ఛేదము ద్వారా 1.8.1979 నుండి చొప్పించబడినది.

(2) భారత ప్రభుత్వము మరియు ఏదేని రాజ్య ప్రభుత్వము విశేష కరారు ద్వారా ఏదేని విషయమును గూర్చి సర్వోన్నత న్యాయస్థానమునకు తదుపరి అధికారితను మరియు అధికారములను ప్రదత్తము చేసియుండి, అట్టి అధికారితాపరిధి మరియు అధికారములను ప్రదత్తము చేసియుండి, అట్టి అధికారితాపరిధి మరియు అధికారములు సర్వోన్నత న్యాయస్థానముచే వినియోగింపబడవలెనని పార్లమెంటు శాసనము ద్వారా నిబంధించినచో, అట్టి అధికారితాపరిధి మరియు అధికారములను సర్వోన్నత న్యాయస్థానము కలిగి యుండును.

**కొన్ని అధిలేఖలను (రిట్లను) జారీ చేయు అధికారములను సర్వోన్నత న్యాయస్థానమునకు ప్రదత్తము చేయుట.**

139. 32వ అనుచ్ఛేదము యొక్క ఖండము (2)లో పేర్కొనబడినవి మినహా ఏవేని ఇతర ప్రయోజనముల కొరకు ఆదేశములను, ఉత్తరువులను లేక బంది ప్రత్యక్ష (హెబియస్ కార్పస్), పరమాదేశ (మాండమస్), ప్రతిషేధ (ప్రోహిబిషన్) అధికారపృచ్ఛ (కోవారెంటో) మరియు ఉత్ప్రేరణ (సర్షియోరారి), స్వభావముగల అధిలేఖలతో సహా, అధిలేఖలను లేక వాటిలో దేనినైనను జారీ చేయు అధికారమును సర్వోన్నత న్యాయస్థానమునకు ప్రదత్తము చేయుటకై పార్లమెంటు శాసనము ద్వారా నిబంధన చేయవచ్చును.

**కొన్ని కేసుల బదిలీ.**

[1][139ఏ. [2][(1) శాసనాత్మకమైన ఒకే ప్రశ్నలు లేక సారత ఒకే ప్రశ్నలు ఇమిడియున్న కేసులు సర్వోన్నత న్యాయస్థానము మరియు ఒకటి లేక అంతకెక్కువ ఉన్నత న్యాయస్థానముల సమక్షమున లేక రెండు లేక అంతకెక్కువ ఉన్నత న్యాయస్థానముల సమక్షమున జరుగుచుండి, సర్వోన్నత న్యాయస్థానము తనంత తానుగాని భారత అటార్నీ జనరలుచే లేక అట్టి ఏదేని కేసు యొక్క పక్షకారుచే దరఖాస్తు చేయబడిన మీదటగాని అట్టి ప్రశ్నలు సాధారణ ప్రాముఖ్యముగల సారభూత ప్రశ్నలని సంతృప్తి చెందినచో, సర్వోన్నత న్యాయస్థానము, ఆ ఉన్నత న్యాయస్థానము లేక ఉన్నత న్యాయస్థానమున సమక్షమున జరుగుచున్న ఆ కేసును లేక కేసులను తెప్పించుకొని తానే స్వయముగా ఆ కేసులన్నింటిని పరిష్కరించవచ్చును:

అయితే, ఉన్నత న్యాయస్థానము సదరు శాసనాత్మకమైన ప్రశ్నలును నిర్ధారణ చేసిన పిమ్మట, అట్లు ఉపసంహరింపబడిన ఏదేని కేసును అట్టి ప్రశ్నలపై తన తీర్పు ప్రతితో సహా ఆ కేసు ఏ ఉన్నత న్యాయస్థానము నుండి ఉపసంహరింపబడినదో ఆ న్యాయస్థానమునకు తిరిగి పంపవచ్చును, మరియు ఉన్నత న్యాయస్థానము దానిని అందుకొనిన మీదట అట్టి తీర్పుకు అనుగుణముగా ఆ కేసును పరిష్కరించుటకు ఉపక్రమింపవలెను.]

(2) ఏదేని ఉన్నత న్యాయస్థానములో పెండింగులో ఉన్న ఏదేని కేసును, అప్పీలును లేక ఇతర చర్యను న్యాయప్రాప్తికై ఇతర ఉన్నత న్యాయస్థానమునకు బదిలీ చేయుట సముచితమని సర్వోన్నత న్యాయస్థానము భావించినచో అది అట్లు చేయవచ్చును.]

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 24వ పరిచ్ఛేదము ద్వారా 1.2.1977 నుండి చొప్పించబడినది.
2. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 21వ పరిచ్ఛేదము ద్వారా ఖండము (1)కి బదులుగా 1.8.1979 నుండి ఉంచబడినది.

140. ఈ సంవిధానము ద్వారాగాని, సంవిధానము క్రిందగాని సర్వోన్నత న్యాయస్థానమునకు ప్రదత్తము చేయబడని అధికారితవరిధిని, ఆ న్యాయస్థానము మరింత సమర్థవంతముగ వినియోగించుటకు ఆవశ్యకమని లేక వాంఛనీయమని తోచునట్టి అనుపూరక అధికారములను సర్వోన్నత న్యాయస్థానములనకు ప్రదత్తము చేయుటకై పార్లమెంటు శాసనము ద్వారా, ఈ సంవిధాన నిబంధనలలో దేనికిని అసంగతము కానట్టి నిబంధన చేయవచ్చును.

**సర్వోన్నత న్యాయస్థానమునకు గల సహాయక అధికారములు.**

141. సర్వోన్నత న్యాయస్థానముచే ప్రఖ్యానింపబడిన శాసనము భారతదేశ రాజ్యక్షేత్రములోని న్యాయస్థానములన్నింటికి అనుసరణీయమై యుండవలెను.

**సర్వోన్నత న్యాయస్థానముచే ప్రఖ్యానించబడిన శాసనము న్యాయస్థానములన్నిటికి అనుసరణీయమై యుండుట.**

142. (1) సర్వోన్నత న్యాయస్థానము తన అధికారితావరిధి వినియోగించుటలో తన సమక్షమున ఆలోచనలో నున్న ఏదేని వ్యాజ్యము లేక విషయములో సంపూర్ణమైన న్యాయము నొనగూర్చుట కొరకు ఆవశ్యకమైన డిక్రీని, లేక ఉత్తరువును ఇవ్వవచ్చును, మరియు అట్లు ఇవ్వబడిన ఏదేని డిక్రీ, లేక ఉత్తరువు భారతదేశ రాజ్యక్షేత్రమందంతటను, పార్లమెంటుచే చేయబడిన ఏదేని శాసనము ద్వారాగాని, శాసనము క్రిందగాని, విహితము చేయబడు రీతిని, మరియు తద్విషయమున అట్లు నిబంధింపబడువరకు [1] [రాష్ట్రపతిచే ఉత్తరువు ద్వారా] విహితము చేయబడు రీతిని, అమలుపరచదగినదై యుండును.

(2) ఈ విషయమును పార్లమెంటు చేసిన ఏదేని శాసనము యొక్క నిబంధనలకు అధ్యధీనమై, సర్వోన్నత న్యాయస్థానము భారతదేశ రాజ్య క్షేత్రము నందంతటను ఏ వ్యక్తినైనను హాజరుపరిపించుటకు ఎట్టి దస్తావేజులనైనను వెల్లడి చేయించుటకు లేక దాఖలు చేయించుటకు, లేక తన ధిక్కారము విషయములో దర్యాప్తు చేయుటకు, లేక శిక్షించుటకు, ఎట్టి ఉత్తరువు నైనను ఇచ్చుటకు, సర్వాధికారములను కలిగియుండును.

**సర్వోన్నత న్యాయస్థానముల యొక్క డిక్రీలను మరియు ఉత్తరువులను అమలు పరచుట, మరియు వెల్లడి మున్నగు వాటిని గూర్చి ఉత్తరువులు.**

143. (1) శాసనిక, లేక సంగతి విషయకమైన ఒక ప్రశ్న ఉత్పన్నమైనదనియు, లేక బహుశః ఉత్పన్నము కావచ్చుననియు, దాని స్వభావమునుబట్టి, మరియు సార్వజనిక ప్రాధాన్యతనుబట్టి సర్వోన్నత న్యాయస్థానము యొక్క అభిప్రాయమును గైకొనుట సముచితమనియు, రాష్ట్రపతికి ఎప్పుడైనను తోచినచో ఆయన ఆ ప్రశ్నను పర్యాలోచనకై ఆ న్యాయస్థానమునకు నిర్దేశించవచ్చును. ఆ న్యాయస్థానము తాను సబబని తలచు ఆకర్ణనను జరిపిన తరువాత దానిపై తన అభిప్రాయమును రాష్ట్రపతికి నివేదించవచ్చును.

**సర్వోన్నత న్యాయస్థానము యొక్క అభిప్రాయమును గైకొనుటకు రాష్ట్రపతికి గల అధికారము.**

---

1. సర్వోన్నత న్యాయస్థానము (డిక్రీలు మరియు ఉత్తర్వులు) అమలుపరచు ఉత్తరువు, 1954 చూడుము. (సీ.ఓ.47)

(2) 131వ అనుచ్ఛేదములోని వినాయింపు [1] [.......]లో ఏమియున్నప్పటికిని, [2] [సదరు వినాయింపులో] పేర్కొనబడిన రకపు వివాదమును రాష్ట్రపతి సర్వోన్నత న్యాయస్థానమునకు దాని అభిప్రాయము కొరకు నిర్దేశించవచ్చును, మరియు సర్వోన్నత న్యాయస్థానము తాను సబబని తలచు ఆకర్ణను జరిపిన తరువాత దానిపై తన అభిప్రాయమును రాష్ట్రపతి నివేదింపవలెను.

**సివిలు మరియు న్యాయిక ప్రాధికారులు సర్వోన్నత న్యాయస్థానమునకు సహాయకులుగా వ్యవహరించుట.**

144. భారతదేశ రాజ్యక్షేత్రములోని సివిలు మరియు న్యాయిక ప్రాధికారులందరును సర్వోన్నత న్యాయస్థానమునకు సహాయకులుగా వ్యవహరించవలెను.

[3][144ఏ. శాస్త్రముల యొక్క సంవిధాన మాన్యతగల ప్రశ్నల పరిష్కారమునకు సంబంధించిన ప్రత్యేక నిబంధనలు.] సంవిధాన (నలుబది మూడవ సవరణ) చట్టము, 1977 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా 13.04.1978 నుండి లుప్తము చేయబడినవి.

**న్యాయస్థానపు నియమావళి మున్నగునవి.**

145. (1) పార్లమెంటు చేసిన ఏదేని శాసనము యొక్క నిబంధనలకు అధ్యధీనమైన, సర్వోన్నత న్యాయస్థానము, ఆయా సమయములందు రాష్ట్రపతి ఆమోదముతో ఈ క్రింది నియమములతో సహా ఆ న్యాయస్థానము యొక్క ఆచరణలను మరియు ప్రక్రియను సాధరణముగా క్రమబద్ధము చేయుటకై నియమావళిని చేయవచ్చును.

(ఎ) ఆ న్యాయస్థాన సమక్షమున న్యాయవాద వృత్తిని సాగించు వ్యక్తులను గూర్చిన నియమములు;

(బి) అప్పీళ్ళను ఆకర్ణించు ప్రక్రియను గూర్చిన, మరియు ఆ న్యాయస్థానములో అప్పీళ్ళను దాఖలు చేయవలసిన కాలావధితో సహా అప్పీళ్ళకు సంబంధించిన ఇతర విషయములను గూర్చిన నియమములు;

(సి) భాగము 3 ద్వారా ప్రదత్తము చేయబడిన హక్కులలో దేనినైనను అమలువరుచుటకు ఆ న్యాయస్థానములోని చర్యలను గూర్చి నియమములు.

[1] [(సిసి) [2] [139ఏ అనుచ్ఛేదము] క్రింద న్యాయస్థానములలోని చర్యలను గూర్చిన నియమములు;]

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1954 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''యొక్క ఖండము (i)'' అను పదములు, బ్రాకెట్లు, అంకెలు 1.11.1956 నుండి లుప్తము చేయబడినవి.
2. అదే చట్టము ద్వారా ''చెప్పబడిన ఖండము'' అను పదములకు బదులు 1.11.1956 నుండి బదులుగా ఉంచబడినది.
3. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 పరిచ్ఛేదము 25 ద్వారా 03.01.1977 నుండి చొప్పించబడినది.

(డి) 134వ అనుచ్ఛేదము యొక్క ఖండము (1)లోని ఉప-ఖండము (సి) క్రింద అప్పీళ్ళను గ్రహించుటకు గూర్చిన నియమములు;

(ఇ) ఆ న్యాయస్థానముచే చెప్పబడిన ఎట్టి తీర్పుగాని, ఇవ్వబడిన ఎట్టి ఉత్తరువుగాని, ఏ షరతులకు అధ్యధీనమై పునర్విలోకన చేయబడవచ్చునో ఆ షరతులను గూర్చి, మరియు అట్టి పునర్విలోకనకై దరఖాస్తు దాఖలు చేయబడవలసిన కాలావధితో సహా అట్టి పునర్విలోకన కొరకైన ప్రక్రియను గూర్చిన నియమములు;

(ఎఫ్) ఆ న్యాయస్థానములోని ఏవేని చర్యలు యొక్కయు, ఆచర్యలకు ఆనుషంగికమై నట్టియు ఖర్చులను గూర్చిన మరియు అందలి చర్యల విషయమున చెల్లింపబడవలసిన ఫీజులను గూర్చిన నియమములు;

(జి) జామీను ఇచ్చుటకు గూర్చిన నియమములు;

(హెచ్) చర్యల నిలుపుదలను గూర్చిన నియమములు;

(ఐ) నిస్సారమైనదని, లేక క్లేశకరమైనదని, లేక కాలయాపన కొరకు తేబడినదని, న్యాయస్థానమునకు చేయు ఏ అప్పీలునైనను సంక్షిప్తముగా నిర్ధారణ చేయుటకైన నియమములు;

(జె) 317వ అనుచ్ఛేదము యొక్క ఖండము (1)లో నిర్దేశింపబడిన పరిశీలన ప్రక్రియను గూర్చిన నియమములు.

(2) [3][ [4](* * *) ఖండము (3) యొక్క నిబంధనలకు] అధ్యధీనమై, ఈ అనుచ్ఛేదము క్రింద చేయబడిన నియమములు ఏ ప్రయోజనము కొరకు కనీసము ఎంతమంది న్యాయాధీశులు ఉపవిష్టులు కావలెనో నియతము చేయవచ్చును, మరియు ఏక న్యాయధీశుని యొక్కయు విభక్త న్యాయస్థానముల యొక్కయు అధికారములను గూర్చి నిబంధనలను చేయవచ్చును.

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 పరిచ్ఛేదము 26 ద్వారా 1.2.1977 నుండి చొప్పించబడినది.
2. సంవిధాన (నలుబది మూడవ సవరణ) చట్టము, 1977, 6వ అనుచ్ఛేదములో ''అనుచ్ఛేదములు 131ఏ మరియు 139బీ'' అనుపదములకు బదులు 13.4.1978 నుండి బదులుగా ఉంచబడినది.
3. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 26వ పరిచ్ఛేదము ద్వారా ''ఖండము (3) యొక్క నిబంధనలకు'' అనుపదములు 1.2.1977 నుండి చేర్చబడినది.
4. సంవిధాన (నలుబది మూడవ సవరణ) చట్టము, 1977 యొక్క 6వ పరిచ్ఛేదము ద్వారా కొన్ని పదములు, అంకెలు, అక్షరములు 13.4.1978 నుండి లుప్తము చేయబడినవి.

(3) ఈ సంవిధానము యొక్క అర్థాన్వయమును గూర్చి సారభూతమైన శాసనిక ప్రశ్న ఇమిడియున్న ఏదేని కేసును నిర్ణయించుటకుగాని, 143వ అనుచ్ఛేదము క్రింద ఏదేని నిర్దేశమును ఆకర్ణించుటకుగాని [1][[2](* * *)కనీసము] అయిదుగురు న్యాయాధీశులు ఉపవిష్టులు కావలెను:

అయితే 132వ అనుచ్ఛేదము మినహా ఈ అధ్యాయము నందలి ఇతర నిబంధనల క్రింద ఏదేని అప్పీలును ఆకర్ణించుచున్న న్యాయస్థానము ఐదుగురుకన్న తక్కువ న్యాయాధీశులతో కూడియుండిన యెడల, మరియు ఆ అప్పీలును ఆకర్ణించుచున్నప్పుడు ఈ సంవిధానపు అర్థాన్వయమునకు సంబంధించిన ఏదేని సారభూతమైన శాసనిక ప్రశ్న దానియందు ఇమిడియున్నదనియు, ఆ అప్పీలు పరిష్కరించుటకు ఆ ప్రశ్నను నిర్ధారణ చేయుట ఆవశ్యకమనియు, ఆ న్యాయస్థానము అభిప్రాయపడినచో, అట్టి ప్రశ్న ఇమిడియున్న ఏదేని ఈ ఖండముచే ఆపేక్షితమైనట్లు సంఘటిత మొనర్చబడిన న్యాయస్థానమునకు అభిప్రాయార్థము నిర్దేశించవలెను, మరియు ఆ అభిప్రాయము అందినమీదట దానికనుగుణముగా ఆ అప్పీలును పరిష్కరించవలెను.

(4) సర్వోన్నత న్యాయస్థానము, ఆ న్యాయస్థానములో బహిరంగముగా తప్ప ఏ తీర్పునైనను ఒసగరాదు; ఆ న్యాయస్థానములో బహిరంగముగనే యొసగబడిన అభిప్రాయము, ప్రకారము తప్ప 143వ అనుచ్ఛేదము క్రింద ఎట్టి నివేదికను పంపరాదు.

(5) కేసునాకర్ణించు సమయమున హాజరై ఉండిన న్యాయాధీశులలో అధిక సంఖ్యాకుల ఏకీభావముతో తప్ప, సర్వోన్నత న్యాయస్థానము ఎట్టి తీర్పుగాని, ఎట్టి అభిప్రాయమునుగాని ఒసగరాదు, కాని అట్లు ఏకీభవించని న్యాయాధీశుడు తన విసమ్మతి తీర్పును లేక విసమ్మతి అభిప్రాయమును ఒసగుట నుండి ఈ ఖండములో నున్నదేదియు, అతనిని నివారించునదిగా భావింపబడరాదు.

**సర్వోన్నత న్యాయస్థానము యొక్క అధికారులు, సేవకులు మరియు వ్యయములు.**

146. (1) సర్వోన్నత న్యాయస్థానపు అధికారుల యొక్కయు, సేవకుల యొక్కయు నియామకము భారత దేశ ముఖ్య న్యాయమూర్తిచే గాని, ఆయన ఆదేశించునట్టు ఆ న్యాయస్థానపు ఇతర న్యాయాధీశుడు లేక అధికారిచే గాని చేయబడవలెను:

అయితే రాష్ట్రపతి, నియమము ద్వారా, ఆ నియమములో నిర్దిష్టపరచబడు సందర్భములలో ఇంతకు ముందే ఆ న్యాయస్థానమునకు చెందియుండని ఏ వ్యక్తిగాని, సంఘ పబ్లికు సేవా కమీషనుతో సంప్రదించిన పిమ్మట తప్ప, ఆ న్యాయస్థానమునకు సంబంధించిన ఎట్టి పదవిలోను నియమించరాదని ఆపేక్షించవచ్చును.

(2) పార్లమెంటు చేసిన ఏదేని శాసనము యొక్క నిబంధనలకధ్యధీనమై, సర్వోన్నత న్యాయస్థానపు అధికారులు మరియు సేవకుల సేవా షరతులు, భారతదేశ ముఖ్య న్యాయమూర్తిచే లేక భారతదేశ ముఖ్య న్యాయమూర్తి ఆ ప్రయోజనముల కొరకు నియమావళిని చేయుటకై ప్రాధికారమొసగు ఆ న్యాయస్థానపు ఇతర న్యాయాధీశునిచే లేక అధికారిచే చేయబడిన నియమావళి ద్వారా విహితము చేయబడినట్టివై యుండును:

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము యొక్క 26వ పరిచ్ఛేదము ద్వారా ''కనీస సంఖ్య'' అను పదములు ఉంచబడినవి (1.2.1977 నుండి).

అయితే, ఈ ఖండము క్రింద చేయబడిన నియమావళి, జీతములకు, బత్తెములకు, సెలవులకు, లేక పింఛనులకు సంబంధించినంత మేరకు, రాష్ట్రపతి యొక్క ఆమోదమును పొందవలెను.

(3) సర్వోన్నత న్యాయస్థానపు అధికారులకు మరియు సేవలకు లేక వారికి సంబంధించి చెల్లించవలసిన అన్ని జీతములు, బత్తెములు, పింఛనులతో సహా, ఆ న్యాయస్థానపు పరిపాలనా వ్యయములు భారత సంచిత నిధిపై ప్రభారమై యుండును మరియు ఆ న్యాయస్థానము పుచ్చుకొను ఫీజులు, లేక ఇతర ధనములు, ఆ నిధిలో చేరి యుండును.

147. ఈ అధ్యాయములోను, భాగము 6 యొక్క అధ్యాయము 5లోనూ ఈ సంవిధానము యొక్క అర్థాన్వయమునకు సంబంధించి ఏదేని సారభూతమైన శాసనిక ప్రశ్నను గూర్చిన నిర్దేశములలో, ఇండియా ప్రభుత్వ చట్టము, 1935 (ఆ చట్టమును సవరణచేయు లేక అనుపూరకము చేయు ఏదేని అధిశాసనముతో సహా) యొక్క, లేక పరిషత్తు ఉత్తరువు యొక్క లేక ఆ ఉత్తరువు క్రింద చేయబడిన ఉత్తరువు యొక్క, లేక ఇండియా స్వాతంత్ర్య చట్టము, 1947 యొక్క లేక ఆ చట్టము క్రింద చేయబడిన ఏదేని ఉత్తరువు యొక్క, అర్థాన్వయమునకు సంబంధించి సారభూతమైన శాసనిక ప్రశ్నను గూర్చిన నిర్దేశములు చేరియున్నట్లు అన్వయించుకొనవలెను. **అర్థాన్వయము.**

## అధ్యాయము – 5

## భారతదేశ కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు

148. (1) భారత దేశమునకు కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు ఉండవలెను. ఆయనను, రాష్ట్రపతి తన చేవ్రాలు మరియు ముద్రగల అధిపత్రము ద్వారా నియమించవలెను. సర్వోన్నత న్యాయస్థానము యొక్క న్యాయాధీశుని పదవి నుండి తొలగించునట్టి రీతిలో మరియు అట్టి ఆధారములనుబట్టి మాత్రమే, ఆయన పదవి నుండి తొలగింపబడవలెను. **భారతదేశ కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు.**

(2) భారతదేశ కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలుగా నియమించబడిన ప్రతి వ్యక్తియు, తన పదవిలో ప్రవేశించుటకు పూర్వము రాష్ట్రపతి సమక్షమున లేక తద్విషయములో ఆయనచే నియమింపబడిన వ్యక్తి సమక్షమున మూడవ అనుసూచిలో అందునిమిత్తమై పొందుపరచబడిన, ప్రరూపముననుసరించి ప్రమాణము లేక ప్రతిజ్ఞ చేసి దానిపై చేవ్రాలు చేయవలెను.

(3) కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు యొక్క జీతము మరియు ఇతర సేవా షరతులు పార్లమెంటు శాసనము ద్వారా నిర్ధారణ చేయునట్టివై యుండును, మరియు అట్లు నిర్ధారణ చేయు వరకు రెండవ అనుసూచిలో నిర్దిష్టపరచబడినట్లుండును:

అయితే, కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు యొక్క నియామకము తరువాత ఆయన జీతమునుగాని, గైరుహాజరీ సెలవును, పింఛనును లేక పదవీ విరమణ వయస్సును గూర్చి ఆయనకు గల హక్కులను గాని, ఆయనకు అననుకూలతగా మార్చరాదు.

(4) కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు తన పదవి నుండి విరమించిన తరువాత, భారత ప్రభుత్వము క్రింద లేక ఏ రాజ్య ప్రభుత్వము క్రింద మరే పదవికి పాత్రుడు కారాదు.

(5) ఈ సంవిధానము యొక్కయు, పార్లమెంటుచే చేయబడిన ఏదేని శాసనము యొక్కయు నిబంధనలకు అధ్యాధీనమై, భారతీయ ఆడిటు మరియు ఖాతా విభాగములో సేవ చేయుచున్న వ్యక్తుల సేవాషరతులు, కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు యొక్క పరి పాలనాధికారములు కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలుతో సంప్రదించిన పిమ్మట రాష్ట్రపతిచే చేయబడు నియమావళి ద్వారా విహితపరచబడినట్టివై యుండును.

(6) కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు కార్యాలయమునందు సేవ చేయు వ్యక్తులకుగాని లేక వారికి చెల్లించవలసిన జీతములు, బత్తెములు మరియు పింఛనులతో సహా ఆ కార్యాలయము యొక్క పరిపాలనా వ్యయములు భారత సంచిత నిధిపై ప్రభారమై యుండవలెను.

**కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు యొక్క కర్తవ్యములు మరియు అధికారములు.**

149. కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు సంఘము మరియు రాజ్యములకు, మరియు ఏదేని ఇతర ప్రాధికారి, లేక నికాయమునకు చెందిన ఖాతాల విషయములో పార్లమెంటు చేసిన ఏదేని శాసనము ద్వారా లేక శాసనము క్రింద విహితము చేయబడినట్టి కర్తవ్యములను నిర్వర్తించవలెను, అట్టి అధికారములను వినియోగించవలెను. ఆ విషయమున అట్లు నిబంధన చేయబడువరకు, కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు, సంఘము యొక్క మరియు రాజ్యముల యొక్క ఖాతాలకు సంబంధించి, ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము క్రమశః భారతేదశ అధినివేశము యొక్కయు, ప్రావిన్సుల ఖాతాలకు సంబంధించి భారతదేశ ఆడిటరు జనరలుకు ప్రదత్తము చేయబడినట్టి కర్తవ్యములనే నిర్వర్తించవలెను, ఆయనచే వినియోగింపబడదగు అధికారములనే వినియోగించవలెను.

**సంఘము మరియు రాజ్యములకు చెందిన ఖాతాల ప్రరూపము.**

[1]150. సంఘమునకు మరియు రాజ్యములకు చెందిన ఖాతాలను భారతదేశ కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు [2][యొక్క సలహాతో] రాష్ట్రపతి విహితము చేయునట్టి ప్రరూపములో ఉంచవలెను.

**ఆడిటు రిపోర్టులు.**

151. (1) సంఘము యొక్క ఖాతాలను గూర్చి కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు యొక్క రిపోర్టులు రాష్ట్రపతికి సమర్పించవలెను. రాష్ట్రపతి వానిని పార్లమెంటు యొక్క ప్రతి సదనము సమక్షమున ఉంచు ఏర్పాటు చేయించవలెను.

(2) రాజ్యము యొక్క ఖాతాలను గూర్చిన కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు యొక్క రిపోర్టు ఆ రాజ్య గవర్నరుకు [3][......] సమర్పించబడవలెను. ఆ గవర్నరు వానిని రాజ్య శాసన మండలి సమక్షమున ఉంచు ఏర్పాటు చేయించవలెను.

## భాగము – 6

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క పరిచ్ఛేదము 27 ద్వారా 1.4.1977 నుండి అనుచ్ఛేదము కొరకు ఉంచబడినది.
2. సంవిధాన (నలుబది నాల్గవ సవరణ) చట్టము, 1978 యొక్క 22వ పరిచ్ఛేదము ద్వారా ''సంప్రదించిన పిమ్మట'' అను పదములకు బదులు ''సలహాతో'' అనుపదము 20.6.1979 నుండి బదులుగా ఉంచబడినది.
3. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజ్‌ప్రముఖ్'' అనుపదములు 01.11.1956 నుండి లుప్తము చేయబడినవి.

# [1]రాజ్యములు

## అధ్యాయము – 1

## సాధారణ విషయములు

152. ఈ భాగములో, సందర్భము అన్యథా అపేక్షించిననే తప్ప రాజ్యము [2][అను పదమునందు జమ్మూ కాశ్మీరు రాజ్యము చేరదు]. నిర్వచనము.

## అధ్యాయము – 2

## కార్యపాలకవర్గము

## గవర్నరు

153. ప్రతి రాజ్యమునకు ఒక గవర్నరు ఉండవలెను; రాజ్య గవర్నర్లు.

[3][అయితే ఈ అనుచ్ఛేదములో నున్నదేదియు ఒకే వ్యక్తిని రెండు లేక రెంటికి మించిన రాజ్యములకు గవర్నరుగా నియమించుట నుండి నివారించదు.]

154. (1) రాజ్యము యొక్క కార్యపాలకాధికారము గవర్నరు నందు నిహితమై యుండవలెను. ఆయన దానిని స్వయముగా లేక తనకు ఆధీనస్తులగు అధికారుల ద్వారా ఈ సంవిధానము ననుసరించి వినియోగించవలెను. రాజ్యము యొక్క కార్యపాలకాధికారము.

(2) ఈ అనుచ్ఛేదములో నున్నదేదియు–

(ఎ) అస్తిత్వములో నున్న ఏదేని శాసనము ద్వారా ఎవరేని ఇతర ప్రాధికారికి ప్రదత్తము చేయబడిన ఏదేని కృత్యములను గవర్నరుకు అంతరణ చేయునదిగా భావింపబడరాదు; లేక

(బి) గవర్నరుకు అధీనస్థుడైన ఏ ప్రాధికారికైనను శాసనము ద్వారా కృత్యములను ప్రదత్తము చేయుట నుండి పార్లమెంటును లేక రాజ్య శాసనమండలిని నివారించదు.

155. రాజ్యము యొక్క గవర్నరు, రాష్ట్రపతిచే, ఆయన చేవ్రాలు, ముద్రగల అధిపత్రము ద్వారా, నియమింపబడవలెను. గవర్నరు నియామకము.

156. (1) గవర్నరు, రాష్ట్రపతి అనుగ్రహముండునంతవరకు పదవియందుండును. గవర్నరు పదవీ కాలావధి.

(2) గవర్నరు తన చేవ్రాలుతో రాష్ట్రపతికి లేఖ వ్రాయుట ద్వారా, తన పదవికి రాజీనామా ఇవ్వవచ్చును.

(3) ఈ అనుచ్ఛేదములోని పూర్వగామి నిబంధనలకు అధ్యధీనమై, గవర్నరు తన పదవిలో ప్రవేశించిన తేదీ నుండి ఐదు సంవత్సరముల కాలావధి వరకు పదవియందుండును:

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''ఒకటవ అనుసూచి యొక్క భాగము–ఏ లోని'' అనుపదములు 01.11.1956 నుండి లుప్తము చేయబడినవి
2. ఇదే చట్టము యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''ఒకటవ అనుసూచి యొక్క భాగము–ఏలో నిర్దిష్టపరచబడిన రాజ్యము అని అర్థము'' అనుపదములకు బదులుగా ఉంచబడినది.
3. సంవిధానము (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 6వ పరిచ్ఛేదము ద్వారా చేర్చబడినది.

అయితే గవర్నరు తన పదావధి ముగిసినప్పటికిని, తన ఉత్తరాధికారి ఆ పదవిలో ప్రవేశించు వరకు పదవిలో కొనసాగవలెను.

157. ఏ వ్యక్తిగాని, ఆయన భారతదేశ పౌరుడైయున్ననే తప్ప, మరియు ఆయనకు ముప్పదియైదు సంవత్సరముల వయస్సు పూర్తియైననే తప్ప గవర్నరుగా నియమింపబడుటకు పాత్రుడు కారాదు. **గవర్నరుగా నియమింపబడుటకు అర్హతలు.**

158. (1) గవర్నరు, పార్లమెంటు యొక్క, లేక మొదటి అనుసూచియందు నిర్దిష్టపరచబడిన ఏదేని రాజ్య శాసన మండలి యొక్క ఏ సదనములోగాని సభ్యుడుగా ఉండరాదు, మరియు పార్లమెంటు యొక్క లేక ఏదేని అట్టి రాజ్య శాసనమండలి యొక్క ఏ సదనములోని సభ్యుడైనను, గవర్నరుగా నియమింపబడినచో ఆయన గవర్నరు పదవిలో ప్రవేశించిన తేదీ నుండి ఆ సదనములోని తన స్థానమును ఖాళీ చేసినట్లు భావింపబడవలెను. **గవర్నరు పదవీ షరతులు.**

(2) గవర్నరు, లాభాయుతమైన ఏదేని ఇతర పదవియందు ఉండరాదు.

(3) గవర్నరు, అద్దె చెల్లించకుండ తన అధికారిక నివాస గృహములను ఉపయోగించుకొను హక్కు కలిగియుండును, మరియు పార్లమెంటు శాసనము ద్వారా నిర్ధారణ చేయునట్టి ఉపలబ్ధులు, బత్తెములు మరియు విశేషాధికారములకు, మరియు తద్విషయమున అట్లు నిబంధన చేయబడు వరకు, రెండవ అనుసూచిలో నిర్దిష్టపరచబడిన ఉపలబ్ధులు, బత్తెములు, మరియు విశేషాధికారములకు ఆయన హక్కు కలిగియుండును.

[1][(3ఏ) ఒకే వ్యక్తి, రెండు లేక రెంటికి మించిన రాజ్యములకు గవర్నరుగా నియమింపబడినచో, గవర్నరుకు చెల్లించదగు ఉపలబ్ధులు, బత్తెములు, రాష్ట్రపతి ఉత్తరువు ద్వారా నిర్ధారణ చేయునట్టి అనుపాతములో ఆ రాజ్యములకు కేటాయింపబడవలెను.]

(4) గవర్నరు యొక్క ఉపలబ్ధులు మరియు బత్తెములు, ఆయన పదావధిలో తగ్గింపబడరాదు.

159. ప్రతి గవర్నరు, మరియు గవర్నరు యొక్క కృత్యములను నిర్వహించు ప్రతి వ్యక్తి, తన పదవిలో ప్రవేశించుటకు పూర్వము ఆ రాజ్యము విషయములో అధికారితను వినియోగించు ఉన్నత న్యాయస్థానము యొక్క ముఖ్య న్యాయమూర్తి సమక్షమునగాని, ఆయన హాజరు లేనప్పుడు ఆ న్యాయస్థానమందలి న్యాయాధీశులలో అందుబాటులో నున్న వారిలో సీనియర్ న్యాయాధీశుని సమక్షమునగాని, ఈ క్రింది ప్రరూపములో ప్రమాణము, లేక ప్రతిజ్ఞ చేసి, దానిపై చేవ్రాలు చేయవలెను; **గవర్నరుచే ప్రమాణము లేక ప్రతిజ్ఞ.**

''ఏ.బీ.అను నేను.... [రాజ్యము పేరు] యొక్క గవర్నరు పదవిని శ్రద్ధాపూర్వకముగ నిర్వహింతుననియు [లేక గవర్నరు యొక్క కృత్యములను శ్రద్ధాపూర్వకముగా నిర్వహింతుననియు] నా సంపూర్ణ సామర్థ్యము మేరకు సంవిధానమును మరియు శాసనమును పరిరక్షించి, సంరక్షించి, రక్షింతుననియు మరియు..... [రాజ్యము పేరు] యొక్క ప్రజల సేవలయందును, వారి

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా 01.11.1956 నుండి చొప్పించబడినది.

**కొన్ని యాదృచ్ఛిక పరిస్థితులలో గవర్నరు యొక్క కృత్యముల నిర్వహణ.**

క్షేమమునందును నిరతుడనయ్యెదననియు, దైవ సాక్షిగా ప్రమాణము చేయుచున్నాను/సత్యనిష్ఠతో ప్రతిజ్ఞ చేయుచున్నాను.''

160. ఈ అధ్యాయములో నిబంధింపబడని ఎట్టి యాదృచ్ఛిక పరిస్థితిలోనైనను, ఒక రాజ్య గవర్నరు యొక్క కృత్యములను నిర్వహించుటకు రాష్ట్రపతి తాను సబబని తలచు నిబంధనను చేయవచ్చును.

**కొన్ని సందర్భములలో క్షమావణలు మొదలైనవాటిని మంజూరు చేయుటకు, మరియు దండనోత్తరువులను సస్పెండు చేయుటకు పరిహరించుటకు లేదా లఘూ కరించుటకు గవర్నరుకుగల అధికారము.**

161. రాజ్యము యొక్క కార్యపాలకాధికారములో చేరియున్న ఏదేని విషయమునకు సంబంధించిన ఏదేని శాసనమునకు విరుద్ధమగు అపరాధమునకై, నేర నిర్ణీతుడైన వ్యక్తికి, క్షమాపణలను, తాత్కాలిక నిలుపుదలను, వాయిదాలను లేక పరిహరణలను మంజూరు చేయుటకు, లేక ఆ వ్యక్తిపై విధింపబడిన దండనోత్తరువును సస్పెండ్ చేయుటకు పరిహరించుటకు, లేక లఘూకరించుటకు రాజ్య గవర్నరు అధికారము కలిగియుండును.

**రాజ్య కార్యపాలకాధికారము యొక్క విస్తరణ.**

162. ఈ సంవిధాన నిబంధనలకు అధ్యధీనమై, రాజ్యము యొక్క కార్యపాలకాధికారములో, ఏ విషయములను గురించి శాసనములను చేయుటకు ఆ రాజ్య శాసనమండలి అధికారము కలిగియున్నదో ఆ విషయము చేరియుండును:

అయితే ఏ విషయమును గూర్చి శాసనములను చేయుటకు రాజ్య శాసనమండలి, మరియు పార్లమెంటు అధికారము కలిగియున్నవో ఆ విషయములో, రాజ్య కార్యపాలకాధికారమును ఈ సంవిధానము ద్వారాగాని పార్లమెంటు చేయు ఏదేని శాసనము ద్వారాగాని, సంఘమునకు, లేక దాని ప్రాధికారులకు అభివ్యక్తముగా ప్రదత్తము చేయబడిన కార్యపాలకాధికారమునకు అధ్యధీనమై, మరియు దానిచే పరిమితమై యుండును.

## మంత్రి పరిషత్తు

**గవర్నరుకు సహాయపడుటకును, సలహా నిచ్చుటకును మంత్రి పరిషత్తు.**

163. (1) ఈ సంవిధానము ద్వారాగాని, దాని క్రిందగాని, గవర్నరు తన కృత్యములను, లేక వాటిలో వేటనైనను తన వివేచనానుసారము నిర్వహించవలెనని అపేక్షింపబడియున్న కృత్యములు, లేక వాటిలో ఏవేని తప్ప, ఇతర కృత్యములను నిర్వహించుటలో ఆయనకు సహాయపడుటకును, సలహా నిచ్చుటకును, ముఖ్యమంత్రి ఆధిపత్యమున ఒక మంత్రి పరిషత్తు ఉండవలెను.

(2) ఈ సంవిధానము ద్వారాగాని, దాని క్రిందగాని, ఏదేని విషయమున గవర్నరు తన వివేచనానుసారము వ్యవహరించుట అపేక్షితమా, కాదా యను ప్రశ్న ఉత్పన్నమైనచో, దానిపై ఆయన తన వివేచనానుసారము చేసిన నిర్ణయము అంతిమమైయుండును; మరియు గవర్నరు తన వివేచనానుసారము వ్యవహరించియుండవలెననెడి, లేక వ్యవహరించి యుండకూడదనెడి కారణమునుబట్టి ఆయన చేసిన ఏ పని యొక్క మాన్యత ప్రష్టవ్యము (ప్రశ్నగతం) కారాదు.

(3) గవర్నరుకు మంత్రులచే ఏదేని సలహా ఈయబడినదా, లేక అట్లైనచో అది ఏది, అను ప్రశ్న ఏ న్యాయస్థానమునందును పరిశీలించబడరాదు.

**మంత్రులను గూర్చిన ఇతర నిబంధనలు.**

164. (1) ముఖ్యమంత్రి గవర్నరుచే నియమించబడవలెను. ఇతర మంత్రులు ముఖ్యమంత్రి సలహాపై గవర్నరుచే నియమించబడవలెను, మంత్రులు గవర్నరు అనుగ్రహముండునంతవరకు పదవియందుండుదురు:

అయితే [1][ఛత్తీస్‌గర్, ఝార్ఖండ్], మధ్యప్రదేశ్ మరియు *[ఒడిశా] రాజ్యములలో జనజాతుల శ్రేయస్సుకు బాధ్యత వహించు మంత్రి ఒకరు ఉండవలెను. ఆయన అనుసూచిత కులముల యొక్కయు, వెనుకబడిన వర్గముల యొక్కయు శ్రేయస్సు, లేక ఏదేని మరొక పని యొక్క అదనపు బాధ్యతను వహించవచ్చును.

[2][(1ఏ) రాజ్యములోని మంత్రి పరిషత్తులో ముఖ్యమంత్రితో సహా మొత్తము మంత్రుల సంఖ్య ఆ రాజ్య శాసన సభలోని మొత్తము సభ్యుల సంఖ్యలో పదిహేను శాతమునకు మించరాదు:

అయితే ముఖ్యమంత్రితో సహా రాజ్యములోని మంత్రుల సంఖ్య పన్నెండుకు తక్కువ ఉండరాదు:

అయితే ఇంకనూ, సంవిధాన (తొంబది-ఒకటవ సవరణ) చట్టము, 2003 ప్రారంభము నాటికి ఏదేని రాజ్యములోని మంత్రి పరిషత్తులో ముఖ్యమంత్రితో సహా మంత్రుల మొత్తము సంఖ్య పదిహేను శాతమునకు లేదా సందర్భానుసారముగా మొదటి వినాయింపులో నిర్దిష్టపరచబడిన సంఖ్యను మించినపుడు, ఆ రాజ్యములోని మంత్రుల సంఖ్యను రాష్ట్రపతిచే అధిసూచింపబడినట్టి తేదీ నుండి ఆరు మాసముల లోపల ఈ ఖండము యొక్క నిబంధనలకనుగుణంగా ఏర్పాటు చేయబడవలెను.

(1బీ) పదవ అనుసూచి యొక్క 2వ పేరా క్రింద రాజ్య శాసనసభ లేక శాసన పరిషత్తును కలిగియున్న రాజ్యము యొక్క శాసన మండలి ఉభయ సదనములలోని ఏదేని సదనములో ఏదేని రాజకీయ పార్టీకి చెందియుండి, ఆ సదనము యొక్క సభ్యునిగా ఉండుటకు నిరర్హుడైన సభ్యుడు, అతని నిరర్హత ప్రారంభపు తేదీ నుండి అట్టి సభ్యునిగా అతని పదవీ కాలావధి ముగియునంతవరకు లేదా అతను అట్టి కాలావధి ముగియుకముందే రాజ్య శాసనసభ లేక సందర్భానుసారముగా శాసన పరిషత్తును కలిగియున్న రాజ్యము యొక్క శాసన మండలి ఉభయ సదనములలో ఏదేని సదనపు ఏదేని ఎన్నికకు పోటీ చేసి ఎన్నికైనట్లుగా ప్రఖ్యానింపబడు తేదీ వరకు వీటిలో ఏది ముందుగా వచ్చునో అంత కాలావధి వరకు ఖండము (1) క్రింద మంత్రిగా నియోజితుడగుటకు కూడ నిరర్హుడగును.]

(2) మంత్రి పరిషత్తు, రాజ్య శాసనసభకు సమిష్టిగా ఉత్తరదాయియై యుండును.

---

1. సంవిధాన (తొంబది నాలుగవ సవరణ) చట్టము, 2006 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ''బీహారు'' అనుదానికి బదులుగా ఉంచబడినది.

* ఒరిస్సా (పేరు మార్పు) చట్టము, 2011 , 4వ పరిచ్ఛేదము ద్వారా ''ఒరిస్సా'' కొరకు 01-11-2011 నుండి బదులుగా ఉంచబడినది.

2. సంవిధాన (తొంబది ఒకటవ సవరణ) చట్టము, 2003 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 1-1-2004 నుండి చొప్పించబడినది.

(3) ఒక మంత్రి తన పదవిలో ప్రవేశించుటకు పూర్వము, పదవియొక్కయు, రహస్య గోపనము యొక్కయు ప్రమాణములను మూడవ అనుసూచిలో అందునిమిత్తము పొందుపరచబడియున్న ప్రరూపములననుసరించి, అతనిచే గవర్నరు చేయించవలెను.

(4) రాజ్యశాసన మండలి యందు వరుసగా ఆరు మాసముల కాలావధి వరకు సభ్యుడిగా లేని మంత్రి, ఆ కాలావధి ముగియగనే మంత్రి పదవిని కోల్పోవును.

(5) మంత్రుల జీతములు, బత్తెములు రాజ్య శాసనమండలి ఆయా సమయములందు శాసనము ద్వారా నిర్ధారణ చేయునట్టివై యుండును. రాజ్య శాసనమండలి అట్లు నిర్ధారణ చేయు వరకు అవి రెండవ అనుసూచిలో నిర్దిష్టపరచబడినట్లుండును.

## రాజ్యము యొక్క అడ్వకేటు జనరలు

165. (1) ఉన్నత న్యాయస్థానము యొక్క న్యాయాధీశునిగ నియమింపబడుటకు అర్హుడైన వ్యక్తిని, ప్రతి రాజ్య గవర్నరు రాజ్యము యొక్క అడ్వకేటు జనరలుగా నియమించవలెను. **రాజ్యము యొక్క అడ్వకేటు జనరలు.**

(2) ఆయా సమయములందు శాసనిక విషయములలో గవర్నరుచే తనకు నిర్దేశింపబడు వానిపై రాజ్య ప్రభుత్వమునకు సలహానిచ్చుటయు, గవర్నరుచే తనకు అప్పగించబడు శాసనిక స్వభావముగల ఇతర కర్తవ్యములను నిర్వర్తించుటయు, ఈ సంవిధానము ద్వారా లేక దాని క్రింద తత్సమయమున అమలులోనున్న ఏదేని ఇతర శాసనము ద్వారా లేక దాని క్రింద తనకు ప్రదత్తము చేయబడిన కృత్యములను నిర్వహించుటయు, అడ్వకేటు జనరలు యొక్క కర్తవ్యమైయుండును.

(3) అడ్వకేటు జనరలు గవర్నరు యొక్క అనుగ్రహముండునంతవరకు పదవియందుండును, మరియు గవర్నరు నిర్ధారణ చేయు ప్రతిమూల్యమును పొందవలెను.

## ప్రభుత్వ కార్యకలాపముల నిర్వహణము

166. (1) రాజ్య ప్రభుత్వమునకు చెందిన కార్యపాలక చర్యయంతము గవర్నరు పేర తీసికొనబడినట్లు అభివ్యక్తపరచబడవలెను. **రాజ్యప్రభుత్వము యొక్క కార్యకలాప నిర్వహణము.**

(2) గవర్నరు పేర చేయబడిన, మరియు అమలుపరచబడిన ఉత్తరువులు, మరియు ఇతర పత్రములు, గవర్నరు చేయు నియమావళిలో నిర్దిష్టపరచబడిన రీతిగ అధిప్రమాణితము చేయబడవలెను. అట్లు అధిప్రమాణితము చేయబడిన ఉత్తరువు యొక్క, లేక పత్రము యొక్క మాన్యత, అది గవర్నరుచే చేయబడినట్టి, లేక అమలుపరచబడినట్టి ఉత్తరువు, లేక పత్రము కాదనెడి కారణమునుబట్టి ప్రశ్నవ్యము కారాదు.

(3) ఈ సంవిధానము ద్వారాగాని, దాని క్రిందగాని, గవర్నరు తన వివేచనానుసారము వ్యవహరించవలెనని అపేక్షించబడిన కార్యకలాపములు తప్ప, రాజ్య ప్రభుత్వమునకు చెందిన ఇతర కార్యకలాపములను మిక్కిలి సుకరముగ జరుపుటకును, ఆ కార్యకలాపములను మంత్రులకు కేటాయించుటకును, గవర్నరు నియమావళిని చేయవలెను.

(4) [1][.......]

167. ఈ క్రింద తెలుపబడినవి ప్రతి రాజ్యము యొక్క ముఖ్యమంత్రి కర్తవ్యములై యుండును:–

**గవర్నరుకు సమాచారమును అందజేయుట మున్నగు విషయములను గురించి ముఖ్యమంత్రి కర్తవ్యములు.**

(ఎ) రాజ్య వ్యవహారముల పరిపాలనకు సంబంధించిన విషయములలో మంత్రి పరిషత్తు యొక్క సమస్త నిర్ణయములను, మరియు శాసన నిర్మాణమునకై చేయబడిన ప్రతిపాదనలను, రాజ్య గవర్నరుకు తెలియజేయుట;

(బి) రాజ్య వ్యవహారముల పరిపాలనకును, శాసన నిర్మాణమునకై చేయబడిన ప్రతిపాదనలకును, సంబంధించిన విషయములలో గవర్నరు కోరు సమాచారమును అందజేయుట; మరియు

(సి) ఏ విషయమైనను ఒక మంత్రిచే నిర్ణయించబడి మంత్రి పరిషత్తుచే పర్యాలోచించబడనియెడల, ఆ విషయమును మంత్రి పరిషత్తు యొక్క పర్యాలోచనకు సమర్పింపవలసినదిగా గవర్నరు ఆపేక్షించినచో దానిని అట్లు సమర్పించుట.

## అధ్యాయము – 3
## రాజ్యశాసన మండలి
### సాధారణ విషయములు

168. (1) గవర్నరుతోను, మరియు –

**రాజ్యములలో శాసన మండలుల సంఘటన.**

(ఎ) [2][ఆంధ్రప్రదేశ్], బీహారు, [3][* * *] [4][మధ్యప్రదేశ్], [5][* * *] [6][మహారాష్ట్ర ] , [1][కర్నాటక], [2][.....] [3][తమిళనాడు] [4][తెలంగాణ] మరియు [5][ఉత్తరప్రదేశ్] రాజ్యములలో రాజ్యములలో రెండు సదనములతోను,

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 28వ పరిచ్ఛేదము ద్వారా 3.1.1977 నుండి చేర్చబడి, సంవిధాన (నలుబది నాల్గవ సవరణ) చట్టము, 1978 యొక్క 23వ పరిచ్ఛేదము ద్వారా (20.6.1979 నుండి) వదిలివేయబడినది.
2. ఆంధ్రప్రదేశ్ శాసనమండలి చట్టము, 2005 (2006లో 1వది) యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 30.3.2007 నుండి చొప్పించబడినది.
3. బాంబే పునర్వ్యవస్థీకరణ చట్టము, 1960 (1960లోని 11వది) యొక్క 20వ పరిచ్ఛేదము ద్వారా 1.5.1960 నుండి ''బాంబే'' అను పదము లుప్తము చేయబడినది.
4. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 8(2) పరిచ్ఛేదము ద్వారా ఈ ఉప-ఖండములో ''మధ్యప్రదేశ్'' అను పదములను చొప్పించుటకు తేదీ ఇంకనూ అధిసూచించబడలేదు.
5. తమిళనాడు శాసనమండలి (రద్దు) చట్టము, 1986 (1986లోని 40వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 1.11.1986 నుండి '' తమిళనాడు'' అను పదములు లుప్తము చేయబడినవి.
6. బాంబే పునర్వ్యవస్థీకరణ చట్టము, 1960 (1960లోని 11వది) యొక్క 20వ పరిచ్ఛేదము ద్వారా 1.5.1960 నుండి చొప్పించడినది.

(బి) ఇతర రాజ్యములలో ఒక సదనముతో కూడిన ఒక శాసన మండలి ప్రతి రాజ్యమునకు ఉండును.

(2) ఒక రాజ్య శాసనమండలియందు రెండు సదనములున్న యెడల, ఒక సదనము శాసన పరిషత్తు, రెండవది శాసనసభ అనబడవలెను, మరియు ఒకే సదనమున్న యెడల, అధి శాసన సభ అనబడవలెను.

169. (1) 168వ అనుచ్ఛేదములో ఏమియున్నప్పటికిని, శాసన పరిషత్తుగల రాజ్యములో అట్టి పరిషత్తు ఉత్సాదన చేయుటకుగాని, అట్టి పరిషత్తులేని రాజ్యములో అట్టి పరిషత్తును ఏర్పాటు చేయుటకుగాని, ఆ రాజ్యము యొక్క శాసనసభ, ఆ సభ యొక్క మొత్తము సభ్యులలో అధిక సంఖ్యాకులచే, మరియు హాజరైయుండి ఓటు చేయు సభ్యులలో మూడింట రెండు వంతులకు తక్కువకాని అధిక సంఖ్యాకులచే, అట్లు చేయవలెనని తీర్మానము చేయబడినచో, పార్లమెంటు శాసనము ద్వారా అందుకై నిబంధన చేయవచ్చును.

**రాజ్యములలో శాసన పరిషత్తులు ఉత్సాదన (రద్దు) లేక ఏర్పాటు.**

(2) ఖండము (1)లో నిర్దేశింపబడిన ఏదేని శాసనము, దాని నిబంధనలను అమలుపరచుటకు ఆవశ్యకమగు సంవిధాన సవరణకైన నిబంధనలను కలిగియుండవలెను, మరియు పార్లమెంటు ఆవశ్యకమని భావించు అనుపూరక, ఆనుషంగిక, పారిణామిక నిబంధనలను కూడా కలిగి యుండవచ్చును.

(3) పైనచెప్పబడిన శాసనము ఏదియు, 368వ అనుచ్ఛేదవు నిమిత్తము ఈ సంవిధాన సవరణగా భావింపబడరాదు.

[6]170. (1) 333వ అనుచ్ఛేదములోని నిబంధనలకు అధ్యధీనమై, ప్రతి రాజ్య శాసనసభ, ఆ రాజ్యములోని ప్రాదేశిక నియోజకవర్గముల నుండి ప్రత్యక్ష ఎన్నిక ద్వారా ఎంపిక చేయబడిన అయిదువందల మందికి మించని, అరువది మందికి తక్కువకాని, సభ్యులతో కూడియుండును.

**శాసనసభల సంరచన.**

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 8(1)వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడిన ''మైసూరు రాజ్యముల (పేరు మార్పు) చట్టము, 1973 (1973లోని 31వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 1.11.1973 నుండి ఉంచబడినది.
2. పంజాబ్ శాసనమండలి (రద్దు) చట్టము, 1969 (1969లోని 46వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 7.1.1970 నుండి ''పంజాబు'' అను పదము లుప్తము చేయబడినది.
3. తమిళనాడు శాసనమండలి చట్టము, 2010 (2010 లోని 16వది) 3వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది (తేదీ ఇంకనూ అధిసూచించబడలేదు.)
4. ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టము, 2014 (2014 లోని 6వది) 96వ పరిచ్ఛేదము ద్వారా ''ఆంధ్రప్రదేశ్'' కొరకు 1-6-2014 నుండి బదులుగా ఉంచబడినది.
5.పశ్చిమ బెంగాలు శాసనమండలలి (రద్దు) చట్టము, 1969 (1969లోని 20వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 1.8.1969 నుండి ''ఉత్తర ప్రదేశ్ మరియు పశ్చిమ బెంగాలు'' ఉంచబడినది.
6. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 9వ పరిచ్ఛేదము ద్వారా 170వ అనుచ్ఛేదమునకు బదులుగా 1.11.1956 నుండి ఉంచబడినది.

(2) ఖండము (1) నిమిత్తము అందలి ప్రతి నియోజకవర్గపు జనసంఖ్యకును, ఆ నియోజక వర్గమునకు కేటాయించబడిన స్థానముల సంఖ్యకును గల నిష్పత్తి ఆచరణీయమైనంత మేరకు, రాజ్యమునందంతటను ఒకే రీతిగ నుండునట్లు ప్రతి రాజ్యము ప్రాదేశిక నియోజకవర్గములుగా విభజింపబడవలెను.

[1][**విశదీకరణ:–** ఈ ఖండములో 'జనసంఖ్య' అను పదబంధమునకు, కట్టకడపటిదియు, అందుకు సంబంధించిన అంకెలు ప్రచురింపబడినదియు అగు జనగణలో అభినిశ్చితమైన జనసంఖ్య అని అర్థము:

అయితే ఈ విశదీకరణలో, కట్టకడపటియు, అందుకు సంబంధించిన అంకెలు ప్రచురింపబడినదియు అగు జనగణనకు గల నిర్దేశమును [2][2026వ] సంవత్సరము పిమ్మట చేయబడు మొదటి జనగణనకు సంబంధించిన అంకెలు ప్రచురింపబడు వరకు [3][2001వ] సంవత్సరపు జనగణనకు నిర్దేశమైనట్లు అన్వయించుకొనవలెను.]

(3) ప్రతియొక జనగణన పూర్తియైన పిమ్మట, ప్రతి రాజ్య శాసనసభలోని మొత్తము స్థానముల సంఖ్య మరియు ప్రాదేశిక నియోజకవర్గములుగ ప్రతి రాజ్యము యొక్క విభజన, పార్లమెంటు శాసనము ద్వారా నిర్ధారణ చేయునట్టి ప్రాధికారిచే, మరియు అట్టి రీతిలో, తిరిగి సర్దుబాటు చేయబడవలెను:

అయితే, అట్లు తిరిగి చేయబడిన సర్దుబాటు, అప్పుడు అస్తిత్వములో నున్న శాసనసభ విఘటితమగువరకు, ఆసభలోని ప్రాతినిధ్యమునకు భంగము కలిగించరాదు:

[4][''అంతేకాక అట్లు తిరిగి చేయబడిన సర్దుబాటు, రాష్ట్రపతి ఉత్తరువు ద్వారా నిర్దిష్టపరచునట్టి తేదీ తేదీ నుండి అమలులోనికి వచ్చును, మరియు అట్టి సర్దుబాటు అమలులోనికి వచ్చు వరకు ఆ శాసనసభకు చెందిన ఏ ఎన్నికనైనను అట్టి సర్దుబాటునకు పూర్వము ఉన్న ప్రాదేశిక నియోజక వర్గముల ప్రాతిపదికపై జరుపవచ్చును:

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 29వ పరిచ్ఛేదము ద్వారా, ఆదిలో ఉండిన విశదీకరణకు బదులుగా 3.1.1977 నుండి ఉంచబడినది.
2. సంవిధాన (ఎనుబది నాలుగవ సవరణ) చట్టము, 2001 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా ''2000'' మరియు ''1971'' కొరకు బదులుగా 21.02.2002 నుండి ఉంచబడినది.
3. సంవిధాన (ఎనుబది ఏడవ సవరణ) చట్టము, 2003 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా ''1991'' కొరకు బదులుగా 22.06.2003 నుండి ఉంచబడినది.''1991'' అంకెలను మొదటి అంకెలు '1971'' లకు బదులుగా సంవిధాన (84వ సవరణ) చట్టము, 2001, 5వ పరిచ్ఛేదము ద్వారా 21.2.2002 నుండి ఉంచబడినది.
4. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 29వ పరిచ్ఛేదము ద్వారా 31.1.1977 నుండి ఉంచబడినది.

[1][అంతేకాక ఇంకను, [2][2026వ] సంవత్సరము పిమ్మట చేయబడు మొదటి జనగణనకు సంబంధించి అంకెలు ప్రచురింపబడు వరకు ఈ ఖండము క్రింద

(i) ప్రతియొక రాజ్యశాసన సభలోని స్థానముల మొత్తము సంఖ్యను 1971వ సంవత్సరపు జనగణన ప్రాతిపాదికపై తిరిగి సర్దుబాటు చేయుట వరకు

(ii) [3][2001వ] సంవత్సరపు జనగణన ప్రాతిపదికపై తిరిగి సర్దుబాటు చేయబడునట్టి రాజ్యమును ప్రాదేశిక నియోజకవర్గములుగ విభజించుటయు, సర్దుబాటు చేయుటకు ఆవశ్యకము కాదు.]

**శాసన పరిషత్తుల సంరచన.**

171. (1) శాసన పరిషత్తుగల రాజ్యము యొక్క శాసన పరిషత్తులోని సభ్యుల మొత్తము సంఖ్య, ఆ రాజ్య శాసనసభలోని సభ్యుల మొత్తము సంఖ్యలో [4][మూడవ వంతుకు] మించరాదు:

అయితే రాజ్య శాసనపరిషత్తులోని సభ్యుల మొత్తము సంఖ్య ఏ సందర్భములోను నలుబదికి తగ్గరాదు.

(2) పార్లమెంటు శాసనము ద్వారా అన్యథా నిబంధించువరకు రాజ్య శాసనపరిషత్తు యొక్క సంరచన ఖండము (3)లో నిబంధించబడినట్లు ఉండును.

(3) రాజ్య శాసన పరిషత్తులోని మొత్తము సభ్యులలో-----

(ఎ) వీలయినంత దగ్గరి సంఖ్యలో గల మూడవ వంతు మంది, రాజ్యములోని పురపాలికల యొక్క జిల్లా బోర్డుల యొక్క, మరియు పార్లమెంటు శాసనము ద్వారానిర్ధిష్టపరచు ఇతర స్థానిక ప్రాధికారుల యొక్క సభ్యులతో కూడిన నిర్వాచక గణముచే ఎన్నుకొనబడవలెను;

(బి) వీలయినంత దగ్గర సంఖ్యలో పండ్రెండవ వంతు (1/12) మంది కనీసము మూడు సంవత్సరములు భారతదేశ రాజ్యక్షేత్రములోని ఏదైనా విశ్వవిద్యాలయము యొక్క పట్టభద్రులుగా నుండి లేక పార్లమెంట్ చేసన ఏదేని శాసనము ద్వారా లేక దాని క్రింద అట్టి

---

1. సంవిధాన (ఎనుబది నాలుగవ సవరణ) చట్టము, 2001, యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా కొన్ని పదములకు బదులుగా ఉంచబడినది.

2. సంవిధాన (ఎనుబది నాలుగవ సవరణ) చట్టము, 2001 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా ''2000'' మరియు ''1971'' కొరకు ఉంచబడినది.

3. సంవిధాన (ఎనుబది ఏడవ సవరణ) చట్టము, 2003 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా ''1991'' కొరకు ఉంచబడినది.

4. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 10వ పరిచ్ఛేదము ''నాలుగవ వంతుకు'' బదులుగా 1-11-1956 నుండి ఉంచబడినది.

ఏదేని విశ్వవిద్యాలయము యొక్క పట్టభద్రుని అర్హతలకు సమానమని విహితము చేయబడిన అర్హతలను కనీసము మూడు సంవత్సరముల నుండి కలిగియుండి, ఆ రాజ్యములో నివసించు వ్యక్తులతో కూడిన నిర్వాచక గణముచే ఎన్నుకొనబడవలెను;

(సి) వీలైనంత దగ్గరి సంఖ్యలో పండ్రెండవ వంతు (1/12) మంది, పార్లమెంటు చేసిన ఏదేని శాసనము ద్వారా, లేక శాసనము క్రింద విహితము చేయబడునట్టి, సెకండరీ పాఠశాల స్థాయికి తక్కువకాని, ఆ రాజ్యము నందలి విద్యాసంస్థలలో కనీసము మూడెళ్లపాటు అధ్యాపనమునందు నిమగ్నులైన వ్యక్తులతో కూడిన నిర్వాచక గణముచే ఎన్నుకొనబడవలెను;

(డి) వీలైనంత దగ్గరి సంఖ్యలో మూడవ వంతు (1/3) మంది, ఆ రాజ్య శాసన సభా సభ్యులచే, ఆ సభలో సభ్యులు కానట్టి వ్యక్తుల నుండి ఎన్నుకొనబడవలెను;

(ఇ) మిగిలినవారు, గవర్నరుచే ఖండము (5) యొక్క నిబంధనలననుసరించి నామ నిర్దేశము చేయబడవలెను.

(4) ఖండము (3) యొక్క ఉపఖండములు (ఎ), (బి), (సి)ల క్రింద ఎన్నుకొనబడవలసిన సభ్యులు, పార్లమెంటు చేసిన ఏదేని శాసనము ద్వారా లేక దాని క్రింద విహితము చేయబడు ప్రాదేశిక నియోజకవర్గముల నుండి ఎంపిక చేయబడవలెను. సదరు ఉప-ఖండముల క్రిందను, సదరు ఖండము యొక్క ఉప-ఖండము (డి) క్రిందను జరుగు ఎన్నికలు, ఏకల అంతరణీయ ఓటు ద్వారా అనుపాతిక ప్రాతినిధ్య పద్ధతిననుసరించి జరుగవలెను:-

(5) ఖండము (3) యొక్క ఉప-ఖండము (ఇ) క్రింద గవర్నరుచే నామనిర్దేశము చేయబడవలసిన సభ్యులు ఈ క్రింది వాటిని బోలిన విషయములందు విశేష జ్ఞానముగాని, వ్యావహారికానుభవముగాని, కలిగిన వ్యక్తులై యుండవలెను, అవేవనగా,

సాహిత్యము, విజ్ఞాన శాస్త్రము, కళ, సహకారోద్యమము మరియు సాంఘిక సేవ.

**రాజ్య శాసన మండలుల కాలావధి.**

172. (1) ప్రతి రాజ్యము యొక్క ప్రతి శాసన సభయు, దాని మొదటి సమావేశమునకై నియతమైన తేదీ నుండి [1] [అయిదు సంవత్సరముల] వరకు, ఆలోపున విఘటన చేయబడిననే తప్ప, కొనసాగవలెను, అంతకు మించి కొనసాగరాదు. సదరు [1][అయిదు సంవత్సరముల] కాలావధి యొక్క ముగింపు ఆ సదనముల యొక్క విఘటనముగా ప్రవర్తితము కావలెను:

అయితే ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము అమలులోనున్నప్పుడు, ఒక్కొక్కసారి ఒక్కొక్క సంవత్సరమునకు మించకుండునట్లును, ఏ సందర్భములోనైనను, సదరు అధిప్రఖ్యానము యొక్క అమలు ఆగిపోయిన తరువాత ఆరు నెలలకు మించకుండునట్లును, సదరు కాలావధిని పార్లమెంటు శాసనము ద్వారా పొడిగించవచ్చును.

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 30వ పరిచ్ఛేదము ద్వారా ''అయిదు సంవత్సరములు'' అను పదములకు బదులుగా ''ఆరు సంవత్సరములు'' అను పదములు 3.1.1977 నుండి ఉంచబడి, సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 24వ పరిచ్ఛేదము ద్వారా ''ఆరు సంవత్సరములు'' అను పదములకు బదులుగా 6.9.1979 నుండి ఉంచబడినవి.

(2) రాజ్య శాసన పరిషత్తు విఘటనకు లోనుకాదు. కాని పార్లమెంటు శాసనము ద్వారా తద్విషయమున చేయు నిబంధనలననుసరించి, శాసనపరిషత్తు సభ్యులలో వీలయినంత దగ్గరి సంఖ్యలో గల మూడవ వంతు మంది ప్రతి రెండవ సంవత్సరము ముగిసిన పిదప వీలైనంత త్వరితముగా పదవి నుండి విరమించవలెను.

173. ఏ వ్యక్తియైనను, రాజ్య శాసన మండలిలోని స్థానమును పూరించుటకై- **రాజ్య శాసన మండలుల సభ్యత్వమునకు అర్హత.**

[1][(ఎ) తాను భారతదేశ పౌరుడైయుండి, ఎన్నికల కమీషనుచే తద్విషయమై ప్రాధీకృతుడైన వ్యక్తి సమక్షమున, మూడవ అనుసూచిలో అందు నిమిత్తము పొందుపరచబడిన ప్రరూపము ననుసరించి ప్రమాణము, లేక ప్రతిజ్ఞ చేసి దానిపై చేవ్రాలు చేసిననే తప్ప;]

(బి) శాసన సభలోని స్థానము విషయములో ఇరువదియైదు సంవత్సరముల వయస్సునకు తక్కువ కాకుండాను, శాసన పరిషత్తులోని స్థానము విషయములో ముప్పది సంవత్సరముల వయస్సునకు తక్కువ కాకుండను, ఉన్ననే తప్ప; మరియు

(సి) పార్లమెంటుచే చేయబడిన ఏదేని శాసనము ద్వారాగాని, దాని క్రిందగాని, తద్విషయమున విహితము చేయబడు ఇతర అర్హతలను కలిగియున్ననే తప్ప;

ఎంపిక చేయబడుటకు అర్హుడుకాడు.

[2][174. (1) గవర్నరు, ఆయా సమయములందు రాజ్యశాసనమండలి యొక్క సదనమును, లేక ప్రతియొక సదనమును, ఆయన సబబని తలచు సమయమునను, స్థలమునను, సమావేశమగుటకు ఆహ్వానించవలెను, కాని, దాని ఒక అధివేశనములోని కడపటి ఉపవేశనమునకును, దాని మరుసటి అధివేశనములోని మొదటి ఉపవేశనమునకు నియతమైన, తేదీకిని మధ్య ఆరు మాసముల అంతరము ఉండరాదు. **రాజ్య శాసన మండలి యొక్క అధివేశనములు, అధివేశనావసానము మరియు విఘటన.**

(2) గవర్నరు ఆయా సమయములందు-

(ఎ) ఆ సదనము యొక్క, లేక ఆసదనములలో ఏదేని ఒకదాని యొక్క అధివేశనావసానము చేయవచ్చును.

(బి) శాసనసభను విఘటన చేయవచ్చును.]

175. (1) గవర్నరు, శాసన సభలోను, లేక శాసన పరిషత్తుగల రాజ్యము విషయములో శాసనమండలి యొక్క సదనములలో దేనియందైనను కలిసి సమావేశమైన ఉభయ సదనములలోనైనను, ప్రసంగించవచ్చును, మరియు అందు నిమిత్తము సభ్యుల హాజరిని కోరవచ్చును. **సదనము లేక సదనములలో ప్రసంగించుటకును వాటికి సందేశములను పంపుటకును గవర్నరుకుగల హక్కు.**

---

1. సంవిధాన (పదహారవ సవరణ) చట్టము, 1963 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా ఖండము (ఎ)కు బదులుగా 5.10.1963 నుండి ఉంచబడినది.
2. సంవిధాన (మొదటి సవరణ) చట్టము, 1951 యొక్క 8వ పరిచ్ఛేదము ద్వారా 174వ అనుచ్ఛేదమునకు బదులుగా 18.6.1951 నుండి ఉంచబడినది.

(2) గవర్నరు, రాజ్య శాసన మండలి యొక్క సదనము లేక సదనములలో దేనికైనను, శాసన మండలిలో అప్పటికి ఆలోచనలోనున్న బిల్లును గూర్చి గాని, అన్యథాగాని, సందేశములను పంపవచ్చును, మరియు ఏ సదనమునకు అట్టి సందేశము పంపబడునో ఆ సదనము ఏ విషయమును పర్యాలోచించుటకు ఆ సందేశము ద్వారా అపేక్షించబడినదో ఆ విషయమును గూర్చి వీలైనంత త్వరితముగ పర్యాలోచించవలెను.

176. (1) గవర్నరు శాసనసభ యొక్క [1][ప్రతి సాధారణ ఎన్నికల తర్వాతి మొదటి అధివేశనము యొక్క ప్రారంభమునను, ప్రతి సంవత్సరము మొదటి అధివేశనము యొక్క ప్రారంభమునను] శాసనసభను లేక శాసన పరిషత్తుగల రాజ్యము విషయములో కలిసి సమావేశమైన ఉభయ సదనములను, సంభోదించి శాసనమండలిని ఆహ్వానించిన కారణములను తెలియజేయుచు ప్రసంగించవలెను.

**గవర్నరు యొక్క విశేష ప్రసంగము.**

(2) సదనవు, లేక ఉభయ సదనముల ప్రక్రియను క్రమబద్ధము చేయు నియమావళి ద్వారా, గవర్నరు ప్రసంగములో నిర్దేశించబడిన విషయములను చర్చించుటకై కాలమును కేటాయించుటకు [2][.........] నిబంధన చేయబడవలెను.

177. ఒక రాజ్యమునకు చెందిన ప్రతి మంత్రి మరియు అడ్వకేటు జనరలు ఆ రాజ్య శాసన సభలోను, లేక శాసన పరిషత్తుగల రాజ్యము విషయములో ఉభయ సదనములలోను మాట్లాడుటకును, అన్యథా వాటి కార్యకలాపములలో పాల్గొనుటకును, మరియు ఆయన సభ్యుడుగ పేర్కొనబడిన శాసనమండలి యొక్క ఏ కమిటీలోనైనను మాట్లాడుటకును, అన్యథా దాని కార్యకలాపములలో పాల్గొనుటకును, హక్కు కలిగియుండును, కాని ఈ అనుచ్ఛేదమును పురస్కరించుకొని ఆయన అందు ఓటు చేయుటకు హక్కు కలిగియుండడు.

**సదనములకు సంబంధించిన మంత్రులకు మరియు అడ్వకేటు జనరలుకు గల హక్కులు.**

## రాజ్య శాసన మండలి అధికారులు

178. ప్రతి రాజ్య శాసనసభయు వీలైనంత త్వరితముగ, ఆ సభయొక్క సభ్యులలో ఇద్దరిని, క్రమముగా అధ్యక్ష, ఉపాధ్యక్ష పదవులకు ఎంపిక చేయవలెను, మరియు అధ్యక్ష పదవిలోగాని, ఉపాధ్యక్ష పదవిలో గాని ఖాళీ ఏర్పడినప్పుడెల్లను, ఆ సభ మరొక సభ్యుని సందర్భానుసారముగ అధ్యక్షునిగ లేక ఉపాక్షునిగ ఎంపిక చేయవలెను.

**శాసనసభ యొక్క అధ్యక్షుడు మరియు ఉపాధ్యక్షుడు.**

179. శాసనసభ యొక్క అధ్యక్ష లేక ఉపాధ్యక్ష పదవియందున్న సభ్యుడు–

(ఎ) ఆ సభలో సభ్యత్వమును కోల్పోయినచో తన పదవిని ఖాళీ చేయవలెను;

(బి) అట్టి సభ్యుడు అధ్యక్షుడైనచో ఉపాధ్యక్షునికి, ఉపాధ్యక్షుడైనచో అధ్యక్షునికి, తన చేవ్రాలుతో లేఖ వ్రాయుట ద్వారా ఎప్పుడైనను తన పదవికి రాజీనామా ఇవ్వవచ్చును; మరియు

**అధ్యక్ష లేక ఉపాధ్యక్ష పదవిని ఖాళీ చేయుట, ఆ పదవికి రాజీనామా, ఇచ్చుట, మరియు ఆ పదవి నుండి తొలగింపబడుట.**

---

1. సంవిధాన (మొదటి సవరణ) చట్టము, 1951 ద్వారా ''ప్రతియొక్క సదనము''నకు బదులుగా ఉంచబడినది.
2. అదే చట్టపు 9వ పరిచ్ఛేదము ద్వారా ''మరియు సదనము యొక్క ఇతర కార్యకలాపములపై అట్టి పూర్వతకు'' అను పదబంధములు లుప్తము చేయబడినవి.

(సి) ఆ సభలో అప్పుడు సభ్యులుగానున్న వారందరిలో అధిక సంఖ్యాకులచే పాస్ చేయబడిన, ఆ సభ యొక్క తీర్మానము ద్వారా తన పదవి నుండి తొలగింపబడవచ్చును:

అయితే, ఖండము (సి) నిమిత్తమైన తీర్మానమేదియు, దానిని ప్రస్తావించవలెనను ఉద్దేశము గలదని నోటీసునిచ్చి కనీసము పదునాలుగు దినములు గడచిననే తప్ప, ప్రస్తావించబడరాదు:

అంతేగాక, సభా విఘటన జరిగినప్పుడెల్లను, అట్టి విఘటనానంతరము జరుగు ఆ సభ యొక్క మొదటి సమావేశమునకు అవ్యవహిత పూర్వము వరకు అధ్యక్షుడు తన పదవిని ఖాళీ చేయరాదు.

**అధ్యక్ష పదవికి చెందిన కర్తవ్యములను నిర్వర్తించుటకు గాని, అధ్యక్షుడుగా వ్యవహరించుటకుగాని, ఉపాధ్యక్షునికి, లేక ఇతర వ్యక్తికిగల అధికారము.**

180. (1) అధ్యక్ష పదవి ఖాళీగా నున్నప్పుడు అధ్యక్ష పదవికి చెందిన కర్తవ్యములు ఉపాధ్యక్షునిచే, లేక ఉపాధ్యక్ష పదవి కూడా ఖాళీగా నున్నచో అందు నిమిత్తము గవర్నరు నియమించిన సభా సభ్యునిచే, నిర్వర్తించబడవలెను.

(2) ఆ సభ యొక్క ఏదేని ఉపవేశనమునందు అధ్యక్షుడు హాజరులో లేనప్పుడు ఉపాధ్యక్షుడు, లేక ఉపాధ్యక్షుడు కూడా హాజరులో లేనప్పుడు ఆ సభ యొక్క ప్రక్రియా నియమావళిచే నిర్ధారణ చేయబడు వ్యక్తి, లేక అట్టి ఏ వ్యక్తియు హాజరు లేనప్పుడు, ఆ సభచే నిర్ధారణ చేయబడు ఎవరేని ఇతర వ్యక్తి, అధ్యక్షుడుగ వ్యవహరించవలెను.

**అధ్యక్షుని లేక ఉపాధ్యక్షుని పదవి నుండి తొలగించుటకు తీర్మానము పర్యాలోచించ బడుచునప్పుడు ఆయన అధ్యక్షత వహించకుండుట.**

181. (1) అధ్యక్షుని పదవి నుండి తొలగించుటకు తీర్మానమేదైనను పర్యాలోచనలోనున్నప్పుడు అధ్యక్షుడు, లేక ఉపాధ్యక్షుని పదవి నుండి తొలగించుటకు తీర్మానమేదైనను పర్యాలోచనలో నున్నప్పుడు ఉపాధ్యక్షుడు, శాసనసభ యొక్క ఏదేని ఉపవేశనమునందు ఆయన హాజరై యున్నప్పటికిని, అధ్యక్షత వహించరాదు; అట్టి ప్రతి ఉపవేశనమునకు 180వ అనుచ్ఛేదములోని ఖండము (2) యొక్క నిబంధనలు సందర్భానుసారముగ, అధ్యక్షుడు లేక ఉపాధ్యక్షుడు హాజరు లేనట్టి ఉపవేశనమునకు వర్తించునటులనే వర్తించును.

(2) అధ్యక్షుని పదవి నుండి తొలగించుటకు తీర్మానమేదైనను శాసనసభలో పర్యాలోచనలోనున్నప్పుడు ఆ సభలో మాట్లాడుటకును, అన్యథా దాని కార్యకలాపములలో పాల్గొనుటకును, అధ్యక్షుడు హక్కు కలిగియుండును, మరియు 189వ అనుచ్ఛేదములో ఏమి యున్నప్పటికిని, అట్టి తీర్మానము పైగాని, ఆ కార్యకలాపములో ఏదేని ఇతర విషయముపైగాని, మొదటి సారి మాత్రమే ఓటు చేయుటకు ఆయనకు హక్కు ఉండును; కాని ఓట్లు సమానమై యుండునెడల ఓటు చేయుటకు ఆయనకు హక్కు ఉండరాదు.

**శాసన పరిషత్తు యొక్క సభాపతి మరియు ఉపసభాపతి.**

182. శాసన పరిషత్తు గల ప్రతి రాజ్యము యొక్క శాసన పరిషత్తు, వీలైనంత త్వరితముగ ఆ పరిషత్తు యొక్క సభ్యులలో ఇద్దరిని క్రమముగా సభాపతి మరియు ఉపసభాపతి పదవులకు ఎంపిక చేయవలెను; మరియు సభాపతి పదవిలోగాని ఉపసభాపతి పదవిలోగాని ఖాళీ ఏర్పడినపుడెల్లను, ఆ పరిషత్తు మరొక సభ్యుని సందర్భానుసారముగ సభాపతిగా, లేక ఉపసభాపతిగ ఎంపిక చేయవలెను.

**సభాపతి లేక ఉపసభాపతి పదవిని ఖాళీ చేయుట, ఆ పదవికి రాజీనామా ఇచ్చుట మరియు ఆ పదవి నుండి తొలగించబడుట.**

183. శాసన పరిషత్తు యొక్క సభాపతి పదవియందున్న లేక ఉపసభాపతి పదవియందున్న సభ్యుడు–

(ఎ) పరిషత్తులో సభ్యత్వమును కోల్పోయినచో తన పదవి ఖాళీ చేయవలెను;

(బి) అట్టి సభ్యుడు, సభాపతియైనచో ఉపసభాపతికి, ఉపసభాపతియైనచో సభాపతికి తన చేవ్రాలుతో లేఖ వ్రాయుట ద్వారా ఎప్పుడైనను తన పదవికి రాజీనామా ఇవ్వవచ్చును; మరియు

(సి) ఆ పరిషత్తులో అప్పుడు సభ్యులుగా నున్న వారందరిలో అధిక సంఖ్యాకులచే పాస్ చేయబడిన ఆ పరిషత్తు యొక్క తీర్మానము ద్వారా పదవి నుండి తొలగింపబడవచ్చును:

అయితే ఖండము (సి) నిమిత్తమైన తీర్మానమేదియు, దానిని ప్రస్తావించవలెనను ఉద్దేశము గలదని నోటీసు ఇచ్చి కనీసము పదునాలుగు దినములు గడచిననే తప్ప, ప్రస్తావించబడరాదు.

**సభాపతి పదవికి చెందిన కర్తవ్యములను నిర్వర్తించుటకు గాని, సభాపతిగా వ్యవహరించుటకుగాని, ఉపసభాపతికి లేక ఇతర వ్యక్తికి గల అధికారము.**

184. (1) సభాపతి పదవి ఖాళీగ నున్నప్పుడు సభాపతి పదవికి చెందిన కర్తవ్యములు ఉపసభాపతిచే, లేక ఉపసభాపతి పదవి కూడ ఖాళీగా నున్నచో అందునిమిత్తము గవర్నరు నియమించిన పరిషత్తు సభ్యునిచే, నిర్వహించబడవలెను.

(2) ఆ పరిషత్తు యొక్క ఏదేని ఉపవేశనమునందు సభాపతి హాజరులో లేనప్పుడు ఉపసభాపతి, లేక ఉప సభాపతి కూడా హాజరులో లేనప్పుడు ఆ పరిషత్తు యొక్క ప్రక్రియా నియమావళిచే నిర్ధారణ చేయబడు వ్యక్తి, లేక అట్టి ఏ వ్యక్తియు హాజరు లేనప్పుడు పరిషత్తుచే నిర్ధారణ చేయబడు ఎవరేని ఇతర వ్యక్తి సభాపతిగా వ్యవహరించవలెను.

**సభాపతి లేక ఉపసభాపతిని పదవి నుండి తొలగించుటకు తీర్మానము పర్యాలోచించ బడుచున్నప్పుడు ఆయన అధ్యక్షత వహించకుండుట.**

185. (1) సభాపతిని పదవి నుండి తొలగించుటకు తీర్మానమేదైనను పర్యాలోచనలోనున్నప్పుడు సభాపతి, లేక ఉపసభాపతిని పదవి నుండి తొలగించుటకు తీర్మానమేదైనను పర్యాలోచనలోనున్నప్పుడు ఉప సభాపతి, శాసన పరిషత్తు యొక్క ఏదేని ఉపవేశము నందు ఆయన హాజరైయున్నప్పటికిని అధ్యక్షత వహించరాదు, మరియు అట్టి ప్రతి ఉపవేశమునకు 184వ అనుచ్ఛేదములోని ఖండము (2) యొక్క నిబంధనలు సందర్భానుసారముగ, సభాపతి లేక, ఉపసభాపతి, హాజరులో లేనట్టి ఉపవేశనమునకు వర్తించునటులనే వర్తించును.

(2) సభాపతి పదవి నుండి తొలగించుటకు తీర్మానమేదైనను శాసన పరిషత్తులో పర్యాలోచనలో నున్నప్పుడు ఆ పరిషత్తులో మాట్లాడుటకును, అన్యథా దాని కార్యకలాపములలో పాల్గొనుటకును సభాపతి హక్కు కలిగి యుండును, మరియు 189వ అనుచ్ఛేదములో ఏమి యున్నప్పటికిని, అట్టి తీర్మానముపైగాని ఆ కార్యకలాపములో ఏదేని ఇతర విషయముపైగాని మొదటిసారి మాత్రమే ఓటు చేయుటకు ఆయనకు హక్కు యుండును. కాని ఓట్లు సమానమై యుండునెడల ఓటు చేయుటకు ఆయనకు హక్కు ఉండదు.

**అధ్యక్షుని, ఉపాధ్యక్షుని మరియు సభాపతి, ఉపసభాపతి యొక్క జీతములు మరియు బత్తెములు.**

186. శాసన సభ యొక్క అధ్యక్షునకును, ఉపాధ్యక్షునకును, మరియు శాసన పరిషత్తు యొక్క సభాపతికిని, ఉపసభాపతికిని, క్రమముగా వారికి ఆ రాజ్య శాసన మండలి శాసనము ద్వారా నియతము చేయు జీతములు, బత్తెములు చెల్లించబడవలెను, మరియు తద్విషయమున అట్లు

**రాజ్య శాసన మండలి యొక్క సచివాలయము.**

నిబంధన చేయబడు వరకు రెండవ అనుసూచిలో నిర్ధిష్టపరచబడిన జీతములు మరియు బత్తెములు చెల్లించబడవలెను.

187. (1) రాజ్య శాసన మండలి యొక్క సదనమునకు లేక ప్రతి సదనమునకు వేరువేరుగ సచివాలయ సిబ్బంది యుండవలెను:

అయితే, ఈ ఖండములో నున్న దేదియు, శాసన పరిషత్తు గల రాజ్య శాసనమండలి విషయములో, అట్టి శాసనమండలి యొక్క ఉభయ సదనములకు చెందు ఉమ్మడి పదవులను సృష్టించుటకు నివారించునదిగా అన్వయించబడరాదు.

(2) రాజ్య శాసన మండలి యొక్క సదనపు, లేక సదనముల, సచివాలయ సిబ్బంది యొక్క భర్తీని, మరియు ఆ సిబ్బందిలో నియమించబడిన వ్యక్తుల సేవా షరతులను, ఆ రాజ్య శాసనమండలి శాసనము ద్వారా క్రమబద్ధము చేయవచ్చును.

(3) ఖండము (2) క్రింద రాజ్య శాసన మండలిచే నిబంధన చేయబడువరకు, గవర్నరు, సందర్భానుసారముగ శాసన సభ యొక్క అధ్యక్షునితో లేక శాసన పరిషత్తు యొక్క సభాపతితో సంప్రదించి ఆ సభకు లేక పరిషత్తుకు చెందిన సచివాలయ సిబ్బంది యొక్క భర్తీని, మరియు ఆ సిబ్బందిలో నియమించబడిన వ్యక్తుల సేవా షరతులను, క్రమబద్ధము చేయు నియమావళిని చేయవచ్చును; మరియు అట్లు చేయబడిన నియమావళి, సదరు ఖండము క్రింద చేయబడు ఏదేని శాసనము యొక్క నిబంధనలకు అధ్యధీనమై, ప్రభావము కలిగియుండును.

## కార్యకలాప నిర్వహణము

188. రాజ్య శాసనసభ యొక్క లేక శాసన పరిషత్తు యొక్క ప్రతిసభ్యుడు, తన స్థానమును స్వీకరించుటకు పూర్వము గవర్నరు సమక్షమున గాని, తద్విషయమున ఆయనచే నియమించబడిన వ్యక్తి సమక్షమునగాని, మూడవ అనుసూచిలో అందు నిమిత్తము పొందుపరచబడిన ప్రరూపము ననుసరించి, ప్రమాణము లేక ప్రతిజ్ఞ చేసి దానిపై చేవ్రాలు చేయవలెను. **సభ్యులచే ప్రమాణము లేక ప్రతిజ్ఞ.**

189. (1) ఈ సంవిధానములో అన్యథా నిబంధింపబడినట్లు తప్ప, రాజ్య శాసనమండలి సదనము యొక్క ఉపవేశనములో అన్ని ప్రశ్నలు అధ్యక్షుడు లేక సభాపతి లేక వారిస్థానే వ్యవహరించుచున్న వ్యక్తి మినహా, హాజరైయుండి ఓటు చేయు సభ్యులలో అధిక సంఖ్యాకుల ఓట్లచే నిర్ధారణ చేయబడవలెను. **సదనములలో ఓటింగు, ఖాళీలున్నప్పటికిని వ్యవహరించుటకు సదనములకు అధికారము మరియు కోరము.**

అధ్యక్షుడు లేక సభాపతి లేక ఆ స్థానములో వ్యవహరించుచున్న వ్యక్తి మొదటిసారి ఓటు చేయరాదు; కాని ఓట్లు సమానమైయుండునెడల ఆయన నిర్ణాయక ఓటును కలిగియుండ వలెను; మరియు అట్టి ఓటు వేయవలెను.

(2) రాజ్య శాసనమండలి యొక్క సదనమునందలి సభ్యుల స్థానములలో ఖాళీ ఏదేని ఉన్నప్పటికిని, ఆ సదనము వ్యవహరించు అధికారమును కలిగియుండును; మరియు రాజ్య శాసన మండలి యొక్క ఏవేని కార్యకలాపములలో, ఉపవిష్టుడగుటకు లేక ఓటు చేయుటకు, లేక అన్యథా పాల్గొనుటకు హక్కు కలిగియుండని ఎవరేని వ్యక్తి ఆ కార్యకలాపములలో ఉపవిష్టుడయ్యెనని, లేక

ఓటు చేసెననిగాని, అన్యథా పాల్గొనెననిగాని, ఆ తరువాత కనుగొనబడినప్పటికిని, ఆ కార్యకలాపముల మాన్యత కలిగినవై యుండును.

(3) రాజ్య శాసనమండలి శాసనము ద్వారా అన్యథా నిబంధించునంత వరకు, రాజ్య శాసనమండలి యొక్క సదనపు సమావేశమునకై కావలసిన కోరము సభ్యులు పది మంది, లేక ఆ సదనము యొక్క మొత్తము సభ్యుల సంఖ్యలో పదియవ భాగము(1/10), ఇందు ఏది అధికతరమో అధియైయుండును.

(4) రాజ్య శాసనసభ యొక్క లేక శాసనపరిషత్తు యొక్క సమావేశములందెప్పుడైనను కోరము లేనిచో, కోరము సమకూరువరకు ఆ సదనమును స్థగితమొనర్చుట లేక ఆ సమావేశమును సస్పెండు చేయుట అధ్యక్షుని యొక్క లేక సభాపతి యొక్క లేక అట్లు ఆ స్థానమున వ్యవహరించు వ్యక్తి యొక్క కర్తవ్యమై యుండును.

## సభ్యుల నిరర్హతలు

190. (1) ఒకే వ్యక్తి రాజ్య శాసనమండలి యొక్క ఉభయ సదనములలో సభ్యుడై యుండరాదు; ఉభయ సదనములకు సభ్యుడుగ ఎంపిక చేయబడిన వ్యక్తి, ఆ ఉభయ సదనములలో ఒక దాని యందలి స్థానమును ఖాళీ చేయుటకు రాజ్య శాసనమండలిచే శాసనము ద్వారా నిబంధన చేయబడవలెను. **స్థానములను ఖాళీ చేయుట.**

(2) ఒకే వ్యక్తి, మొదటి అనుసూచిలో నిర్దిష్టపరచబడిన రెండు లేక రెంటికి మించిన రాజ్యశాసన మండలులలో సభ్యుడై యుండరాదు. ఏ వ్యక్తియైనను అట్టి రాజ్యములలో రెండు లేక రెంటికి మించిన రాజ్యశాసన మండలులకు సభ్యుడుగ ఎంపిక చేయబడినచో, ఆ రాజ్యములలోని ఒక రాజ్యశాసన మండలిలో తప్ప మిగతా రాజ్య శాసన మండలులలో తన స్థానమునకు అంతకు ముందు రాజినామా ఇచ్చియుండిననే తప్ప, అట్టి మిగతా రాజ్య శాసనమండలుల లోని ఆ వ్యక్తి యొక్క స్థానము రాష్ట్రపతిచే చేయబడిన [1][నియమావళి] యందు నిర్దిష్టపరచబడు కాలావధి ముగియగనే ఖాళీ అగును.

(3) రాజ్య శాసన మండలిలోని ఏ సదనము యొక్క సభ్యుడైనను–

(ఎ) [2][191వ అనుచ్ఛేదము యొక్క ఖండము (1) లేక (2)లో] పేర్కొనబడిన నిరర్హతలలో దేనికైనను లోనైనచో; లేక

[1](బి) సందర్భానుసారముగ అధ్యక్షునికి, లేక సభాపతికి తన చేవ్రాలుతో లేఖ వ్రాయుట ద్వారా తన స్థానమునకు రాజీనామా ఇచ్చుటయు, అట్టి రాజీనామాను సందర్భానుసారముగ అధ్యక్షుడు, లేక సభాపతి స్వీకరించుటయు జరిగినచో,]

---

1. ఏకకాల సభ్యత్వ నిషేధ నియమములు, 1950 కొరకు 26.1.1950వ తేదీ నాటి న్యాయమంత్రిత్వ శాఖ అధిసూచన నెం.ఎఫ్ 46/50–సీ, భారత ప్రభుత్వ అసాధారణ గెజెట్ పేజీ 678లో చూడుము.
2. సంవిధాన (యాబది రెండవ సవరణ) చట్టము, 1985 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా అనుచ్ఛేదము 191 యొక్క ఖండము (1) బదులుగా 1.3.1985 నుండి ఉంచబడినది.

అటుపై అతని స్థానము ఖాళీ అగును:

[2] [అయితే, ఉప-ఖండము (బి)లో నిర్దేశించబడిన ఏదేని రాజీనామా విషయములో, సందర్భానుసారముగ, అధ్యక్షుడు, లేక సభాపతి ఆయనకు అందిన సమాచారమునుబట్టిగాని, అన్యథాగాని, మరియు ఆయన సబబని తలచు పరిశీలన జరిపిన పిమ్మట ఆ రాజీనామా స్వచ్ఛందముగా చేసినదికాదని లేక నిజమైనదికాదని, అభిప్రాయపడినచో ఆయన అట్టి రాజీనామాను స్వీకరించరాదు.]

(4) రాజ్య శాసన మండలిలోని ఏ సదనము యొక్క సభ్యుడైనను, ఆ సదనము యొక్క అనుజ్ఞ లేకుండ దాని సమావేశములన్నింటికి అరువది దినముల కాలావధి వరకు హాజరు కానిచో ఆయన స్థానము ఖాళీయైనట్లు ఆ సదనము ప్రఖ్యానించవచ్చును:

అయితే, సదరు అరువది దినముల కాలావధిని లెక్కించుటలో ఆ సదనము అధివేశనావసానము చేయబడియున్న, లేక వరుసగ నాలుగు దినములకు మించి స్థగితమొనర్చబడినయున్న, ఏదేని కాలావధిని లెక్కింపరాదు.

191. (1) ఒక వ్యక్తి రాజ్యశాసన సభయొక్క లేక శాసన పరిషత్తు యొక్క సభ్యుడుగ ఎంపిక చేయబడుటకు, మరియు అట్టి సభ్యుడుగ నుండుటకు ఈ క్రింది పరిస్థితులలో నిరర్హుడు అగును: **సభ్యత్వమునకు నిరర్హతలు.**

[3][(ఎ) భారత ప్రభుత్వము క్రిందగాని మొదటి అనుసూచిలో నిర్దిష్టపరచబడిన ఏదేని రాజ్య ప్రభుత్వము క్రిందగాని లాభాయుతమైన ఏ పదవియందున్న వ్యక్తికి నిరర్హత కలుగదని రాజ్య శాసన మండలిచే శాసనము ద్వారా ప్రఖ్యానింపబడినదో, ఆ పదవి కాక, అన్యమైనట్టి ఏ లాభాయుత పదవి యందైనను అతడున్నచో; ]

(బి) అతడు అస్వస్థచిత్తుడైయుండి అట్లని సమర్థ న్యాయస్థానముచే ప్రఖ్యానింపబడినచో;

(సి) అతడు అనున్ముక్త దివాలాదారైనచో;

(డి) అతడు భారతదేశ పౌరుడు కానిచో, లేక విదేశీ రాజ్యము యొక్క పౌరత్వమును తనంత తానుగా ఆర్జించియున్నచో, లేక ఏదేని విదేశీరాజ్యము పట్ల నిష్ఠను, లేక అనుషక్తిని కలిగియుండుటకు ఒప్పుకొనియున్నచో;

(ఇ) పార్లమెంటుచే చేయబడిన ఏదేని శాసనము ద్వారా గాని, దాని క్రిందగాని అతడు అట్లు నిరర్హుడుగా చేయబడినచో.

---

1. సంవిధాన (ముప్పది మూడవ సవరణ) చట్టము, 1974 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా ఉప-ఖండము (బి)కి బదులుగా 19.5.1974 నుండి ఉంచబడినది.
2. అదే చట్టపు 3వ పరిచ్ఛేదము ద్వారా 19.5.1974 నుండి చొప్పించబడినది.
3. సంవిధాన (42వ సవరణ) చట్టము, 1976 యొక్క 32వ పరిచ్ఛేదము ద్వారా బదులుగా ఉంచబడినది (తేదీ ఇంకనూ అధిసూచించబడలేదు.

[1][**విశదీకరణ:** ఈ ఖండము ప్రయోజనము నిమిత్తము] ఒక వ్యక్తి సంఘము యొక్క లేక మొదటి అనుసూచిలో నిర్దిష్టపరచబడియున్న ఏదేని రాజ్యము యొక్క మంత్రిగానున్న కారణమునుబట్టియే భారత ప్రభుత్వము క్రింద, లేక అట్టి ఏదేని రాజ్య ప్రభుత్వము క్రింద లాభాయుతమైన పదవియందున్నట్లు భావింపబడరాదు.

[2][(2) పదవ అనుసూచి క్రింద ఒక వ్యక్తి నిరర్హుడైనచో రాజ్యము యొక్క శాసన సభ లేక శాసన పరిషత్తు సభ్యుడుగా ఉండుటకు నిరర్హుడగును.]

**సభ్యుల నిరర్హతలను గూర్చిన ప్రశ్నలపై నిర్ణయము.**

[3][192. (1) రాజ్య శాసనమండలిలోని ఏ సదనము యొక్క సభ్యుడైనను, 191వ అనుచ్ఛేదము యొక్క ఖండము (1)లో పేర్కొనబడిన నిరర్హతలలో దేనికైనను లోనయినాడా అను ప్రశ్న ఉత్పన్నమైనచో, ఆ ప్రశ్న గవర్నరు నిర్ణయమునకై నిర్దేశింపబడవలెను. గవర్నరు నిర్ణయము అంతిమమైనదై యుండును.

(2) అట్టి ఏదేని ప్రశ్నపై నిర్ణయము చేయుటకు పూర్వము గవర్నరు ఎన్నికల కమీషను యొక్క అభిప్రాయమును గైకొని అట్టి అభిప్రాయానుసారము వ్యవహరింపవలెను.]

**188వ అనుచ్ఛేదము క్రింద ప్రమాణము లేక ప్రతిజ్ఞ చేయుటకు ముందు లేక అర్హత లేనప్పుడు లేక నిరర్హుడైనప్పుడు ఉపవిష్టుడైనందుకు మరియు ఓటు చేసినందుకు శాస్తి.**

193. ఏ వ్యక్తియైనను తాను 188వ అనుచ్ఛేదము యొక్క అవసరములను పాటించుటకు పూర్వము, లేక రాజ్య శాసన సభలోనైనను శాసన పరిషత్తులోనైనను సభ్యత్వమునకు తాను అర్హుడుకాడనిగాని, నిరర్హుడైనాడనిగాని, పార్లమెంటుచేనైనను రాజ్య శాసన మండలిచేనైనను చేయబడిన ఏదేని శాసనము యొక్క నిబంధనల ద్వారా తాను రాజ్యశాసన సభయందు లేక శాసన పరిషత్తునందు సభ్యుడుగ ఉపవిష్టుడగుట నుండి, లేక ఓటు చేయుట నుండి, నిషేధింపబడినాడనిగాని తెలిసియుండియు, అట్లు ఉపవిష్టుడైనచో లేక ఓటు చేసినచో ఆయన ఆ విధముగా ఉపవిష్టుడైన లేక ఓటు చేసిన ప్రతి దినమునకు అయిదు వందల రూపాయల చొప్పున శాస్తికి పాత్రుడు అగును. దానిని రాజ్యమునకు బాకీ యున్న ఋణమువలె ఆయన నుండి వసూలు చేయబడును.

## రాజ్యముల శాసన మండలులకు మరియు వాటి సభ్యులకు గల అధికారములు, విశేషాధికారములు మరియు ఉన్ముక్తతలు

**రాజ్య శాసనమండలుల సదనములకు వాటి సభ్యులకు మరియు కమిటీలకు గల అధికారములు, విశేషాధికారములు మున్నగునవి.**

194. (1) ఈ సంవిధాన నిబంధనలకును, శాసనమండలి యొక్క ప్రక్రియను క్రమబద్ధము చేయు నియమములకును, స్థాయీ ఉత్తరువులకును అధ్యధీనమై, ప్రతి రాజ్య శాసనమండలిలో వాక్ స్వాతంత్ర్యము ఉండవలెను.

---

1. సంవిధాన (యాబది రెండవ సవరణ) చట్టము, 1985 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా ''(2) ఈ అనుచ్ఛేదము నిమిత్తము'' అనుదానికి బదులుగా 1.3.1985 నుండి ఉంచబడినది.
2. అదే చట్టపు 5వ పరిచ్ఛేదము ద్వారా 1.3.1985 నుండి చొప్పించబడినది.
3. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 33వ పరిచ్ఛేదము ద్వారా 3.1.1977 నుండి ఉంచబడినదానికి బదులుగా సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 25 పరిచ్ఛేదము ద్వారా 20.6.1979 నుండి కొత్తది ఉంచబడినది.

(2) రాజ్యశాసనమండలి యొక్క సభ్యుడెవరైనను, శాసనమండలిలో, లేక దానికి చెందిన ఏదేని కమిటీలో, తాను చెప్పిన ఏ విషయమును గూర్చిగాని తాను యిచ్చిన ఏ ఓటును గూర్చిగాని ఏ న్యాయస్థానము నందును, ఎట్టి చర్యలకు పాత్రుడు కారాదు. అట్టి శాసనమండలి యొక్క ఏదేని సదనపు ప్రాధికారముచేగాని, ప్రాధికారము క్రిందగాని, ఏదేని రిపోర్టు, పత్రము, ఓటు లేక కార్యకలాపము యొక్క ప్రచురణ విషయమున ఏ వ్యక్తియు అట్లు పాత్రుడు కారాదు.

(3) ఇతర విషయములలో, రాజ్యశాసన మండలిలోని ప్రతి సదనము యొక్కయు, అట్టి శాసనమండలికి చెందిన సభ్యుల మరియు కమిటీల అధికారములు, విశేషాధికారములు మరియు ఉన్ముక్తతలు ఆయా సమయములందు శాసనమండలిచే శాసనము ద్వారా నిర్వచింపబడు నట్లుండవలెను, మరియు అట్లు నిర్వచింపబడువరకు [1][అది సంవిధాన (నలుబది నాల్గవ సవరణ) చట్టము, 1978 యొక్క 26వ పరిచ్ఛేదము అమలులోనికి వచ్చుటకు అవ్యవహిత పూర్వము ఆ సదనముకును దాని సభ్యులకును మరియు కమిటీలకును ఏమి యుండెనో అవే అయి యుండవలెను.]

(4) ఖండము (1), (2) మరియు (3)లలోని నిబంధనలు రాజ్య శాసనమండలి యొక్క సభ్యులకు వర్తించునటులనే, ఈ సంవిధానమును పురస్కరించుకొని రాజ్య శాసనమండలి యొక్క ఏ సదనములోగాని దానికి చెందిన ఏదేని కమిటీలోగాని, మాట్లాడుటకును, అన్యథా దాని కార్యకలాపములలో పాల్గొనుటకును, హక్కుగల వ్యక్తుల విషయమున కూడ వర్తించవలెను.

**సభ్యుల జీతములు, బత్తెములు.**

195. రాజ్య శాసనసభ యొక్కయు శాసనపరిషత్తు యొక్కయు సభ్యులు, శాసన మండలిచే ఆయా సమయములందు శాసనము ద్వారా నిర్ధారణ చేయబడు జీతములను, బత్తెములను పొందుటకు హక్కు కలిగియుందురు. తద్విషయమున అట్లు నిబంధన చేయబడువరకు ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము ఆ రాజ్యము స్థానములో నుండిన ప్రావిన్సు యొక్క శాసన సభకు చెందిన సభ్యుల విషయములో వర్తించుచుండినట్టి రేట్లు చొప్పునను, అట్టి షరతులపైనను, జీతములను, బత్తెములను పొందుటకు వారు హక్కు కలిగియుందురు.

## శాసన నిర్మాణ ప్రక్రియ

**బిల్లులను ప్రవేశ పెట్టుటకును, పాస్ చేయుటకును నిబంధనలు.**

196. (1) 198 మరియు 207 అనుచ్ఛేదములలోని ధన సంబంధమైన బిల్లులను, మరియు ఇతర విత్తీయ బిల్లులను గూర్చిన నిబంధనలకు అధ్యధీనమై ఏ బిల్లైనను శాసన పరిషత్తుగల రాజ్యశాసన మండలి యొక్క ఏ సదనమునందైనను ఆరంభింపబడవచ్చును.

(2) 197 మరియు 198 అనుచ్ఛేదములలోని నిబంధనలకు అధ్యధీనమై, ఏ బిల్లైనను సవరణ లేకుండగాని రాజ్యశాసనమండలి యొక్క ఉభయ సదనములచే అంగీకరించబడిన సవరణలతో మాత్రమేగాని ఆ ఉభయ సదనములచే అంగీకరించబడిననే తప్ప, శాసనపరిషత్తుగల రాజ్య శాసన మండలి యొక్క సదనములచే పాస్ చేయబడినట్లు భావింపబడరాదు.

---

1. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 26వ పరిచ్ఛేదము ద్వారా కొన్ని పదములకు బదులుగా 20.6.1979 నుండి బదులుగా ఉంచబడినవి.

(3) రాజ్య శాసన మండలిలో ఆలోచనలో నున్న బిల్లు ఆ శాసనమండలి యొక్క సదనము లేక సదనముల యొక్క అధివేశనావసాన కారణమును బట్టి వ్యపగతము కారాదు.

(4) రాజ్య శాసనసభచే పాస్ చేయబడక శాసన పరిషత్తులో పెండింగులోనున్న బిల్లు శాసన సభ విఘటన చేయబడినను వ్యపగతము కారాదు.

(5) రాజ్య శాసన సభలో పెండింగులోనున్న లేక శాసన సభచే పాస్ చేయబడి శాసన పరిషత్తులో పెండింగులోనున్న బిల్లు, ఆ సభ విఘటన చేయబడినప్పుడు వ్యపగతము కావలెను.

**ధనసంబంధమైనవి కానట్టి బిల్లులను గూర్చి రాజ్య శాసన పరిషత్తు యొక్క అధికారములపై నిర్బంధన.**

197. (1) ఏదేని బిల్లు శాసన పరిషత్తుగల రాజ్యము యొక్క శాసనసభచే పాస్ చేయబడి శాసన పరిషత్తుకు పంపబడిన తరువాత–

(ఎ) ఆ బిల్లు పరిషత్తుచే త్రోసివుచ్చబడినచో, లేక

(బి) పరిషత్తు సమక్షమున ఆ బిల్లు ఉంచబడిన తేదీ నుండి దానిచే ఆ బిల్లు పాస్ చేయబడకయే మూడు మాసములకు మించిన కాలము గడిచినచో; లేక

(సి) శాసనసభ అంగీకరించని సవరణలతో పరిషత్తుచే ఆ బిల్లు పాస్ చేయబడినచో;

శాసనసభ, దాని యొక్క ప్రక్రియను క్రమబద్ధము చేయు నియమావళికి అధ్యధీనమై, ఆ బిల్లును శాసనపరిషత్తుచే చేయబడిన, సూచింపబడిన లేక అంగీకరింపబడిన సవరణలు ఏవైన ఉన్నచో వాటితోగాని, అవి లేకుండగాని, అదే అధివేశనములోనైనను, అటు తరువాతి ఏ అధివేశములోనైనను మరల పాస్ చేసి, అటుపైన అట్లు పాస్ చేయబడిన బిల్లును శాసన పరిషత్తుకు పంపవచ్చును.

(2) శాసనసభచే ఒక బిల్లు అట్లు రెండవమారు పాస్ చేయబడి శాసనపరిషత్తుకు పంపబడిన తరువాత–

(ఎ) ఆ బిల్లు పరిషత్తుచే త్రోసివుచ్చబడినచో; లేక

(బి) పరిషత్తు సమక్షమున ఆ బిల్లు ఉంచబడిన తేదీ నుండి దానిచే ఆ బిల్లు పాస్ చేయబడకయే ఒక మాసమునకు మించిన కాలము గడిచినచో; లేక

(సి) శాసనసభ అంగీకరించని సవరణలతో పరిషత్తుచే ఆ బిల్లు పాస్ చేయబడినచో;

శాసనపరిషత్తుచే చేయబడిన లేక సూచింపబడిన మరియు శాసనసభచే అంగీకరించబడిన సవరణలు ఏవైనా ఉన్నచో వాటితో, శాసనసభచే రెండవమారు ఆ బిల్లు ఏ రూపములో పాస్ చేయబడినదో ఆ రూపములో ఆ బిల్లు రాజ్య శాసనమండలి యొక్క సదనములచే పాస్ చేయబడినట్లు భావింపబడవలెను.

(3) ఈ అనుచ్ఛేదములో నున్నదేదియు ధన సంబంధమైన బిల్లునకు వర్తించరాదు.

**ధన సంబంధమైన బిల్లులను గూర్చిన విశేష ప్రక్రియ.**

198. (1) ధన సంబంధమైన బిల్లు శాసన పరిషత్తులో ప్రవేశ పెట్టబడరాదు.

(2) ధన సంబంధమైన బిల్లును శాసన పరిషత్తుగల రాజ్యము యొక్క శాసనసభ పాస్ చేసిన పిమ్మట దానిని శాసనపరిషత్తు సిఫారసుల కొరకు పంపవలెను. శాసన పరిషత్తు ఆ బిల్లు తనకు అందిన తేదీ నుండి పదునాలుగు దినముల కాలావధిలో దానిని తన సిఫారసులతో శాసన సభకు త్రిప్పి పంపవలెను. అటుపై శాసన పరిషత్తు చేసిన సిఫారసులను అన్నింటినిగాని, వాటిలో వేటినిగాని, శాసనసభ స్వీకరించవచ్చును, లేక త్రోసిపుచ్చవచ్చును.

(3) శాసనపరిషత్తు యొక్క సిఫారసులలో వేటినైనను శాసనసభ స్వీకరించినచో, ఆ ధన సంబంధమైన బిల్లు శాసన పరిషత్తుచే సిఫారసు చేయబడి శాసనసభచే స్వీకరించబడిన సవరణలతో ఉభయ సదనములచే పాస్ చేయబడినట్లు భావింపబడవలెను.

(4) శాసనపరిషత్తు యొక్క సిఫారసులలో దేనిని కూడ శాసనసభ స్వీకరించినచో, ఆ ధన సంబంధమైన బిల్లు శాసనసభచే పాస్ చేయబడిన రూపములో శాసనపరిషత్తుచే సిఫారసు చేయబడిన సవరణలతో ఏదియు లేకుండ ఉభయ సదనములచే పాస్ చేయబడినట్లు భావింపబడవలెను.

(5) శాసనసభచే పాస్ చేయబడి శాసన పరిషత్తు సిఫారసులకొరకు పంపబడిన ధనసంబంధమైన బిల్లు, సదరు పదునాలుగు దినముల కాలావధిలో శాసనసభకు త్రిప్పి పంపబడనిచో, ఆ బిల్లు శాసనసభచే పాస్ చేయబడిన రూపములో సదరు కాలావధి ముగియగనే ఉభయ సదనములచే పాస్ చేయబడినట్లు భావించబడవలెను.

**ధన సంబంధమైన బిల్లుల నిర్వచనము.**

199. (1) ఏదేని బిల్లులో ఈ క్రింది విషయములన్నింటిని గూర్చిన, లేక వాటిలో వేటినైనను గూర్చిన నిబంధనలు మాత్రమే ఉన్నచో, ఆ బిల్లు ఈ అధ్యాయము నిమిత్తము ధనసంబంధమైన బిల్లుగ భావింపబడవలెను, అవేవనగా–

(ఎ) ఏదేని పన్ను యొక్క విధింపు, ఉత్సాదన, పరిహరణ, మార్పు లేక క్రమబద్ధీకరణ;

(బి) రాజ్యముచే అప్పు చేయబడుటనుగాని, ఏదేని హామి ఇవ్వబడుటనుగాని, క్రమబద్ధము చేయుట, లేక రాజ్యముచే వహించబడిన, లేక వహింపబడగల, ఏవేని విత్తీయ బాధ్యతలను గూర్చిన శాసనమును సవరించుట;

(సి) రాజ్య సంచిత నిధి యొక్క లేక ఆకస్మికతా నిధి (ఆగంతుకనిధి) యొక్క అభిరక్ష, అట్టి ఏదేని నిధిలో ధనమును చెల్లించుట, లేక దాని నుండి ధనమును తిరిగి తీసికొనుట;

(డి) రాజ్య సంచిత నిధి నుండి ధనమున వినియోజనము చేయుట;

(ఇ) ఏదేని వ్యయమును రాజ్య సంచిత నిధిపై ప్రభారమైన వ్యయముగ ప్రఖ్యానించుట, లేక అట్టి ఏదేని వ్యయము యొక్క మొత్తమును పెంచుట;

(ఎఫ్) రాజ్య సంచిత నిధికి గాను, లేక రాజ్యము యొక్క ప్రభుత్వ ఖాతాకుగాను, ధనమును స్వీకరించుట లేక అట్టి ధనము యొక్క అభిరక్ష లేక విడుదల, లేక

(జి) (ఎ) నుండి (ఎఫ్) వరకు గల ఉప–ఖండములలో నిర్దిష్టపరచబడిన విషయములలో దేనికైనను ఆనుషంగికమైన ఏదేని విషయము.

(2) జుర్మానాలను లేక ఇతర సంబంధమైన ఇతర శాస్తులను విధించుట కొరకు లేక లైసెన్సు ఫీజులను లేక చేసిన సేవలకైన ఫీజును అభ్యర్థించుట, లేక చెల్లించుట కొరకు గాని, నిబంధనలు కలిగియున్నదను కారణమాత్రమున, లేక ఎవరేని స్థానిక ప్రాధికారిచే, లేక ఏదేని స్థానిక నికాయముచే స్థానిక ప్రయోజనములను ఏదేని పన్ను విధించబడుట, ఉత్పాదన చేయబడుట, పరిహరింపబడుట, మార్చబడుట లేక క్రమబద్ధము చేయబడుట కొరకు నిబంధనలు కలిగియున్నదను కారణ మాత్రమున, ఏదేని బిల్లు ధన సంబంధమైన బిల్లుగ భావింపబడరాదు.

(3) శాసన పరిషత్తు గల రాజ్య శాసన మండలిలో ప్రవేశపెట్టబడిన ఏదేని బిల్లు, ధనసంబంధమైన బిల్లు అగునా కాదాయను ప్రశ్న ఉత్పన్నమైనచో అట్టి రాజ్య శాసనసభ యొక్క అధ్యక్షుని(స్పీకరు)చే నిర్ణయము అంతిమమైనదై ఉండవలెను.

(4) 198వ అనుచ్ఛేదము క్రింద శాసనపరిషత్తునకు పంపబడినప్పుడుఉ, 200వ అనుచ్ఛేదము క్రింద గవర్నరు యొక్క అనుమతి కొరకు సమర్పించబడినప్పుడు ధనసంబంధమైన ప్రతిబిల్లుపై, అది ధనపు బిల్లు అని శాసనసభ యొక్క అధ్యక్షునిచే సంతకము చేయబడిన ధృవీకరణ పృష్ఠాంకితమై యుండవలెను.

200. రాజ్యశాసన సభచే, లేక శాసన పరిషత్తు గల రాజ్యము విషయములో ఆ రాజ్య శాసన మండలి యొక్క ఉభయ సదనములచే ఏదేని బిల్లు పాస్ చేయబడినప్పుడు అది గవర్నరుకు సమర్పించబడవలెను. గవర్నరు, ఆ బిల్లుకు అనుమతి నిచ్చుచున్నాననిగాని, అనుమతిని నిలుపు చేయుచున్నానని, గాని రాష్ట్రపతి యొక్క పర్యాలోచన కొరకు ఆ బిల్లును ప్రత్యేకించుచున్నానని గాని ప్రఖ్యానించవలెను: **బిల్లులకు అనుమతి.**

అయితే గవర్నరు, ఏదేని బిల్లు అనుమతి కొరకు తనకు సమర్పించబడిన పిమ్మట అది ధన సంబంధమైన బిల్లుకానిచో, సదనము లేక సదనములు ఆ బిల్లునుగాని, దానిలోని ఏవైనా నిర్దిష్ట నిబంధనలనుగాని, పున:పర్యాలోచింపవలెననియు, ప్రత్యేకముగా, తన సందేశములో తాను సిఫారసు చేయు ఏవేని సవరణలను ప్రవేశపెట్టుట వాంఛనీయమాయని పర్యాలోచించవలెననియు కోరు సందేశముతో సహా ఆ బిల్లును సాధ్యమైనంత త్వరితముగా సదనములకు త్రిప్పివంప వచ్చును; బిల్లు అట్లు త్రిప్పి పంపబడినప్పుడు ఆ సదనము లేక సదనములు ఆ బిల్లును తదనుసారము పునః పర్యాలోచించవలెను, మరియు ఆ బిల్లు సవరణతోగాని, సవరణలేకుండగాని, సదనము లేక సదనములచే మరల పాస్ చేయబడి గవర్నరు అనుమతి కొరకు సమర్పింపబడినచో, గవర్నరు ఆ బిల్లుకు తన అనుమతిని నిలుపు చేయరాదు:

అంతేగాక, ఏదేని బిల్లు శాసనమైనచో, ఈ సంవిధానముచే ఉన్నత న్యాయస్థానమునకు కల్పింపబడిన స్థాయికి అపాయము కలుగునంతగా ఆ న్యాయస్థానపు అధికారములను న్యూనపరచునని గవర్నరు అభిప్రాయబడిన యెడల, గవర్నరు ఆ బిల్లుకు అనుమతి నొసంగక దానిని రాష్ట్రపతి పర్యాలోచనకై ప్రత్యేకించవలెను.

201. ఒక బిల్లు, గవర్నరుచే రాష్ట్రపతి యొక్క పర్యాలోచనకై ప్రత్యేకించబడినప్పుడు, రాష్ట్రపతి తాను ఆ బిల్లుకు అనుమతి నిచ్చుచున్నానని గాని, అనుమతిని నిలుపు చేయుచున్నానని గాని ప్రఖ్యానించవలెను: **పర్యాలోచనకై ప్రత్యేకించబడిన బిల్లులు.**

అయితే ఆ బిల్లు ధనసంబంధమైన బిల్లు కానియెడల, ఆ బిల్లును 200వ అనుచ్ఛేదము యొక్క మొదటి వినాయింపులో పేర్కొనబడిన సందేశముతో సహా, ఆ రాజ్య శాసనమండలికి చెందిన, సందర్భానుసారముగ, సదనమునకుగాని, సదనములకుగాని త్రిప్పి పంపవలెనని రాష్ట్రపతి గవర్నరును ఆదేశించవచ్చును, మరియు బిల్లు అట్లు త్రిప్పి పంపబడినప్పుడు ఆ సదనము లేక సదనములు అట్టి సందేశము అందిన తేదీ నుండి ఆరు మాసముల కాలావధిలో దానిని తదనుసారముగ పున:పర్యాలోచించవలెను, మరియు అది, సవరణతో గాని సవరణ లేకుండగాని, ఆ సదనము లేక సదనములచే మరల పాస్ చేయబడినచో దానిని రాష్ట్రపతి పర్యాలోచన కొరకు తిరిగి సమర్పించవలెను.

## విత్తీయ విషయములలో ప్రక్రియ

202. (1) గవర్నరు, ప్రతి విత్తీయ సంవత్సరము విషయమున ఆ సంవత్సరమునకు గాను రాజ్యము యొక్క అంచనా వేయబడిన ఆదాయ వ్యయముల వివరణను రాజ్య శాసన మండలి యొక్క సదనము లేక సదనముల సమక్షమున ఉంచు ఏర్పాటు చేయించవలెను. ఆ వివరణ ఈ భాగములో ''వార్షిక విత్తీయ వివరణ'' అని నిర్దేశింపబడినది. **వార్షిక విత్తీయ వివరణ.**

(2) వార్షిక విత్తీయ వివరణలో పొందుపరచబడిన వ్యయము యొక్క అంచనాలలో–

(ఎ) రాజ్య సంచితనిధిపై ప్రభారమైన వ్యయము అని ఈ సంవిధానముచే తెలుపబడిన వ్యయమును భరించుటకు కావలసిన డబ్బును; మరియు

(బి) రాజ్య సంచిత నిధి నుండి చేయుటకు ప్రతిపాదించబడిన ఇతర వ్యయమును భరించుటకు కావలసిన డబ్బును, వేరు వేరుగా తెలుపవలెను, మరియు రెవెన్యూ ఖాతా నుండి చేయబడు వ్యయమును ఇతర వ్యయము నుండి వేరుపరచవలెను.

(3) ఈ క్రింది వ్యయము ప్రతి రాజ్య సంచిత నిధిపై ప్రభారమైన వ్యయము యుండును:–

(ఎ) రాజ్య గవర్నరు యొక్క ఉపలబ్ధులు, బత్తెములు, మరియు ఆయన పదవికి సంబంధించిన ఇతర వ్యయము;

(బి) శాసన సభ యొక్క అధ్యక్షుని, ఉపాధ్యక్షుని మరియు శాసన పరిషత్తుగల రాజ్యము విషయములో శాసన పరిషత్తు యొక్క సభాపతి, ఉపసభాపతి యొక్క జీతములు మరియు బత్తెములు;

(సి) వడ్డీ, ఋణోన్మోచన భారములు మరియు విమోచన భారములతో సహా, రాజ్యము తీర్చవలసిన ఋణభారములు మరియు అప్పులను సేకరించుటకును, ఋణముల చెల్లింపు ఏర్పాటుకును, విమోచన చేయుటకును సంబంధించిన ఇతర వ్యయము;

(డి) ఏదేని ఉన్నత న్యాయస్థానపు న్యాయాధీశుల జీతములను మరియు బత్తెములను గూర్చిన వ్యయము;

(ఇ) ఏదేని న్యాయస్థానము యొక్క లేక మధ్యవర్తిత్వ ట్రిబ్యునలు యొక్క ఏదేని తీర్పునుగాని, డిక్రినిగాని, అవార్డును (అధినిర్ణయమును) గాని అమలుపరచుటకు కావలసిన ఏవేని డబ్బులు;

(ఎఫ్) అట్లు ప్రభారమైనవని ఈ సంవిధానముచే గాని, శాసనము ద్వారా రాజ్య శాసన మండలిచే గాని ప్రఖ్యానింపబడిన ఏదేని ఇతర వ్యయము.

**అంచనాలను గూర్చి శాసన మండలిలో అనుసరించవలసిన ప్రక్రియ.**

203. (1) రాజ్య సంచితనిధిపై ప్రభారమైన వ్యయమునకు సంబంధించినంతమేరకు ఆ అంచనాలు రాజ్య శాసన సభ యొక్క ఓటుకు సమర్పించబడరాదు, కాని అట్టి ఏదేని అంచనాలను గూర్చి శాసన మండలిలో చర్చించుటను ఈ ఖండములోనున్నదేదియు నివారించునదిగా అన్వయించబడరాదు.

(2) ఇతర వ్యయమునకు సంబంధించినంత వరకు సదరు అంచనాలు అనుదానములకై చేయబడు అభ్యర్థనల రూపములో శాసనసభకు సమర్పించబడవలెను. ఏదేని అభ్యర్థనకు అనుమతినిచ్చుటకుగాని, అనుమతిని నిరాకరించుటకుగాని, లేక ఏదేని అభ్యర్థనయందు నిర్దిష్టపరచబడిన మొత్తమును తగ్గించు ఆ అభ్యర్థనకు అనుమతినిచ్చుటకుగాని, శాసన సభకు అధికారము ఉండును.

(3) గవర్నరు సిఫారసుపై తప్ప, అనుదానమునకై ఏ అభ్యర్థనము చేయబడరాదు.

**వినియోజనపు బిల్లులు.**

204. (1) 203వ అనుచ్ఛేదము క్రింద శాసనసభచే అనుదానములు చేయబడిన తరువాత వీలైనంత త్వరితముగా రాజ్య సంచితనిధి నుండి ఈ క్రింది వాటికి కావలసిన ధనములన్నింటి వినియోజనమును గూర్చి నిబంధించుటకైన బిల్లు ప్రవేశ పెట్టబడవలెను:–

(ఎ) సభచే అట్లు చేయబడిన అనుదానములు; మరియు

(బి) రాజ్య సంచితనిధిపై ప్రభారమైనట్టి వ్యయము; కాని ఇది అంతకు పూర్వమే సదనము లేక సదనముల సమక్షమున ఉంచబడిన వివరణములో తెలుపబడిన మొత్తమునకు ఏ సందర్భములోను మించి ఉండరాదు.

(2) అట్టి ఏ బిల్లుకును అట్లు చేయబడిన ఏదేని అనుదానపు మొత్తమును హెచ్చించు లేక తగ్గించు లేక దాని గమ్యమును మార్చు లేక రాజ్య సంచితనిధిపై ప్రభారమైన ఏదేని వ్యయపు మొత్తమును హెచ్చించు లేక తగ్గించు ప్రభావము గల సవరణ రాజ్య శాసన మండలి యొక్క సదనములో లేక ఉభయ సదనములలో దేనిలోను ప్రతిపాదింపబడరాదు. ఈ ఖండము క్రింద ఏదేని సవరణ అగ్రాహ్యమైనదా (అనుమతింపబడినదిగా) అనుదానిని గూర్చి అధ్యక్షత వహించు వ్యక్తి యొక్క నిర్ణయము అంతిమమై ఉండవలెను.

(3) 205 మరియు 206 అనుచ్ఛేదములలోని నిబంధనలకు అధ్యధీనమై ఈ అనుచ్ఛేదము యొక్క నిబంధనలననుసరించి పాస్ చేయబడిన శాసనము ద్వారా చేయబడిన వినియోజనము క్రిందనే తప్ప రాజ్య సంచితనిధి నుండి ధనమేదియు తిరిగి తీసుకొనబడరాదు.

**అనుపూరక, అదనపు లేక అతిరిక్త అనుదానములు.**

205. (1) (ఎ) 204వ అనుచ్ఛేదములోని నిబంధనలననుసరించి చేయబడిన శాసనము ద్వారా, వర్తమాన విత్తీయ సంవత్సరము నందు ఏదైన ప్రత్యేక సేవార్థము వ్యయము చేయుటకై ప్రాధికారమీయబడిన మొత్తము ఆ సంవత్సరపు ప్రయోజనము కొరకు చాలదని కనుగొనబడినచో, లేక వర్తమాన విత్తీయ సంవత్సరమునందు వార్షిక విత్తీయ వివరణములో తలంపబడని ఏదేని నూతన సేవ కొరకు అనుపూరక లేక అదనపు వ్యయమునకు అక్కర కలిగినప్పుడు; లేక

(బి) ఏదేని విత్తీయ సంవత్సరములో ఏదేని సేవపై ఆ సంవత్సరమునకు గాను ఆ సేవ కొరకు అనుదానము చేయబడిన మొత్తమున కంటే అతిరిక్తముగా ధనము ఖర్చు పెట్టబడినచో;

గవర్నరు సందర్భానుసారముగ, ఆ వ్యయమునకై అంచనా వేయబడిన మొత్తమును తెలుపు మరొక వివరణను రాజ్య శాసనమండలి యొక్క సదనము లేక సదనముల సమక్షమున ఉంచు ఏర్పాటు చేయించవలెను, లేక అట్టి అతిరక్త వ్యయమునకై అధ్యర్థన రాజ్య శాసన సభయందు సమర్పింపబడు ఏర్పాటును చేయించవలెను.

(2) వార్షిక విత్తీయ వివరణకు, దానియందు పేర్కొనబడిన వ్యయమునకు, లేక అనుదానపు అధ్యర్థనకు, మరియు అట్టి వ్యయమునకుగాని అనుదానమునకుగాని కావలసినధనమును రాజ్య సంచిత నిధి నుండి వినియోజనము చేయు ప్రాధికారము నొసగుటకై చేయబడు శాసనమునకు, సంబంధించి 202, 203 మరియు 204 అనుచ్ఛేదములలోని నిబంధనలు ఎట్టి ప్రభావము కలిగియుండునో, అట్టి ప్రభావమునే ఆ నిబంధనలు ఈ అనుచ్ఛేదము క్రింది ఏదేని వివరణకు, వ్యయమునకు లేక అధ్యర్థనకు మరియు అట్టి వ్యయమునకుగాని, అట్టి అధ్యర్థనను గూర్చిన అనుదానమునకుగాని కావలసిన ధనమును రాజ్య సంచితనిధి నుండి వినియోజనము చేయు ప్రాధికారము నొసగుచు చేయబడు శాసనమునకు, సంబంధించి కూడ కలిగియుండవలెను.

**లెక్కలకు ఓట్లు, పరపతికి ఓట్లు మరియు అసాధారణ అనుదానములు.**

206. (1) ఈ అధ్యాయము యొక్క పూర్వగామి నిబంధనలలో ఏమి యున్నప్పటికిని రాజ్య శాసనసభ, ఈ క్రింది అనుదానములు చేయుటకు అధికారము కలిగియుండును,–

(ఎ) ఏదేని అనుదానమునకు ఓటు చేయుటకు 203వ అనుచ్ఛేదములో విహితము చేయబడిన ప్రక్రియ పూర్తియగులోపున, మరియు అట్టి వ్యయమునకు సంబంధించి 204వ అనుచ్ఛేదములోని నిబంధనలననుసరించి శాసనము పాస్ చేయబడులోపున, ఏదేని విత్తీయ సంవత్సరములోని భాగమునకు అంచనా వేయబడిన వ్యయమును గూర్చి అగ్రిమముగా ఏదేని అనుదానమును చేయుటకు;

(బి) ఏదేని సేవ యొక్క విస్తృతినిబట్టి గాని, దాని అనిశ్చిత స్వభావమునుబట్టి గాని దానిని గురించిన అధ్యర్థన సామాన్యముగా వార్షిక విత్తీయ వివరణలో ఈయబడు వివరములతో

తెలుపబడజాలనప్పుడు, అట్టి యాదృచ్ఛిక అర్థ్యర్థనకు కావలసిన ధనమును రాజ్యము యొక్క వనరుల నుండి అనుదానము చేయుటకు;

(సి) ఏదేని విత్తీయ సంవత్సరమునందు వర్తమాన సేవలలో భాగముగా లేనట్టి ఏదేని అసాధారణ అనుదానమును చేయుటకు;

మరియు సదరు అనుదానములు ఏ ప్రయోజనముల కొరకు చేయబడినవో వాటి కొరకు, రాజ్య సంచిత నిధి నుండి ధనములను తిరిగి తీసుకొనుటకై శాసనము ద్వారా ప్రాధికారమిచ్చుటకు రాజ్య శాసనమండలి అధికారము కలిగియుండవలెను.

(2) వార్షిక విత్తీయ వివరణలో పేర్కొనబడిన ఏదేని వ్యయమునకై అనుదానమును చేయుటకును మరియు అట్టి వ్యయము కొరకు కావలసిన ధనములను రాజ్య సంచిత నిధి నుండి వినియోజనము చేయుటకు ప్రాధికారము నొసగుటకై చేయబడు శాసనమునకు సంబంధించి 203 మరియు 204 అనుచ్ఛేదములలోని నిబంధనలు ఎట్టి ప్రభావము కలిగి యుండునో అట్టి ప్రభావమునే ఆ నిబంధనలు ఖండము (1) క్రింద ఏదేని అనుదానము చేయుటకు, మరియు ఆ ఖండము క్రింద చేయబడవలసిన శాసనమునకు, సంబంధించి కూడ కలిగియుండవలెను.

**విత్తీయ బిల్లులను గూర్చిన విశేష నిబంధనలు.**

207. (1) 199వ అనుచ్ఛేదము యొక్క ఖండము (1)లోని (ఎ) నుండి (ఎఫ్) వరకు గల ఉప-ఖండములలో నిర్దిష్టపరచబడిన విషయములలో దేని కొరకైనను నిబంధనచేయు బిల్లుగాని, సవరణ గాని, గవర్నరు సిఫారసు మీద తప్ప ప్రవేశ పెట్టబడరాదు, లేక ప్రస్తావించబడరాదు. అట్టి నిబంధన చేయు బిల్లు శాసన పరిషత్తులో ప్రవేశపెట్టబడరాదు:

అయితే ఈ ఖండము క్రింద ఆవశ్యకమగు సిఫారసు ఏదియు ఏదేని పన్నును తగ్గించుటకు లేక ఉత్సాదన చేయుటకు నిబంధన చేయు సవరణను ప్రస్తావించుటకొరకు ఆవశ్యకము కారాదు.

(2) జుర్మానాలను లేక ధనసంబంధమైన ఇతర శాస్తులను విదించుట కొరకు గాని, లైసెన్సు ఫీజులను లేక చేసిన సేవలకైన ఫీజులను అర్థ్యర్థించుట, చెల్లించుట కొరకుగాని నిబంధనలను కలిగియున్నదను కారణ మాత్రమున, లేక ఎవరేని స్థానిక ప్రాధికారిచే లేక ఏదేని స్థానిక సంస్థచే స్థానిక ప్రయోజనములకు ఏదేని పన్ను విధించబడుట, ఉత్సాదన చేయబడుట, పరిహరించబడుట, మార్చబడుట లేక క్రమబద్ధము చేయబడుట కొరకు నిబంధనలు కలిగియున్నదను కారణ మాత్రమున ఏదేని బిల్లు లేక సవరణ, పైనచెప్పబడిన విషయములలో దేనికొరకైనను నిబంధన చేయునదిగా భావింపబడరాదు.

(3) ఏ బిల్లును శాసనము చేసి అమలులోనికి తెచ్చినచో రాజ్య సంచిత నిధి నుండి వ్యయము చేయవలసి వచ్చునో ఆ బిల్లును గవర్నరు రాజ్య శాసనమండలి యొక్క ఏ సదనమునకైనను పర్యాలోచించుటకై సిఫారసు చేసిననే తప్ప, ఆ సదనముచే అది పాస్ చేయబడరాదు.

## సాధారణ ప్రక్రియ

**ప్రక్రియా నియమావళి.**

208. (1) ఈ సంవిధాన నిబంధనలకు అధ్యధీనమై, రాజ్య శాసనమండలి యొక్క సదనము తన ప్రక్రియను మరియు కార్యకలాప నిర్వాహణమును క్రమబద్ధము చేయుట కొరకు నియమావళిని చేయవచ్చును.

(2) ఖండము (1) క్రింద నియమావళి చేయబడు వరకు, ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము ఆ రాజ్యము స్థానములో నుండిన ప్రావిన్సు యొక్క శాసనమండలిని గూర్చి అమలులో నుండిన ప్రక్రియ నియమావళి మరియు స్థాయీ ఉత్తరువులును, సందర్భానుసారముగా, శాసనసభాధ్యక్షునిచే లేక శాసన పరిషత్తు సభాపతిచే వాటిలో చేయబడునటువంటి మార్పులకు మరియు అనుకూలానాసరణములకును అధ్యధీనమై రాజ్య శాసన మండలి విషయమున ప్రభావము కలిగి యుండవలెను.

(3) గవర్నరు, శాసన పరిషత్తుగల రాజ్యములో, శాసన సభాధ్యక్షునితో మరియు శాసన పరిషత్తు సభాపతితో సంప్రదించిన మీదట, రెండు సదనముల మధ్య పరస్పర సంసూచనలకు సంబంధించిన ప్రక్రియను గూర్చి నియమావళిని చేయవచ్చును.

**రాజ్య శాసనమండలిలో విత్తీయ కార్యకలాపమునకు సంబంధించిన ప్రక్రియను శాసనము ద్వారా క్రమబద్ధవరచుట.**

209. విత్తీయ కార్యకలాపము సకాలములో పూర్తియగుట కొరకు, రాజ్య శాసనమండలి, ఏదేని విత్తీయ విషయమునకు లేక రాజ్య సంచిత నిధి నుండి ధన వినియోజనము కొరకైన ఏదేని బిల్లుకు సంబంధించిన రాజ్య శాసన మండలి యొక్క సదనము లేక సదనముల ప్రక్రియను మరియు దానిలోని లేక వాటిలోని కార్యకలాప నిర్వహణమును రాజ్య శాసన మండలి శాసనము ద్వారా క్రమబద్ధము చేయవచ్చును: అట్లు చేయబడిన ఏదేని శాసనము యొకక ఏదేని నిబంధన, 208వ అనుచ్ఛేదము యొక్క ఖండము (1) క్రింద రాజ్య శాసన మండలి యొక్క సదనముచే లేక సదనములలో దేనిచే నైనను చేయబడిన ఏదేని నియమమునకుగాని ఆ అనుచ్ఛేదము యొక్క ఖండము (2) క్రింద రాజ్య శాసన మండలికి సంబంధించిన ప్రభావము కలిగియుండెడి ఏదేని విషయము లేక స్థాయీ ఉత్తరువునకు గాని అసంగతముగా నున్నచో అట్లు అసంగతముగా నున్నంత మేరకు, అట్టి నిబంధనయే చెల్లుబాటు కలిగియుండవలెను.

**శాసన మండలిలో వాడవలసిన భాష.**

210. (1) భాగము – 17లో ఏమియున్నప్పటికినీ, 348వ అనుచ్ఛేదము యొక్క నిబంధనలకు అధ్యధీనమై రాజ్య శాసన మండలిలోని కార్యకలాపములు రాజ్యము యొక్క అధికారికభాషలో లేక రాజ్యభాషలలో లేక హిందీలో లేక ఇంగ్లీషులో జరుపబడవలెను:

అయితే పైన చెప్పబడిన భాషలలో దేనియందుగాని తన భావములను సరిగా వ్యక్త పరచజాలని ఎవరేని సభ్యుడు, ఆ సదనములో తన యొక్క మాతృ భాషలో ప్రసంగించుటకు సందర్భానుసారముగ, శాసన సభాధ్యక్షుడు శాసన పరిషత్తు యొక్క సభాపతి లేక అట్లు వ్యవహరించుచున్న వ్యక్తిగాని, అనుజ్ఞ నీయవచ్చును.

(2) రాజ్య శాసన మండలి శాసనము ద్వారా అన్యథా నిబంధించిననే తప్ప, ఈ సంవిధాన ప్రారంభము నుండి పదునైదు సంవత్సరముల కాలావధి ముగిసిన తరువాత, ఈ అనుచ్ఛేదము నుండి ''ఇంగ్లీషులో లేక'' అను మాటలు లుప్తమైనట్లుగా, ఈ అనుచ్ఛేదము ప్రభావము కలిగి యుండవలెను:

[1] [అయితే [2] (హిమాచల్ ప్రదేశ్, మణిపూర్, మేఘాలయ మరియు త్రిపుర రాజ్యముల శాసనమండలుల) విషయములో, ఈ ఖండములో గల ''పదునైదు సంవత్సరముల'' అను పదబంధమునకు బదులు ''ఇరువదియైదు సంవత్సరముల'' అను పదబంధము ఉంచబడినట్లుగ ఈ ఖండము ప్రభావము కలిగియుండవలెను.]

[3][అయితే ఇంకనూ [4][అరుణాచల్ ప్రదేశ్, గోవా మరియు [5][మిజోరం రాజ్యముల శాసన మండలుల]] విషయములో, ఈ ఖండములో గల ''పదునైదు సంవత్సరములు'' అను పదబంధముకు బదులుగా ''నలుబది సంవత్సరములు'' అను పదబంధము ఉంచబడినట్లుగ ఈ ఖండము ప్రభావము కలిగియుండవలెను.]

**శాసన మండలిలో చర్చపై నిర్బంధన.**

211. సర్వోన్నత న్యాయస్థానము యొక్క లేక ఉన్నత న్యాయస్థానము యొక్క ఎవరేని న్యాయాధీశుని కర్తవ్య నిర్వహణ యందలి అతని నడవడికి సంబంధించి రాజ్య శాసనమండలిలో ఎట్టి చర్చ జరుగరాదు.

**రాజ్యశాసన మండలి యొక్క కార్య కలాపములను గూర్చి న్యాయస్థానములు పరిశీలన జరుపకుండుట.**

212. (1) ప్రక్రియలో ఏదేని క్రమరాహిత్యము కలదను కారణమును బట్టి రాజ్య శాసన మండలిలోని ఏవేని కార్యకలాపముల యొక్క మాన్యత ప్రష్టవ్యము (ప్రశ్నగతము) కారాదు.

(2) శాసన మండలిలో ప్రక్రియను లేక కార్యకలాపముల నిర్వహణను క్రమబద్ధపరచుటకు, లేక శాసన మండలి సువ్యవస్థను కాపాడుటకు, ఈ సంవిధానముచే లేక దాని క్రింద అధికారములు రాజ్య శాసన మండలి యొక్క ఏ అధికారి యందు లేక సభ్యునియందు నిహితమై యున్నవో ఆ అధికారి, లేక సభ్యుడు అట్టి అధికారముల వినియోగ విషయమున ఏ న్యాయస్థానపు అధికారితకును లోను కారాదు.

## అధ్యాయము – 4
## గవర్నరు యొక్క శాసన నిర్మాణ అధికారములు

**శాసన మండలి యొక్క విరామ కాలములో అధ్యాదేశములను ప్రఖ్యాపన చేయుటకు గవర్నరుకు గల అధికారము.**

213. (1) రాజ్యసభ అధివేశనములో నున్నప్పుడు తప్ప, లేక రాజ్యములో శాసన పరిషత్తు ఉన్న యెడల శాసనమండలి యొక్క ఉభయ సదనములు అధివేశనములో నున్నప్పుడు తప్ప, ఎప్పుడైనను

1. హిమాచల్ ప్రదేశ్ చట్టము, 1970 (1970లోనే 53వది) యొక్క 46 పరిచ్ఛేదము ద్వారా 25.1.1971 నుండి చొప్పించబడినది.
2. ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 71వ పరిచ్ఛేదము ''హిమాచల్ ప్రదేశ్ శాసనమండలి'' అనుపదములకు బదులుగా 21.1.1972 నుండి ఉంచబడినది.
3. మిజోరం రాజ్య చట్టము, 1986 (1986లోని 34వది) యొక్క 39వ పరిచ్ఛేదము ద్వారా (20.2.1987 నుండి) చొప్పించబడినది.
4. గోవా దమన్ మరియు దయ్యు పునర్వ్యవస్థీకరణ చట్టము, 1987 (1987లోని 18వది) యొక్క 63వ పరిచ్ఛేదము ద్వారా ''అరుణాచల్ ప్రదేశ్ మరియు మిజోరం'' అనుపదములకు బదులుగా (30.5.1987 నుండి) ఉంచబడినది.
5. అరుణాచల్ ప్రదేశ్ రాజ్య చట్టము, 1986 (1986లోని 69వది) యొక్క 42వ పరిచ్ఛేదము ద్వారా (20.2.1987 నుండి) ''మిజోరం శాసనమండలి'' కొరకు ఉంచబడినది.

వెంటనే తాము చర్య తీసుకొనవలసిన పరిస్థితులు కలవని గవర్నరు అభిప్రాయ పడినచో ఆ పరిస్థితులను బట్టి ఆవశ్యకమనితోచు అధ్యాదేశములను ఆయన ప్రఖ్యాపన చేయవచ్చును:

అయితే, ఈ క్రింది పరిస్థితులలో రాష్ట్రపతి నుండి అనుదేశములు లేకుండ గవర్నరు అట్టి ఏ అధ్యాదేశమును ప్రఖ్యాపన చేయరాదు:-

(ఎ) అవే నిబంధనలు కలిగియుండు బిల్లును శాసన మండలిలో ప్రవేశపెట్టుటకు ఈ సంవిధానము క్రింద రాష్ట్రపతి యొక్క పూర్వ మంజూరు కావలసియుండెడిదైనచో; లేక

(బి) అవే నిబంధనలు కలిగియుండు బిల్లును, రాష్ట్రపతి యొక్క పర్యాలోచన కొరకు ప్రత్యేకించుట ఆవశ్యకమని గవర్నరు భావించి యుండినచో; లేక

(సి) అవే నిబంధనలు కలిగియుండు రాజ్య శాసన మండలి యొక్క చట్టము, రాష్ట్రపతి పర్యాలోచన కొరకు ప్రత్యేకించబడి ఆయన అనుమతిని పొందియుండిననే తప్ప, ఈ సంవిధానము క్రింద శాసనము అమాన్యమై యుండెడిదైనచో.

(2) ఈ అనుచ్ఛేదము క్రింద ప్రఖ్యాపన చేయబడిన అధ్యాదేశమునకు గవర్నరుచే అనుమతింపబడిన రాజ్య శాసనమండలి యొక్క చట్టమునకు ఉండునట్టి ప్రాబల్య ప్రభావములు ఉండవలెను. కాని అట్టి ప్రతి అధ్యాదేశము-

(ఎ) రాజ్య శాసన సభా సమక్షమున, లేక రాజ్యములో శాసన పరిషత్తు ఉన్న యెడల ఉభయ సదనముల సమక్షమున ఉంచబడవలెను, మరియు రాజ్య శాసనమండలి తిరిగి సమావేశమైనప్పటి నుండి ఆరు వారముల కాలావధి ముగియుగనే లేక ఆ కాలావధి ముగియుటకు ముందే ఆ అధ్యాదేశమును గురించి అననుమోదించు తీర్మానము శాసన సభచే పాస్ చేయబడి శాసన పరిషత్తు వున్నచో దానిచే అంగీకరించబడినచో, సందర్భానుసారముగ, ఆ తీర్మానము పరిషత్తుచే అంగీకరించబడిన మీదట ఆ అధ్యాదేశము యొక్క అమలు ఆగిపోవలెను; మరియు

(బి) గవర్నరుచే ఎప్పుడైనను ఉపసంహరింపబడవచ్చును.

**విశదీకరణ:-** శాసన పరిషత్తుగల రాజ్య శాసన మండలి యొక్క సదనములు వేరు వేరు తేదీలలో తిరిగి సమావేశమగుటకు ఆహ్వానించబడిన యెడల, ఈ ఖండము నిమిత్తము ఆరు వారముల కాలావధి తేదీలలో కడపటి దాని నుండి గణింపబడవలెను.

(3) రాజ్య శాసన మండలిచే చేయబడి గవర్నరుచే అనుమతించబడిన చట్టములోనున్న, మాన్యము కాని ఏదేని నిబంధన, ఈ అనుచ్ఛేదము క్రింద అధ్యాదేశములో చేయబడినచో, అంతమేరకు, ఆ అధ్యాదేశము ప్రభావశూన్యము కావలెను:

అయితే పార్లమెంటు చేసిన చట్టమునకుగాని, ఉభయ సామాన్య సూచిలో పేర్కొనబడిన ఏదేని విషయమును గూర్చి అస్తిత్వములో నున్న ఏదేని శాసనముకుగాని, రాజ్య శాసనమండలి చేసిన ఏదేని చట్టము, విరుద్ధముగా నున్నచో దాని పరిణామమును గూర్చి తెలుపు ఈ సంవిధాన నిబంధనల నిమిత్తము ఈ అనుచ్ఛేదము క్రింద రాష్ట్రపతి అనుదేశములననుసరించి ప్రఖ్యాపన చేయబడిన

అధ్యాదేశము, రాష్ట్రపతి పర్యాలోచనకై ప్రత్యేకించబడి ఆయన అనుమతిని పొందిన రాజ్య శాసనమండలి చట్టముగా భావింపబడవలెను.

[1][(4)* * * * *]

## అధ్యాయము – 5
## రాజ్యములలో ఉన్నత న్యాయస్థానములు

214. [2][...............] ప్రతి రాజ్యమునకు ఒక ఉన్నత న్యాయస్థానము ఉండును. **రాజ్యములకు ఉన్నత న్యాయ స్థానములు.**

[3][* * * * *]

215. ప్రతి ఉన్నత న్యాయస్థానము, రికార్డు న్యాయస్థానముగా ఉండును. అది తన ధిక్కారమునకై శిక్షించు అధికారముతో సహా ఇట్టి న్యాయస్థానపు అధికారములన్నింటెని కలిగియుండును. **ఉన్నత న్యాయ స్థానములు రికార్డు న్యాయస్థానములుగ నుండుట.**

216. ప్రతి ఉన్నత న్యాయస్థానము, ముఖ్య న్యాయమూర్తితోను, ఆయా సమయములందు నియామకము చేయుటకు ఆవశ్యకమని రాష్ట్రపతి భావించు ఇతర న్యాయధీశులతోను కూడియుండును. **ఉన్నత న్యాయస్థానముల సంఘటన.**

[4][* * * * *]

217. (1) ఉన్నత న్యాయస్థానము యొక్క ప్రతి న్యాయాధీశుని నియామకము, [5][124ఏ అనుచ్ఛేదములో నిర్దేశించిన జాతీయ న్యాయపద నియామకముల కమీషను యొక్క సిఫారసులపై,] రాజ్య గవర్నరుతోను, మరియు ముఖ్య న్యాయమూర్తి కాక అన్యుడగు న్యాయాధీశుని నియామకము విషయమున, ఉన్నత న్యాయస్థానపు ముఖ్య న్యాయమూర్తితోనూ సంప్రదించిన తరువాత, రాష్ట్రపతి **ఉన్నత న్యాయస్థానపు న్యాయాధీశుని నియామకము మరియు ఆయన పదవీ షరతులు.**

---

1. సంవిధాన (ముప్పది ఎనిమిదవ సవరణ) చట్టము, 1975 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా గతకాలిక ప్రభావంతో చొప్పించబడిన ఖండము (4), సంవిధాన (నలుబది నాల్గవ సవరణ) చట్టము, 1978 యొక్క 27వ పరిచ్ఛేదము ద్వారా 20.6.1979 నుండి లుప్తము చేయబడినది.
2. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ‘‘(1)’’ అను బ్రాకెట్లు మరియు అంకె (1.11.1956 నుండి) లుప్తము చేయబడినది.
3. అదే చట్టము ద్వారా, ఖండము (2) మరియు (3)లుప్తము చేయబడినవి.
4. అదే చట్టము యొక్క 11వ పరిచ్ఛేదము ద్వారా వినాయింపు లుప్తము చేయడమైనది.
5. సంవిధాన (తొంభై తొమ్మిదవ సవరణ) చట్టము, 2014 యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా ‘‘భారతదేశ ముఖ్య న్యాయమూర్తిని సంప్రదించిన మీదట’’ అను పదములకు బదులుగా 13.4.2015వ తేదీ నుండి ఉంచబడినవి. అయితే, సర్వోన్నత న్యాయస్థానములో నమోదైన న్యాయవాదుల సంఘం వర్సెస్ భారత ప్రభుత్వపు కేసులో, సర్వోన్నత న్యాయస్థానము 16.10.2015వ తేదీ నాటి తన ఉత్తరువులో ఈ సవరణను కొట్టివేసినది.

తన చేవ్రాలు మరియు ముద్రగల అధిపత్రము ద్వారా చేయవలెను, మరియు [1][అదనపు లేక కార్యకారి న్యాయాధీశుడు 224వ అనుచ్ఛేదములో నిబంధింపబడినట్లుగను మరియు ఏదైనా ఇతర సందర్భములోని తనకు [2](అరువది రెండు) సంవత్సరముల వయస్సు పూర్తియగు వరకు ఆ పదవి యందుండవలెను:]

అయితే,-

(ఎ) ఏ న్యాయాధీశుడైనను తన చేవ్రాలుతో రాష్ట్రపతికి లేఖ వ్రాయుట ద్వారా తన పదవికి రాజీనామా ఇవ్వవచ్చును.

(బి) ఏ న్యాయాధీశుడైనను, సర్వోన్నత న్యాయస్థానవు న్యాయాధీశుని తొలగింపు కొరకు 124వ అనుచ్ఛేదము యొక్క ఖండము (4)లో నిబంధింపబడిన రీతిలో రాష్ట్రపతిచే అతని పదవి నుండి తొలగింపబడవచ్చును.

(సి) ఎవరేని న్యాయాధీశుని పదవి, ఆయన రాష్ట్రపతిచే సర్వోన్నత న్యాయాస్థానవు న్యాయాధీశునిగ నియమించబడినందున గాని భారతదేశ రాజ్యక్షేత్రము నందలి ఏదేని ఇతర ఉన్నత న్యాయస్థానమునకు బదిలీ చేయబడినందునగాని, ఖాళీ కావలెను.

(2) ఏ వ్యక్తియైనను ఆయన భారతదేశ పౌరుడైయుండి, మరియు,-

(ఎ) కనీసము పది సంవత్సరములు భారతదేశ రాజ్య క్షేత్రమునందు న్యాయిక పదవియందుండినసే తప్ప; లేక

(బి) కనీసము పది సంవత్సరములు [3][.........] ఒక ఉన్నత న్యాయస్థానములో గాని వరుసగా అట్టి రెండు లేక రెంటికి మించిన న్యాయస్థానములలో గాని అడ్వకేటుగా ఉండియుండినసే తప్ప [3][........]

ఉన్నత న్యాయస్థానము యొక్క న్యాయాధీశునిగ నియమింపబడుటకు అర్హుడు కారాదు.

[4][(సి)* * * * *]

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 12వ పరిచ్ఛేదము ద్వారా ''అతనికి అరువది సంవత్సరముల వయస్సు వచ్చువరకు పదవియందుండవలెను'' అను పదములకు బదులుగా 1.11.1956 నుండి ఉంచబడినది.

2. సంవిధాన (పదునైదవ సవరణ) చట్టము, 1963 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా ''అరువది సంవత్సరములు''కు బదులుగా 5.10.1963 నుండి ఉంచబడినది.

3. సంబంధిత (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''ఒకటవ అనుసూచిలో నిర్దిష్టపరచబడిన ఏదేని రాజ్యములో'' అను పదములు 1.11.1956 నుండి లుప్తము చేయబడినది.

4. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 36వ పరిచ్ఛేదము ద్వారా ''లేక'' అనుపదము మరియు ఉప-ఖండము (సి), 3.1.1977 నుండి చొప్పించబడి, సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క పరిచ్ఛేదము ద్వారా 20.6.1979 నుండి లుప్తము చేయబడినవి.

**విశదీకరణ:–** ఈ ఖండము నిమిత్తము,–

[1] [(ఎ) ఒక వ్యక్తి భారత రాజ్యక్షేత్రములో న్యాయిక పదవియందుండిన కాలావధిని లెక్కించుటలో, ఆయన ఏదేని న్యాయిక పదవియందుండిన తర్వాత ఆయన ఒక ఉన్నత న్యాయస్థానము యొక్క అడ్వకేటుగా వుండిన లేక ఒక ట్రిబ్యునలు సభ్యత్వ పదవియందుండిన లేక సంఘము లేక ఒక రాజ్యము క్రింద శాసనమును గూర్చిన విశేష పరిజ్ఞానము కావలసియున్నట్టి ఏదేని పదవియందుండిన కాలావధిని చేర్చవలెను.]

[2] [(ఎఎ) ఒక వ్యక్తి ఉన్నత న్యాయస్థానము యొక్క అడ్వకేటుగా నుండిన కాలావధిని లెక్కించుటలో, ఆయన అడ్వకేటు అయిన తరువాత [3] [న్యాయిక పదవియందు లేక ఒక ట్రిబ్యునలు సభ్యత్వ పదవి యందు, లేక సంఘము క్రిందగాని ఒక రాజ్యము క్రిందగాని శాసన సంబంధమైన విశేష పరిజ్ఞానము కావలసియున్నట్టి] ఏదేని పదవి యందుండిన కాలావధిని చేర్చవలెను.

(బి) ఒక వ్యక్తి భారతదేశ రాజ్య క్షేత్రములో న్యాయిక పదవియందుండిన కాలావధిని, లేక ఒక ఉన్నత న్యాయస్థానపు అడ్వకేటుగ నున్న కాలావధిని లెక్కించుటలో, సందర్భానుసారముగ ఇండియా ప్రభుత్వ చట్టము, 1935లో నిర్వచింపబడిన ఇండియాలో, 1947, ఆగస్టు పదునైదవ దినమునకు పూర్వము చేరియున్న ఏదేని ప్రాంతములో ఈ సంవిధాన ప్రారంభమునకు పూర్వము ఆయన న్యాయిక పదవి యందుండిన లేక అట్టి ఏదేని ప్రాంతములో ఏదేని ఉన్నత న్యాయస్థానము యొక్క అడ్వకేటుగా నుండియున్న కాలావధిని చేర్చవలెను.

[4][(3) ఉన్నత న్యాయస్థానము యొక్క ఎవరేని న్యాయాధీశుని వయస్సును గూర్చి ఏదేని ప్రశ్న ఉత్పన్నమైనచో, రాష్ట్రపతి ఆ ప్రశ్నను, భారతదేశ ముఖ్య న్యాయమూర్తితో సంప్రదించిన తరువాత నిర్ణయించవలెను, మరియు రాష్ట్రపతి నిర్ణయము అంతిమమైయుండవలెను.]

**సర్వోన్నత న్యాయస్థానమునకు సంబంధించిన కొన్ని నిబంధనలు ఉన్నత న్యాయస్థానములకు వర్తింపజేయుట.**

218. 124వ అనుచ్ఛేదము యొక్క ఖండములు (4) మరియు (5)లోని నిబంధనలు, సర్వోన్నత న్యాయస్థానము విషయమున వర్తించునట్లుగానే, సర్వోన్నత న్యాయస్థానమును గూర్చిన నిర్దేశమునకు బదులు ఉన్నత న్యాయస్థానమును గూర్చిన నిర్దేశములు ఉంచబడినట్లు, ఉన్నత న్యాయస్థానము విషయమున వర్తించవలెను.

---

1. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 28వ పరిచ్ఛేదము ద్వారా 20.6.1979 నుండి చొప్పించబడినది.
2. అదే చట్టము ద్వారా 20.6.1979 నుండి ఖండము (ఎ)ను ఖండము (ఎఎ)గా తిరిగి వ్రాయడమైనది.
3. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 36వ పరిచ్ఛేదము ద్వారా ''న్యాయిక పదవియందు'' అను పదములకు బదులుగా 3.1.1977 నుండి ఉంచబడినది.
4. సంవిధాన (పదునైదవ సవరణ) చట్టము, 1963 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా, గతకాలిక ప్రభావముతో 5.10.1963 నుండి చొప్పించబడినది.

219. [1][..........] ఉన్నత న్యాయస్థానపు న్యాయాధీశునిగా నియమింపబడిన ప్రతి వ్యక్తియు, తన పదవిలో ప్రవేశించుటకు పూర్వము రాజ్య గవర్నరు సమక్షమునగాని, తద్విషయమున ఆయనచే నియమింపబడిన వ్యక్తి సమక్షమునగాని మూడవ అనుసూచిలో అందు నిమిత్తము పొందుపరచబడిన ప్రరూపముననుసరించి ప్రమాణము లేక ధ్రువీకరణను చేసి దానిపై చేవ్రాలు చేయవలెను.

**ఉన్నత న్యాయస్థానపు న్యాయాధీశులచే ప్రమాణము లేక ప్రతిజ్ఞ.**

[2][220. ఈ సంవిధాన ప్రారంభము తరువాత ఒక ఉన్నత న్యాయస్థానము యొక్క స్థాయీ న్యాయాధీశుడు పదవియందుండిన ఏ వ్యక్తియు, సర్వోన్నత న్యాయస్థానములోను, ఇతర ఉన్నత న్యాయస్థానములలోను తప్ప, భారతదేశములోని ఏ న్యాయస్థానము నందుగాని ఏ ప్రాధికారి సమక్షమునగాని న్యాయవాదిత్వమును చేపట్టరాదు, లేక న్యాయవాదిగా వ్యవహరించరాదు.

**స్థాయీ న్యాయాధీశునిగా ఉన్న తరువాత న్యాయవాద వృత్తిని ఆచరించుటపై నిర్బంధన.**

**విశదీకరణ:–** ఈ అనుచ్ఛేదములో 'ఉన్నత న్యాయస్థానము' అను పదమునందు, సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క [3][ప్రారంభమునకు] పూర్వముగల మొదటి అనుసూచి యొక్క భాగము (బి)లో నిర్దిష్టపరచబడిన ఏదేని రాజ్యము యొక్క ఉన్నత న్యాయస్థానము చేరియుండదు.]

221. [4][(1) ప్రతి ఉన్నత న్యాయస్థానపు న్యాయాధీశునకు పార్లమెంటు శాసనము ద్వారా నిర్ధారణ చేయబడునట్టి జీతములు మరియు తద్విషయమున నిబంధన చేయబడునంతవరకు రెండవ అనుసూచిలో నిర్దిష్టపరచబడిన జీతములు చెల్లింపబడవలెను.]

**న్యాయాధీశులు జీతములు మున్నగునవి.**

(2) ప్రతిన్యాయాధీశుడు పార్లమెంటుచే చేయబడిన శాసనము ద్వారాగాని, దాని క్రిందగాని నిర్ధారణ చేయబడు బత్తెములను, గైరుహాజరీ సెలవు మరియు పింఛనులను గూర్చిన హక్కులను కలిగియుండవలెను మరియు ఇట్లు నిర్ధారణ చేయబడు వరకు ఆయన, రెండవ అనుసూచిలో నిర్దిష్టపరచబడిన బత్తెములు, మరియు హక్కులను కలిగియుండవలెను:

అయితే ఒక న్యాయాధీశుని నియామకము తరువాత ఆయన బత్తెములనుగాని గైరుహాజరీ సెలవు లేక ఫించను గూర్చి ఆయనకు గల హక్కులను గాని ఆయనకు అనుకూలముగా మార్చరాదు.

222. (1) రాష్ట్రపతి [1][124ఏ అనుచ్ఛేదములో నిర్దేశించిన జాతీయ న్యాయపర నియామకముల కమీషను యొక్క సిఫారసుపై] ఎవరేని న్యాయాధీశుని ఒక ఉన్నత న్యాయస్థానము నుండి [2][.........] [2][.........] ఏదేని ఇతర ఉన్నత న్యాయస్థానమునకు బదిలీ చేయవచ్చును.

**ఒక ఉన్నత న్యాయస్థానము నుండి మరొక ఉన్నత న్యాయస్థానమునకు న్యాయాధీశుని బదిలీ.**

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా, ''ఒక రాజ్యములో'' అను పదములు 1.11.1956 నుండి లుప్తము చేయబడినవి.
2. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 13వ పరిచ్ఛేదము ద్వారా 220వ అనుచ్ఛేదమునకు బదులుగా ఉంచబడినది.
3. 1956, నవంబరు, 1.
4. సంవిధార (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1986 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 1.4.1986 నుండి ఖండము (1)కి బదులుగా ఉంచబడినది.

[3][(2) ఎవరేని న్యాయధీశుడు అట్లు బదిలీ చేయబడి యుండినప్పుడు, లేక బదిలీ చేయబడినప్పుడు, సంవిధాన (పదునైదవ సవరణ) చట్టము, 1963 ప్రారంభమైన పిమ్మట, ఆ ఇతర ఉన్నత న్యాయస్థానపు న్యాయాధీశుని సేవ చేసిన కాలావధిలో, ఆయన జీతమునకు అదనముగా, పార్లమెంటు శాసనము ద్వారా నిర్ధారణ చేయు నష్టపరిహారక బత్తెమును మరియు అట్లు నిర్ధారణ చేయబడువరకు, రాష్ట్రపతి ఉత్తర్వు ద్వారా నియతము చేయు నష్టపరిహారక బత్తెమును పొందుటకు హక్కు కలిగియుండవలెను.]

**కార్యకారి ముఖ్య న్యాయమూర్తి నియామకము.**

223. ఒక ఉన్నత న్యాయస్థానము యొక్క ముఖ్య న్యాయమూర్తి పదవి ఖాళీగా నున్నప్పుడు, లేక అట్టి ముఖ్య న్యాయమూర్తి హాజరులోలేని కారణమునగాని, అన్యథాగాని, తన పదవీ కర్తవ్యములను నిర్వర్తింపజాలనప్పుడు, ఆ న్యాయస్థానమునకు చెందిన ఇతర న్యాయాధీశులలో నుండి, రాష్ట్రపతి అందు నిమిత్తము నియమించు న్యాయాధీశునిచే ఆ పదవీ కర్తవ్యములు నిర్వర్తించబడవలెను.

**అదనపు మరియు కార్యకారి న్యాయాధీశుల నియామకము.**

[4][224.(1) ఒక ఉన్నత న్యాయస్థానము యొక్క కార్యకలాపముల తాత్కాలిక పెరుగుదల కారణమునగాని, అందలి పని బకాయిపడిన కారణమునగాని, ఆ న్యాయాస్థానపు న్యాయాధీశుల సంఖ్యను తాత్కాలికముగా పెంచవలెనని రాష్ట్రపతికి తోచినచో, [5][రాష్ట్రపతి, జాతీయ న్యాయపర నియామకముల కమీషనును సంప్రదించిన మీదట] తగిన అర్హతలుగల వ్యక్తులను ఆ న్యాయస్థానము యొక్క అదనపు న్యాయాధీశులుగ రెండు సంవత్సరములకు మించకుండ ఆయన నిర్దిష్టపరచు కాలావధి వరకు నియమించవచ్చును.

(2) ఒక ఉన్నత న్యాయస్థానము యొక్క ముఖ్య న్యాయమూర్తి కాక అన్యుడగు ఎవరేని న్యాయాధీశుడు హాజరులోలేని కారణమునగాని, ఏదేని ఇతర కారణమునగాని తన పదవీ

---

1. సంవిధాన (తొంబై తొమ్మిదవ సవరణ) చట్టము, 2014 యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా, ''భారతదేశ ముఖ్య న్యాయాధీశుని సంప్రదించిన తరువాత'' అనుపదములకు బదులుగా 13.04.2015వ తేదీ నుండి ఉంచబడినవి. అయితే, సర్వోన్నత న్యాయస్థానములో నమోదైన న్యాయవాదుల సంఘం వర్సెస్ భారత సంఘరాజ్య క్షేత్రము కేసులో, సర్వోన్నత న్యాయస్థానము 16.10.2015వ తేదీనాటి తన ఉత్తరువులో ఈ సవరణను కొట్టివేసినది. (ఏ.ఐ.ఆర్. 2016, ఎస్.సీ.117)
2. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 14వ పరిచ్ఛేదము ద్వారా ''భారత రాజ్యక్షేత్రము లోపల'' అను పదములు 1.11.1956 నుండి లుప్తము చేయబడినవి.
3. సంవిధాన (పదునైదవ సవరణ) చట్టము, 1963 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 14వ పరిచ్ఛేదము ద్వారా మొదట ఉన్న ఖండము (2)ను 1.11.1956 నుండి లుప్తము చేయడమైనది.
4. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 15వ పరిచ్ఛేదము ద్వారా 224వ అనుచ్ఛేదమునకు బదులుగా 1.11.1956 నుండి ఉంచబడినది.
5. సంవిధాన (తొంబై తొమ్మిదవ సవరణ) చట్టము, 2014 యొక్క 8వ పరిచ్ఛేదము ద్వారా, ''రాష్ట్రపతి నియమించవచ్చును'' అను పదములకు బదులుగా 13.04.2015వ తేదీ నుండి ఉంచబడినవి. అయితే, సర్వోన్నత న్యాయస్థానములో నమోదైన న్యాయవాదుల సంఘం వర్సెస్ భారత ప్రభుత్వపు కేసులో, సర్వోన్నత న్యాయస్థానము 16.10.2015వ తేదీ నాటి తన ఉత్తరువులో ఈ సవరణను కొట్టివేసినది. (ఏ.ఐ.ఆర్. 2016, ఎస్.సీ.117)

కర్తవ్యములను నిర్వర్తించజాలనప్పుడు, లేక ముఖ్య న్యాయమూర్తిగా తాత్కాలికముగా వ్యవహరించుటకు నియమింపబడినప్పుడు [1][రాష్ట్రపతి, జాతీయ న్యాయవర నియామకముల కమీషనును సంప్రదించిన మీదట] తగిన అర్హతలుగల వ్యక్తిని, స్థాయీ న్యాయాధీశుడు తన కర్తవ్యములను పునర్గ్రహించు వరకు ఆ న్యాయాస్థానము యొక్క న్యాయాధీశునిగ వ్యవహరించుటకు నియమించవచ్చును.

(3) ఉన్నత న్యాయస్థానము యొక్క అదనపు లేక కార్యకారి న్యాయాధీశునిగా నియమింపబడిన ఏ వ్యక్తియు, [2][అరువది రెండు సంవత్సరముల] వయస్సు పూర్తియైన తరువాత పదవియందుండరాదు.]

ఉన్నత న్యాయస్థానము యొక్క ఉపవేశనములందు పదవీ విరమణ చేసిన న్యాయాధీశుల నియామకము.

[3][224ఏ. ఈ అధ్యాయమునందేమి యున్నప్పటికిని, [4][ఏదైనా రాజ్యపు ఉన్నత న్యాయస్థానము యొక్క ముఖ్య న్యాయమూర్తిచే జాతీయ న్యాయవర నియామకముల కమీషనుకు చేయబడిన నిర్దేశముపై, రాష్ట్రపతి యొక్క పూర్వ సమ్మతితో,] ఆ న్యాయస్థానము నందుగాని, ఇతర ఉన్నత న్యాయస్థానము నందుగాని న్యాయాధీశుని పదవియందున్న ఎవరేని వ్యక్తిని, ఆ రాజ్యపు ఉన్నత న్యాయస్థానము యొక్క న్యాయాధీశునిగా ఉపవిష్టుడై వ్యవహరించవలెనని కోరవచ్చును. అట్లు కోరబడిన ప్రతి వ్యక్తియు, అట్లు ఉపవిష్టుడై వ్యవహరించుచున్నప్పుడు రాష్ట్రపతి ఉత్తరువు ద్వారా నిర్ధారణ చేయు బత్తెములకు హక్కు కలిగియుండును, మరియు ఆ ఉన్నత న్యాయస్థానపు న్యాయాధీశకునికి గల అధికారితను, అధికారములను మరియు విశేషాధికారములను అన్నింటిని కలిగియుండును; కాని ఆయన అన్యథా, ఆ ఉన్నత న్యాయస్థానపు న్యాయాధీశునిగా భావింపబడరాదు.

అయితే, ఈ అనుచ్ఛేదములో నున్న దేదియు పూర్వోక్తమైన ఏ వ్యక్తికిగాని, ఆయన సమ్మతించిననే తప్ప ఆ న్యాయస్థానము నందు న్యాయాధీశునిగా ఉపవిష్టుడు కావలెననియు వ్యవహరించవలెననియు అపేక్షించునదిగా భావింపబడరాదు.]

1. సంవిధాన (తొంబై తొమ్మిదవ సవరణ) చట్టము, 2014 యొక్క 8వ పరిచ్ఛేదము ద్వారా, ''రాష్ట్రపతి నియమించవచ్చును'' అను పదములకు బదులుగా 13.04.2015వ తేదీ నుండి ఉంచబడినవి. అయితే, సర్వోన్నత న్యాయస్థానములో నమోదైన న్యాయవాదుల సంఘం వర్సెస్ భారత ప్రభుత్వపు కేసులో, సర్వోన్నత న్యాయస్థానము 16.10.2015వ తేదీ నాటి తన ఉత్తరువులో ఈ సవరణను కొట్టివేసినది.
2. సంవిధాన (పదినైదవ సవరణ) చట్టము, 1963 యొక్క 6వ పరిచ్ఛేదము ద్వారా ''అరువది సంవత్సరములు''కు బదులుగా 5.10.1963 నుండి ఉంచబడినది.
3. అదే చట్టము యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.
4. సంవిధాన (తొంబై తొమ్మిదవ సవరణ) చట్టము, 2014 యొక్క 9వ పరిచ్ఛేదము ద్వారా, ''ఒక రాజ్యపు ఉన్నత న్యాయస్థానము యొక్క ముఖ్య న్యాయమూర్తి ఎప్పుడైననూ, రాష్ట్రపతి యొక్క పూర్వసమ్మతితో'' అను పదములకు బదులుగా 13.4.2015వ తేదీ నుండి ఉంచబడినది. అయితే, సర్వోన్నత న్యాయస్థానములో నమోదైన న్యాయవాదుల సంఘం వర్సెస్ భారత ప్రభుత్వము కేసులో, సర్వోన్నత న్యాయస్థానము 16.10.2015వ తేదీ నాటి తన ఉత్తరువులో ఈ సవరణను కొట్టివేసినది.

225. ఈ సంవిధాన నిబంధనలకును, అందుకు సంబంధించిన శాసనమండలి ఈ సంవిధానము ద్వారా ప్రదత్తమైన అధికారములను పురస్కరించుకొని చేసిన ఏదేని శాసనము యొక్క నిబంధనలకును అధ్యధీనమై ప్రస్తుతమున్న ఏదేని ఉన్నత న్యాయస్థానము యొక్క అధికారితను, అందు అమలుజరుపబడు శాసనమును, మరియు ఆ న్యాయస్థానము యొక్క నియమావళిని చేయుటకును ఆ న్యాయస్థానపు ఉపవేశనములను ఏక న్యాయాధీశునిగా విభక్త న్యాయస్థానములలో గాని ఉపవిష్టులగు ఆ న్యాయస్థానపు సభ్యుల ఉపవేశనములను క్రమబద్ధపరచుటకును గల ఏదేని అధికారముతో సహా, ఆ న్యాయస్థానములో న్యాయపాలన విషయమును అందలి న్యాయమూర్తులకు గల ఆయా అధికారములును, ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము ఎట్లుండెనో అట్లే ఉండును:

**ప్రస్తుతమున్న ఉన్నత న్యాయస్థానముల యొక్క అధికారిత.**

[1][అయితే ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము రెవెన్యూకు సంబంధించిన, లేక దానిని వసూలు చేయుటలో ఉత్తరువు ఇవ్వబడిన లేక చేయబడిన ఏదేని కార్యమునకు సంబంధించిన ఏ విషయమును గూర్చి అయినను ఏదేని ఉన్నత న్యాయస్థానము ఆరంభిక అధికారితను వినియోగించుట ఏ నిర్బంధనకు లోనై యుండెనో ఆ నిర్బంధన అట్టి అధికారితను వినియోగించుటకు ఇక ముందు వర్తించదు.]

[2][226.(1) 32వ అనుచ్ఛేదములో ఏమి ఉన్నప్పటికిని, [3] [........] ప్రతి యొక్క ఉన్నత న్యాయస్థానము, తాను అధికారితను వినియోగించు రాజ్యక్షేత్రముల యందంతటను అందలి ఎవరేని వ్యక్తికి లేక ప్రాధికారికి సముచిత సందర్భములలో ఏదేని ప్రభుత్వమునకు కూడా [4] [ఆయా రాజ్యక్షేత్రములలో3వ భాగము ద్వారా ప్రదత్తమైన హక్కులలోని దేనినైనను అమలుపరచుట కొరకు మరియు ఏదేని ఇతర ప్రయోజనముల కొరకు] ఆదేశములను, ఉత్తరువులను, లేక బందీ ప్రత్యక్ష (హేబియస్ కార్పస్) పరమాదేశ (మాండమస్) ప్రతిషేధ (ప్రోహిబిషన్) అధికార పృచ్ఛ (కోవారెంటో) మరియు ఉత్ప్రేషణ (సెర్షియోరారి) స్వభావముగల రిట్లతో సహా రిట్లను, లేక వాటిలో దేనినైనను, జారీ చేయుటకు అధికారము కలిగియుండును.]

**ఉన్నత న్యాయస్థానములు కొన్ని అధిలేఖలను (రిట్లను) జారీ చేయుటకు అధికారము.**

---

1. సంవిధాన (నలుబది నాల్గవ సవరణ) చట్టము, 1978 యొక్క 29వ పరిచ్ఛేదము ద్వారా 20.6.1979 నుండి చొప్పించబడినది.
2. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 38వ పరిచ్ఛేదము ద్వారా అనుచ్ఛేదము 226కు బదులుగా 1.2.1977 నుండి ఉంచబడినది.
3. సంవిధాన (నలుబది మూడవ సవరణ) చట్టము, 1977 యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా ''అయితే 131–ఏ అనుచ్ఛేదము మరియు 226–ఏ అనుచ్ఛేదముల నిబంధనలకు లోబడి'' అను పదములు, అంకెలు మరియు మాటలు 13.4.1978 నుండి లుప్తము చేయబడినవి.
4. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 30వ పరిచ్ఛేదము ద్వారా ''బందీ ప్రత్యక్ష, పరమాదేశ, ప్రతిషేధ, అధికార ప్రచ్ఛ మరియు ఉత్ప్రేషణ స్వభావము గల రిట్లలో దేనినైనను'' అనుపదములతో మొదలయ్యే మరియు'' ''న్యాయ ప్రాముఖ్యత విఫలము వలన న్యాయ విరుద్ధమునకు దారితీయునట్టి'' అవి పూర్తయ్యే పదములకు బదులుగా 1.8.1979 నుండి ఉంచబడినవి.

(2) ఏదేని ప్రభుత్వమునకు ప్రాధికారికి లేక వ్యక్తికి ఆదేశములను ఉత్తరువులను, లేక రిట్లను జారీ చేయుటకై ఖండము (1) ద్వారా ప్రదత్తమైన అధికారము, అట్టి అధికారమును వినియోగించుటకై ఏ రాజ్య క్షేత్రములలో దావాహేతువు పూర్ణతఃగాని భాగతఃగాని ఉత్పన్నమగునో ఆ రాజ్యక్షేత్ర విషయమున అధికారితను వినియోగించు ఏ ఉన్నత న్యాయస్థానముచేనైనను, అట్టి ప్రభుత్వము యొక్క లేక ప్రాధికారి యొక్క (కార్య) స్థానముగాని అట్టి వ్యక్తి యొక్క నివాస స్థానముగాని ఆ రాజ్యక్షేత్రములలో లేనప్పటికిని, వినియోగించబడవచ్చును.

[1][(3) ఖండము (1) క్రింద, ఒక అర్జీపై గాని, దానికి సంబంధించిన ఏదేని చర్యలో గాని ఏ పక్షకారుపై–

(ఎ) అట్టి ఏ అర్జీ యొక్క మరియు అట్టి మధ్యకాలీన ఉత్తరువు కొరకైన వాదమును బలపరుచు దస్తావేజులన్నింటి యొక్క నకళ్ళను అట్టి పక్షకారుకు అంద జేయకుండగను; మరియు

(బి) అట్టి పక్షకారుకు వాదనావకాశము ఇవ్వకుండగును,

వ్యాదేశ రూపమునగాని, నిలుపుదల రూపమునగాని, ఏదేని ఇతర రీతిలోగాని మధ్యకాలీన ఉత్తరువు చేయబడినదో ఆ పక్షకారు అట్టి ఉత్తరువును రద్దు చేయుట కొరకు ఉన్నత న్యాయస్థానమునకు దరఖాస్తు పెట్టి, అట్టి ధరఖాస్తు నకలును అట్టి ఉత్తరువు ఎవరికి అనుకూలముగా చేయబడినదో ఆ పక్షకారుకు, లేక అట్టి పక్షకారు యొక్క న్యాయవాదికి అందజేసిన యెడల, ఉన్నత న్యాయస్థానము, ఆ దరఖాస్తు అందిన తేదీ నుండి, లేక దరఖాస్తు నకలును అట్టి ఉత్తరువు ఎవరికి అనుకూలముగ చేయబడినదో ఆ పక్షకారుకు, లేక అట్టి పక్షకారు యొక్క న్యాయవాదికి అందజేసిన యెడల, ఉన్నత న్యాయస్థానము, ఆ దరఖాస్తు అందిన తేదీ, లేక ఆ దరఖాస్తు నకలు అట్లు అందజేయబడిన తేదీ ఈ రెంటిలో ఏది తరువాతిదో ఆ తేదీ నుండి రెండు వారముల కాలావధి లోపల, లేక ఉన్నత న్యాయస్థానము ఆ కాలావధి యొక్క చివరి దినమున మూసివేయబడిన యెడల ఉన్నత న్యాయస్థానము తెరువబడిన మరుసటి దినము గడుచుటకు ముందు దానిని పరిష్కరంచవలెను, మరియు దరఖాస్తు అట్లు పరిష్కరించబడనిచో మధ్య కాలీన ఉత్తరువు, సందర్భానుసారముగ ఆ కాలావధి ముగిసిన మీదట, లేక సదరు మరుసటి దినము గడిచిన పిదప రద్దయినదగును.]

1. సంవిధాన (నలుబది నాల్గవ సవరణ) చట్టము, 1978 యొక్క 30వ పరిచ్ఛేదపు ఖండము (బి) ద్వారా (3), (4), (5), (6), ఖండములకు బదులు 1.8.1979 నుండి ఇది ఉంచబడినది.

[1][(4) ఈ అనుచ్ఛేదము ద్వారా ఉన్నత న్యాయస్థానమునకు ప్రదత్తమైన అధికారము, 32వ అనుచ్ఛేదము యొక్క ఖండము (2) ద్వారా సర్వోన్నత న్యాయస్థానమునకు ప్రదత్తమైన అధికారమును న్యూనపరచదు.]

[2]226ఏ.[కేంద్ర శాసనముల యొక్క సంవిధానిక మాన్యతను 226వ అనుచ్ఛేదపు క్రింది చర్యలలో పరిగణలోనికి తీసుకొనబడరాదు.]

**న్యాయస్థానములన్నిటి పైన ఉన్నత న్యాయస్థానము యొక్క అధీక్షణాధికారము.**

227. [3][(1) ప్రతి ఉన్నత న్యాయస్థానము, తాను ఏ రాజ్య క్షేత్రములకు సంబంధించి అధికారితను వినియోగించునో ఆ రాజ్య క్షేత్రములోని అన్ని న్యాయస్థానములు మరియు ట్రిబ్యునళ్ళ పైన అధీక్షణ కలిగియుండును;]

(2) పూర్వగామి నిబంధన యొక్క సాధారణతకు భంగము కలుగకుండ, ఉన్నత న్యాయస్థానము,-

(ఎ) అట్టి న్యాయస్థానముల నుండి రిటర్నులను తెప్పించవచ్చును.

(బి) అట్టి న్యాయస్థానముల యొక్క ఆచరణను మరియు చర్యలను క్రమబద్ధపరచుటకు సాధారణ నియమావళిని జారీ చేయవచ్చును; మరియు ప్రరూపములను విహితము చేయవచ్చును, మరియు

(సి) అట్టి న్యాయస్థానముల అధికారులు పుస్తకములను, నమోదులను మరియు లెక్కలను ఏ ప్రరూపములలో వ్రాసియుంచవలెనో విహితము చేయవచ్చును.

(3) ఉన్నత న్యాయస్థానము, అట్టి న్యాయస్థానముల యొక్క షరీఫునకు మరియు అందరు గుమస్తాలకు, అధికారులకు మరియు అందు తమ వృత్తిని సాగించు అటార్నీలకు, అడ్వకేట్లకు మరియు ప్లీడర్లకు ఈయవలసిన ఫీజు పట్టికలను కూడ నిర్ధారణ చేయవచ్చును:

అయితే, ఖండము (2), లేక (3) క్రింద చేయబడిన ఏ నియమములు గాని విహితము చేయబడిన ప్రరూపములు గాని, లేక నిర్ధారణ చేయబడిన పట్టికలు గాని తత్సమయమున

---

1. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 30వ పరిచ్ఛేదము ద్వారా 1.8.1979 నుండి ఖండము (7)ను ఖండము (4)గా తిరిగి అంకెవేయబడినది.
2. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 39వ పరిచ్ఛేదము ద్వారా 1.2.1977 నుండి చొప్పించబడినది.
3. సంవిధాన (నలుబది నాల్గవ సవరణ) చట్టము, 1978 యొక్క 31వ పరిచ్ఛేదపు ఖండము (1) ద్వారా అట్లుంచబడిన దానికి బదులుగా 20.6.1979 నుండి ఇది ఉంచబడినట్లుగా చదువుకొనవలెను.

అమలులోనున్న ఏదేని శాసనము యొక్క నిబంధనకు అసంగతముగ నుండరాదు; మరియు అవి గవర్నరు యొక్క పూర్వానుమోదము పొందవలెను.

(4) ఈ అనుచ్ఛేదములో నున్నదేదియు, సాయుధ బలములకు సంబంధించిన ఏ శాసనము ద్వారా లేక దాని క్రింద సంఘటిత పరచబడిన ఏదేని న్యాయస్థానము లేక ట్రిబ్యునలుపై ఉన్నత న్యాయస్థానమునకు అధీక్షణాధికారములను ప్రదత్తము చేయునదిగా భావించబడరాదు.

(5) [1][* * * *]

**ఉన్నత న్యాయస్థానమునకు కొన్ని కేసుల బదిలీ .**

228. తనకు అధీనమైయున్న న్యాయస్థానములో పెండింగులోనున్న కేసులో ఈ సంవిధానము యొక్క అర్థాన్వయమును గూర్చిన ఏదేని సారభూతమైన శాసనాత్మక ప్రశ్న ఇమిడియున్నదనియు దానిని నిర్ధారణ చేయుట ఆ కేసు యొక్క పరిష్కారమునకు ఆవశ్యకమనియు, ఉన్నత న్యాయస్థానము అభిప్రాయపడినచో, [2][అది ఆ కేసును తెప్పించుకొనవలెను; మరియు [3]* * * * * *]

(ఎ) తానే ఆ కేసును పరిష్కరించవచ్చును, లేక

(బి) సదరు శాసనాత్మక ప్రశ్నను నిర్ధారణ చేసి అట్టి ప్రశ్న విషయములో తన యొక్క నకలుతో సహా ఏ న్యాయస్థానము నుండి ఆ కేసు తెప్పించబడినదో ఆ న్యాయస్థానమునకు దానిని త్రిప్పి పంపవలెను, మరియు అది అందిన మీదట సదరు న్యాయస్థానము అట్టి తీర్పుకు అనుగుణముగ ఆ కేసును పరిష్కరించుటకు ఉపక్రమించవలెను.

[4]228ఏ. [రాజ్య శాసనముల సంవిధానిక మాన్యతకు సంబంధించిన ప్రశ్నలను పరిష్కరించుటకైన విశేష నిబంధనలు], సంవిధాన (నలబై మూడవ సవరణ) చట్టము, 1977 యొక్క 10వ పరిచ్ఛేదము ద్వారా (13.04.1978 నుండి) లుప్తము చేయబడినది.

**ఉన్నత న్యాయస్థానముల అధికారులు, సేవకులు మరియు వ్యయములు.**

229. (1) ఉన్నత న్యాయస్థానపు అధికారుల మరియు సేవకుల నియామకము, ఆ న్యాయస్థానపు ముఖ్య న్యాయమూర్తిచే లేక ఆయన ఆదేశించునట్టి న్యాయస్థానపు ఇతర న్యాయాధీశునిచే లేక అధికారిచేగాని చేయబడవలెను:

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 40వ పరిచ్ఛేదము ఖండము (బి) ద్వారా ఖండము (5) 1.2.1977 నుండి చొప్పించబడినది మరియు సంవిధాన (నలుబది నాల్గవ సవరణ) చట్టము, 1978 యొక్క 31వ పరిచ్ఛేదము ఖండము (బి) ద్వారా 20.6.1979 నుండి లుప్తము చేయబడినది.
2. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 41వ పరిచ్ఛేదము ద్వారా 1.2.1977 నుండి ''అది ఆ కేసును తెప్పించుకొనవలెను, మరియు'' అను పదములకు బదులుగా ఉంచబడినది.
3. సంవిధాన (నలుబది మూడవ సవరణ) చట్టము, 1977 యొక్క 9వ పరిచ్ఛేదవు ద్వారా ''131ఏ అనుచ్ఛేదవు నిబంధనలకు అధ్యధీనమై'' అను పదములు అంకెలు మరియు మాటలు 13.4.1978 నుండి లుప్తము చేయబడినది.
4. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 42వ పరిచ్ఛేదము ద్వారా 1.2.1977 నుండి 228-ఏ పరిచ్ఛేదము చొప్పించబడినది.

అయితే [1] [......] రాజ్యము యొక్క గవర్నరు, నియమము ద్వారాను, ఆ నియమములో నిర్దిష్టపరచబడు సందర్భములలోను, ఇంతకుముందే ఆ న్యాయస్థానమునకు చేందియుండని ఏ వ్యక్తినిగాని, రాజ్యపబ్లికు సేవా కమీషనుతో సంప్రదించిన పిమ్మట తప్ప, ఆ న్యాయస్థానమునకు సంబంధించిన ఎట్టి పదవిలోను నియమింపరాదని ఆపేక్షించవచ్చును.

(2) రాజ్య శాసనమండలి చేసిన ఏదేని శాసనము యొక్క నిబంధనలకు అధ్యధీనమై, ఉన్నత న్యాయస్థానము యొక్క అధికారుల మరియు సేవకుల సేవా షరతులు, ఆ న్యాయస్థానము యొక్క ముఖ్య న్యాయమూర్తిచే లేక ముఖ్య న్యాయమూర్తి అందు నిమిత్తము నియమావళిని చేయుటకై ప్రాధికారమొసగు ఆ న్యాయస్థానపు ఇతర న్యాయాధీశునిచే లేక అధికారిచే చేయబడిన నియమావళి ద్వారా విహితము చేయబడినవై యుండవలెను:

అయితే, ఈ ఖండము క్రింద చేయబడిన నియమావళి, జీతములకు, బత్తెములకు, సెలవులకు లేక పింఛనులకు సంబంధించినంత వరకు [2] [..........] రాజ్య గవర్నరు యొక్క ఆమోదమును పొందవలెను.

(3) ఉన్నత న్యాయస్థానముల అధికారులకు మరియు సేవకులకు లేక వారిని గూర్చి చెల్లించవలసిన అన్ని జీతములు, బత్తెములు, పింఛనులతో సహా, ఆ న్యాయస్థానపు పరిపాలనా వ్యయములు రాజ్య సంచిత నిధిపై ప్రభారమైయుండును మరియు న్యాయస్థానము పుచ్చుకొను ఫీజు లేక అన్యధనములు ఆ నిధిలో చేరియుండును.

**ఉన్నత న్యాయస్థానముల అధికారితను సంఘ రాజ్యక్షేత్రములకు విస్తరింపచేయుట.**

[3] [230. (1) పార్లమెంటు శాసనము ద్వారా ఒక ఉన్నత న్యాయస్థానము యొక్క అధికారితను ఏదేని సంఘ రాజ్యక్షేత్రమునకు విస్తరింపజేయవచ్చును లేక ఏదేన సంఘ రాజ్యక్షేత్రము నుండి దానిని అపవర్జింపవచ్చును.

(2) ఒక రాజ్యపు ఉన్నత న్యాయస్థానము సంఘ రాజ్యక్షేత్రమునకు సంబంధించి అధికారితను వినియోగించుచున్న యెడల,–

(ఎ) ఈ సంవిధానములో నున్న దేదియు, అట్టి అధికారితను పెంచుటకును, పరిమిత పరచుటకును, లేక ఉత్సాదన చేయుటకును ఆ రాజ్య శాసనమండలికి అధికార మొసగునదిగా అన్వయింపబడరాదు.

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''ఆ ఉన్నత న్యాయస్థానము తన యొక్క ముఖ్యస్థానము ఉన్నట్టి'' అను పదములు 1.11.1956 నుండి లుప్తము చేయబడినవి.
2. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29 పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''ఆ ఉన్నత న్యాయస్థానము తన యొక్క ముఖ్యస్థానము ఉన్నట్టి'' అను పదములు 01.11.1956 నుండి లుప్తము చేయబడినవి.
3. అదే చట్టము యొక్క 16 పరిచ్ఛేదము ద్వారా, ఆదిలో ఉంచిన అనుచ్ఛేదములు 230, 231 మరియు 232లకు బదులుగా 01.11.1956 నుండి ఉంచబడినది.

(బి) 227వ అనుచ్ఛేదములో గవర్నరును గూర్చిన నిర్దేశము, ఆ రాజ్య క్షేత్రములోని అధీనస్థ న్యాయస్థానముల కొరకైన నియమములు, ప్రరూపములు లేక పట్టికల విషయములో, రాష్ట్రపతిని గూర్చిన నిర్దేశముగ అన్వయించబడవలెను.

231. (1) ఈ అధ్యాయములోని పూర్వవర్తి నిబంధనలలో ఏమియున్నప్పటికిని, పార్లమెంటు శాసనము ద్వారా రెండు, లేక రెంటికి మించిన రాజ్యములకుగాని, రెండు, లేక రెంటికి మించిన రాజ్యములకు మరియు ఒక సంఘ రాజ్యక్షేత్రమునకుగాని ఒక ఉమ్మడి ఉన్నత న్యాయస్థానమును స్థాపించవచ్చును.

**రెండు లేక రెంటికి మించిన రాజ్యములకు ఒకే ఉమ్మడి ఉన్నత న్యాయస్థానము యొక్క స్థాపన.**

(2) ఏదైన అట్టి ఉన్నత న్యాయస్థానము విషయములో–

[1][(ఎ) * * * *]

(బి) 227వ అనుచ్ఛేదములో గవర్నరును గూర్చిన నిర్దేశము, అధీనస్థ న్యాయస్థానముల కొరకై నియమములు, ప్రరూపములు, లేక పట్టికల విషయములో ఆ అధీనస్థ న్యాయస్థానములు ఏ రాజ్యము నందు కలవో ఆ రాజ్య గవర్నరును గూర్చిన నిర్దేశముగా అన్వయింపబడవలెను; మరియు

(సి) 219, 229 అనుచ్ఛేదములలో రాజ్యమును గూర్చిన నిర్దేశములు ఆ ఉన్నత న్యాయస్థానము యొక్క ప్రధాన స్థానము ఉన్నట్టి రాజ్యమును గూర్చిన నిర్దేశములుగ అన్వయించబడవలెను:

అయితే, అట్టి ప్రధాన స్థానము, సంఘ రాజ్యక్షేత్రములో ఉన్నచో, 219, 229 అనుచ్ఛేదములలో గవర్నరు, పబ్లికు సేవా కమీషను, శాసనమండలి మరియు రాజ్య సంచిత నిధులను గూర్చిన నిర్దేశములు క్రమశః రాష్ట్రపతి, సంఘ పబ్లికు సేవా కమీషను, పార్లమెంటు మరియు భారత సంచిత నిధిని గూర్చిన నిర్దేశములుగ అన్వయించబడవలెను.]

[232. అర్థాన్వయము – అనుచ్ఛేదములు 230 మరియు 231 సంవిధాన (7వ సవరణ) చట్టము, 1956, 16వ పరిచ్ఛేదము ద్వారా 230, 231 మరియు 232 అనుచ్ఛేదములకు బదులుగా 01.11.1956 నుండి ఉంచబడినవి.]

## అధ్యాయము – 6

---

1. సంవిధాన (తొంభై తొమ్మిదవ సవరణ) చట్టము, 2014 యొక్క 10వ పరిచ్ఛేదము ద్వారా, 13.4.2015వ తేదీ నుండి లుప్తము చేయబడినది. అయితే ఈ సవరణను, సర్వోన్నత న్యాయస్థానములో నమోదైన న్యాయవాదుల సంఘం వర్సెస్ భారత సంఘరాజ్యక్షేత్రం కేసులో (ఏ.ఐ.ఆర్. 2016 ఎస్.సీ. 117), సర్వోన్నత న్యాయస్థానము 16.10.2015వ తేదీ నాటి తన ఉత్తరువులో కొట్టివేసినది. సవరణకు ముందు ఖండము (ఎ) ఈ క్రింది విధముగా ఉన్నది.

   (ఎ) 217వ అనుచ్ఛేదములో రాజ్య గవర్నరును గూర్చిన నిర్దేశము ఆ ఉన్నత న్యాయస్థానము ఏ రాజ్యములకు సంబంధించి అధికారితను వినియోగించునో ఆ రాజ్యములన్నింటి యొక్క గవర్నరులను గూర్చిన నిర్దేశముగా అన్వయించబడవలెను.

## అధీనస్థ న్యాయస్థానములు

233. (1) ఏదేని రాజ్యములో జిల్లా న్యాయాధీశులుగా ఉండవలసిన వ్యక్తుల నియామకములు మరియు వారి పదస్థాపన, ప్రమోషను, అట్టి రాజ్యమునకు సంబంధించి అధికారితను వినియోగించుచున్న ఉన్నత న్యాయస్థానమును సంప్రదించి, ఆ రాజ్య గవర్నరుచే చేయబడవలెను. **జిల్లా న్యాయాధీశుల నియామకము.**

(2) సంఘము యొక్క, లేక ఆ రాజ్యము యొక్క సేవలో ఇంతకుముందులేని వ్యక్తి, ఏడు సంవత్సరములకు తక్కువ కాకుండ అడ్వకేటుగ లేక ప్లీడరుగనున్నవాడై, జిలాల న్యాయాధీశుడుగా నియమించబడుటకై ఉన్నత న్యాయస్థానముచే సిఫారసు చేయబడినచో మాత్రమే అట్టి న్యాయాధీశుడుగా నియమించబడుటకు పాత్రుడై యుండును.

[1][233ఏ. ఏదేని న్యాయస్థానము యొక్క ఏదైన తీర్పు డిక్రీ, లేక ఉత్తరువు ఎట్లున్నప్పటికిని, 233, లేక 235వ అనుచ్ఛేదము యొక్క నిబంధనల ననుసరించి కాక అన్యథా, సంవిధాన (ఇరవైయ్యవ సవరణ) చట్టము, 1966 ప్రారంభమునకు పూర్వము ఎప్పుడైనను చేయబడిన,– **కొందరు జిల్లా న్యాయాధీశుల నియామకమును మరియు వారిచే నొసగబడిన తీర్పులు మొదలగు వాటిని మాన్య మొనర్చుట.**

(ఎ)(i) ఒక రాజ్యమము యొక్క న్యాయిక సేవా వర్గమందు అదివరకే యుండిన ఎవరేని వ్యక్తి యొక్క, లేక ఏడు సంవత్సరములకు తక్కువ కాకుండ అడ్వకేటుగ లేక ప్లీడరుగ ఉండిన ఎవరేని వ్యక్తి యొక్క ఆ రాజ్యము నందు జిల్లా న్యాయాధీశుడుగా నియామకము ఏదియు; మరియు

(ii) జిల్లా న్యాయాధీశుడుగా అట్టి ఎవరేని వ్యక్తి యొక్క పదస్థాపన, ప్రమోషను లేక బదిలీ ఏదియు;

అట్టి నియామకము, పదస్థాపన, ప్రమోషను, లేక బదిలీ, సదరు నిబంధనల ననుసరించి చేయబడలేదను కారణమునుబట్టి మాత్రమే శాసన విరుద్ధమైనదిగా లేక ప్రభావ శూన్యమైనదిగా, లేక ఇది వరకు ఎప్పుడైనను శాసన విరుద్ధము, లేక ప్రభావశూన్యమై యుండునట్టిదిగా, భావించబడరాదు;

(బి) సంవిధాన (ఇరవైయవ సవరణ) చట్టము, 1966 ప్రారంభమునకు పూర్వము 233 లేక 235 అనుచ్ఛేదము యొక్క నిబంధనల ననుసరించి కాక అన్యథా, ఏ రాజ్యమునందైనను జిల్లా న్యాయాధీశుడుగా, నియామకము, పదస్థాపన, ప్రమోషను లేక బదిలీ చేయబడిన ఏ వ్యక్తిచే గాని వినియోగించబడిన అధికారిత, ఇవ్వబడిన తీర్పు, డిక్రీ దండనోత్తరువు లేక ఉత్తరువు, మరియు చేయబడిన ఇతర కార్యము, లేక అతని సమక్షమున తీసుకొనబడిన చర్య ఏదియు, అట్టి నియామకము, పదస్థాపన, ప్రమోషను, లేక బదిలీ, సదరు నిబంధనల ననుసరించి చేయబడలేదను కారణమును బట్టి మాత్రమే శాసన విరుద్ధమైనదిగా, లేక అమాన్యమైనదిగా, లేక ఇది వరకు ఎప్పుడైనను శాసన విరుద్ధము, లేక అమాన్యమైయుండినట్టిదిగా భావించబడరాదు.]

---

1. సంవిధాన (ఇరవైయవ సవరణ) చట్టము, 1966 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 22.12.1966 నుండి చొప్పించబడినది.

234. ఒక రాజ్యము యొక్క న్యాయిక సేవా వర్గమందు జిల్లా న్యాయాధీశులుగాక ఇతర వ్యక్తుల నియామకములు, ఆ రాజ్యము యొక్క పబ్లికు సేవా కమీషనుతోను, ఆ రాజ్యమునకు సంబంధించి అధికారితను వినియోగించుచున్న ఉన్నత న్యాయస్థానముతోను, సంప్రదించిన మీదట, ఆ రాజ్య గవర్నరుచే తద్విషయమున ఆయన చేసిన నియమావళి ననుసరించి చేయబడవలెను.

**న్యాయిక సేవావర్గములలో జిల్లా న్యాయాధీశులు కాక ఇతర వ్యక్తుల భర్తీ.**

235. ఒక రాజ్యము యొక్క న్యాయిక సేవా వర్గమునకు చెందియుండి జిల్లా న్యాయాధీశుని పదవికి క్రిందిదైన ఏదేని పదవియందుండి వ్యక్తుల పదస్థాపన, ప్రమోషను మరియు వారికి సెలవు ఇచ్చుటతో సహా, జిల్లా న్యాయస్థానములపైనను, వాటికి అధీనస్థమగు న్యాయస్థానముల పైనను నియంత్రణ, ఉన్నత న్యాయస్థానమునందు నిహితమై యుండును. కాని ఈ అనుచ్ఛేదములో నున్నదేదియు, అట్టి వ్యక్తి యొక్క సేవా షరతులను క్రమబద్ధపరచు శాసనము క్రింద అప్పీలు చేసికొనుటకు ఆయనకు గల ఏదేని హక్కును పోగొట్టునదిగా గాని, అట్టి శాసనము క్రింద విహితము చేయబడిన అతని సేవా షరతులననుసరించి కాక అన్యథా అతనివట్ల వ్యవహరించుటకు ఉన్నత న్యాయస్థానమునకు ప్రాధికారమొసగునదిగాగాని అన్వయించబడరాదు.

**అధీనస్థ న్యాయస్థానములపై నియంత్రణ.**

236. ఈ అధ్యాయములో,-

**అర్థాన్వయము.**

(ఎ) 'జిల్లా న్యాయాధీశుడు' అను పదమునందు, నగర సివిలు న్యాయస్థాన న్యాయాధీశుడు, అదనపు జిల్లా న్యాయాధీశుడు, సంయుక్త జిల్లా న్యాయాధీశుడు, సహాయక జిల్లా న్యాయాధీశుడు, లఘు దావాల న్యాయస్థాన ముఖ్య న్యాయాధీశుడు, ముఖ్య ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటు, అదనపు ముఖ్య ప్రెసిడెన్సీ మేజిస్ట్రేటు, సెషన్సు న్యాయాధీశుడు (నేరముల విచారణ న్యాయాధీశుడు), అదనపు సెషన్సు న్యాయాధీశుడు, మరియు సహాయక సెషన్సు న్యాయాధీశుడు చేరియుండును.

(బి) ''న్యాయిక సేవా వర్గము'' అను పదబంధమునకు జిల్లా న్యాయాధీశ పదస్థానమును పూరించుటకు, మరియు జిల్లా న్యాయాధీశ పదస్థానమునకు క్రిందివైన ఇతర సివిలు న్యాయిక పదస్థానములను పూరించుటకు, ఉద్దేశింపబడిన వ్యక్తులు మాత్రమే గల సేవా వర్గమని అర్థము.

237. గవర్నరు పబ్లికు అధిసూచన ద్వారా, ఈ అధ్యాయములోని పూర్వగామి నిబంధనలను వాటి క్రింద చేయబడిన ఏవేని నియమములను రాజ్యము యొక్క న్యాయిక సేవా వర్గములలో నియమించబడిన వ్యక్తుల విషయమున వర్తించునటులనే రాజ్యము యొక్క ఏదేని తరగతి లేక ఏవేని తరగతుల మెజిస్ట్రేట్ల విషయమున, ఆయన తద్విషయమున నియతము చేయు తేదీ నుండి, ఆ అధిసూచనలో నిర్దిష్టపరచబడు మినహాయింపులకును, మార్పులకును 'అధ్యధీనమై, వర్తించవలెనని ఆదేశించవచ్చును.

**ఏదేని తరగతి లేక కొన్ని తరగతుల మేజిస్ట్రేట్లకు ఈ అధ్యాయము యొక్క నిబంధనల వర్తింపు.**

## భాగము – 7

[ ఒకటవ అనుసూచి యొక్క భాగము బీ లోని రాజ్యములు] సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా లుప్తము చేయబడినది.

238. [మొదటి అనుసూచి యొక్క భాగము బీ లోని రాజ్యములకు భాగం – 6 యొక్క నిబంధనల వర్తింపు] సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956, 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా 01.11.1956 నుండి లుప్తము చేయబడింది.

## భాగము – 8

## [1][**సంఘ రాజ్యక్షేత్రములు**]

[2]239. (1) పార్లమెంటుచే శాసనము ద్వారా అన్యథా నిబంధించబడినట్లు తప్ప, రాష్ట్రపతి, తాను సబబని తలచు మేరకు తాను నిర్దిష్టపరచు పదాభిదానముతో తాను నియమించు పరిపాలకుని ద్వారా వ్యవహరించుచు, ప్రతి సంఘ రాజ్యక్షేత్రమును పరిపాలించవలెను. **సంఘరాజ్య క్షేత్రముల పరిపాలనము.**

(2) భాగము 6లో ఏమియున్నప్పటికిని, రాష్ట్రపతి ఏదేని రాజ్యము యొక్క గవర్నరును, ఆ రాజ్యమునకు ప్రక్కనున్న సంఘ రాజ్య క్షేత్రము యొక్క పరిపాలకుడుగా నియమించవచ్చును, మరియు ఎవరేని గవర్నరు అట్లు నియమించబడిన యెడల ఆయన అట్టి పరిపాలకుడుగా తన మంత్రి పరిషత్తుతో ప్రసక్తి లేకుండ తన కృత్యములను నిర్వహించవలెను.

[3][239ఏ. (1) పార్లమెంటు శాసనము ద్వారా [4][[5][పుదుచ్చేరి] సంఘరాజ్య క్షేత్రము కొరకు] శాసనములో వేరు వేరుగా నిర్ధిష్టపరచబడిన సంఘటనము, అధికారములు మరియు కృత్యముల కొరకు; **కొన్ని సంఘరాజ్య క్షేత్రములకు స్థానిక శాసన మండలులను లేక మంత్రి పరిషత్తులను లేక రెంటిని ఏర్పాటు చేయుట.**

(ఎ) ఆ సంఘ రాజ్యక్షేత్రమునకు శాసన మండలిగ వ్యవహరించుటకు ఎన్ను కొనబడినదైనను లేక భాగతః నామనిర్దేశము చేయబడి భాగతః ఎన్నుకోబడినదైనను, ఒక నికాయమును; లేక

(బి) ఒక మంత్రి పరిషత్తును; లేక రెండింటికిని ఏర్పాటు చేయవచ్చును.

(2) ఖండము (1)లో నిర్దేశించబడిన ఏదేని శాసనము అందు సంవిధానమును సవరించు, లేక సవరించునట్టి ప్రభావము గల ఏదేని నిబంధన ఉన్నప్పటికిని 368వ అనుచ్ఛేదము నిమిత్తము సంవిధానము యొక్క సవరణగా భావింపబడరాదు.]

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 17వ పరిచ్ఛేదము ద్వారా ‘‘ఒకటవ అనుసూచి యొక్క భాగము–సీ లోని రాజ్యములు’’ అను శీర్షికను బదులుగా 01.11.1956 నుండి ఉంచబడినది.
2. అదే చట్టము ద్వారా, అనుచ్ఛేదము 239 మరియు 240లకు బదులు ఉంచబడినవి.
3. సంవిధాన (పదునాలుగవ సవరణ) చట్టము, 1962 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.
4. గోవా, డామన్ మరియు డయ్యూ పునర్వ్యవస్థీకరణ చట్టము, 1987 (1987లోని 18వది) యొక్క 63వ పరిచ్ఛేదము ద్వారా (30.5.1987 నుండి) ‘‘గోవా, డామన్, డయ్యూ మరియు పాండిచ్చేరి రాజ్యక్షేత్రము’’ అను పదము ఉంచబడినది.
5. పాండిచ్చేరి (పేరు మార్పు) చట్టము, 2006 (2006లోని 44వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా (1.10.2006 నుండి) ‘‘పాండిచ్చేరి’’ అను పదమునకు బదులుగా ఉంచబడినది.

[1][239ఏఏ. (1) సంవిధానవు (అరువది తొమ్మిదవ సవరణ) చట్టము, 1991 అమలులోనికి వచ్చిన తేదీ నుండి ఢిల్లీ సంఘ రాజ్యక్షేత్రమును (ఈ భాగములో ఇటు తరువాత జాతీయ రాజధాని రాజ్యక్షేత్రముగా పేర్కొనబడు) ఢిల్లీ జాతీయ రాజధాని రాజ్య క్షేత్రముగా పేర్కొనవలెను, మరియు అనుచ్ఛేదము 239 క్రింద దాని కొరకు నియమించబడిన పరిపాలకుని లెఫ్టినెంటు గవర్నరుగా పేర్కొనవలెను.

**ఢిల్లీకి సంబంధించిన ప్రత్యేక నిబంధనలు.**

(2)(ఎ) జాతీయ రాజధాని రాజ్యక్షేత్రము కొరకు ఒక శాసన సభ ఉండవలెను మరియు అట్టి శాసనసభలోని స్థానములు ఆ జాతీయ రాజధాని రాజ్యక్షేత్రములోని శాసనసభా నియోజక వర్గముల నుండి ప్రత్యక్ష ఎన్నిక ద్వారా ఎంపిక చేయబడిన సభ్యులచే భర్తీ చేయబడవలెను.

(బి) శాసనసభ మొత్తము స్థానముల సంఖ్య, అనుసూచిత కులముల కొరకు ప్రత్యేకించిన స్థానముల సంఖ్య, శాసనసభ నియోజక వర్గములుగా జాతీయ రాజధాని రాజ్యక్షేత్రవు విభజన (అట్టి విభజనకు ప్రాతిపదికతో సహా) మరియు ఆ శాసనసభ నిర్వాహణకు సంబంధించి అన్ని ఇతర విషయములు పార్లమెంటు చేసిన శాసనముచే క్రమబద్ధీకరించబడవలెను.

(సి) 324 నుండి 327 మరియు 329 అనుచ్ఛేదములలోని నిబంధనలు ఒక రాజ్యమునకు, రాజ్య శాసనసభకు మరియు దాని సభ్యులకు సంబంధించి వర్తించినట్లుగానే క్రమముగా జాతీయ రాజధాని క్షేత్రమునకు, దాని శాసనసభకు మరియు దాని సభ్యులకు వర్తించును, మరియు అనుచ్ఛేదములు 326 మరియు 329లోని ''సముచిత శాసనమండలి''కి చేసిన ఏదేని నిర్దేశమును పార్లమెంటుకు చేసిన నిర్దేశముగా భావించవలెను.

(3) (ఎ) ఈ సంవిధానములోని నిబంధనలకు లోబడి రాజ్య జాబితా లేక ఉభయ సామాన్య జాబితాలో పేర్కొన్న ఏవేని విషయములకు సంబంధించి రాజ్య జాబితాలోని 1, 2, 18 నమోదులు మరియు ఆ జాబితాలోని 64, 65, 66 నమోదులు సదరు 1, 2, 18 నమోదులకు సంబంధించిన మేరకు తప్ప ఏదేని అట్టి విషయము సంఘ రాజ్యక్షేత్రములకు వర్తించదగినంత మేరకు జాతీయ రాజధాని క్షేత్రము మొత్తమునకు లేక దానిలోని ఏదేని భాగమునకు శాసనములు చేయుటకు శాసనసభ అధికారము కలిగియుండును.

(బి) ఉప-ఖండము (ఎ)లో ఉన్నదేదియు ఏదేని విషయమునకు సంబంధించి ఒక సంఘ రాజ్యక్షేత్రమునకు లేక దానికి సంబంధించిన ఏదేని భాగమునకు శాసనములు చేయుటకు ఈ సంవిధానము క్రింద పార్లమెంటుకు ఉన్న అధికారములను న్యూనపరచజాలదు.

(సి) ఏదేని విషయమునకు సంబంధించి శాసనసభ చేసిన శాసనము యొక్క ఏదేని నిబంధన, శాసనసభ చేసిన, శాసనమునకు లేక శాసనసభ చేసిన శాసనము కానట్టి తొలి శాసనమునకు ముందు లేక అటు తర్వాత శాసనసభ ఆమోదించిననూ, ఆ విషయమునకు సంబంధించి పార్లమెంటు చేసిన శాసనము యొక్క ఏదేని నిబంధనకు విరుద్ధముగా ఉన్నట్లయితే అప్పుడు ఆ రెండు సందర్భములలో పార్లమెంటు చేసిన శాసనము లేక సందర్భానుసారముగా అట్టి

---

1. సంవిధాన (అరవై తొమ్మిదవ సవరణ) చట్టము, 1991 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 1.2.1992 నుండి చొప్పించబడినది.

తొలి శాసనము ప్రభావము కలిగియుండును మరియు శాసనసభ చేసిన శాసనము, విరుద్ధముగా ఉన్నంత వరకు చెల్లదు:

అయితే శాసనసభ చేసిన ఏదేని అట్టి శాసనము రాష్ట్రపతి యొక్క పర్యాలోచనకు ప్రత్యేకించి మరియు ఆయన ఆమోదము పొందినపుడు అట్టి శాసనము ఆ జాతీయ రాజధాని క్షేత్రములో ప్రభావము కలిగియుండును:

అయితే ఇంకనూ ఈ ఉప-ఖండములో ఉన్నదేదియు శాసనసభ చేసిన శాసనమునకు చేర్చుటకు, సవరించుటకు, మార్పు చేయుటకు లేక రద్దుచేయుటతో సహా అదే విషయమునకు సంబంధిచి ఎప్పుడైనను ఏదేని శాసనము చేయుటకు పార్లమెంటును నివారించదు.

(4) ఏదేని శాసనము ద్వారాగాని లేదా దాని క్రిందగాని లెఫ్టినెంటు గవర్నరు ఏ విషయములను గురించి శాసనసభకు శాసనములు చేయుటకు ఉన్న అధికారములకు సంబంధించిన కృత్యములను తన వివేచనానుసారము నిర్వహించవలెనని ఆపేక్షింపబడియున్న కృత్యములు, లేక వాటిలో ఏవేని తప్ప, ఇతర కృత్యములను నిర్వహించుటలో ఆయనకు సహాయపడుటకును, సలహా నిచ్చుటకును ముఖ్యమంత్రి ఆధిపత్యమున శాసనసభ సభ్యుల సంఖ్యలో పది శాతానికి మించని ఒక మంత్రి పరిషత్తు ఉండవలెను:

అయితే ఏదేని విషయములో లెఫ్టినెంటు గవర్నరుకు మరియు అతని మంత్రులకు మధ్య అభిప్రాయబేధము వచ్చిన సందర్భంలో లెఫ్టినెంటు గవర్నరు దానిని రాష్ట్రపతి నిర్ణయము కొరకు నివేదించవలెను మరియు దాని మీద రాష్ట్రపతి ఇచ్చిన నిర్ణయానుసారము నడుచుకొనవలెను. రాష్ట్రపతి అట్టి నిర్ణయము ఇచ్చులోపల ఏదేని విషయములో తను అత్యవసరమైన చర్య తీసుకొనవలసిన అవసరము తనకున్నదని లెఫ్టినెంటు గవర్నరు భావించినప్పుడు లేదా ఆ విషయములో తనకు తోచినట్టి ఆదేశములు ఇచ్చులకు లెఫ్టినెంటు గవర్నరు సమర్థత కలిగియుండును.

(5) ముఖ్యమంత్రి రాష్ట్రపతిచే నియమించబడవలెను మరియు ఇతర మంత్రులు ముఖ్యమంత్రి సలహాపై రాష్ట్రపతిచే నియమించబడవలెను. మంత్రులు రాష్ట్రపతి అనుగ్రహమున్నంత వరకు పదవియందు ఉండవలెను.

(6) మంత్రి పరిషత్తు శాసనసభకు సమిష్టిగా బాధ్యత వహించవలెను.

[1][(7)(ఎ)] ఇది వరకటి ఖండములలోని నిబంధనలను అమలు చేయటానికి లేదా వాటికి అనుబంధముగా మరియు అందుకు సంబంధించి అన్ని ఆనుషంగిక లేక పారిణామిక విషయముల కొరకు పార్లమెంటు శాసనము ద్వారా నిబంధనలు చేయవచ్చును.

[2][(బి) ఉప-ఖండము (ఎ)లో పేర్కొనబడిన ఏదేని అట్టి శాసనము ఈ సంవిధానపు సవరణకు లేదా సవరించుటకు ప్రభావం కలిగించు ఏదేని నిబంధనతో కూడియున్నదను

---

1. సంవిధాన (పదిహేడవ సవరణ) చట్టము, 1992 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 21.12.1991 నుండి ''(7)'' బదులుగా ఉంచబడినది.
2. అదే చట్టము యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా (21.12.1991 నుండి) చొప్పించబడినది.

దానితో నిమిత్తం లేకుండా, 368వ అనుచ్ఛేదవు ప్రయోజనముల నిమిత్తము ఈ సంవిధాన సవరణగా భావించరాదు.]

(8) 239-బీ అనుచ్ఛేదములోని నిబంధనలు సంఘరాజ్యక్షేత్రమునకు దాని పరిపాలకునికి మరియు దాని శాసన మండలికి సంబంధించి వర్తించనట్లే క్రమముగా వీలైనంతవరకు అవి జాతీయ రాజధాని క్షేత్రమునకు, దాని లెఫ్టినెంటు గవర్నరు మరియు దాని శాసనసభకు సంబంధించి పుదుచ్చేరి సంఘ రాజ్యక్షేత్రము, దాని పరిపాలకుడు మరియు దాని శాసనమండలికి అనువర్తించునట్లుగా మరియు ఆ అనుచ్ఛేదములోని ‘‘239ఏ అనుచ్ఛేదవు ఖండము (1)కి చేసిన ఏదేని నిర్దేశమును ఈ అనుచ్ఛేదమునకు లేదా సందర్భానుసారముగా 239ఏబీ కి చేసిన నిర్దేశముగా భావించవలెను.

**సంవిధాన యంత్రాంగము విఫలమైన సందర్భంలో నిబంధనలు**

239ఏబీ. లెఫ్టినెంట్ గవర్నరు నుండి రిపోర్టు అందిన మీదట లేక అన్యథా రాష్ట్రపతి,-

(ఎ) అనుచ్ఛేదము 239-ఏఏ లేదా ఆ అనుచ్ఛేదమునకు అనుసరణగా చేసిన శాసనములోని నిబంధనలకు అనుగుణంగా జాతీయ రాజధాని క్షేత్రములో పరిపాలన సాగటానికి వీలులేని పరిస్థితి ఉన్నదని, లేదా

(బి) జాతీయ రాజధాని క్షేత్రములో సముచిత పరిపాలన కొరకు ఆ విధంగా చేయటం ఆవశ్యకమని లేదా యుక్తమని రాష్ట్రపతి సంతృప్తి చెందినపుడు,

అనుచ్ఛేదము 239 మరియు అనుచ్ఛేదము 239-ఏఏ లలోని నిబంధనలకనుగుణంగా జాతీయ రాజధాని క్షేత్రములో పరిపాలన కొనసాగించడానికి తన దృష్టిలో ఆవశ్యకమని మరియు యుక్తమని భావించిన ఆనుషంగికమైన మరియు పారిణామికమైన నిబంధనలను అట్టి శాసనములో నిర్దిష్టపరచుచూ మరియు అట్టి కాలావధితో పాటు మరియు అట్టి నియమములకు లోబడి ఉండునట్లు అనుచ్ఛేదము 239-ఏఏ లోని ఏదేని లేక అన్ని నిబంధనలను లేక ఆ అనుచ్ఛేదమునకు అనుగుణంగా చేసిన ఏదేని శాసనము యొక్క ఏదేని నిబంధనల అమలును రాష్ట్రపతి తన ఉత్తరువు ద్వారా సస్పెండు చేయవచ్చును.]

**శాసనమండలి యొక్క విరామ కాలములో అధ్యాదేశములను ప్రఖ్యాపనచేయుటకు పరిపాలకునకు గల అధికారము.**

[1][239బీ. (1) ఏ కాలములోనైనను [2][[3][పుదుచ్చేరి] సంఘ రాజ్యక్షేత్రము యొక్క]] శాసనమండలి అధివేశనములో నున్నప్పుడు తప్ప ఎప్పుడైనను తాను వెంటనే చర్య తీసుకొనుట ఆవశ్యకమగునట్టి పరిస్థితులు కలవని ఆ రాజ్యక్షేత్రవు పరిపాలకుడు అభిప్రాయపడినచో ఆ పరిస్థితులలో ఆవశ్యకమని ఆయనకు తోచునట్టి అధ్యాదేశములను ఆయన ప్రఖ్యాపన చేయవచ్చును:

---

1. సంవిధాన (ఇరువది ఏడవ సవరణ) చట్టము, 1971 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 30.12.1971 నుండి చొప్పించబడినది.
2. గోవా, డామన్ మరియు డయ్యు పునర్వ్యవస్థీకరణ చట్టము, 1987 (1987లోని 18వది) యొక్క 63వ పరిచ్ఛేదము ద్వారా ‘‘239-ఏ అనుచ్ఛేదము యొక్క ఖండము (1)లో నిర్దేశించబడిన సంఘరాజ్య క్షేత్రమునకు’’ బదులుగా 30.5.1987 నుండి ఉంచబడినది.
3. పాండిచ్చేరి (పేరు మార్పు) చట్టము, 2006 (2006లోని 44వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 1.10.2006 నుండి ‘‘పాండిచ్చేరి’’ అను పదమునకు బదులుగా ఉంచబడినది.

అయితే అట్టి అధ్యాదేశమేదియు, తద్విషయమై రాష్ట్రపతి నుండి అనుదేశములను పొందిన పిమ్మటనే తప్ప, పరిపాలకునిచే ప్రఖ్యావన చేయబడరాదు:

అంతే కాక సదరు శాసనమండలి విఘటితమైనప్పుడెల్లను, లేక 239-ఏ అనుచ్ఛేదము యొక్క ఖండము (1)లో నిర్దేశించబడిన ఏదేని శాసనము క్రింద తీసుకొనబడిన ఏదేని చర్య వలన దాని కృత్యముల నిర్వహణ సస్పెండు చేయబడియున్నప్పుడెల్లను పరిపాలకుడు, అట్టి విఘటన లేక సస్పెన్షను (తాత్కాలిక నిలుపుదల) కాలావధిలో ఏ అధ్యాదేశమును ప్రఖ్యావన చేయరాదు.

(2) రాష్ట్రపతి నుండి పొందిన అనుదేశములను పురస్కరించుకొని ఈ అనుదేశము క్రింద ప్రఖ్యావన చేయబడిన అధ్యాదేశము, 239-ఏ అనుచ్ఛేదము యొక్క ఖండము (1)లో నిర్దేశించబడిన ఏదేని శాసనములో తద్విషయమై పొందుపరచబడిన నిబంధనలను పాటించిన పిమ్మట తగురీతిగా అనుశాసించబడిన సంఘ రాజ్యక్షేత్ర శాసనమండలి యొక్క చట్టముగా భావించబడవలెను; కాని అట్టి ప్రతి యొక్క అధ్యాదేశము–

(ఎ) సంఘ రాజ్యక్షేత్ర శాసనమండలి సమక్షమున ఉంచబడవలెను, మరియు శాసనమండలి తిరిగి సమావేశమైనప్పటి నుండి ఆరు వారముల కాలావధి ముగియగనే, లేక ఆ కాలావధి ముగియుటకు పూర్వము, ఆ అధ్యాదేశమును ఆమోదించరాదను తీర్మానము శాసనమండలిచే పాస్ చేయబడినచో, ఆ తీర్మానము పాస్ చేయబడిన మీదట, అధ్యాదేశము యొక్క అమలు ఆగిపోవలెను; మరియు

(బి) పరిపాలకునిచే తద్విషయమై రాష్ట్రపతి నుండి అనుదేశములను పొందిన పిమ్మట ఎప్పుడైనను, ఉపసంహరించబడవచ్చును.

(3) 239-ఏ అనుచ్ఛేదము యొక్క ఖండము (1)లో నిర్దేశింపబడిన ఏదేని శాసనములో, తద్విషయమై పొందుపరచబడిన నిబంధనలను పాటించి చేసిన సంఘ రాజ్యక్షేత్ర శాసనమండలి యొక్క చట్టమునందు అధిశాసించబడినచో ఏ నిబంధన అమాన్యమై యుండెడిదో, అట్టి ఏదేని నిబంధనను ఈ అనుచ్ఛేదము క్రింది అధ్యాదేశము చేసినచో, మరియు అట్లు చేసినంత మేరకు అది ప్రభావశూన్యము కావలెను.

[1][(4)* * * *]

**కొన్ని సంఘ రాజ్య క్షేత్రముల కొరకు వినియమములను చేయుటకు రాష్ట్రపతికి గల అధికారము.**

240. (1) రాష్ట్రపతి, ఈ క్రింది సంఘ రాజ్యక్షేత్రముల శాంతి, ప్రగతి మరియు సుపరిపాలన కొరకు వినియమములను చేయవచ్చును–

(ఎ) అండమాను మరియు నికోబారు దీవులు;

[1][(బి) లక్షద్వీప్;]

1. సంవిధాన (ముప్పది ఎనిమిదవ సవరణ) చట్టము, 1975 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా ఖండము (4) గతకాలిక ప్రభావముతో చొప్పించబడినది మరియు సంవిధన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 32వ పరిచ్ఛేదము ద్వారా 20.6.1979వ తేదీ నుండి లుప్తము చేయబడినది.

[2][(సి) దాద్రా మరియు నగర్ హవేలి మరియు డామన్ మరియు డయ్యు; ]

[3][(డి)..... ]

[4][(ఇ) పుదుచ్చేరి;]

[5][(ఎఫ్)....... ]

[6] [ (జి).......

[7][అయితే 239-ఏ అనుచ్ఛేదము క్రింద, [8][[9][పుదుచ్చేరి] సంఘరాజ్యక్షేత్రము] కొరకు ఏదేని నికాయము శాసనమండలిగా వ్యవహరించుటకుగాను ఏర్పాటు చేయబడినప్పుడు, ఆ శాసనమండలి యొక్క మొదటి సమావేశమునకు నియతపరచబడిన తేదీ నుండి ఆ సంఘ రాజ్యక్షేత్రము యొక్క శాంతి, ప్రగతి మరియు సుపరిపాలన కొరకు రాష్ట్రపతి ఎట్టి వినియమము చేయరాదు:

---

1. లక్కదీవి, మినికోయ్ మరియు అమిన్‌దీవి దీవుల (పేరు మార్పు) చట్టము, 1973 (1973లోని 34వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 1.11.1973 నుండి నమోదు (బి)కి బదులుగా ఉంచబడినది.
2. దాద్రా మరియు నగర్ హవేలి మరియు డామన్ మరియు డయ్యూ (సంఘ రాజ్యక్షేత్రముల సంవిలీనము) చట్టము (2019లోని 44వది) ద్వారా 19.12.2019 నుండి బదులుగా ఉంచబడినది. సంవిధాన (పదవ సవరణ) చట్టము, 1961 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 11.08.1961 నుండి నమోదు (సీ) చొప్పించబడినది.
3. దాద్రా మరియు నగర్ హవేలి మరియు డామన్ మరియు డయ్యూ (సంఘ రాజ్యక్షేత్రముల సంవిలీనము) చట్టము (2019లోని 44వది) ద్వారా 19.12.2019 నుండి లుప్తము చేయబడినది మరియు మిజోరాంకు సంబంధించిన నమోదు (ఎఫ్) మిజోరాం రాజ్య చట్టము, 1986 (1986లోని 34వది) యొక్క 39వ పరిచ్ఛేదము ద్వారా 20.2.1987 నుండి వదిలివేయబదినది.
4. సంవిధాన (14వ సవరణ చట్టము, 1962, 5వ మరియు 7వ పరిచ్ఛేదము ద్వారా 16-8-1962 నుండి చొప్పించబడినది. పాండిచ్చేరి (పేరు మార్పు) చట్టము, 2006 (2006లోని 44వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా ''పాండిచ్చేరి''కి బదులుగా 1.10.2006 నుండి ఉంచబడినది.
5. మిజోరాంకు సంబంధించిన నమోదు (ఎఫ్) మిజోరాం రాజ్య చట్టము, 1986 (1986లోని 34వది) యొక్క 39వ పరిచ్ఛేదము ద్వారా 20.2.1987 నుండి వదిలివేయబదినది.
6. అరుణాచల్‌ప్రదేశ్‌కు సంబంధించిన నమోదు (జి) అరుణాచల్‌ప్రదేశ్ రాజ్య చట్టము, 1986 (1986లోని 69వది) యొక్క 42వ పరిచ్ఛేదము ద్వారా 20.2.1987 నుండి లుప్తము చేయబడినది.
7. సంవిధాన (పదునాల్గవ సవరణ) చట్టము, 1962 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.
8. సంవిధాన (ఇరవై ఏడవ సవరణ) చట్టము, 1971 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 15.2.1972 నుండి ''గోవా, డామన్ మరియు డయ్యు లేక పాండిచ్చేరి సంఘం రాజ్యక్షేత్రములు'' అను దానికి బదులుగా ఉంచబడినది.
9. పాండిచ్చేరి (పేరు మార్పు) చట్టము, 2006 (2006లోని 44వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 01.10.2006 నుండి ''పాండిచ్చేరి''కి బదులుగా ఉంచబడినది.

[1] [అంతేగాక పుదుచ్చేరి, సంఘ రాజ్యక్షేత్రము కొరకై శాసన మండలిగా కృత్యములను నిర్వహించుచున్న నికాయము విఘటితమైనపుడెల్లను, లేక అట్టి శాసన మండలిగా ఆ నికాయము యొక్క కృత్యముల నిర్వహణ 239-ఏ అనుచ్ఛేదము యొక్క ఖండము (1)లో నిర్దేశింపబడిన ఏదేని శాసనము క్రింద ఏదేని చర్యవలన సస్పెండు చేయబడియున్నప్పుడెల్లను, రాష్ట్రపతి, అట్టి విఘటన లేక సస్పెన్షను (తాత్కాలిక నిలుపుదల) కాలావధిలో ఆ సంఘరాజ్యక్షేత్రము యొక్క శాంతి, ప్రగతి మరియు సుపరిపాలన కొరకై వినిములను చేయవచ్చును.]

(2) అట్లు చేయబడిన ఏదేని వినియము, పార్లమెంటుచే చేయబడిన ఏదేని చట్టమును, లేక సంఘరాజ్యక్షేత్రమునకు తత్సమయమున వర్తించు [2][ఏదేని ఇతర శాసనమును] రద్దు చేయవచ్చును, లేక సవరించవచ్చును; మరియు రాష్ట్రపతిచే ప్రఖ్యాపన చేయబడినప్పుడు ఆ రాజ్య క్షేత్రమునకు వర్తించెడి పార్లమెంటు యొక్క చట్టమునకు గల ప్రాబల్య ప్రభావములనే ఆ వినియము కలిగియుండును.

**సంఘ రాజ్యక్షేత్రముల కొరకు న్యాయస్థానములు**

241. (1) పార్లమెంటు శాసనము ద్వారా [3] [సంఘరాజ్యక్షేత్రము] దేనికైనను ఒక ఉన్నత న్యాయస్థానమును సంఘటిత పరచవచ్చును, లేక [4] [అట్టి రాజ్యక్షేత్రము] నందలి ఏ న్యాయస్థానమునైనను ఈ సంవిధానము యొక్క అన్ని లేక ఏవేని ప్రయోజనముల కొరకై ఉన్నత న్యాయస్థానముగ ప్రఖ్యానింపవచ్చును.

(2) పార్లమెంటు శాసనము ద్వారా నిబంధించునట్టి మార్పులకు, లేక మినహాయింపులకు అధ్యధీనమై, భాగము 6లోని అధ్యాయము 5 యొక్క నిబంధనలు 214వ అనుచ్ఛేదములో నిర్దేశించబడిన ఉన్నత న్యాయస్థానము విషయమున వర్తించునటులనే ఖండము (1)లో నిర్దేశింపబడిన ప్రతి ఉన్నత న్యాయస్థానము విషయమున వర్తించవలెను.

[5][(3) ఈ సంవిధానము యొక్క నిబంధనలకును ఈ సంవిధానముచేగాని, దాని క్రిందగాని, ప్రదత్తమైన అధికారములను పురస్కరించుకొని అందుకు సంబంధించిన శాసన మండలిచే చేయబడిన ఏదేని శాసనము యొక్క నిబంధనలకును అధ్యధీనమై, ఈ సంవిధాన (ఏడవ సవరణ) చట్టము,

---

1. సంవిధాన (ఇరవై ఏడవ సవరణ) చట్టము, 1971 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 15.2.1972 నుండి చొప్పించబడినది.
2. అదే చట్టము యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 15.2.1972 నుండి ''అస్తిత్వము నందున్న ఏదేని శాసనము''నకు బదులుగా ఉంచబడినది.
3. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''ఒకటవ అనుసూచి యొక్క భాగము-సీలో నిర్దిష్టపరచబడిన రాజ్యము''నకు 01.11.1956 నుండి బదులుగా ఉంచబడినది.
4. అదే చట్టము యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''అట్టి రాజ్యము''నకు బదులుగా ఉంచబడినది.
5. అదే చట్టము యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ఖండములు (3) మరియు (4)లకు బదులుగా ఉంచబడినది.

1956 యొక్క ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము ఏదేని సంఘరాజ్యక్షేత్రమునకు సంబంధించి అధికారితను వినియోగించుచుండిన ప్రతి ఉన్నత న్యాయస్థానము, అట్టి ప్రారంభము తరువాత కూడా ఆ సంఘరాజ్యక్షేత్రమునకు సంబంధించి అట్టి అధికారితను వినియోగించు చుండవలెను.]

(4) ఈ అనుచ్ఛేదములో నున్నదేదియు, ఒక రాజ్యము యొక్క ఉన్నత న్యాయస్థానపు అధికారితను ఏదేని సంఘ రాజ్యక్షేత్రమునకు, లేక తద్భాగమునకు విస్తరింపజేయుటకు, లేక అందుండి అపవర్జించుటకు, పార్లమెంటుకు గల అధికారమును న్యూనపరచదు.

242. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956, పరిచ్ఛేదము 29 మరియు అనుసూచి ద్వారా 01.11.1956 నుండి లుప్తము చేయబడినది. **కూర్గ్.**

## [1][**భాగము – 9**

## **పంచాయతీలు**

243. ఈ భాగము సందర్భము అన్యథా కోరిననే తప్ప– **నిర్వచనములు.**

(ఎ) ''జిల్లా'' అనగా ఒక రాజ్యములోని ఒక జిల్లా అని అర్థము.

(బి) ''గ్రామ సభ'' అనగా గ్రామ స్థాయిలో పంచాయితీ ప్రాంతములో చేరియున్న ఒక గ్రామమునకు చెందిన ఓటర్ల జాబితాలో రిజిస్టరు అయిన వ్యక్తులతో కూడిన నికాయము అని అర్థము;

(సి) ''మధ్యస్థ స్థాయి'' అనగా ఈ భాగము నిమిత్తము మధ్యస్థ స్థాయిగా నుండునని బహిరంగ (పబ్లికు) అధిసూచన ద్వారా ఆ రాజ్య గవర్నరుచే నిర్ధేశించబడునట్టి గ్రామము మరియు జిల్లా స్థాయిల మధ్యనున్న ఒక స్థాయి అని అర్థము.

(డి) ''పంచాయతీ'' అనగా గ్రామీణ ప్రాంతముల కొరకు అనుచ్ఛేదము 243–బీ క్రింద ఏర్పాటు చేయబడు (ఏ పేరుతో పిలువబడినను) స్వయంపాలనా సంస్థ అని అర్థము.

(ఇ) ''పంచాయతీ ప్రాంతము'' అనగా ఒక పంచాయతీ యొక్క ప్రాదేశిక ప్రాంతము అని అర్థము;

(ఎఫ్) ''జనాభా'' అనగా సంబంధిత అంకెలు ప్రచురించబడునట్టి గత చివరి జనాభా లెక్కలచే నిర్ధారించబడిన జనాభా అని అర్థము;

(జి) ''గ్రామము'' అనగా ఈ భాగము నిమిత్తము ఒక గ్రామముగా నుండినను బహిరంగ అధిసూచన ద్వారా గవర్నరుచే నిర్దేశింపబడు ఒక గ్రామము అని అర్థము మరియు అట్లు నిర్ధేశింపబడిన గ్రామముల సమూహము అందు చేరియుండును.

---

1. సంవిధాన (డెబ్బది మూడవ సవరణ) చట్టము, 1992 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 24.4.1993 నుండి చొప్పించబడినది. అంతకు ముందున్న భాగము 9 సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29 పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా 24.04.1993 నుండి లుప్తము చేయబడినది.

243-ఏ. ఒక గ్రామస్థాయిలో, రాజ్యము యొక్క శాసనసభ శాసనము ద్వారా నిబంధించునట్టి అధికారములు వినియోగించవచ్చును మరియు అట్టి కృత్యములు నిర్వర్తించవచ్చును. **గ్రామసభ.**

243-బీ. (1) ప్రతి రాజ్యములోను, ఈ భాగములోని నిబంధనల ననుసరించి గ్రామము, మధ్యస్థ, మరియు జిల్లా స్థాయిలలో పంచాయితీలను ఏర్పాటు చేయవలెను. **పంచాయితీల సంఘటన.**

(2) ఖండము (1)లో ఏమి ఉన్నప్పటికిని, ఇరవై లక్షలకు మించని జనాభా కలిగిన ఒక రాజ్యములో మధ్యస్థ స్థాయిలో పంచాయితీలను ఏర్పాటు చేయరాదు.

243-సీ. (1) ఈ భాగములోని నిబంధనలకు లోబడి, రాజ్య శాసనసభ మండలి శాసనము ద్వారా పంచాయితీ సంరచన విషయములో నిబంధనలు చేయవచ్చును: **పంచాయితీల సంరచన.**

అయితే రాజ్యము నందంతటనూ ఏ స్థాయిలోనైనను ఒక పంచాయితీలోని ప్రాదేశిక ప్రాంతములోని జనాభాకు మరియు ఎన్నికల ద్వారా భర్తీ చేయవల్సిన అట్టి పంచాయితీలోని సీట్ల సంఖ్యకు మధ్యగల దామాషా సాధ్యమైనంతవరకూ ఒకటిగానే యుండవలెను.

(2) పంచాయితీలోని అన్ని సీట్లనూ ఆ పంచాయితీ ప్రాంతములోని ప్రాదేశిక నియోజక వర్గముల నుండి ప్రత్యక్ష ఎన్నికల ద్వారా ఎంచుకొనబడిన వ్యక్తులచే భర్తీ చేయబడవలెను, మరియు ఇందు నిమిత్తం ప్రతి పంచాయితీ ప్రాంతమును ఆ పంచాయితీ ప్రాంతము నందంతటనూ, ప్రతి నియోజకవర్గము యొక్క జనాభా మరియు దానికి కేటాయించబడిన సీట్ల సంఖ్య మధ్యనున్న దామాషా సాధ్యమైనంతవరకూ ఒకటిగానే యుండునట్లుగా, ప్రాదేశిక నియోజక వర్గములుగా విభజించవలెను.

(3) రాజ్య శాసనమండలి శాసనము ద్వారా,-

(ఎ) మధ్యస్థ స్థాయి పంచాయితీలలో, లేక మధ్యస్థస్థాయిలో పంచాయితీలు లేని రాజ్యము విషయములో జిలాల స్థాయిలోగల పంచాయితీలలో గ్రామస్థాయిలోని పంచాయితీ ఛైర్‌పర్సన్‌ల యొక్క;

(బి) జిల్లా స్థాయి పంచాయితీలలో, మధ్యస్థ స్థాయిలో పంచాయితీల ఛైర్‌పర్సన్‌ల యొక్క;

(సి) గ్రామ స్థాయి కానట్టి పంచాయితీలో పంచాయితీ ప్రాంతములో పూర్తిగా గాని లేక భాగతః గాని కూడియున్న నియోజకవర్గములకు ప్రాతినిధ్యము వహించున్న లోక్‌సభ సభ్యుల యొక్క మరియు శాసనసభ సభ్యుల;

(డి) రాజ్య సభ సభ్యుల మరియు రాజ్య విధాన పరిషత్తు సభ్యుల యొక్క;

(i) మధ్యస్థ స్థాయిలోని పంచాయితీ ప్రాంతములో ఓటర్లుగా రిజిస్టరు అయినచో మధ్యస్థ స్థాయిలో గల ఒక పంచాయితీ ప్రాంతములోను;

(ii) ఒక జిల్లా స్థాయిలోని పంచాయితీ ప్రాంతములో ఓటర్లుగా రిజిస్టరు అయినచో జిల్లా స్థాయివద్ద గల ఒక పంచాయితీలోను;

ప్రాతినిధ్యము కొరకు నిబంధన చేయవచ్చును.

(4) ఆ పంచాయితీ ప్రాంతములోని ప్రాదేశిక నియోజక వర్గముల నుండి ప్రత్యక్షముగా ఎన్నుకొనబడిన లేక లేకున్న ఒక పంచాయితీ యొక్క ఛైర్‌పర్సన్ మరియు ఒక పంచాయితీ యొక్క ఇతర సభ్యుల పంచాయితీ సమావేశములలో ఓటు చేయు హక్కు కలిగియుందురు.

(5) (ఎ) గ్రామస్థాయిలోని ఒక పంచాయితీ యొక్క ఛైర్‌పర్సన్, రాజ్య శాసనసభ శాసనము ద్వారా నిబంధించునట్టి రీతిలో ఎన్నుకొనబడవలెను, మరియు

(బి) మధ్య స్థాయిలోని లేక జిల్లా స్థాయిలోని ఒక పంచాయితీ యొక్క ఛైర్‌పర్సన్‌ను, దానికి ఎన్నికైన సభ్యులు తమలో నుండి ఒకరిని ఎన్నుకొనవలెను.

243-డీ. (1) ప్రతి పంచాయితీలోనూ- **సీట్ల ప్రత్యేకీకరణ.**

(ఎ) అనుసూచిత కులములకు, మరియు

(బి) అనుసూచిత జనజాతులకు,-

సీట్లు ప్రత్యేకించబడవలెను మరియు అట్లు ప్రత్యేకించవలసిన సీట్ల సంఖ్య, ఆ పంచాయితీలోని మొత్తము జనాభాకు ఆ పంచాయితీలోని అనుసూచిత కులముల లేక సందర్భానుసారముగా అనుసూచిత జనజాతుల జనాభా ఏ నిష్పత్తిలో ఉన్నదో ఆ పంచాయితీలో ప్రత్యక్ష ఎన్నిక ద్వారా భర్తీ చేయబడవలసిన మొత్తము సీట్ల సంఖ్యకు ప్రత్యేకించవల్సిన సీట్ల సంఖ్య అదే నిష్పత్తికి సాధ్యమైనంత దగ్గరగా ఉండవలెను మరియు అట్టి సీట్లను ఒక పంచాయితీలోని వేరువేరు నియోజక వర్గములకు వంతులవారీగా కేటాయించవలెను.

(2) ఖండము (1) క్రింద ప్రత్యేకించబడిన సీట్ల మొత్తము సంఖ్యలో మూడవ వంతుకు తగ్గకుండా అనుసూచిత కులములు లేక సందర్భానుసారముగా అనుసూచిత జనజాతులకు చెందిన మహిళలకు ప్రత్యేకించవలెను.

(3) ప్రతి పంచాయితీలోను ప్రత్యక్ష ఎన్నిక ద్వారా భర్తీ చేయబడు మొత్తము స్థానముల సంఖ్యలో (అనుసూచిత కులములు, అనుసూచిత జనజాతులకు చెందిన మహిళలకు ప్రత్యేకించబడిన సీట్ల సంఖ్యతో సహా) మూడవ వంతుకు తగ్గకుండా మహిళల కొరకు ప్రత్యేకించ వలెను మరియు అట్టి స్థానములను పంచాయితీలోను వేరువేరు నియోజక వర్గములకు వంతులవారీగా కేటాయించవలెను.

(4) గ్రామస్థాయిలో లేక ఏదేని ఇతర స్థాయిలోని పంచాయితీల్లో ఛైర్‌పర్సన్ పదవులను అనుసూచిత కులములకు, అనుసూచిత జనజాతులకు మరియు మహిళలకు రాజ్య శాసనమండలి శాసనము ద్వారా నిబంధించునట్టి రీతిలో ప్రత్యేకించబడవలెను:

అయితే రాజ్యములోని మొత్తము జనాభాకు రాజ్యములోని అనుసూచిత కులముల జనాభా లేక రాజ్యములోని అనుసూచిత జనజాతుల జనాభా ఏ నిష్పత్తిలో ఉన్నదో ఏదేని రాజ్యములో ప్రతి స్థాయిలోని పంచాయితీలలో అట్టి పదవుల మొత్తము సంఖ్యకు పంచాయితీలోని అనుసూచిత కులములకు మరియు అనుసూచి జనజాతులకు ప్రత్యేకించబడిన ఛైర్‌పర్సన్ పదవుల సంఖ్య వీలైనంత దగ్గరగా అదే నిష్పత్తిలో ఉండవలెను:

అయితే ఇంకనూ ప్రతి స్థాయిలోనూ పంచాయితీలలో ఛైర్‌పర్సన్ పదవుల మొత్తము సంఖ్యలో మూడవ వంతుకు తగ్గకుండా మహిళలకు ప్రత్యేకించబడవలెను:

అంతేకాక ఈ ఖండము క్రింద ప్రత్యేకించిన పదవులను ప్రతి స్థాయిలోను వేరు వేరు పంచాయితీలకు వంతులవారీగా కేటాయించవలెను.

(5) ఖండము (1) మరియు (2) క్రింద సీట్ల ప్రత్యేకీకరణ మరియు ఖండము (4) క్రింద (మహిళల ప్రత్యేకీకరణ కాకుండా) ఛైర్‌పర్సన్ పదవుల ప్రత్యేకీకరణ అనుచ్ఛేదము 334లో నిర్దేశించిన కాలావధి ముగిసిన పిమ్మట ప్రభావము కోల్పోవును.

(6) ఈ భాగములో ఉన్నదేదియు వెనుకబడిన తరగతుల పౌరులకు అనుకూలముగా ఏదేని స్థాయిలో పంచాయితీలలో ఏవేని సీట్ల లేక పంచాయితీలలో ఛైర్‌పర్సన్ పదవులకు ప్రత్యేకీకరణ నిబంధనలు చేయుటకు రాజ్య శాసనసభను నివారించదు.

243-ఈ. (1) ప్రతి పంచాయితీ, తత్సమయమున అమలు నందున్న ఏదేని శాసనము క్రింద ముందుగా రద్దు చేయబడిననే తప్ప, దాని మొదటి సమావేశమునకు నియమించిన తేదీ నుండి అయిదు సంవత్సరముల పాటు కొనసాగవలెను మరియు అంతకు మించి కొనసాగరాదు. **పంచాయతీల కాలపరిమితి మొదలగునవి.**

(2) తత్సమయమునందు అమలునందున్న ఏదేని శాసనము యొక్క సవరణ, అట్టి సవరణకు తక్షణపూర్వము పనిచేయుచున్న ఏదేని స్థాయిలోని ఒక పంచాయితీని ఖండము (1)లో నిర్దేశిచిన దాని కాలావధి ముగియునంతవరకు రద్దు (విఘటన) చేయు ప్రభావము కలిగియుండదు.

(3) ఒక పంచాయితీని ఏర్పాటు చేయుటకై ఎన్నికను-

(ఎ) ఖండము (1)లో నిర్దేశించిన దాని కాలావధి ముగియుటకు ముందు,

(బి) దానిని రద్దు చేసిన తేదీ నుండి ఆరు నెలల కాలావధి ముగియుటకు ముందు పూర్తి చేయబడవలెను:

అయితే రద్దు చేయబడిన పంచాయితీ కొనసాగవలసియుండిన మిగిలిన కాలావధి ఆరు నెలలకన్నా తక్కువ అయినచో అట్టి కాలావధికి పంచాయితీని ఏర్పాటు చేయుటకు ఈ ఖండము క్రింద ఎన్నికను జరుపవలసినన అవసరము లేదు.

(4) ఒక పంచాయితీ దాని కాలావధి ముగియుటకు ముందు రద్దు చేయబడిన పిమ్మట, ఏర్పాటు చేయబడిన పంచాయితీ, రద్దు చేయబడిన పంచాయితీ, ఆ విధముగా రద్దు చేయబడినచో కొనసాగియుండెడి మిగిలిన కాలావధిపాటు మాత్రమే కొనసాగవలెను.

243-ఎఫ్. (1) ఒక వ్యక్తి – ఒక పంచాయితీ సభ్యునిగా ఎంచుకొనబడుటకు మరియు సభ్యుడుగా ఉండుటకు ఈ క్రింది సందర్భములలో నిరర్హుడు అగును: **సభ్యత్వమునకు నిరర్హత.**

(ఎ) సంబంధిత శాసనమండలి ఎన్నికల నిమిత్తము తత్సమయమున అమలునందున్న ఏదేని శాసనము క్రింద ఆయన అట్లు నిరర్హుడు అయినచో:

అయితే ఏ వ్యక్తికి అయిననూ ఇరవై ఒక్క సంవత్సరములు ఉన్నచో, ఆయన ఇరవై అయిదు సంవత్సరముల లోపు వయస్సుగల వాడన్న కారణముతో ఆయనను నిరర్హుడుని చేయరాదు.

(బి) రాజ్య శాసనమండలిచే చేయబడిన ఏదేని శాసనముచే లేక దాని క్రింద ఆయన నిరర్హుడు అయినచో.

(2) ఒక పంచాయితీ సభ్యుడు ఖండము (1)లో ఉదహరించిన ఏవేని నిరర్హతలకు గురి అయినాడా అను ప్రశ్న ఉత్పన్నమైనప్పుడు, ఆ విషయమును రాజ్య శాసనమండలి శాసనము ద్వారా నిబంధించునట్టి ప్రాధికారి నిర్ణయమునకు అట్టి రీతిలో నిర్దేశించవలెను.

**పంచాయితీల యొక్క అధికారములు, ప్రాధికారము మరియు బాధ్యతలు.**

243-జీ. సంవిధానము యొక్క నిబంధనలకు అధ్యధీనమై రాజ్యశాసనమండలి, పంచాయితీలకు అవి స్వపరిపాలనా సంస్థలుగా పనిచేయుటకు వీలు కలిగించుటకు అవసరమైనట్టి అధికారములను మరియు ప్రాధికారమును శాసనము ద్వారా ఈయవచ్చును. అట్టి శాసనము, దానిలో నిర్దేశించినట్టి నిబంధనలకు అధ్యధీనమై తగిన స్థాయిలో పంచాయితీలకు అట్టి అధికారములను, బాధ్యతలను ఈ క్రింది విషయములతో సంక్రమింప చేయుటకు నిబంధనలు కలిగియుండవచ్చును:

(ఎ) అర్థికాభివృద్ధి మరియు సామాజిక న్యాయము కొరకైన ప్రణాళికలను తయారు చేయుట;

(బి) పదకొండవ అనుసూచిలో గల జాబితాలోని నియమములతో సహా వాటికి అప్పగించబడిన ఆర్థికాభివృద్ధి మరియు సామాజిక న్యాయము కొరకైన పథకముల అమలు.

**పంచాయితీలకు పన్నులు విధించు అధికారములు మరియు వాటి నిధులు.**

243-హెచ్. రాజ్య శాసనమండలి శాసనము ద్వారా, ఆ శాసనములో నిర్దేశించబడినట్లుగా,-

(ఎ) పంచాయితీకి అట్టి పన్నులు, సుంకములు, టోల్స్, ఫీజులు అట్టి ప్రక్రియ ననుసరించి, అట్టి పరిమితులకు లోబడి విధించుటకు, వసూలు చేయుటకు మరియు వినియోజనము చేయుటకు అధికారము ఈయవచ్చు;

(బి) రాజ్య ప్రభుత్వము అట్టి ప్రయోజనము కొరకు మరియు అట్టి నిబంధనలు మరియు పరిమితులకు అధ్యధీనమై విధించబడిన మరియు వసూలు చేయబడిన అట్టి పన్నులు, సుంకములు, టోల్స్, ఫీజులు పంచాయితీకి అప్పగించవచ్చును;

(సి) రాజ్య సంచిత నిధి నుండి పంచాయితికీ అట్టి గ్రాంట్స్-ఇన్-ఎయిడ్ (సహాయక అనుదానములు) ఇచ్చుటకు నిబంధించవచ్చును; మరియు

(డి) పంచాయితీలచే మరియు వాటి తరపున స్వీకరించబడిన అన్ని డబ్బులు జమ చేయుటకై అట్టి నిధులను ఏర్పాటు చేయుటకు మరియు అట్టి డబ్బులు వాటి నుండి తీసుకొనుటకు కూడా వీలు కల్పించవచ్చును.

**విత్తీయ పరిస్థితి పునర్విలోకనము చేయుటకు విత్తీయ కమీషను ఏర్పాటు.**

243-ఐ. (1) సంవిధానపు (డెబ్బది మూడవ సవరణ) చట్టము, 1992 ప్రారంభమైనప్పటి నుండి ఒక సంవత్సరము లోపలను, అటు తరువాత ప్రతి అయిదవ సంవత్సరము ముగిసిన మీదటను, పంచాయితీల ఆర్థిక పరిస్థితిని పునరీక్షించుటకు రాజ్య గవర్నరు ఒక విత్తీయ కమీషనును ఏర్పాటు చేయవలెను. అది ఈ క్రింది విషయములలో గవర్నరుకు సిఫార్సులు చేయవలెను, అవేవనగా-

(ఎ) (i) ఈ భాగము క్రింద రాజ్యము మరియు పంచాయితీల మధ్య పంపిణీ చేయదగియున్న రాజ్యముచే విధింపబడు అన్ని పన్నులు, సుంకములు, టోల్స్, మరియు ఫీజుల నికర రాబడులను రాజ్యము పంచాయితీల మధ్య పంపిణీ చేయుటకు, మరియు అట్టి రాబడులలో పంచాయితీల మధ్య అన్ని స్థాయిలలో వాటాలను కేటాయించుట;

(ii) పంచాయితీలకు ఈయబడు లేక వాటిచే వినియోజనము చేయబడు పన్నులు, సుంకములు, టోల్స్ మర్తియు ఫీజులను నిర్ధారించుట.

(iii) రాజ్య సంచిత నిధి నుండి పంచాయితీలకు సహాయక అనుదానములు వీటికి సంబంధించిన సూత్రములు;

(బి) పంచాయితీల ఆర్థిక పరిస్థితిని అభివృద్ధిపరచుటకు అవసరమైన చర్యలు;

(సి) పంచాయితీల ఆర్థిక సుస్థిరత విషయములో గవర్నరుచే, ఆర్థిక సంఘమునకు నిర్దేశించబడు ఏదేని ఇతర విషయము.

(2) రాజ్య శాసనసభ శాసనము ద్వారా ఆర్థిక సంఘము యొక్క ఏర్పాటుకు, దాని సభ్యుల నియామకమునకు ఆవశ్యకమగునట్టి అర్హతలు, మరియు వారు ఎంపిక చేయబడు పద్ధతిని నిబంధించవచ్చును.

(3) కమీషను తమ విధాన ప్రక్రియను నిర్ణయించుకొనవలెను మరియు వారి కృత్యములను నిర్వర్తించుటలో రాజ్య శాసనసభ శాసనము ద్వారా వారికి ఒసగునట్టి అధికారములను కలిగియుండును.

(4) కమీషనుచే ఈ అనుచ్ఛేదము క్రింద చేయబడు ప్రతి సిఫారసును, దానిపై తీసుకొనబడిన చర్యకు సంబంధించిన వివరణ మెమోరాండంతో పాటు రాజ్య శాసనమండలియందు ఉండునట్లు గవర్నరు చూడవలెను.

**పంచాయితీల లెక్కల ఆడిటు.**

243-జే. రాజ్య శాసనసభ శాసనము ద్వారా పంచాయితీ లెక్కల నిర్వహణ విషయములోను మరియు అట్టి లెక్కల ఆడిటింగ్ విషయములోను నిబంధనలు చేయవచ్చును.

**పంచాయితీలకు ఎన్నికలు.**

243-కే. (1) అన్ని పంచాయితీలకు ఓటర్ల జాబితాను తయారు చేయుట మరియు అన్ని ఎన్నికల నిర్వహణ యొక్క పర్యవేక్షణ, ఆదేశము మరియు నియంత్రణ గవర్నరుచే నియమింపబడు రాజ్య ఎన్నికల కమీషనరుచే కూడియుండు రాజ్య ఎన్నికల కమీషనుయందు నిహితమై యుండును.

(2) రాజ్య శాసన మండలి చేయు ఏదేని శాసనము యొక్క నిబంధనలకు అధ్యధీనమై రాజ్య ఎన్నికల కమీషనరు సేవా షరతులు మరియు పదవీ కాలము గవర్నరు నియమము ద్వారా నిర్ధారించునట్టిదిగా ఉండవలెను:

అయితే రాజ్య ఎన్నికల కమీషనరును ఉన్నత న్యాయస్థానపు న్యాయాధీశుని ఏ రీతిగా మరియు ఏ కారణములతో పదవి నుండి తొలగించవచ్చునో ఆ రీతిగాను మరియు ఆ కారణములతో తప్ప, పదవి

నుండి తొలగింపరాదు మరియు రాజ్య ఎన్నికల కమీషనరు సేవా షరతులను మరియు ఆయన నియామకము తరువాత ఆయనకు అననుకూలముగా మార్చరాదు.

(3) రాజ్య ఎన్నికల కమీషనరు, ఖండము (1) ద్వారా ఒసగబడిన కృత్యములు నిర్వహించుటకు అవసరమైనట్టి సిబ్బందిని, సమకూర్చవలసినదిగా కోరినప్పుడు గవర్నరు అట్టి సిబ్బందిని రాజ్య ఎన్నికల కమీషనుకు లభ్యము చేయవలెను.

(4) ఈ సంవిధానము యొక్క నిబంధనలకు అధ్యధీనమై, రాజ్య శాసనమండలి శాసనము ద్వారా పంచాయితీల ఎన్నికలకు చెందిన లేక దానికి సంబంధించిన అన్ని విషయముల గురించి నిబంధనలు చేయవచ్చును.

**సంఘ రాజ్యక్షేత్రములకు వర్తింపు.**

243-ఎల్. ఈ భాగము యొక్క నిబంధనలు సంఘ రాజ్య క్షేత్రములకు వర్తించవలెను మరియు ఒక సంఘ రాజ్యక్షేత్రమునకు వాటిని వర్తింపచేయుటలో ఒక రాజ్యము యొక్క గవర్నరుకు నిర్దేశములు, అనుచ్ఛేదము 239 క్రింద నియమింపబడిన సంఘరాజ్యక్షేత్రము యొక్క పరిపాలకునికి మరియు ఒక రాజ్యము యొక్క శాసనమండలి లేక శాసనసభకు గల నిర్దేశములు ఒక శాసనసభ కలిగియున్న సంఘరాజ్యక్షేత్రము విషయములో ఆ శాసనసభకు వర్తించును:

అయితే రాష్ట్రపతి ఒక బహిరంగ అధిసూచన ద్వారా ఈ భాగము యొక్క నిబంధనలు ఏదేని సంఘ రాజ్యక్షేత్రమునకు లేక దాని యొక్క భాగమునకు ఆ అధిసూచనలో ఆయన నిర్దేశించునట్టి మినహాయింపులకు మరియు మార్పులకు అధ్యధీనమై వర్తించవలెనని ఆదేశించవచ్చును.

**ఈ భాగము కొన్ని ప్రాంతములకు వర్తించకుండుట.**

243-ఎమ్.(1) ఈ భాగములో ఉన్నదేదియు, అనుచ్ఛేదము 244 యొక్క ఖండము (1)లో నిర్దేశించిన అనుసూచిత ప్రాంతములకు, మరియు ఖండము (2)లో నిర్దేశించిన గిరిజన ప్రాంతములకు వర్తించదు.

(2) ఈ భాగములో ఉన్నదేదియు–

(ఎ) నాగాలాండ్, మేఘాలయ మరియు మిజోరమ్ రాజ్యములకు

(బి) ప్రస్తుతము అమలునందున్న ఏదేని శాసనము క్రింద జిల్లా కౌన్సిల్స్ ఉన్నట్టి మణిపూర్ రాజ్యములోని కొండ ప్రాంతములకు, వర్తించదు.

(3) ఈ భాగములో ఉన్నదేదియు–

(ఎ) ప్రస్తుతము ఏదేని శాసనము క్రింద డార్జిలింగ్ గోర్‌ఖాహిల్ కౌన్సిల్ ఉన్నట్టి పశ్చిమబెంగాల్ రాజ్యములోని డార్జిలింగ్ జిల్లా యొక్క కొండ ప్రాంతములకు వర్తించదు;

(బి) అట్టి శాసనము క్రింద ఏర్పాటు చేయబడిన డార్జిలింగ్ గోర్‌ఖాహిల్ కౌన్సిల్ యొక్క కృత్యములకు మరియు అధికారములకు ప్రభావము కలిగించునని అన్వయించబడరాదు.

[1][(3ఏ) అనుసూచిత కులముల వారి కొరకు సీట్ల రిజర్వేషనుకు సంబంధించి అనుచ్ఛేదము 243డీ లో ఉన్నదేదియు అరుణాచల్ ప్రదేశ్ రాజ్యమునకు వర్తించదు.]

(4) ఈ సంవిధానములో ఏమి ఉన్నప్పటికిని–

(ఎ) ఖండము (2)లోని ఉప–ఖండము (ఎ)లో నిర్దేశించబడిన ఒక రాజ్య శాసనమండలి, ఆ రాజ్య శాసన సభలోని మొత్తము సభ్యులలో అత్యధిక సభ్యులచే మరియు ఆ సభలో హాజరై ఓటు చేయు సభ్యులలో మూడింట రెండు వంతుల మందికి తక్కువకాని అత్యధిక సభ్యులచే ఆ మేరకు ఒక తీర్మానము చేసినచో, ఖండము (1)లో నిర్దేశించిన ఏవేని ప్రాంతములున్నచో, వాటికి తప్ప శాసనము ద్వారా ఈ భాగమును ఆ రాజ్యమునకు విస్తరింప చేయవచ్చును:

(బి) పార్లమెంటు శాసనము ద్వారా, ఈ భాగము యొక్క నిబంధనలను, శాసనములో నిర్దిష్టపరచబడునట్టి మినహాయింపులు మరియు మార్పులకు అధ్యధీనమైన ఖండము (1)లో నిర్దేశింపబడిన అనుసూచిత ప్రాంతములకు మరియు గిరిజన ప్రాంతములకు విస్తరింపజేయవచ్చును మరియు 368వ అనుచ్ఛేదపు ప్రయోజనముల నిమిత్తము అట్టి శాసనము ఈ సంవిధానము యొక్క సవరణగా భావించరాదు.

**అస్తిత్వములోనున్న శాసనాలు మరియు పంచాయితీల కొనసాగింపు.**

243–ఎన్. ఈ భాగములో ఏమి ఉన్నప్పటికిని, సంవిధానపు (డెబ్బది మూడవ సవరణ) చట్టము, 1992 ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము రాజ్యములో అమలునందున్న పంచాయితీలకు సంబంధించి ఈ భాగమునకు అసంగతముగా ఉన్న ఏదేని శాసనపు ఏదేని నియమము సమర్థ శాసనమండలి లేదా ఇతర సమర్థ ప్రాధికారము సవరించునంతవరకు లేదా రద్దు చేయునంతవరకు లేదా అట్టి ప్రారంభము నుండి ఒక సంవత్సరము ముగియునంతవరకు ఇందులో ఏది ముందు జరుగునో అంతవరకు అమలులో ఉండుట కొనసాగవలెను:

అయితే అట్టి ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము ఉన్న పంచాయతీలన్నియు, ఆ రాజ్య శాసనసభ లేదా శాసన పరిషత్తు ఉన్న రాజ్యము విషయములో ఆ రాజ్య శాసనమండలి యొక్క ప్రతి సదనముచే ఆమోదించబడిన తీర్మానము ద్వారా ముందుగా రద్దు చేయబడితే తప్ప వాటి కాలావధులు ముగియునంత వరకు కొనసాగవలెను.

**నిర్వాచక విషయములలో న్యాయస్థానములు జోక్యము కలిగించుకొనుటపై ప్రతిబంధకము.**

243–ఓ. సంవిధానములో ఏమి ఉన్నప్పటికిని:

(ఎ) నియోజకవర్గముల హద్దుల నిర్ణయమునకు సంబంధించిన లేదా అట్టి నియోజకవర్గములకు 243–కే అనుచ్ఛేదము క్రింద చేయబడిన లేదా చేయబడినట్లు తాత్పర్యమిచ్చు స్థానముల కేటాయింపుకు సంబంధించిన ఏదేని శాసనము యొక్క శాసనమాన్యతను ఏ న్యాయస్థానములో గాని ప్రశ్నగతము కారాదు.

(బి) రాజ్య శాసనమండలిచే చేయబడిన ఏదేని శాసనము ద్వారా లేదా దాని క్రింద నిబంధించబడినట్టి ప్రాధికారి ఎన్నికల పిటీషను దాఖలు చేయుట ద్వారా తప్ప మరియు ఆ

---

1. సంవిధాన (యనభై మూడవ సవరణ) చట్టము, 2000 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 08.09.2000 నుండి చొప్పించబడినది.

శాసనములో నిబంధించబడినట్టి రీతిలో దాఖలు చేయబడిననే తప్ప ఏదేని పంచాయితీకి జరిగిన ఎన్నికను ప్రశ్నగతము కారాదు.

## [1][భాగము – 9–ఏ

## పురపాలికలు

243–పీ. ఈ భాగములో సందర్భము అన్యథా అపేక్షించిననే తప్ప:– **నిర్వచనములు.**

(ఏ) ''కమిటీ'' అనగా 243– ఎస్ అనుచ్ఛేదము క్రింద ఏర్పాటు చేయబడిన కమిటీ అని అర్థము;

(బి) ''జిల్లా'' అనగా రాజ్యములోని జిల్లా అని అర్థము;

(సి) ''మహానగర ప్రాంతము'' అనగా ఈ భాగవు ప్రయోజనముల నిమిత్తము మహానగర ప్రాంతముగా బహిరంగ అధిసూచన ద్వారా గవర్నరుచే నిర్దిష్టపరచబడినట్టి, పది లక్షలు అంతకంటే ఎక్కువ జనాభా కలిగియుండి ఒకటి లేదా అంతకంటే ఎక్కువ జిల్లాల్లో చేరియున్నట్టి, రెండు లేదా అంతకంటే ఎక్కువ పురపాలికలు లేదా పంచాయితీలు లేదా ఇతర అనుబంధ ప్రాంతములతో కూడియున్నట్టి ప్రాంతము అని అర్థము;

(డి) ''పురపాలిక ప్రాంతము'' అనగా గవర్నరుచే అధిసూచింపబడినట్టి పురపాలిక యొక్క ప్రాదేశిక ప్రాంతము అని అర్థము;

(ఇ) ''పురపాలిక'' అనగా 243–క్యూ అనుచ్ఛేదము క్రింద ఏర్పాటు చేయబడినట్టి స్వయం పరిపాలనా సంస్థ అని అర్థము;

(ఎఫ్) ''పంచాయితీ'' అనగా 243–బీ అనుచ్ఛేదము క్రింద ఏర్పాటు చేయబడినట్టి పంచాయితీ అని అర్థము;

(జి) ''జనాభా'' అనగా అంకెలు ప్రచురింపబడినట్టి కట్టకడపటి జనగణనలో నిర్ధారితమైన జనాభా అని అర్థము.

243–క్యూ. (1) ప్రతి రాజ్యములోను:– **పురపాలికల సంఘటన.**

(ఏ) మార్పు చెందుతున్న ప్రాంతమునకు అనగా గ్రామీణ ప్రాంతము నుండి పట్టణ ప్రాంతముగా మార్పు చెందుతున్న ప్రాంతమునకు (ఏ పేరుతే పిలువబడినప్పటికినీ) ఒక నగర పంచాయితీ–

(బి) ఒక చిన్న పట్టణ ప్రాంతమునకు పురపాలిక కౌన్సిలు;

(సి) పెద్ద పట్టణ ప్రాంతమునకు పురపాలిక కార్పొరేషను, ఈ భాగము యొక్క నిబంధనలను అనుసరించి ఏర్పాటు చేయవలెను:

---

1. సంవిధాన (డెబ్బది నాలుగవ సవరణ) చట్టము, 1992 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 1.6.1993 నుండి చొప్పించబడినది.

అయితే, గవర్నరు ఒక ప్రాంతపు పరిమాణమును ఆ ప్రాంతములో పారిశ్రామిక సంస్థ సమకూర్చుతున్న లేదా సమకూర్చుటకు ప్రతిపాదించిన పురపాలిక సేవలను మరియు తాను సబబని భావించినట్టి ఇతర అంశములను దృష్టియందుంచుకొని అధిసూచన ద్వారా పారిశ్రామిక పట్టణ ప్రాంతముగా నుండునని నిర్దిష్టపరచవచ్చునుగనుక అట్టి పట్టణ ప్రాంతములో లేదా అందులోని భాగములో ఈ ఖండము క్రింద పురపాలికను ఏర్పాటు చేయరాదు.

(2) ఈ అనుచ్ఛేదములో ''మార్పు చెందుతున్న ప్రాంతము (సంధికాలిక ప్రాంతము)'' లేదా ''చిన్న పట్టణ ప్రాంతము'' లేదా ''పెద్ద పట్టణ ప్రాంతము'' అనగా గవర్నరు ఒక ప్రాంత జనాభాను అందులోని జనాభా సాంద్రతను స్థానిక పరిపాలనకు రాగల రాబడిని, వ్యవసాయేతర కార్యకలాపాల్లో నిమగ్నులైన వారి యొక్క ఉపాధి శాతమును, ఆర్థిక ప్రాముఖ్యతను, లేదా తాను సబబని భావించునట్టి ఇతర అంశములను దృష్టియందుంచుకొని ఈ భాగపు ప్రయోజనముల నిమిత్తము బహిరంగ అధిసూచన ద్వారా నిర్ధిష్టపరచునట్టి ప్రాంతము అని అర్థము;

**పురపాలికల సంరచన.**

243-ఆర్. (1) ఖండము (2)లో నిబంధించినట్ల తప్ప, పురపాలికలోని స్థానములన్నింటిని ఒక పురపాలిక ప్రాంతములోని ప్రాదేశిక నియోజకవర్గముల నుండి ప్రత్యక్ష ఎన్నికలో ఎన్నుకొనబడిన సభ్యులతో భర్తి చేయవలెను, మరియు ఇందు నిమిత్తము ప్రతి పురపాలక ప్రాంతమును, వార్డులుగా పేర్కొనబడు ప్రాదేశిక నియోజక వర్గములుగా విభజించవలెను.

(2) రాజ్య శాసనమండలి శాసనము ద్వారా-

(ఎ) పురపాలికలో ఈ క్రింది వారికి, అనగా-

(i) పురపాలిక పరిపాలనలో ప్రత్యేక పరిజ్ఞానము లేదా అనుభవము కలిగిన సభ్యులకు;

(ii) పూర్తిగా లేదా పాక్షికముగా పురపాలిక ప్రాంతముతో కూడియున్న నియోజక వర్గమునకు ప్రాతినిధ్యము వహించుచున్న లోక్‌సభ మరియు రాజ్య శాసనసభ సభ్యులకు;

(iii) పురపాలిక ప్రాంతములో ఓటర్లుగా రిజిస్టరైన రాజ్యసభ మరియు రాజ్య శాసన పరిషత్తు సభ్యులకు;

(iv) 243-ఎన్ అనుచ్ఛేదము యొక్క ఖండము (5) క్రింద ఏర్పాటు అయిన కమిటీల ఛైర్‌పర్సన్‌లకు ప్రాతినిధ్యము కల్పించుటకు:

అయితే పేరాగ్రాపు (1)లో పేర్కొనబడిన సభ్యులు పురపాలిక సమావేశములలో ఓటు వేయుటకు హక్కు కలిగివుండరు;

(బి) పురపాలిక ఛైరపర్సన్ ఎన్నిక జరుగు రీతిని, నిబంధించుటకు నిబంధనలు చేయవచ్చును.

**వార్డుల కమిటీలు మొదలగు వాటి సంఘటన మరియు సంరచన.**

243-ఎస్ .(1) మూడు లక్షలు, అంతకు ఎక్కువ జనాభా కలిగిన పురపాలిక ప్రాదేశిక ప్రాంతములో, ఒకటి లేక అంతకంటే ఎక్కువ వార్డులతో కూడిన వార్డుల కమిటీలను ఏర్పాటు చేయవలెను.

(2) రాజ్య శాసన మండలి శాసనము ద్వారా ఈ క్రింది వాటికి సంబంధించి అనగా:-

(ఎ) వార్డుల కమిటీ సంరచన మరియు దాని ప్రాదేశిక ప్రాంతం;

(బి) వార్డుల కమిటీలోని స్థానములను భర్తీ చేయవలసిన విధానము గురించి నిబంధించ వచ్చును.

(3) వార్డుల కమిటీ యొక్క ప్రాదేశిక ప్రాంతములో గల వార్డుకు ప్రాతినిధ్యము వహించుచున్న పురపాలిక సభ్యుడు, ఆ కమిటీలో సభ్యుడై ఉండవలెను.

(4) వార్డుల కమిటీ,-

(ఎ) ఒక వార్డుతో కూడి ఉన్నచో, పురపాలికలో ఆ వార్డుకు ప్రాతినిధ్యము వహించుచున్న సభ్యుడు; లేదా

(బి) రెండు లేదా అంతకంటే ఎక్కువ వార్డులతో కూడి ఉన్నచో వార్డుల కమిటీ సభ్యులచే ఎన్నుకొనబడిన పురపాలికలోని అట్టి వార్డులకు ప్రాతినిధ్యము వహించుచున్న వారిలో ఒక సభ్యుడుని ఆ కమిటీ ఛైర్‌పర్సన్‌గా ఉండవలెను.

(5) ఈ అనుచ్ఛేదములో ఉన్నదేదియు, వార్డుల కమిటీకి అదనముగా కమిటీలను ఏర్పాటు చేయుటకు ఏదేని నిబంధన చేయుట నుండి రాజ్య శాసనమండలిని నివారించుచున్నట్లు భావించరాదు.

**సీట్ల ప్రత్యేకీకరణ.**

243-టీ. (1) ప్రతి పురపాలికలోని అనుసూచిత కులములకు, మరియు అనుసూచిత జనజాతులకు, సీట్లు ప్రత్యేకించబడవలెను మరియు అట్లు ప్రత్యేకించవలసిన సీట్ల సంఖ్య ఆ పురపాలికలోని మొత్తము జనాభాకు ఆ పురపాలికలోని అనుసూచిత కులముల లేక ఆ పురపాలిక లోని అనుసూచిత జనజాతుల జనాభా ఏ నిష్పత్తిలో ఉన్నదో ఆ పురపాలికలోని ప్రత్యక్ష ఎన్నిక ద్వారా భర్తీ చేయబడవల్సిన మొత్తము సీట్ల సంఖ్యకు ప్రత్యేకించవల్సిన సీట్ల సంఖ్య వీలైనంత దగ్గరగా అదే నిష్పత్తిలో ఉండవలెను మరియు అట్టి సీట్లను ఒక పురపాలికలోని వేరు వేరు నియోజక వర్గములకు వంతులవారీగా కేటాయించవలెను.

(2) ఖండము (1) క్రింద ప్రత్యేకించబడిన సీట్ల మొత్తము సంఖ్యలో మూడవ వంతుకు తగ్గకుండా అనుసూచిత కులములు లేక సందర్భానుసారముగా అనుసూచిత జనజాతులకు చెందిన మహిళలకు ప్రత్యేకించవలెను.

(3) ప్రతి పురపాలికలోను ప్రత్యక్ష ఎన్నిక ద్వారా భర్తీ చేయబడు మొత్తము స్థానముల సంఖ్యలో (అనుసూచిత కులములు, అనుసూచిత జనజాతులకు చెందిన మహిళలకు ప్రత్యేకించబడిన సీట్ల సంఖ్యతో సహా) మూడవ వంతుకు తగ్గకుండా మహిళల కొరకు ప్రత్యేకించవలెను, మరియు అట్టి స్థానములను పురపాలికలోని వేరు వేరు నియోజకవర్గములకు వంతుల వారీగా కేటాయించవలెను.

(4) పురపాలికలలో ఛైర్‌పర్సన్ల పదవులను అనుసూచిత కులములకు, అనుసూచిత జనజాతులకు మరియు మహిళలకు రాజ్య శాసనమండలి శాసనము ద్వారా నిబంధించునట్టి రీతిలో ప్రత్యేకించబడవలెను.

(5) ఖండము (1) మరియు (2) క్రింద సీట్ల ప్రత్యేకీకరణ మరియు ఖండము (4) క్రింద (మహిళల ప్రత్యేకీకరణ కాకుండా) ఛైర్‌పర్సన్ల పదవుల ప్రత్యేకీకరణ అనుచ్ఛేదము 334లో నిర్దేశించిన కాలావధి ముగిసిన పిమ్మట ప్రభావము కోల్పోవును.

(6) ఈ భాగములో ఉన్నదేదియు వెనుకబడిన తరగతుల పౌరులకు అనుకూలముగా ఏదేని పురపాలికలో ఏవేని సీట్ల లేక పురపాలికలలో ఛైర్‌పర్సన్ల పదవుల ప్రత్యేకీకరణకు నిబంధనలు చేయుట నుండి రాజ్య శాసనసభను నివారించదు.

**పురపాలికల కాలపరిమితి మొదలగునవి.**

243-యు. (1) ప్రతి పురపాలిక, తత్సమయమున అమలునందున్న ఏదేని శాసనము క్రింద ముందుగా రద్దు (విఘటన) చేయబడిననే తప్ప, దాని మొదటి సమావేశమునకు నియమించిన తేదీ నుండి అయిదు సంవత్సరములపాటు కొనసాగవలెను మరియు అంతకు మించి కొనసాగరాదు:

అయితే పురపాలికను రద్దు చేయుటకు ముందు, విన్నవించుకొనుటకు దానికి తగిన అవకాశము ఇవ్వవలెను.

(2) తత్సమయమునందు అమలునందున్న ఏదేని శాసనము యొక్క సవరణ, అట్టి సవరణకు తక్షణ పూర్వము పనిచేయుచున్న ఏ స్థాయిలోనైనను పురపాలికను ఖండము (1)లో నిర్దేశించిన దాని కాలావధి ముగియునంతవరకు రద్దు చేయు ప్రభావము కలిగియుండదు.

(3) ఒక పురపాలికను ఏర్పాటు చేయుటకైన ఒక ఎన్నిక–

(ఎ) ఖండము (1)లో నిర్దేశించిన దాని కాలావధి ముగియుటకు ముందు;

(బి) దాని రద్దు తేదీ నుండి ఆరు నెలల కాలావధి ముగియుటకు ముందు; పూర్తి చేయబడవలెను.

అయితే రద్దు చేయబడిన పురపాలిక కొనసాగవల్సియుండిన మిగిలిన కాలావధి ఆరు నెలలకన్నా తక్కువ అయినచో అట్టి కాలావధికి ఈ ఖండము క్రింద పురపాలిక ఏర్పాటు చేయుటకు ఏదేని ఎన్నికను జరుపవలసిన పని లేదు.

(4) ఒక పురపాలిక దాని కాలావధి ముగియుటకు ముందు రద్దు చేయబడిన పిమ్మట ఏర్పాటు చేయబడిన పురపాలిక, రద్దు చేయబడిన పురపాలిక, ఆ విధముగా రద్దు చేయబడినచో కొనసాగియుండెడి మిగిలియున్న కాలావధి పాటు మాత్రమే కొనసాగవలెను.

**సభ్యత్వమునకు నిరర్హతలు.**

243-వీ. (1) ఒక వ్యక్తి–

(ఎ) సంబంధిత శాసనమండలి ఎన్నికల నిమిత్తము తత్సమయమున అమలునందున్న ఏదేని శాసనముచే లేక దాని క్రింద ఆయన అట్లు నిరర్హుడు అయినచో:

అయితే ఏ వ్యక్తికి అయిననూ ఇరవై ఒక సంవత్సరములు ఉన్నచో ఆయన ఇరవై అయిదు సంవత్సరములలోపు వయస్సుగల వాడన్న కారణముతో ఆయనను నిరర్హుడిని చేయరాదు.

(బి) రాజ్య శాసనమండలిచే చేయబడిన ఏదేని శాసనముచే లేక దాని క్రింద ఆయన నిరర్హుడు అయినచో;

ఒక పురపాలిక సభ్యునిగా ఎంచుకొనబడుటకు మరియు సభ్యునిగా ఉండుటకు నిరర్హుడు అగును.

(2) ఒక పురపాలిక సభ్యుడు ఖండము (1)లో ఉదహరించిన ఏవేని నిరర్హతలకు గురి అయినాడా అను ప్రశ్న ఉత్పన్నమైనప్పుడు, ఆ విషయమును రాజ్య శాసనమండలి శాసనము ద్వారా నిబంధించునట్టి రీతిలో అట్టి ప్రాధికారి నిర్ణయమునకు నిర్దేశించవలెను.

**పురపాలికల అధికారములు, ప్రాధికారము, మరియు బాధ్యతలు మొదలగునవి.**

243–డబ్ల్యు. సంవిధానము యొక్క నిబంధనలకు అధ్యధీనమై, రాజ్య శాసనమండలి, శాసనము ద్వారా–

(ఎ) పురపాలికలు స్వపరిపాలనా సంస్థలుగా పనిచేయుటకు వీలుగా అవసరమైనట్టి అధికారములు, ప్రాధికారము ఈయవచ్చును. అట్టి శాసనము, దానిలో నిర్దేశించినట్టి నిబంధనలకు అధ్యధీనమై పురపాలికలకు అధికారములు మరియు బాధ్యతలు ఈ క్రింది విషయములలో సంక్రమింప చేయుటకు నిబంధనను కలిగియుండ వచ్చును.

(i) ఆర్థికాభివృద్ధి మరియు సామాజిక న్యాయము కొరకు ప్రణాళికలను రూపొందించుట;

(ii) పన్నెండవ అనుసూచిలోని జాబితాలోగల విషయములతో సహా వాటికి అప్పగించిన కృత్యములు నిర్వర్తించుట మరియు పథకములు అమలు పరచుట.

(బి) పన్నెండవ అనుసూచిలోని జాబితాలోగల విషయములతో సహా వాటికి అప్పగించ బడిన బాధ్యతలను కొనసాగించుటకు వీలుగాఆ కమిటీలకు అవసరమైనట్టి అధికారములు మరియు ప్రాధికారమును ఈయవచ్చును.

**పన్నులు విధించుటకు మరియు నిధుల కొరకు పురపాలికలకు గల అధికారము.**

243–ఎక్స్. రాజ్య శాసనమండలి, శాసనము ద్వారా, ఆ శాసనములో నిర్దిష్టపచబడినట్లుగా,–

(ఎ) అట్టి ప్రక్రియననుసరించి, అట్టి పరిమితులకు అధ్యధీనమై అట్టి పన్నులు, సుంకములు, టోల్స్, ఫీజులు విధించుటకు, వసూలు చేయుటకు, వినియోజనము చేయుటకు పురపాలికలకు అధికారము ఈయవచ్చును;

(బి) రాజ్య ప్రభుత్వముచే విధించబడిన మరియు వసూలు చేయబడిన అట్టి పన్నులు, సుంకములు, టోల్స్, ఫీజులు అట్టి ప్రయోజనము కొరకు మరియు అట్టి నిబంధనలు మరియు పరిమితులకు అధ్యధీనమై పురపాలికకు అప్పగించవచ్చును;

(సి) రాజ్య సంచిత నిధి నుండి పురపాలికకు అట్టి సహాయక అనుదానములు ఇచ్చుటకు నిబంధించవచ్చును; మరియు

(డి) పురపాలికలచే మరియు వరుసగా వాటి తరపున స్వీకరించబడిన అన్ని డబ్బులు జమ చేయుటకు, అట్టి నిధులను ఏర్పాటు చేయుటకు మరియు వాటి నుండి అట్టి డబ్బులు తీసుకొనుటకు కూడా వీలు కల్పించవచ్చును.

243–వై. (1) అనుచ్ఛేదము 243–ఐ క్రింద ఏర్పాటు చేయబడిన విత్తీయ కమీషను పురపాలికల విత్తీయ పరిస్థితిని కూడా పునర్విలోకనము చేయవలెను మరియు ఈ క్రింది విషయములలో గవర్నరుకు సిఫారసులు చేయవలెను. **విత్తీయ కమీషను.**

(ఎ)(i) రాజ్యము మరియు పురపాలికల మధ్య పంపిణీ చేయదగు, రాజ్యముచే విధించబడు అన్ని పన్నులు, సుంకములు, టోల్స్ మరియు ఫీజుల నికర రాబడులను ఈ భాగము క్రింద వాటి మధ్య పంపిణీ చేయుటకు మరియు అట్టి రాబడులను అన్ని స్థాయిలలోని పురపాలికల మధ్య వాటికి తగిన వాటాలను కేటాయించుటకు–

(ii) పురపాలికలకు ఈయబడు లేక వాటిచే వినియోజనము చేయబడు పన్నులు, సుంకములు, టోల్స్ మరియు ఫీజులను నిర్ధారించుటకు;

(iii) రాజ్య సంచిత నిధి నుండి పురపాలికలకు సహాయక అనుదానములకు సంబంధించిన సూత్రములు.

(బి) పురపాలికల విత్తీయ పరిస్థితిని అభివృద్ధి పరచుటకు అవసరమైన చర్యలు;

(సి) పురపాలికల ఆర్థికసుస్థిరత విషయములో గవర్నరుచే ఆర్థిక సంఘమునకు నిర్దేశించబడు ఏదేని ఇతర విషయము.

(2) కమీషనుచే ఈ అనుచ్ఛేదము క్రింద చేయబడు ప్రతి సిఫారసును, దానిపై తీసుకొనబడిన చర్యకు సంబంధించిన వివరణ మెమోరాండంతోపాటు రాజ్య శాసనమండలి యందు ఉంచునట్లు గవర్నరు చూడవలెను.

243–జడ్. రాజ్య శాసనమండలి పురపాలికలచే లెక్కల నిర్వహణ గురించి, మరియు అట్టి లెక్కల ఆడిటింగ్ గురించి శాసనము ద్వారా నిబంధనలు చేయవచ్చును. **పురపాలికల లెక్కల ఆడిటు.**

243–జడ్ ఏ. (1) పురపాలికల ఓటర్ల జాబితాను తయారు చేయుట మరియు అన్ని ఎన్నికలు నిర్వహించుట యొక్క అధీక్షణ, ఆదేశము, నియంత్రణ 243–కే అనుచ్ఛేదములో నిర్దేశించిన విధంగా రాజ్య ఎన్నికల కమీషనులో నిహితమై యుండును. **పురపాలికలకు ఎన్నికలు.**

(2) ఈ సంవిధానము యొక్క నిబంధనలకు అధ్యధీనమై, రాజ్య శాసనమండలి శాసనము ద్వారా పురపాలికల ఎన్నికలకు చెందిన లేక దానికి సంబంధించిన అన్ని విషయముల గురించి నిబంధనలు చేయవచ్చును.

243–జడ్ బీ. ఈ భాగము యొక్క నిబంధనలు సంఘ రాజ్యక్షేత్రములకు వర్తింపజేయవలెను, మరియు ఒక సంఘ రాజ్యక్షేత్రమునకు వాటిని వర్తింపజేయుటలో ఒక రాజ్యము యొక్క గవర్నరుకు గల నిర్దేశములు, అనుచ్ఛేదము 239 క్రింద నియమింపబడిన సంఘ రాజ్యక్షేత్రము యొక్క **సంఘ రాజ్యక్షేత్రములకు వర్తింపు.**

పరిపాలకునికిగల నిర్దేశమువలె మరియు ఒక రాజ్యము యొక్క శాసన మండలికి లేక శాసన సభకు గల నిర్దేశములు ఒక శాసనసభ కలిగియున్న సంఘ రాజ్యక్షేత్రము విషయములో ఆ శాసనసభకు గల నిర్దేశములపై ప్రభావము కలిగియుండును:

అయితే రాష్ట్రపతి ఒక బహిరంగ అధిసూచన ద్వారా ఈ భాగము యొక్క నిబంధనలు ఏదేని సంఘ రాజ్య క్షేత్రమునకు లేక దాని యొక్క భాగమునకు, ఆ అధిసూచనలో ఆయన నిర్దేశించునట్టి మినహాయింపులకు మరియు సవరణలకు అధ్యధీనమై వర్తించవలెనని ఆదేశించవచ్చును.

**ఈ భాగము కొన్ని ప్రాంతములకు వర్తించకుండుట.**

243-జెడ్ సీ. (1) ఈ భాగములో ఉన్నదేదియు 244వ అనుచ్ఛేదములోని ఖండము (1)లో నిర్దేశించిన అనుసూచిత ప్రాంతములకు మరియు ఖండము (2)లో నిర్దేశించిన గిరిజన ప్రాంతములకు వర్తించదు.

(2) ఈ భాగములో ఉన్నదేదియు పశ్చిమ బెంగాల్ రాజ్యములోని డార్జిలింగ్ జిల్లా కొండ ప్రాంతములకు ప్రస్తుతము అమలు నందున్న ఏదేని శాసనము క్రింద ఏర్పాటు చేయబడిన డార్జిలింగ్ గోర్ఖాహిల్ కౌన్సిల్ యొక్క కృత్యములకు మరియు అధికారములకు ప్రభావము కలిగించునవి అన్వయించబడరాదు.

(3) ఈ సంవిధానములో ఏమి ఉన్నప్పటికిని, పార్లమెంటు శాసనము ద్వారా ఖండము (1)లో నిర్దేశించబడిన అనుసూచిత ప్రాంతములకు మరియు గిరిజన ప్రాంతములకు అట్టి శాసనము క్రింద నిర్దిష్ట పరచునట్టి మినహాయింపులు మరియు మార్పులకు అధ్యధీనమై ఈ భాగము యొక్క నిబంధనలను విస్తరింపజేయ వచ్చును. అట్టి ఏ శాసనము అయినను 368వ అనుచ్ఛేదము యొక్క ప్రయోజనముల నిమిత్తము ఈ సంవిధానము యొక్క సవరణగా భావించరాదు.

**జిల్లా ప్రణాళికలకు కమిటీ.**

243-జెడ్ డీ. (1) ప్రతి రాజ్యములోను ఆ జిల్లాలోని పంచాయితీల మరియు పురపాలికలచే తయారు చేయబడిన ప్రణాళికలను ఏకీకరించుటకు మరియు ఆ జిల్లాకు మొత్తం మీద ప్రణాళికాభివృద్ధి ముసాయిదాను తయారు చేయుటకు జిల్లా స్థాయిలో ఒక జిల్లా ప్రణాళిక కమిటీని ఏర్పాటు చేయవలెను.

(2) రాజ్య శాసనమండలి శాసనము ద్వారా ఈ క్రింది వాటి విషయములో నిబంధన చేయవచ్చును.

(ఎ) జిల్లా ప్రణాళిక కమిటీ కూర్పు;

(బి) ఆ కమిటీలో స్థానములను భర్తీ చేయవలసిన విధానము:

అయితే అట్టి కమిటీ మొత్తము సభ్యుల సంఖ్యలో అయిదింట నాలుగువంతులకు తక్కువ కాకుండా సభ్యులను జిల్లా స్థాయిలో పంచాయితీ యొక్క మరియు జిల్లాలోని పురపాలికల యొక్క ఎన్నికైన సభ్యులు తమలో నుండి, ఆ జిల్లాలోని గ్రామీణ ప్రాంతముల మరియు పట్టణ ప్రాంతముల మధ్య గల నిష్పత్తికి దామాషాలో ఎన్నుకొనవలెను;

(సి) అట్టి కమిటీలకు అప్పగించవలసిన జిల్లా ప్రణాళికకు సంబంధించిన కృత్యములు;

(డి) అట్టి జిల్లా కమిటీల ఛైర్‌పర్సన్స్ ఎంపిక చేయబడవలసిన పద్ధతి.

(3) ప్రతి జిల్లా ప్రణాళికా కమిటీ ప్రణాళికాభివృద్ధి ముసాయిదాను తయారు చేయుటలో,-

(ఎ) ఈ క్రింది వాటిని దృష్టియందుంచుకొనవలెను:

(i) స్థలములకు సంబంధించిన ప్రణాళిక, నీటి పంపిణీ ఇతర భౌతిక, సహజవనరులు, మౌలిక సదుపాయముల సమగ్రాభివృద్ధి, పర్యావరణ పరిరక్షణలతో సహా పంచాయితీలకు పురపాలికలకు ఉమ్మడిగా ఆసక్తిగల విషయములను;

(ii) విత్తీయ లేక ఇతర విధముగా అందుబాటులోనున్న వనరుల విస్తీర్ణము, వాటి తరహా;

(బి) గవర్నరు ఉత్తరువు ద్వారా నిర్దేశించునట్టి సంస్థలను మరియు వ్యవస్థాపనలను సంప్రదించవలెను.

(4) ప్రతి జిల్లా ప్రణాళికా కమిటీ ఛైర్‌పర్సన్స్ అట్టి కమిటీచే సిఫారసు చేయబడిన అభివృద్ధి ప్రణాళికను రాజ్యప్రభుత్వమునకు పంపవలెను.

243-జెడ్ ఈ. (1) ప్రతి మహానగర ప్రాంతములోను, ఆ మహానగర ప్రాంతము మొత్తమునకు అభివృద్ధి ప్రణాళికా ముసాయిదాను తయారు చేయుటకు మహానగర ప్రణాళిక కమిటీని ఏర్పాటు చేయవలెను. **మహా నగరముల ప్రణాళికా కమిటీ.**

(2) రాజ్య శాసనమండలి ఈ క్రింది విషయములలో శాసనము ద్వారా నిబంధనలు చేయవచ్చును,-

(ఎ) మహానగర ప్రణాళిక కమిటీల కూర్పు;

(బి) అట్టి కమిటీలలో స్థానములను భర్తీ చేయవల్సిన పద్ధతి:

అయితే అట్టి కమిటీ మొత్తము సభ్యుల సంఖ్యలో మూడింట రెండువంతులకు తక్కువ కాకుండ సభ్యులను, మహానగర ప్రాంతములో పురపాలికల యొక్క మరియు పంచాయితీల ఛైర్‌పర్సన్ యొక్క ఎన్నికైన సభ్యులు తమలో నుండి ఆ ప్రాంతములోని పురపాలికల మరియు పంచాయితీలకు మధ్యగల నిష్పత్తికి దామాషాలో ఎన్నుకొనవలెను:

(సి) అట్టి కమిటీలలో, అట్టి కమిటీలకు అప్పగించబడిన కృత్యములను కొనసాగించుటకు అవసరమని భావించునట్టి భారత ప్రభుత్వము యొక్క మరియు రాజ్య ప్రభుత్వము యొక్క అట్టి వ్యవస్థాపనల మరియు సంస్థల ప్రాతినిధ్యము;

(డి) అట్టి కమిటీలకు అప్పగించబడిన మహానగర ప్రాంతము యొక్క ప్రణాళికకు మరియు సమన్వయమునకు సంబంధించిన కృత్యములు;

(ఇ) అట్టి కమిటీల ఛైర్‌పర్సనును ఎంపిక చేయవలసిన విధానము.

(3) ప్రతి మహానగర ప్రణాళిక కమిటీ ప్రణాళికాభివృద్ధి ముసాయిదాను తయారు చేయుటలో-

(ఎ) ఈ క్రింది వాటిని దృష్టియందుంచుకొనవలెను-

(i) మహానగర ప్రాంతములో పురపాలికల మరియు పంచాయితీలచే తయారు చేయబడిన ప్రణాళికలను;

(ii) ఆ ప్రాంతము యొక్క స్థలములకు సంబంధించిన ప్రణాళిక నీటి పంపిణీ, ఇతర భౌతిక సహజవనరులు, మౌలిక సదుపాయముల సమగ్రాభివృద్ధి, పర్యావరణ పరిరక్షణలతో సహా పంచాయితీల పురపాలికలకు పంచాయితీలకు ఉమ్మడిగా ఆసక్తిగల విషయములను;

(iii) భారత ప్రభుత్వముచే మరియు రాజ్యప్రభుత్వముచే రూపొందించబడిన మొత్తం మీద లక్ష్యములు మరియు ప్రాధాన్యతలు;

(iv) భారత ప్రభుత్వ మరియు రాజ్యప్రభుత్వ ఏజెన్సీలచే చేయబడు పెట్టుబడుల పరిధి మరియు స్వభావము.

(బి) గవర్నరు ఉత్తరువు ద్వారా నిర్దేశించునట్టి సంస్థలను, వ్యవస్థాపనలను సంప్రదించవలెను.

(4) ప్రతి మహానగర ప్రణాళికా కమిటీ ఛైర్‌పర్సన్ అట్టి కమిటీ సిఫార్సు చేసిన అభివృద్ధి ప్రణాళికను రాజ్య ప్రభుత్వమునకు పంపవలెను.

**అస్తిత్వములోనున్న శాసనాలు మరియు పురపాలికల కొనసాగింపు.**

243-జడ్ ఎఫ్. ఈ భాగములో ఏమి యున్నప్పటికిని, సంవిధానపు (డెబ్బది నాలుగవ సవరణ) చట్టము, 1992 ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము రాజ్యములో అమలునందున్న పురపాలికలకు సంబంధించి ఈ భాగమునకు అసంగతముగా ఉన్న ఏదేని శాసనపు ఏదేని నిబంధనను సమర్థ శాసనమండలి లేదా ఇతర సమర్థ ప్రాధికారము సవరించునంతవరకు లేదా రద్దు చేయునంతవరకు లేదా అట్టి ప్రారంభము నుండి ఒక సంవత్సరము ముగియునంతవరకు ఇందులో ఏది ముందు జరుగునో అంత వరకు అమలులో ఉండుట కొనసాగవలెను:

అయితే అట్టి ప్రారంభమునకు అవ్యవహితపూర్వము ఉన్న పురపాలికలన్నియు, రాజ్య శాసనసభచే లేదా శాసన పరిషత్తు ఉన్న రాజ్యము విషయములో ఆ రాజ్య శాసనమండలి యొక్క ప్రతి సదనముచే ఆమోదింపబడిన తీర్మానము ద్వారా ముందుగా రద్దు చేయబడిననే తప్ప వాటి కాలావధులు ముగియునంతవరకు కొనసాగవలెను.

**నిర్వాచక విషయములలో న్యాయస్థానములచే జోక్యము పై ప్రతిబంధకము.**

243-జడ్ జీ. ఈ సంవిధానములో ఏమి యున్నప్పటికినీ,-

(ఎ) నియోజిత వర్గముల పరిసీమన లేక అట్టి నియోజకవర్గములకు సీట్లు కేటాయింపుకు సంబంధించి, 243-జడ్ ఏ అనుచ్ఛేదము క్రింద చేయబడిన లేక చేయబడినట్లు తాత్పర్వితమగు ఏదేని శాసనము యొక్క మాన్యతను గురించి ఏదేని న్యాయస్థానములో ప్రశ్నగతం కారాదు.;

(బి) రాజ్యము యొక్క శాసనమండలిచే చేయబడిన ఏదేని శాసనము ద్వారా దాని క్రింద ఏర్పాటు చేయబడినట్టి ప్రాధికారమునకు మరియు అట్టి రీతిలో చేయబడిన నిర్వాచక ఫిర్యాదు పైననే తప్ప, ఏదేని పురపాలిక యొక్క ఎన్నిక ప్రశ్నగతం కారాదు.]

## [1][భాగము – 9బీ

## సహకార సంఘములు

243–జెడ్ హెచ్. ఈ భాగములో, సందర్భమునుబట్టి అర్థము ఇతర విధముగా ఉన్ననే తప్ప,– **నిర్వచనములు.**

(ఎ) ''ప్రాధీకృత వ్యక్తి'' అనగా 243–జడ్ క్యూ అనుచ్ఛేదములో నిర్దేశించబడునట్టి వ్యక్తి అని అర్థము;

(బి) ''బోర్డు'' అనగా ఒక సంఘము యొక్క కార్యకలాపాల నిర్వహణకు సంబంధించిన నిర్దేశాలను మరియు నియంత్రణలను అప్పగించబడి, అది ఏ పేరుతో పిలువబడినప్పటికినీ, సహకార సంఘము యొక్క డైరెక్టరుల బోర్డు లేక పాలకవర్గ నికాయము అని అర్థము;

(సి) ''సహకార సంఘము'' అనగా ఏదేని రాజ్యములో తత్సమయమున అమలు నందున్న సహకార సంఘములకు సంబంధించిన ఏదేని శాసనము క్రింద రిజిస్టరైన లేక రిజిస్టరు చేయబడినట్లుగా భావించబడు సంఘము అని అర్థము;

(డి) ''బహుళ రాజ్య సహకార సంఘము'' అనగా ఒక రాజ్యమునకు పరిమితము కాని లక్ష్యములతో మరియు అట్టి సహకార సంఘాలకు సంబంధించిన తత్సమయమున అమలులోనున్న ఏదేని శాసనము క్రింది రిజిస్టరైన లేక రిజిస్టరు చేయబడినట్లుగా భావించబడు సంఘము అని అర్థము;

(ఇ) ''కార్య నిర్వాహకుడు'' అనగా సహకార సంఘము యొక్క అధ్యక్షుడు, ఉపాధ్యక్షుడు, ఛైర్–పర్సన్, వైస్–ఛైర్–పర్సన్, కార్యదర్శి లేదా కోశాధికారి అని అర్థము మరియు ఇందులో ఏదేని సహకార సంఘపు బోర్డుచే ఎన్నుకొనబడు ఎవరేని ఇతర వ్యక్తి చేరియుందురు;

(ఎఫ్) ''రిజిస్ట్రారు'' అనగా బహుళ రాజ్య సహకార సంఘములకు సంబంధించి సహకార సంఘములకు సంబంధించి రాజ్య శాసనమండలిచే చేయబడిన శాసనము క్రింద రాజ్య ప్రభుత్వముచే నియమించబడిన సహకార సంఘముల రిజిస్ట్రారు అని అర్థము;

(జి) ''రాజ్య చట్టము'' అనగా రాజ్య శాసనమండలిచే చేయబడిన ఏదేని శాసనము అని అర్థము;

---

1. సంవిధాన (తొంబది ఏడవ సవరణ) చట్టము, 2011 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 15.02.2012 నుండి చొప్పించబడినది.

(హెచ్) ''రాజ్య స్థాయి సహకార సంఘము'' అనగా రాజ్యమంతటికిని విస్తరించియున్న కార్యవర్తన ప్రాంతము కలిగియుండి, మరియు రాజ్య శాసనమండలిచే చేయబడిన ఏదేని శాసనములో అట్లు నిర్వచింపబడిన సహకార సంఘము అని అర్థము.

**సహకార సంఘముల నిగమనము.**

243-జడ్ ఐ. ఈ భాగము యొక్క నిబంధనలకు అధ్యధీనమై, రాజ్య శాసన మండలి, శాసనము ద్వారా, స్వచ్ఛంద రూపకల్పన, ప్రజాస్వామ్య సభ్య-నియంత్రణ, ఆర్థిక-సభ్య భాగస్వామ్యము మరియు స్వతంత్ర నిర్వహణ వంటి సూత్రాల ప్రాతిపదికపై సహకార సంఘముల నిగమనము క్రమబద్ధీకరణ మరియు పరిసమాపనముకు సంబంధించి నిబంధనలు చేయవచ్చును.

**బోర్డు యొక్క సభ్యుల మరియు దాని కార్యనిర్వాహకుల సంఖ్య మరియు పదవీ కాలావధి.**

243-జడ్ జే. (1) రాజ్య శాసనమండలిచే శాసనము ద్వారా నియమించబడునట్టి సంఖ్యలో డైరెక్టర్లను బోర్డు కూడియుండవలెను:

అయితే, ఒక సహకార సంఘము యొక్క డైరెక్టరుల గరిష్ట సంఖ్య ఇరువది ఒకటికి మించరాదు:

అయితే ఇంకనూ, రాజ్య శాసనమండలి, శాసనము ద్వారా, వైయుక్తికులు సభ్యులుగా కూడి యున్న ప్రతి సహకార సంఘములో మరియు అట్టి తరగతి లేక వర్గము యొక్క వ్యక్తుల నుండి అనుసూచిత కులములు లేక అనుసూచిత జనజాతులకు ఒక సీటును మరియు మహిళలకు రెండు సీట్లను బోర్డులో ప్రత్యేకించవలెను.

(2) బోర్డుకి ఎన్నికైన సభ్యుల మరియు దాని కార్యనిర్వహకుల పదవీ కాలావధి ఎన్నిక కాబడిన తేదీ నుండి ఐదు సంవత్సరముల వరకు ఉండవలెను, మరియు కార్యనిర్వహకుల పదవీ కాలావధి బోర్డు కాలావధి వరకు సమానముగ ఉండవలెను:

అయితే, బోర్డు యొక్క కాలావధి అసలు కాలావధిలో సగము కంటే తక్కువగా ఉన్నచో, ఏర్పడిన ఆకస్మిక ఖాళీకి సంబంధించి అదే తరగతికి చెందిన సభ్యుల నుండి నామనిర్దేశము చేయుట ద్వారా, బోర్డులోని ఆకస్మిక ఖాళీని బోర్డు భర్తీ చేయవచ్చును.

(3) రాజ్య శాసనమండలి, శాసనము ద్వారా, బ్యాంకింగు నిర్వహణ, విత్తీయ క్షేత్రాలలో లేక సహకార సంఘ లక్ష్యములు మరియు దానిచే చేపట్టబడిన కార్యకలాపము క్షేత్రాలలో లేక సహకార సంఘ లక్ష్యములు మరియు దానిచే చేపట్టబడిన కార్యకలాపములకు సంబంధించి ప్రత్యేక నైపుణ్యాము కలిగిన ఏదేని ఇతర రంగములో అనుభవము కలిగిన వ్యక్తులను అట్టి సంఘము యొక్క బోర్డు సభ్యులుగా చేసుకొనుటకై బోర్డు సభ్యులను కో-ఆప్ట్ చేసుకొనుటకు నిబంధనలు చేయవలెను:

అయితే, అట్లు కో-ఆప్ట్ చేసుకోబడిన సభ్యుల సంఖ్య ఖండము (1)లోని మొదటి వినాయింపులో నిర్దిష్టపరచబడిన ఇరువది-ఒక్క డైరెక్టర్లకు అదనముగా ఇద్దరు సభ్యుల కంటే మించరాదు:

అయితే ఇంకనూ, అట్లు కో-ఆప్ట్ చేసుకొనబడిన సభ్యులు అట్టి సహకార సంఘ సభ్యుని హోదాలో ఏదేని ఎన్నికలో వారు ఓటు చేయు హక్కు కలిగియుండరు లేక బోర్డు కార్యనిర్వాహకులుగా ఎన్నుకొనబడుటకు అర్హులై ఉండరు:

అంతేగాక, ఒక సహకార సంఘము యొక్క కార్యనిర్వర్తన డైరెక్టర్లు బోర్డు యొక్క సభ్యులుగా కూడ ఉందురు మరియు అట్టి సభ్యులు ఖండము (1)లోని మొదటి వినాయింపులో నిర్దిష్టపరచబడిన మొత్తము డైరెక్టర్ల సంఖ్యను లెక్కించు నిమిత్తం మినహాయించబడవలెను.

**బోర్డు యొక్క సభ్యుల ఎన్నిక.**

243-జడ్ కే. (1) రాజ్య శాసనమండలిచే చేయబడిన ఏదేని శాసనములో ఏమున్నప్పటికినీ నిష్క్రమించే (పదవీ విరమణ చేస్తున్న) బోర్డు సభ్యుల పదవీ కాలావధి ముగిసిన వెంటనే క్రొత్తగా ఎన్నికైన బోర్డు సభ్యులు పదవిని చేపట్టునట్లు చూచుటకై బోర్డు యొక్క కాలావధి ముగియుటకు ముందే బోర్డు ఎన్నికలను నిర్వహించవలెను.

(2) ఓటర్ల జాబితాను తయారు చేయుటకు మరియు సహకార సంఘము యొక్క ఎన్నికలన్నింటిని నిర్వహించుటకైన అధీక్షణ, ఆదేశము, నియంత్రణ రాజ్య శాసనమండలిచే శాసనము ద్వారా ఏర్పాటు చేయబడునట్టి ప్రాధికార సంస్థ లేక నికాయమునందు నిహితమై ఉండును:

అయితే, రాజ్య శాసనమండలి, శాసనము ద్వారా అట్టి ఎన్నికల నిర్వహణ కొరకు ప్రక్రియ మరియు మార్గదర్శకాలను రూపొందించవలెను.

**బోర్డు రద్దు, తాత్కాలికముగా నిలిపి ఉంచుట మరియు మధ్యకాలీన నిర్వహణ.**

243-జడ్ ఎల్. (1) తత్సమయమున అమలునందున్న ఏదేని శాసనములో ఏమి ఉన్నప్పటికినీ, ఏ బోర్డును రద్దు చేయరాదు లేక ఆరు మాసముల కంటే మించిన కాలావధికి తాత్కాలికముగా నిలిపి ఉంచరాదు:

అయితే, ఈ క్రింది విషయములో బోర్డును రద్దు పరచవచ్చును లేక తాత్కాలికముగా నిలిపియుంచవచ్చు,-

(i) దాని నిరంతర తప్పిదమునకు; లేక

(ii) దాని కర్తవ్య నిర్వహణలోని ఉపేక్షకు; లేక

(iii) సహకార సంఘము లేక దాని సభ్యుల హితములకు భంగము కలిగించు ఏదేని చర్యను బోర్డు చేసినప్పుడు; లేక

(iV) బోర్డు యొక్క స్థాపనలో లేక కృత్యములలో స్తబ్ధత; లేక

(V) రాజ్య శాసనమండలిచే, శాసనము ద్వారా 243-జడ్ కే అనుచ్ఛేదపు ఖండము (2) క్రింద ఏర్పాటు చేయబడిన ప్రాధికార సంస్థ లేక నికాయము, రాజ్య చట్టము యొక్క నిబంధనల ననుసరించి ఎన్నికలు నిర్వహణలో విఫలమైనపుడు:

అయితే ఇంకనూ, ప్రభుత్వపు వాటాలు లేక ఋణములు లేక ఆర్థిక సహాయము లేక ప్రభుత్వముచే ఏదేని పూచీకత్తు లేని కారణంగా ఏదేని సహకార సంఘము యొక్క బోర్డుని రద్దు పరచరాదు లేక తాత్కాలికముగా నిలిపియుంచరాదు:

అంతేగాక ఇంకనూ, ఒక సహకార సంఘం బ్యాంకింగు వ్యాపారము కొనసాగింపు సందర్భములో, బ్యాంకింగు వినియమ చట్టము, 1949 యొక్క నిబంధనలు కూడ వర్తించును:

అంతేగాకుండా, బహుళ రాజ్య సహకార సంఘము కానట్టి సహకార సంఘము బ్యాంకింగు వ్యాపారము కొనసాగించు సందర్భములో ఈ ఖండము యొక్క నిబంధనలలోని ''ఆరు మాసములు'' అను పదములకు బదులుగా ''ఒక సంవత్సరము'' అను పదములను ఉంచబడినట్లుగా ప్రభావము కలిగియుండును.

(2) బోర్డుని రద్దు చేసిన సందర్భములో, అట్టి సహకార సంఘము యొక్క వ్యవహారములను నిర్వహించుట కొరకు నియమించబడిన పరిపాలకుడు ఖండము (1)లో నిర్దిష్టపరచబడిన కాలావధి లోపుగా ఎన్నికల నిర్వహణకు ఏర్పాటు చేయవలెను మరియు ఎన్నికైన బోర్డుకి నిర్వహణకు అప్పగించవలెను.

(3) రాజ్య శాసనమండలి పరిపాలకుని యొక్క సేవా షరతులకై శాసనము ద్వారా నిబంధనలు చేయవలెను.

243–జడ్ ఎమ్. (1) రాజ్య శాసనమండలి, సహకార సంఘములచే లెక్కల నిర్వహణకు సంబంధించి మరియు అట్టి లెక్కలకు కనీసము ప్రతి సంవత్సరమునకు ఒకసారి ఆడిటింగు చేయించుటకు సంబంధించి శాసనము ద్వారా నిబంధనలు చేయవచ్చును. **సహకార సంఘముల లెక్కల ఆడిటు.**

(2) రాజ్య శాసనమండలి శాసనము ద్వారా, సహకార సంఘముల లెక్కల ఆడిటింగ్ కొరకు అర్హులైన ఆడిటర్లు మరియు ఆడిటింగ్ చేయు ఫర్ములకు కనీస అర్హతలను మరియు అనుభవమును కలిగియుండునట్లు నిర్ధారించవలెను.

(3) ప్రతి ఒక సహకార సంఘము, సహకార సంఘము యొక్క సర్వ సభ్యులచే నియమింపబడి, ఖండము (2)లో నిర్దేశింపబడిన ఆడిటరు లేక ఆడిటింగ్ ఫర్ములచే ఆడిట్ చేయించవలెను:

అయితే, అట్టి ఆడిటర్లు లేక ఆడిటింగ్ ఫర్ములు రాజ్య ప్రభుత్వము లేక ఈ విషయములో రాజ్య ప్రభుత్వముచే ప్రాధికారమొసగబడిన ప్రాధికారిచే ఆమోదించబడిన ప్యానెలు నుండి నియమించబడవలెను.

(4) ప్రతి సహకార సంఘము లెక్కలు, అట్టి లెక్కలకు సంబంధించిన విత్తీయ సంవత్సరము ముగిసిన ఆరు మాసముల లోపల ఆడిట్ చేయబడవలెను.

(5) రాజ్య చట్టముచే నిర్వచించబడునట్టి ప్రధాన సహకార సంఘపు లెక్కల ఆడిట్ నివేదికను, రాజ్య శాసనమండలిచే శాసనము ద్వారా, ఏర్పాటు చేయబడునట్టి రీతిలో రాజ్య శాసనమండలి సమక్షమున ఉంచవలెను.

243–జడ్ ఎన్. శాసనములో నిబంధించబడినట్లుగా వ్యాపారమును నిర్వహించుటకై ప్రతి సహకార సంఘము యొక్క వార్షిక సర్వ సభ్య సమావేశమును, ప్రతి ఆర్థిక సంవత్సర ముగింపు నుండి ఆరు మాసములలోపు నిర్వహించే విధంగా రాజ్య శాసనమండలి, శాసనము ద్వారా నిబంధనలు చేయవచ్చును. **సర్వసభ్య సమావేశములను నిర్వహించుట.**

243-జడ్ ఓ. (1) రాజ్య శాసనమండలి, శాసనము ద్వారా సహకార సంఘపు ప్రతి సభ్యునికి, అట్టి సభ్యునితో క్రమంగా చేసిన కార్యకలాపాలకు సంబంధించి సహకార సంఘంలో ఉంచిన పుస్తకాలు, సమాచారము మరియు ఖాతాలను అందుబాటులో ఉంచవలెను. **సమాచారమును పొందుటకు సభ్యుని హక్కు.**

(2) రాజ్య శాసనమండలి, శాసనము ద్వారా, సభ్యులు కనీస సమావేశములకు హాజరగుటకు అవసరమైన నిబంధనను, సహకార సంఘము యొక్క నిర్వహణలో సభ్యులు పాల్గొను విధంగా చూచుటకు నిబంధనలు చేయవచ్చు.

(3) సహకార సంఘ సభ్యులకు సహకార విద్య మరియు శిక్షణను కల్పించుటకు రాజ్య శాసనమండలి, శాసనము ద్వారా నిబంధనలు చేయవచ్చును.

243-జడ్ పీ. ప్రతి సహకార సంఘము ఈ క్రింది విషయములతో సహా రాజ్య ప్రభుత్వముచే నిర్దేశించబడిన ప్రాధికారికి ప్రతి విత్తీయ సంవత్సరము ముగిసిన ఆరు మాసముల లోపల రిటర్నులను దాఖలు పరచవలెను, అవేవనగా:- **రిటర్నులు.**

(ఎ) వారి కార్యకలాపముల వార్షిక నివేదిక;

(బి) ఆడిటు చేయబడిన వాటి లెక్కల నివేదిక;

(సి) సహకార సంఘపు సర్వ సభ్యులచే ఆమోదించబడినట్లుగా మిగులు వితరణకైన ప్రణాళిక;

(డి) సహకార సంఘపు ఉప-విధులకు ఏవేని సవరణలున్నచో వాటి జాబితా;

(ఇ) వాటి యొక్క సర్వసభ్య సమావేశపు తేదీ మరియు జరగవలసియున్న ఎన్నికల తేదీల గురించిన ప్రఖ్యానము;

(ఎఫ్) రాజ్య చట్టపు ఏదేని నిబంధనలను పురస్కరించుకొని రిజిస్ట్రారుచే కోరబడు ఏదేని ఇతర సమాచారము.

243-జడ్ క్యూ. (1) రాజ్య శాసనమండలి, సహకార సంఘముల అపరాధములు మరియు అట్టి అపరాధములకైన శాస్తులకు సంబంధించి శాసనము ద్వారా నిబంధనలు చేయవచ్చును. **అపరాధములు మరియు శాస్తులు.**

(2) ఖండము (1) క్రింద రాజ్య శాసనమండలిచే చేయబడిన శాసనములో ఈ క్రిందది ఏదేని చర్య లేక తప్పిదమునకై చేసిన అపరాధములు, ఆవేవనగా:-

(ఎ) ఒక సహకార సంఘము లేక అధికారి లేక అందులోని దాని సభ్యుడు బుద్ధిపూర్వకముగా తప్పుడు రిటర్నులు చేసిననూ లేక తప్పుడు సమాచారము అందజేసిననూ లేక ఎవరేని వ్యక్తి బుద్ధిపూర్వకముగా తన నుండి లేక రాజ్య చట్టపు నిబంధనల క్రింద ఈ విషయములో ప్రాధికారమొసగబడిన వ్యక్తికి అవసరమైన ఏదేని సమాచారమును అందించకపోయిననూ;

(బి) రాజ్య చట్టపు నిబంధనల క్రింద జారీ చేయబడిన ఏవేని సమనులను, అభ్యర్థనను లేక శాసనపరమైన వ్రాతపూర్వక ఉత్తర్వు పట్ల ఎవరేని వ్యక్తి బుద్ధిపూర్వకముగా లేక సరియైన కారణము లేకుండా అవిధేయత చూపిననూ;

(సి) ఎవరేని యజమాని, తన ఉద్యోగుల నుండి తనచే మినహాయించబడిన మొత్తమును బట్టి మినహాయింపు చేయబడిన తేదీ నుండి పదునాలుగు దినముల కాలావధిలోపుగా సరియైన కారణము చూపకుండా సహకార సంఘమునకు చెల్లించక పోయిననూ;

(డి) ఎవరేని అధికారి లేక అభిరక్షకుడు, తాను అధికారిగా లేక అభిరక్షకునిగా ఉన్నట్టి సహకార సంఘమునకు చెందిన పుస్తకములు, ఖాతాలు, దస్తావేజులు, రికార్డులు, నగదు హామీలు మరియు ఇతర ఆస్తుల అభిరక్షణను బుద్ధిపూర్వకముగా ప్రాధికార మొసగబడిన వ్యక్తికి అప్పగించుటలో విఫలమైననూ;

(ఇ) ఎవరైననూ, బోర్డు సభ్యుల లేక కార్యనిర్వాహకుల ఎన్నికలకు ముందు జరుగు సమయములో లేక తరువాత ఏదేని అవినీతి చర్యలకు పాల్పడినచో; చేరియుండును.

**బహుళ రాజ్య సహకార సంఘములకు వర్తింపు.**

243–జడ్ ఆర్. ''రాజ్య శాసనమండలి'', ''రాజ్య చట్టము'' లేక ''రాజ్య ప్రభుత్వము''లకైన ఏదేని నిర్దేశమును వరుసగా ''పార్లమెంటు'', ''కేంద్ర చట్టము'' లేక ''కేంద్ర ప్రభుత్వము'' అను నిర్దేశముగా అన్వయించబడవలెను మార్పుకు అధ్యధీనమై ఈ భాగములోని నిబంధనలు బహుళ రాజ్య సహకార సంఘములకు వర్తించును.

**సంఘ రాజ్య క్షేత్రములకు వర్తింపు.**

243–జడ్ ఎస్. ఈ భాగములోని నిబంధనలు సంఘ రాజ్యక్షేత్రములకు వర్తింపజేయవలెను మరియు సంఘ రాజ్యక్షేత్రమునకు వాటిని వర్తింపజేయుటలో శాసనసభ లేనటువంటి రాజ్యము యొక్క శాసనమండలికి చేయు నిర్దేశములు ఎట్లో అనుచ్ఛేదము 239 క్రింద నియమింపబడిన పరిపాలకునికి, మరియు శాసనసభను కలిగియున్న సంఘ రాజ్యక్షేత్ర విషయములో ఆ శాసనసభకు వర్తించును:

అయితే, రాష్ట్రపతి అధికారిక రాజపత్రములో అధిసూచన ద్వారా ఈ భాగము యొక్క నిబంధనలు అధిసూచనలో నిర్దిష్టపరచినట్లు ఏదేని సంఘ రాజ్యక్షేత్రమునకు లేక దానిలోని భాగమునకు వర్తించవని ఆదేశించవచ్చును.

**అస్తిత్వములోనున్న శాసనముల కొనసాగింపు.**

243–జడ్ టీ. ఈ భాగములో ఏమి ఉన్నప్పటికినీ, సంవిధానపు (తొంబది ఏడవ సవరణ) చట్టము, 2011 ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము రాజ్యములో అమలు నందున్న సహకార సంఘములకు సంబంధించి ఈ భాగమునకు అసంగతముగా ఉన్న నిబంధనలుగల ఏదేని శాసనము యొక్క ఏదేని నిబంధన, సమర్థ శాసనమండలి లేదా ఇతర సమర్థ ప్రాధికారముచే సవరించబడు లేక రద్దు చేయబడునంత వరకు లేదా అట్టి ప్రారంభము నుండి ఒక సంవత్సరము ముగియునంత వరకు వీటిలో ఏది తక్కువైనచో అంతవరకు అమలులో కొనసాగుచుండవలెను.]

## భాగము – 10

## అనుసూచిత మరియు జనజాతి క్షేత్రములు

**అనుసూచిత ప్రాంతముల మరియు జనజాతి ప్రాంతముల పరిపాలనము.**

244. (1) అయిదవ అనుసూచి యొక్క నిబంధనలు [1][అస్సాము, [2][[3][మేఘాలయ, త్రిపుర, మరియు మిజోరాం రాజ్యములు]]], మినహా [4][............] ఏదేని రాజ్యములోని అనుసూచిత ప్రాంతముల యొక్కయు, అనుసూచిత జనజాతుల యొక్కయు పరిపాలనకు, మరియు నియంత్రణకు వర్తించవలెను.

(2) ఆరవ అనుసూచి యొక్క నిబంధనలు [1][అస్సాము,[2][[5][మేఘాలయ, త్రిపుర మరియు మిజోరాం]]], రాజ్యములలోని జనజాతి ప్రాంతముల పరిపాలనకు వర్తించవలెను.

**అస్సాములో కొన్ని జనజాతి క్షేత్రములను కలిపి ఒక స్వాయత్త రాజ్యమును ఏర్పాటు చేయుట, మరియు దాని కొరకు స్థానిక శాసన మండలిని లేక మంత్రి పరిషత్తును, లేక రెండింటిని ఏర్పాటు చేయుట.**

[6] [244ఏ. (1) ఈ సంవిధానమునందేమి యున్నప్పటికిని ఆరవ అనుసూచిలోని 20వ పేరాకు జతపరచబడిన పట్టిక యొక్క [7][భాగము (1)]లో నిర్దిష్టపరచబడిన జనజాతి ప్రాంతములన్నియు, లేక వాటిలో ఏవైనను పూర్ణతః లేక భాగతః లేక చేరియుండు ఒక స్వాయత్త రాజ్యమును పార్లమెంటు శాసనము ద్వారా అస్సాము రాజ్యములో ఏర్పాటు చేయవచ్చును, మరియు దాని కొరకు అట్టి శాసనము వేరు వేరుగా నిర్దిష్టపరచబడు సంఘటనము, అధికారములు మరియు కృత్యములతో,–

---

1. ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 71 పరిచ్ఛేదము ద్వారా 21.1.1972 నుండి ''అస్సాం రాజ్యము''కు బదులు ఉంచబడినది.
2. సంవిధాన (నలుబది తొమ్మిదవ సవరణ) చట్టము, 1984 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ''మేఘాలయ'' అనువదములకు బదులుగా (1.4.1985 నుండి) ఉంచబడనది.
3. మిజోరం రాజ్య చట్టము, 1986 (1986లోని 34వది) యొక్క 39వ పరిచ్ఛేదము ద్వారా 20.2.1987 నుండి ''మేఘాలయ మరియు త్రిపుర''కు బదులుగా ఉంచబడినది.
4. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ అనుచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''ఒకటవ అనుసూచి యొక్క భాగము 'ఎ' లేక భాగము 'బి'లో నిర్దిష్ట పరచబడిన'' అనువదములు మరియు అక్షరములు వదిలివేయబడినవి.
5. అదే చట్టము ద్వారా ''మేఘాలయ త్రిపుర మరియు మిజోరాం సంఘరాజ్యక్షేత్రము''నకు బదులుగా 20.02.1987 నుండి ఉంచబడినది.
6. సంవిధాన (ఇరువది రెండవ సవరణ చట్టము, 1969 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.
7. ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 71వ పరిచ్ఛేదము ద్వారా 21.1.1972 నుండి '' భాగము–ఏ'' కు బదులుగా ఉంచబడినది.

(ఎ) ఆ స్వాయత్త రాజ్యమునకు ఒక శాసనమండలిగా వ్యవహరించుటకు ఎన్నుకొనబడినదైనను, లేక భాగతః నామనిర్దేశము చేయబడి, భాగతః ఎన్నుకొనబడినదైనను, ఒక నికాయమును; లేక

(బి) ఒక మంత్రి పరిషత్తును, లేక రెండింటిని ఏర్పాటు చేయవచ్చును.

(2) ఖండము (1)లో నిర్దేశించబడినట్టి ఏదేని శాసనము ప్రత్యేకముగా,–

(ఎ) అస్సాము రాజ్యశాసన మండలిని అపవర్జించియైనను, అన్యథాయైనను, ఆ స్వాయత్త రాజ్యము యొక్క శాసనమండలి, ఆ రాజ్యమంతటికి, లేక అందలి ఏదేని భాగమునకు, రాజ్యసూచిలో గాని, ఉభయ సామాన్య సూచిలోగాని, పేర్కొనబడిన ఏ విషయములను గూర్చి శాసనములను చేయుటకు అధికారము కలిగియుండునో నిర్దిష్టపరచవచ్చును;

(బి) ఆ స్వాయత్త రాజ్యము యొక్క కార్యపాలకాధికారములో ఏ విషయములు చేరియుండునో నిర్వచించవచ్చును;

(సి) అస్సాము రాజ్యముచే విధించబడిన ఏదైనా పన్ను, దాని నుండి వచ్చు ఆదాయము, ఆ స్వాయత్త రాజ్యమునకు సంబంధించి యున్నదనదగిన మేరకు, ఆ స్వాయత్త రాజ్యమునకు ప్రత్యేకించబడవలెనని నిబంధన చేయవచ్చును;

(డి) ఈ సంవిధానము యొక్క ఏదేని అనుచ్ఛేదము నందు రాజ్యమును గూర్చిన ఏ నిర్దేశములోనైనను స్వాయత్త రాజ్యమును గూర్చిన నిర్దేశము చేరియున్నట్లు అన్వయించుకొనబడవలెనని నిబంధన చేయవచ్చును;

(ఇ) ఆవశ్యకమని తలచబడు అనుపూరక, అనుషంగిక మరియు పారిణామిక నిబంధనలను చేయవచ్చును.

(3) పైన చెప్పబడిన ఏదేని శాసనము యొక్క సవరణ, అట్టి సవరణ ఖండము (2) యొక్క ఉప–ఖండము (ఎ) లేక (బి)లో నిర్దిష్టపరచబడిన విషయములో దేనికైనను సంబంధించి యుండునంత మేరకు, పార్లమెంటు యొక్క ప్రతి యొక్క సదనములో హాజరైయుండి ఓటు చేయు సభ్యులలో మూడింట రెండు వంతులకు తక్కువకాని వారిచే పాస్ చేయబడిననే తప్ప, ఎట్టి ప్రభావమును కలిగియుండదు.

(4) ఈ అనుచ్ఛేదములో నిర్దేశింపబడిన ఏ శాసనము నందైనను, ఈ సంవిధానమును, సవరించు లేక సవరించు ప్రభావమును కలిగియుండు, ఏదైన నిబంధన ఉన్నప్పటికిని, 368వ అనుచ్ఛేదము నిమిత్తము అది ఈ సంవిధానము యొక్క సవరణగా భావించబడరాదు.]

## భాగము – 11

## సంఘమునకు మరియు రాజ్యములకు మధ్య సంబంధములు

### అధ్యాయము–1–శాసన నిర్మాణమును గూర్చిన సంబంధములు

#### శాసన నిర్మాణ అధికారముల వంపిణీ

245. (1) ఈ సంవిధాన నిబంధనలకు అధ్యధీనమై, పార్లమెంటు భారతదేశ రాజ్య క్షేత్రము అంతటికిని లేక అందలి ఏదేని భాగమునకు, శాసనములను చేయవచ్చును, మరియు రాజ్య శాసనమండలి, రాజ్యమంతటికిని లేక అందలి ఏదేని భాగమునకు, శాసనములను చేయవచ్చును.

**పార్లమెంటు మరియు రాజ్యముల శాసన మండలులచే చేయబడు శాసనముల విస్తరణ.**

(2) పార్లమెంటుచే చేయబడిన శాసనము ఏదియు, అది రాజ్య క్షేత్రాతీత ప్రవృత్తి కలిగియుండునను కారణమును బట్టి అమాన్యమైనదిగా భావింపబడరాదు.

246. (1) ఖండములు (2) మరియు (3)లలో ఏమియున్నప్పటికిని, (ఈ సంవిధానములో ఏడవ అనుసూచియందు ''సంఘ సూచి''యని నిర్దేశించబడిన) సూచి-I లో పేర్కొనబడిన విషయములలో వేటిని గూర్చియైనను శాసనములను చేయుటకు పార్లమెంటు మాత్రమే అధికారము కలిగియున్నది.

**పార్లమెంటుచే లేక రాజ్య శాసన మండలులచే చేయబడు శాసనముల విషయవస్తువు.**

(2) ఖండము (3)లో ఏమి యున్నప్పటికిని, (ఈ సంవిధానములో ఏడవ అనుసూచి యందు ''ఉభయ సామాన్యసూచి'' అని నిర్దేశింపబడిన) సూచి-IIIలో పేర్కొనబడిన విషయములలో దేనిని గూర్చియైనను శాసనములను చేయుటకు పార్లమెంటు, మరియు ఖండము (1)కి అధ్యధీనమై, [1][........] ఏదేని రాజ్య శాసనమండలి కూడ అధికారము కలిగియున్నది.

(3) ఖండము (1) (2)లకు అధ్యధీనమై, (ఈ సంవిధానములో ఏడవ అనుసూచి యందు ''రాజ్య సూచి'' యని నిర్దేశించబడిన) సూచి-II లో పేర్కొనబడిన విషయములలో దేనిని గూర్చియైనను [1][.......] ఏదేని రాజ్యమునకుగాని, అందలి ఏదేని భాగమునకుగాని, శాసనములను చేయుటకు అట్టి రాజ్యశాసన మండలి మాత్రమే అధికారము కలిగియున్నది.

(4) [2][ఏ రాజ్యములోను] చేర్చబడని భారతదేశ రాజ్యక్షేత్రము యొక్క ఏదేని భాగము కొరకు ఏ విషయమును గూర్చియైనను, అట్టి విషయము రాజ్యసూచిలో పేర్కొనబడిన విషయమైనప్పటికిని, శాసనములను చేయుటకు పార్లమెంటు అధికారము కలిగియున్నది.

[3][246ఏ. (1) 246 మరియు 254వ అనుచ్ఛేదములో ఏమి ఉన్నప్పటికినీ, పార్లమెంటు మరియు ఖండము (2)నకు అధ్యధీనమై ప్రతీ రాజ్యము యొక్క శాసన మండలి, కేంద్రము ద్వారా లేదా అట్టి రాజ్యము ద్వారా విధించబడు వస్తువుల మరియు సేవల పన్నుకు సంబంధించిన శాసనములు చేయుటకు అధికారము కలిగి ఉండును.

**వస్తువుల మరియు సేవల పన్నుకు సంబంధించిన ప్రత్యేక నిబంధనలు.**

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''ఒకటవ అనుసూచి యొక్క భాగము ఏ లేక భాగము బీలో నిర్దిష్టపరచబడిన'' అనుపదములు మరియు అక్షరములు వదిలివేయబడినవి.
2. అదే చట్టపు 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''మొదటి అనుసూచి యొక్క భాగము-ఏ మరయు భాగము-బీ లో'' కు బదులుగా ఉంచబడినది.
3. సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా, 16.9.2016వ తేదీ నుండి క్రొత్త అనుచ్ఛేదము 246ఏ చొప్పించబడినది.

(2) అంతర్ రాజ్య వర్తకము లేదా వాణిజ్యము చేయు క్రమంలో చోటు చేసుకొను వస్తువుల లేదా సేవల లేదా రెండింటి సరఫరాలోని వస్తువుల మరియు సేవల పన్నుకు సంబంధించిన శాసనములు చేయుటకు పార్లమెంటుకు ప్రత్యేక అధికారములు ఉండును.

**విశదీకరణ:–** 279ఏ అనుచ్ఛేదము యొక్క ఖండము (5)లో నిర్దేశించబడిన వస్తువుల మరియు సేవల పన్నుకు సంబంధించి, ఈ అనుచ్ఛేదములోని నిబంధనలు, వస్తువుల మరియు సేవల పన్ను కౌన్సిలు ద్వారా సిఫారసు చేయబడిన తేదీ నుండి అమలులోనికి వచ్చును.]

**కొన్ని అదనపు న్యాయ స్థానముల స్థాపనకై నిబంధనలు చేయుటకు పార్లమెంటు గల అధికారము.**

247. ఈ అధ్యాయములో ఏమియున్నప్పటికిని, పార్లమెంటుచే చేయబడిన శాసనములను, లేక సంఘసూచిలో పేర్కొనబడిన ఏ విషయమును గూర్చియైనను అస్తిత్వములోనున్న ఏవేని శాసనములను శ్రేష్టతరముగా అమలు జరిపించుటకై ఏవేని అదనపు న్యాయస్థానములను స్థాపించుటకు పార్లమెంటు శాసనము ద్వారా నిబంధనలు చేయవచ్చును.

**శాసన నిర్మాణమునకు అవశిష్ట అధికారములు.**

248. (1) ఉభయ సామాన్య సూచిలోగాని, రాజ్యసూచిలోగాని, పేర్కొనబడని ఏ విషయమును గూర్చియైనను ఏదేని శాసనమును చేయుటకు [1][246ఏ అనుచ్ఛేదమునకు అధ్యధీనమై పార్లమెంటు] మాత్రమే అధికారము కలిగియున్నది.

(2) అట్టి అధికారములో, ఆ రెండు సూచిలలో దేని యందును పేర్కొనబడని పన్నును విధించుచూ ఏదేని శాసనము చేయు అధికారము చేరియుండవలెను.

**రాజ్య సూచిలోని ఏదేని విషయమును గూర్చి జాతీయ హితము దృష్ట్యా శాసనములను చేయుటకు పార్లమెంటుకు గల అధికారము.**

249. (1) ఈ అధ్యాయములోని పూర్వగామి నిబంధనలలో ఏమియున్నప్పటికిని, రాజ్యసూచిలో పేర్కొనబడిన ఏదేని విషయమును [2][లేదా 246ఏ అనుచ్ఛేదము క్రింద నిబంధించిన వస్తువుల మరియు సేవల పన్ను] గూర్చి, జాతీయ హితము దృష్ట్యా పార్లమెంటు శాసనములను చేయుట ఆవశ్యకమని, లేక సముచితమని, రాజ్య పరిషత్తు హాజరై వోటు చేయు సభ్యులలో మూడింట రెండు వంతులకు తక్కువకాని వారిచే బలపరచబడిన తీర్మానము ద్వారా ప్రఖ్యానించినచో, ఆ తీర్మానము అమలులోనుండగా ఆ విషయమును గూర్చి యావద్భారత రాజ్యక్షేత్రమునకు లేక అందలి ఏదేని భాగమునకు పార్లమెంటు శాసనములను చేయుట శాసనమ్మతమైయుండును.

(2) ఖండము (1) క్రింద పాస్ చేయబడిన తీర్మానము, ఒక సంవత్సరమునకు మించకుండ, దానిలో నిర్దిష్టపరచబడిన కాలావధి వరకు అమలులో నుండవలెను:

అయితే అట్టి తీర్మానము ఇంకను అమలులో కొనసాగవలెనని ఆమోదించుచు ఒక తీర్మానము ఖండము (1)లో నిబంధించబడిన రీతిగా పాస్ చేయబడినచో, మరియు అట్లు పాస్ చేయబడినప్పుడెల్లను, ఈ ఖండము క్రింద ఆ తీర్మానము అమలులో నుండుట అన్యథా

1. సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా, ''పార్లమెంటు'' అను పదమునకు బదులుగా 16.9.2016వ తేదీ నుండి ఉంచబడినది.
2. అదే చట్టపు 4వ పరిచ్ఛేదము ద్వారా, 16.9.2016వ తేదీ నుండి చొప్పించబడినది.

ఆగిపోయియుండెడి తేదీ నుండి అదనముగా ఒక సంవత్సర కాలావధి వరకు అది అమలులో కొనసాగవలెను.

(3) ఖండము (1) క్రింద తీర్మానము పాస్ చేయబడకుండినచో ఏ శాసనము చేయుటకు పార్లమెంటుకు సమర్థత లేకుండెడిదో, ఆ శాసనమును అట్టి తీర్మానమును పురస్కరించుకొని పార్లమెంటు చేసిన యెడల అది అట్టి అసమర్థత మేరకు, ఆ తీర్మానము అమలులో నుండుట ఆగిపోయిన తరువాత ఆరు మాసముల కాలావధి ముగియక పూర్వము చేయబడిన, లేక చేయుట లోపించిన విషయములను గూర్చి మాత్రము అట్లు ప్రభావరహితము కాదు.

**ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము అమలులోనున్నప్పుడు రాజ్యములోని ఏ విషయమునకు సంబంధించియైనను శాసనములను చేయుటకు పార్లమెంటుకు గల అధికారము.**

250. (1) ఈ అధ్యాయములో ఏమియున్నప్పటికిని, ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము అమలులోనున్నప్పుడు యావద్భారత రాజ్యక్షేత్రమునకు లేక అందలి ఏదేని భాగమునకు, [1][246ఏ అనుచ్ఛేదము క్రింద నిబంధించిన వస్తువుల మరియు సేవల పన్నును గూర్చి లేదా] రాజ్యసూచిలో పేర్కొనబడిన విషయములలో దేనిని గూర్చియైనను, శాసనము చేయుటకు పార్లమెంటు అధికారము కలిగియుండును.

(2) ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము జారీ చేయబడకుండినచో, ఏ శాసనమును చేయుటకు పార్లమెంటుకు సమర్థత లేకుండెడిదో ఆ శాసనమును అట్టి అధిప్రఖ్యానమును పురస్కరించుకొని పార్లమెంటు చేసిన యెడల, అది అట్టి అసమర్థత మేరకు, ఆ అధిప్రఖ్యానము అమలులోనుండుట ఆగిపోయిన తరువాత ఆరు మాసముల కాలావధి ముగిసిన మీదట ప్రభావరహితము కావలెను. అయితే సదరు కాలావధి ముగియక పూర్వము చేయబడిన, లేక చేయుట లోపించిన విషయములను గూర్చి మాత్రము అట్లు ప్రభావరహితము కాదు.

**249, 250 అనుచ్ఛేదముల క్రింద పార్లమెంటుచే చేయబడిన శాసనములకును రాజ్యము. శాసన మండలులచే చేయబడిన శాసనములకును మధ్య అసంగతత.**

251. ఈ సంవిధానము క్రింద ఏ శాసనమును చేయుటకు రాజ్య శాసనమండలికి అధికారము కలదో, ఆ శాసనము చేయుటకు రాజ్య శాసన మండలి యొక్క అధికారమును 249, 250 అనుచ్ఛేదములలో నున్న దేదియు పరిమితపరచరాదు; కాని రాజ్య శాసనమండలిచే చేయడిన శాసనములోని ఏదేని నిబంధన సదరు అనుచ్ఛేదములలో దేని క్రిందనైనను, పార్లమెంటు తనకు గల అధికారమును పురస్కరించుకొని చేసిన ఏదేని శాసనములోని నిబంధనకు ఏదేని విరుద్ధముగానున్నచో, పార్లమెంటుచే చేయబడిన శాసనమే, అది రాజ్య శాసనమండలిచే చేయబడిన శాసనమునకు పూర్వము చేయబడినను, పిమ్మట చేయబడినను, చెల్లుబాటు కలిగియుండవలెను, మరియు పార్లమెంటుచే చేయబడిన శాసనము ప్రభావము కలిగియున్న కాలము వరకు మాత్రము, రాజ్య శాసనమండలిచే చేయబడిన శాసనము అది అట్లు విరుద్ధముగా నున్నంత మేరకు, అమలు కారాదు.

**రెండు లేక రెంటికి మించిన రాజ్యముల కొరకు వాటి సమ్మతిపై శాసనములను చేయుటకు పార్లమెంటుకు గల అధికారము మరియు ఏ ఇతర రాజ్యముచే నైనను అట్టి శాసనములు**

252. (1) 249, 250 అనుచ్ఛేదములలో నిబందింపబడినట్లు తప్ప, ఏ విషయములను గూర్చి రాజ్యముల కొరకు శాసనములను చేయుటకు పార్లమెంటుకు అధికారము లేదో, ఆ విషయములలో దేనినైనను పార్లమెంటు శాసనము ద్వారా క్రమబద్ధపరచుట వాంఛనీయమని ఏవేని రెండు, లేక

1. సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా, 16.9.2016వ తేదీ నుండి చొప్పించబడినవి.

రెంటికి మించిన రాజ్యముల శాసన మండలులకు తోచినచో, మరియు ఆ రాజ్య శాసనమండలుల సదనములన్నింటిచే అందుకై తీర్మానములు పాస్ చేయబడినచో, తదనుసారముగా పార్లమెంటు ఆ విషయమును క్రమబద్ధపరచుటకు చట్టమును చేయుట శాసనసమ్మతమై యుండును, మరియు అట్లు చేయబడిన ఏదేని చట్టము అట్టి రాజ్యములకు వర్తించవలెను మరియు ఏదేని ఇతర రాజ్యము, దాని శాసనమండలి సదనముచే లేక దానికి రెండు సదనములున్నచో ఆ సదనములలో ప్రతి సదనముచే తద్విషయమై పాస్ చేయబడిన తీర్మానము ద్వారా ఆ చట్టమును అటు తరువాత అంగీకరించినచో అది అట్టి ఇతర రాజ్యమునకు వర్తించవలెను.

(2) పార్లమెంటుచే అట్లు చేయబడిన చట్టము ఆ రీతిగానే చేయబడిన లేక అంగీకరించబడిన పార్లమెంటు యొక్క చట్టము ద్వారా సవరించబడవచ్చును, లేక రద్దు చేయబడవచ్చును; కాని అది వర్తించు ఏ రాజ్యమును గూర్చిగాని, ఆ రాజ్య శాసనమండలి యొక్క చట్టముచే అది సవరించబడరాదు, లేక రద్దు చేయబడరాదు.

**అంతర్జాతీయ కరారులను అమలుపరచుటకు శాసనములను చేయుట.**

253. ఈ అధ్యాయములోని పూర్వగామి నిబంధనలలో ఏమియున్నప్పటికినీ, ఏదేని ఇతర దేశముతో లేక ఏవేని ఇతర దేశములతో గల సంధిని, కరారును, లేక సాముదాయక నిర్ణయమును దేనినైనను, లేక ఏదేని అంతర్జాతీయ సమ్మేళనము, అసోసియేషను, లేక ఇతర నికాయముతో చేయబడిన నిర్ణయమును దేనినైనను అమలుపరచుటకు యావద్భారత రాజ్య క్షేత్రమునకు లేక అందలి ఏదేని భాగమునకు ఏ శాసనమునైనను చేయుటకు పార్లమెంటు అధికారమును కలిగియున్నది.

**పార్లమెంటుచే చేయబడిన శాసనములకు మరియు రాజ్య శాసన మండలులచే చేయబడిన శాసనములకు మధ్య అసంగతత.**

254. (1) పార్లమెంటు అధిశాసించుటకు సమర్థత కలిగియుండి చేసిన శాసనము యొక్క ఏదేని నిబంధనకు, లేక ఉభయసామాన్య సూచిలో పేర్కొనబడిన విషయములలో నొకదానిని గూర్చి అస్తిత్వములోనున్న శాసనము యొక్క ఏదేని నిబంధనకు, ఏదేని రాజ్య శాసన మండలిచే చేయబడిన శాసనము యొక్క ఏదేని నిబంధన విరుద్ధముగా నున్నచో, అప్పుడు, రాజ్యశాసన మండలిచే చేయబడిన శాసనమునకు పూర్వము చేయబడినదైనను పిమ్మట చేయబడినదైనను, పార్లమెంటుచే చేయబడిన శాసనమే, లేక సందర్భానుసారముగ అస్తిత్వమునందున్న శాసనమే ఖండము (2) యొక్క నిబంధనలకు అధ్యధీనమై, చెల్లుబాటు కలిగియుండును, మరియు రాజ్య శాసనమండలిచే చేయబడిన శాసనము, అట్లు విరుద్ధముగ నున్నంతమేరకు, ప్రభావశూన్యము కావలెను.

(2) ఉభయ సామాన్య సూచిలో పేర్కొనబడిన విషయములలో నొకదానిని గూర్చి [1][* * * *] ఒక రాజ్య శాసన మండలిచే చేయబడిన శాసనము ఆ విషయమును గూర్చి పార్లమెంటుచే పూర్వమే చేయబడిన శాసనము యొక్క, లేక అస్తిత్వములోనున్న శాసనము యొక్క నిబంధనలకు విరుద్ధమగు ఏ నిబంధననైనను కలిగియున్నప్పుడు, ఆ రాజ్య శాసనమండలిచే అట్లు చేయబడిన శాసనము,

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''ఒకటవ అనుసూచి యొక్క భాగము-ఏ లేక భాగము-బీలో నిర్దిష్టపరచబడిన'' అను పదములు మరియు అక్షరములు వదిలివేయబడినవి.

రాష్ట్రపతి పర్యాలోచనకై ప్రత్యేకింపబడి ఆయన అనుమతిని పొందినచో, అదియే ఆ రాజ్యములో చెల్లుబాటు కలిగియుండును.

అయితే రాజ్య శాసనమండలిచే అట్లు చేయబడిన శాసనమునకు చేర్పును, సవరణను, మార్పును చేయునట్టి, లేక దానిని రద్దు చేయునట్టి శాసనముతో సహా, ఎప్పుడైనను ఆ విషయమును గూర్చి పార్లమెంటు ఏదేని శాసనమును అధిశాసించుటను ఈ ఖండములోనున్న దేదియు నివారించరాదు.

255. పార్లమెంటు యొక్క, లేక ఒక రాజ్య శాసనమండలి [1][* * * *] యొక్క ఏదేని చట్టము మరియు అట్టి చట్టములోని ఏదేని నిబంధన, ఆ చట్టము, సిఫారసులు మరియు పూర్వమంజూరీలను గూర్చిన అపేక్షతములు ప్రక్రియకు సంబంధించిన విషయములుగా మాత్రమే పరిగణించబడుట.

(ఎ) అపేక్షితమైన సిఫారసు గవర్నరుదైనచో, గవర్నరుచే, లేక రాష్ట్రపతిచే అనుమతించబడినచో;

(బి) అపేక్షితమైన సిఫారసు రాజప్రముఖునిదైనచో రాజ ప్రముఖునిచే, లేక రాష్ట్రపతిచే అనుమతించబడినచో;

(సి) అపేక్షితమైన సిఫారసు లేక పూర్వ మంజూరీ రాష్ట్రపతిదైనచో, రాష్ట్రపతిచే అనుమతించబడినచో;

ఈ సంవిధానము క్రింద అపేక్షితమైన ఏదేని సిఫారసు లేక పూర్వ మంజూరీ లేదను కారణమునుబట్టియే అమాన్యము కారాదు.

## అధ్యాయము – 2 – పరిపాలక సంబంధములు

### సాధారణ విషయములు

256. పార్లమెంటుచే చేయబడిన శాసనముల యొక్క మరియు రాజ్యములో వర్తించెడి అస్తిత్వములో నున్న శాసనముల యొక్క పాటింపును కట్టుదిట్టముగా జరిపించునట్లు ప్రతి రాజ్యము యొక్క కార్యపాలకాధికారమును వినియోగించవలెను మరియు అందు కొరకు భారత ప్రభుత్వమునకు ఆవశ్యకమని తోచు ఆదేశములను రాజ్యమునకు ఇచ్చుట సంఘము యొక్క కార్యపాలనాధికారములో చేరియుండవలెను. రాజ్యముల యొక్కయు, సంఘము యొక్కయు బాధ్యత.

257. (1) సంఘము యొక్క కార్యపాలకాధికారపు వినియోగమును ఆటంకపరచునట్లుగా లేక దానికి భంగము కలుగనట్లుగా ప్రతి రాజ్యము యొక్క కార్యపాలకాధికారము వినియోగించబడ వలెను మరియు అందుకొరకు భారత ప్రభుత్వమునకు ఆవశ్యకమని తోచు ఆదేశములను రాజ్యమునకు ఇచ్చుట సంఘము యొక్క కార్యపాలకాధికారములో చేరి యుండును. కొన్ని సందర్భములలో రాజ్యముపై సంఘము యొక్క నియంత్రణ.

(2) జాతీయ లేక సైనిక ప్రాముఖ్యముగలవిగా ఆదేశములో ప్రఖ్యానించిన సంచార మరియు సంసూచన సాధనముల నిర్మాణమును, నిర్వహణను గూర్చి ఏదేని రాజ్యమునకు ఆదేశములనిచ్చుట కూడా సంఘము యొక్క కార్యపాలకాధికారములో చేరియుండును:

అయితే ఏవేని రాజమార్గములను, లేక జలమార్గములను జాతీయ జలమార్గములుగ ప్రఖ్యానించుటకు పార్లమెంటుకుగల అధికారమునుగాని, అట్లు ప్రఖ్యానించబడిన రాజమార్గముల, లేక జలమార్గముల విషయములో సంఘమునకు గల అధికారమునుగాని, నౌకా, సైనిక మరియు వైమానిక బలములకు సంబంధించిన నిర్మాణముల విషయమున తన కృత్యములలోని భాగముగ సంచార, మరియు సంసూచన సాధనములను నిర్మించుటకును, నిర్వహించుటకును, సంఘమునకుగల అధికారమునుగాని ఈ ఖండములోనున్న దేదియు పరిమితపరచునట్లు గ్రహింపబడరాదు.

(3) ఏదేని రాజ్యములోని రైలు మార్గముల రక్షణ కొరకు తీసుకొనబడవలసిన చర్యలను గూర్చి ఆ రాజ్యమునకు ఆదేశముల నిచ్చుట కూడా సంఘ కార్యపాలకాధికారములో చేరియుండును.

(4) ఏదేని సంచార, మరియు సంసూచన సాధనము యొక్క నిర్మాణము, లేక నిర్వహణ గూర్చి ఖండము (2) క్రిందను, లేక ఏదేని రైలు మార్గము యొక్క రక్షణకై తీసుకొనవలసిన చర్యలను గూర్చి ఖండము (3) క్రిందను, ఒక రాజ్యమునకు ఈయబడిన ఏదేని ఆదేశమును అమలువరచుటలోఅట్టి ఆదేశమీయబడనిచో రాజ్యము యొక్క మామూలు కర్తవ్యముల నిర్వహణకు అగు ఖర్చులకంటె ఎక్కువ ఖర్చులు అగునెడల, రాజ్యమునకు అట్లు అయిన అదనపు ఖర్చులకుగాను, ఇచ్చుటకు కరారు చేసికొనిన డబ్బు, లేక కరారు లేనప్పుడు భారతేదశ ముఖ్య న్యాయమూర్తి నియమించిన మధ్యవర్తి నిర్ధారణ చేయు డబ్బు భారత ప్రభుత్వముచే ఆ రాజ్యమునకు చెల్లించబడవలెను.

[1]257ఏ. [సంఘము యొక్క సాయుధ బలగములు లేక ఇతర బలగముల మోహరింపు ద్వారా రాజ్యములకు సహకారము.] సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 33వ పరిచ్ఛేదము ద్వారా 20.06.1979 నుండి రద్దు చేయబడినది.

**కొన్ని సందర్భములలో రాజ్యములకు అధికారములు మున్నగు వాటిని ప్రదత్తము చేయుటకు సంఘమునకు గల అధికారము.**

258. (1) ఈ సంవిధానము నందేమియున్నప్పటికిని రాష్ట్రపతి, ఒక రాజ్య ప్రభుత్వము యొక్క సమ్మతితో, ఆ ప్రభుత్వమునకు, లేక తదధీన అధికారులకు, సంఘము యొక్క కార్య పాలకాధికారములో చేరిన ఏదేని విషయమును గూర్చి ఏవేని కృత్యములను షరతుగగాని, బేషరతుగగాని అప్పగించవచ్చును.

(2) పార్లమెంటుచే చేయబడి, ఏదేని రాజ్యములో వర్తించు శాసనము, ఆ రాజ్య శాసన మండలికి శాసనములను చేయు అధికారములేని, ఏదేని విషయమునకు సంబంధించిన-దైనప్పటికిని అది ఆ రాజ్యమునకు, లేక దాని అధికారులకును, ప్రాధికారులకును అధికారములను ప్రదత్తము చేయవచ్చును, వారిపై కర్తవ్యములను మోపవచ్చును, లేక అధికారములు ప్రదత్తము చేయుటను మరియు కర్తవ్యములు మోపుటను ప్రాధీకృత మొనర్చవచ్చును.

(3) ఈ అనుచ్ఛేదమును బట్టి ఒక రాజ్యమునకు, లేక దాని అధికారులకు, లేక ప్రాధికారులకు అధికారములు ప్రవత్తము చేయబడిన యెడల, లేక వారిపై కర్తవ్యములు మోపబడిన యెడల, ఆ

---

1. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 33వ పరిచ్ఛేదము ద్వారా 20.6.1979 నుండి రద్దు చేయబడినది.

అధికారములను, లేక కర్తవ్యములను నిర్వర్తించుటలో అయిన అదనపు పరిపాలన ఖర్చులకుగాను, ఇచ్చుటకు కరారు చేసికొనిన డబ్బుగాని, కరారు లేనప్పుడు భారతదేశ ముఖ్య న్యాయమూర్తి నియమించిన మధ్యవర్తి నిర్ధారణ చేయు డబ్బుగాని, భారత ప్రభుత్వముచే ఆ రాజ్యమునకు చెల్లించబడవలెను.

[1][258ఏ. ఈ సంవిధానములో ఏమియున్నప్పటికిని, రాజ్య గవర్నరు భారత ప్రభుత్వము యొక్క సమ్మతితో, ఆ ప్రభుత్వమునకు, లేక దాని యొక్క అధికారులకు రాజ్యము యొక్క కార్య పాలకాధికారములో చేరిన ఏదేని విషయమును గూర్చిన కృత్యములను షరతుగ లేక బేషరతుగ అప్పగించవచ్చును.] **సంఘమునకు కృత్యములను అప్పగించుటకు రాజ్యములకు గల అధికారములు.**

259. [ఒకటవ అనుసూచి యొక్క భాగము (బీ) యందలి రాజ్యముల సాయుధ బలములు సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956లోని 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా లుప్తము చేయబడినది.]

260. భారత ప్రభుత్వము, భారత రాజ్యక్షేత్రములో భాగమై యుండని ఏదేని రాజ్యక్షేత్రము యొక్క ప్రభుత్వముతో చేసుకొనిన కరారు ద్వారా అట్టి రాజ్యక్షేత్రము యొక్క ప్రభుత్వమునందు నిహితమైయుండు ఏవేని కార్యపాలక, శాసన నిర్మాణ, లేక న్యాయిక కృత్యములను చేపట్టవచ్చును, కాని అట్టి ప్రతి యొక్క కరారు వైదేశిక అధికారిత వినియోగమునకు సంబంధించి తత్సమయమున అమలులోనున్న ఏదేని శాసనమునకు అధ్యధీనమై దానిచే పాలించబడవలెను. **భారతదేశము వెలుపలి రాజ్య క్షేత్రములకు సంబంధించి సంఘము యొక్క అధికారిత.**

261. (1) సంఘము యొక్కయు, ప్రతి రాజ్యము యొక్కయు పబ్లికు కార్యములు, రికార్డులు, మరియు న్యాయిక చర్యల యెడల, భారత రాజ్య క్షేత్రమునందంతటను సంపూర్ణమైన విశ్వాసము మరియు మాన్యత చూపబడవలెను. **పబ్లికు కార్యములు, రికార్డులు మరియు న్యాయిక చర్యలు.**

(2) ఖండము (1)లో నిర్దేశించబడిన కార్యములను, రికార్డులను, మరియు చర్యలను ఏ రీతిలో, మరియు ఏ షరతులకధీనమై నిరూపించవలెనో, మరియు వాటి ప్రభావమును నిర్ధారణ చేయవలెనో, ఈ రీతి మరియు షరతులు పార్లమెంటుచే చేయబడిన శాసనము ద్వారా నిబంధించినట్లుండవలెను.

(3) భారత రాజ్యక్షేత్రములోని ఏదేని భాగమునందలి సివిల్ న్యాయస్థానములచే ఇవ్వబడిన అంతిమ తీర్పులు లేక ఉత్తరువులు ఆ రాజ్యక్షేత్రమునందెచ్చటనైనను శాసనమునుసరించి అమలుపరచదగి యుండవలెను.

## జల సంబంధ వివాదములు

262. (1) ఏదేని అంతర్ రాజ్య నది యొక్క, లేక నదియందలి జలముల, లేక నదీలోయ యొక్క లేక నదీలోయలోని జలముల ఉపయోగము, పంపకము, లేక నియంత్రణను గూర్చి ఏదేని వివాదము లేక ఫిర్యాదు యొక్క న్యాయ నిర్ణయము కొరకు పార్లమెంటు శాసనము ద్వారా నిబంధించవచ్చును. **అంతర్ రాజ్య నదుల లేక ను దీ లోయల యొక్క జలములకు సంబంధించిన వివాదముల న్యాయ నిర్ణయము.**

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 18వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.

(2) ఈ సంవిధానమునందేమి యున్నప్పటికిని, ఖండము (1)లో నిర్దేశింపబడిన ఎట్టి వివాదము, లేక ఫిర్యాదు విషయములోనైనను సర్వోన్నత న్యాయస్థానముగాని, ఏదేని ఇతర న్యాయస్థానముగాని అధికారితను వినియోగించరాదని పార్లమెంటు శాసనము ద్వారా నిబంధన చేయవచ్చును.

## రాజ్యముల మధ్య సమన్వయము

**అంతర్ రాజ్య పరిషత్తును గూర్చిన నిబంధనలు.**

263. రాష్ట్రపతికి ఎప్పుడైనను,-

(ఎ) రాజ్యముల మధ్య ఉత్పన్నమైయుండిన వివాదములను పరిశీలన చేయుటకును, వాటిని గూర్చి సలహాలనిచ్చుటకును;

(బి) కొన్ని రాజ్యములు, లేక అన్ని రాజ్యములుగాని, సంఘము మరియు ఒకటి లేక అంతకు మించిన రాజ్యములుగాని, ఉమ్మడిగా హితము కలిగియున్న విషయములను దర్యాప్తు చేయుటకును, చర్చించుటకును; లేక

(సి) అట్టి ఏ విషయమును గూర్చియైనను సిఫారసులను చేయుటకును, ప్రత్యేకించి ఆ విషయమునకు సంబంధించిన విధానములను, చర్యలను ఇతోధికముగా సమన్వయపరచుటకై సిఫారసులను చేయుటకును.

కర్తవ్యము అప్పగించబడిన ఒక పరిషత్తు యొక్క స్థాపన వలన ప్రజాహితము చేకూరగలదని తోచినచో, రాష్ట్రపతి ఉత్తరువు ద్వారా అట్టి పరిషత్తును స్థాపించుట, మరియు అది నిర్వర్తించవలసిన కర్తవ్యముల స్వభావమును, దాని వ్యవస్థాపనను మరియు ప్రక్రియను నిర్వహించుట శాసనసమ్మతమై యుండును.

## భాగము – 12

## విత్తము, ఆస్తి, కాంట్రాక్టులు మరియు దావాలు

### అధ్యాయము – 1 – విత్తము

### సాధారణ విషయములు

**అర్థాన్వయము.**

[1][264. ఈ భాగములో ''విత్తీయ కమీషను'' అనగా 280వ అనుచ్ఛేదము క్రింద సంఘటితమైన విత్తీయ కమీషను అని అర్థము.]

**శాసన ప్రాధికారము ననుసరించి తప్ప పన్నులు విధింపబడకుండుట.**

265. పన్ను ఏదియు, శాసన ప్రాధికారము ననుసరించి తప్ప విధించబడరాదు, లేక వసూలు చేయబడరాదు.

**భారత దేశము యొక్కయు, రాజ్యముల యొక్కయు సంచిత నిధులు మరియు పబ్లికు ఖాతాలు.**

266. (1) 267వ అనుచ్ఛేదము యొక్క నిబంధనలకు, మరియు కొన్ని పన్నుల యొక్కయు, సుంకముల యొక్కయు నికర ఆదాయమును పూర్తిగా లేక అందు కొంత భాగమును రాజ్యములకు

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా అనుచ్ఛేదము 264 కొరకు ఉంచబడినది.

కేటాయించుటను గూర్చిన ఈ అధ్యాయములోని నిబంధనలకు అధ్యధీనమై, భారత ప్రభుత్వము పుచ్చుకొనిన అన్ని రాబడులు మరియు ఖజానా వినిమయ పత్రములు, అప్పులు, లేక అక్కర కొరకైన అడ్వాన్సుల ధనముల ద్వారా ఆ ప్రభుత్వము సేకరించిన అన్ని అప్పులు మరియు అప్పులు తిరిగి చెల్లింపు క్రింద ఆ ప్రభుత్వము పుచ్చుకొనిన ధనములన్నియు ''భారత సంచిత నిధి'', యనబడు ఒక సంచిత నిధిగా రూపొందవలెను, మరియు ఏదేని రాజ్య ప్రభుత్వము పుచ్చుకొనిన అన్ని రాబడులు మరియు ఖజానా వినిమయ పత్రములు, అప్పులు, లేక అక్కరకొరకైన అడ్వాన్సుల ద్వారా ఆ ప్రభుత్వము సేకరించిన అన్ని అప్పులు, మరియు అప్పుల తిరిగి చెల్లింపు క్రింద ప్రభుత్వము పుచ్చుకొనిన ధనములన్నియు ''రాజ్య సంచిత నిధి'' యనబడు ఒక సంచిత నిధి రూపొందవలెను.

(2) భారత ప్రభుత్వముగాని, దాని తరపునగాని, రాజ్య ప్రభుత్వముచేగాని, దాని తరపునగాని, పుచ్చుకొనబడిన ఇతర పబ్లికు ధనములన్నియు, సందర్భానుసారముగ, భారత ప్రభుత్వము యొక్క ప్రబుత్వ ఖాతాకు, లేక ఆ రాజ్యము యొక్క ప్రభుత్వ ఖాతాకు, జతకట్టబడవలెను.

(3) భారతదేశ సంచితనిధి నుండి గాని, ఒక రాజ్యము యొక్క సంచిత నిధి నుండి గాని, ఏ ధనములైనను శాసనము ననుసరించియు, ఈ సంవిధానములో నిబంధింపబడిన ప్రయోజనములకు, నిబంధింపబడిన రీతిలోను తప్ప వినియోజనము చేయబడరాదు.

267. (1) అగ్రదాయ స్వభావము కలిగి ''భారత ఆకస్మికతా నిధి'' యనబడు ఒక ఆకస్మికతా నిధిని పార్లమెంటు శాసనము ద్వారా స్థాపించవచ్చును. అట్టి శాసనము ద్వారా ఆయా సమయములందు నిర్ధారణ చేయబడు డబ్బు ఆ నిధిలో చెల్లించబడవలెను మరియు ముందుగా తెలియకుండ సంభవించెడి వ్యయమును భరించుటకై, అట్టి వ్యయమును 115వ, లేక 116వ అనుచ్ఛేదము క్రింద పార్లమెంటు శాసనము ద్వారా ప్రాధీకృతమొనర్చుటకు పూర్వము అట్టి ఆకస్మికతా నిధి నుండి రాష్ట్రపతిచే అడ్వాన్సులు ఇవ్వబడుటకు వీలగునట్లు ఆ నిధి ఆయన అధీనములో ఉంచబడవలెను. **ఆకస్మికతా నిధి.**

(2) అగ్రదాయ స్వభావము కలిగి ''రాజ్య ఆకస్మికతా నిధి యనబడు ఒక ఆకస్మికతా నిధిని, రాజ్య శాసనమండలి శాసనము ద్వారా స్థాపించవచ్చును. అట్టి శాసనము ద్వారా ఆయా సమయములందు నిర్ధారణ చేయబడు డబ్బు ఆ నిధిలో చెల్లించబడవలెను, మరియు ముందుగా తెలియకుండ సంభవించెడి వ్యయమును భరించుటకై అట్టి వ్యయమును, 205 లేక 206వ అనుచ్ఛేదము క్రింద ఆ రాజ్య శాసనమండలి శాసనము ద్వారా ప్రాధీకృతమొనర్చుటకు పూర్వము అట్టి ఆకస్మికతా నిధి నుండి ఆ రాజ్య గవర్నరు [1] [........]చే అడ్వాన్సులు ఇవ్వబడుటకు వీలగునట్లు, ఆ నిధి ఆయన అధీనములో ఉంచబడవలెను.

## సంఘము మరియు రాజ్యముల మధ్య రాబడుల పంపిణీ

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజ ప్రముఖ'' అను పదములు వదిలివేయబడినది.

268. (1) సంఘసూచిలో పేర్కొనబడినట్టి స్టాంపు సుంకములు, [1][* * * *] భారత ప్రభుత్వముచే విధించబడవలెను. కాని అవి,- **సంఘముచే విధింపబడి రాజ్యములచే వసూలు చేయబడి వినియోజనము చేయబడు సుంకములు.**

(ఎ) ఏదేని [2][సంఘ రాజ్య క్షేత్రము]లో విధించబడదగినవైన యెడల, భారత ప్రభుత్వముచే వసూలు చేయబడవలెను, మరియు

(బి) ఇతర సందర్భములలో, ఏయే రాజ్యములలో విధించబడదగి యుండునో ఆయా రాజ్యములచే వసూలు చేయబడవలెను.

(2) ఏదేని రాజ్యములో విధించబడదగు అట్టి సుంకము నుండి ఏదేని విత్తీయ సంవత్సరమునందు చేకూరిన ఆదాయము భారతదేశ సంచిత నిధిలో చేరియుండరాదు, అది ఆ రాజ్యమునకే కేటాయింపబడవలెను.

[3][268ఏ .* * * *] సంవిధాన (101వ సవరణ) చట్టము, 2016 యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా 16.09.2016 నుండి లుప్తము చేయబడినది.

269. [4][(1) సరుకుల క్రయ విక్రయములపై పన్నులు మరియు [5][269ఏ అనుచ్ఛేదములో నిబంధించినవి తప్ప,] సరుకుల రవాణాపై పన్నులు భారత ప్రభుత్వముచే విధించబడి వసూలు చేయబడవలెను. కాని అవి ఖండము (2)లో నిబంధించబడిన రీతిగా రాజ్యములకు కేటాయించవలెను మరియు 1996, ఏప్రిల్ 1వ తేదీన లేక తరువాత రాజ్యములకు కేటాయింపబడినట్లుగా భావింపబడవలెను. **సంఘముచే విధింపబడి మరియు వసూలు చేయబడి, రాజ్యములకు కేటాయించబడు పన్నులు.**

**విశదీకరణ:-** ఈ ఖండము ప్రయోజనముల నిమిత్తము,-

(ఎ) ''సరకుల క్రయ విక్రయములపై పన్నులు'' అను పదబంధమునకు అంతర్రాజ్య వ్యాపార లేక వాణిజ్య సరళిలో జరిగిన యెడల క్రయ విక్రయములపై పన్నులు అని అర్థము;

---

1. సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 6వ పరిచ్ఛేదము ద్వారా, 16.9.016వ తేదీ నుండి ''మరియు అట్టి ఔషధీయ మరియు ప్రసాధన ద్రవ్యములపైన ఎక్సైజు సుంకములు'' అను పదములు వదిలివేయబడినవి.
2. అదే చట్టము ద్వారా ''ఒకటవ అనుసూచి యొక్క భాగము-సీ లో నిర్దేశించబడిన రాజ్యము'' అను పదములకు బదులు ఉంచబడినవి.
3. సంవిధాన (ఎనుబది ఎనిమిదవ సవరణ) చట్టము, 2003 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది. (ఇది ఇప్పటి వరకు అమలులోనికి రాలేదు, తేదీ తరువాత అధిసూచించబడును). 268ఏ అనుచ్ఛేదము, సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా 16.9.2016 నుండి వదిలివేయబడినది.
4. సంవిధాన (యనభైయ్యవ సవరణ) చట్టము, 2000 యొక్క రెండవ పరిచ్ఛేదము ద్వారా ఖండములు (1) మరియు (2)కు బదులుగా 09.06.2000 నుండి ఉంచబడినది.
5. సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 8వ పరిచ్ఛేదము ద్వారా, ''సరుకుల రవాణా'' అను పదములకు ముందు చొప్పించబడినవి.

(బి) ''సరకుల రవాణాపై పన్నులు'' అను పదబంధమునకు అంతర్రాజ్య వ్యాపార లేక వాణిజ్య సరళిలో రవాణా జరిగిన యెడల (రవాణా చేయు వ్యక్తికైనను లేక ఎవరేని ఇతర వ్యక్తికైనను) అట్టి సరుకుల రవాణాపై పన్నులు అని అర్థము.

(2) ఏ విత్తీయ సంవత్సరమునందైనను అట్టి పన్ను యొక్క నికర ఆదాయము, ఆ ఆదాయము సంఘ రాజ్యక్షేత్రములకు సంబంధించినదన దగినదై యున్నంత వరకు తప్ప, భారతదేశ సంచిత నిధిలో చేరియుండరాదు. ఏ రాజ్యములలో ఆ సుంకము, లేక పన్ను ఆ సంవత్సరములో విధించబడదగియుండునో ఆ రాజ్యములకే అది కేటాయించబడి పార్లమెంటుచే శాసనము ద్వారా రూపొందింపబడు పంపిణీ సూత్రముల ననుసరించి ఆ రాజ్యముల మధ్య పంపిణీ చేయబడవలెను.]

[1][(3) [2][సరకుల క్రయ విక్రయములు లేక రవాణా అంతర్ రాజ్య వ్యాపార లేక వాణిజ్య సరళిలో ఎప్పుడు జరుగునో నిర్ధారణ వేయుటకు సూత్రములను పార్లమెంటు శాసనము ద్వారా రూపొందించవచ్చును.]

**అంతర్ రాజ్య వర్తకము లేదా వాణిజ్యము చేయు క్రమంలో వస్తువుల మరియు సేవలపై పన్ను విధింపు మరియు వసూలు.**

[3][269ఏ. (1) అంతర్ రాజ్య వర్తకం లేదా వాణిజ్యము చేయు క్రమములో వస్తువుల మరియు సేవల సరఫరాలపై పన్నును భారత ప్రభుత్వము ద్వారా విధించబడి, వసూలు చేయబడవలెను మరియు అట్టి పన్నును, వస్తువుల మరియు సేవల పన్ను కౌన్సిలు యొక్క సిఫారసులపై పార్లమెంటుచే నిబంధించబడు రీతిలో సంఘము మరియు రాజ్యముల మధ్య పంచవలెను.

**విశదీకరణ:** ఈ ఖండము నిమిత్తము, వస్తువుల లేదా సేవల లేక రెండింటి యొక్క సరఫరా భారతదేశపు రాజ్యక్షేత్రములోనికి దిగుమతి చేసుకునే క్రమములో, అంతర్‌రాజ్య వర్తకము లేక వాణిజ్య క్రమములో ఆ వస్తువుల లేదా సేవల లేక రెండింటి యొక్క సరఫరాగా పరిగణించబడవలెను.

(2) ఖండము (1) క్రింద ఒక రాజ్యమునకు పంచిన మొత్తము భారతదేశ సంచిత నిధిలోని భాగముగా రూపొందదు.

(3) ఖండము (1) క్రింద విధించిన పన్నుగా వసూలు చేసిన మొత్తమును 246ఏ అనుచ్ఛేదము క్రింద రాజ్యముచే విధించిన పన్ను చెల్లింపునకు ఉపయోగించినపుడు, అట్టి మొత్తము భారతదేశ సంచిత నిధిలోని భాగముగా రూపొందదు.

(4) 246ఏ అనుచ్ఛేదము క్రింద రాజ్యముచే విధించిన పన్ను మొత్తమును, ఖండము (1) క్రింద విధించి పన్ను యొక్క చెల్లింపు సంచిత నిధిలోని భాగముగా రూపొందదు.

---

1. సంవిధన (ఆరవ సవరణ) చట్టము, 1956 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.
2. సంవిధాన (నలభై ఆరవ సవరణ) చట్టము, 1982 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ''సరుకుల క్రయవిక్రయము''కు బదులుగా ఉంచబడినది.
3. సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 9వ పరిచ్ఛేదము ద్వారా, 16.9.2016వ తేదీ నుండి కొత్త అనుచ్ఛేదము 269ఏ చొప్పించబడినది.

(5) అంతర్ రాజ్య వర్తకము లేదా వాణిజ్యము చేయు క్రమములో వస్తువుల లేదా సేవల లేదా రెండింటి సరఫరా చోటు చేసుకున్నప్పుడు, సరఫరా స్థలమును నిర్ధారించుటకు, పార్లమెంటు శాసనము ద్వారా సూత్రములను రూపొందించవచ్చును.]

**పన్నులు విధించుట మరియు సంఘము మరియు రాజ్యముల మధ్య పంపిణీ చేయుట.**

[1][270.(1) అనుచ్ఛేదములు [2][268, 269 మరియు 269ఏ లలో] వరుసగా నిర్దేశించబడిన సుంకములు మరియు పన్నులు మినహా, సంఘము యొక్క జాబితాలో నిర్దేశించబడిన అన్ని పన్నులు మరియు సుంకములు, అనుచ్ఛేదము 271లో నిర్దేశించబడిన పన్నులు మరియు సుంకములపై సర్చార్జీ మరియు పార్లమెంటు ద్వారా చేయబడిన ఏదేని శాసనము క్రింద నిర్దిష్టపరచిన ప్రయోజనము కొరకు విధించబడిన ఏదేని సెస్సు భారత ప్రభుత్వము విధించి, వసూలు చేయవలెను మరియు ఖండము (2)లో నిబంధించబడిన రీతిలో సంఘము మరియు రాజ్యముల మధ్య పంచబడవలెను.

[3][(1ఏ) 246ఏ అనుచ్ఛేదము యొక్క ఖండము (1) క్రింద సంఘముచే వసూలు చేయబడిన పన్నును కూడ ఖండము (2) క్రింద నిబంధించిన రీతిలో సంఘము మరియు రాజ్యముల మధ్య పంపిణీ చేయవలెను.

(1బీ) 246ఏ అనుచ్ఛేదపు ఖండము (2) మరియు 269ఏ అనుచ్ఛేదము క్రింద సంఘముచే విధించబడి మరియు వసూలు చేయబడిన, 246ఏ అనుచ్ఛేదము యొక్క ఖండము (1) క్రింద సంఘముచే విధించబడి పన్ను చెల్లింపు కొరకు ఉపయోగించిన, మరియు 269ఏ అనుచ్ఛేదము యొక్క ఖండము (1) క్రింద సంఘమునకు పంపకము చేయబడిన పన్ను మొత్తమును కూడ, ఖండము (2) క్రింద నిబంధించిన రీతిలో సంఘము మరియు రాజ్యముల మధ్య పంపిణీ చేయబడవలెను.]

(2) ఏదేని విత్తీయ సంవత్సరములో ఏదేని అట్టి పన్ను లేక సుంకము యొక్క నికర రాబడులపై విహిత పరచబడునట్టి శాతము, భారత సంచిత నిధిలో భాగముగా ఉండదు. ఆ సంవత్సరములో విధించదగు పన్ను లేక సుంకము రాజ్యముల మధ్య కేటాయించబడవలెను మరియు ఖండము (3)లో నిబంధించబడిన రీతిలో విహితపరచబడునట్టి సమయము నుండి మరియు అట్టి రీతిలో ఆయా రాజ్యముల మధ్య పంచబడవలెను.

(3) ఈ అనుచ్ఛేదములో ''విహితపరచబడిన'' అనగా--

---

1. సంవిధాన (యనబైయ్యవ సవరణ) చట్టము, 2000 యొక్క మూడవ పరిచ్ఛేదము ద్వారా 270వ అనుచ్ఛేదమునకు బదులుగా 1.4.1996 నుండి ఉంచబడినది.
2. సంవిధాన (ఎనుబది ఎనిమిదవ సవరణ) చట్టము, 2003 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా బ్రాకెట్లలోని పదములు మరియు అక్షరముల అనుచ్ఛేదములు ''268, 268ఏ మరియు 269''గా ఉంచబడినవి. (ఇది ఇప్పటి వరకు అమలులోనికి రాలేదు, తేదీ తరువాత అధిసూచించబడును).
3. సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 10వ పరిచ్ఛేదము ద్వారా, 16.9.2016వ తేదీ నుండి చొప్పించబడినది.

(i) విత్తీయ కమీషను ఏర్పాటు చేయబడునంతవరకు, ఉత్తరువు ద్వారా రాష్ట్రపతిచే విహితవరచబడిన, మరియు

(ii) విత్తీయ కమీషను ఏర్పాటు చేయబడినమీదట, విత్తీయ కమీషను యొక్క సిఫారసులను పర్యాలోచించిన మీదట ఉత్తరువు ద్వారా రాష్ట్రపతిచే విహితవరచబడిన అని అర్థము.]

**సంఘ ప్రయోజనము నిమిత్తము కొన్ని సుంకములు మరియు పైనను వన్నులపై సర్ఛార్జి.**

271. అనుచ్ఛేదములు 269 మరియు 270లో ఏమియున్నప్పటికినీ పార్లమెంటు ఎప్పుడైనను సంఘ ప్రయోజనముల కొరకు, [1][246ఏ అనుచ్ఛేదము క్రింద వస్తువుల మరియు సేవల పన్ను తప్ప,] ఆ అనుచ్ఛేదములో నిర్దేశింపబడిన ఏవేని సుంకములను, లేక పన్నులను సర్చార్జీ ద్వారా పెంచవచ్చును, మరియు అట్టి సర్చార్జీ నుండి చేకూరు ఆదాయమంతయు భారత సంచిత నిధిలో చేరి యుండును.

272. [సంఘముచే విధించబడి మరియు వసూలు చేయబడి సంఘము మరియు రాజ్యముల మధ్య పంపిణీ చేయదగువన్నులు.] సంవిధాన (యనభైవ సవరణ) చట్టము, 2000 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 09.06.2000 నుండి లుప్తము చేయబడినది.

**జనపనార మరియు జనపనార వస్తువులపై ఎగుమతి సుంకమునకు బదులుగా అనుదానములు.**

273. (1) ప్రతి సంవత్సరము జనపనార మరియు జనపనార వస్తువుల ఎగుమతి పై వచ్చు సుంకము యొక్క నికరాదాయములో అస్సాము, బీహారు, [2][ఒడిషా] మరియు పశ్చిమ బెంగాల్ రాజ్యములకు ఏదేని వాటాను కేటాయించుటకు బదులుగ ఆ రాజ్యములకు రెవిన్యూ సహాయక అనుదానములుగ ఇవ్వబడుటకుగాను, విహితము చేయబడు డబ్బు భారత సంచిత నిధిపై ప్రభారము చేయబడవలెను.

(2) అట్లు విహితము చేయబడిన డబ్బు, భారత ప్రభుత్వముచే జనపనార, జనపనార వస్తువులపై ఏదేని ఎగుమతి సుంకము విధించబడు చుండునంత కాలము, లేక, ఈ సంవిధానము నుండి పది సంవత్సరములు ముగియు వరకు – ఈ రెండింటిలో ఏది ముందుగా ముగియునో అంతవరకు, భారత సంచితనిధిపై ప్రభారము చేయబడవలెను.

(3) ఈ అనుచ్ఛేదములో ''విహిత వరచబడిన'' అను పదబంధమునకు 270వ అనుచ్ఛేదములో గల అర్థమే ఉండును.

**రాజ్యములకు హితము గల పన్నుల విధింపునకు సంబంధించిన బిల్లులకు రాష్ట్రపతి యొక్క పూర్వసిఫారసు ఆవశ్యకత.**

274. (1) రాజ్యములకు హితము గల ఏదేని పన్ను, లేక సుంకమును విధించు లేక మార్చు, లేక భారతదేశ రాబడి పన్నుకు సంబంధించిన శాసనముల నిమిత్తము నిర్వచించబడిన ''వ్యవసాయ రాబడి'' అను పదబంధము యొక్క అర్థమును మార్చు, లేక ఈ అధ్యాయములోని పూర్వగామి నిబంధనలలో దేని క్రిందనైనను ధనములను రాజ్యములకు ఏ సూత్రముల ప్రకారము పంచవలెనో, లేక పంచవచ్చునో ఆ సూత్రములకు భంగము కలిగించు, లేక సంఘము నిమిత్తము ఈ అధ్యాయములోని పూర్వగామి నిబంధనలో పేర్కొనబడిన ఏదేని సర్చార్జీని విదించు, ఏదేని బిల్లుగాని,

---

1. సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 11వ పరిచ్ఛేదము ద్వారా 16.9.2016వ తేదీ నుండి ''ఆ అనుచ్ఛేదములలో'' అను పదములకు ముందు చొప్పించబడినవి.

2. ఒరిస్సా (పేరు మార్పిడి) చట్టము, 2011 (2011లోని 15వది)యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా (1-11-2011 నుండి) ''ఒరిస్సా'' అను దానికి బదులుగా ఉంచబడినది.

సవరణగాని, రాష్ట్రపతి యొక్క సిఫారసుపై తప్ప, పార్లమెంటు ఉభయ సదనములలో దేనియందును ప్రవేశపెట్టబడరాదు, లేక ప్రస్తావించబడరాదు.

(2) ఈ అనుచ్ఛేదములో ''రాజ్యములకు హితముగల పన్ను, లేక సుంకము'' అను పదబంధమునకు–

(ఎ) ఏ పన్ను యొక్క లేక సుంకము యొక్క మొత్తము నికర ఆదాయముగాని దానిలో కొంత భాగముగాని, ఏదేని రాజ్యమునకు కేటాయించబడునో ఆ పన్ను, లేక సుంకము అనియు; లేక

(బి) ఏ పన్ను యొక్క లేక సుంకము యొక్క నికరాదాయమును బట్టి, ఏదేని రాజ్యమునకు భారత సంచిత నిధి నుండి తత్సమయమున డబ్బు చెల్లించబడదగియుండునో ఆ పన్ను, లేక సుంకము, అని అర్థము.

**కొన్ని రాజ్యములకు సంఘము నుండి అనుధానములు.**

275. (1) ఏ రాజ్యములకు సహాయము ఆవశ్యకమని పార్లమెంటు నిర్ధారణ చేయునో ఆ రాజ్య రెవెన్యూలకు సహాయక అనుదానములుగా, పార్లమెంటు శాసనము ద్వారా నిబంధించునట్టి డబ్బు ప్రతి సంవత్సరము భారతదేశ సంచిత నిధిపై ప్రభారము చేయబడవలెను మరియు వేరు వేరు రాజ్యములకు వేరు వేరు మొత్తములు నియతము చేయబడవచ్చును:

అయితే ఏదేని రాజ్యములోని అనుసూచిత జనజాతుల శ్రేయస్సును పెంపొందించు నిమిత్తముగాని, అందలి అనుసూచిత జనజాతి క్షేత్రముల పరిపాలన స్థాయిని ఆ రాజ్యము యొక్క తక్కిన క్షేత్రముల పరిపాలన స్థాయికి సమానమగునట్లు పెంచు నిమిత్తము గాని, భారత ప్రభుత్వము యొక్క ఆమోదముతో ఆ రాజ్యము చేపట్టిన అభివృద్ధి పథకములకగు ఖర్చులను ఆ రాజ్యము భరించుటకు కావలసిన మూలధనము మరియు ఆవృత్తక ధనము భారత సంచితనిధి నుండి ఆ రాజ్య రెవెన్యూలకు సహాయక అనుదానములుగా చెల్లించబడవలెను:

అంతేగాక, ఈ క్రింది మూలధనము మరియు ఆవృత్తక ధనము భారత సంచిత నిది నుండి అస్సాము రాజ్యము యొక్క రెవెన్యూలకు సహాయక అనుదానములుగా చెల్లింపబడవలెను:–

(ఎ) ఆరవ అనుసూచి యొక్క పేరా 20కి జతపరచిన పట్టికలోని [1][భాగము '1']లో నిర్దిష్టపరచబడిన జనజాతి క్షేత్రముల పరిపాలనను గూర్చి, ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము రెండు సంవత్సరములలో, రెవెన్యూలకు మించి చేసిన వ్యయము యొక్క సగటునకు సమానమగు డబ్బు; మరియు

(బి) సదరు క్షేత్రముల పరిపాలనా స్థాయిని ఆ రాజ్యము యొక్క తక్కిన క్షేత్రముల పరిపాలనా స్థాయికి సమానమగునట్లు పెంచు నిమిత్తము భారత ప్రభుత్వ ఆమోదముతో ఆ రాజ్యము చేపట్టు అభివృద్ధి పథకముల ఖర్చులకు సమానమగు డబ్బు.

---

1. ఉత్తర ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 71వ పరిచ్ఛేదము ద్వారా ''భాగము ఏ''కు బదులుగా 21.1.1972 నుండి ఉంచబడినది.

[1][(1ఏ) 244ఎ అనుచ్ఛేదము క్రింద స్వాయత్త రాజ్యము ఏర్పాటు చేయబడినప్పుడు మరియు అప్పటి నుండి:-

(i) ఖండము (1)కి గల రెండవ వినాయింపు యొక్క ఖండము (ఎ)లో నిర్దేశింపబడిన జనజాతి క్షేత్రములన్నియు ఆ స్వాయత్తరాజ్యమునందు చేరియున్నచో సదరు ఖండము (ఎ) క్రింద చెల్లించదగు ఏదేని డబ్బు, ఆ స్వాయత్త రాజ్యమునకు చెల్లింపబడవలెను; మరియు ఆ స్వాయత్త రాజ్యమునందు ఆ జనజాతి క్షేత్రములలో కొన్ని మాత్రమే చేరియున్నచో, ఆ డబ్బు అస్సాము రాజ్యమునకును ఆ స్వాయత్త రాజ్యమునకును మధ్య రాష్ట్రపతి ఉత్తరువు ద్వారా నిర్దిష్టపరచునట్లు పంచబడవలెను;

(ii) ఆ స్వాయత్త రాజ్యము యొక్క పరిపాలనా స్థాయిని తక్కిన అస్సాము రాజ్యము యొక్క పరిపాలనా స్థాయికి సమానమగునట్లు పెంచు నిమిత్తము భారత ప్రభుత్వము యొక్క ఆమోదముతో ఆ స్వాయత్త రాజ్యము చేపట్టిన అభివృద్ధి పథకముల ఖర్చులకు సమానమగు మూలధనము, మరియు ఆవృత్తక ధనము, భారత సంచితనిధి నుండి ఆ స్వాయత్త రాజ్యము యొక్క రెవెన్యూలకు సహాయక అనుదానుముగా చెల్లింపబడవలెను.]

(2) పార్లమెంటుచే ఖండము (1) క్రింద నిబంధనలు చేయబడువరకు, ఆ ఖండము క్రింద పార్లమెంటుకు ప్రదత్తము చేయబడిన అధికారములు రాష్ట్రపతిచే ఉత్తరువు ద్వారా వినియోగించబడదగి ఉండవలెను మరియు ఈ ఖండము క్రింద రాష్ట్రపతిచే చేయబడిన ఏదేని ఉత్తరువు పార్లమెంటుచే చేయబడు అట్టి ఏదేని నిబంధనకు అధ్యధీనమై, ప్రభావము కలిగియుండును:

అయితే ఒక విత్తీయ కమీషను సంఘటితపరచబడిన తరువాత, ఈ కమీషను యొక్క సిఫారసులను పర్యాలోచించిన పిమ్మట తప్ప, ఈ ఖండము క్రింద రాష్ట్రపతి ఎట్టి ఉత్తరువును చేయరాదు.

**వృత్తులు, వ్యాపారములు, ఆజీవికలు మరియు ఉద్యోగములపై పన్నులు.**

276. (1) 246వ అనుచ్ఛేదములో ఏమి యున్నప్పటికిని, వృత్తులు, వ్యాపారములు, ఆజీవికలు, లేక ఉద్యోగములను గూర్చిన ఒక రాజ్యము యొక్క లేక అందలి ఒక పురపాలిక, జిల్లా బోర్డు, స్థానిక బోర్డు, లేక ఇతర స్థానిక ప్రాధికారి యొక్క మేలు కొరకైన పన్నులకు సంబంధించి ఆ రాజ్య శాసనమండలి చేసిన శాసనమేదియు, అది రాబడి పన్నుకు సంబంధించియున్నదను కారణమును బట్టి అమాన్యము కారాదు.

(2) వృత్తులు, వ్యాపారములు, ఆజీవికలు, మరియు ఉద్యోగములపై, పన్ను రూపమున రాజ్యమునకుగాని, అందలి పురపాలికకు, జిల్లా బోర్డుకు, స్థానిక బోర్డుకు, లేక ఇతర స్థానిక

1. సంవిధాన (ఇరువది రెండవ సవరణ) చట్టము, 1969 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 25.09.1969 నుండి చొప్పించబడినది.

ప్రాధికారికిగాని, ఒక వ్యక్తి చెల్లించదగిన మొత్తము, సంవత్సరమునకు [1][రెండు వేల ఐదు వందల రూపాయలకు మించరాదు.]

[2][* * * * *]

(3) వృత్తులు, వ్యాపారములు, ఆజీవికలు, మరియు ఉద్యోగులపై పన్నుల విషయములో శాసనములను చేయుటకు ఒక రాజ్యము యొక్క శాసనమండలికి గల పైన చెప్పబడిన అధికారము, వృత్తులు, వ్యాపారము ఆజీవికలు, మరియు ఉద్యోగముల నుండి ప్రాప్తమగు, లేక ఉత్పన్నమగు రాబడిపై పన్నులను గూర్చి శాసనములను చేయుటకు పార్లమెంటుకు గల అధికారమును ఏ విధముగాను పరిమితము చేయునదిగా అన్వయించబడరాదు.

277. ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము ఏదేని రాజ్య ప్రభుత్వముచేగాని, ఏదేని పురపాలికచే లేక ఏదేని ఇతర స్థానిక ప్రాధికారి, లేక నికాయముచే ఆ రాజ్యము, పురపాలిక, జిల్లా లేక ఇతర స్థానిక ప్రాంతము నిమిత్తము శాసనసమ్మతముగా విధించబడుచుండిన ఏవేవి పన్నులు, సుంకములు, సెస్సులు లేక ఫీజులు, అవి సంఘసూచిలో పేర్కొనబడినవైయున్నప్పటికిని, పార్లమెంటు శాసనము ద్వారా తద్విరుద్ధముగా నిబంధన చేయు వరకు, ఆ నిమిత్తము అదే విధముగా విధించబడుచు మరియు వినియోగించబడుచుండ వచ్చును. **వ్యావృత్తులు**

278. [కొన్ని విత్తీయ విషయములలో మొదటి అనుసూచి యొక్క బి భాగము నందలి రాజ్యములతో కరారు.] సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా రద్దు చేయబడినది.

279. (1) ఈ అధ్యాయములోని పూర్వగామి నిబంధనలలో ఏదేని పన్ను లేక సుంకము విషయమున ''నికర ఆదాయము'' అనగా దాని వసూలుకగు ఖర్చు పోగా మిగిలిన ఆదాయము అని అర్థము మరియు ఆ నిబంధనల నిమిత్తము ఏదేని ప్రాంతములోని లేక దానికి సంబంధించిన దనదగిన ఏదేని పన్ను లేక సుంకము యొక్క లేక ఏదేని పన్నులోగాని, సుంకములోగాని భాగము యొక్క నికర ఆదాయము, భారత కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలుచే అభినిశ్చయించబడి ధ్రువీకరించబడవలెను మరియు ఆయన ధృవీకరణ అంతిమమై యుండవలెను. **''నికర ఆదాయపు'' లెక్కింపు మున్నగునవి.**

(2) ఏదేని సుంకము, లేక పన్ను యొక్క ఆదాయము, ఈ భాగము క్రింద ఏదేని రాజ్యమునకు కేటాయించబడిన, లేక కేటాయించబడదగు ఏ సందర్భములోను, పైన చెప్పబడిన వాటికిని, ఈ అధ్యాయము యొక్క ఇతర అభివ్యక్త నిబంధనకును అధ్యధీనమై ఆ ఆదాయమును లెక్క వేయు రీతిని గూర్చియు, చెల్లింపులను ఏ కాలము నుండి, లేక ఏ కాలమున మరియు ఏ రీతిలో చేయవలెనో ఆ కాలమును మరియు ఆ రీతిని గూర్చియు, ఒక విత్తీయ సంవత్సరమునకును మరొక విత్తీయ సంవత్సరమునకును మధ్య సర్దుబాటులను చేయుటకు గూర్చియు, ఇతర ఆనుషంగిక లేక సహాయక

---

1. సంవిధాన (అరవైయ్యవ సవరణ) చట్టము, 1988 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ''రెండు వందల యాభై రూపాయలు''కు బదులుగా 20.12.1988 నుండి ఉంచబడినది.
2. అదే చట్టపు 2వ పరిచ్ఛేదము ద్వారా వినాయింపు లుప్తము చేయబడినది.

విషయములను గూర్చియు, పార్లమెంటుచే చేయబడిన శాసనములో లేక రాష్ట్రపతి యొక్క ఉత్తరువులో నిబంధనలు చేయబడవచ్చును.

**వస్తువుల మరియు సేవల పన్ను కౌన్సిలు.**

[1][279ఏ. (1) సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క ప్రారంభపు తేదీ నుండి అరవై దినముల లోపల, రాష్ట్రపతి, వస్తువుల మరియు సేవల పన్ను కౌన్సిలు అని పిలువబడు కౌన్సిలు నొకదానిని ఏర్పాటు చేయవలెను.

(2) వస్తువుల మరియు సేవల పన్ను కౌన్సిలు, ఈ క్రింది సభ్యులతో కూడి ఉండవలెను, వారెవరనగా:-

(ఎ) కేంద్ర విత్తీయ మంత్రి .............. ఛైర్‌పర్సన్;

(బి) రెవెన్యూ లేదా విత్తమునకు అధికారము నందున్న, రాజ్యమునకైన కేంద్ర మంత్రి........ సభ్యుడు;

(సి) ప్రతి యొక్క రాజ్యప్రభుత్వముచే నామనిర్దేశము చేయబడునట్టి, విత్తీయ లేదా పన్ను విధింపులకు అధికారమునందున్న మంత్రి లేదా ఇతర మంత్రి.........సభ్యులు.

(3) ఖండము (2) యొక్క ఉప-ఖండము (సి)లో నిర్దేశించబడిన వస్తువుల మరియు సేవల పన్ను కౌన్సిలు యొక్క సభ్యులు, వీలైనంత వెంటనే, వారిలో నుండి ఒకరిని కౌన్సిలు యొక్క వైస్-ఛైరపర్సన్‌గా వారు నిర్ణయించునట్టి కాలావధికి ఎంపిక చేసుకొనవలెను.

(4) వస్తువుల మరియు సేవల పన్ను కౌన్సిలు, ఈ క్రింది వాటిపై సంఘము మరియు రాజ్యములకు సిఫారసులు చేయవలెను-

(ఎ) సంఘము, రాజ్యములు మరియు స్థానిక సంస్థల ద్వారా విధించబడిన వస్తువుల మరియు సేవల పన్నులో అంతర్గతంగా ఉండు పన్నులు, సెస్సులు మరియు సర్ఛార్జీలు;

(బి) వస్తువుల మరియు సేవల పన్నుకు గురియగునట్టి లేదా దాని నుండి మినహాయించబడినట్టి వస్తువులు మరియు సేవలు;

(సి) ఆధునిక వస్తువుల మరియు సేవల పన్ను శాసనములు, విధింపు సూత్రములు, 269ఏ అనుచ్ఛేదము క్రింద రాజ్యాంతర్గత వర్తకము లేదా వాణిజ్యము జరుగు క్రమములో సరఫరాలపై వస్తువుల మరియు సేవల పన్ను విధింపు యొక్క పెంపకము పాలించు సూత్రములు;

(డి) వస్తువుల మరియు సేవల పన్ను నుండి మినహాయించబడునట్టి వస్తువుల మరియు సేవల దిగువ టర్నోవరు యొక్క ప్రారంభ పరిమితి;

(ఇ) వస్తువుల మరియు సేవల పన్ను బ్యాండుతో కనీస ధరతో సహా ధరలు;

---

1. సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 12వ పరిచ్ఛేదము ద్వారా 279ఏ అనుచ్ఛేదము 12.9.2016వ తేదీ నుండి చొప్పించబడినది.

(ఎఫ్) ఏదైనా ప్రకృతి వైపరీత్యము లేదా విపత్తు సమయములో ఒక నిర్దిష్ట కాలావధి కొరకు అదనపు వనరులను సేకరించుటకైనట్టి ఏదైనా ప్రత్యేక ధర లేదా ధరలు;

(జి) అరుణాచల ప్రదేశ్, అస్సామ్, జమ్ము మరియు కాశ్మీరు, మణిపూర్, మేఘాలయ, మిజోరం, నాగాలాండ్, సిక్కిం, త్రిపుర, హిమాచల్ ప్రదేశ్ మరియు ఉత్తరాఖండ్ రాజ్యములకు సంబంధించి ప్రత్యేక నిబంధనలు;

(హెచ్) కౌన్సిలు నిర్ధారించునట్టి, వస్తువుల మరియు సేవల పన్నుకు సంబంధించిన ఏదేని ఇతర విషయము.

(5) వస్తువుల మరియు సేవల పన్ను కౌన్సిలు, పెట్రోలియం క్రూడ్, హైస్పీడ్ డీజిలు, (సాధారణముగా పెట్రోలు అని పిలువబడు) మోటారు స్పిరిట్, సహజ వాయువు మరియు విమాన టర్బైన్ ఇంధనములపై వస్తువుల మరియు సేవల పన్ను విధించు తేదీని సిఫారసు చేయవలెను.

(6) ఈ అనుచ్ఛేదము ద్వారా ఒసగబడిన కృత్యములను నిర్వర్తించుటలో, వస్తువుల మరియు సేవల పన్ను యొక్క సామరస్య పూరితమైన రూపకల్పన, వస్తువుల మరియు సేవల కొరకు సామరస్య పూరితమైన జాతీయ మార్కెటు యొక్క అభివృద్ధి కొరకు అవసరమైనట్లుగా వస్తువుల మరియు సేవల పన్ను కౌన్సిలు మార్గదర్శకం చేయవలెను.

(7) వస్తువుల మరియు సేవల పన్ను కౌన్సిలు యొక్క మొత్తము సభ్యులలో సగము మంది సభ్యులు దాని సమావేశములకు కోరముగా ఏర్పడవలెను.

(8) వస్తువుల మరియు సేవల పన్ను కౌన్సిలు దాని కృత్యములను నిర్వర్తించుటలోని ప్రక్రియను నిర్ధారించవలెను.

(9) వస్తువుల మరియు సేవల పన్ను కౌన్సిలు యొక్క ఒక సమావేశములో తీసుకొనబడు ప్రతీ నిర్ణయము, ఈ క్రింది సూత్రములననుసరించి ఆ సమావేశమునకు హాజరై మరియు ఓటు చేసిన ఓట్ల బలములో నాలుగింట మూడు వంతులకు తగ్గనటువంటి ఆధిక్యముతో తీసుకొనబడవలెను, అవేవనగా:–

(ఎ) కేంద్ర ప్రభుత్వము యొక్క ఓటు, వేయబడిన మొత్తము ఓట్ల యొక్క మూడింట ఒక వంతు సంఖ్యాబలములో ఉండవలెను;

(బి) రాజ్య ప్రభుత్వము యొక్క ఓట్లు, వేయబడిన మొత్తము ఓట్ల యొక్క మూడింట రెండు వంతుల సంఖ్యా బలములో ఉండవలెను.

(10) వస్తువుల మరియు సేవల పన్ను కౌన్సిలు యొక్క ఏదేని చర్య లేక ప్రొసీడింగు కేవలము ఈ క్రింది కారణములపై శాసన మాన్యతను కోల్పోదు–

(ఎ) కౌన్సిలు యొక్క ఏర్పాటులోని ఏదేని లోపము లేదా ఏదేని ఖాళీ ఉండుట వలన; లేదా

(బి) కౌన్సిలు సభ్యునిగా ఒక వ్యక్తి నియామకములోని లోపము వలన; లేదా

(సి) కౌన్సిలు యొక్క కేసు యోగ్యతకు భంగము కలిగించని ఏదేని ప్రక్రియా పరమైన క్రమరాహిత్యము.

(11) వస్తువుల మరియు సేవల పన్ను కౌన్సిలు–

(ఎ) భారత ప్రభుత్వము మరియు ఒకటి లేదా అంతకెక్కువ రాజ్యముల మధ్య; లేదా

(బి) భారత ప్రభుత్వము మరియు ఏదేని రాజ్యము మధ్య లేదా రాజ్యములు ఒక వైపు మరియు ఒకటి లేక అంతకెక్కువ ఇతర రాజ్యములు మరొకవైపు; లేదా

(సి) ఒకటి లేదా అంతకెక్కువ రాజ్యముల మధ్య ఉత్పన్నమగు ఏదైనా వివాదమును న్యాయ నిర్ణయము చేయుటకైన లేదా దానిని అమలు పరచుటకైన యంత్రాంగమును కౌన్సిలు యొక్క సిఫారసులపై ఏర్పాటు చేయవలెను.]

**విత్తీయ కమీషను**

280. (1) ఈ సంవిధాన ప్రారంభము నుండి రెండు సంవత్సరములలోపున మరియు అటు తరువాత ప్రతి అయిదవ సంవత్సరము ముగియగానే లేక రాష్ట్రపతి ఆవశ్యకమని తలచినచో అంతకు పూర్వమే, రాష్ట్రపతి ఉత్తరువు ద్వారా ఒక విత్తీయ కమీషనును సంఘటితము చేయవలెను. అది రాష్ట్రపతిచే నియమించబడు ఒక అధ్యక్షుడు, మరియు నలుగురు సభ్యులతో కూడియుండవలెను.

(2) ఆ కమీషను యొక్క సభ్యులుగ నియమించబడుటకు కావలసిన అర్హతలను మరియు వారిని ఎంపిక చేయు రీతిని పార్లమెంటు శాసనము ద్వారా నిర్ధారణ చేయవచ్చును.

(3) ఈ క్రింది వాటిని గూర్చి రాష్ట్రపతికి సిఫారసులను చేయుట ఆ కమీషను యొక్క కర్తవ్యమై యుండవలెను:–

(ఎ) ఈ అధ్యాయము క్రింద సంఘమునకు, రాజ్యములకు మధ్య పంచవలసిన, లేక పంచదగిన పన్నుల నికర ఆదాయమును వాటి మధ్య పంచుట మరియు అట్టి ఆదాయములో ఆయా రాజ్యముల వాటాలను ఆయా రాజ్యములకు కేటాయించుట;

(బి) భారత సంచితనిధి నుండి చేయబడు రాజ్యముల రెవెన్యూల సహాయక అనుదానములకు వర్తించు సూత్రములు;

[1] [(బిబి) రాజ్య విత్తీయ కమీషనరు చేసిన సిఫారసుల ఆధారముగా రాజ్యములోని పంచాయితీల వనరులను పెంపొందించుటకుగాను రాజ్య సంచిత నిధిని పెంచుటకు అవసరమైన చర్యలు;]

[1][(సి) రాజ్య విత్తీయ కమీషను చేసిన సిఫారసుల ఆధారముగా రాజ్యములోని పురపాలిక వనరులను పెంపొందించుటకుగాను రాజ్య సంచిత నిధిని పెంచుటకుగాను అవసరమైన చర్యలు;]

---

1. సంవిధాన (డెబ్బది మూడవ సవరణ) చట్టము, 1992 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 24.4.1993 నుండి చొప్పించబడినది.

[2][(డి) విత్తీయ సౌష్టవమును ఒనగూర్చుటకుగాను కమీషనుకు రాష్ట్రపతిచే నిర్దేశించబడిన ఏదేని ఇతర విషయములు;]

(4) కమీషను తన ప్రక్రియను తానే నిర్ధారణ చేసికొనవలెను, మరియు తన కృత్యముల నిర్వర్తనలో కమీషను, తనకు పార్లమెంటు శాసనము ద్వారా ప్రదత్తము చేయు అధికారములను కలిగియుండవలెను.

281. రాష్ట్రపతి, ఈ సంవిధానము యొక్క నిబంధనల క్రింద విత్తీయ కమీషనుచే చేయబడు ప్రతి సిఫారసును, దానిపై తీసుకొనబడిన చర్యను గురించిన విశదీకరణ జ్ఞాపనతో సహా, పార్లమెంటు యొక్క ప్రతి సదనము సమక్షమున ఉంచు ఏర్పాటు చేయించవలెను.

**విత్తీయ కమీషను యొక్క సిఫారసులు.**

## వివిధ విత్తీయ నిబంధనలు

282. ఏదేని సార్వజనిక ప్రయోజనము కొరకు, సందర్భానుసారముగా, పార్లమెంటుచే, లేక రాజ్యశాసన మండలిచే, శాసనములు చేయబడరానప్పటికిని, అందుకొరకు సంఘము, లేక రాజ్యము ఏవేని అనుదానములను చేయవచ్చును.

**సంఘముచే గాని, రాజ్యముచేగాని, దాని రెవెన్యూల నుండి భరించబడదగు వ్యయము.**

283. (1) భారత సంచితనిధి యొక్కయు, భారత ఆకస్మికతా నిధి యొక్కయు అభిరక్ష, అట్టి నిధులలో ధనములను చెల్లించుట, మరియు వాటి నుండి ధనములను తిరిగి తీసుకొనుట, భారత ప్రభుత్వముచే గాని వారి తరపున గాని పుచ్చుకొనబడి అట్టి నిధులకు జమ కట్టబడిన ధనములు మినహా ఇతర పబ్లికు ధనముల యొక్క అభిరక్ష, భారత పబ్లికు ఖాతాలో వాటిని చెల్లించుట, మరియు అట్టి ఖాతా నుండి ధనములను తిరిగి తీసికొనుట, మరియు పూర్వోక్త విషయములకు సంబంధించిన, లేక సహాయకమగు ఇతర విషయములన్నియు పార్లమెంటుచే చేయబడిన శాసనము ద్వారా క్రమబద్ధము చేయబడవలెను మరియు అట్లు తద్విషయమున నిబంధన చేయబడు వరకు, రాష్ట్రపతిచే చేయబడిన నియమావళి ద్వారా క్రమబద్ధము చేయబడవలెను.

**సంచిత నిధుల యొక్కయు, ఆకస్మికతా నిధుల యొక్కయు, పబ్లికు ఖాతాకు జమకట్టబడిన ధనముల యొక్కయు అభిరక్ష మున్నగునవి.**

(2) ఒక రాజ్యసంచిత నిధి యొక్కయు, ఆకస్మికతా నిధి యొక్కయు అభిరక్ష అట్టి నిధులలో ధనములను చెల్లించుట, మరియు వాటి నుండి ధనములను తిరిగి తీసుకొనుట, రాజ్య ప్రభుత్వముచే గాని, వారి తరపున గాని పుచ్చుకొనబడి అట్టి నిధులకు జమకట్టబడిన ధనములు మినహా ఇతర పబ్లికు ధనముల యొక్క అభిరక్ష ఆ రాజ్య పబ్లికు ఖాతాలో వాటిని చెల్లించుట, మరియు అట్టి ఖాతా నుండి ధనములను తిరిగి తీసికొనుట మరియు పైన చెప్పబడిన విషయములకు సంబంధించిన, లేక సహాయకరమగు, ఇతర విషయములన్నియు రాజ్య శాసన మండలిచే చేయబడిన శాసనము ద్వారా

---

1. సంవిధాన (డెబ్బది నాలుగవ సవరణ) చట్టము, 1992 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 1.6.1993 నుండి చొప్పించబడినది.
2. అదే చట్టము ద్వారా ఉప-ఖండము (సి)ని ఉప-ఖండము (డి)గా తిరిగి అక్షరము వేయబడినది.

క్రమబద్ధము చేయబడవలెను, మరియు తద్విషయమున అట్లు నిబంధన చేయబడువరకు, రాజ్య గవర్నరుచే [1][.......] చేయబడు నియమావళి ద్వారా క్రమబద్ధము చేయబడవలెను.

**పబ్లికు సేవకులు, మరియు న్యాయస్థానములచే పుచ్చుకొనబడు, పక్షకారుల డిపాజిట్ల యొక్కయు, ఇతర ధనము యొక్కయు అభిరక్ష.**

284. (ఎ) భారత ప్రభుత్వముచే, లేక సందర్భానుసారముగా రాజ్య ప్రభుత్వముచే సేకరించబడిన, లేక పుచ్చుకొనబడిన రెవెన్యూలు, లేక పబ్లికు ధనములు కానట్టియు, సంఘము యొక్క లేక రాజ్యము యొక్క వ్యవహారముల సంబంధమున నియమించబడిన ఏవరేని అధికారిచే అధికారరీత్యా పుచ్చుకొనబడినట్టియు, లేక ఆయన వద్ద అధికారరీత్యా డిపాజిటు చేయబడినట్టి ధనములన్నియును; లేక

(బి) ఏదేని వ్యాజ్యములో, ఏదేని విషయమున, ఏదేని ఖాతాకు లేక ఎవరేని వ్యక్తుల పేర భారత రాజ్యక్షేత్రములోని ఏదేని న్యాయస్థానముచే పుచ్చుకొనబడిన, లేక దాని వద్ద డిపాజిటు చేయబడిన ధనములన్నియును భారత పబ్లికు ఖాతాలో, లేక సందర్భానుసారముగ, రాజ్యపబ్లికు ఖాతాలో చెల్లింపబడవలెను.

**సంఘము యొక్క ఆస్తిని రాజ్యపు పన్ను విధింపు నుండి మినహాయించుట.**

285. (1) పార్లమెంటు శాసనము ద్వారా అన్యథా నిబంధించు మేరకు తప్ప, రాజ్యముచేగాని, రాజ్యము నందలి ఏ ప్రాధికారిచేగాని విధింపబడు పన్నులన్నింటి నుండి సంఘము యొక్క ఆస్తి మినహాయించబడవలెను.

(2) ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము ఏదేని రాజ్యములో సంఘము యొక్క ఏదేని ఆస్తి ఏదేని పన్ను చెల్లింపునకు లోనైయుండినచో, లేక లోనైయున్నట్లు ఎంచబడినచో, పార్లమెంటు శాసనము ద్వారా అన్యథా నిబంధించువరకు ఆ రాజ్యములో ఆ పన్ను విధింపు కొనసాగుచున్నంత కాలము ఖండము (1)లో నున్న దేదియు ఆ రాజ్యములోని ఏ ప్రాధికారినైనను ఆ ఆస్తిపై అట్టి పన్నును విధించుట నుండి నివారించదు.

**వస్తువుల లేదా సేవల లేదా రెండింటిపై పన్ను విధించుటకు గూర్చిన నిర్బంధనలు.**

286. (1) [2][వస్తువుల లేదా సేవల రెండింటి సరఫరా-]

(ఎ) రాజ్యమునకు వెలుపల, లేక

(బి) [1][అట్టి వస్తువుల లేదా సేవల లేదా రెండింటి సరఫరా] భారత రాజ్యక్షేత్రములోనికి దిగుమతి చేయుటలో గాని భారత రాజ్యక్షేత్రము నుండి ఎగుమతి చేయుటలోగాని, జరిగిన యెడల, ఆ రాజ్యము యొక్క శాసనము ఏదియు ఆ సరఫరాలపై పన్ను విధించరాదు, లేక విధించుటకు ప్రాధికారము నొసగరాదు.

[1][* * * * *]

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజప్రముఖ్'' అను పదములు (1.11.1956 నుండి) లుప్తము చేయబడినవి.
2. సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 13వ పరిచ్ఛేదము ద్వారా, ''వస్తువుల క్రయ విక్రయములు'' అను పదములకు బదులుగా 16.9.2016 నుండి ఉంచబడినది.

[2][(2) వస్తువుల లేదా సేవల రెండింటి సరఫరా ఖండము (1)లో పేర్కొనబడిన ఏదేని విధముగా ఎప్పుడు జరుగునో నిర్ధారణ చేయు సూత్రములను పార్లమెంటు శాసనము ద్వారా రూపొందించవచ్చును.]

[3][* * * * *]

287. పార్లమెంటు శాసనము ద్వారా అన్యథా నిబంధన చేయు మేరకు తప్ప,–

**విద్యుచ్ఛక్తి మీద పన్నుల మినహాయింపు.**

(ఎ) భారత ప్రభుత్వముచే వినియోగించబడిన, లేక భారత ప్రభుత్వ వినియోగము కొరకు ఆ ప్రభుత్వమునకు విక్రయించబడిన: లేక

(బి) ఏదేని రైలు మార్గ నిర్మాణములో, మరమ్మత్తులో లేక నిర్వహణలో భారత ప్రభుత్వముచే లేక ఆ రైలు మార్గమును నిర్వహించే రైల్వే కంపెనీచే వినియోగించబడిన లేక ఏదేని రైలు మార్గము నిర్మాణములో, మరమత్తులో లేక నిర్వహణలో వినియోగము కొరకు ఆ ప్రభుత్వమునకు లేక అట్టి ఏదేని రైల్వే కంపెనీకి విక్రయించబడిన విద్యుచ్ఛక్తి యొక్క వినియోగము లేక విక్రయముపై (ఆ విధ్యుచ్ఛక్తి ఉత్పాదన ప్రభుత్వముచే చేయబడినను, లేక ఇతర వ్యక్తులచే చేయబడినను) రాజ్యము యొక్క ఏ శాసనముగాని పన్ను విధించరాదు, లేక విధించుటకు ప్రాధికారము నొసగరాదు మరియు విద్యుచ్ఛక్తి విక్రయముపై పన్ను విధించు, లేక విధించుటకు ప్రాధికారము నొసగు ఏ శాసనమైనను, భారత ప్రభుత్వ వినియోగము కొరకు ఆ ప్రభుత్వమునకు, లేక ఏదేని రైలు మార్గపు నిర్మాణములో, మరమ్మతులో లేక నిర్వహణలో వినియోగము కొరకు

పైన చెప్పబడిన ఏదేని రైల్వే కంపెనీకి విక్రయించబడిన విద్యుచ్ఛక్తి యొక్క వెల విద్యుచ్ఛక్తిని అధిక పరిమాణములో వినియోగించుకొను ఇతర వినియోగదారుల నుండి గైకొనబడు వెల కన్న, పన్ను మేరకు తక్కువగా నుండునట్లు ఏర్పాటు చేయవలెను.

288. (1) రాష్ట్రపతి ఉత్తరువు ద్వారా అన్యథా నిబంధనచేయు మేరకు తప్ప, ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము అమలులోనున్న రాజ్య శాసనమేదియు, అంతర్ రాజ్య నదిని, లేక నది లోయను క్రమబద్ధము చేయుటకు లేక అభివృద్ధి పరచుటకుగాని అస్తిత్వములో నున్న ఏదేని శాసనముచే లేక పార్లమెంటుచే చేయబడిన శాసనముచే స్థాపించబడిన ఏ ప్రాధికార సంస్థచేనైననూ నిలువ చేయబడిన, ఉత్పత్తి చేయబడిన, వినియోగము చేయబడిన, పంపిణీ చేయబడిన లేక

**కొన్ని సందర్భములలో, జలము లేక విద్యుచ్ఛక్తి విషయమున రాజ్యములచే పన్ను విధింపు నుండి మినహాయింపు.**

---

1. సంవిధాన (ఆరవ సవరణ) చట్టము, 1956 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా ఖండము (1)కి గల విశదీకరణ లుప్తము చేయబడినది.
2. అదే చట్టపు 4వ పరిచ్ఛేదము ద్వారా ఖండములు (2) మరియు (3)కు బదులుగా ఉంచబడినది.
3. సంవిధాన (నలుబదియారవ సవరణ) చట్టము, 1982 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా ఖండము (3)కు బదులుగా ఉంచబడినది మరియు సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 13వ పరిచ్ఛేదము ద్వారా, 16.9.2016వ తేదీ నుండి సదరు ఖండము (3) లుప్తము చేయబడినది.

వి(క్రయించబడిన ఏదేని జలము విషయమున లేక విద్యుచ్ఛక్తి విషయమున పన్ను విధించరాదు, లేక విధించుటకు ప్రాధికారము నొసగరాదు.

**విశదీకరణ:–** ఈ ఖండములో ''అమలులోనున్న రాజ్య శాసనము'' అను పదబంధములో, ఈ సంవిధాన ప్రారంభమునకు పూర్వము పాస్ చేయబడి, లేక కావించబడి, అంతకుముందు రద్దుకాని రాజ్య శాసనము అట్టి ఏ శాసనమైనను అందలి ఏ భాగములైనను అప్పుడు పూర్తిగా లేక కొన్ని ప్రత్యేక ప్రాంతములలో అమలులో లేనప్పటికిని, చేరియుండును.

(2) రాజ్యశాసనమండలి, ఖండము (1)లో పేర్కొనబడిన ఏదేని పన్నును శాసనము ద్వారా విధించవచ్చును లేక విధించుటకు ప్రాధికారమునొసగవచ్చును, కానీ అట్టి శాసనమెదియు, రాష్ట్రపతి యొక్క పర్యాలోచన కొరకు ప్రత్యేకించబడినదై ఆయన అనుమతిని పొందిననే తప్ప, ఎట్టి ప్రభావమును కలిగియుండదు, మరియు అట్టి ఏ శాసనమైనను, ఆ శాసనము క్రింద ఏ ప్రాధికారిచేనైననూ చేయబడవలసిన నియమావళి ద్వారా లేక ఉత్తరువుల ద్వారా అట్టి పన్ను యొక్క రేట్లను లేక ఇతర ప్రసంగతులను నిర్ణయించుటకు నిబంధించుచో, అట్టి నియమమును లేక ఉత్తరువును చేయుటకు రాష్ట్రపతి యొక్క పూర్వ సమ్మతిని పొందవలెనని, ఆ శాసనము నిబంధించవలెను.

**రాజ్యము యొక్క ఆస్తిని మరియు రాబడిని సంఘము యొక్క పన్ను విధింపు నుండి మినహాయించుట.**

289. (1) రాజ్యము యొక్క ఆస్తి మరియు రాబడి సంఘపు పన్ను విధింపు నుండి మినహాయింపబడవలెను.

(2) రాజ్య ప్రభుత్వముచే లేక దానితరపునగాని సాగించబడు ఏదేని వ్యాపారమును లేక వర్తకమును గూర్చి లేక దానిని సంబంధించిన ఏదేని క్రియాకలాపములను గూర్చి, లేక అట్టి వ్యాపారము లేక వర్తకము నిమిత్తము ఉపయోగించబడిన లేక ఆక్రమించుకొనబడిన ఏదేని ఆస్తిని గూర్చి లేక తత్సంబంధమున ప్రాప్తమగు లేక ఉత్పన్నమగు ఏదేని రాబడిని గూర్చి పార్లమెంటు శాసనము ద్వారా నిబంధన చేసినచో, ఆ మేరకు ఖండము (1)లో నున్న దేదియు సంఘమును ఏదేని పన్ను విధించుట నుండి లేక విధించుటకు ప్రాధికారము నొసగుట నుండి నివారించదు.

(3) పార్లమెంటు శాసనము ద్వారా ప్రభుత్వము యొక్క సామాన్య కృత్యములకు అనుషంగికమైనవిగా ప్రఖ్యానము చేయు ఏదేని వ్యాపారమునకు లేక వర్తకమునకు లేక ఏదేని తరగతికి చెందిన వ్యాపారమునకు లేక వర్తకమునకు ఖండము (2)లో నున్న దేదియు వర్తించదు.

**కొన్ని వ్యయములు మరియు పింఛనుల విషయములో సర్దుబాటు.**

290. ఏదేని న్యాయస్థానము యొక్క లేక కమీషను యొక్క వ్యయములు లేక ఈ సంవిధాన ప్రారంభమునకు పూర్వము ఇండియాలో క్రౌను క్రిందగాని, అట్టి ప్రారంభమునకు తరువాత సంఘము యొక్క లేక ఒక రాజ్యము యొక్క వ్యవహారములకు సంబంధించిగాని సేవ చేసిన ఎవరేని వ్యక్తికి లేక వ్యక్తిని గూర్చి, చెల్లించవలసిన పింఛను, ఈ సంవిధాన నిబంధనల క్రింద, భారత సంచిత నిధి, లేక ఆ రాజ్య సంచిత నిధిపై ప్రభారమైనదైన యెడల,–

(ఎ) భారత సంచిత నిధిపై ప్రభారమైనదైన సందర్భములో ఆ న్యాయస్థానముగాని, కమీషనుగాని, రాజ్యము యొక్క ప్రత్యేకమైన అక్కరలలో దేనినైనను తీర్చుచో, లేక ఆ వ్యక్తి

రాజ్యము యొక్క వ్యవహారములకు సంబంధించి పూర్ణిత: కాని భాగత: కాని సేవ చేసి యున్నచో; లేక

(బి) రాజ్య సంచిత నిధిపై ప్రభారమైనదైన సందర్భములో ఆ న్యాయస్థానముగాని, కమీషనుగాని, సంఘము యొక్క లేక మరొక రాజ్యము యొక్క ప్రత్యేకమైన అక్కరలలో దేనినైనను తీర్చుచో లేక ఆ వ్యక్తి సంఘము యొక్క లేక మరొక రాజ్యము యొక్క వ్యవహారములకు సంబంధించి పూర్ణత: లేక భాగత: సేవ చేసి యున్నచో,

ఆ వ్యయములను, లేక పింఛనును గూర్చి కరారు చేసుకొనబడిన లేక కరారు ఏదియు లేనిచో, భారతదేశ ముఖ్య న్యాయమూర్తి నియమించిన మధ్యవర్తిచే నిర్ధారణ చేయబడునట్టి అంశదాయము రాజ్య సంచితనిధిపై లేక సందర్భానుసారముగా భారత సంచిత నిధిపై లేక ఆ మరొక రాజ్య సంచితనిధిపై ప్రభారము చేయబడి దాని నుండి చెల్లించబడవలెను.

[1][290ఏ. తరువాన్కురు దేవస్వపు నిధికిగాను ప్రతి సంవత్సరము నలుబదియారు లక్షల ఏబది వేల రూపాయల మొత్తము కేరళ రాజ్యము యొక్క సంచిత నిధిపై ప్రభారము చేయబడి దాని నుండి చెల్లించబడవలెను, మరియు తిరవాన్కూరు కొచ్చిన్ రాజ్యము నుండి 1956 నవంబరు ఒకటవ తేదీన [2][తమిళనాడు] రాజ్యమునకు అంతరణ చేయబడిన రాజ్యక్షేత్రములందలి హిందూ దేవాలయముల మరియు పూజా మందిరముల నిర్వహణ కొరకు తమిళనాడు రాజ్యములో స్థాపించబడిన దేవస్వపు నిధికిగాను ప్రతి సంవత్సరము పదమూడు లక్షల ఏబది వేల రూపాయల మొత్తము తమిళనాడు రాజ్య సంచిత నిధిపై ప్రభారము చేయబడి దాని నుండి చెల్లించబడవలెను.] **కొన్ని దేవస్వపు నిధులకు వార్షిక చెల్లింపు.**

291. [.........] సంవిధాన (ఇరువది ఆరవ సవరణ) చట్టము, 1971లోని 2వ పరిచ్ఛేదము ద్వారా 28.12.1971 నుండి లుప్తము చేయబడినది.]

## అధ్యాయము – 2
## అప్పు చేయుట

292. సంఘము యొక్క కార్యపాలకాధికారములో, పార్లమెంటు ఆయా సమయములందు శాసనము ద్వారా ఏవేని పరిమితులను నియతపరచినచో అట్టి పరిమితులలోపున, భారత సంచితనిధి యొక్క ప్రతిభూతిపై అప్పు చేయుటయు, అట్లు నియతపరచబడిన పరిమితులు ఏవేని ఉన్నచో అట్టి పరిమితులలోపున, హామీలనిచ్చుటయు చేరియుండును. **భారత ప్రభుత్వముచే అప్పు చేయుట.**

293. (1) ఈ అనుచ్ఛేదము యొక్క నిబంధనలకు అధ్యధీనమై ఒక రాజ్యము యొక్క కార్యపాలకాధికారములో, ఆ రాజ్య శాసనమండలి ఆయా సమయములందు శాసనము ద్వారా ఏవేని పరిమితులను నియతపరచినచో అట్టి పరిమితులలోపున, ఆ రాజ్య సంచితనిధి యొక్క ప్రతిభూతిపై **రాజ్యములచే అప్పు చేయుట.**

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 19వ పరిచ్ఛేదము ద్వారా 01.11.1956 నుండి చొప్పించబడినది.
2. మద్రాసు రాజ్య(పేరు మార్పిడి) చట్టము, 1968 (1968లోని 53వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 14.1.1969 నుండి ''మద్రాసు'' అను దానికి బదులుగా ఉంచబడినది.

భారత రాజ్యక్షేత్రము లోపల అప్పుచేయుటయు, అట్లు నియతపరచబడిన పరిమితుల ఏవేని ఉన్నచో అట్టి పరిమితుల లోపున, హామీల నిచ్చుటయు చేరియుండును.

(2) పార్లమెంటుచే చేయబడిన ఏదేని శాసనము ద్వారా లేక శాసనము క్రింద పేర్కొనబడిన షరతులకు అధ్యధీనమై, భారత ప్రభుత్వము ఏదేని రాజ్యమునకు అప్పు ఇవ్వవచ్చును, లేక 292వ అనుచ్ఛేదము క్రింద నియతపరచబడిన పరిమితులను మించకుండ ఏదేని రాజ్యము సేకరించు అప్పుల విషయమున హామీల నీయవచ్చును మరియు అట్టి అప్పులిచ్చు నిమిత్తము కావలసిన ఏవైనా డబ్బులు భారత సంచిత నిధిపై ప్రభారము చేయబడవలెను.

(3) ఏదేని రాజ్యమునకు భారత ప్రభుత్వముచే లేక దానికి ముందున్న ప్రభుత్వముచే ఈయబడిన, లేక భారత ప్రభుత్వముచే లేక దానికి ముందున్న ప్రభుత్వముచే హామీ ఈయబడిన అప్పులో ఏదేని భాగము ఇంకను చెల్లింపబడకయున్నచో భారత ప్రభుత్వము యొక్క సమ్మతి లేకుండ ఆ రాజ్యము ఎట్టి అప్పును సేకరింపరాదు.

(4) భారత ప్రభుత్వము విధించుట సబబని తలచు షరతులు ఏవేని ఉన్నచో, వాటికి అధ్యధీనమై ఖండము (3) క్రింద సమ్మతి మంజూరు చేయవచ్చును.

## అధ్యాయము – 3

## ఆస్తి, కాంట్రాక్టులు, హక్కులు, దాయిత్వములు, బాధ్యతలు, మరియు దావాలు.

**ఆస్తికి, సంపత్తికి, హక్కులకు, దాయిత్వములకు మరియు బాధ్యతలకు కొన్ని సందర్భములలో ఉత్తరాధికారము.**

294. ఈ సంవిధాన ప్రారంభమునకు పూర్వము పాకిస్తాన్ అధినివేశము యొక్క లేక పశ్చిమ బెంగాల్, తూర్పు బెంగాల్, పశ్చిమ పంజాబు మరియు తూర్పు పంజాబు ప్రావిన్సుల యొక్క ఏర్పాటు కారణముగ చేయబడిన లేక చేయబడు ఏదేని సర్దుబాటుకు అధ్యధీనమై, ఈ సంవిధాన ప్రారంభము నుండి,–

(ఎ) అట్టి ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము భారతదేశ అధినివేశ ప్రభుత్వము కొరకు బ్రిటీషు సామ్రాట్టు నందు నిహితమై యుండిన సకల ఆస్తులు, మరియు సంపత్తి మరియు అట్టి ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము ప్రతి గవర్నరు ప్రావిన్సు యొక్క ప్రభుత్వము కొరకు బ్రిటీషు సామ్రాట్టునందు నిహితమైయుండిన సకల ఆస్తుల మరియు సంపత్తి క్రమతః సంఘమునందును, ఆ ప్రావిన్సు స్థానములోనున్న రాజ్యము నందును నిహితమై యుండును; మరియు

(బి) భారతదేశ అధినివేశ ప్రభుత్వము యొక్క మరియు ప్రతి గవర్నరు ప్రావిన్సు ప్రభుత్వము యొక్క సకల హక్కులు, దాయిత్వములు మరియు బాధ్యతలు, అవి ఏదేని కాంట్రాక్టు నుండి ఉత్పన్నమైనవైనను, అన్యథా ఉత్పన్నమైనవైనను, క్రమశ: భారత ప్రభుత్వము యొక్క మరియు ప్రావిన్సు స్థానములో నున్న ప్రతిరాజ్య ప్రభుత్వము యొక్క హక్కులు, దాయిత్వములు మరియు బాధ్యతలు అయియుండును.

**ఆస్తులకు, సంపత్తికి, హక్కులకు, దాయిత్వములకు మరియు బాధ్యతలకు ఇతర సందర్భములలో ఉత్తరాధికారము.**

295. (1) ఈ సంవిధాన ప్రారంభము నుండి:–

(ఎ) ఒకటవ అనుసూచి యొక్క భాగము 'బి' యందు నిర్దిష్టపరచబడిన ఏదేని రాజ్యము స్థానములో బట్టి ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము ఇండియాలో ఉండిన ఏదేని రాజ్యమునందు నిహితమై యుండిన సకల ఆస్తులు, మరియు సంపత్తి, అవి అట్టి ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము ఏ ప్రయోజనముల కొరకు కలిగియుండబడెనో ఆ ప్రయోజనములు అటు తరువాత సంఘ సూచిలో పేర్కొనబడిన విషయములకు సంబంధించినవైన సంఘ ప్రయోజనములగుచో, ఆ విషయమై భారత ప్రభుత్వము ఆ రాజ్యము యొక్క ప్రభుత్వముతో చేసుకొనిన ఏదేని కరారుకు అధ్యధీనమై, సంఘమునందు నిహితమై యుండును; మరియు

(బి) ఒకటవ అనుసూచి యొక్క భాగము 'బి' యందు నిర్దిష్టపరచబడిన ఏదేని రాజ్యము స్థానములో నుండిన ఇండియాలోని ఏదేని రాజ్యము యొక్క సకల హక్కులు, దాయిత్వములు మరియు బాధ్యతలు అవి కాంట్రాక్టు నుండి ఉత్పన్నమైనవైన లేక అన్యథా ఉత్పన్నమైనవైనను అట్టి ప్రారంభమునకు పూర్వము ఏ ప్రయోజనముల కొరకు అట్టి హక్కులు ఆర్జించబడినవో, లేక అట్టి దాయిత్వములుగాని, బాధ్యతలుగాని చేసికొనబడినవో,

ఆ ప్రయోజనములు అటు తరువాత సంఘ సూచిలో పేర్కొనబడిన విషయములలో దేనికైనను సంబంధించినవైన భారత ప్రభుత్వ ప్రయోజనములగుచో, ఆ విషయమై భారత ప్రభుత్వము ఆ రాజ్య ప్రభుత్వముతో చేసికొనిన ఏదేని కరారుకు లోబడి భారత ప్రభుత్వము యొక్క హక్కులు, దాయిత్వములు మరియు బాధ్యతలు అయి యుండును.

(2) పైన చెప్పబడిన వాటికి అధ్యధీనమై ఖండము (1)లో నిర్ధేశింపబడినవి మినహా, ఇతరమైన సకల ఆస్తులు, సంపత్తి, హక్కులు, దాయిత్వములు మరియు బాధ్యతల విషయమున అవి కాంట్రాక్టు నుండి ఉత్పన్నమైనవైనను, అన్యథా ఉత్పన్నమైనవైనను ఒకటవ అనుసూచి యొక్క భాగము 'బీ' యందు నిర్దిష్టపరచబడిన ప్రతి రాజ్యము యొక్క ప్రభుత్వము ఆ రాజ్యము స్థానములో నుండి ఇండియాలోని రాజ్యము యొక్క ప్రభుత్వమునకు ఈ సంవిధాన ప్రారంభము నుండి ఉత్తరాధికారియై యుండును.

**రాజ్యగామిత్వము లేక వ్యవగమనము లేక స్వామి హీనత్వముచే ప్రాప్తమైన ఆస్తి.**

296. ఇటు పిమ్మట ఇందు నిబంధింపబడిన వాటికి అధ్యధీనమై, భారతదేశ రాజ్య క్షేత్రములోని ఏదేని ఆస్తి, ఈ సంవిధానము అమలులోనికి రాకుండినచో రాజగామిత్వము వలనగాని, వ్యవగమనము వలనగాని హక్కు గల స్వామి లేకుండుటచే కలిగిన స్వామిహీనత్వము వలనగాని, సామ్రాట్టుకు లేక ఎవరేని ఇండియా రాజ్యాధీశునకు ప్రాప్తించి యుండెడిదైనచో ఆ ఆస్తి ఏదైన రాజ్యములో స్థితమై యున్నచో ఆ రాజ్యమునందును, ఇతర సందర్భములో సంఘమునందును నిహితము కావలెను:

అయితే ఏదేని ఆస్తి సామ్రాట్టునకు లేక ఇండియా రాజ్యధీశునకు అట్లు ప్రాప్తించియుండెడి తేదీన భారత ప్రభుత్వము యొక్క, లేక ఒక రాజ్య ప్రభుత్వము యొక్క స్వాధీనములో, లేక నియంత్రణలో ఉండినచో, అది అప్పుడు ఉపయోగించబడిన, లేక కలిగి యుండబడిన ప్రయోజనములు సంఘము యొక్క ప్రయోజనములైనచో సంఘమునందును, రాజ్యము యొక్క ప్రయోజనములైనచో రాజ్యమునందను నిహితము కావలెను.

**విశదీకరణ:–** ఈ అనుచ్ఛేదములో ''రాజ్యాధీశుడు'' మరియు ''ఇండియాలోని రాజ్యము'' అను పదములు 363వ అనుచ్ఛేదములో వాటికి ఏ అర్థములుగలవో ఆ అర్థములనే కలిగి యుండును.

[1][297. (1) భారత దేశపు జలప్రాంగణములలో లేక మహాద్వీపీయ విధానములో సముద్రములో గల లేక అనన్య ఆర్థిక పరిధిలో గల అన్ని భూములు, ఖనిజములు మరియు ఇతర విలువైన వస్తువులు సంఘము నందు నిహితమగును, వాటిని సంఘ ప్రయోజనముల కొరకు కలిగియుండవలెను.

**జల ప్రాంగణములు లేక మహాద్వీపీయ విధానములో గల విలువైన వస్తువులు మరియు అనన్య ఆర్థిక పరిధిలోని వనరులు సంఘము నందు నిహితమగుట.**

(2) భారతదేశపు అనన్య ఆర్థిక పరిధిలోని ఇతర వనరులన్నియు కూడ సంఘమునందు నిహితమగును, వాటిని సంఘ ప్రయోజనముల కొరకు కలిగియుండవలెను.

(3) భారతదేశపు జలప్రాంగణములు, మహాద్వీపీయ విధానము, అనన్య ఆర్థిక పరిధి మరియు ఇతర సముద్ర మండలముల హద్దులు, పార్లమెంటుచే ఆయా సమయములందు చేయబడు శాసనము ద్వారా లేక దాని క్రింద నిర్దిష్ట పరచబడునట్టివై యుండును.]

[2][298. సంఘము యొక్కయు, ప్రతి రాజ్యము యొక్కయు కార్యపాలకాధికారములో, ఏదేని వ్యాపారమును, లేక వర్తకమును సాగించుటయు, ఆస్తిని ఆర్జించుటయ, కలిగియుండుటయు, మరియు వ్యయనము చేయుటయు మరియు ఏదైన ప్రయోజనము కొరకు కాంట్రాక్టులను చేయుటయు చేరియుండును:

**వ్యాపారము మొదలగునవి సాగించుటకు అధికారము.**

అయితే:–

(ఎ) పార్లమెంటు అట్టి వ్యాపారము, లేక వర్తకము లేక అట్టి ప్రయోజనము విషయమున శాసనములను చేయరాని మేరకు సంఘము యొక్క సదరు కార్యపాలకాధికారము, ప్రతి రాజ్యములోను ఆ రాజ్యము యొక్క శాసన నిర్మాణమునకు అధ్యధీనమై యుండును, మరియు

(బి) రాజ్య శాసనమండలి, అట్టి వ్యాపారము లేక వర్తకము, లేక అట్టి ప్రయోజనము విషయమున శాసనములను చేయరాని మేరకు ప్రతి రాజ్యము యొక్క సదరు కార్యపాలకాధికారము పార్లమెంటు యొక్క శాసన నిర్మాణమునకు అధ్యధీనమై యుండును.]

299. (1) సంఘము యొక్క లేక ఒక రాజ్యము యొక్క కార్యపాలకాధికారమును వినియోగించుచు చేయబడిన కాంట్రాక్టులన్నియు, రాష్ట్రపతిచే లేక సందర్భానుసారముగా, రాజ్య గవర్నరుచే [3][* * * *] చేయబడినట్లు అభివ్యక్త పరచబడవలెను, మరియు ఆ అధికారమును

**కాంట్రాక్టులు.**

---

1. సంవిధాన (నలుబయ్యవ సవరణ) చట్టము, 1976 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 27.5.1976 నుండి 297వ అనుచ్ఛేదమునకు బదులుగా ఉంచబడినది.
2. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 20వ పరిచ్ఛేదము ద్వారా 298వ అనుచ్ఛేదమునకు బదులుగా ఉంచబడినది.
3. అదే చట్టపు 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజ్‌ప్రముఖ్'' అను పదములు వదిలివేయబడినవి.

వినియోగించుచు చేయబడిన కాంట్రాక్టులన్నియును, ఆస్తి హస్తాంతరణ పత్రములన్నియును, రాష్ట్రపతి తరుపున లేక గవర్నరు [2][* * * *] తరపున, ఆయన ఆదేశించు లేక ప్రాధికారము నొసగు వ్యక్తులచే మరియు అట్టి రీతిలో వ్రాసి ఈయబడవలెను.

(2) ఈ సంవిధానపు ప్రయోజనములు కొరకు, లేక ఇంతకు పూర్వము అమలులోనున్న భారత ప్రభుత్వమునకు చెందిన ఏదేని చట్టము నిమిత్తము చేయబడిన, లేక వ్రాసి ఈయబడిన ఏదేని కాంట్రాక్టు, లేక హస్తాంతరణ పత్రముల (హామీల) విషయములలో, రాష్ట్రపతి గాని, గవర్నరు గాని [1][* * **] వ్యక్తిగతముగా బాధ్యుడు కారాదు మరియు వారిలో ఎవరి తరపుననైనను అట్టి కాంట్రాక్టును లేక హస్తాంతరణ పత్రమును చేయు, లేక వ్రాసియిచ్చు ఏ వ్యక్తిగాని, దాని విషయములో వ్యక్తిగతముగ బాధ్యుడు కాడు.

**దావాలు మరియు చర్యలు.**

300. (1) భారతదేశ సంఘము పేరున భారత ప్రభుత్వము దావా వేయవచ్చును లేక ఆ పేరున ఆ ప్రభుత్వము పై దావా వేయబడవచ్చును: మరియు ఒక రాజ్యము పేరున ఆ రాజ్య ప్రభుత్వము దావా వేయవచ్చును లేక ఆ పేరున ఆ ప్రభుత్వము పై దావా వేయబడవచ్చును; మరియు ఈ సంవిధానము ద్వారా ప్రదత్తమైన అధికారములను పురస్కరించుకొని పార్లమెంటుచే లేక అట్టి రాజ్య శాసనమండలిచే అనుశాసింపబడిన చట్టము ద్వారా చేయబడు నిబంధనలకు అధ్యధీనమై ఆయా ప్రభుత్వముల వ్యవహారములకు సంబంధించి, ఈ సంవిధానము అధిశాసించబడకుండినచో తాదృశ విషయములలో భారత అధినివేశము, మరియు అట్టి రాజ్యము స్థానములో నుండిన ప్రావిన్సులు లేక ఇండియాలోని రాజ్యము ఎట్లు దావా వేసియుండెడివో లేక వాని పై ఎట్లు దావా వేయబడియుండెడిదో, అట్లే అవి దావా వేయవచ్చును, లేక వానిపై దావా వేయబడవచ్చును.

(2) ఈ సంవిధాన ప్రారంభమున

(ఎ) భారతదేశ అధినివేశనము ఒక పక్షముగా నున్న శాసనబద్ధ చర్య ఏదైనా జరుగుచున్నచో, ఆ చర్యలో అధినివేశనముకు బదులు భారతదేశ సంఘము ఉంచబడినట్లు భావింపబడవలెను; మరియు

(బి) ఏదేని ప్రావిన్సు లేక ఇండియాలోని రాజ్యము ఒక పక్షముగానున్న శాసనబద్ధ చర్య ఏదైనా జరుగుచున్నచో, ఆ చర్యలో ఆ ప్రావిన్సుకు, లేక ఆ ఇండియాలోని రాజ్యమునకు బదులు దాని స్థానములో నున్న రాజ్యము ఉంచబడినట్లు భావించబడవలెను.

## [2][**అధ్యాయము – 4**
## **ఆస్తి హక్కు**

**శాసన ప్రాధికారము ద్వారా తప్ప వ్యక్తుల ఆస్తి హరించ బడకుండుట.**

300ఏ. ఏ వ్యక్తి యొక్క ఆస్తి గాని శాసన ప్రాధికారము ద్వారా తప్ప హరించబడరాదు.]

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజప్రముఖ్'' అనుపదములు రద్దు చేయబడినవి.
2. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 34వ పరిచ్ఛేదము ద్వారా 20.6.1979 నుండి చొప్పించబడినది.

## భాగము – 13
## భారత రాజ్య క్షేత్రములోపల వ్యాపారము, వాణిజ్యము మరియు సంసర్గము

301. ఈ భాగము యొక్క ఇతర నిబంధనలకు అధ్యధీనమై, భారత రాజ్యక్షేత్రము నందంతటను వ్యాపారము, వాణిజ్యము మరియు సంసర్గము స్వేచ్ఛాయుతముగా నుండవలెను.

**వ్యాపారము, వాణిజ్య సంసర్గములలో స్వేచ్ఛ.**

302. ఒక రాజ్యమునకు మరొక రాజ్యమునకు మధ్య లేక భారత రాజ్యక్షేత్రములో ఏ భాగమునందైనను వ్యాపారము, వాణిజ్యము మరియు సంసర్గముల స్వేచ్ఛపై ప్రజాహితమున కావశ్యమగునట్టి నిర్బంధనలను పార్లమెంటు శాసనము ద్వారా విధించవచ్చును.

**వ్యాపారము, వాణిజ్య సంసర్గములపై నిర్బంధనలు విధించుటకు పార్లమెంటుకు గల అధికారము.**

303. (1) 302వ అనుచ్ఛేదములో ఏమి యున్నప్పటికిని, పార్లమెంటుగాని, రాజ్యశాసన మండలిగాని, ఏడవ అనుసూచిలోని ఏదేని సూచీలలో వ్యాపారమునకు, వాణిజ్యమునకు సంబంధించిన ఏదేని నమోదును బట్టి ఒక రాజ్యమునకు మరొక రాజ్యము కన్న ఏదేని అధిగణ్యతనిచ్చు లేక యిచ్చుటకు ప్రాధికారము నొసగు లేక ఒక రాజ్యమునకు మరొక రాజ్యమునకు మధ్య ఏదేని విచక్షణ చేయు లేక చేయుటకు ప్రాధికారము నొసగు ఏ శాసనమును చేయుటకును అధికారము కలిగియుండరాదు.

**వ్యాపార, వాణిజ్యముల విషయమున సంఘము, రాజ్యముల యొక్కయు శాసన నిర్మాణాధికారములపై నిర్బంధనలు.**

(2) భారత రాజక్షేత్రములో ఏదేని భాగమునందు సరుకుల కొరత వలన ఉత్పన్నమగు పరిస్థితిని ఎదుర్కొను నిమిత్తము ఏదేని అధిగణ్యత నిచ్చు, లేక యిచ్చుటకు ప్రాధికారము నొసగు లేక ఏదేని విచక్షణ చేయు లేక చేయుటకు ప్రాధికారము నొసగు ఏదేని శాసనమును చేయుట ఆవశ్యకమని అట్టి శాసనముచే ప్రఖ్యానించబడినచో, ఖండము (1)లో నున్న దేదియు అట్టి శాసనమును చేయుట నుండి పార్లమెంటును నివారించదు.

304. 301వ లేక 303వ అనుచ్ఛేదములో ఏమియున్నప్పటికిని ఒక రాజ్య శాసనమండలి, శాసనము ద్వారా:–

**రాజ్యముల మధ్య వ్యాపార, వాణిజ్య, సంసర్గములపై నిర్బంధనలు.**

(ఎ) ఇతర రాజ్యముల [1][లేక సంఘ రాజ్యక్షేత్రముల] నుండి ఆ రాజ్యమునకు దిగుమతియగు సరుకులపై, ఆ రాజ్యమునందు తయారు చేయబడు లేక ఉత్పత్తి చేయబడు తత్ సదృశమగు సరుకులపై విధించబడుచున్న పన్నును, అట్లు దిగుమతి చేయబడు సరుకులకు మరియు అట్లు తయారు చేయబడు లేక ఉత్పత్తి చేయబడు సరుకులకు మధ్య విచక్షణ చేయకుండునట్లు విధించవచ్చును; మరియు

(బి) ఆ రాజ్యముతో, లేక రాజ్యమునందు వ్యాపారము లేక సంసర్గముల స్వేచ్ఛపై ప్రజాహితమునకై ఆవశ్యకమగు యుక్తమైన నిర్బంధనలను విధించవచ్చును:

అయితే ఖండము (బి) నిమిత్తము ఏ బిల్లుగాని, ఏ సవరణ గాని, రాష్ట్రపతి యొక్క పూర్వ మంజూరీ లేకుండ ఏ రాజ్య శాసన మండలియందైనను ప్రవేశ పెట్టబడరాదు లేక ప్రస్తావించబడరాదు.

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా 01.11.1956 నుండి చొప్పించబడినది.

[1][305. 301వ మరియు 303వ అనుచ్ఛేదములో నున్న దేదియు, రాష్ట్రపతి ఉత్తరువుల ద్వారా అన్యథా ఆదేశించునంత మేరకు తప్ప, అస్తిత్వములో నున్న ఏ శాసనము యొక్క నిబంధనలకును భంగము కలిగించదు మరియు 301వ అనుచ్ఛేదములో నున్నదేదియు, 19వ అనుచ్ఛేదము యొక్క ఖండము (6), ఉప-ఖండము (ii)లో నిర్దేశించబడిన ఏదేని విషయమునకు సంబంధించియుండునంత మేరకు, సంవిధాన (నాల్గవ సవరణ) చట్టము, 1955 యొక్క ప్రారంభమునకు పూర్వము చేయబడిన ఏదేని శాసనము యొక్క అమలుకు భంగము కలిగించదు లేక అట్టి ఏదేని విషయమునకు సంబంధించిన ఏదేని శాసనమును చేయుట నుండి పార్లమెంటును లేక రాజ్యశాసన మండలిని నివారించదు.]

**అస్తిత్వములోనున్న శాసనముల యొక్కయు రాజ్య ఏకాధిపత్యము కొరకు నిబంధించు శాసనముల యొక్కయు వ్యావృత్తి.**

306. [వర్తకము మరియు వాణిజ్యముపై పరిమితులు విధించుటకు మొదటి అనుసూచి యొక్క భాగము–బీ లోని కొన్ని రాజ్యములకు అధికారము.] సంవిదాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా 01.11.1956 నుండి లుప్తము చేయబడినది.

307. పార్లమెంటు 301, 302, 303 మరియు 304వ అనుచ్ఛేదముల ప్రయోజనములను నెరవేర్చుటకు సముచితమని తాను తలచునట్టి ప్రాధికారిని శాసనము ద్వారా నియమించవచ్చును, మరియు ఆవశ్యకమని తాను తలచునట్టి అధికారములను, కర్తవ్యములను, అట్లు నియమించబడిన ప్రాధికారికి ప్రదత్తము చేయవచ్చును.

**301 నుండి 304 వరకు గల అనుచ్ఛేదముల ప్రయోజనములను నెరవేర్చుటకు ప్రాధికారి నియామకము.**

## భాగము – 14

## సంఘమునకు మరియు రాజ్యములకు అధీనమైన సేవా వర్గములు

### అధ్యాయము – 1 – సేవా వర్గములు

308. ఈ భాగములో, సందర్భము అన్యథా అపేక్షించిననే తప్ప, ‘‘రాజ్యము’’ [2][అను పదమునందు జమ్మూ కాశ్మీరు రాజ్యము చేరియుండదు.]

**అర్థాన్వయము.**

309. ఈ సంవిధాన నిబంధనలకు అధ్యధీనమై, సంఘము యొక్క లేక ఏదేని రాజ్యము యొక్క వ్యవహారములకు సంబంధించిన పబ్లికు సేవలోను, పదస్థానములలోను, నియమించబడిన వ్యక్తుల భర్తీని, మరియు వారి సేవా షరతులను, సముచిత శాసన మండలి యొక్క చట్టములు క్రమబద్ధము చేయవచ్చును:

**సంఘమునకు లేక రాజ్యమునకు సేవ చేయు వ్యక్తుల భర్తీ మరియు వారి సేవా షరతులు.**

---

1. సంవిధాన (నాలుగవ సవరణ) చట్టము, 1955 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా అనుచ్ఛేదము 305నకు బదులుగా 27.04.1955 నుండి ఉంచబడినది.
2. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ‘‘అనగా ఒకటవ అనుసూచి యొక్క భాగము–ఏ లేదా భాగము–బీ లో నిర్దిష్టపరచబడిన రాజ్యము అను పదములకు బదులు ఉంచబడినది.

అయితే ఈ అనుచ్ఛేదము క్రింద, సముచిత శాసన మండలి యొక్క చట్టము ద్వారా లేక చట్టము క్రింద, తద్విషయమున నిబంధన చేయబడు వరకు, సంఘము యొక్క వ్యవహారములకు సంబంధించిన సేవల మరియు పదస్థానముల విషయములో, రాష్ట్రపతి గాని, ఆయన ఆదేశించు వ్యక్తిగాని, మరియు రాజ్య వ్యవహారములకు సంబంధించిన సేవల మరియు పదస్థానముల విషయములో ఆ రాజ్య గవర్నరుగాని [1][* * *] ఆయన ఆదేశించు వ్యక్తిగాని, అట్టి సేవలలో, లేక పదస్థానములలో నియమించబడు వ్యక్తుల భర్తీని, మరియు వారి సేవా షరతులను క్రమబద్ధము చేయు నియమములను చేయుటకు సమర్థత కలిగియుండవలెను, మరియు అట్లు చేయబడిన ఏవేని నియమములు అట్టి ఏదేని చట్టము యొక్క నిబంధనలకు అధ్యధీనమై ప్రభావము కలిగియుండవలెను.

**సంఘమునకు లేక రాజ్యమునకు సేవ చేయు వ్యక్తుల పదవీ కాలము.**

310. (1) ఈ సంవిధానముచే అభివ్యక్తముగ నిబంధించబడినట్లు తప్ప, సంఘము యొక్క రక్షణ సేవయందు లేక సివిలు సేవయందు, లేక ఏదేని అఖిల భారత సేవయందు సభ్యుడైయున్న, లేక సంఘమున కధీనమైన రక్షకు సంబంధించిన ఏదేని పదస్థానమునందున్న లేక ఏదేని సివిలు పదస్థానమునందున్న ప్రతివ్యక్తియు, రాష్ట్రపతి అనుగ్రహముండునంత వరకు పదవియందుండ వలెను; మరియు రాజ్యము యొక్క సివిలు సేవయందు సభ్యుడైయున్న, లేక రాజ్యమున కధీనమైన సివిలు పదస్థానమునందున్న ప్రతి వ్యక్తియు, రాజ్య గవర్నరు [2][* * *] అనుగ్రహముండునంత వరకు పదవి యందుండవలెనా,

(2) సంఘమునకు, లేక రాజ్యమునకు అధీనమైన సివిలు ప్రదస్థానము నందున్న వ్యక్తి, ఆ పదస్థానములో సందర్భానుసారముగ, రాష్ట్రపతి యొక్క, లేక రాజ్య గవర్నరు యొక్క [3][* * *] అనుగ్రహముందునంత వరకు పదవి యందుండునప్పటికిని, విశేషార్హతలు గల ఒక వ్యక్తి యొక్క సేవలను పొందుటక ఆవశ్యకమని సందర్భానుసారముగ రాష్ట్రపతి, లేక గవర్నరు [2][* * *] భావించినందున, రక్షణ సేవయందుగాని, అఖిల భారత సేవయందుగాని సంఘము యొక్క లేక రాజ్యము యొక్క సివిలు సేవయందుగాని, సభ్యుడు కానట్టి ఎవరేని వ్యక్తి ఈ సంవిధానము క్రింది అట్టి పదవి యందు ఏదేని కాంట్రాక్టు ననుసరించి నియమించబడిన యెడల, కరారులో ఏర్పరచిన కాలావధి ముగియుక పూర్వమే ఆ పదస్థానము రద్దు చేయబడినచో, లేక అతని యొక్క ఏదేని చేడునడువడికి సంబంధించిన ఏవేని కారణములనుబట్టి అతడు పదస్థానమును ఖాళీ చేయవలెనని ఆపేక్షించ బడినచో, అతనికి నష్టపరిహారమును చెల్లించుటకు ఆ కాంట్రాక్టు ఏర్పాటు చేయవచ్చును.

---

1. అదే చట్టము యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజప్రముఖ్'' అను పదములు లుప్తము చేయబడినవి.
2. అదే చట్టము యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక సందార్భానుసారముగా రాజప్రముఖ్'' అను పదములు వదలివేయబడినవి.
3. అదే చట్టము యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజప్రముఖ్'' అను పదములు వదిలివేయబడినవి.

311. (1) సంఘము యొక్క సివిలు సేవలోగాని, అఖిలభారత సేవలోగాని, ఏదేని రాజ్యము యొక్క సివిలు సేవలోగాని సభ్యుడైయున్న లేక సంఘమునకు లేక ఏదేని రాజ్యమునకు అధీనమైన సివిలు పదస్థానమునందున్న ఏ వ్యక్తియు, అతడు ఏ ప్రాధికారిచే నియమించబడెనో ఆ ప్రాధికారికి అధీనస్థుడైన ప్రాధికారిచే బర్తరఫ్ చేయబడరాదు లేక తొలగించబడరాదు.

**సంఘము క్రింద లేక రాజ్యము క్రింద సివిలు హోదాలో నియమించబడిన వ్యక్తుల భర్తరవు, తొలగింపు లేక పదస్థాయి తగ్గింపు.**

[1][(2) పైన చెప్పబడిన ఎవరేని వ్యక్తిపై చేయబడిన ఆరోపణలను గూర్చి అతనికి తెలియజేయబడి, ఆ ఆరోపణ విషయమున ఆకర్ణించబడుటకు అతనికి యుక్తమైన అవకాశము ఈయబడి పరిశీలన జరుపబడిననే తప్ప [2][......] అతనిని బర్తరఫ్ చేయుట, తొలగించుట లేక అతని పదస్థాయి తగ్గించుట చేయరాదు:

[3][అయితే అట్టి పరిశీలన జరిపి పిమ్మట, అతనిపై ఏదేని అట్టి శాస్తిని విధించుటకు ప్రతిపాదించిన యెడల, అట్టి శాస్తిని ఆ పరిశీలనలో ఒసగబడిన సాక్ష్యము అధారముపై విధించవచ్చును మరియు ప్రతిపాదిత శాస్తిని గూర్చి విన్నవము చేసికొనుటకు అతనికి అవకాశము నొసగుట ఆవశ్యకము కాదు:

అంతేకాక ఈ ఖండము ఈ క్రింది సందర్భములో వర్తించదు–]

(ఎ) ఎవరేని వ్యక్తి యొక్క నడవడి క్రిమినలు ఆరోపణపై అతని నేర నిర్ణయమునకు దారితీసినందున అతడు బర్తరవు చేయబడిన యెడల లేక తొలగించబడిన యెడల లేక అతని పదస్థాయి తగ్గించబడిన యెడల; లేక

(బి) ఎవరేని వ్యక్తిని బర్తరవు చేయుటకు లేక తొలగించుటకు, లేక అతని పదస్థాయిని తగ్గించుటకు అధికారము గల ప్రాధికారి, ఆ ప్రాధికారిచే వ్రాసి యుంచబడవలసిన ఏవేని కారణములను బట్టి అట్టి పరిశీనలను జరుపుట సహేతుకముగా ఆచరణ సాధ్యము కాదని అభిప్రాయపడిన యెడల; లేక

(సి) రాజ్యము యొక్క భద్రతను కాపాడుట కొరకు అట్టి పరిశీలన జరుపకుండుట సముచితమని రాష్ట్రపతి లేక సందర్భానుసారముగా గవర్నరు అభిప్రాయపడిన యెడల;

(3) పైన చెప్పబడిన ఎవరేని వ్యక్తి విషయమున, ఖండము (2)లో నిర్దేశించబడినట్లు అట్టి పరిశీలన జరుపుట సహేతుకముగ ఆచరణ సాధ్యమగునా కాదాయను ప్రశ్న ఉత్పన్నమైనచో, దానిపై అట్టి వ్యక్తిని బర్తరఫ్ చేయుటకు లేక తొలగించుటకు లేక అతని పదస్థాయిని తగ్గించుటకు అధికారము గల ప్రాధికారి నిర్ణయము, అంతిమమై యుండును.]

312. (1) [1][భాగము 6 యొక్క అధ్యాయము 6లో లేక భాగము 11లో] ఏమియున్నప్పటికిని, సంఘమునకును, రాజ్యములకును, ఉమ్మడిగా చెందు ఒక, అంతకు మించిన [2][అఖిల భారత

**అఖిల భారత సేవా వర్గములు.**

---

1. సంవిధాన (పదునైదవ సవరణ) చట్టము, 1963 యొక్క 10వ పరిచ్ఛేదవు ఖండము (2) మరియు (3)కు బదులుగా ఉంచబడినది.
2. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 44వ పరిచ్ఛేదము యొక్క ఖండము (ఎ) ద్వారా కొన్ని పదములు 3.1.1977 నుండి వదలివేయబడినవి.
3. అదే చట్టపు 44వ పరిచ్ఛేదము ద్వారా కొన్ని పదములకు బదులుగా 3.1.1977 నుండి ఉంచబడినవి.

న్యాయిక సేవా వర్గములతో సహా] అఖిల భారత సేవా వర్గములను నెలకొల్పుట జాతీయ హితమునకై ఆవశ్యకమని, లేక సముచితమని రాజ్యసభ. హాజరై ఓటు చేయు సభ్యులలో మూడింట రెండు వంతులకు తక్కువకాని వారిచే బలపరచబడిన తీర్మానము ద్వారా ప్రఖ్యానించినచో, పార్లమెంటు శాసనము ద్వారా అట్లు నిబంధనలు చేయవచ్చును మరియు ఈ అధ్యాయము యొక్క ఇతర నిబంధనలకు అధ్యధీనమై, అట్టి ఏదేని సేవా వర్గములో నియమించబడు వ్యక్తుల యొక్క భర్తీని, మరియు వారి సేవా షరతులను క్రమబద్ధము చేయవచ్చును.

(2) ఈ సంవిధాన ప్రారంభమున భారతీయ పరిపాలక సేవా వర్గమనియు, భారతీయ పోలీసు సేవావర్గమనియు, అనబడుచుండిన సేవా వర్గము ఈ అనుచ్ఛేదము క్రింద పార్లమెంటుచే నెలకొల్పబడిన సేవా వర్గములుగా భావించబడవలెను.

[3][(3) ఖండము (1)లో నిర్దేశించబడిన అఖిల భారత న్యాయిక సేవా వర్గములో, 236వ అనుచ్ఛేదములో నిర్వచించబడిన జిల్లా న్యాయాధీశుని కంటె క్రిందిదైన పదస్థానమేదియు చేరియుండదు.

(4) పైన చెప్పబడిన అఖిల భారత న్యాయిక సేవావర్గమును నెలకొల్పుటకై నిబంధనచేయు శాసనములో ఆ శాసనము యొక్క నిబంధనలను అమలుపరచుటకు ఆవశ్యకమగునట్టి నిబంధనలు, భాగము 6లోని అధ్యాయము 6ను సవరించుటకైనపై ఉండవచ్చును మరియు 368వ అనుచ్ఛేదము కొరకు అట్టి శాసనము దేనినిగాని సంవిధానము యొక్క సవరణయైనట్లు భావించరాదు.]

[4][312ఏ. (1) పార్లమెంటు శాసనము ద్వారా,–

**కొన్ని సేవా వర్గముల లోని అధికారుల సేవా షరతులను మార్చుటకు లేక ప్రతి సంహరించుటకు పార్లమెంటుకు గల అధికారము.**

(ఎ) ఈ సంవిధాన ప్రారంభమునకు పూర్వము సెక్రటరీ ఆఫ్ స్టేట్‌చే లేక సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఇన్ కౌన్సిలుచే ఇండియాలో క్రౌన్ యొక్క సివిలు సేవా వర్గములో నియమించబడియుండి, సంవిధాన (ఇరువది ఎనిమిదవ సవరణ) చట్టము, 1972 ప్రారంభమున, మరియు అటు తరువాత ఏదేని సేవా వర్గములో లేక పదస్థానములో భారత ప్రభుత్వమునకు లేక రాజ్య ప్రభుత్వమునకు సేవ చేయుచున్న వ్యక్తుల యొక్క ప్రతిమూల్యము, సెలవు మరియు పింఛనును గూర్చిన సేవా షరతులను, మరియు క్రమశిక్షణను గూర్చిన హక్కులను, భావికాలిక ప్రభావముతోనైన లేక గత కాలిక ప్రభావముతోనైన మార్చవచ్చును లేక ప్రతి సంహరించవచ్చును.

(బి) ఈ సంవిధాన ప్రారంభమునకు పూర్వము సెక్రటరీ ఆఫ్ స్టేట్‌చే, లేక సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఇన్ కౌన్సిలుచే, ఇండియాలో క్రౌను యొక్క సివిలు సేవా వర్గములో

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 45వ పరిచ్ఛేదము ద్వారా ''భాగము–11''కు బదులుగా ఉంచబడినది.
2. అదే చట్టము యొక్క 45వ పరిచ్ఛేదము ద్వారా 3.1.1977 నుండి చొప్పించబడినది.
3. అదే చట్టము యొక్క 45వ పరిచ్ఛేదము ద్వారా 3.1.1977 నుండి చొప్పించబడినది.
4. సంవిధాన (ఇరువది ఎనిమిదవ సవరణ) చట్టము, 1972 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 29.8.1972 నుండి చొప్పించబడినది.

నియమించబడియుండి, సంవిధాన (ఇరువది ఎనిమిదవ సవరణ) చట్టము, 1972 ప్రారంభమునకు పూర్వము ఎప్పుడైనను, పదవిని విరమించిన లేక అన్యథా సేవా వర్గములో ఉండకుండ పోయిన, వ్యక్తుల యొక్క పింఛను గూర్చిన సేవా షరతులను, భావికాలిక ప్రభావముతోనైన లేక గతకాలిక ప్రభావముతోనైన మార్చవచ్చును లేక ప్రతి సంహరించవచ్చును:

అయితే సర్వోన్నత న్యాయస్థానము యొక్క లేక ఉన్నత న్యాయస్థానము యొక్క ముఖ్య న్యాయమూర్తి, లేక ఇతర న్యాయధీశుని పదవి యందును, భారత కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు పదవియందును సంఘ లేక రాజ్య పబ్లికు సేవా కమీషను అధ్యక్షుని లేక ఇతర సభ్యుని పదవియందును, లేక ఎన్నికల ముఖ్య కమీషనరు పదవియందును ఉన్న లేక ఆ పదవియందు ఉండిన, ఏ వ్యక్తి విషయములోనైనను, అట్టి పదవిలో అతడు నియమించబడిన పిమ్మట, సెక్రటరీ ఆఫ్ స్టేట్ చే, లేక సెక్రటరీ ఆఫ్ స్టేట్ ఇన్ కౌన్సిలుచే, ఇండియాలో క్రౌను యొక్క సివిలు సేవావర్గములో ఆ వ్యక్తి నియమించబడిన కారణముగ అతనికి వర్తించదగియుండెడి, సేవా షరతుల మేరకు తప్ప, అతని సేవా షరతులను అతనికి అనుకూలముగ మార్చుటకు, లేక ప్రతి సంహరించుటకు, ఉపఖండము (ఎ) లేక (బి)లో నున్నదేదియు పార్లమెంటుకు అధికార మొసగునదిగ అన్వయించబడరాదు.

(2) ఈ అనుచ్ఛేదము క్రింద శాసనము ద్వారా పార్లమెంటుచే నిబంధించబడినంత మేరకు తప్ప ఖండము (1)లో నిర్దేశించబడిన వ్యక్తుల సేవా షరతులను క్రమబద్ధము చేయుటకై ఈ సంవిధానము యొక్క ఏదేని ఇతర నిబంధన క్రింద, ఏదేని శాసన మండలి లేక ఇతర ప్రాధికారి యొక్క అధికారమునకు, ఈ అనుచ్ఛేదములో నున్న దేదియు భంగము కలిగించరాదు.

(3) సర్వోన్నత న్యాయస్థానముగాని, ఏదేని ఇతర న్యాయస్థానముగాని, ఈ క్రింది విషయములలో అధికారిత కలిగియుండరాదు:-

(ఎ) ఖండము (1)లో నిర్దేశించబడిన ఎవరేని వ్యక్తిచే చేయబడిన, లేక అతనిచే వ్రాసి ఈయబడిన ఏదేని ఒప్పందము, కరారు, లేక తాదృశమైన ఇతర పత్రము యొక్క ఏదేని నిబంధన నుండి, లేక దానిపై చేయబడిన ఏదేని పృష్టాంకనము నుండి ఉత్పన్నమగు లేక ఇండియాలోని క్రౌను యొక్క ఏదేని సివిలు సేవావర్గములో అతని నియామకమునకు సంబంధించి లేక భారతదేశ అధినివేశము యొక్క లేక దాని ప్రావిన్సు యొక్క ప్రభుత్వమునకు అధీనమైన సేవావర్గములో అతడు కొనసాగుటకు సంబంధించి ఆ వ్యక్తికి జారీ చేయబడిన ఏదేని జాబు (లేఖ) ద్వారా ఉత్పన్నమగు ఏదేని వివాదము;

(బి) ఆదిలో అధిశాసించబడినట్లుగా 314వ అనుచ్ఛేదము క్రింద ఏదేని హక్కు, దాయిత్వము, లేక బాధ్యత విషయమున గల ఏదైన వివాదము.

(4) ఆదిలో అధిశాసించబడినట్లుగా 314వ అనుచ్ఛేదములో గాని, ఈ సంవిధానము యొక్క ఏదేని ఇతర నిబంధనలోగాని, ఏమి యున్నప్పటికిని, ఈ అనుచ్ఛేదము యొక్క నిబంధనలు, ప్రభావము కలిగి యుండవలెను.]

313. ఈ సంవిధానము క్రింద తద్విషయమైన ఇతర నిబంధన చేయబడు వరకు, ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము అమలులో నుండినట్టియు ఈ సంవిధాన ప్రారంభమునకు తరువాత అఖిల భారత సేవా వర్గముగా గాని సంఘమునకు లేక ఏదేని రాజ్యమునకధీనమైన సేవా వర్గముగా గాని, పదస్థానముగా గాని, కొనసాగుచున్న ఏదేని పబ్లికు సేవా వర్గమునకు, లేక పదస్థానమునకు వర్తించదగినట్టివియు అగు అన్ని శాసనములను, ఈ సంవిధాన నిబంధనలకు అవి సుసంగతమైనంత వరకు, అమలులో కొనసాగవలెను. **సంధికాలిక నిబంధనలు.**

314. కొన్ని సేవల యొక్క అస్తిత్వపు అధికారుల రక్షణకు నిబంధన సంవిధాన (ఇరువది ఎనిమిదవ సవరణ) చట్టము, 1972 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా (29.08.1972 నుండి) లుప్తము చేయబడినది. **కొన్ని సేవల యొక్క అస్తిత్వపు అధికారుల రక్షణకు నిబంధన.**

## అధ్యాయము – 2 – పబ్లికు సేవా కమీషనులు

315. (1) ఈ అనుచ్ఛేదము యొక్క నిబంధనలకు అధ్యధీనమై సంఘమునకు ఒక పబ్లికు సేవా కమీషను మరియు ఒక్కొక్క రాజ్యమునకు ఒక్కొక్క పబ్లిక్ సేవా కమీషను ఉండవలెను. **సంఘమునకు మరియు రాజ్యములకు పబ్లికు సేవా కమీషనులు.**

(2) రెండు లేక అంతకెక్కువ రాజ్యములు, ఆ రాజ్య సముదాయమునకు ఒకే పబ్లికు సేవా కమీషను ఉండవలెనని ఒప్పుకొనవచ్చును మరియు ఆ రాజ్యములలోని ప్రతి యొక్క రాజ్య శాసనమండలి యొక్క సదనముచే లేక రెండు సదనములున్నచో ఆ సదనములలో ప్రతి సదనముచే అందుకై తీర్మానము పాస్ చేయబడినచో పార్లమెంటు శాసనము ద్వారా, ఆ రాజ్యముల అక్కరలను తీర్చుటకుగాను (ఈ అధ్యాయములో సంయుక్త కమీషను అని నిర్దేశించబడిన) ఒక సంయుక్త రాజ్య పబ్లికు సేవా కమీషనును నియమించుటకు నిబంధనలను చేయవచ్చును.

(3) పైన చెప్పబడినట్టి ఏదేని శాసనము, దాని ప్రయోజనములను నెరవేర్చుటకు ఆవశ్యకమైన, లేక వాంఛనీయమైన ఆనుషంగిక మరియు పారిణామిక నిబంధలను కలిగియుండవచ్చును.

(4) ఒక రాజ్యము యొక్క అక్కరులన్నింటిని లేక వాటిలో వేటినైనను తీర్చుటకు ఆ రాజ్య గవర్నరు [1][* * *] సంఘ పబ్లికు సేవా కమీషనును కోరినచో, ఆ కమీషను, రాష్ట్రపతి ఆమోదముతో అట్లు చేయుటకు అంగీకరించవచ్చును.

(5) సందర్భము అన్యథా అపేక్షించిననే తప్ప, ఈ సంవిధానములో సంఘ పబ్లికు సేవా కమీషనును, లేక రాజ్య పబ్లికు సేవా కమీషనును గూర్చిన నిర్దేశములు, ప్రసక్తిలోనున్న ప్రత్యేక విషయమునకు సంబంధించి సందర్భానుసారముగ, సంఘము యొక్క, లేక రాజ్యము యొక్క అక్కరులను తీర్చుచున్న కమీషనును గూర్చిన నిర్దేశములుగా అన్వయించబడవలెను.

316. (1) పబ్లికు సేవా కమీషనును అధ్యక్షుడు, మరియు ఇతర సభ్యులు, సంఘ కమీషను లేక సంయుక్త కమీషను విషయములో రాష్ట్రపతిచే రాజ్య కమీషను విషయములో రాజ్య గవర్నరు [1][* * *]చే నియమింపబడవలెను: **సభ్యుల నియామకము, మరియు వారి పదావధి.**

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజముఖ్'' అను పదములు వదిలివేయబడినవి.

అయితే ప్రతి పబ్లికు సేవా కమీషను సభ్యులలోను వీలైనంత దగ్గర సంఖ్యలో సగము మంది వారివారి నియామకముల తేదీ నాటికి భారత ప్రభుత్వము క్రింద గాని, ఏదేని రాజ్య ప్రభుత్వము క్రిందగాని, కనీసము పది సంవత్సరముల పాటు పదవియందుండిన వ్యక్తులై యుండవలెను, మరియు పది సంవత్సరముల కాలావధిని లెక్కకట్టుటలో ఈ సంవిధాన ప్రారంభమునకు పూర్వము ఇండియాలోని క్రౌన్ క్రిందగాని ఏదేని ఇండియాలోని రాజ్య ప్రభుత్వము క్రిందగాని, పదవియందుండిన ఏదేని కాలావధి చేర్చబడును.

[1][(1ఏ) కమీషను యొక్క అధ్యక్షుని పదవి ఖాళీ అయినచో లేక హాజరులోలేని కారణమునగాని, ఏదేని ఇతర కారణమునగాని అట్టి అధ్యక్షుడెవరైన తన పదవీ కర్తవ్యములను నిర్వర్తింపజాలనిచో, ఖాళీ అయిన పదవిలో ఖండము (1) క్రింద ఎవరేని వ్యక్తి నియమింపబడి దాని కర్తవ్యములను చేపట్టువరకు లేక సందర్భానుసారముగ, అధ్యక్షుడు తన కర్తవ్యములను పునర్ గ్రహించు వరకు, సంఘ కమీషను లేక సంయుక్త కమీషను విషయములో రాష్ట్రపతిచే, రాజ్య కమీషను విషయములో గవర్నరుచే, ఆ కమీషను యొక్క ఇతర సభ్యులలో నుండి అందునిమిత్తము నియమించబడిన సభ్యునిచే ఆ కర్తవ్యములు నిర్వర్తించబడవలెను.]

(2) ఒక పబ్లికు సేవా కమీషను సభ్యుడు అతని పదవిలో ప్రవేశించు తేదీ నుండి ఆరు సంవత్సరముల కాలావధి వరకును లేక సంఘ కమీషను విషయములో అతనికి అరువదియైదు సంవత్సరముల వయస్సు వచ్చు వరకును, మరియు రాజ్య కమీషను విషయములో లేక సంయుక్త కమీషను విషయములో అతనికి [2][అరువది రెండు సంవత్సరముల] వయస్సు వచ్చువరకును, వీనిలో ఏది ముందు జరుగునో అంతవరకు, పదవియందుండవలెను.

(ఎ) అయితే, ఒక పబ్లికు సేవా కమీషను సభ్యుడు, సంఘ కమీషను, లేక సంయుక్త కమీషను విషయములో రాష్ట్రపతికి, రాజ్య కమీషను విషయములో రాజ్య గవర్నరు [3][* * *] కు, తన చేవ్రాలుతో లేఖ వ్రాయుట ద్వారా తన పదవికి రాజీనామా ఇవ్వవచ్చును.

(బి) ఒక పబ్లికు సేవా కమీషను సభ్యుడు, 317వ అనుచ్ఛేదము యొక్క ఖండము(1)లో, లేక ఖండము (3)లో నిబంధింపబడిన రీతిలో పదవి నుండి తొలగించబడవచ్చును.

(3) ఒక పబ్లికు సేవా కమీషను సభ్యుగా పదవియందున్న వ్యక్తి అతని పదవీ కాలము ముగిసిన పిమ్మట ఆ పదవిలో తిరిగి నియమించబడుటకు పాత్రుడు కాడు.

**పబ్లికు సేవా కమీషను సభ్యుని తొలిగింపు మరియు తాత్కాలిక నిలుపుదల.**

317. (1) ఖండము (3)లోని నిబంధనలకు అధ్యధీనమై, పబ్లికు సేవా కమీషను యొక్క అధ్యక్షుడు లేక ఎవరేని ఇతర సభ్యుడు, రాష్ట్రపతిచే సర్వోన్నత న్యాయస్థానమునకు చేయబడిన నిర్దేశముపై 145వ

1. సంవిధాన (పదిహేనవ సవరణ) చట్టము, 1963 యొక్క 11వ పరిచ్ఛేదము ద్వారా 05.10.1963 నుండి చొప్పించబడినది.
2. సంవిధాన (41వ సవరణ) చట్టము, 1975 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ''అరువది సంవత్సరములు'' అను పదములకు బదులు ''అరువది రెండు సంవత్సరములు'' అను పదములు ఉంచబడినవి.
3. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజప్రముఖ్'' అను పదములు వదలివేయబడినవి.

అనుచ్ఛేదము క్రింద తద్విషయమై విహితము చేయబడిన ప్రక్రియ ననుసరించి పరిశీలన జరుపబడి దుర్వర్తన ఆధారముపై ఆ అధ్యక్షుని లేక సందర్భానుసారముగ, అట్టి ఇతర సభ్యుని తొలగించదగునని ఆ న్యాయస్థానము రిపోర్టు చేసిన పిమ్మట మాత్రమే, అట్టి ఆధారముపై రాష్ట్రపతి ఉత్తరువు ద్వారా అతనిని పదవి నుండి తొలగించవలెను.

(2) సంఘ కమీషను, లేక సంయుక్త కమీషను విషయమున రాష్ట్రపతి మరియు రాజ్య కమీషను విషయమున గవర్నరు [1][* * *] ఎవరిని గూర్చి ఖండము (1) క్రింద సర్వోన్నత న్యాయస్థానమునకు నిర్దేశము చేయబడినదో ఆ కమీషను యొక్క అధ్యక్షుని, లేక ఇతర సభ్యుని, అట్టి నిర్దేశముపై సర్వోన్నత న్యాయస్థానము యొక్క రిపోర్టు అందిన మీదట రాష్ట్రపతి ఉత్తరువు నిచ్చు వరకు, పదవి నుండి సస్పెండు చేయవచ్చును.

(3) ఖండము (1)లో ఏమి యున్నప్పటికిని, రాష్ట్రపతి ఒక పబ్లికు సేవా కమీషను అధ్యక్షుడినైనను, ఇతర సభ్యుడినైనను ఈ క్రింది పరిస్థితులలో ఉత్తరువు ద్వారా పదవి నుండి తొలగించవచ్చును,-

(ఎ) అతడు దివాలాదారుని న్యాయనిర్ణయము చేయబడినచో; లేక

(బి) అతని పదావధిలో అతని పదవీ కర్తవ్యములకు చెందని ఏదేని వేతనికోద్యోగము నందు పని చేయుచో; లేక

(సి) రాష్ట్రపతి అభిప్రాయములో అతడు మానసిక, లేక శారీరక దౌర్బల్యము కారణముగ పదవిలో కొనసాగుటకు అయోగ్యుడైనచో.

(4) ఒక పబ్లికు సేవా కమీషను యొక్క అధ్యక్షుడు, లేక ఇతర సభ్యుడు, ఒక నిగమిత కంపెనీ సభ్యుడుగాను, ఆ కంపెనీ యొక్క ఇతర సభ్యులతో ఉమ్మడిగాను, లేక ఇతర విధముగా భారత ప్రభుత్వముచే లేక తరపున, లేక ఒక రాజ్య ప్రభుత్వముచే లేక ఆ ప్రభుత్వము తరపున చేయబడిన ఏదేని కాంట్రాక్టుతో లేక కరారుతో ఏ విధముగనైనను ఆ ప్రభుత్వము సంబంధము కలిగియున్నచో, లేక సంబంధము కలిగిన వాడగుచో, లేక దాని యందు అతనికి ఏదేని హితము ఉన్నచో లేక హితము కలుగుచో లేక దాని వలన వచ్చు లాభములో గాని, దాని నుండి ఉత్పన్నమగు ఏదేని మేలు లేక ఉపలబ్ధిలోగాని ఏ విధముగనైన అతడు పాల్గొనినచో, ఖండము (1) నిమిత్తము అతడు దుర్వర్తనా దోషిగా భావించబడవలెను.

**కమీషను సభ్యుల యొక్కయు, సిబ్బంది యొక్కయు సేవా షరతులను గూర్చి వినియమములు చేయు అధికారము.**

318. సంఘ కమీషను లేక సంయుక్త కమీషను విషయమున రాష్ట్రపతి, మరియు రాజ్య కమీషను విషయమున రాజ్య గవర్నరు, [1][* * *] వినియమముల ద్వారా

(ఎ) ఆ కమీషను యొక్క సభ్యుల సంఖ్యను, వారి సేవా షరతులను నిర్ధారణ చేయవచ్చును; మరియు

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజప్రముఖ్'' అను పదములు 01.11.1956 నుండి లుప్తము చేయబడినవి.

(బి) ఆ కమీషను సిబ్బంది యొక్క సభ్యుల సంఖ్యను గూర్చియు, వారి సేవా షరతులను గూర్చియు, నిబంధనలు చేయవచ్చును:

అయితే పబ్లికు సేవా కమీషను సభ్యుని సేవా షరతులు అతని నియామకము పిమ్మట అతనికి అననుకూలముగ మార్చబడరాదు.

319. పదవి యందుండకుండ పోయిన తరువాత–

**కమీషను సభ్యులు అట్టి సభ్యులుగా ఉండకుండ పోయిన తరవాత ఇతర పదవుల యందుండుటపై నిషేధము.**

(ఎ) సంఘ పబ్లికు సేవా కమీషను అధ్యక్షుడు భారత ప్రభుత్వము క్రింద లేక ఏదేని రాజ్య ప్రభుత్వము క్రింద మరొక ఉద్యోగము చేయుటకు పాత్రుడు కాడు.

(బి) ఒక రాజ్య పబ్లికు సేవా కమీషను అధ్యక్షుడు, సంఘ పబ్లికు సేవా కమీషను అధ్యక్షుడుగ లేక ఇతర సభ్యుడుగ లేక ఏదేని ఇతర రాజ్య పబ్లికు సేవా కమీషను అధ్యక్షుడుగ నియమించబడుటకు పాత్రుడై యుండును. కాని అతడు భారత ప్రభుత్వము క్రింద లేక ఏ రాజ్య ప్రభుత్వము క్రింద ఏ ఇతర ఉద్యోగమునకును పాత్రుడు కాడు.

(సి) సంఘ పబ్లికు సేవా కమీషను అధ్యక్షుడు మినహా ఇతర సభ్యుడు, సంఘ పబ్లికు సేవా కమీషను అధ్యక్షుడుగ లేక ఏదేని రాజ్య పబ్లికు సేవా కమీషను అధ్యక్షుడుగ, నియమించబడుటకు పాత్రుడై యుండును, కాని అతడు భారత ప్రభుత్వము క్రింద లేక రాజ్య ప్రభుత్వము క్రింద ఏ ఇతర ఉద్యోగమునకును పాత్రుడు కాడు.

(డి) ఒక రాజ్య పబ్లికు సేవా కమీషను అధ్యక్షుడు మినహా ఇతర సభ్యుడు, సంఘ పబ్లికు సేవా కమీషను అధ్యక్షుడుగ లేక సభ్యుడుగ లేక రాజ్య, ఏదేని ఇతర రాజ్య పబ్లికు సేవా కమీషను అధ్యక్షుడుగ నియమింపబడుటకు పాత్రుడై యుండును కాని అతడు భారత ప్రభుత్వము క్రింద లేక రాజ్య ప్రభుత్వము క్రింద ఏ ఇతర ఉద్యోగమునకును పాత్రుడు కాడు.

320. (1) సంఘ సేవావర్గములలోను, రాజ్య సంఘ సేవా వర్గములలోను, నియామకములు చేయుట కొరకు పరీక్షలను జరుపుట క్రమశ: సంఘ పబ్లికు సేవా కమీషను యొక్కయు, రాజ్య పబ్లికు సేవా కమీషను యొక్కయు, కర్తవ్యమై యుండును.

**పబ్లికు సేవా కమీషనుల కృత్యములు.**

(2) విశేషార్హతలుగల అభ్యర్థులు కావలసిన ఏదేని సేవా వర్గములకు ఉమ్మడిగా భర్తీ చేయుటకై పథకములను రూపొందించుటకును వాటిని అమలుపరచుటకును, తమకు తోడ్పడవలెనని రెండు లేక అంతకెక్కువ రాజ్యములు కోరినచో అట్లు తోడ్పడుట కూడా సంఘ పబ్లికు సేవా కమీషను యొక్క కర్తవ్యమై యుండవలెను.

(3) ఈ క్రింది విషయములను గూర్చి, సంఘ పబ్లికు సేవా కమీషనుతో, లేక సందర్భానుసారముగా, రాజ్య పబ్లికు సేవా కమీషనుతో సంప్రదించవలెను,–

(ఎ) సివిలు సేవా వర్గములలో మరియు సివిలు పదస్థానములో భర్తీ చేయు పద్ధతులకు సంబంధించిన అన్ని విషయములు;

(బి) సివిలు సేవా వర్గములకును, సివిలు పదస్థానములకును నియామకములు చేయుటలోను మరియు పదోన్నతి ఇచ్చుటలోను, మరియు ఒక సేవా వర్గము నుండి వేరొక సేవా వర్గమునకు బదిలీలు చేయుటలోను, మరియు అట్టి నియామకములకు, పదోన్నతులకు లేక బదిలీలకు అభ్యర్థుల యోగ్యత విషయములో అనుసరించబడవలసిన సూత్రములు;

(సి) భారత ప్రభుత్వము క్రింద లేక ఏదేని రాజ్య ప్రభుత్వము క్రింద సివిలు హోదాలో సేవా చేయు వ్యక్తికి సంబంధించిన క్రమశిక్షణ విషయములు, మరియు వాటికి సంబంధించిన మహాజర్లు లేక అర్జీలు;

(డి) భారత ప్రభుత్వము క్రింద లేక రాజ్య ప్రభుత్వము క్రింద లేక ఇండియాలో క్రౌన్ క్రింద లేక ఇండియాలోని ప్రభుత్వము క్రింద, సివిలు హోదాలో సేవా చేయుచున్న లేక సేవచేసియుండిన ఎవరేని వ్యక్తిచే లేక ఆ వ్యక్తి విషయమున, అతడు తన కర్తవ్య నిర్వహణలో చేసిన లేక అట్టి నిర్వహణలో చేయబడినట్లు తాత్పర్యితమైన కార్యములను గూర్చి అతనిపై సంస్థితము చేయబడిన శాసనబద్ధ చర్యలకు ప్రతివాదిని చేయుటలో అతనికి అయిన ఏవేని ఖర్చులు సందర్భానుసారముగా, భారత సంచిత నిధి నుండి రాజ్య సంచిత నిధి చెల్లించబడవలెనను ఏదేని క్లెయిము;

(ఇ) ఒక వ్యక్తికి అతడు భారత ప్రభుత్వము క్రింద, లేక రాజ్య ప్రభుత్వము క్రింద, లేక ఇండియాలోని క్రౌన్ క్రింద లేక ఇండియాలోని రాజ్యము యొక్క ప్రభుత్వము క్రింద సివిలు హోదాలో సేవ చేయుచున్నప్పుడు కలిగిన క్షతులను గూర్చి పింఛను ప్రదానమునకైన ఏదేని క్లెయిము మరియు అట్లు ప్రదానము చేయవలసిన మొత్తమును గూర్చిన ఏదేని ప్రశ్నకు, మరియు అట్లు వారికి నిర్దేశించబడిన ఏ విషయము పైనైనను సందర్భానుసారముగ రాష్ట్రపతిచే, లేక రాజ్య గవర్నరుచే [1][* * *] వారికి నిర్దేశింపబడు ఏ ఇతర విషయముపైనైనను సలహా నొసగుట పబ్లికు సేవా కమీషను యొక్క కర్తవ్యమైయుండును:

అయితే సాధారణముగనైనను, ఏదేని తరగతికి చెందిన ప్రత్యేక సందర్భములోనైనను, ఏవేని ప్రత్యేక పరిస్థితులలోనైనను, అఖిల భారత సేవా వర్గములను గూర్చి, మరియు సంఘ కార్యకలాపములకు సంబంధించిన ఇతర సేవా వర్గములను పదస్థానములను గూర్చి కూడ రాష్ట్రపతి మరియు రాజ్య కార్యకలాపములకు సంబంధించి ఇతర సేవావర్గములను పదస్థానములను గూర్చి గవర్నరు

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''సందర్భానుసారముగ లేక రాజప్రముఖ్'' అను పదములు లుప్తము చేయబడినవి.

[1][* * *] పబ్లికు సేవా కమీషనుతో సంప్రదించుట ఆవశ్యకము కారాని విషయములను నిర్దిష్టపరచుచు వినియములను చేయవచ్చును.

(4) 16వ అనుచ్ఛేదపు ఖండము (4)లో నిర్దేశించబడిన ఏ నిబంధనైనను చేయవలసిన రీతిని గూర్చి, లేక 335వ అనుచ్ఛేదపు నిబంధనలను అమలుపరచు రీతిని గూర్చి, పబ్లికు సేవా కమీషనుతో సంప్రదించవలెనని ఖండము (3)లో నున్నదేదియు ఆపేక్షించరాదు.

(5) రాష్ట్రపతిచే, లేక రాజ్య గవర్నరు [1][* * *]చే ఖండము (3) యొక్క వినాయింపు క్రింద చేయబడిన వినియమములన్నియు అవి చేయబడిన పిమ్మట వీలైనంత త్వరితముగా, పార్లమెంటు యొక్క ప్రతి సదనము సమక్షమున, లేక సందర్భానుసారముగ, రాజ్య శాసన మండలి యొక్క సదనము సమక్షమున, లేక ప్రతి సదనము సమక్షమున పదునాలుగు దినములకు తక్కువ కాని కాలావధి వరకు ఉంచబడవలెను మరియు అవి అట్లు ఉంచబడిన అధివేశనములో పార్లమెంటు యొక్క ఉభయ సదనములు, లేక రాజ్య శాసనమండలి యొక్క సదనము లేక ఉభయ సదనములు, రద్దు రూపమున గాని, సవరణ రూపమునగాని చేయునట్టి మార్పులకు అధ్యధీనమై యుండవలెను.

**పబ్లికు సేవా కమీషనుల కృత్యములను విస్తృతపరచుటకు అధికారము.**

321. సంఘము యొక్క, లేక రాజ్యము యొక్క సేవావర్గము గూర్చి, మరియు ఏదేని స్థానిక ప్రాధికారి యొక్క, లేక శాసనము ద్వారా సంఘటితమైన ఇతర నిగమ నికాయము యొక్క లేక ఏదేని పబ్లికు సంస్థ యొక్క సేవా వర్గములను గూర్చి కూడ సంఘ పబ్లికు సేవా కమీషను లేక ఆ రాజ్య పబ్లికు సేవా కమీషను అదనపు కృత్యములను నిర్వహించుటకు, పార్లమెంటుచే, లేక సందర్భానుసారముగా రాజ్య శాసన మండలిచే చేయబడిన చట్టము నిబంధనలు చేయవచ్చును.

**పబ్లికు సేవా కమీషనుల ఖర్చులు.**

322. సంఘము యొక్క లేక రాజ్యము యొక్క పబ్లికు సేవా కమీషను సభ్యులకు లేక సిబ్బందికి లేక వారి విషయమై, చెల్లించదగు జీతములు బత్తెములు మరియు ఫించనులతో సహా ఆ కమీషను ఖర్చులు భారత సంచితనిధిపై లేక సందర్భానుసారముగా రాజ్య సంచిత నిధిపై ప్రభారమై యుండవలెను.

**పబ్లికు సేవా కమీషనుల రిపోర్టులు.**

323. (1) సంఘ కమీషను చేసిన పనిని గూర్చిన ఒక రిపోర్టును ప్రతి సంవత్సరము రాష్ట్రపతికి సమర్పించుట ఆ కమీషను యొక్క కర్తవ్యమై యుండవలెను, మరియు అట్టి రిపోర్టు అందిన మీదట, రాష్ట్రపతి దాని నకలు నొకదానిని, కమీషను సలహా అంగీకరించబడని సందర్భములేవైన ఉన్నచో అట్లు అంగీకరించని కారణములను విశదీకరించు జ్ఞాపనతో సహా, పార్లమెంటు యొక్క ప్రతి సదనము సమక్షమున ఉంచవలెను.

(2) రాజ్య కమీషను చేసిన పనిని గూర్చిన ఒక రిపోర్టును ప్రతి సంవత్సరము రాజ్య గవర్నరుకు [2][* * *] సమర్పించుట ఆ కమీషను యొక్క కర్తవ్యమై యుండవలెను మరియు ఏదేని సంయుక్త

---

1. అదే చట్టము యొక్క 29వ పరిచ్ఛేదము మరయిఉ అనుసూచి ద్వారా ''లేక రాజప్రముఖ్'' అను పదముల లుప్తము చేయబడినవి.
2. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''సందర్భానుసారముగ లేక రాజప్రముఖ్'' అను పదములు లుప్తము చేయబడినవి.

కమీషను ఏ రాజ్యముల అక్కరను తీర్చుచున్నదో ఆ రాజ్యములలో ప్రతి రాజ్యము యొక్క గవర్నరుకు [1][* * *] ఆ రాజ్యమునకు సంబంధించి తాను చేసిన పనిని గూర్చిన ఒక రిపోర్టును ప్రతి సంవత్సరము సమర్పించుట ఆ సంయుక్త కమీషను యొక్క కర్తవ్యమై యుండవలెను మరియు పై రెండు సందర్భములలోను అట్టి రిపోర్టు అందిన మీదట, గవర్నరు [1][* * *] దాని నకలు నొకదానిని, కమీషను యొక్క సలహా అంగీకరించబడని సందర్భములేవైన ఉన్నచో అట్లు అంగీకరించని కారణములను విశదీకరించు జ్ఞాపనతో సహా, రాజ్య శాసన మండలి సమక్షమున ఉంచవలెను.

## [1][భాగము – 14ఏ

## ట్రిబ్యునళ్లు

323ఏ. (1) సంఘము లేక ఏదేని రాజ్యము లేక భారతరాజ్య క్షేత్రమునందలిగాని, భారత ప్రభుత్వ నియంత్రణ క్రింద ఉన్నట్టిగాని, ఏదేని స్థానిక లేక ఇతర ప్రాధికారి, లేక ఆ ప్రభుత్వ స్వామ్యమునందున్న లేక దాని నియంత్రణలో వున్న ఏదేని కార్పొరేషన్ యొక్క కార్యకలాపములకు సంబంధించిన పబ్లికు వర్గములలో మరియు పదవులలో చేయు భర్తీని గూర్చిన మరియు అందు నియమించబడిన వ్యక్తుల సేవా షరతులను గూర్చిన వివాదములను మరియు ఫిర్యాదులను పరిపాలక ట్రిబ్యునళ్లు న్యాయ నిర్ణయము లేక విచారణ చేయుటకు పార్లమెంటు శాసనము ద్వారా నిబంధించవచ్చును. **పరిపాలక ట్రిబ్యునళ్లు.**

(2) ఖండము (1) క్రింద చేయబడిన శాసనము,–

(ఏ) సంఘమునకు ఒక పరిపాలక ట్రిబ్యునలును, మరియు వేరు వేరుగా ఒక్కొక్క రాజ్యమునకు గాని లేక రెండు లేక అంతకు ఎక్కువ రాజ్యములకుగాని ఒక పరిపాలక ట్రిబ్యునలును స్థాపించుట కొరకై నిబంధించవచ్చును.

(బి) అట్టి ట్రిబ్యునళ్ళలో ప్రతి యొక్క దానిచే వినియోగించబడదగు అధికారితను అధికార ధిక్కరణకు గాను శిక్షించు అధికారముతో సహా అధికారములను మరియు ప్రాధికారమును నిర్దిష్టపరచవచ్చును.

(సి) అట్టి ట్రిబ్యునళ్లు అనుసరించవలసిన ప్రక్రియ కొరకు (కాల పరిమితి మరియు సాక్ష్యపు నియమములను గూర్చిన నిబంధనలతో సహా) నిబంధించవచ్చును.

(డి) ఖండము (1)లో నిర్దేశించబడిన వివాదములు లేక ఫిర్యాదులకు సంబంధించిన విషయములలో 136వ అనుచ్ఛేదము క్రింద సర్వోన్నత న్యాయస్థానపు అధికారిత మినహా అన్ని న్యాయస్థానముల అధికారితను అపవర్జించవచ్చును.

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 46వ పరిచ్ఛేదము ద్వారా 3.1.1977 నుండి చొప్పించబడినది.

(ఇ) ఏదేని పరిపాలక ట్రిబ్యునలును స్థాపించుటకు అవ్యవహిత పూర్వము, ఏదేని న్యాయస్థానము లేక ఇతర ప్రాధికారి సమక్షమున జరుగుచుండిన ఏయే కేసులు అట్టి దావాలకు లేక చర్యకు ఆధారమైన దావా హేతువులు అట్టి స్థాపనకు పిమ్మట ఉత్పన్నమై యుండిన యెడల అట్టి ట్రిబ్యునలు అధికారితలోనికి వచ్చియుండెడివో ఆయా కేసులను అట్టి పరిపాలక ట్రిబ్యునలుకు అంతరణ చేయుటకై నిబంధించవచ్చును.

(ఎఫ్) 371-డీ అనుచ్ఛేదపు ఖండము (3) క్రింద రాష్ట్రపతిచే చేయబడిన ఏదేని ఉత్తరువును రద్దు చేయవచ్చును లేక సవరించవచ్చును.

(జి) అట్టి ట్రిబ్యునళ్లు సమర్థవంతముగ పని చేయుటకు మరియు కేసులను శీఘ్రముగా పరిష్కరించుటకు మరియు వాటి ఉత్తరువులను అమలు జరుపుటకు ఆవశ్యకమని పార్లమెంటు భావించునట్టి అనుపూరక, ఆనుషంగిక మరియు పారిణామిక నిబంధనలను (ఫీజుకు సంబంధించిన నిబంధనలతో సహా) కలిగి ఉండవచ్చును.

(3) ఈ అనుచ్ఛేదపు నిబంధనలు, ఈ సంవిధానము యొక్క ఏదేని ఇతర నిబంధనలో గాని, తత్సమయమున అమలునందున్న ఏదేని ఇతర శాసనములోగాని ఏమియున్నప్పటికిని, ప్రభావము కలిగియుండును.

**ఇతర విషయముల కొరకై ట్రిబ్యునళ్లు.**

323బీ. (1) ఖండము (2)లో నిర్దిష్టపరచబడిన విషయములన్నింటికైనను లేక వాటిలో వేటికైనను సంబంధించిన ఏవేని వివాదములు, ఫిర్యాదులు లేక అపరాధములు ట్రిబ్యునళ్ళచే న్యాయ నిర్ణయము లేక నిర్ధారణ చేయబడుటకు గాను సముచిత శాసనమండలి, శాసనము ద్వారా తాను శాసనములు చేయుటకు అధికారము కలిగియున్నట్టి విషయములను గూర్చి నిబంధించవచ్చును.

(2) ఖండము (1)లో నిర్దేశించబడిన విషయములు ఈ క్రిందివై యుండును, అవేవనగా,-

(ఎ) ఏదేని పన్ను యొక్క విధింపు, నిర్ధారణ, వసూలు మరియు అమలుజరుపుటకు;

(బి) విదేశీ మారక ద్రవ్యము, కస్టమ్సు సరిహద్దులను దాటి వేయు ఎగుమతి దిగుమతులు;

(సి) పారిశ్రామిక మరియు శ్రామిక వివాదములు;

(డి) 31-ఏ అనుచ్ఛేదములో నిర్వచించబడినట్లుగా ఏదేని ఎస్టేటు లేక అందలి ఏదేని హక్కులను రాజ్యము అధ్యార్జించుటకు గాను లేక ఏవేని అట్టి హక్కులను నిర్వాపన లేక మార్పు చేయుటకు గాను, లేక వ్యవసాయ భూమిపై గరిష్ట పరిమితిని విధించుటకుగాను లేక ఏదేని ఇతర విధముగా, భూసంస్కరణలు;

(ఇ) పట్టణ ఆస్తిపై గరిష్ట పరిమితి;

(ఎఫ్) 329వ మరియు 329-ఏ అనుచ్ఛేదములలో నిర్దేశింపబడిన విషయములు మినహా పార్లమెంటు యొక్క ఉభయ సదనములలో ఏ సదనముకైనను లేక రాజ్యశాసన మండలి సదనమునకు లేక దాని ఉభయ సదనములలో ఏ సదనమునకైనను ఎన్నికలు;

(జి) ఆహార పదార్థములు (తినదగు చమురు గింజలు మరియు నూనెలతో సహా) మరియు రాష్ట్రపతి ఈ అనుచ్ఛేదపు నిమిత్తము అత్యావశ్యకమైన సరుకులుగ పబ్లికు అధిసూచన ద్వారా ప్రఖ్యానించు ఇతర సరుకుల యొక్క ఉత్పత్తి, సేకరణ, సరఫరా మరియు పంపిణీ మరియు అట్టి సరుకుల ధరలు నియంత్రణ;

[1] [(హెచ్)] భూస్వాములు మరియు కౌలుదార్ల హక్కు, హక్కుమూలము మరియు హితముతో సహా శిస్తు, దాని క్రమబద్ధీకరణ, నియంత్రణ మరియు కౌలుదారీ విషయములు;]

[2] [(ఐ)] (ఎ) నుండి [3] [(హెచ్)] వరకు గల ఉపఖండములలో నిర్దిష్టపరచబడిన విషయములలో దేనికైనను సంబంధించిన శాసన విరుద్ధమైన అపరాధములు మరియు ఆ విషయములలో దేనికైనను సంబంధించిన ఫీజు;

[1][(జె)] (ఎ) నుండి [4] [(ఐ)] వరకు గల ఉప-ఖండములలో నిర్దిష్టపరచబడిన విషయములలో దేనికైనను ఆనుషంగికమైన ఏదేని విషయము.]

(3) ఖండము (1) క్రింద చేయబడిన శాసనములో,

(ఎ) స్థాయీవారీ ట్రిబ్యునళ్లను స్థాపించుటకు నిబంధించుట;

(బి) అట్టి ట్రిబ్యునళ్లలో ప్రతి యొకదానిచే వినియోగించబడదగు అధికారితను (అధికార ధిక్కరణకుగాను శిక్షించు అధికారముతో సహా) అధికారములను, మరియు ప్రాధికారమును నిర్దిష్టపరచవచ్చును;

(సి) అట్టి ట్రిబ్యునళ్ళు అనుసరించవలసిన ప్రక్రియ కొరకై (కాలపరిమితి మరియు సాక్ష్యపు నియమములను గూర్చిన నిబంధనలతో సహా) నిబంధించవచ్చును;

(డి) 136వ అనుచ్ఛేదము క్రింద సర్వోన్నత న్యాయస్థానపు అధికారితను తప్ప, అట్టి ట్రిబ్యునళ్ళ అధికారితలోనికి వచ్చు విషయములన్నింటికి లేక వాటిలో వేటికైనను సంబంధించి, అన్ని న్యాయస్థానముల అధికారితను అపవర్జించవచ్చును;

(ఇ) ఏదేని ట్రిబ్యునలును స్థాపించుటకు అవ్యవహిత పూర్వము, ఏదేని న్యాయస్థానము లేక ఇతర ప్రాధికారి సమక్షమున జరుగుచుండిన ఏవే కేసులు అట్టి దావాలకు లేక చర్యలకు

---

1. సంవిధాన (డెబ్బది ఐదవ సవరణ) చట్టము, 1993 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 15.5.1994 నుండి చొప్పించబడినది.
2. సంవిధాన (75వ సవరణ) చట్టము, 1993 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ఉప-ఖండము (హెచ్) మరియు (ఐ)లు, (ఐ) మరియు (జె)లుగా 15.05.1994 నుండి మార్చబడినవి.
3. అదే చట్టము యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ఉప-ఖండము (జె)కు బదులుగా 15.5.1994 నుండి ఇది ఉంచబడినది.
4. అదే చట్టము యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ఉప-ఖండము (హెచ్)కు బదులుగా 15.5.1994 నుండి ఉంచబడినది.

ఆధారమైన దావా హేతువులు అట్టి స్థాపనకు పిమ్మట ఉత్పన్నమైయుండిన యెడల అట్టి ట్రిబ్యునలు అధికారితలోనికి వచ్చి యుండెడివో ఆయా కేసులను అట్టి ట్రిబ్యునలుకు అంతరణ చేయుటకై నిబంధించవచ్చును;

(ఎఫ్) అట్టి ట్రిబ్యునళ్లు సమర్ధవంతముగ పని చేయుటకు మరియు కేసులను శీఘ్రముగ పరిష్కరించుటకు మరియు వాటి ఉత్తరువులను అమలు జరుపుటకు ఆవశ్యకమని సముచిత శాసనమండలి భావించునట్టి అనుసంపూరక, ఆనుషంగిక మరియు పారిణామిక నిబంధనలను (ఫీజుకు సంబంధించిన నిబంధనలతో సహా) కలిగి ఉండవచ్చును.

(4) ఈ అనుచ్ఛేదపు నిబంధనలు, ఈ సంవిధానము యొక్క ఏదేని ఇతర నిబంధనలోగాని, తత్సమయమున అమలునందున్న ఏదేని ఇతర శాసనములో గాని ఏమి ఉన్నప్పటికిని, ప్రభావము కలిగియుండును.

**విశదీకరణ:–** ఈ అనుచ్ఛేదములో ఏదేని విషయములకు సంబంధించి ''సముచిత శాసనమండలి'' అనగా భాగము–11 యొక్క నిబంధనలననుసరించి అట్టి విషయమును గూర్చి శాసనములను చేయుటకు సమర్ధత కలిగియున్న పార్లమెంటు లేక సందర్భానుసారముగా రాజ్య శాసనమండలి అని అర్థము.]

## భాగము – 15

## ఎన్నికలు

**ఎన్నికల యొక్క అధీక్షణ, ఆదేశ, నియంత్రణలు ఒక ఎన్నికల కమీషనులో నిహితమై యుండును.**

324. (1) ఈ సంవిధానము క్రింద పార్లమెంటుకు, మరియు ప్రతియొక రాజ్య శాసనమండలికి జరుపబడెడి అన్ని ఎన్నికల కొరకు ఓటర్ల జాబితాలను తయారు చేయుటను గూర్చియు, ఎన్నికలను జరుపుటను గూర్చియు, మరియు రాష్ట్రపతి, ఉపరాష్ట్రపతి పదవులకు జరుపబడెడి ఎన్నికలను గూర్చియు [1][* * *] అధీక్షణ, ఆదేశ నియంత్రణలు (ఈ సంవిధానములో ఎన్నికల కమీషను అని నిర్దేశించబడిన) ఒక కమీషనులో నిహితమై యుండవలెను.

(2) ఎన్నికల కమీషను, ఎన్నికల ముఖ్య కమీషనరుతో మరియు ఇతర ఎన్నికల కమీషనర్లు ఉన్నచో ఎప్పటికప్పుడు రాష్ట్రపతి నియతము చేయు సంఖ్యలో ఇతర ఎన్నికల కమీషనర్లతో కూడియుండవలెను మరియు ఎన్నికల ముఖ్య కమీషనరు యొక్కయు ఇతర ఎన్నికల కమీషనర్లకు యొక్కయు నియామకము, తద్విషయమున పార్లమెంటుచే చేయబడు ఏదేని శాసనము యొక్క నిబంధనలకు అధ్యధీనమై, రాష్ట్రపతిచే చేయబడవలెను.

(3) ఇతర ఎన్నికల కమీషనరెవరైనను అట్లు నియమించబడినప్పుడు ఎన్నికల ముఖ్య కమీషనరు ఆ ఎన్నికల కమీషను అధ్యక్షుడుగా వ్యవహరించవలెను.

---

1. సంవిధాన (పందొమ్మిదవ సవరణ) చట్టము, 1966 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ''పార్లమెంటు మరియు రాజ్యశాసన మండలుల ఎన్నికలకు సంబంధించి లేక ఎన్నికల నుండి ఉత్పన్నమైన సందేహములు మరియు వివాదములపై నిర్ణయము కొరకు ఎన్నికల ట్రిబ్యునళ్ల నియామకముతో సహా'' అను పదములు 11.12.1966 నుండి వదలి వేయబడినవి.

(4) లోక్‌సభ కు మరియు ప్రతి రాజ్య శాసనసభకు జరిగెడి ప్రతి సాధారణ ఎన్నికలకు పూర్వమును శాసన పరిషత్తు గల ప్రతి రాజ్యము యొక్క శాసన పరిషత్తుకు జరిగెడి ప్రథమ సాధారణ ఎన్నికలకు పూర్వమును, అటు పిమ్మట ఆ పరిషత్తుకు జరిగెడి ప్రతి ద్వైవార్షిక ఎన్నికలకు పూర్వమును, రాష్ట్రపతి, ఎన్నికల కమీషనుతో సంప్రదించిన పిమ్మట, ఖండము (1) ద్వారా ఆ ఎన్నికల కమీషనుకు ప్రదత్తము చేయబడిన కృత్యములను నిర్వర్తించుటలో ఆ కమీషనుకు తోడ్పడుటకుగాను, ఆవశ్యకమని ఆయన భావించు ప్రాంతీయ కమీషనర్లను కూడ నియమించ వచ్చును.

(5) పార్లమెంటుచే చేయబడిన ఏదేని శాసనము యొక్క నిబంధనలకు అధ్యధీనమై ఎన్నికల కమీషనర్ల యొక్కయు, ప్రాంతీయ కమీషనర్ల యొక్కయు సేవా షరతులు మరియు పదవీకాలము రాష్ట్రపతిచే నియమము ద్వారా నిర్ధారణ చేయబడునవై యుండును:

అయితే సర్వోన్నత న్యాయస్థానపు న్యాయధీశుని ఏ రీతిగ, మరియు ఏ ఆధారములపై పదవి నుండి తొలగించవచ్చునో ఆ రీతిగను, మరియు ఆ ఆధారములపైనను తప్ప, ఎన్నికల ముఖ్య కమీషనరు పదవి నుండి తొలగించబడరాదు, మరియు ఎన్నికల ముఖ్య కమీషనరు యొక్క సేవా షరతులు, అతని నియామకమునకు పిమ్మట అతనికి అననుకూలముగ మార్చబడరాదు:

అంతేకాక ఎన్నికల ముఖ్య కమీషనరు సిఫారసుపై తప్ప, ఇతర ఎన్నికల కమీషనరు, లేక ప్రాంతీయ ఎన్నికల కమీషనరు, పదవి నుండి తొలగించబడరాదు.

(6) ఖండము (1) ద్వారా ఎన్నికల కమీషనుకు ప్రదత్తము చేయబడిన కృత్యములను నిర్వహించుటకు ఆవశ్యకమగునట్టి సిబ్బందిని ఎన్నికల కమీషనుకు లేక ప్రాంతీయ కమీషనరుకు, అప్పగించవలెనని ఎన్నికల కమీషను కోరినప్పుడు, రాష్ట్రపతి లేక రాజ్య గవర్నరు [1][* * *] అట్లు అప్పగించవలెను.

**మత, జాతి, కుల లేక లింగ భేద కారణములను బట్టి, ఏ వ్యక్తియు ఓటర్ల జాబితాలో చేర్చబడుటకు అపాత్రుడు కాకుండుట, లేక అట్టి కారణములను బట్టి ఏదైనా విశేష జాబితాలో చేర్చబడుటకు క్లెయిము చేయరాకుండుట.**

325. పార్లమెంటు ఉభయ సదనములలో ఏ సదనమునకుగాని, ఒక రాజ్య శాసనమండలి సదనమునకు, లేక ఉభయ సదనములలో ఏ సదనమునకు గాని, ఎన్నికల కొరకు ప్రతి ప్రాదేశిక నియోజనకవర్గమునకు ఒకే సాధారణ ఓటర్ల జాబితా ఉంచవలెను మరియు కేవలము మత, జాతి, కుల, లింగ బేధము కారణమునుబట్టి కాని, లేక వాటిలో వేటిని బట్టి కాని, ఏ వ్యక్తియు అట్టి ఏదేని జాబితాల్లో చేర్చబడుటకు అపాత్రుడు కారాదు, లేక అట్టి కారణములనుబట్టి ఏదేని విశేష ఓటర్ల జాబితాలో చేర్చబడవలెనని క్లెయిము చేయరాదు.

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజప్రముఖ్'' అను పదములు లుప్తము చేయబడినది.

**లోక్‌సభకును, రాజ్య శాసనసభలకును ఎన్నికలు వయోజన వోటు హక్కు ప్రాతిపదికపై నుండుట.**

326. లోక్‌సభకును, ప్రతి రాజ్య శాసనసభకును ఎన్నికలు వయోజన ఓటు హక్కు ప్రాతిపదికపై నుండవలెను, అనగా, భారతదేశ పౌరుడైయుండి సముచిత శాసనమండలిచే చేయబడిన ఏదేని శాసనముచే లేక శాసనము క్రింద, తద్విషయమై నియతము చేయబడు తేదీనాటికి [1][పదునెనిమిది] సంవత్సరములకు తక్కువ కాని వయస్సు, కలిగియుండి అన్యథా ఈ సంవిధానము క్రింద లేక సముచిత శాసనమండలిచే చేయబడిన ఏదేని శాసనము క్రింద అనివాసము, అస్వస్థచిత్తము, నేరము, భ్రష్టాచరణ, లేక శాసన విరుద్ధమైన ఆచరణ కారణమునుబట్టి నిరర్హునిగ చేయబడిన ప్రతి వ్యక్తియు, అట్టి ఏ ఎన్నికయందైనను ఓటరుగ రిజిస్టరు చేయబడుటకు హక్కు కలిగియుండవలెను.

**శాసన మండలుల ఎన్నికలను గూర్చి నిబంధనలు చేయుటకు పార్లమెంటుకు గల అధికారము.**

327. ఈ సంవిధాన నిబంధనలకు అధ్యధీనమై, పార్లమెంటు ఉభయ సదనములలో ఏ సదనమునకైనను, ఒక రాజ్య శాసనమండలి సదనమునకు లేక ఉభయ సదనములలో ఏ సదనముకైనను, వోటర్ల జాబితా తయారుచేయుటకు, నియోజక వర్గముల పరిసీమన, మరియు అట్టి సదనము, లేక సదనముల సముచిత సంఘటితను చేకూర్చుటకు ఆవశ్యకమగు ఇతర విషయములన్నిటితో సహా, ఎన్నికలకు సంబంధించిన సకల విషయములను గూర్చి పార్లమెంటు ఆయా సమయములందు శాసనము ద్వారా నిబంధనలు చేయవచ్చును.

**శాసన మండలుల ఎన్నికలను గూర్చి నిబంధనలు చేయుటకు రాజ్య శాసన మండలికి గల అధికారము.**

328. ఈ సంవిధాన నిబంధనలకు అధ్యధీనమై మరియు తద్విషయమై పార్లమెంటు నిబంధనలు చేయునంతవరకు, ఏదేని రాజ్య శాసన మండలి యొక్క సదనమునకైనను, ఉభయసదనములలో ఏ సదనమునకైనన ఓటర్ల జాబితాను తయారు చేయుటకు, మరియు అట్టి సదనము లేక సదనముల సముచిత సంఘటనను చేకూర్చుటకు ఆవశ్యకమగు ఇతర విషయములన్నింటితో సహా, ఎన్నికలకు సంబంధించిన సకల విషయములను గూర్చి ఆ రాజ్య శాసన మండలి ఆయా సమయములందు శాసనము ద్వారా నిబంధనలు చేయవచ్చును.

**ఎన్నికల విషయములలో న్యాయస్థానముల జోక్యమునకు ప్రతిబంధకము.**

329. [2][ఈ సంవిధానమందేమి యున్నప్పటికిని, [3]* * *–]

(ఎ) 327వ లేక 328వ అనుచ్ఛేదము క్రింద చేయబడిన లేక చేయబడినట్లు తాత్పర్యితమగు నియోజకవర్గముల పరిసీమనకు లేక అట్టి నియోజకవర్గములకై స్థానముల కేటాయింపునకు సంబంధించిన ఏదేని శాసనము యొక్క మాన్యత ఏ న్యాయ స్థానమునందుకు ప్రష్టవ్యము (ప్రశ్నగతము) కారాదు.

---

1. సంవిధాన (అరువది ఒకటవ సవరణ) చట్టము, 1988 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ''ఇరవై ఒక్క సంవత్సరములు'' అను పదములకు బదులుగా 28.03.1989 నుండి ఉంచబడినది.
2. సంవిధాన (ముప్పది తొమ్మిదవ సవరణ) చట్టము, 1975 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా కొన్ని పదములకు బదులుగా 10.08. 1975 నుండి ఉంచబడినది.
3. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 35వ పరిచ్ఛేదము ద్వారా 20.06.1979 నుండి అనుచ్ఛేదము 329ఏ లుప్తము చేయడబడినది

(బి) పార్లమెంటు ఉభయ సదనములలో దేనికైనను, లేక ఏదేని రాజ్య శాసన మండలి యొక్క సదనమునకు లేక దాని ఉభయ సదనములలో దేనికైనను, జరిగిన ఎన్నిక ఏదియు సముచిత శాసన మండలిచే చేయబడిన ఏదేని శాసనము ద్వారా లేక శాసనము క్రింద ఏర్పాటు చేయబడిన ప్రాధికారికి, ఆ శాసనములో నిబంధింపబడిన రీతిలో సమర్పించబడిన ఎన్నిక అర్జీ ద్వారా తప్ప, ప్రష్టవ్యము (ప్రశ్నగతము) కారాదు.

[1]329ఏ. [ప్రధాన మంత్రి మరియు సభాపతి విషయములో పార్లమెంటు ఎన్నికలకైన విశేష నిబంధన] సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 36వ పరిచ్ఛేదము ద్వారా (20.06.1979) నుండి లుప్తము చేయబడినది.

## భాగము – 16
## కొన్ని వర్గములకు సంబంధించిన విశేష నిబంధనలు

**అనుసూచిత కులములకును, అనుసూచిత జన జాతులకును లోకసభలో స్థానములను ప్రత్యేకించుట.**

330. (1) లోక్‌సభ లో ఈ క్రింది వారికి స్థానములు ప్రత్యేకించబడవలెను:

(ఎ) అనుసూచిత కులములకు;

[2][(బి) అస్సాము యొక్క స్వాయత్త జిల్లాలలోని అనుసూచిత జనజాతులు మినహా, అనుసూచిత జనజాతులకు, మరియు

(సి) అస్సాము యొక్క స్వాయత్త జిల్లాలలోని అనుసూచిత జనజాతులకు.

(2) ఏదేని రాజ్యమునందు [3][లేక సంఘ రాజ్యక్షేత్రమునందు] ఖండము (1) క్రింద అనుసూచిత కులములకు, లేక అనుసూచిత జనజాతులకు ప్రత్యేకించబడిన స్థానముల సంఖ్యకును, లోక్‌సభ లో ఆ రాజ్యమునకు, [3][లేక సంఘ రాజ్యక్షేత్రమునకు] కేటాయించబడిన మొత్తము స్థానముల సంఖ్యకును గల అనుపాతము, ఆ రాజ్యములోని [3][లేక సంఘ రాజ్యక్షేత్రములోని] అనుసూచిత కులముల యొక్క, లేక సందర్భానుసారముగా, ఆ రాజ్యములోని, [3][లేక సంఘ రాజ్యక్షేత్రములోని] లేక రాజ్యము యొక్క భాగములోని, [3][లేక సంఘ రాజ్యక్షేత్రము యొక్క భాగములోని] అనుసూచిత జనజాతుల జనాభాకును ఆ రాజ్యము యొక్క [3][లేక సంఘ రాజ్యక్షేత్రము యొక్క] మొత్తము జనాభాకును గల అనుపాతమునకు సాధ్యమైనంత దరిదాపుగ ఉండవలెను.

---

1. సంవిధాన (ముప్పది తొమ్మిదవ సవరణ) చట్టము, 1975 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.
2. సంవిధాన (యాబది ఒకటవ సవరణ) చట్టము, 1984 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 16.6.1986 నుండి ఉప-ఖండము (బి)కి బదులుగా ఉంచబడినది.
3. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా 01.11.1956 నుండి చొప్పించబడినది.

[1][(3) ఖండము (2)లో ఏమియున్నప్పటికిని అస్సాము రాజ్యమునందలి స్వాయత్త జిల్లాలోని అనుసూచిత జనజాతులకు లోక్‌సభలో ప్రత్యేకించబడిన స్థానముల సంఖ్యకును, ఆ రాజ్యమునకు కేటాయించబడిన మొత్తము స్థానముల సంఖ్యకును గల అనుపాతము, సదరు స్వాయత్త జిల్లాలలోని అనుసూచిత జనజాతుల జనాభాకును ఆ రాజ్యము యొక్క మొత్తము జనాభాకును గల అనుపాతమునకు తక్కువ కాకుండ నుండవలెను.

[2][**విశదీకరణ:–** ఈ అనుచ్ఛేదములో మరియు 332వ అనుచ్ఛేదములో 'జనసంఖ్య' అను పదమునకు కట్టకడపటిదియు అందుకు సంబంధించిన అంకెలు ప్రచురించబడినట్టిదియు అగు జనగణనలో అభినిశ్చితమైన జనసంఖ్య అని అర్థము:

అయితే ఈ విశదీకరణలో కట్టకడపటిదియు అందుకు సంబంధించిన అంకెలు ప్రచురించబడినట్టిదియు అగు జనగణనకు గల నిర్దేశము [3] [2026వ] సంవత్సరము పిమ్మట చేయబడు మొదటి జనగణనకు సంబంధించిన అంకెలు ప్రచురించబడువరకు [4] [2001వ] సంవత్సరపు జనగణనకు నిర్దేశమైనట్లు అన్వయించుకొనబడవలెను.]

**లోక్‌సభలో ఆంగ్లో ఇండియను సమాజమునకు ప్రాతినిధ్యము.**

331. 81వ అనుచ్ఛేదములో ఏమియున్నప్పటికిని రాష్ట్రపతి లోక్‌సభ లో ఆంగ్లో ఇండియన్ సమాజమునకు తగినంత ప్రాతినిధ్యము లేదని అభిప్రాయపడినచో, ఆయన ఆ సమాజమునకు చెందిన సభ్యులను ఇద్దరికి మించకుండ లోక్‌సభ కు నామనిర్దేశము చేయవచ్చును.

**రాజ్య శాసన సభలలో అనుసూచిత కులములకును, అనుసూచిత జన జాతులకును ప్రత్యేకించుట.**

332. (1) అనుసూచిత కులములకును, [5][అస్సాము యొక్క స్వాయత్త జిల్లాలోని అనుసూచిత జనజాతులు మినహా] ఇతర అనుసూచిత జనజాతులకును [6][* * *] ప్రతి రాజ్యము యొక్క శాసనసభలో స్థానములు ప్రత్యేకించబడవలెను.

(2) అస్సాములోని స్వాయత్త జిల్లాలకు కూడ ఆ రాజ్య శాసనసభయందు స్థానములు ప్రత్యేకించబడవలెను.

---

1 . సంవిధాన (ముప్పది ఒకటవ సవరణ) చట్టము, 1973 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 17.10.1973 నుండి చొప్పించబడినది.

2. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 47వ పరిచ్ఛేదము ద్వారా 3.1.1977 నుండి చొప్పించబడినది.

3. సంవిధాన (ఎనుబది నాలుగవ సవరణ) చట్టము, 2001 యొక్క 6వ పరిచ్ఛేదము ద్వారా ''2000'' మరియు ''1971''కి 21.02.2001 నుండి బదులుగా ఉంచబడినది.

4. సంవిధాన (ఎనుబది ఏడవ సవరణ) చట్టము, 2003 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా ''1991''కి బదులుగా 22.06.2003 నుండి ఉంచబడినది.

5. సంవిధాన (యాబది ఒకటవ సవరణ) చట్టము, 1984 ద్వారా కొన్ని పదములకు బదులుగా 16.6.1986 నుండి ఉంచబడినది.

6. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా 16.6.1986 నుండి ''ఒకటవ అనుసూచి యొక్క భాగము 'ఏ'లో లేక భాగము 'బీ'లో నిర్దిష్టపరచబడిన'' అను పదముల అక్షరములు లుప్తము చేయబడినవి.

(3) ఏదేని రాజ్య శాసనసభలో ఖండము (1) క్రింద అనుసూచిత కులములకు, లేక అనుసూచిత జనజాతులకు, ప్రత్యేకించబడిన స్థానముల సంఖ్యకును, ఆ సభలోని మొత్తము స్థానముల సంఖ్యకును గల అనుపాతము, సందర్భానుసారముగ, ఆ రాజ్యములోని అనుసూచిత కులముల యొక్క లేక సందర్భానుసారముగా, ఆ రాజ్యములోని లేక ఆ రాజ్యము యొక్క భాగములోని అనుసూచిత జనజాతుల జనాభాకును ఆ రాజ్యము యొక్క మొత్తము జనాభాకును గల అనుపాతమునకు సాధ్యమైనంత దరిదాపుగ ఉండవలెను.

[1][(3-ఏ). ఖండము (3)లో ఏమి ఉన్నప్పటికిని, [2][2026వ] సంవత్సరము తరువాతి మొదటి జనగణన ప్రాతిపదికపై, అనుచ్ఛేదము 170 క్రింద అరుణాచల ప్రదేశ్, మేఘాలయ, మిజోరాం, నాగాలాండ్ రాజ్యశాసన సభలలో స్థానముల సంఖ్యను తిరిగి సర్దుబాటు చేయుట జరుగునంత వరకు ఏదేని అట్టి రాజ్య శాసనసభలో అనుసూచిత కులములకు ప్రత్యేకించబడు స్థానములు–

(ఎ) సంవిధాన (యాబది ఏడవ సవరణ) చట్టము, 1987 అమలులోనికి వచ్చు తేదీ నాటికి అస్తిత్వములోనున్న (ఇక ముందు ఈ ఖండములోని అస్తిత్వమునందున్న శాసనసభ అని పేర్కొనబడు) అట్టి రాజ్య శాసనసభలోని అన్ని స్థానములను అనుసూచిత జనజాతుల సభ్యులే కలిగియున్నచో, ఒకటి తప్ప అన్ని స్థానములు;

(బి) ఏదేని ఇతర సందర్భములో, అస్తిత్వములోనున్న శాసనసభ మొత్తము స్థానముల సంఖ్యకు, అస్తిత్వములోనున్న శాసనసభలో (పైన పేర్కొన్న తేదీన) అనుసూచిత జనజాతులకు చెందిన సభ్యుల సంఖ్య యొక్క అనుపాతమునకు తక్కువ కాకుండా మొత్తము స్థానములకు ఆ అనుపాతములో నుండు స్థానములు, అయి ఉండవలెను.]

[3][(3-బీ) ఖండము (3)లో ఏమి ఉన్నప్పటికినీ [4][2026వ] సంవత్సరము తరువాత మొదటి జనగణన ప్రాతిపదికపై, 170వ అనుచ్ఛేదము క్రింద తిరిగి సర్దుబాటు జరుగునంత వరకు. త్రిపుర రాజ్య శాసనసభలో ఉన్న స్థానముల సంఖ్యలో, ఆ శాసనసభలోని అనుసూచిత జనజాతులకు ప్రత్యేకించవలసియున్న స్థానముల సంఖ్య, సంవిధాన (డెబ్బది రెండవ సవరణ) చట్టము, 1992 అమలులోనికి వచ్చు తేదీ నాటికి అస్తిత్వమునందున్న శాసనసభలోని మొత్తము స్థానములకు, సదరు తేదీ నాటికి ఉన్న అనుసూచిత జనజాతుల సంఖ్యకు తక్కువ కాకుండా మొత్తము స్థానములకు అనుపాతములో అట్టి అనుసూచిత జనజాతుల సభ్యుల స్థానములు ఉండవలెను.]

---

1. సంవిధాన (యాబది–ఏడవ సవరణ) చట్టము, 1987 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 21.9.1987 నుండి చొప్పించబడినది.
2. సంవిధాన (ఎనభై–నాలుగవ సవరణ) చట్టము, 2001 యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా ''2000'' అను దానికి బదులుగా 21.02.2002 నుండి ఉంచబడినది.
3. సంవిధాన (డెబ్బది రెండవ సవరణ) చట్టము, 1992 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 5.12.1992 నుండి చొప్పించబడినది.
4. సంవిధాన (ఎనుబది నాలుగవ సవరణ) చట్టము, 2001 యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా ''2000''కి బదులుగా 21.02.2002 నుండి ఉంచబడినది.

(4) అస్సాము రాజ్య శాసనసభలో ఒక స్వాయత్త జిల్లాకు ప్రత్యేకించబడిన స్థానముల సంఖ్యకును, ఆ సభలోని మొత్తము స్థానముల సంఖ్యకును గల అనుపాతము, ఆ జిల్లా యొక్క జనాభాకును ఆ రాజ్యము యొక్క మొత్తము జనాభాకును గల అనుపాతమునకు తక్కువ కాకుండా ఉండవలెను.

(5) అస్సాము యొక్క ఏదేని స్వాయత్త జిల్లాకు ప్రత్యేకించబడిన స్థానముల నియోజకవర్గములలో, [1][* * *] ఆ జిల్లా వెలుపలి ఏ ప్రాంతమైనను చేరి యుండరాదు.

(6) అస్సాము రాజ్యము యొక్క ఏదేని స్వాయత్త జిల్లాలలోని అనుసూచిత జనజాతి సభ్యుడుకాని ఏ వ్యక్తియు, ఆ జిల్లా యొక్క [1][* * *] ఏ నియోజకవర్గము నుండియు ఆ రాజ్య శాసనసభకు ఎన్నుకొనబడుటకు పాత్రుడు కాడు:

[2][అయితే అస్సాము రాజ్య శాసనసభ ఎన్నికలను బోడోలాండ్ ప్రాదేశిక ప్రాంతముల జిల్లాలో చేరియున్న అధిసూచించబడిన మరియు బోడోలాండ్ ప్రాదేశిక ప్రాంతముల జిల్లాలో ఏర్పాటుకు ముందు అస్తిత్వములో ఉన్నటువంటి అనుసూచిత జనజాతులు మరియు అనుసూచిత జనజాతేతరుల ప్రాతినిధ్యముపై నిర్వహించవలెను.]

**రాజ్యముల శాసనసభలలో ఆంగ్లో ఇండియను సమాజమునకు ప్రాతినిధ్యము.**

333. 170వ అనుచ్ఛేదములో ఏమియున్నప్పటికిని, ఏదేని రాజ్య శాసనసభలో ఆంగ్లో ఇండియను సమాజమునకు ప్రాతినిధ్యము ఆవశ్యకమనియు దానికి తగినంత ప్రాతినిధ్యము లేదనియు, ఆ రాజ్య గవర్నరు [3][* * *] అభిప్రాయపడినచో, ఆయన [4][ఆ సమాజమునకు చెందిన ఒక సభ్యుని ఆ సభకు నామనిర్దేశము చేయవచ్చును.]

**స్థానములను ప్రత్యేకించుట, మరియు విశేష ప్రాతినిధ్యము [3] [కొద్ది కాలము] తరువాత అంతమగుట.**

334. ఈ భాగము యొక్క పూర్వగామి నిబంధనలలో ఏమియున్నప్పటికిని,-

(ఎ) లోక్‌సభ లోను, రాజ్య శాసనసభలలోను, అనుసూచిత కులములకు మరియు అనుసూచిత జనజాతులకు స్థానములను ప్రత్యేకించుటకు సంబంధించిన; మరియు

(బి) లోక్‌సభ లోను, రాజ్య శాసనసభలోను, నామ నిర్దేశము ద్వారా ఆంగ్లో ఇండియను సమాజము యొక్క ప్రాతినిధ్యమునకు సంబంధించిన,

---

1. ఉత్తమ ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 71వ పరిచ్ఛేదము ద్వారా 21.1.1972 నుండి కొన్ని పదములు లుప్తము చేయబడినవి.
2. సంవిధాన (తొంభైయ్యవ సవరణ) చట్టము, 2003 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 28.09.2003 నుండి చొప్పించబడినది.
3. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజ్‌ప్రముఖ్'' అను పదములు లుప్తము చేయబడినవి.
4. సంవిధాన (ఇరవై మూడవ సవరణ) చట్టము, 1969 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా ''ఆ సమాజమునకు చెందిన సభ్యులలో తాను సముచితమని తలచినంతమందిని ఆ సభకు నామ నిర్దేశము చేయవచ్చును'' అను పదములకు బదులుగా 23.01.1970 నుండిఉంచబడినది.

ఈ సంవిధాన నిబంధనలు, ఈ సంవిధాన ప్రారంభము నుండి [1][ఖండము (ఎ)కు సంబంధించి ఎనభై సంవత్సరములు మరియు ఖండము (బి)కు సంబంధించి డెబ్బై సంవత్సరములు] ముగిగనే ప్రభావరహితము కావలెను:

అయితే ఈ అనుచ్ఛేదములో నున్న దేదియు, సందర్భానుసారముగ, అప్పుడున్న లోక్‌సభ యొక్క లేక సందర్భానుసారముగ ఏదేని రాజ్య శాసనసభ యొక్క విఘటన జరుగువరకు లోక్‌సభ లోని, లేక ఆ శాసన సభలోని ఏ ప్రాతినిధ్యమునకును భంగము కలిగించరాదు.

335. సంఘము యొక్క లేక ఏదేని రాజ్యము యొక్క వ్యవహారములకు సంబంధించిన సేవావర్గములకు మరియు పదస్థానములకు నియామకములను చేయుటలో, పరిపాలనా దక్షతను కాపాడుటకు సుసంగతముగ, అనుసూచిత కులములకును, అనుసూచిత జనజాతులకును చెందిన వ్యక్తుల క్లెయిములు పర్యాలోచించబడవలెను:

**సేవా వర్గములకు మరియు పద స్థానములకు అనుసూచిత కులముల యొక్కయు అనుసూచిత జనజాతుల యొక్కయు క్లెయిము.**

[2][అయితే, ఈ అనుచ్ఛేదములో నున్నదేదియు, అనుసూచిత కులములు మరియు అనుసూచిత జనజాతుల వ్యక్తులకు అనుకూలముగా ఏదేని పరీక్షలో అర్హతనిచ్చు మార్కుల విషయములో సడలింపు లేక ప్రమాణాల మూల్యాంకనమును తక్కువ చేయుటకు సంఘము లేక రాజ్యము యొక్క వ్యవహారములకు సంబంధించి ఏదేని తరగతి లేక తరగతుల సేవల లేక పదవుల పదోన్నత విషయములో ప్రత్యేకించు నిమిత్తము ఏదేని నిబంధన చేయుట నుండి నివారించదు.]

336. (1) ఈ సంవిధాన ప్రారంభమునకు పిమ్మట మొదటి రెండు సంవత్సరములలో, సంఘము యొక్క రైల్వే, కస్టమ్సు, తపాలా మరియు తంతి సేవా వర్గములలోని పదస్థానములకు ఆంగ్లో ఇండియను సమాజమునకు చెందిన వ్యక్తుల నియామకములు, 1947, ఆగష్టు పదునైదవ దినమునకు అవ్యవహిత పూర్వము ఉండినట్టి ప్రాతిపదిక పైననే చేయబడవలెను.

**కొన్ని సేవా వర్గములలో ఆంగ్లో ఇండియను సమాజము కొరకు విశేష నిబంధన.**

తరువాత ప్రతి రెండు సంవత్సరముల కాలావధిలోను ఈ సేవా వర్గములలో సదరు సమాజమునకు చెందిన వ్యక్తులకు ప్రత్యేకించబడు పదస్థానముల సంఖ్య అంతకు అవ్యవహిత పూర్వము రెండు సంవత్సరముల కాలావధిలో అట్లు ప్రత్యేకించబడిన సంఖ్య కన్న, సాధ్యమైనంత దరిదాపుగా పదిశాతము తక్కువదై యుండవలెను:

అయితే ఈ సంవిధాన ప్రారంభము నుండి పది సంవత్సరములు ముగియగనే అట్లు ప్రత్యేకించుట అంతము కావలెను.

(2) ఆంగ్లో ఇండియను సమాజమునకు చెందిన వ్యక్తుల గుణరీత్యా ఇతర సమాజములకు చెందిన వ్యక్తులతో పోల్చగా నియామకమునకు అర్హులై యున్నచో, ఆ ఖండము క్రింద ఆ సమాజము

---

1. సంవిధాన (నూట నాల్గవ సవరణ) చట్టము, 2019 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా '' డెబ్బై సంవత్సరములు'' అను పదములకు బదులుగా 25.1.2020వ తేదీ నుండి ఉంచబడినది.

2. సంవిధాన(ఎనభై రెండవ సవరణ) చట్టము, 2000 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 06.09.2000 నుండి చొప్పించబడినది.

వారికి ప్రత్యేకించబడినవి కాక ఇతరమైనవగు లేక అదనమగు పదస్థానములలో వారి నియామకమునకు ఖండము (1)లో నున్న దేదియు ప్రతిబంధకము కారాదు.

**ఆంగ్లో ఇండియను సమాజము యొక్క మేలు కొరకు విద్యా సంబంధమైన అను దానములను గూర్చిన విశేష నిబంధన.**

337. ఆంగ్లో ఇండియను సమాజము యొక్క మేలుకై విద్యను గూర్చి 1948, మార్చి ముప్పది ఒకటవ దినమున అంతమగు విత్తీయ సంవత్సరమునందు ఏవేని అనుదానములు చేయబడి యుండినచో అట్టి అనుదానములు ఈ సంవిధాన ప్రారంభమునకు పిమ్మట మొదటి మూడు విత్తీయ సంవత్సరములలోను సంఘముచే మరియు [1][* * *] ప్రతి రాజ్యముచే చేయబడవలెను.

తరువాతి ప్రతి మూడు సంవత్సరముల కాలావధిలోను ఆ అనుదానములు అంతకు అవ్యవహిత పూర్వపు మూడు సంవత్సరముల కాలావధిలోని అనుదానముల కన్న పది శాతము తక్కువగా నుండవచ్చును:

అయితే, అట్టి అనుదానములు ఆంగ్లో ఇండియను సమాజమునకు అవి విశేష రాయితీలై యున్నంత మేరకు ఈ సంవిధాన ప్రారంభము నుండి పది సంవత్సరములు ముగియగనే ఆగిపోవలెను:

అంతేకాక, ఏ విద్యా సంస్థయు, అందు ప్రతి సంవత్సరము చేర్చుకొనబడు వారిలో కనీసము నూటికి నలుబది శాతము మంది ఆంగ్లో ఇండియను సమాజము కాక ఇతర సమాజములకు చెందిన వ్యక్తులై యుండిననే తప్ప, ఈ అనుచ్ఛేదము క్రింద ఎట్టి అనుదానమునుగాని పొందుటకు హక్కు కలిగి యుండరాదు.

**అనుసూచిత కులముల వారి కొరకు జాతీయ కమీషను.**

338. [2][(1) అనుసూచిత కులముల జాతీయ కమీషను అను పేరుతో పిలువబడు అనుసూచిత కులముల కమీషను ఒకటి ఉండవలెను.

(2) పార్లమెంటు ఈ విషయములో చేసిన ఏవేని శాసన నిబంధనలకు అధ్యధీనమై కమీషను ఛైర్‌పర్సన్, వైస్ ఛైర్‌పర్సన్ మరియు ఇతర సభ్యుల సేవా నిబంధనలు మరియు పదవీ కాలావధి రాష్ట్రపతిచే నియమముల ద్వారా నిర్ధారణ చేయబడినట్టివిగా ఉండవలెను.]

(3) రాష్ట్రపతి తన చేవ్రాలు మరియు ముద్రగల అధిపత్రము ద్వారా కమీషను యొక్క ఛైర్‌పర్సన్, వైస్-ఛైరపర్సన్ మరియు ఇతర సభ్యులను నియమించవలెను.

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''ఒకటవ అనుసూచి యొక్క భాగము 'ఏ'లో లేక భాగము 'బీ'లో నిర్దిష్టపరచబడిన అనుపదములు, అక్షరములు వదలివేయబడినవి.
2. సంవిధన (ఎనభై తొమ్మిదవ సవరణ) చట్టము, 2003 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా మార్జినల్ శీర్షికకు బదులుగా 19.2.2004 నుండి ఉంచబడినది.

(4) కమీషను, తన కార్య ప్రక్రియను క్రమబద్ధీకరించుకొను అధికారమును కలిగి ఉండవలెను.

(5) కమీషను, ఈ క్రింది కర్తవ్యములను కలిగి ఉండవలెను,–

(ఎ) ఈ సంవిధానము క్రింద లేదా తత్సమయమున అమలులోనున్న ఏదేని ఇతర శాసనము క్రింద లేదా ఏదేని ప్రభుత్వ ఉత్తరువు క్రింద అనుసూచిత కులములకు [1][* * *] సమకూర్చబడిన సంరక్షణలకు సంబంధించిన అన్ని విషయములను దర్యాప్తు మరియు పరిశీలన చేసి అట్టి సంరక్షణలు అమలు జరుగుతున్న తీరును అంచనా వేయుట;

(బి) అనుసూచిత కులముల [1][* * *] హక్కులు మరియు సంరక్షణలను హరించు నిర్దిష్ట ఫిర్యాధులను గురించి పరిశీలన చేయుట;

(సి) అనుసూచిత కులముల [1][* * *] సామాజిక, ఆర్థికాభివృద్ధి యొక్క ప్రణాళిక ప్రక్రియలో పాల్గొనుట మరియు సలహాలిచ్చుట, రాజ్యముల సంఘము మరియు ఏదేని రాజ్యము క్రింద వారి అభివృద్ధి ప్రగతిని అంచనావేయుట;

(డి) కమీషను అట్టి సంరక్షణల పనితీరుపై నివేదికలను వార్షికముగాను మరియు యుక్తమని భావించునట్టి ఇతర సమయములోను రాష్ట్రపతికి సమర్పించుట;

(ఇ) అనుసూచిత కులముల [1][* * *] రక్షణ, సంక్షేమము, సామాజిక ఆర్థికాభివృద్ధి కొరకైన సంరక్షణలను మరియు ఇతర చర్యలను కట్టుదిట్టముగా అమలు జరుపుటకై సంఘము లేదా ఏదేని రాజ్యము తీసుకొనవలసిన చర్యలకు సంబంధించినట్టి నివేదికలను మరియు సిఫార్సులను చేయుట; మరియు

(ఎఫ్) పార్లమెంటు చేయు ఏదేని శాసనము యొక్క నిబంధనలకు అధ్యధీనమై రాష్ట్రపతి నియమము ద్వారా నిర్ధిష్టపరచునట్టి, అనుసూచిత కులముల [1][* * *] రక్షణ సంక్షేమము, అభివృద్ధి మరియు పురోభివృద్ధికి సంబంధించినట్టి ఇతర కృత్యములను నిర్వర్తించుట; దీకరించు జ్ఞాపనపత్రం (మెమోరాండము)తో పాటు పార్లమెంటులోని ప్రతి సదనము సమక్షమున ఉంచబడునట్లు చేయవలెను.

---

1. సంవిధాన (89వ సవరణ) చట్టము, 2003 2వ పరిచ్ఛేదము ద్వారా ''మరియు అనుసూచిత జనజాతులకు'' అను పదములు 19.2.2004 నుండి లుప్తము చేయబడినవి.

(6) రాష్ట్రపతి అట్టి అన్ని నివేదికలను, సంఘమునకు సంబంధించిన సిఫారసులపై తీసుకొన్న చర్య లేదా తీసుకొనుటకు ప్రతిపాదించబడిన చర్య మరియు ఏదేని అట్టి సిఫారసులను ఆమోదించనిచో అట్లు ఆమోదింపబడకుండుటకు గల కారణములను విశ

(7) ఏదేని అట్టి నివేదిక లేదా అందులోని ఏదేని భాగము ఏదేని రాజ్యప్రభుత్వమునకు సంబంధించిన విషయమునకు చెందినచో అట్టి నివేదిక సంబంధిత రాజ్య గవర్నరుకు పంపవలెను. ఆయన దానిని ఆ రాజ్యమునకు సంబంధించిన సిఫారసులపై తీసుకొన్న చర్యను, లేదా తీసుకొనుటకు ప్రతిపాదించిన చర్యను మరియు ఏవేని అట్టి సిఫారసులలో దేనినైనను ఆమోదించనిచో అట్లు ఆమోదించకుండుటకు గల కారణములను విశదీకరించు జ్ఞాపన పత్రం (మెమోరాండము)తో పాటు రాజ్య శాసనసభ సమక్షమున ఉంచబడునట్లు చేయవలెను.

(8) కమీషను (5)వ ఖండములోని ఉప-ఖండము (ఎ)లో పేర్కొన్న ఏదేని విషయమును దర్యాప్తు చేయునప్పుడు లేక ఖండము (బి)లో పేర్కొనిన ఏదేని ఫిర్యాదుపై పరిశీలన జరుపునప్పుడు ఒక దావా విచారించునప్పుడు సివిలు న్యాయస్థానమునకు ముఖ్యముగా ఈ క్రింది విషయములలో, ఉన్న అధికారములన్నింటిని కలిగి ఉండవలెను, అవేవనగా,-

(ఎ) భారత దేశపు ఏ భాగము నుండియైనను ఏ వ్యక్తినైనను సమను చేసి హాజరగునట్లు చూచుట మరియు ప్రమాణము చేయించి పరీక్షించుట;

(బి)ఏదేని దస్తావేజును వెల్లడించమని మరియు దాఖలు చేయమని కోరుట;

(సి) అఫిడవిట్లపై సాక్ష్యమును స్వీకరించుట;

(డి) ఏదేని న్యాయస్థానము లేదా కార్యాలయము నుండి ఏదేని పబ్లికు రికార్డును లేదా దాని ప్రతిని అభ్యర్థించుట;

(ఇ) సాక్ష్యులను మరియు దస్తావేజులను పరీక్షించుటకై కమీషనులను జారీ చేయుట;

(ఎఫ్) రాష్ట్రపతి, నియమము ద్వారా నిర్ధారించునట్టి ఏదేని ఇతర విషయము;

(9) [1][* * *] సంఘము మరియు ప్రతి రాజ్య ప్రభుత్వము అనుసూచిత కులములను ప్రభావపరచు ప్రధానమైన విధాన నిర్ణయ విషయములపై కమీషనును సంప్రదించవలెను.

[2][(10)] ఈ అనుచ్ఛేదములో అనుసూచిత కులములను గూర్చిన నిర్దేశములలో [3][* * *] ఆంగ్లో ఇండియను సమాజమును గూర్చిన నిర్దేశములు కూడా చేరియున్నట్టు అన్వయించబడవలెను.

**అనుసూచిత జనజాతుల వారి కొరకు జాతీయ కమీషను.**

1. సంవిధాన (యనభై తొమ్మిదవ సవరణ) చట్టము, 2003 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా ''మరియు అనుసూచిత జనజాతులు'' అనుపదములు 19.2.2004 నుండి లుప్తము చేయబడినవి.
2. సంవిధాన (అరువది ఐదవ సవరణ) చట్టము, 1990 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ఖండము (3)ను ఖండము (10)గా 12.3.1992 నుండి తిరిగి అంకెవేయబడినది.
3. సంవిధాన (నూట రెండవ సవరణ) చట్టము, 2018 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా, కొన్ని పదములు లుప్తము చేయబడినవి.

[1][338ఏ. (1) అనుసూచిత జనజాతుల జాతీయ కమీషను అను పేరుతో పిలువబడు అనుసూచిత జనజాతులు కమీషను ఒకటి ఉండవలెను.

(2) పార్లమెంటు ఈ విషయములో చేసిన ఏవేని శాసన నిబంధనలకు అధ్యధీనమై కమీషను ఛైర్‌పర్సన్, వైస్-ఛైర్‌పర్సన్ మరియు ముగ్గురు ఇతర సభ్యులతో కూడి యుండవలెను. అట్లు నియమించబడిన ఛైర్‌పర్సన్, వైస్-ఛైర్‌పర్సన్ మరియు ఇతర సభ్యుల సేవా నిబంధనలు మరియు పదవీ కాలావధి రాష్ట్రపతిచే నియమముల ద్వారా నిర్ధారణ చేయబడినట్టివిగా ఉండవలెను.

(3) రాష్ట్రపతి తన చేవ్రాలు మరియు ముద్రగల అధిపత్రము ద్వారా కమీషను యొక్క ఛైర్‌పర్సన్, వైస్-ఛైర్‌పర్సన్ మరియు ఇతర సభ్యులను నియమించవలెను;

(4) కమీషను తన కార్యప్రక్రియను క్రమబద్ధీకరించుకొను అధికారమును కలిగి ఉండవలెను.

(5) కమీషను, ఈ క్రింది కర్తవ్యములను కలిగి ఉండవలెను,-

(ఎ) ఈ సంవిధానము క్రింద లేదా అమలులోనున్న ఏదేని ఇతర శాసనము క్రింద లేదా ఏదేని ప్రభుత్వ ఉత్తరువు క్రింద అనుసూచిత జనజాతులకు సమకూర్చబడిన సంరక్షణలకు సంబంధించిన అన్ని విషయములను దర్యాప్తు మరియు పరిశీలన చేసి అట్టి సంరక్షణలు అమలు జరుగుతున్న తీరును అంచనావేయుట;

(బి) అనుసూచిత జనజాతుల హక్కుల మరియు సంరక్షణలను హరించు నిర్దిష్ట ఫిర్యాదులను గూరించి పరిశీలన చేయుట;

(సి) అనుసూచిత జనజాతుల సామాజిక, ఆర్థికాభివృద్ధి యొక్క ప్రణాళిక ప్రక్రియలో పాల్గొనుట మరియు సలహాలిచ్చుట, రాజ్యముల సంఘము మరియు ఏదేని రాజ్యము క్రింద వారి అభివృద్ధి ప్రగతిని అంచనావేయుట;

(డి) కమీషను, అట్టి సంరక్షణల పనితీరుపై నివేదికలను వార్షికముగాను మరియు యుక్తమని భావించునట్టి ఇతర సమయములలోను రాష్ట్రపతికి సమర్పించుట;

(ఇ) అనుసూచిత జనజాతుల రక్షణ, సంక్షేమము, సామాజిక, ఆర్థికాభివృద్ధి కొరకైన సంరక్షణలను మరియు ఇతర చర్యలను కట్టుదిట్టముగా అమలు పరచుటకై సంఘము లేదా ఏదేని రాజ్యము తీసుకొనవలసిన చర్యలకు సంబంధించినట్టి నివేదికలను మరియు సిఫారసులను చేయుట; మరియు

(ఎఫ్) పార్లమెంటు చేయు ఏదేని శాసనము యొక్క నిబంధనలకు అధ్యధీనమై, రాష్ట్రపతి నియమము ద్వారా నిర్దిష్టపరచునట్టి అనుసూచిత జనజాతుల రక్షణ, సంక్షేమము, అభివృద్ధి మరియు పురోభివృద్ధికి సంబంధించినట్టి ఇతర కర్తవ్యములను నిర్వర్తించుట;

---

1. సంవిధాన (యనభై తొమ్మిదవ సవరణ) చట్టము, 2003 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 19.2.2004 నుండి చొప్పించబడినది.

(6) రాష్ట్రపతి అట్టి నివేదికలను సంఘమునకు సంబంధించిన సిఫారసులపై తీసుకొన్న చర్య లేదా తీసుకొనుటకు ప్రతిపాదించబడిన చర్య మరియు ఏదేని అట్టి సిఫారసును ఆమోదించబడినచో అట్లు ఆమోదింపబడకుండుటకు గల కారణములను విశదీకరించు జ్ఞాపనపత్రం (మెమోరాండము)తో పాటు పార్లమెంటులోని ప్రతి సదనము సమక్షమున ఉంచునట్లు చేయవలెను.

(7) ఏదేని అట్టి నివేదిక లేదా అందులోని ఏదేని భాగము ఏదేని రాజ్యప్రభుత్వమునక సంబంధించిన విషయమునకు చెందినదైనచో, అట్టి నివేదిక ప్రతిని సంబంధిత రాజ్య గవర్నరుకు పంపవలెను. ఆయన దానిని ఆ రాజ్యమునకు సంబంధించిన సిఫారసులపై తీసుకున్న చర్యను లేదా తీసుకొనుటకు ప్రతిపాదించిన చర్యను మరియు ఏవేని అట్టి సిఫారసులలో దేనినైనను ఆమోదించనిచో, అట్లు ఆమోదించకుండుటకు గల కారణములను విశదీకరించు జ్ఞాపనపత్రం (మెమోరాండము)తో పాటు రాజ్య శాసన సభ సమక్షమున ఉంచునట్లు చేయవలెను.

(8) కమీషను (5)వ ఖండములోని ఉప-ఖండము (ఎ)లో పేర్కొనిన ఏదేని విషయమును దర్యాప్తు చేయునపుడు లేక ఖండము (బి)లో పేర్కొనిన ఏదేని ఫిర్యాదు పై పరిశీలన జరుపునపుడు, ఒక దావా విచారించునపుడు సివిలు న్యాయ స్థానమునకు ముఖ్యముగా ఈ క్రింది విషయములలో ఉన్న అధికారములన్నింటిని కలిగి వుండవలెను, అవేవనగా,-

(ఎ) భారతదేశపు ఏ భాగము నుండి యైనను ఏ వ్యక్తినైనను సమను చేసి హాజరగునట్లు చూచుట మరియు ప్రమాణము చేయించి పరీక్షించుట;

(బి) ఏవేని దస్తావేజులను ప్రకటీకరించమనియు, దాఖలు చేయుమనియు కోరుట;

(సి) అఫిడవిట్లపై సాక్ష్యమును స్వీకరించుట;

(డి) ఏదేని న్యాయస్థానమును లేదా కార్యాలయము నుండి ఏదేని పబ్లికు రికార్డును లేదా దాని ప్రతిని అభ్యర్థించుట;

(ఇ) సాక్షులను మరియు దస్తావేజులను పరీక్షించుటకై కమీషనులను జారీ చేయుట;

(ఎఫ్) రాష్ట్రపతి నియమము ద్వారా నిర్ధారించునట్టి ఏదేని ఇతర విషయము.

(9) సంఘము మరియు ప్రతి రాజ్యప్రభుత్వము అనుసూచిత జనజాతులను ప్రభావపరచు ప్రధానమైన విధాన నిర్ణయ విషయములపై కమీషనును సంప్రదించవలెను.]

**వెనుకబడిన తరగతుల వారికి జాతీయ కమీషను.**

[1][338బీ. (1) సామాజికముగా మరియు విద్యా విషయకంగా వెనుకబడిన తరగతులకు, వెనుకబడిన తరగతుల జాతీయ కమీషను అను పేరుతో పిలువబడు ఒక కమీషను ఉండవలెను.

(2) పార్లమెంటు ఈ విషయములో చేసిన ఏవేని శాసన నిబంధనలకు అధ్యధీనమై, కమీషను ఛైర్‌పర్సన్, వైస్-ఛైర్‌పర్సన్ మరియు ముగ్గురు ఇతర సభ్యులతో కూడి ఉండవలెను. అట్లు నియమించబడిన ఛైర్-పర్సన్, వైస్-ఛైర్‌పర్సన్ మరియు ఇతర సభ్యుల సేవా నిబంధనలు మరియు పదవీకాలావధి, రాష్ట్రపతిచే నియమముల ద్వారా నిర్ధారించబడునట్టివిగా ఉండవలెను.

---

1. సంవిధాన (నూటరెండవ సవరణ) చట్టము, 2018 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.

(3) రాష్ట్రపతి తన చేవ్రాలు మరియు ముద్రగల అధిపత్రము ద్వారా కమీషను యొక్క ఛైర్ పర్సన్, వైస్–ఛైర్ పర్సన్ మరియు ఇతర సభ్యులను నియమించవలెను.

(4) కమీషను తన కార్య ప్రక్రియను క్రమబద్ధము చేసుకొను అధికారమును కలగి ఉండవలెను.

(5) కమీషను ఈ క్రింది కర్తవ్యములను కలిగి ఉండవలెను–

(ఎ) ఈ సంవిధానము క్రింద లేదా తత్సమయమున అమలులోనున్న ఏదేని ఇతర శాసనము క్రింద లేదా ఏదైన ప్రభుత్వ ఉత్తరువు క్రింద సామాజికముగా మరియు విద్యావిషయకంగా వెనకబడిన తరగతులకు సమకూర్చుబడిన సంరక్షణలకు సంబంధించిన అన్ని విషయములను దర్యాప్తు మరియు పరిశీలన చేసి, అట్టి సంరక్షణలు అమలు జరుగుతున్న తీరును అంచనావేయుట;

(బి) సామాజికంగా మరియు విద్యా విషయకంగా వెనుకబడిన తరగతుల యొక్క హక్కులు మరియు సంరక్షణలను హరించు నిర్దిష్ట ఫిర్యాదులను గురించి పరిశీలన చేయుట;

(సి) సామాజికంగా మరియు విద్యావిషయకంగా వెనుకబడిన తరగతుల సామాజిక, ఆర్థికాభివృద్ధి యొక్క ప్రణాళికా రాజ్యముల సంఘము మరియు ఏదేని రాజ్యము క్రింద వారి అభివృద్ధి ప్రగతిని అంచనా వేయుట;

(డి) కమీషను, అట్టి సంరక్షణల పని తీరుపై వార్షికముగను మరియు యుక్తమని భావించునట్టి ఇతర సమయములలోను రాష్ట్రపతికి నివేదికలు సమర్పించుట;

(ఇ) సామాజికంగా మరియు విద్యావిషయకంగా వెనుకబడిన తరగతుల రక్షణ, సంక్షేమము, సామాజిక, ఆర్థికాభివృద్ధి కొరకైన సంరక్షణలను మరియు ఇతర చర్యలను కట్టు దిట్టముగా అమలు పరచుటకై సంఘము లేదా ఏదేని రాజ్యము తీసుకొనవలసిన చర్యలను సంబంధించినట్టి సిఫారసులపై నివేదికలను సమర్పించుట; మరియు

(ఎఫ్) పార్లమెంటు చేయు ఏదేని శాసనము యొక్క నిబంధనలకు అధ్యధీనమై, రాష్ట్రపతి, నియమము ద్వారా నిర్ధిష్టపరచునట్టి సామాజికంగా మరియు విద్యావిషయకంగా వెనుకబడిన తరగతుల రక్షణ, సంక్షేమము, అభివృద్ధి మరియు పురోభివృద్ధికి సంబంధించినట్టి ఇతర కర్తవ్యములను నిర్వర్తించుట.

(6) రాష్ట్రపతి, సంఘమును గూర్చిన సిఫారసులపై తీసుకొనిన లేదా తీసుకొనుటకు ప్రతిపాదించినట్టి చర్యను వివరించు జ్ఞాపన మరియు అట్టి ఏదేని సిఫారసుల యొక్క అనంగీకారములు ఏవైనా సదనముల సమక్షమున ఉంచవలసినట్టి నివేదికలన్నింటిని ఉంచబడునట్లు చూడవలెను.

(7) ఏదైనా అట్టి నివేదిక లేక దానిలోని ఏదైనా భాగము ఏదేని రాజ్య ప్రభుత్వమునకు సంబంధించిన విషయమైన యెడల, అట్టి నివేదిక యొక్క ఒక ప్రతిని రాజ్య ప్రభుత్వమునకు పంపవలెను. రాజ్యము తనకు సంబంధించిన సిఫారసులపై తీసుకొనిన లేదా తీసుకొనుటకు ప్రతిపాదించినట్టి చర్యను వివరించు జ్ఞాపన మరియు అట్టి ఏవేని సిఫారసుల యొక్క అనంగీకారములు

ఏవైనా ఉన్నచో, దానికిగల కారణములతో పాటుగా రాజ్య శాసనమండలి సమక్షమున ఉంచబడునట్లు చూడవలెను.

(8) కమీషను, ఖండము (5) యొక్క ఉప-ఖండము (ఎ)లో నిర్దేశించిన ఏదేని విషయమును దర్యాప్తు చేయునపుడు లేదా ఉప-ఖండము (బి)లో నిర్దేశించిన ఏదైనా ఫిర్యాదును విచారించునపుడు ప్రత్యేకముగా ఈ క్రింది వాటికి సంబంధించిన విషయములో ఒక దావాను విచారించుటలో ఒక సివిలు న్యాయస్థానము కలిగి ఉండు అధికారములు కలిగియుండును, అవేవనగా:-

(ఎ) భారత దేశము యొక్క ఏదేని ప్రదేశము నుండి ఎవరేని వ్యక్తిని పిలుచుట అతనిని హాజరు పరచి ప్రమాణముపై పరీక్షించుట;

(బి) ఏదేని దస్తావేజులను వెతికి, సమర్పించవలసినదిగా కోరుట;

(సి) అఫిడవిట్‌లపై సాక్ష్యమును స్వీకరించుట;

(డి) ఏదేని న్యాయస్థానము లేదా కార్యాలయము నుండి ఏదేని పబ్లిక్ రికార్డును లేక దాని ప్రతిని అభ్యర్థించుట;

(ఇ) సాక్షులను మరియు దస్తావేజులను పరీక్షించుట కొరకు కమీషనులు జారీ చేయుట;

(ఎఫ్) రాష్ట్రపతి, నియమము ద్వారా, నిర్ధారించు ఏదేని ఇతర విషయము.

(9) సామాజికముగా మరియు విద్యా విషయకముగా వెనుకబడిన తరగతులకు భంగము కలిగించు ప్రధాన విధానపరమైన విషయములన్నింటిపై, సంఘము మరియు ప్రతీ రాజ్య ప్రభుత్వము కమీషనును సంప్రదించవలెను.]

**అనుసూచిత ప్రాంతముల పరిపాలనపైనను, అనుసూచిత జనజాతుల శ్రేయస్సు పైనను సంఘము యొక్క నియంత్రణ.**

339. (1) [1][.......] రాజ్యములలోని అనుసూచిత ప్రాంతముల పరిపాలనను గూర్చియు, అనసూచిత జనజాతుల శ్రేయస్సును గూర్చియు, రిపోర్టు చేయుటకై ఒక కమీషనును రాష్ట్రపతి ఉత్తరువు ద్వారా ఎప్పుడైనను నియమించవచ్చును, మరియు ఈ సంవిధాన ప్రారంభము నుండి పది సంవత్సరములు ముగియగనే నియమించవలెను.

ఆ ఉత్తరువు, కమీషను యొక్క సంరచనను, అధికారములను, మరియు ప్రక్రియను నిర్వచించవచ్చును మరియు అది రాష్ట్రపతి ఆవశ్యకమని లేక వాంఛనీయమని తలచు, ఆనుషంగిక లేక సహాయక నిబంధనలను కలిగియుండవచ్చును.

(2) ఏదేని రాజ్యములోని అనుసూచిత జనజాతుల శ్రేయస్సుకు అత్యావశ్యకమని నిర్దిష్టపరచబడిన పథకములను రూపొందించుటను గూర్చియు వాటిని అమలుపరచుటను గూర్చియు

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''ఒకటవ అనుసూచి యొక్క భాగము-ఏ లేక భాగము-బీలో నిర్దిష్టపరచబడిన'' అను పదములు మరియు అక్షరములు వదలివేయబడినవి.

[1] [ఆ రాజ్యమునకు] ఆదేశముల నిచ్చుట, సంఘము యొక్క కార్యపాలకాధికారములో చేరియుండవలెను.

340. (1) భారత రాజ్య క్షేత్రములో సాంఘికమగును, విద్యావిషయకమగును వెనుకబడిన వర్గముల పరిస్థితులను గూర్చియు, వారు అనుభవించు ఇబ్బందులను గూర్చియు దర్యాప్తు చేయుటకు, అట్టి ఇబ్బందులను తొలగించుటకు, వారి పరిస్థితిని మెరుగువరచుటకు సంఘముచే గాని, ఏదేని రాజ్యముచేగాని, తీసుకొనబడవలసిన చర్యలను గూర్చియు అందు నిమిత్తము, సంఘముచేగాని ఏదేని రాజ్యముచే గాని చేయబడవలసిన అనుదానములను గూర్చియు, ఏ షరతులకు అధ్యధీనమై అట్టి అనుదానములు చేయబడవలెనో అట్టి షరతులను గూర్చియు, సిఫారసును చేయుటకు, తాను సబబని తలచు వ్యక్తులతో కూడిన ఒక కమీషను రాష్ట్రపతి ఉత్తరువు ద్వారా నియమించవచ్చును, మరియు అట్టి కమీషనును నియమించు ఉత్తరువు ఆ కమీషనుచే అనుసరిచబడవలసిన ప్రక్రియను నిర్వచించవలెను.

**వెనుకబడిన వర్గముల పరిస్థితులను దర్యాప్తు చేయుటకై ఒక కమీషను నియామకము.**

(2) అట్లు నియమించబడిన కమీషను, వారికి నిర్దేశింపబడిన విషయములను దర్యాప్తు చేసి వారు కనుగొనినట్టి సంగతులను పొంచువరచు, వారికి యుక్తమని తోచు సిఫారసులను చేయుచు, ఒక రిపోర్టును రాష్ట్రపతికి సమర్పించవలెను.

(3) రాష్ట్రపతి, ఆయనకు అట్లు సమర్పించబడిన రిపోర్టు యొక్క నకల నొకదానిని, ఆ రిపోర్టుపై తీసుకొని చర్యలను విశదీకరించు జ్ఞాపనపత్రంతో సహా, పార్లమెంటు యొక్క ప్రతి సదనము సమక్షమున ఉంచు ఏర్పాటు చేయించవలెను.

341. (1) [2][ఏదేని రాజ్యమును, [3][లేక సంఘరాజ్యక్షేత్రమును] గూర్చి, మరియు అది [4][* * *] ఒక రాజ్యమైనచో దాని గవర్నరుతో [5][* * *] సంప్రదించిన మీదట, రాష్ట్రపతి ఆ రాజ్యమునకు [2][లేక సందర్భానుసారముగ సంఘ రాజ్యక్షేత్రమునకు] సంబంధించి ఈ సంవిధానము నిమిత్తము అనుసూచిత కులములుగ భావింపబడవలసిన కులములను, జాతులను లేక ఆ కులముల, జాతుల

**అనుసూచిత కులములు.**

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ఏదేని అట్టి రాజ్యమును బదులుగా ఉంచబడినది.
2. సంవిధాన (ఒకటవ సవరణ) చట్టము, 1951 యొక్క 10 పరిచ్ఛేదము ద్వారా ''ఒక రాజ్యము యొక్క గవర్నరు లేక రాజప్రముఖ్‌తో సంప్రదించిన మీదట ''అనుపదములకు బదులుగా ఉంచబడినవి.
3. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా చొప్పించబడినది.
4. అదే చట్టము ద్వారా ''ఒకటవ అనుసూచి యొక్క భాగము–ఏ లేక భాగము–బీ లో నిర్దిష్టవరచబడిన'' అను పదములు మరియు అక్షరములు వదిలివేయబడినవి.
5. అదే చట్టపు 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజ్‌ప్రముఖ్'' అను పదములు వదలివేయబడనవి.

లేక జనజాతుల యొక్క భాగములను, లేక అందలి సముదాయములను బహిరంగ అధిసూచన[1] ద్వారా నిర్దిష్టపరచవచ్చును.

(2) పార్లమెంటు శాసనము ద్వారా, ఖండము (1) క్రింద జారీ చేయబడిన అధిసూచనలో నిర్దిష్టపరచబడిన అనుసూచిత కులముల సూచిలో ఏదేని కులమును, జాతిని, లేక జనజాతిని లేక ఆ కులము, జాతి లేక జనజాతి యొక్క ఏదేని భాగమును, లేక అందలి ఏదేని సముదాయమును చేర్చవచ్చును, లేక దానిని ఆ సూచి నుండి అపవర్జింపవచ్చును, కాని పైన చెప్పిన రీతిలో తప్ప, ఆ ఖండము క్రింద జారీ చేయబడిన అధిసూచన, అటు తరువాతి ఏ అధిసూచన ద్వారాను మార్చబడరాదు.

**అనుసూచిత జనజాతులు.**

342. (1) [2][ఏదేని రాజ్యమును, లేక [3][సంఘరాజ్యక్షేత్రమును] గూర్చి, మరియు అది [4][* * *] ఒక రాజ్యమైనచో దాని గవర్నరుతో [5][* * *] సంప్రదించిన మీదట, రాష్ట్రపతి ఆ రాజ్యమునకు [4][లేక సందర్భానుసారముగా సంఘ రాజ్యక్షేత్రమునకు] సంబంధించి ఈ సంవిధానము నిమిత్తము అనుసూచిత జనజాతులుగ భావింపబడవలసిన జనజాతులను లేక జనజాతుల సమాజములను లేక ఆ జనజాతుల, లేక జనజాతి సమాజముల భాగములను, లేక అందలి సముదాయములను, [6][బహిరంగ అధిసూచన ద్వారా] నిర్దిష్టపరచవచ్చును.

---

1. చూడుము: ఎప్పటికప్పుడు సవరించబడినట్టి సంవిధాన (అనుసూచిత) ఉత్తరువు, 1950 (సి.ఓ.19), సంవిధాన (అనుసూచిత కులముల) (సంఘరాజ్యక్షేత్రముల) ఉత్తరువు (సి.ఓ.32), సంవిధాన (జమ్మూ కాశ్మీరు) అనుసూచిత కులముల ఉత్తరువు, 1956 (సి.ఓ.52), సంవిధాన (దాద్రానగర్ హవేలీ) అనుసూచిత కులముల ఉత్తరువు, 1962 (సి.ఓ.64); సంవిధాన (పుదుచ్చేరి) అనుసూచిత కులముల ఉత్తరువు, 1964 (సి.ఓ.68); సంవిధాన (గోవా, దామన్ మరియు డయ్యు) అనుసూచిత కులముల ఉత్తరువు, 1968 (సి.ఓ.81) మరియు సంవిధాన (సిక్కిం) అనుసూచిత కులముల ఉత్తరువు 1978 (సి.ఓ.110).
2. సంవిధాన (ఒకటవ సవరణ) చట్టము, 1951 యొక్క 11వ పరిచ్ఛేదము ''రాజ్యము యొక్క గవర్నరు లేక రాజప్రముఖ్‌ను సంప్రదించిన మీదట అను పదములకు బదులుగా ఉంచబడినవి.
3. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొకక 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా చొప్పించబడినది.
4. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''ఒకటవ అనుసూచి యొక్క భాగము ఏ లేక భాగము బీలో నిర్దిష్టపరచబడిన'' అను మాటలు మరియు అక్షరములు వదలివేయబడినవి.
5. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజప్రముఖ్'' అను పదములు రద్దు చేయబడినవి.
6. చూడుము: సంవిధాన (అనుసూచిత జనజాతుల) ఉత్తరువు, 1950 (సి.ఓ.22), సంవిధాన (అనుసూచిత (అనుసూచిత జనజాతుల) (సంఘరాజ్యక్షేత్రముల) ఉత్తరువు, 1951 (సి.ఓ.33), సంవిధాన (అండమాన్ మరియు నికోబార్‌దీవులు) అనుసూచిత జనజాతుల ఉత్తరువు, 1959 (సి.ఓ.58), సంవిధాన (దాద్రా మరియు నగర్‌హవేలీ) అనుసూచిత జనజాతుల ఉత్తరువు, 1962 (సి.ఓ.65), సంవిధాన (అనుసూచిత జనజాతుల) (ఉత్తరప్రదేశ్) ఉత్తరువు, 1967 (సి.ఓ.78), సంవిధాన (గోవా, డామన్ మరియు డయ్యు

(2) పార్లమెంటు, శాసనము ద్వారా, ఖండము (1) క్రింద జారీ చేయబడిన అధిసూచనలో నిర్దిష్టపరచబడిన అనుసూచిత జనజాతుల సూచిలో ఏదేని జనజాతిని, లేక జనజాతి సమాజము లేక జనజాతి యొక్క లేక జనజాతి సమాజము యొక్క ఏదేని భాగమును, లేక అందలి ఏదేని సముదాయమును చేర్చవచ్చును లేక దానిని ఆ సూచి నుండి అపవర్జించవచ్చును, కాని పైన చెప్పిన రీతిలో తప్ప, ఆ ఖండము క్రింద జారీ చేయబడిన అధిసూచన అటు తరువాత ఏ అధిసూచన ద్వారాను మార్చబడరాదు.

**సామాజికముగా మరియు విద్యా విషయకముగా వెనుకబడిన తరగతులు.**

[1][342ఏ. (1) రాష్ట్రపతి, ఏదైనా రాజ్యము లేదా సంఘ రాజ్యక్షేత్రమునకు సంబంధించి, మరియు అది ఒక రాజ్యమైనపుడు, దాని యొక్క గరవ్నరును సంప్రదించిన మీదట, బహిరంగ అధిసూచన ద్వారా, ఆ రాజ్యము లేదా సందర్భానుసారముగా సంఘ రాజ్యక్షేత్రమునకు సంబంధించి సామాజికముగా మరియు విద్యా విషయముగా వెనుకబడిన తరగతులుగా భావించుటకు ఈ సంవిధానము యొక్క ప్రయోజనముల కొరకు సామాజికముగా మరియు విద్యావిషయకముగా వెనుకబడిన తరగతులను నిర్దిష్టపరచవచ్చును.

(2) పార్లమెంటు, శాసనము ద్వారా, ఏదైనా సామాజికముగా మరియు విద్యావిషయకముగా వెనుకబడిన తరగతిని ఖండము (1) క్రింద జారీ చేయబడిన అధిసూచనలో నిర్దిష్టపరచబడిన సామాజికంగా మరియు విద్యావిషయకంగా వెనుకబడిన తరగతుల యొక్క కేంద్ర జాబితాలో చేర్చవచ్చును లేదా దాని నుండి తొలగించవచ్చును, అయితే పైన పేర్కొనబడునట్లు తప్ప సదరు ఖండము క్రింద జారీ చేయబడిన అధిసూచన ఏదేని తదనంతర అధిసూచన ద్వారా విభేదించునదిగా ఉండరాదు.]

## భాగము–17

## రాజభాష

### అధ్యాయము – 1 – సంఘ భాష

**సంఘ రాజ భాష.**

343. (1) సంఘము యొక్క రాజభాష, దేవనాగరి లిపిలో హిందీయైయుండవలెను.

సంఘము యొక్క అధికారిక ప్రయోజనముల కొరకు ఉపయోగించబడవలసిన అంకెల రూపము, భారతీయ అంకెల అంతర్జాతీయ రూపమై యుండవలెను.

(2) ఖండము (1)లో ఏమియున్నప్పటికినీ, ఈ సంవిధాన ప్రారంభము నుండి పదునైదు సంవత్సరముల కాలావధి వరకు, ఇంగ్లీషు భాష అట్టి ప్రారంభమునకు అవ్యవహితపూర్వము అధికారిక

---

అనుసూచిత జనజాతుల ఉత్తరువు, 1968 (సి.ఓ.82), సంవిధాన (నాగాలాండ్) అనుసూచిత జనజాతుల ఉత్తరువు, 1970 (సి.ఓ.88) మరియు సంవిధాన (సిక్కిం) అనుసూచిత జనజాతుల ఉత్తరువు, 1978 (సి.ఓ.111).

1. సంవిధాన (నూట రెండవ సవరణ) చట్టము, 2018 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 342ఏ అనుచ్ఛేదము 11.08.2018 నుండి చొప్పించబడినది.

ప్రయోజనములలో వేటి కొరకు ఉపయోగించబడుచుండెనో, అట్టి ప్రయోజనములన్నిటి కొరకు ఉపయోగించబడుచుండవలెను:

అయితే రాష్ట్రపతి సదరు కాలావధిలో సంఘము యొక్క అధికారిక ప్రయోజనములలో దేనికొరకైనను, ఇంగ్లీషు భాషతో పాటు హిందీ భాషను మరియు భారతీయ అంకెల అంతర్జాతీయ రూపముతో పాటు అంకెల దేవనాగరి రూపమును ఉపయోగించుటకు [1] [ఉత్తరువు ద్వారా] ప్రాధికారము నొసగవచ్చును.

(3) ఈ అనుచ్ఛేదములో ఏమియున్నప్పటికినీ, పార్లమెంటు శాసనము ద్వారా, ఆ శాసనములో నిర్దిష్టపరచబడు ప్రయోజనముల కొరకు,–

(ఎ) ఇంగ్లీషు భాషను, లేక

(బి) అంకెల దేవనాగిరి రూపమును

సదరు పదునైదు సంవత్సరము కాలావధి తరువాత ఉపయోగించుటకై నిబంధనలు చేయవచ్చును.

**రాజభాష విషయమున కమీషను మరియు పార్లమెంటు కమిటీ.**

344. (1) ఈ సంవిధాన ప్రారంభము నుండి అయిదు సంవత్సరములు ముగియుగనే, మరియు అటుపిమ్మట అట్టి ప్రారంభము నుండి పది సంవత్సరములు ముగియుగనే, రాష్ట్రపతి ఉత్తరువు ద్వారా ఒక కమీషనును సంఘటితము చేయవలెను. ఆ కమీషను రాష్ట్రపతి నియమించు ఒక అధ్యక్షునితోను, ఎనిమిదవ అనుసూచిలో నిర్దిష్టపరచబడిన వివిధ భాషలకు ప్రాతినిధ్యము వహించు ఇతర సభ్యులతోను కూడియుండవలెను మరియు, ఆ ఉత్తరువు ఆ కమీషనుచే అనుసరించబడవలసిన ప్రక్రియను నిర్వచింపవలెను.

(2) ఈ క్రింది విషయములను గురించి రాష్ట్రపతికి సిఫారసులు చేయుట ఆ కమీషను కర్తవ్యమైయుండవలెను, అవేవనగా:–

(ఎ) సంఘము యొక్క అధికారిక ప్రయోజనముల కొరకు హిందీ భాషను క్రమక్రమముగా హెచ్చుగా ఉపయోగించుట;

(బి) సంఘము యొక్క అధికారిక ప్రయోజనములన్నింటికి గాని, వాటిలో దేనికైన గాని ఇంగ్లీషు భాషను ఉపయోగించుటపై నిర్బంధనలు;

(సి) 348వ అనుచ్ఛేదములో పేర్కొనబడిన ప్రయోజనములన్నింటి కొరకు గాని, వాటిలో వేటికొరకైనగాని, ఉపయోగించబడవలసిన భాష;

(డి) సంఘము యొక్క ఒకటి లేక అంతకు మించిన నిర్దిష్ట ప్రయోజనముల కొరకు ప్రయోగించబడవలసిన అంకెల రూపము;

(ఇ) సంఘము యొక్క రాజభాషను గూర్చి సంఘములకును ఒక రాజ్యమునకును మధ్య లేక ఒక రాజ్యమునకు మరొక రజ్యమునకును మధ్య ఉత్తరప్రత్యుత్తరముల భాషను గూర్చి మరియు

---

1. చూడుము (సీ.ఓ.41).

ఆ భాషలను ఉపయోగించుటను గూర్చి రాష్ట్రపతిచే ఆ కమీషనుకు నిర్దేశించబడిన ఏదేని ఇతర విషయము;

(3) ఆ కమీషను ఖండము (2) క్రింద సిఫారసులను చేయుటలో భారతదేశపు పారిశ్రామిక సాంస్కృతిక మరియు వైజ్ఞానిక పురోభివృద్ధిని, మరియు పబ్లికు సేవల విషయమున హిందీభాష మాట్లాడని ప్రాంతములకు చెందిన వ్యక్తుల న్యాయమైన క్లెయిములను మరియు హితములను తగినట్లు గమనించవలెను;

(4) ఏకల అంతరణీయ వోటు ద్వారా అనుపాతక ప్రాతినిధ్య పద్ధతిననుసరించి, లోక్‌సభ యొక్క సభ్యులచే ఆ సభ నుండి ఎన్నుకొనబడు ఇరువది మంది సభ్యులతోను, అట్టి పద్ధతిననుసరించి రాజ్యసభ యొక్క సభ్యులచే ఆ సభ నుండి ఎన్నుకొనబడు పది మంది సభ్యులతో కూడియుండిన ముప్పది మంది సభ్యులుగల కమిటీ ఒకటి సంఘటితము చేయబడవలెను;

(5) ఖండము (1) క్రింద సంఘటితము చేయబడిన కమీషను యొక్క సిఫారసులను పరిశీలించి, వాటిపై తమ అభిప్రాయములను రాష్ట్రపతికి నివేదించుట కమిటీ కర్తవ్యమైయుండ వలెను;

(6) 343వ అనుచ్ఛేదములో ఏమియున్నప్పటికినీ, రాష్ట్రపతి ఖండము (5)లో నిర్దేశించబడిన నివేదికను పర్యాలోచించిన మీదట, అట్టి పూర్తి నివేదికననుసరించి గాని, అందలి ఏదేని భాగముననుసరించిగాని ఆదేశములను జారీ చేయవచ్చును.

## అధ్యాయము – 2 – ప్రాంతీయ భాషలు

**రాజ్యము యొక్క రాజభాష లేక రాజభాషలు.**

345. అనుచ్ఛేదములు 346 మరియు 347 యొక్క నిబంధనలకు అధ్యధీనమై ఒక రాజ్య శాసనమండలి, ఆ రాజ్యమునందు వాడుకలో నున్న ఏ ఒక భాషనుగాని బహు భాషలనుగాని, లేక హిందీ భాషను గాని, ఆ రాజ్యము యొక్క అధికారిక ప్రయోజనములన్నింటికి లేక వాటిలో వేటికైనను, ఉపయోగింపబడవలసిన భాషగ, లేక భాషలుగ శాసనము ద్వారా అంగీకరించవచ్చును:

అయితే ఆ రాజ్య శాసనమండలి శాసనము ద్వారా అన్యథా నిబంధనలు చేయు వరకు ఇంగ్లీషు భాష ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము ఆ రాజ్యమునందు ఏ అధికారిక ప్రయోజనముల కొరకు ఉపయోగించబడుచుండెనో ఆ ప్రయోజనముల కొరకు ఆ భాషను ఉపయోగించుట కొనసాగుచుండవలెను.

**ఒక రాజ్యము మరొక రాజ్యము మధ్యను, ఒక రాజ్యము మరియు సంఘము మధ్యను, ఉత్తర ప్రత్యుత్తరములకై రాజభాష.**

346. అధికారిక ప్రయోజనముల కొరకు సంఘములో ఉపయోగించుటకుగాను, తత్సమయమున ప్రాధికారము పొందియున్న భాష, ఒక రాజ్యము మరొక రాజ్యము మధ్యను, ఒక రాజ్యము సంఘము మధ్యను ఉత్తరప్రత్యుత్తరములకు రాజభాషగ నుండవలెను:

అయితే, రెండు లేక అంతకు ఎక్కువ రాజ్యములు, తమ మధ్య ఉత్తర ప్రత్యుత్తరములకై, రాజభాషగ హిందీ భాష ఉండవలెనని ఒప్పుకొనినచో, ఆ భాష అట్టి ప్రత్యుత్తరములకై ఉపయోగించబడవచ్చును.

347. తద్విషయమై అభ్యర్థన చేయబడిన మీదట, ఒక రాజ్యము యొక్క జనాభాలో తగినంత భాగముగానున్న వారు తాము మాట్లాడు ఏదేని భాషను ఆ రాజ్యము గుర్తించవలెనని వాంఛించుచున్నారని రాష్ట్రపతి అభిప్రాయపడినచో, తాను నిర్దిష్టపరచు ఏదేని ప్రయోజనము కొరకు ఆ రాజ్యమునందంతటా, లేక అందలి ఏదేని భాగములో ఆ భాషను కూడా అధికార రీత్యా గుర్తించవలెనని ఆయన ఆదేశించవచ్చును.

**ఒక రాజ్యము యొక్క జనాభాలో ఒక భాగము వారు మాట్లాడు భాషకు సంబంధించిన విశేష నిబంధన.**

## అధ్యాయము – 3

## సర్వోన్నత న్యాయస్థానము, ఉన్నత న్యాయస్థానములు మున్నగువాటి యొక్క భాష

348. (1) ఈ భాగము యొక్క పూర్వగామి నిబంధనలలో ఏమున్నప్పటికిని, పార్లమెంటు శాసనము ద్వారా అన్యథా నిబంధనలు చేయువరకు ఈ క్రిందివి ఇంగ్లీషు భాషలో ఉండవలెను,–

**సర్వోన్నత న్యాయస్థాన మందును, ఉన్నత న్యాయస్థానము లందును చట్టములు, బిల్లులు మున్నగు వాటి కొరకు ఉపయోగించ వలసిన భాష.**

(ఎ) సర్వోన్నత న్యాయస్థానములోని, మరియు ప్రతి ఉన్నత న్యాయస్థానములోని చర్యలు అన్నియు;

(బి)(i) పార్లమెంటు ఉభయ సదనములలో ఏ సదనమునందుగాని, రాజ్య శాసనమండలి సదనమునందు లేక ఉభయ సదనములలో ఏ సదనము నందుగాని ప్రవేశపెట్టబడు అన్ని బిల్లుల యొక్క లేక వాటి విషయమున ప్రతిపాదించబడు అన్ని సవరణల యొక్క ప్రాధీకృత పాఠములు;

(ii) పార్లమెంటుచే గాని, ఒక రాజ్య శాసన మండలిచే గాని చేయబడిన అన్ని చట్టముల యొక్కయు, రాష్ట్రపతిచేగాని, ఒక రాజ్య గవర్నరుచేగాని ప్రఖ్యాపన చేయబడిన అన్ని అధ్యాదేశముల యొక్కయు, ప్రాధీకృత పాఠములు మరియు;

(iii) ఈ సంవిధానము క్రింద లేక పార్లమెంటుచేగాని, ఒక రాజ్య శాసనమండలిచే గాని, చేయబడిన ఏదేని శాసనము క్రింద జారీ చేయబడిన అన్ని ఉత్తరువులు, నియమములు, వినియమములు మరియు ఉపవిధుల యొక్క ప్రాధీకృత పాఠములు.

(2) ఖండము (1) యొక్క ఉప-ఖండము (ఎ)లో ఏమియున్నప్పటికిని, రాష్ట్రపతి పూర్వసమ్మతితో ఏదేని రాజ్యము యొక్క గవర్నరు, [1][* * *] ఆ రాజ్యములో ప్రధాన స్థానముగల ఉన్నత న్యాయస్థానపు చర్యలలో, హిందీ భాషనుగాని ఆ రాజ్యపు అధికారిక ప్రయోజనములలో దేనికొరకైన ఉపయోగించబడుచున్న ఏదేని ఇతర భాషను గాని ఉపయోగించుటకు ప్రాధికారము నొసగవచ్చును:

అయితే, ఈ ఖండములో నున్నదేదియు, అట్టి ఉన్నత న్యాయస్థానముచే ఇవ్వబడు ఏదేని తీర్పుకు డిక్రీకి, లేక ఉత్తరువుకు వర్తించరాదు.

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజ్‌ప్రముఖ్'' అను పదములు వదలివేయబడినవి.

(3) ఖండము (1) యొక్క ఉప-ఖండము (బి)లో ఏమియున్నప్పటికిని, ఏదేని రాజ్య శాసనమండలిలో ప్రవేశపెట్టబడు బిల్లులలోను, లేక దానిచే పాస్ చేయబడు చట్టములలోను, లేక ఆ రాజ్య గవర్నరుచే [1][* * *] ప్రఖ్యానించబడు అధ్యాదేశములలోను, లేక ఆ ఉప-ఖండము యొక్క పేరా (iii)లో నిర్దేశితమైన ఏదేని ఉత్తరువు, నియమము, వినియమము లేక ఉప-విధిలోను ఉపయోగించుటకై ఆ రాజ్య శాసనమండలి ఇంగ్లీషు భాష మినహా ఏదేని ఇతర భాషను విహితము చేసిన యెడల, ఆ భాషా పాఠమునకు ఆ రాజ్య గవర్నరు యొక్క ప్రాధికారము క్రింద రాజ్యము యొక్క అధికారిక రాజపత్రము ప్రచురించబడిన ఇంగ్లీషు అనువాదము, ఈ అనుచ్ఛేదము క్రింద ఇంగ్లీషు భాషలో దాని అధికారిక పాఠముగా భావించబడవలెను.

**భాషను సంబంధించిన కొన్ని శాసనములను చేయుటకు విశేష ప్రక్రియ.**

349. ఈ సంవిధాన ప్రారంభము నుండి పదునైదు సంవత్సరముల కాలావధిలో 348వ అనుచ్ఛేదము యొక్క ఖండము (1) పేర్కొనబడిన ఏదేని ప్రయోజనము కొరకు ఉపయోగించబడ వలసిన భాషకై నిబంధనలు చేయు ఏ బిల్లుగాని, సవరణగాని రాష్ట్రపతి యొక్క పూర్వమంజూరీ లేకుండ పార్లమెంటు ఉభయ సదనములలో ఏ సదనమునందుగాని ప్రవేశపెట్టబడరాదు లేక ప్రస్తావించబడరాదు, మరియు 344వ అనుచ్ఛేదము యొక్క ఖండము (1) క్రింద సంఘటితమైన కమీషను యొక్క సిఫారసులను మరియు ఆ అనుచ్ఛేదము యొక్క ఖండము (4) క్రింద సంఘటితమైన కమిటీ యొక్క నివేదికను పర్యాలోచించిన మీదటనే తప్ప, అట్టి ఏదేని బిల్లును ప్రవేశపెట్టుటకు లేక అట్టి ఏదేని సవరణను ప్రస్తావించుటకు రాష్ట్రపతి తన మంజూరీని ఈయరాదు.

## అధ్యాయము – 4 – విశేష ఆదేశములు

**వ్యథల నివారణ కొరకైన విన్నపములలో ఉపయోగించవలసిన భాష.**

350. ఏదేని వ్యథ నివారణకై, సంఘము లేక రాజ్యము యొక్క ఎవరేని అధికారికి లేక ప్రాధికారికి సంఘములోగాని సందర్భానుసారముగా ఆ రాజ్యములోగాని ఉపయోగింపబడు ఏ భాషలోనైనను విన్నపము సమర్పించుకొనుటకు ప్రతి వ్యక్తియు హక్కు కలిగియుండును.

**ప్రాథమిక దశలో మాతృభాషలో విద్యాభోదన సౌకర్యములు.**

[1][350ఏ. ప్రతి రాజ్యము, మరియు రాజ్యములోని ప్రతి స్థానిక ప్రాధికారి, భాషా విషయక అల్పసంఖ్యాక వర్గములకు చెందిన పిల్లలకు ప్రాథమిక దశలో మాతృభాషలో విద్యాభోధనకు తగిన సౌకర్యములను సమకూర్చుటకు ప్రయత్నించవలెను. అట్టి సౌకర్యములను చేకూర్చుటకు తాను ఆవశ్యకమని, లేక ఉచితమని తలచెడు ఆదేశములను రాష్ట్రపతి జారీ చేయవచ్చును.

**భాషావిషయక అల్పసంఖ్యాకుల కొరకు విశేషాధికారి.**

350బీ. (1) భాషా విషయక అల్ప సంఖ్యాకుల కొరకు రాష్ట్రపతిచే నియమించబడు ఒక విశేషాధికారి ఉండవలెను.

(2) ఈ సంవిధనము క్రింద భాషా విషయక అల్పసంఖ్యాకులకు సమకూర్చబడిన సంరక్షణకు సంబంధించిన సకల విషయములను దర్యాప్తు చేసి, రాష్ట్రపతి ఆదేశించునట్టి అంతరావధులలో ఆ విషయములపై రాష్ట్రపతికి రిపోర్టు చేయుట విశేషాధికారి యొక్క కర్తవ్యమై యుండవలెను, రాష్ట్రపతి

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 21వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.

అట్టి రిపోర్టులు పార్లమెంటు యొక్క ప్రతి సదనము సమక్షమున ఉంచబడునట్లును, సంబంధిత రాజ్యముల ప్రభుత్వములకు పంపబడునట్లును ఏర్పాటు చేయించవలెను.]

**హింధీ భాషను అభివృద్ధి పరచుటకు ఆదేశము.**

351. హిందీ భాషా వ్యాప్తిని పెంపొందించుటయు, భారతదేశ సమ్మిశ్ర సంస్కృతికి చెందిన తత్వములన్నింటి భావ ప్రకటన సాధనముగ ఉపకరించునట్లు దానిని అభివృద్ధి చేయుటయు, దాని స్వభావమునకు భంగము కలుగకుండ హిందుస్తానీలోను, ఎనిమిదవ అనుసూచిలో నిర్దిష్టపరచబడియున్న ఇతర భారతీయ భాషలలోను, ఉపయోగించబడు రూపములను, శైలిని, నుడికారములను జీర్ణించుకొనుచు మరియు ఆవశ్యకమైనప్పుడు, లేక వాంఛనీయమైనప్పుడు ప్రధానముగ సంస్కృతము నుండియు అటు తరువాత తదితర ఇతర భాషల నుండియు శబ్దజాలమును గ్రైకొనుచు, అది సున్నంపన్నమగునట్లు చేయుట సంఘము యొక్క కర్తవ్యమై యుండవలెను.

## భాగము – 18

## ఆత్యయిక నిబంధనలు

**ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము.**

352. (1) యుద్ధమువలనగాని, బాహ్య దురాక్రమణవలన గాని, [1][సాయుధ తిరుగుబాటు] వలనగాని, భారత దేశము యొక్క లేక దాని రాజ్యక్షేత్రములోని ఏదేని భాగము యొక్క భద్రతకు భంగము వాటిల్లగల తీవ్రమైన ఆత్యయిక పరిస్థితి కలదని రాష్ట్రపతి అభిప్రాయపడినచో, ఆయన అట్టి పరిస్థితి కలదని అధిప్రఖ్యానము ద్వారా, [2][యావద్భారత దేశమును గూర్చిగాని, అధిప్రఖ్యానములో నిర్దిష్టపరచబడునట్టి రాజ్యక్షేత్ర భాగమును గూర్చిగాని], ప్రఖ్యానము చేయవచ్చును.

[3][**విశదీకరణ:–** యుద్ధము, బాహ్య దురాక్రమణ లేక సాయుధ తిరుగుబాటు సంభవించు అపాయము ఆసన్నమైనదని రాష్ట్రపతి అభిప్రాయపడినచో అది వాస్తవముగా సంభవించుటకు పూర్వమే అట్టి యుద్ధము లేక ఏదేని దురాక్రమణ లేక తిరుగుబాటువలన భారతదేశము యొక్క లేక దాని రాజ్యక్షేత్రములోని ఏదేని భాగము యొక్క భద్రతకు భంగము వాటిల్లనున్నదని ప్రఖ్యానించు ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము చేయబడవచ్చును.]

---

1. సంవిధాన (నలుబది నాల్గవ సవరణ) చట్టము, 1978 యొక్క పరిచ్ఛేదపు ఖండము (ఎ)లోని ఉప-ఖండము (i) ద్వారా ''అంత:కల్లోలము'' అను పదమునకు బదులుగా 20.6.1979 నుండి ఇది ఉంచబడినది.
2. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 48వ పరిచ్ఛేదము ద్వారా 3.1.1977 నుండి చొప్పించబడినది.
3. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 37వ పరిచ్ఛేదము ద్వారా 20.6.1979 నుండి చొప్పించబడినది.

[1][(2) ఖండము (1) క్రింద జారీ చేయబడిన అధిప్రఖ్యానము, తరువాతి అధిప్రఖ్యానము ద్వారా మార్పు లేక ప్రతిసంహరణ చేయబడవచ్చును.

(3) ఖండము (1) క్రింద అధిప్రఖ్యానము లేక అట్టి అధి ప్రఖ్యానమును మార్పు చేయు అధి ప్రఖ్యానము జారీ చేయబడవచ్చునను కేంద్ర క్యాబినేట్ (అనగా ప్రధాన మంత్రి మరియు 75వ అనుచ్ఛేదము క్రింద నియమించబడిన క్యాబినేట్ హోదా గల ఇతర మంత్రులతో కూడిన పరిషత్తు) యొక్క నిర్ణయము వ్రాతపూర్వకముగా రాష్ట్రపతికి తెలియజేయబడిననే తప్ప, ఆయన అట్టి అధిప్రఖ్యానమును జారీ చేయరాదు.

(4) ఈ అనుచ్ఛేదము క్రింద జారీ చేయబడిన ప్రతి అధిప్రఖ్యానము పార్లమెంటు యొక్క ప్రతిసదనము సమక్షమున ఉంచబడవలెను మరియు అది ఒక పూర్వపు అధిప్రఖ్యానమును ప్రతిసంహరించు అధిప్రఖ్యానమైననే తప్ప, ఒక మాసము ముగియుటకు పూర్వము పార్లమెంటు యొక్క ఉభయ సదనముల తీర్మానముల ద్వారా అది ఆమోదించబడిననే తప్ప ఆ కాలావధి ముగియగానే దాని అమలు ఆగిపోవలెను:

అయితే, (పూర్వపు అధిప్రఖ్యానమును ప్రతిసంహరించు అధిప్రఖ్యానము కానట్టి) ఏదేని అధిప్రఖ్యానము లోక్‌సభ విఘటన చేయబడి యుండిన సమయమున జారీ చేయబడినచో లేక ఈ ఖండములో నిర్దేశించబడిన ఒక మాసము కాలావధిలో లోక్‌సభ యొక్క విఘటన జరిగినచో మరియు ఆ అధిప్రఖ్యానమును ఆమోదించు తీర్మానము రాజ్యసభచే పాస్ చేయబడి ఆ కాలావధి ముగియుటకు పూర్వము అట్టి అధిప్రఖ్యానమునకు సంబంధించిన తీర్మానమేదియు లోక్‌సభ చే పాస్ చేయబడనిచో, లోక్‌సభ యొక్క పునస్సంఘటనానంతరము దాని మొదటి ఉపవేశనపు తేదీ నుండి ముప్పది దినములు ముగియుటకు పూర్వము, లోక్‌సభ కూడ ఆ అధిప్రఖ్యానమును ఆమోదించు తీర్మానమును పాస్ చేసిననేతప్ప, ఆ కాలావధి ముగియగానే ఆ అధిప్రఖ్యానము యొక్క అమలు ఆగిపోవలెను.

(5) అట్లు ఆమోదించబడిన అధిప్రఖ్యానము ఉపసంహరించబడిననే తప్ప, ఖండము (4) క్రింద ఆ అధిప్రఖ్యానమును ఆమోదించు రెండవ తీర్మానము పాస్ చేయబడిన తేదీ నుండి ఆరు మాసముల కాలావధి ముగిసిన మీదట దాని అమలు ఆగిపోవలెను:

అయితే పార్లమెంటు యొక్క ఉభయ సదనములు, అట్టి అధిప్రఖ్యానపు అమలు కొనసాగింపును ఆమోదించు తీర్మానమును పాస్ చేసినచో మరియు అట్లు పాస్ చేసినప్పుడెల్లను, ఆ అధిప్రఖ్యానము ప్రతిసంహరింపబడిననే తప్ప, ఈ ఖండము క్రింద ఏ తేదీ నుండి అన్యథా దాని అమలు ఆగిపోయి వుండెడిదో ఆ తేదీ నుండి ఇంకను ఆరు మాసముల వరకు అమలునందు కొనసాగవలెను:

అంతేకాక అట్టి ఏదైనా ఆరుమాసముల కాలములో లోక్‌సభ యొక్క విఘటన జరిగినచో, మరియు అట్టి అధిప్రఖ్యానము యొక్క అమలు కొనసాగింపును ఆమోదించు తీర్మానము రాజ్యసభచే పాస్ చేయబడి ఆ కాలావధిలో అట్టి అధిప్రఖ్యానపు అమలు కొనసాగింపును గూర్చిన తీర్మాన

---

1. అదే చట్టము, యొక్క 37వ పరిచ్ఛేదము ద్వారా (2) (2ఏ) మరియు (3) ఖండములకు బదులుగా 20.6.1979 నుండి ఉంచబడినది.

మేదియు లోక్‌సభ చే పాస్ చేయబడనిచో, లోక్‌సభ యొక్క పునస్సంఘటనానంతరము అది మొదటిసారిగా ఉపవేశనమగు తేదీ నుండి ముప్పది దినముల ముగియుటకు పూర్వము లోక్‌సభ కూడ అధిప్రఖ్యానపు అమలు కొనసాగింపును ఆమోదించు తీర్మానమును పాస్ చేసిననే తప్ప, ఆ కాలావధి ముగియుగనే ఆ అధిప్రఖ్యానపు అమలు ఆగిపోవలెను.

(6) ఖండములు (4) మరియు (5) నిమిత్తము పార్లమెంటు యొక్క ఏ సదనముచేనైనను, ఆ సదనము యొక్క మొత్తము సభ్యులలో అధిక సంఖ్యాకులచే, మరియు హాజరై, వోటు చేయుచున్నట్టి ఆ సదనపు సభ్యులలో మూడింట రెండు వంతులకు తక్కువకాని సంఖ్యాకులచే మాత్రమే ఒక తీర్మానము పాస్ చేయబడవచ్చును.

(7) పూర్వగామి ఖండములలో ఏమి యున్నప్పటికిని, ఖండము (1) క్రింద జారీ చేయబడిన అధిప్రఖ్యానమును లేక అట్టి అదిప్రఖ్యానమును మార్పు చేయు అధిప్రఖ్యానమును ఆమోదించకుండ లేక సందర్భానుసారముగ దాని అమలు కొనసాగింపును ఆమోదించకుండ, లోక్‌సభ ఒక తీర్మానమును పాస్ చేసినచో రాష్ట్రపతి ఆ అధిప్రఖ్యానమును ప్రతిసంహరించవలెను.

(8) ఖండము (1) క్రింద జారీ చేయబడిన అధిప్రఖ్యానమును లేక అట్టి అధిప్రఖ్యానమును మార్పు చేయు అధిప్రఖ్యానమును ఆమోదించకుండ లేక సందర్భానుసారముగ దాని అమలు కొనసాగింపును ఆమోదించకుండ ఒక తీర్మానమును ప్రస్తావించుటకు తమ ఉద్దేశమును తెలుపుచు లోక్‌సభ యొక్క మొత్తము సభ్యులలో పదవవంతు మందికి తక్కువ కాని వారిచే సంతకము చేయబడిన వ్రాతపూర్వక నోటీసు–

(ఎ) ఆ సదనము అధివేశనమునందున్నచో అధ్యక్షునకు;

(బి) ఆ సదనము అధివేశనమునందు లేనిచో రాష్ట్రపతికి,

ఈయబడిన యెడల, అధ్యక్షునికి లేక సందర్భానుసారముగ రాష్ట్రపతికి అట్టి నోటీసు అందిన తేదీ నుండి పదునాల్గు దినములలో ఆ సదనపు ప్రత్యేక ఉపవేశము, అట్టి తీర్మానమును పర్యాలోచించు నిమిత్తము ఏర్పాటు చేయబడవలెను.]

[1] [ [2] [(9)] రాష్ట్రపతిచే ఖండము (1) క్రింద ఇదివరకే ఒక అధిప్రఖ్యానము జారీ చేయబడియున్నను, లేకున్నను, మరియు అట్టి అధిప్రఖ్యానము అమలులోనున్నను, లేకున్నను, యుద్ధము బాహ్య దురాక్రమణ, [3][సాయుధ తిరుగుబాటు] సంభవించుట, లేక యుద్ధము, బాహ్య దురాక్రమణ, లేక [3][సాయుధ తిరగుబాటు] సంభవించు అపాయము ఆసన్నమగుట – ఈ విభిన్న

1. సంవిధాన (ముప్పది ఎనిమిదవ సవరణ) చట్టము, 1975 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా గతకాలిక ప్రభావంతో చొప్పించబడినది.

2. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 37వ పరిచ్ఛేదము ద్వారా లోగడ నున్న ఖండము (4)ను ఖండము (9)గా తిరిగి అంకె వేయబడినది.

3. అదే చట్టము యొక్క 37వ పరిచ్ఛేదము ద్వారా ''అంతఃకల్లోలము'' అను పదమునకు బదులుగా 20.6.1979 నుండి ఉంచబడినది.

ఆధారములపై విభిన్న అధిప్రఖ్యానములను జారీ చేయు అధికారము కూడ ఈ అనుచ్ఛేదము ద్వారా రాష్ట్రపతి ప్రదత్తము చేయబడిన అధికారమునందు చేరియుండవలెను.

[1] * * * *]

353. ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము అమలులో నున్నప్పుడు– **ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము యొక్క ప్రభావము.**

(ఎ) ఈ సంవిధానములో ఏమియున్నప్పటికిని, ఏ రాజ్యమునకైనను దాని కార్యపాలకాధికారమును వినియోగించు రీతిని గూర్చి ఆదేశముల నిచ్చుట, సంఘము యొక్క కార్యపాలకాధికారములో చేరియుండవలెను;

(బి) ఏదేని విషయము సంఘసూచి జాబితాలో పేర్కొన బడనిదైనప్పటికిని, దానిని గూర్చి సంఘమునకుగాని, సంఘమునకు చెందిన అధికారులకుగాని, ప్రాధికారులకుగాని అధికారములను ప్రదత్తము చేసేడి మరియు వారిపై కర్తవ్యములను విధించెడి లేక వారికి అధికారములను ప్రదత్తము చేయుటకు లేక వారిపై కర్తవ్యములను విధించుటకు ప్రాధికారము నొసగెడి, శాసనములను చేయు అధికారము, ఆ విషయమును గూర్చి శాసనములను చేయుటకు పార్లమెంటుకు గల అధికారములో చేరియుండవలెను:

[2] [అయితే ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము భారత రాజ్యక్షేత్రమునందలి ఏదేని భాగములో మాత్రమే అమలునందున్న యెడల,

(i) ఖండము (ఎ) క్రింద ఆదేశముల నొసగుటకు సంఘమునకు గల కార్యపాలకాధికారము; మరియు

(ii) ఖండము (బి) క్రింద శాసనములను చేయుటకు పార్లమెంటుకుగల అధికారము, ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము అమలునందున్నట్టి కార్య భారత రాజ్యక్షేత్ర భాగములోనయినను దాని సంబంధమునైనను జరుగు కలాపముల వలన భారతదేశము యొక్క లేక దాని రాజ్య క్షేత్రమునందలి ఏదేని భాగము యొక్క భద్రతకు భంగము వాటిల్లినచో, మరియు అంతమేరకు, ఏ రాజ్యములో లేక ఏ రాజ్యములోనిదైన ఏదేని భాగములో ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము అమలులోనున్నదో ఆ రాజ్యము కానట్టి ఏదేని ఇతర రాజ్యమునకు కూడ విస్తరించును.]

354. (1) ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము అమలులో నున్నప్పుడు, 268 నుండి 279 వరకు గల అనుచ్ఛేదముల నిబంధనలన్నియు గాని, వాటిలో ఏవేనిగాని అట్టి అధిప్రఖ్యానము యొక్క అమలు ఏ విత్తీయ సంవత్సరములో ఆగిపోవునో ఆ సంవత్సరము దాటి ఏ సందర్భములోను విస్తరించకుండ, ఆ ఆదేశమునందు నిర్దిష్టపరచబడిన కాలావధి వరకు, రాష్ట్రపతి సబబని తలచు **ఆత్యయికతను గూర్చి అధిప్రఖ్యానము అమలులోనున్నప్పుడు రెవెన్యూలను పంచుటకు సంబంధించిన నిబంధనల వర్తింపు.**

1. అదే చట్టము యొక్క 37వ పరిచ్ఛేదము ద్వారా ఖండము (5) 20.6.1979 నుండి లుప్తము చేయబడినది.
2. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 49వ పరిచ్ఛేదము ద్వారా 3.1.1977 నుండి చొప్పించబడినది.

మినహాయింపులకు లేక మార్పులకు అధ్యధీనమై ప్రభావము కలిగియుండవలెనని ఆయన ఉత్తరువు ద్వారా ఆదేశించవచ్చును.

(2) ఖండము (1) క్రింద చేయబడిన ప్రతి ఉత్తరువు అది చేయబడిన పిమ్మట వీలైనంత త్వరితముగా పార్లమెంటు యొక్క ప్రతి సదనము సమక్షమున ఉంచబడవలెను.

**బాహ్యదురాక్రమణ నుండియు, అంతఃకల్లోలము నుండియు రాజ్యములను రక్షించుట సంఘము యొక్క కర్తవ్యము.**

355. బాహ్య దురాక్రమణనుండియు, అంతఃకల్లోలమునుండియు ప్రతి రాజ్యమును రక్షించుట, మరియు ప్రతి రాజ్యము యొక్క పరిపాలన ఈ సంవిధాన నిబంధనలననుసరించి జరుగునట్లు కట్టుదిట్టము చేయుట సంఘము యొక్క కర్తవ్యమై యుండవలెను.

**రాజ్యములలో సంవిధాన యంత్రాంగము విఫలమైన సందర్భములో నిబంధనలు.**

356. (1) ఏదేని రాజ్యము యొక్క గవర్నరు [1][* * *] నుండి రిపోర్టు అందిన మీదటనైనను, అన్యథాయైనను ఈ సంవిధాన నిబంధనలననుసరించి ఆ రాజ్యము యొక్క పరిపాలనను జరుపుటకు వీలుకాని పరిస్థితి ఏర్పడినదని రాష్ట్రపతి అభిప్రాయపడినచో, రాష్ట్రపతి అధిప్రఖ్యానము ద్వారా–

(ఎ) ఆ రాజ్య ప్రభుత్వము యొక్క కృత్యములనన్నిటినిగాని వాటిలో వేటినిగాని, మరియు గవర్నరులో [2][* * *] నిహితమైయున్న లేక ఆయనచే వినియోగించదగిన లేక ఆరాజ్య శాసనమండలి మినహా ఆ రాజ్యములోని ఏదేని ఇతర నికాయములోగాని, ప్రాధికారిలోగాని నిహితమైయున్న లేక అట్టి నికాయములోగాని, ప్రాధికారిలోగాని నిహితమైయున్న లేక అట్టి నికాయముచేగాని, ప్రాధికారిచేగాని వినియోగించబడదగిన అధికారములను అన్నిటినిగాని, వాటిలో వేటినిగాని తానే పరిగ్రహించ వచ్చును.

(బి) ఆ రాజ్య శాసనమండలికి చెందిన అధికారములు పార్లమెంటుచేగాని, దాని ప్రాధికారము క్రిందగాని వినియోగించబడవలెనని ప్రఖ్యానించవచ్చును;

(సి) అధిప్రఖ్యానము యొక్క ఉద్దేశములను నెరవేర్చుటకుగాను ఆ రాజ్యములోని ఏదేని నికాయమునకు, లేక ప్రాధికారికి సంబంధించి ఈ సంవిధానములోనున్న ఏవేని నిబంధనల అమలును పూర్ణతః లేక భాగతః లేక సస్పెండు చేయు నిబంధనలతో సహా, తాను ఆవశ్యకమని లేక వాంఛనీయమని తలచు ఆనుషంగిక మరియు పారిణామిక నిబంధనలను చేయవచ్చును:

అయితే ఉన్నత న్యాయస్థానమునందు నిహితమైయున్న, లేక దానిచే వినియోగించబడదగిన అధికారములలో దేనినైనను, తానే పరిగ్రహించుటకు, లేక ఉన్నత న్యాయస్థానములకు సంబంధించి ఈ

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజ్‌ప్రముఖ్'' అను పదములు వదలివేయబడినవి.

2. అదే చట్టము ద్వారా ''లేక సందర్భానుసారముగా రాజ్‌ప్రముఖ్'' అను పదములు వదలివేయబడినవి.

సంవిధానములో నున్న ఏవేని నిబంధనల అమలును పూర్ణతః లేక భాగతః లేక సస్పెండు చేయుటకు ఈ ఖండములో నున్న దేదియు, రాష్ట్రపతికి ప్రాధికారము నొసగరాదు.

(2) అట్టి ఏ అధిప్రఖ్యానమైనను తరువాతి అధిప్రఖ్యానము ద్వారా ప్రతిసంహరింపబడ వచ్చును, లేక మార్చబడవచ్చును.

(3) ఈ అనుచ్ఛేదము క్రింది ప్రతి అధిప్రఖ్యానము పార్లమెంటు యొక్క ప్రతి సదనము సమక్షమున ఉంచబడవలెను; మరియు అది ఒక పూర్వపు అధిప్రఖ్యానమును ప్రతిసంహరించు అధిప్రఖ్యానమైననే తప్ప, రెండు మాసములు ముగియుటకు పూర్వము పార్లమెంటు యొక్క ఉభయ సదనముల తీర్మానముల ద్వారా అది ఆమోదించబడిననే తప్ప, ఆ కాలావధి ముగియగానే దాని అమలు ఆగిపోవును:

అయితే, (పూర్వపు అధిప్రఖ్యానమును ప్రతిసంహరించు అధిప్రఖ్యానము కానట్టి) ఏదేని అధిప్రఖ్యానము లోక్‌సభ విఘటన చేయబడి యుండిన సమయమున జారీ చేయబడినచో లేక ఈ ఖండములో నిర్దేశింపబడిన రెండు మాసముల కాలావధిలో లోక్‌సభ యొక్క విఘటన జరిగినచో, మరియు ఆ అధిప్రఖ్యానము ఆమోదించు తీర్మానము రాజ్యసభచే పాస్ చేయబడి ఆ కాలావధి ముగియుటకు పూర్వము అట్టి తీర్మానమేదియు లోక్‌సభ చే పాస్ చేయబడనిచో, లోక్‌సభ యొక్క పునస్సంఘటనానంతరము అది మొదటిసారి ఉపవేశనమగు తేదీ నుండి ముప్పది దినములు ముగియుటకు పూర్వము లోక్‌సభ కూడా ఆ అధిప్రఖ్యానమును ఆమోదించు తీర్మానమును పాస్ చేసిననే తప్ప ఆ కాలావధి ముగియగనే ఆ అధిప్రఖ్యానము యొక్క అమలు ఆగిపోవును.

(4) అట్లు ఆమోదించబడిన అధిప్రఖ్యానము ప్రతిసంహరించబడిననే తప్ప [1] [ఆ అధిప్రఖ్యానమును జారీ చేసిన తేదీ నుండి ఆరు మాసములు] ముగిసిన మీదట, దాని అమలు ఆగిపోవును:

అయితే, పార్లమెంటు యొక్క ఉభయ సదనములు, అట్టి అధిప్రఖ్యానపు అమలు కొనసాగింపును ఆమోదించు తీర్మానమును పాస్ చేసినచో మరియు అట్లు పాస్ చేసినప్పుడెల్లను ఆ అధిప్రఖ్యానము ప్రతి సంహరించబడిననే తప్ప ఆ తీర్మానమును చేయని యెడల ఈ ఖండము క్రింద ఏ తేదీ నుండి అన్యథా దాని అమలు ఆగిపోయియుండెడిదో ఆ తేదీ నుండి ఇంకను [2] [ఆరు

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 50వ పరిచ్ఛేదము ద్వారా అంతకుముందన్న ''ఆరు మాసములు'' అను పదములకు బదులుగా ''ఒక సంవత్సరము అను పదములు ఉంచబడి, తిరిగి సంవిధాన (నలుబది నాల్గవ సవరణ) చట్టము, 1978 యొక్క 38వ పరిచ్ఛేదము ద్వారా ''ఖండము (3) క్రింద అధిప్రఖ్యానము ఆమోదించు రెండవ తీర్మానము పాస్ చేయబడిన తేదీ నుండి ఒక సంవత్సరము'' అను పదములకు బదులుగా ''ఆరు మాసములు'' అను పదములు ఉంచబడినవి.
2. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 ద్వారా అంతకు ముందున్న మాసములు ''ఆరు మాసములు'' అను పదములకు బదులుగా ''ఒక సంవత్సరము'' అను పదములు ఉంచబడి, తిరిగి సంవిధాన (నలుబది నాల్గవ సవరణ) చట్టము, 1978 యొక్క 38వ పరిచ్ఛేదము ద్వారా ''ఒక సంవత్సరము'' అను పదములకు బదులు ''ఆరు మాసములు'' అను పదములు 20.6.1979 నుండి ఉంచబడినవి.

మాసముల] వరకు అది అమలునందు కొనసాగవలెను. కాని అట్టి అధిప్రఖ్యానమేదియు ఏ సందర్భములోను మూడు సంవత్సరములకు మించి అమలులో నుండరాదు:

అంతేకాక, అట్టి ఏదైనా [2][ఆరు మాసముల] కాలములో లోక్‌సభ యొక్క విఘటన జరిగినచో, మరియు అట్టి అధిప్రఖ్యానము యొక్క అమలు కొనసాగింపును ఆమోదించు తీర్మానము రాజ్యసభచే పాస్ చేయబడి, ఆ కాలావధిలో అట్టి అధిప్రఖ్యానపు అమలు కొనసాగింపును గూర్చిన తీర్మానమేదియు లోక్‌సభ చే పాస్ చేయబడనిచో, లోక్‌సభ యొక్క పునస్సంఘటనానంతరము అది మొదటిసారిగ ఉపవేశనమగు తేదీ నుండి ముప్పది దినముల ముగియుటకు పూర్వమే లోక్‌సభ కూడ ఆ అధిప్రఖ్యానపు అమలు కొనసాగింపును ఆమోదించు తీర్మానమును పాస్‌చేసిననే తప్ప, ఆ కాలావధి ముగియగానే ఆ అధిప్రఖ్యానము యొక్క అమలు ఆగిపోవును.

[1][అయితే ఇంకనూ పంజాబు రాజ్యమునకు సంబంధించి 1987 మే 11వ దినమున ఖండము (1) క్రింద జారీ చేయబడిన అధిప్రఖ్యానము విషయములో ఈ ఖండమునకు గల మొదటి వినాయింపులోని ''మూడు సంవత్సరములు'' [2][''ఐదు సంవత్సరములు'']కు గల నిర్దేశముగా అన్వయించుకొనవలెను].

[3][(5) ఖండము (4)లో ఏమియున్నప్పటికిని, ఖండము (3) క్రింద ఆమోదించబడిన అధిప్రఖ్యానము యొక్క అమలును అట్టి అధిప్రఖ్యానము జారీ అయిన తేదీ నుండి ఒక సంవత్సరము ముగిసిన తరువాత ఎంత కాలావధికైనను కొనసాగించుటను గూర్చిన తీర్మానము–

(ఎ) అట్టి తీర్మానమును పాస్ చేయు సమయమున యావద్భారత దేశములోగాని, సందర్భానుసారముగ ఒక రాజ్యము నందంతటగాని, అందలి ఏదేని భాగములోగాని ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము అమలులో వున్ననే తప్ప; మరియు

(బి) ఖండము (3) క్రింద ఆమోదించబడిన అధిప్రఖ్యానము యొక్క అమలును అట్టి తీర్మానములో నిర్దిష్టపరచిన కాలావధి పాటు కొనసాగించుట సంబంధిత రాజ్యశాసనసభకు సాధారణ ఎన్నికలను జరుపుటలో ఇబ్బందులు వున్న కారణముగా ఆవశ్యకమని ఎన్నికల కమీషను ధృవీకరించిననే తప్ప–

పార్లమెంటు యొక్క ఏ సదనముచేనైనను పాస్ చేయబడరాదు:

---

1. సంవిధాన (అరువది నాలుగవ సవరణ) చట్టము, 1990 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.
2. సంవిధాన (అరువది ఏడవ సవరణ) చట్టము, 1990 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ఉంచబడిన దానిని మరియు సంవిధాన (అరువది ఎనిమిదవ సవరణ) చట్టము, 1991 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ఉంచబడిన విధంగా చదువుకొనవలెను.
3. సంవిధాన (ముప్పది ఎనిమిదవ సవరణ) చట్టము 1975 యొక్క 6వ పరిచ్ఛేదం ద్వారా గత కాలిక ప్రభావంతో ఖండము (5) చొప్పించబడినది, మరియు సంవిధాన (నలుబది నాల్గవ సవరణ) చట్టము, 1978 యొక్క 38వ పరిచ్ఛేదము ద్వారా అప్పటి ఖండము (5)కు బదులుగా 20.6.1979 నుండి ఇది ఉంచబడినది.

[1][అయితే ఈ ఖండములోనున్న దేదియు పంచాయితీ రాజ్యమునకు సంబంధించి ఖండము (1) క్రింద 1987 మే 11వ దినమున జారీ చేసిన అధిప్రఖ్యానమునకు వర్తించదు.]

**356వ అనుచ్ఛేదము క్రింద జారీ చేయబడిన అధిప్రఖ్యానము క్రింద శాసన నిర్మాణాధికారములను వినియోగించుట.**

357. (1) 356వ అనుచ్ఛేదము యొక్క ఖండము (1) క్రింద జారీ చేయబడిన అధిప్రఖ్యానము ద్వారా, ఆ రాజ్య శాసనమండలి యొక్క అధికారములు పార్లమెంటుచేగాని, దాని ప్రాధికారము క్రిందగాని, ప్రయోగించబడదగునని ప్రఖ్యానించబడిన యెడల–

(ఎ) శాసనములను చేయుటకు ఆ రాజ్య శాసన మండలికి గల అధికారమును రాష్ట్రపతికి ప్రదత్తము చేయుటకును, ఆయనకు అట్లు ప్రదత్తము చేయబడిన అధికారమును తద్విషయమున ఆయనచే నిర్దిష్టపరచబడిన ఏ ఇతర ప్రాధికారినైనను, ఆయన విధించుట సబబని తలచు షరతులకు అధ్యధీనమై ప్రత్యాయోజనము చేయు ప్రాధికారమును ఆయనకు ఇచ్చుటకు పార్లమెంటు సమర్థత కలిగియుండవలెను;

(బి) సంఘమునకు లేక దానికి చెందిన అధికారులకు మరియు ప్రాధికారులకు అధికారములను ప్రదత్తముచేసేడి, మరియు వారిపై కర్తవ్యములను విధించెడి, లేక వారికి అధికారములను ప్రదత్తము చేయుటకు మరియు వారిపై కర్తవ్యములను విధించుటకు ప్రాధికారము నొసగెడి, శాసనములను చేయుటకు, పార్లమెంటు, లేక రాష్ట్రపతి, లేక ఉప–ఖండము (ఎ) క్రింద శాసనములను చేయు అధికారము నిహితమైయున్న ఇతర ప్రాధికారి సమర్థత కలిగియుండవలెను;

(సి) లోక్‌సభ అధివేశనములో లేని సమయమున రాజ్య సంచిత నిధి నుండి వ్యయమును పార్లమెంటు మంజూరు చేయు లోపున, దాని నుండి వ్యయము చేయుటకు ప్రాధికారము నొసగుటకు రాష్ట్రపతి సమర్థత కలిగియుండవలెను.

[2][(2) 356వ అనుచ్ఛేదము క్రింద అధిప్రఖ్యానమును జారీ చేసిననేగాని, పార్లమెంటుకుగాని, రాష్ట్రపతికిగాని ఖండము (1) యొక్క ఉప–ఖండము (ఎ)లో నిర్దేశించబడిన ఇతర ప్రాధికారికిగాని ఏ శాసనము చేయుటకు సమర్థత లేకుండెడిదో అట్టి శాసనమును వారెవరేని రాజ్య శాసనమండలి యొక్క అధికారమును ప్రయోగించుచు చేసిన యెడల, అధిప్రఖ్యానము అమలునందుండుట ఆగిపోయిన పిమ్మట, సమర్థ శాసనమండలిచే లేక ఇతర ప్రాధికారిచే మార్పు, లేక రద్దు, లేక సవరణ చేయబడువరకు ఆ శాసనము అమలునందు కొనసాగును.]

---

1. సంవిధాన (అరువది మూడవ సవరణ) చట్టము, 1989 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 6.1.1990 నుండి వదలివేయబడినది. తిరిగి సంవిధాన (అరువది నాలుగవ సవరణ) చట్టము, 1990 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.
2. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 51వ పరిచ్ఛేదవు ద్వారా ఖండము 2కు బదులుగా 3.1.1977 నుండి ఉంచబడినది.

358. [1][(1)] భాగము(3)లో నిర్వచింపబడిన రాజ్యమునకు, ఆ భాగములోగల నిబంధనలు లేనిచో ఏ శాసనమును చేయుటకు లేక ఏ కార్యపాలక చర్యను తీసికొనుటకు సమర్థత యుండెడిదో, ఆ శాసనమును చేయుటకు లేక ఆ చర్యను తీసుకొనుటకు రాజ్యమునకు గల ఆ అధికారమును 19వ అనుచ్ఛేదములో నున్న దేదియు [2][యుద్ధము వలన గాని, బాహ్యదురాక్రమణ వలన గాని భారత దేశము యొక్క లేక దాని రాజ్య క్షేత్రములోని ఏదేని భాగము యొక్క భద్రతకు భంగము వాటిల్లనున్నదని ప్రఖ్యానించు ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము అమలులో నుండగా] పరిమిత పరచరాదు, కాని అట్లు చేయబడిన ఏ శాసనమునైనను అట్టి అసమర్థత మేరకు, ఆ శాసనము ఈ అనుచ్ఛేదము క్రింద ప్రభావరహితమగుటకు పూర్వము చేయబడిన లేక చేయుట లోపించిన కార్యములను గూర్చి తప్ప, ఆ అధిప్రఖ్యానము యొక్క అమలు ఆగిపోయిన వెంటనే ప్రభావ రహితము కావలెను:

**ఆత్యయిక పరిస్థితులలో 19వ అనుచ్ఛేదము యొక్క నిబంధనలను తాత్కాలిక నిలుపుదల చేయుట.**

[3][అయితే, [4][అట్టి ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము] భారత రాజ్యక్షేత్రము నందలి ఏదేని భాగములో మాత్రమే అమలునందున్న యెడల ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము భారత రాజ్యక్షేత్రమునందలి ఏ భాగములో అమలునందున్నదో ఆ భాగములోనైనను దానికి సంబంధించియైనను జరుగు కార్యకలాపముల వలన భారత దేశము యొక్క లేక దాని రాజ్యక్షేత్రమునందలి ఏదేని భాగము యొక్క భద్రతకు భంగము వాటిల్లినచో, మరియు అంతమేరకు ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము అమలులో లేనట్టి ఏదేని రాజ్యము లేక సంఘ రాజ్యక్షేత్రము లేక అందలి ఏదేని భాగములోగాని, దానికి సంబంధించిగాని ఈ అనుచ్ఛేదము క్రింద ఏదేని అట్టి శాసనము చేయబడవచ్చును లేక ఏదేని అట్టి కార్యపాలక చర్య తీసికొనబడవచ్చును.]

[5][(2) ఖండము (1)లో నున్నదేదియు–

(ఎ) ఏదైనా శాసనము చేయబడినప్పుడు అట్టి శాసనము అమలులో నున్న ఆత్యయికతా అధిప్రఖ్యానమునకు సంబంధించి యున్నదని అందు చెప్పబడి ఉండదో అట్టి ఏదేని శాసనమునకు; లేక

(బి) అట్లు చెప్పబడియున్న శాసనము క్రింద కాకుండా అన్యథా తీసుకొనబడిన ఏదేని కార్యపాలక చర్యకు వర్తించదు.]

**భాగము 3 ద్వారా ప్రదత్తము చేయబడిన హక్కుల అమలును ఆత్యయిక పరిస్థితులలో తాత్కాలిక నిలుపుదల చేయుట.**

---

1. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 39వ పరిచ్ఛేదము ద్వారా లోగడ నున్న 358వ అనుచ్ఛేదమును 20.6.1979 నుండి ఖండము (1)గా తిరిగి అంకెవేయబడినది.
2. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 39వ పరిచ్ఛేదములోని (ఎ)లోని ఉప-ఖండము (1) ద్వారా ''అత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము అమలులో నున్నప్పుడు'' అను పదములకు బదులు బ్రాకెట్లలోని పదములు 20.6.1979 నుండి ఉంచబడినవి.
3. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 52వ పరిచ్ఛేదము ద్వారా 3.1.1979 నుండి చొప్పించబడినది.
4. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1976 యొక్క 39వపరిచ్ఛేదము ద్వారా ''అత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము అను పదములకు బదులుగా 20.6.1973 నుండి ఉంచబడినవి.
5. సదరు చట్టము యొక్క 39వ పరిచ్ఛేదములోని ఖండము (బి) ద్వారా 20.6.1979 నుండి చొప్పించబడినది.

359. (1) ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము అమలునందున్న యెడల, రాష్ట్రపతి ఉత్తరువు ద్వారా, [1][(20 మరియు 21 అనుచ్ఛేదములు మినహా) భాగము 3చే ప్రదత్తమైన హక్కుల]లో నుండి, ఆ ఉత్తరువులో పేర్కొనబడిన హక్కులను అమలుపరచుటకుగాను ఏ న్యాయస్థానమునైన అర్థించు హక్కు, మరియు అట్లు పేర్కొనబడిన హక్కులను అమలు పరచుటకు గాను ఏ న్యాయస్థానములోనైన జరుగుచున్న అన్ని చర్యలు, ఆ అధిప్రఖ్యానము అమలులో నుండు కాలావధి వరకు లేక ఆ ఉత్తరువులో నిర్దిష్టపరచబడునట్టి తక్కువ కాలావధి వరకు, తాత్కాలికముగా నిలిపియుంచవచ్చునని ప్రఖ్యానించవచ్చును.

[2][(1ఏ) (20 మరియు 21 అనుచ్ఛేదములు మినహా) భాగము 3 ద్వారా ప్రదత్తమైన హక్కుల]లో వేటియనైనను పేర్కొనుచు ఖండము (1) క్రింద చేయబడిన ఉత్తరువు అమలులో నున్నప్పుడు, ఆ భాగములో అట్టి హక్కులను ప్రదత్తము చేయునదేదియు, ఆ భాగములో నిర్వచింపబడిన రాజ్యము, ఆ భాగములోని నిబంధనలు లేకుండినచో ఏ శాసనమును చేయుటకు లేక ఏ కార్యపాలక చర్య తీసుకొనుటకు సమర్థత కలిగియుండెడిదో, అట్టి శాసనమును చేయుటకు లేక అట్టి చర్యను తీసుకొనుటకు, అట్టి రాజ్యమునకు గల అధికారమును పరిమితపరచరాదు; కాని, అట్లు చేయబడిన ఏదేని శాసనము, అట్టి అసమర్థత మేరకు ఆ ఉత్తరువు అమలులోనుండుట ఆగిపోయిన వెంటనే ప్రభావరహితము కావలెను; ఆ శాసనము అట్లు ప్రభావరహితమగుటకు పూర్వము చేయబడిన, లేక చేయుట లోపించిన విషయముల గూర్చి మాత్రము అట్లు ప్రభావరహితము కారాదు:]

[3][అయితే ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము భారత రాజ్య క్షేత్రము నందలి ఏదేని భాగములో మాత్రమే అమలునందున్న యెడల ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము భారత రాజ్యక్షేత్రమునందలి ఏ భాగములో అమలునందున్నదో ఆ భాగములోగాని దానికి సంబంధించి జరుగు కార్యకలాపములవలన భారతదేశము యొక్క లేక దాని రాజ్యక్షేత్రము నందలి ఏదేని భాగము యొక్క భద్రతకు, భంగము వాటిల్లినచో, మరియు అంతమేరకు, ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము అమలులో లేనట్టి ఏదేని రాజ్యము లేక సంఘ రాజ్యక్షేత్రము లేక అందలి ఏదేని భాగములో గాని దానికి సంబంధించిగాని ఈ అనుచ్ఛేదము క్రింద ఏదేని అట్టి శాసనము చేయబడవచ్చును లేక ఏదేని అట్టి కార్యపాలక చర్య తీసుకొనబడవచ్చును.]

---

1. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 40వ పరిచ్ఛేదము ద్వారా ''భాగము 3 ద్వారా ప్రదత్తమైన హక్కులు'' అను పదములకు బదులుగా 20.6.1979 నుండి చొప్పించబడినవి.
2. సంవిధాన (ముప్పది ఎనిమిద సవరణ) చట్టము, 1975 యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా గతకాలిక ప్రభావంతో చొప్పించబినది.
3. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 53వ పరిచ్ఛేదము ద్వారా 3.1.1977 నుండి చొప్పించబడినది.

[1][(1బీ) ఖండము (ఏ)లో నున్నదేదియు–

(ఎ) ఏ శాసనము చేయబడినప్పుడు అట్టి శాసనము అమలులోనున్న ఆత్యయికతా అధిప్రఖ్యానమునకు సంబంధించియున్నదని అందు చెప్పబడి ఉండదో అట్టి ఏదేని శాసనమునకు, లేక

(బి) అట్లు చెప్పబడియున్న శాసనము క్రింద కాకుండ అన్యథా తీసుకొనబడిన ఏదేని కార్యపాలక చర్యకు – వర్తించదు.]

(2) పూర్వోక్తమైనట్లు చేయబడిన ఆదేశము, యావద్భారత రాజ్యక్షేత్రమునకుగాని, అందలి ఏదేని భాగమునకుగాని విస్తరించవచ్చును:

[2][అయితే, ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము భారత రాజ్యక్షేత్రము నందలి ఏదేని భాగములో మాత్రమే అమలునందున్న యెడల, ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము అమలునందున్నట్టి భారత రాజ్యక్షేత్ర భాగములో లేక దానికి సంబంధించి జరుగు కార్యకలాపముల వలన భారతదేశము యొక్క లేక దాని రాజ్యక్షేత్రమునందలి ఏదేని భాగము యొక్క భద్రతకు భంగము వాటిల్లునని అభిప్రాయపడినచో, ఏదేని అట్టి ఉత్తరువు భారత రాజ్యక్షేత్రము నందలి ఏదేని ఇతర భాగమునకు విస్తరింపజేయుట ఆవశ్యకమని రాష్ట్రపతి భావించిననే తప్ప, అట్టి ఉత్తరువు ఆ భాగమునకు విస్తరించదు.]

(3) ఖండము (1) క్రింద చేయబడిన ప్రతి ఆదేశము, అది చేయబడిన పిమ్మట వీలైనంత త్వరితముగా పార్లమెంటు ప్రతి సదనము సమక్షమున ఉంచబడవలెను.

[3]359ఏ. [ఈ భాగమును పంజాబు రాజ్యమునకు వర్తింపజేయుట.] సంవిధాన (అరువది మూడవ సవరణ) చట్టము, 1989 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 06.01.1990 నుండి రద్దు చేయబడినది.

**విత్తీయ ఆత్యయిక పరిస్థితిని గూర్చిన నిబంధనలు.**

360. (1) భారతదేశము యొక్క, లేక దాని రాజ్యక్షేత్రము నందలి ఏదేని భాగము యొక్క విత్తీయ స్థైర్యమునకు, లేక పరపతికి, ముప్పు వాటిల్లునట్టి పరిస్థితి ఏర్పడినదని రాష్ట్రపతి అభిప్రాయపడినచో ఆయన అట్లని ఒక అధిప్రఖ్యానము ద్వారా ప్రఖ్యానించవచ్చును.

[1][(2) ఖండము (1) క్రింద జారీ చేయబడిన అధిప్రఖ్యానము–

---

1. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 40వ పరిచ్ఛేదము ద్వారా 20.6.1979 నుండి చొప్పించబడినది.
2. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 53వ పరిచ్ఛేదము ద్వారా 3.1.1977 నుండి చేర్చబడినది.
3. సంవిధాన (యాభై తొమ్మిదవ సవరణ) చట్టము, 1988 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది. ఈ చట్టపు ప్రారంభపు తేదీ నుండి రెండు సంవత్సరముల కాలావధి ముగిసినందున 30.3.1988 నుండి ఇది అమలులో లేదు.

(ఎ) తరువాతి అధి[ప్రఖ్యానము ద్వారా [ప్రతి సంహరణ లేక మార్పు చేయబడవచ్చును;

(బి) పార్లమెంటు యొక్క [ప్రతి సదనము సమక్షమున ఉంచబడవలెను;

(సి) రెండు మాసములు ముగియుటకు పూర్వము పార్లమెంటు యొక్క ఉభయ సదనములచే తీర్మానము ద్వారా అది ఆమోదించబడిననే తప్ప, ఆ కాలావధి ముగియగానే దాని అమలు ఆగిపోవును:

అయితే అట్టి ఏదేని అధి[ప్రఖ్యానము లోక్‌సభ విఘటన చేయబడియుండిన సమయమున జారీ చేయబడినచో లేక ఉప-ఖండము (సి)లో నిర్దేశింపబడిన రెండు మాసముల కాలావధిలో లోక్‌సభ యొక్క విఘటన జరిగినచో మరియు ఆ అధి[ప్రఖ్యానమును ఆమోదించు తీర్మానము రాజ్యసభచే పాస్ చేయబడి, ఆ కాలవధి ముగియుటకు పూర్వము అట్టి తీర్మాన మేదియు లోక్‌సభచే పాస్ చేయబడనిచో, లోక్‌సభ యొక్క పునస్సంఘటనానంతరము అది మొదటిసారి ఉపవేశనమగు తేదీ నుండి ముప్పది దినములు ముగియుటకు పూర్వము లోక్‌సభ కూడ ఆ అధి[ప్రఖ్యానము ఆమోదించు తీర్మానమును పాస్ చేసిననే తప్ప, ఆ కాలావధి ముగియగానే ఆ అధి[ప్రఖ్యానము యొక్క అమలు ఆగిపోవును.]

(3) ఖండము (1)లో పేర్కొనబడిన ఏదేని అధి[ప్రఖ్యానము అమలునందున్న కాలావధిలో, ఏ రాజ్యమునకైనను, నిర్దిష్టపరచబడు విత్తీయ ఔచిత్య సూత్రములను పాటించవలెనని ఆదేశములనిచ్చుట మరియు ఆ [ప్రయోజనముల కొరకు రాష్ట్రపతి ఆవశ్యకమైనవనియు, చాలినవైనవనియు తలచు ఇతర ఆదేశములనిచ్చుట సంఘము యొక్క కార్యపాలక [ప్రాధికారములో చేరియుండవలెను.

(4) ఈ సంవిధానములో ఏమియున్నప్పటికిని-

(ఎ) అట్టి ఏ ఆదేశమునందైనను ఈ [క్రింది నిబంధనలు చేరియుండవచ్చును:-

(i) ఒక రాజ్యము యొక్క వ్యవహారములకు సంబంధించి సేవచేయుచున్న వ్యక్తులందరి యొక్క లేక వారిలో ఏదేని వర్గము యొక్క జీతములను మరియు బత్తెములను తగ్గించవలెనని ఆదేశించునట్టి నిబంధన;

(ii) అన్ని ధన సంబంధమైన బిల్లులు, లేక 207వ అనుచ్ఛేదము యొక్క నిబంధనలు వర్తించెడి ఇతర బిల్లులు, రాజ్య శాసన మండలిచే పాస్ చేయబడిన తరువాత రాష్ట్రపతి యొక్క పర్యాలోచన కొరకు [ప్రత్యేకించబడవలెనని ఆదేశించు నిబంధన.

(బి) ఈ అనుచ్ఛేదము [క్రింద జారీ చేయబడిన ఏదేని [ప్రఖ్యానము అమలునందున్న కాలావధిలో, సర్వోన్నత న్యాయస్థానము యొక్కయు, ఉన్నత న్యాయస్థానముల యొక్కయు న్యాయాధీశులతో సహా సంఘ వ్యవహారములకు సంబంధించి సేవ చేయుచున్న వ్యక్తులందరి

---

1. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 41వ పరిచ్ఛేదము ద్వారా లోగడనున్న ఖండము (2)కు బదులుగా 20.6.1979 నుండి ఉంచబడినది.

యొక్క లేక వారిలో ఏదేని వర్గము యొక్క జీతములను మరియు బత్తెములను తగ్గించుటకుగాను ఆదేశములను జారీ చేయుటకు రాష్ట్రపతి సమర్థ కలిగియుండవలెను.

[1][* * * * *]

## భాగము – 19

## వివిధ విషయములు

**రాష్ట్రపతికి, గవర్నర్లకు, మరియు రాజ ప్రముఖ్‌నకు రక్షణ.**

361. (1) రాష్ట్రపతి, లేక రాజ్య గవర్నరు, లేక రాజప్రముఖుడు తన పదవీ అధికారములను వినియోగించుటను గూర్చి మరియు పదవీ కర్తవ్యముల పాలననుగూర్చి, లేక ఆ అధికారములను వినియోగించుటలోను, కర్తవ్యముల నిర్వర్తనలోను ఆయనచే చేయబడినట్టిగాని, ఆయనచే చేయబడినట్లు తాత్పర్యితమైనట్టిగాని ఏదేని కార్యమును గూర్చి ఎట్టి న్యాయస్థానమునకును జవాబుదారు కారాదు:

అయితే 61వ అనుచ్ఛేదము క్రింద ఆరోపణను దర్యాప్తు చేయుటకు పార్లమెంటు యొక్క ఏ సదనముచేగాని నియమించబడిన లేక పేర్కొనబడిన ఏదేని న్యాయస్థానము, ట్రిబ్యునలు లేక నికాయము రాష్ట్రపతి యొక్క నడవడిని పరిశీలించవచ్చును:

అంతేగాక, భారత ప్రభుత్వముపైగాని, ఏదేని రాజ్య ప్రభుత్వముపైగాని సముచితమైన చర్యలను గైకొనుటకు ఏ వ్యక్తికైనను గల హక్కును ఈ ఖండములో నున్నదేదియు పరిమితపరచునట్లు అన్వయించబడరాదు.

(2) రాష్ట్రపతిపైగాని, రాజ్య గవర్నరుపై [2][* * *] గాని, ఆయన పదవీ కాలమునందు ఏ న్యాయస్థానములోను, ఎట్టి క్రిమినలు చర్యయు సంస్థితము (విచారణ ఆరంభించుట) చేయబడరాదు లేక కొనసాగించబడరాదు.

(3) రాష్ట్రపతి, లేక రాజ్య గవర్నరు [1][* * *] ను ఆయన పదవీకాలమునందు అరెస్టు చేయుటకుగాని, కారాగార వాసమునందుంచుటకు గాని, ఏ న్యాయస్థానము నుండియైనను, ఎట్టి ఆదేశికయు జారీ చేయబడరాదు.

(4) రాష్ట్రపతి నుండి గాని, రాజ్య గవర్నరు నుండి గాని, [1][* * *] ఆయన రాష్ట్రపతిగా లేక ఆ రాజ్య గవర్నరుగా [1][* * *] పదవిలో ప్రవేశించుటకు పూర్వము గాని, ప్రవేశించిన పిమ్మటగాని, వ్యక్తిగతముగ చేసిన, లేక చేసినట్లు తాత్పర్యితమైన ఏదేని కార్యము విషయమున, పరిహారమును క్లెయిము చేయు సివిలు చర్యలేవియు, అట్టి చర్యల స్వభావము, దావా హేతువును సంస్థితము చేయబోవు పక్షకారు పేరు, వర్ణన, నివాసము మరియు క్లెయిము చేయు పరిహారమును

---

1. సంవిధాన (ముప్పది ఎనిమిదవ సవరణ) చట్టము, 1975 యొక్క 8వ పరిచ్ఛేదము ద్వారా ఖండము (5) గతకాలిక ప్రభావంతో చొప్పించబడి, సంవిధాన (నలుబది నాల్గవ సవరణ) చట్టము, 1978 యొక్క 41వ పరిచ్ఛేదము ద్వారా 20.6.1979 నుండి వదలివేయబడినది.
2. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజప్రముఖ్'' అను పదములు వదలివేయబడినవి.

తెలియజేయుచు లిఖిత పూర్వకమైన నోటీసును, రాష్ట్రపతికి, లేక సందర్భానుసారముగ గవర్నరుకు [1][* * *] అందజేసిన పిమ్మట, లేక ఆయన కార్యాలయములో ఉంచిన పిమ్మట, రెండు మాసములు ముగియునంతవరకు ఏ న్యాయస్థానము నందును సంస్థితము (విచారణ ఆరంభించుట) చేయబడరాదు.

**పార్లమెంటు మరియు రాజ్య శాసన మండలుల యొక్క కార్య కలాపముల ప్రచురణకు రక్షణ.**

[1][361ఏ. (1) పార్లమెంటులోని ఏదేని సదనము యొక్క లేక శాసనసభ యొక్క లేక సందర్భానుసారముగ రాజ్య శాసనమండలిలోని ఏదేని సదనము యొక్క ఏవేని కార్యకలాపములను గూర్చి సారత : యదార్థ నివేదికను వార్తాపత్రికలో ప్రచురించుటకు సంబంధించి, ఆ ప్రచురణ ద్వేషముతో చేయబడినదని రుజువు చేయబడిననే తప్ప, ఏ వ్యక్తిగాని, ఏ న్యాయస్థానములోనైనను సివిలు లేక క్రిమినలు చర్యలు వేటికిగాని పాత్రుడుకాడు:

అయితే ఈ ఖండములోనిదేదియు, పార్లమెంటులోని ఏదేని సదనము యొక్క లేక శాసనసభ యొక్క లేక సందర్భానుసారముగ రాజ్య శాసనమండలిలోని ఏదేని సదనము యొక్క రహస్య ఉపవేశనపు కార్య కలాపములను గూర్చిన ఏదేని నివేదిక యొక్క ప్రచురణకు వర్తించదు.

(2) ఖండము (1) వార్తాపత్రికలలో ప్రచురించబడిన నివేదికలు లేక విషయములకు సంబంధించి ఎట్లు వర్తించునో అట్లే, ప్రసార కేంద్రము ద్వారా ఏర్పాటు చేయబడిన ఏదేని కార్యక్రమము లేక సర్వీసులో భాగముగా వైర్‌లెస్ టెలిగ్రాఫీ ద్వారా ప్రసారము చేయబడు నివేదికలకు లేక విషయములకు సంబంధించి వర్తించును.

**విశదీకరణ:–** ఈ అనుచ్ఛేదములో ''వార్తాపత్రిక''లో ఒక వార్తాపత్రికలో ప్రచురణ కొరకు భోగట్టా కలిగియున్న వార్తా సంస్థ నివేదిక చేరి యుండును.]

**ప్రతిఫలము నిచ్చు రాజకీయ పదవిలో నియమించబడుటకు అనర్హత.**

[2][361బీ. సదనములోని ఏదేని రాజకీయ పార్టీకి చెందియుండి, పదవ అనుసూచి యొక్క 2వ పేరా క్రింద ఆ సదనము యొక్క సభ్యుడిగా ఉండుటకు అనర్హుడైన సభ్యుడు, అతని అనర్హత ప్రారంభపు తేదీ నుండి అట్టి సభ్యునిగా అతని పదవీ కాలము ముగియునంతవరకు లేదా అతను పార్లమెంటు ఉభయ సదనములకు పోటీ చేసి ఎన్నికైనట్లుగా ప్రఖ్యానించబడు తేదీ వరకు, ఈ రెండింటిలో ఏది ముందుగా వచ్చునో అంతవరకు, ఏదేని ప్రతిఫలమునిచ్చు రాజకీయ పదవిని కలిగి యుండుటకు కూడా అనర్హుడగును.

**విశదీకరణ:–** ఈ అనుచ్ఛేదము యొక్క ప్రయోజనముల నిమిత్తము–

(ఎ) ''సదనము'' అను పదబంధము పదవ అనుసూచి యొక్క 1వ పేరాలోని ఖండము (ఎ)లో దానికి ఇవ్వబడిన అర్థమునే కలిగియుండును;

(బి) ''ప్రతిఫలము నిచ్చు రాజకీయ పదవి'' అనగా చెల్లించిన జీతము లేక ప్రతిఫలము స్వభావ రీత్యా పరిహారమైననే తప్ప,–

1. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 20.6.1979 నుండి చొప్పించబడినది.
2. సంవిధాన (తొంబై ఒకటవ సవరణ) చట్టము, 2003 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.

(i) భారత ప్రభుత్వము లేక సందర్భానుసారముగా రాజ్యప్రభుత్వము యొక్క పబ్లిక్ రెవెన్యూ నుండి అట్టి పదవికి జీతము లేక ప్రతిఫలము చెల్లించు భారత ప్రభుత్వము లేక రాజ్య ప్రభుత్వము క్రిందనున్న; లేక

(ii) భారత ప్రభుత్వము లేక రాజ్యప్రభుత్వముచే పూర్ణతః లేక భాగతః స్వామ్యము కలిగియున్న ఒక నికాయము క్రిందనున్న నిగమితమైనదైనను లేక కాకున్ననూ ఏదేని పదవి అని అర్థము అట్టి పదవికి జీతము లేక ప్రతిఫలము అట్టి నికాయముచే చెల్లించబడును.

362. ఇండియాలోని దేశీయ రాజ్యముల పాలకుల యొక్క హక్కులు మరియు విశేషాధికారములు. సంవిధాన (ఇరువది ఆరవ సవరణ) చట్టము, 1971 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా రద్దు చేయబడినది.

**కొన్ని సంధులు మరియు కరారులు, మున్నగు వాని నుండి ఉత్పన్నమగు వివాదములలో న్యాయస్థానముల జోక్యమునకు ప్రతిబంధకము.**

363. (1) ఈ సంవిధానములో ఏమియున్నప్పటికిని, 143వ అనుచ్ఛేదము యొక్క నిబంధనలకు అధ్యధీనమై, ఈ సంవిధాన ప్రారంభమునకు పూర్వము, ఇండియాలోని దేశీయ రాజ్యము యొక్క ఎవరేని రాజ్యాధీశునిచే చేసికొనబడినట్టిదియు లేక వ్రాసి ఈయబడినట్టిదియు భారతదేశ అధినివేశ ప్రభుత్వముగాని, దానికి పూర్వవర్తి ప్రభుత్వములలో ఏదియైనగాని ఒక పక్షమైయుండి మరియు అట్టి ప్రారంభానంతరము అమలులో కొనసాగినట్టిదియు లేక కొనసాగించబడినట్టిదియు అగు ఏదేని సంధి, కరారు, ప్రసంవిధ, ఒప్పంధము, సనదు లేక తాదృశ్యమైన ఇతర పత్రము యొక్క ఏదేని నిబంధన నుండి ఉత్పన్నమైన ఏ వివాదములో గాని, అట్టి ఏదేని సంధి, కరారు, ప్రసంవిద, ఒప్పందము, సనదు, లేక తాదృశ్యమైన ఇతర పత్రమునకు సంబంధించి ఈ సంవిధానములోని నిబంధనలలో దేని క్రిందనైనను ప్రాప్తించు ఏదేని హక్కును లేక ఉత్పన్నమగు ఏదేని దాయిత్వమును, లేక బాధ్యతను గూర్చిన ఏదేని వివాదములో, సర్వోన్నత న్యాయస్థానము గాని, ఏదేని ఇతర న్యాయస్థానముగాని, అధికారితను కలిగియుండరాదు.

(2) ఈ అనుచ్ఛేదములో–

(ఎ) ''ఇండియాలోని దేశీయ రాజ్యము'' అనగా ఈ సంవిధాన ప్రారంభునకు పూర్వము సామ్రాట్టుచే గాని, భారతదేశ అధినివేశ ప్రభుత్వముచేగాని, అట్టి రాజ్యముగ గుర్తించబడిన ఏదేని రాజ్య క్షేత్రము అని అర్థము; మరియు

(బి) ''రాజ్యాధీశుడు'' అను పదములో అట్టి ప్రారంభమునకు పూర్వము సామ్రాట్టుచేగాని, భారతదేశ అధినివేశ ప్రభుత్వముచేగాని ఇండియాలోని ఏదేని దేశీయ రాజ్యము యొక్క అధీశుడుగా గుర్తించబడిన రాజు, ముఖ్యుడు లేక ఇతర వ్యక్తి చేరియుండును.

[1][363ఏ. ఈ సంవిధానములో, లేక తత్సమయమున అమలులో నుండు ఏదేని శాసనములో, ఏమియున్నప్పటికిని–

**ఇండియాలోని దేశీయ రాజ్యముల రాజ్యాధీశులకు ఈయబడిన గుర్తింపు అంతమగుట, మరియు రాజభరణముల రద్దు.**

(ఎ) సంవిధాన (ఇరువది ఆరవ సవరణ) చట్టము, 1971 యొక్క ప్రారంభమునకు పూర్వము ఎప్పుడైనను, రాష్ట్రపతిచే ఇండియాలోని దేశీయరాజ్యము యొక్క అదీశుడుగా గుర్తించబడిన రాజు, ముఖ్యుడు, లేక ఇతర వ్యక్తి, లేక అట్టి ప్రారంభమునకు పూర్వము ఎప్పుడైనను రాష్ట్రపతిచే అట్టి రాజ్యాధీశుని ఉత్తరాధికారిగా గుర్తించబడిన ఎవరేని వ్యక్తి, అట్టి ప్రారంభమున, మరియు అప్పటి నుండి అట్టి రాజ్యాధీశుడుగా, లేక అట్టి రాజ్యాధీశుని ఉత్తరాధికారిగా గుర్తించబడుట అంతము కావలెను.

(బి) సంవిధాన (ఇరువది ఆరవ సవరణ) చట్టము, 1971 యొక్క ప్రారంభమున, మరియు అప్పటి నుండి రాజభరణము రద్దు చేయబడినది మరియు రాజభరణము విషయమునగల హక్కులు దాయిత్వములు మరియు బాధ్యతలన్నియు నిర్వావనము చేయడినవి (అంతమయినవి) , మరియు సందర్భానుసారముగ, ఖండము (ఎ)లో నిర్దేశించబడిన రాజ్యాధీశునకు లేక అట్టి రాజ్యాధీశుని ఉత్తరాధికారికి లేక ఎవరేని ఇతర వ్యక్తికి రాజభరణము డబ్బు ఏదియు చెల్లించబడరాదు.]

364. (1) ఈ సంవిధానములో ఏమి యున్నప్పటికిని, రాష్ట్రపతి బహిరంగ అధిసూచన ద్వారా, ఆ అధిసూచనలో నిర్ధిష్టపరచబడు తేదీ నుండి–

**పెద్ద ఓడరేవులు మరియు విమానాశ్రయముల విషయములో విశేష నిబంధనలు.**

(ఎ) పార్లమెంటుచేగాని ఒక రాజ్య శాసనమండలిచే గానీ చేయబడిన ఏదేని శాసనము ఏదేని పెద్ద ఓడరేవునకు లేక విమానాశ్రయమునకు వర్తించదని లేక అది ఆ అధిసూచనలో నిర్దిష్టపరచబడు మినహాయింపులకు లేక మార్పులకు అధ్యధీనమై, అట్టి ఓడరేవునకు లేక విమానాశ్రయమునకు వర్తించునని ఆదేశించవచ్చును; లేక

(బి) ఆ తేదీకి పూర్వము చేయబడిన లేక చేయుటకు లోపించిన విషయములను గూర్చి తప్ప, అట్టి పెద్ద ఓడరేవు సంబంధమున గాని, విమానాశ్రయము సంబంధమునగాని, అస్తిత్వములోనున్న ఏదేని శాసనము ప్రభావరహితము కావలెనని లేక అట్టి ఓడరేవునకు లేక విమానాశ్రయమునకు దాని వర్తింపులో, ఆ అధిసూచనయందు నిర్దిష్టపరచబడిన మినహాయింపులకు, లేక మార్పులకు అధ్యధీనమై ప్రభావమును కలిగి యుండవలెనని ఆదేశించవచ్చును.

(2) ఈ అనుచ్ఛేదములో–

(ఎ) ''పెద్ద ఓడరేవు'' అనగా పార్లమెంటుచే చేయబడిన ఏదేని శాసనము ద్వారా, లేక శాసనము క్రింద లేక అస్తిత్వములోనున్న ఏదేని శాసనము ద్వారా లేక శాసనము క్రింద పెద్ద ఓడరేవుగా ప్రఖ్యానించబడిన ఓడరేవు అని అర్థము, మరయు దాని యందు తత్సమయమున అట్టి ఓడరేవు హద్దులలో చేర్చబడియున్న ప్రాంతములన్నియు చేరును.

---

1. సంవిధాన (ఇరువది యారవ సవరణ) చట్టము, 1971 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.

(బి) ''విమానాశ్రయము'' అనగా వాయు మార్గములకు, వాయు యానములకు మరియు విమానయామునకు సంబంధించిన అధిశాసనముల నిమిత్తము నిర్వచించబడిన విమానాశ్రయము అని అర్థము.

365. ఈ సంవిధానములోని నిబంధనలలో దేనిక్రిందనైనను సంఘము యొక్క కార్యపాలకాధికారమును వినియోగించుచు ఇవ్వబడిన ఏవేని ఆదేశములను ఏదేని రాజ్యము పాటించనియెడల లేక అమలుపరచని యెడల, ఈ సంవిధానము యొక్క నిబంధనలననుసరించి ఆ రాజ్యము యొక్క పరిపాలన జరుపబడుటకు వీలుకాని పరిస్థితి ఏర్పడినదని రాష్ట్రపతి నిర్ధారణ చేయుట శాసన సమ్మతమైయుండును.

**సంఘముచే ఇవ్వబడిన ఆదేశములను పాటించని యెడల లేక అమలుపరచని యెడల కలుగు పరిణామము.**

366. ఈ సంవిధానమునందు, సందర్భము అన్యథా అపేక్షించిననే తప్ప, ఈ క్రింది పదబంధములు వాటికి క్రమశః ఇందుమూలముగ నియతము చేయబడిన అర్థములను కలిగియుండును:–

**నిర్వచనములు.**

(1) ''వ్యవసాయ రాబడి'' అనగా భారతీయ రాబడి పన్నుకు సంబంధించిన శాసనముల నిమిత్తము నిర్వచించబడిన వ్యవసాయ రాబడి అని అర్థము.

(2) ''ఆంగ్లో – ఇండియను'' అనగా ఏ వ్యక్తి యొక్క తండ్రి లేక పితృపరంపరలోని పురుషులలో ఎవరినైనను, ఐరోపీయ వంశీయుడై యున్నాడో, లేక ఉండెనో, మరియు అతడు భారత రాజ్యక్షేత్రములో అధినివాసము కలిగియున్నవాడై అట్టి రాజ్యక్షేత్రములో తాత్కాలిక ప్రయోజనము కొరకు మాత్రమే స్థావరము ఏర్పరచుకొన్నవారు కాకుండ, సతతము నివసించుచుండిన తల్లిదండ్రులకు అట్టి రాజ్య క్షేత్రములో జన్మించినాడో, లేక జన్మించియుండెనో, ఆ వ్యక్తి అని అర్థము;

(3) ''అనుచ్ఛేదము'' అనగా ఈ సంవిధానము యొక్క అనుచ్ఛేదము అని అర్థము;

(4) ''అప్పుచేయుట'' అను పదములో వార్షికముల అనుదానము ద్వారా ధనమును సేకరించుట చేరియుండును; ''అప్పు'' అను పదము తదనుసారముగ అన్వయించబడవలెను;

[1][* * * * *]

(5) ''ఖండము'' అనగా ఆ పదము ఏ అనుచ్ఛేదములో వచ్చునో ఆ అనుచ్ఛేదము యొక్క ఖండము అని అర్థము;

(6) ''కార్పొరేషన్ పన్ను'' అనగా కంపెనీలచే చెల్లించబడవలసినంత మేరకు రాబడి పన్ను అయియుండి ఈ క్రింది షరతులను పూర్తి చేయు పన్ను అని అర్థము:–

(ఎ) అది వ్యవసాయ రాబడి పై ప్రభారము కారాదు;

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 54వ పరిచ్ఛేదము ద్వారా 1.2.1977 నుండి చొప్పించబడి, సంవిధాన (నలుబది మూడవ సవరణ) చట్టము, 1977 యొక్క 11వ పరిచ్ఛేదము ద్వారా 13.4.1978 నుండి వదిలివేయబడినది.

(బి) కంపెనీలచే చెల్లించబడిన పన్నుకు వర్తించు ఏవేని శాసనములచే, ఆ కంపెనీలు వ్యక్తులకు చెల్లించవలసిన లాభాంశములలో నుండి ఆ పన్నును గూర్చి తగ్గింపు చేయుటకు ప్రాధికారము ఒసగబడియుండరాదు;

(సి) భారతీయ రాబడి పన్ను కొరకు అట్టి లాభాంశములను పొందుచుండు వ్యక్తుల మొత్తము రాబడిని లెక్కకట్టుటలో గాని, అట్టి వ్యక్తులచే చెల్లించబడదగు, లేక వారికి వాపసు చేయబడదగు భారతీయ రాబడి పన్నును లెక్కకట్టుటలోగాని, అట్లు చెల్లించబడిన పన్నును లెక్కలోనికి తీసుకొనుటకుగాని ఎట్టి నిబంధనయు ఉండరాదు;

(7) ''ఆ రాజ్యము స్థానములో నుండిన ప్రావిన్సు'', ''ఆ రాజ్యము స్థానములో నుండిన ఇండియాలోని దేశీయ రాజ్యము'' లేక ''ఆ ప్రావిన్సు స్థానములోనున్న రాజ్యము'' అనగా, సందేహము కలిగెడి సందర్భములలో, ప్రసక్తిలోనున్న ప్రత్యేక ప్రయోజనము కొరకు, సందర్భానుసారముగ ఆ రాజ్యము స్థానములో నుండిన ప్రావిన్సు అని, ఆ రాజ్యము స్థానములో నుండిన ఇండియాలోని దేశీయ రాజ్యమని లేక ఆ ప్రావిన్సు స్థానములోనున్న రాజ్యమని రాష్ట్రపతి నిర్ధారణ చేయు ప్రావిన్సు ఇండియాలోని దేశీయ రాజ్యము లేక రాజ్యము అని అర్థము;

(8) ''ఋణము'' అను పదములో, వార్షికముల రూపమున మూలధనరాసులను తిరిగి చెల్లించు బాధ్యతను గూర్చిన దాయిత్వమేదైనను మరియు ఏదేని హామీ క్రింది దాయిత్వమేదైనను చేరియుండును, మరియు ''ఋణభారములు'' అను పదబంధము తదనుసారముగనే అన్వయించబడవలెను;

(9) ''సంపద సుంకము'' అనగా పార్లమెంటుచే నైనను, ఒక రాజ్య శాసనమండలి చేనైనను, ఆ సుంకమునకు సంబంధించి చేయబడిన శాసనములచేగాని, ఆ శాసనముల క్రిందగాని, విహితము చేయబడు నియమావళి ననుసరించి అభినిశ్చయింపబడినదైన, సదరు శాసనముల నిబంధనల క్రింద మరణానంతరము సంక్రమించు లేక అట్లు సంక్రమించునట్లు భావించబడు సకల ఆస్తి యొక్క ప్రధాన మూల్యము పై గాని, దానినిబట్టి గాని, నిర్ధారణ చేయబడు సుంకము అని అర్థము;

(10) ''అస్తిత్వములోనున్న శాసనము'' అనగా అధికారము కలిగియున్న ఏదేని శాసనమండలిచే, లేక ఎవరేని ప్రాధికారిచే లేక వ్యక్తిచే ఈ సంవిధాన ప్రారంభమునకు పూర్వము పాస్ చేయబడిన లేక చేయబడిన ఏదేని శాసనము, అధ్యాదేశము, ఉత్తరువు, ఉపవిధి, నియమము లేక వినియము అని అర్థము;

(11) ''ఫెడరల్ న్యాయస్థానము'' అనగా, ఇండియా ప్రభుత్వ చట్టము, 1935 క్రింద సంఘటితమైన ఫెడరల్ న్యాయస్థానము అని అర్థము;

(12) ''వస్తువులు'' అను పదములో సకల సామాగ్రులు, దినుసులు మరియు సరుకులు చేరియుండును;

[1][(12ఏ) ''వస్తువుల మరియు సేవల పన్ను'' అనగా మానవ వినియోగమునకైన ఆల్కహాల్ మధ్యము సరఫరాపై పన్నులు మినహా, వస్తువుల లేదా సేవల లేదా రెండింటిపైన ఏదైనా పన్ను అని అర్థము;]

(13) ''హామీ'' అను పదములో ఒక విత్తీయ కార్యకలాపము యొక్క లాభములు ఒక నిర్దిష్టమైన మొత్తముకన్న తక్కువైనపుడు, చెల్లింపులు చేయుటకు ఈ సంవిధాన ప్రారంభమునకు పూర్వము అంగీకరింపబడిన ఏదేని బాధ్యత చేరి యుండును;

(14) ''ఉన్నత న్యాయస్థానము'' అనగా ఈ సంవిధాన ప్రయోజనముల కొరకు ఏదేని రాజ్యమునకు ఉన్నత న్యాయస్థానముగా భావించబడు న్యాయస్థానము అని అర్థము, మరియు ఆ పదములో ఈ క్రింది న్యాయస్థానములు చేరియుండును;

(ఎ) ఈ సంవిధానము క్రింద భారత రాజ్యక్షేత్రములో ఉన్నత న్యాయస్థానముగా, సంఘటితమైన, లేక పునస్సంఘటితమైన ఏదేని న్యాయస్థానము; మరియు

(బి) ఈ సంవిధానము యొక్క ప్రయోజనములన్నిటి కొరకుగాని, వాటిలో వేటికొరకుగాని, ఉన్నత న్యాయస్థానమని పార్లమెంటుచే శాసనము ద్వారా ప్రఖ్యానించబడు, భారతదేశ రాజ్యక్షేత్రములోని ఏదేని ఇతర న్యాయస్థానము;

(15) ''ఇండియాలోని దేశీయరాజ్యము'' అనగా భారతదేశ అధినివేశ ప్రభుత్వ ఇండియాలోని రాజ్యముగా గుర్తించిన ఏదేని రాజ్య క్షేత్రము అని అర్థము;

(16) ''భాగము'' అనగా ఈ సంవిధానము యొక్క భాగము అని అర్థము;

(17) ''పింఛను'' అనగా అది ఏ రకపుదైనను, అంశదాయమైనదైనను, కానిదైనను, ఎవరేని వ్యక్తికి లేక ఎవరేని వ్యక్తిని గూర్చి చెల్లించబడదగు పింఛను అని అర్థము మరియు ఆ పదములో, అట్లు చెల్లించబడదగు సేవా విరమణానంతరవేతనము అట్లు చెల్లించబడదగు ఉపదానము, మరియు భవిష్యనిధికి చెల్లించబడదగు అభిదాయము వాటిపై వడ్డీతో గాని, వడ్డీ లేకుండగాని లేక వాటికి ఏదైన చేర్చిగాని, చేర్చకగాని, తిరిగి ఇచ్చుటకుగాను అట్లు చెల్లించబడదగు ఏదేని డబ్బు లేక ఏవేని డబ్బులు చేరియుండును.

(18) ''ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము'' అనగా 352వ అనుచ్ఛేదము యొక్క ఖండము (1) క్రింద జారీ చేయబడిన అధిప్రఖ్యానము అని అర్థము;

(19) ''బహిరంగ అధిసూచన'' అనగా సందర్భానుసారముగ భారతదేశ రాజపత్రములోని లేక ఏదేని రాజ్యము యొక్క అధికారిక రాజపత్రములోని అధిసూచన అని అర్థము;

(20) ''రైలుమార్గము'' అను పదములో ఈ క్రిందివి చేరి వుండవు:–

(ఎ) పూర్తిగ ఒక పురపాలిక ప్రాంతమునందున్న ట్రాము మార్గము; లేక

---

1. సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 14వ పరిచ్ఛేదము ద్వారా, ఖండము (12ఏ) 16.9.2016వ తేదీ నుండి చొప్పించబడినది.

(బి) పూర్తిగ ఒక రాజ్యమునందే ఉండి, పార్లమెంటుచే శాసనము ద్వారా రైలు మార్గముకాదని ప్రఖ్యానించబడినట్టి యేదేని ఇతర సంచార మార్గము;

[1][* * * *]

[2][(22) ''రాజ్యాధీశుడు అనగా'' సంవిధాన (ఇరువది ఆరవ సవరణ) చట్టము, 1971 యొక్క ప్రారంభమునకు పూర్వము ఎప్పుడైనను రాష్ట్రపతిచే, ఇండియాలోని రాజ్యాధీశుడుగా గుర్తించబడిన రాజు, ముఖ్యుడు లేక ఇతర వ్యక్తి అని, లేక అట్టి ప్రారంభమునకు పూర్వము ఎప్పుడైనను రాష్ట్రపతిచే అట్టి రాజ్యాధీశుని ఉత్తరాధికారిగ గుర్తించబడిన ఎవరేని వ్యక్తియని అర్థము;

(23) ''అనుసూచి'' అనగా ఈ సంవిధానము యొక్క అనుసూచి అని అర్థము;]

(24) ''అనుసూచిత కులములు'' అనగా ఈ సంవిధాన ప్రయోజనముల కొరకు 341వ అనుచ్ఛేదము క్రింద అనుసూచిత కులములుగా భావించబడు కులములు, జాతులు లేక జనజాతులు, లేక అట్టి కులముల, జాతుల, లేక జనజాతుల యొక్క భాగములు, లేక వాటిలోని సముదాయములు అని అర్థము;

(25) ''అనుసూచిత జనజాతులు'' అనగా ఈ సంవిధాన ప్రయోజనముల కొరకు 342వ అనుచ్ఛేదము క్రింద అనుసూచిత జనజాతులుగ భావించబడు జనజాతులు లేక జనజాతి సమాజములు లేక అట్టి జనజాతుల లేక జనజాతి సమాజముల యొక్క భాగములు లేక అందలి సముదాయములు అని అర్థము;

(26) ''ప్రతిభూతులు'' అను పదములో స్టాకు చేరియుండును;

[3][(26ఏ) ''సేవలు'' అనగా వస్తువులు కానటువంటివి ఏవైనా అని అర్థము;

(26బీ) 246ఏ, 268, 269, 269ఏ మరియు 279ఏ అనుచ్ఛేములలో నిర్దేశించిన ''రాజ్యము'' అనువదములో శాసన మండలిలోనున్న సంఘరాజ్యక్షేత్రము చేరియుండును;]

[4][(26సీ) ''సామాజికముగా మరియు విద్యా విషయకముగా వెనుకబడిన తరగతులు'' అనగా ఈ సంవిధానము యొక్క ప్రయోజనము కొరకు 342ఏ అనుచ్ఛేదము క్రింద అట్లు భావించినట్టి వెనుకబడిన తరగతులు అని అర్థము;]

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ఖండమ (21) వదలివేయబడినది.
2. సంవిధాన (ఇరువది యారవ సవరణ) చట్టము, 1971 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా ఖండము (22)కు బదులుగా ఉంచబడినది.
3. సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 14వ పరిచ్ఛేదము ద్వారా ఖండము (26ఏ) మరియు (26బీ)లు 16.09.2016 చొప్పించబడినవి.
4. సంవిధాన (నూట రెండవ సవరణ) చట్టము, 2018 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా 11.8.2018 నుండి చొప్పించబడినది.

(27) ''ఉప-ఖండము'' అనగా ఆ పదము ఏ ఖండములో వచ్చునో ఆ ఖండము యొక్క ఉప-ఖండమని అర్థము;

(28) ''పన్ను విధింపు'' అను పదములో సాధారణమైన, లేక స్థానికమైన, లేక విశేషమైన, ఏదేని పన్ను యొక్క లేక శుల్కము యొక్క విధింపు చేరియుండును, మరియు 'పన్ను' అనుపదము తదనుసారము అన్వయించబడవలెను;

(29) ''రాబడిపై పన్ను'' అను పదములో అధిక లాభములపై పన్నును బోలిన పన్ను చేరియుండును;

[1][(29ఏ) ''సరుకుల క్రయము లేక విక్రయములపై పన్ను''లో ఈ క్రిందివి చేరియుండును-

(ఎ) ఏవేని సరుకులలో ఆస్తికిగాని, నగదుకుగాని వాయిదా వేసిన చెల్లింపునకు లేదా ఇతర విలువగల ప్రతిఫలమునకు కాంట్రాక్టు ననుసరించి గాక అన్యథా పన్నుల అంతరణ చేయుటపై పన్ను;

(బి) పనుల కాంట్రాక్టుల నిర్వహణలో చేరియున్న సరుకులలో ఆస్తి అంతరణపై (సరుకుల రూపముగానైన లేక మరొక రూపముగానైన) పన్ను;

(సి) అద్దె కొనుగోలుపై లేదా వాయిదాలపై చెల్లించు ఏదేని పద్ధతిపై సరుకులనందజేయుటపై పన్ను;

(డి) ఏవేని సరుకులను ఏదేని ప్రయోజనము నిమిత్తం నగదుకుగాని, వాయిదా వేసిన చెల్లింపునకు లేక విలువగల ఇతర ప్రతిఫలమునకు (నిర్దిష్ట కాలావధి కొరకైనను లేకున్నను) ఉపయోగించుటకు గల అంతరణ హక్కుపై పన్ను;

(ఇ) నిగమితము కాని ఏదేని అసోసియేషనుచే లేక వ్యక్తుల నికాయముచే అందలి ఒక సభ్యునకు నగదుకుగాని, వాయిదా వేసిన చెల్లింపునకు లేక విలువగల ఇతర ప్రతిఫలమునకు సరుకులను సరఫరా చేయుటపై పన్ను;

(ఎఫ్) ఆహార పదార్థముగాగాని లేక మానవ వినియోగానికై ఏదేని ఇతర వస్తువుగాగాని లేక ఏదేని పానీయముగాగాని (మత్తు కలిగించునదైనను, కాకున్నను) ఉన్న సరుకులను ఏదేని సేవా రూపముగా లేదా సేవలో భాగముగా లేదా మరేదేని ఇతర రీతిలో అదేదైనప్పటికిని సరఫరా చేయుటపై పన్ను; అట్టి సరఫరా లేక సేవా నగదుకుగాని, వాయిదాపడిన చెల్లింపునకు గాని లేక విలువగల ఇతర ప్రతిఫలమునకు గాని చేయబడిన యెడల;

---

1. సంవిధాన (నలుబది ఆరవ సవరణ) చట్టము, 1982 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 02.02.1983 నుండి చొప్పించబడినది.

మరియు ఏదేని సరుకుల యొక్క అట్టి అంతరణ అందచేయుట లేక సరఫరా అంతరణ అందచేయుట లేక సరఫరా చేయబడిన వ్యక్తిచే ఆ సరుకులను అమ్మకము చేసినట్లుగాను మరియు ఏ వ్యక్తికి అట్టి అంతరణ అందచేయుట లేదా సరఫరా చేయబడినదో ఆ వ్యక్తిచే ఆ సరుకులను కొనుగోలు చేయబడినట్లు గాను భావించబడవలెను.]

[1][(30) ''సంఘ రాజ్యక్షేత్రము'' అనగా ఒకటవ అనుసూచిలో నిర్దిష్టపరచబడిన ఏదేని సంఘ రాజ్యక్షేత్రము అని అర్థము, మరియు ఆ పదములో ఆ అనుసూచిలో నిర్దిష్టపరచబడక భారత రాజ్యక్షేత్రములో చేరియున్న ఏదేని ఇతర రాజ్యక్షేత్రము చేరియుండును.]

**అర్థాన్వయము.**

367. (1) సందర్భము అన్యథా అపేక్షించిననే తప్ప, 372వ అనుచ్ఛేదము క్రింద సాధారణ ఖండముల చట్టము, 1897లో చేయబడు అనుకూలానుసరణలకు మరియు మార్పులకు అధ్యధీనమై, ఆ చట్టము ఇండియా అధినివేశ శాసనమండలి చట్టము యొక్క అర్థాన్వయమునందు ఎట్లు వర్తించునో, అటులనే ఈ సంవిధానము యొక్క అర్థాన్వయమునందు వర్తించవలెను.

(2) ఈ సంవిధానములో పార్లమెంటు యొక్క, లేక దానిచే చేయబడిన చట్టములను లేక శాసనములను లేక [2][* * * *] ఒక రాజ్య శాసనమండలి యొక్క, లేక దానిచే చేయబడిన చట్టములను, లేక శాసనములను, గూర్చిన ఏ నిర్దేశములోనైనను, రాష్ట్రపతిచే చేయబడిన అధ్యాదేశమును గూర్చిన నిర్దేశము లేక సందర్భానుసారముగ, గవర్నరు [3][* * * *] చే చేయబడిన అధ్యాదేశమును గూర్చిన నిర్దేశము చేరియున్నట్లు అన్వయించబడవలెను.

(3) ఈ సంవిధాన ప్రయోజనముల కొరకు ''విదేశీ రాజ్యము'' అనగా, భారతదేశము మినహా ఏదేని ఇతర రాజ్యము అని అర్థము:

అయితే పార్లమెంటుచే చేయబడు ఏదేని శాసనము యొక్క నిబంధనలకు అధ్యధీనమై, రాష్ట్రపతి [4]ఉత్తరువు ద్వారా ఆ ఉత్తరువులో నిర్దిష్టపరచబడు ప్రయోజనముల కొరకు ఏదేని రాజ్యము విదేశీ రాజ్యము కాదని ప్రఖ్యానించవచ్చును.

## భాగము – 20

## సంవిధానము యొక్క సవరణ

[5][**సంవిధానమును సవరించుటకు పార్లమెంటుకు గల అధికారము, మరియు అందుకైన ప్రక్రియ.**]

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ఖండము (30)కి బదులుగా ఉంచబడినది.
2. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''ఒకటవ అనుసూచి యొక్క భాగము – ఏ లేక 1వ భాగము – బీ లో నిర్దిష్టపరచబడిన'' అను పదములు మరియు అక్షరములు వదిలివేయబడినవి.
3. అదే చట్టము ద్వారా ''లేక రాజ ప్రముఖ్''లను అనుపదములు రద్దు చేయబడినవి.
4. సంవిధాన (విదేశీ రాజ్యములగూర్చిన ప్రఖ్యానము) ఉత్తరువు 1950 (సి.ఓ–2) చూడుము.

368. [1][(1) ఈ సంవిధానములో ఏమియున్నప్పటికిని, పార్లమెంటు, తన సంవిధానాధికారమును వినియోగించుచు, ఈ అనుచ్ఛేదములో పేర్కొనబడిన ప్రక్రియ ననుసరించి ఈ సంవిధానము యొక్క ఏ నిబంధననైనను చేర్పు, మార్పు, లేక రద్దు రూపమున సవరించవచ్చును.]

[2][(2) ఈ సంవిధానము యొక్క సవరణకు, పార్లమెంటు యొక్క ఉభయ సదనములలో ఏ సదనమునందైనను, ఆ ప్రయోజనము కొరకు ఒక బిల్లును ప్రవేశ పెట్టుటద్వారా మాత్రమే ఉపక్రమించవచ్చును; మరియు ఆ బిల్లు ప్రతి సదనములోను, ఆ సదనము యొక్క మొత్తము సభ్యులలో అధిక సంఖ్యాకులచే మరియు హాజరై యుండి ఓటు చేయు సభ్యులలో మూడింట రెండు వంతులకు తక్కువ కాని అధిక సంఖ్యాకులచే, పాస్ చేయబడినచో [3][అది రాష్ట్రపతికి సమర్పించబడగా ఆయనదానికి తన అనుమతిని ఒసగవలెను.] అటుపైన ఆ బిల్లు యొక్క నిబంధనల ప్రకారము సంవిధానము సవరించబడినదై యుండవలెను:

అయితే అట్టి సవరణ–

(ఎ) 54, 55, 73, [4][162, 241 లేదా279ఏ అనుచ్ఛేదములలో], లేక

(బి) భాగము 5 యొక్క అధ్యాయము 4, భాగము 6 యొక్క అధ్యాయము 5, లేక భాగము 11 యొక్క అధ్యాయము 1లో, లేక

(సి) ఏడవ అనుసూచిలోని సూచీలలో దేనిలోనైనను, లేక

(డి) పార్లమెంటు నందు రాజ్యముల ప్రాతినిధ్యములో, లేక

(ఇ) ఈ అనుచ్ఛేదము యొక్క నిబంధనలలో,

ఏదేని మార్పును చేయగోరునదైనచో, అట్టి సవరణ నిబంధనలుగల బిల్లు అనుమతి కొరకు రాష్ట్రపతికి సమర్పించబడుటకు పూర్వము, ఆ సవరణ, [5][* * *] మొత్తము రాజ్యముల సంఖ్యలో సగమునకు తక్కువ కాని రాజ్య శాసన మండలులచే కూడ, అందుకుగాను చేయబడిన తీర్మానముల ద్వారా, అనంతర సమర్థన చేయబడవలసియుండును.

---

1. సంవిధాన (ఇరువది నాలుగవ సవరణ) చట్టము, 1971 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.
2. సంవిధాన (ఇరువది నాల్గవ సవరణ) చట్టము, 1971 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 368వ అనుచ్ఛేదమును, ఖండము (2)గా తిరిగి అంకె వేయబడినది.
3. అదే చట్టపు 3వ పరిచ్ఛేదము ద్వారా ''అది రాష్ట్రపతికి అతని అనుమతి కొరకు సమర్పించబడవలెను మరియు బిల్లునకు అట్టి అనుమతి ఇవ్వబడిన మీదట''కు బదులుగా ఉంచబడినది.
4. సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 15వ పరిచ్ఛేదము ద్వారా ''162 లేక 241వ అనుచ్ఛేదములలో'' అను పదములకు బదులుగా 16.9.2016వ తేదీ నుండి ఉంచబడినది.
5. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1971 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా ''అనుసూచి యొక్క భాగము–ఏ లేక భాగము–బీలో నిర్దిష్టపరచబడిన'' అను పదములు మరియు అక్షరములు వదలివేయబడినవి.

[1][(3) 13వ అనుచ్ఛేదములో నున్న దేదియు, ఈ అనుచ్ఛేదము క్రింద చేయబడిన సవరణకు దేనికినీ వర్తించరాదు.]

[2][(4) [సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976లోని 55వ పరిచ్ఛేదవు ప్రారంభమునకు పూర్వము చేయబడినదైనను, లేక తరువాత చేయబడినదైనను] ఈ అనుచ్ఛేదము క్రింద చేయబడిన లేక చేయబడినట్లు తాత్పర్యితమగు (భాగము 3 యొక్క నిబంధనలతో సహా) ఈ సంవిధానము యొక్క సవరణ ఏదియు, ఏ న్యాయస్థానములోను ఏ ఆధారముపైనను ప్రష్టవ్యము (ప్రశ్నగతము) కారాదు.

(5) ఈ అనుచ్ఛేదము క్రింద, సంవిధానపు నిబంధనలను చేర్పు, మార్పు లేక రద్దు రూపమున సవరించుటకు పార్లమెంటుకుగల సంవిధానాయకాధికారముపై ఏ విధమైన పరిమితి ఉండరాదని సందేహములను తొలగించుటకై ఇందుమూలముగ ప్రఖ్యానించడమైనది.]

## భాగము – 21

## [3][తాత్కాలిక, పరివర్తనకాలిక మరియు విశేష నిబంధనలు]

**రాజ్యసూచిలోని కొన్ని విషయములను గూర్చి అవి ఉభయ సామాన్య సూచిలో ఉండినటులనే శాసనములను చేయుటకు పార్లమెంటుకుగల తాత్కాలిక అధికారము.**

369. ఈ సంవిధానములో ఏమియున్నప్పటికిని, ఈ సంవిధాన ప్రారంభము నుండి అయిదు సంవత్సరముల కాలావధిలో ఈ క్రింది విషయములను గూర్చి అవి ఉభయ సామాన్య సూచిలో పేర్కొనబడి యుండినటులనే శాసనములను చేయుటకు పార్లమెంటు అధికారము కలిగియుండ వలెను, అవేవనగా–

(ఎ) నూలు మరియు ఉన్ని వస్త్రములు, ముడి ప్రత్తి (గింజలు తీసిన ప్రత్తి, మరియు గింజలు తీయని ప్రత్తి లేక కపాసుతో సహా) ప్రతి గింజలు, కాగితము (వార్తా పత్రికల కాగితముతో సహా), ఆహార పదార్థములు (తినదగు చమురు గింజలు మరియు నూనెలతో సహా) పశుగ్రాసము (గానుగపిండి మరియు తదితర సారకృత పదార్థములతో సహా), బొగ్గు (కోకు బొగ్గు మరియు రాక్షసిబొగ్గు నుండి ఉత్పన్నమైన పదార్థములతో సహా), ఇనుము, ఉక్కు మరియు అభ్రకములలో ఒక రాజ్యము లోపల జరుగు వ్యాపార, వాణిజ్యములు మరియు వాటి ఉత్పాదన, సరఫరా మరియు పంపిణీ;

---

1. సంవిధాన (ఇరువది నాలుగవ సవరణ) చట్టము, 1971 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.
2. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 55వ పరిచ్ఛేదము ద్వారా ఖండము (4) మరియు (5)లు చొప్పించబడినవి. ఈ పరిచ్ఛేదమును సర్వోన్నత న్యాయస్థానము మినర్వా మిల్స్ లిమిటెడ్ మరియు ఇతరులు వర్సెస్ భారత సంఘము మరియు ఇతరులు (1980, 2 ఎస్.సీ.సీ.591) కేసులో అమాన్యమైనదిగా ప్రఖ్యానించినది.
3. సంవిధాన (పదమూడవ సవరణ) చట్టము, 1962 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ''తాత్కాలిక మరియు పరివర్తనకాలిక నిబంధనలకు'' బదులుగా 1.12.1963 నుండి ఉంచబడినది.

(బి) ఖండము (ఎ)లో పేర్కొనబడిన ఏవేని విషయములను గూర్చిన శాసనములకు విరుద్ధమగు అపరాధములు ఆ విషయములలో దేనిని గూర్చియైనను సర్వోన్నత న్యాయస్థానము తప్ప, న్యాయస్థానములన్నిటి అధికారిత మరియు అధికారములు మరియు ఆ విషయములలో దేనిని గూర్చియైనను ఏదేని న్యాయస్థానముచే తీసుకొనబడు ఫీజులు మినహా ఇతర ఫీజులు;

కాని ఈ అనుచ్ఛేదములోని నిబంధనలు లేకుండినచో ఏ శాసనమును చేయుటకు పార్లమెంటుకు సమర్థత లేకుండెడిదో, అట్టి ఏదేని శాసనమును పార్లమెంటు చేసిన యెడల, ఆ శాసనము అట్టి అసమర్థత మేరకు, సదరు కాలావధి ముగియక పూర్వము చేయబడిన లేక చేయుట లోపించిన విషయమును గూర్చి తప్ప, ఇతర విషయములను గూర్చి ఆ కాలావధి ముగిసిన మీదట ప్రభావరహితము కావలెను.

**[1][370. (1) ఈ సంవిధానములో ఏమి యున్నప్పటికిని,- జమ్మూ కాశ్మీరు రాజ్యమును గూర్చిన తాత్కాలిక నిబంధనలు.

---

** భారత సంవిధానపు 370వ అనుచ్ఛేదపు ఖండపు (1)తో కలిపి చదువుకొను 370వ అనుచ్ఛేదపు ఖండము (3) ద్వారా ఒసగబడిన అధికారములను వినియోగించుటలో, పార్లమెంటు సిఫారసులపై రాష్ట్రపతి, 2019, ఆగష్టు 6వ తేదీ నుండి ఈ క్రింది మినహా, సదరు 370వ అనుచ్ఛేదపు అన్ని ఖండముల అమలు ఆగిపోవలెననిప్రఖ్యానించబడినది, అవేవనగా:-

''370. ఈ సంవిధానపు అనుచ్ఛేదము 152 లేదా అనుచ్ఛేదము 308 లేదా ఏదైనా ఇతర అనుచ్ఛేదము లేదా జమ్మూ మరియు కాశ్మీర్ సంవిధానములోని ఏదైనా ఇతర నిబంధన లేదా భారత రాజ్యక్షేత్రములో అమలులోనున్న ఏదైనా శాసనము, దస్తావేజు, తీర్పు, అధ్యాదేశము, ఉత్తర్వు, ఉప-నియమము (by-law), నియమము, వినియమము, అధిసూచన, ఆచారము లేదా వాడుక లేదా ఇతర దస్తావేజు లేదా 363వ అనుచ్ఛేదము క్రింద లేదా ఇతర విధంగా గ్రహించిన ఏదేని పత్రము, సంధి లేదా కరారులో ఉన్నదానికి విరుద్ధముగా ఏమి ఉన్నప్పటికినీ, ఎటువంటి మార్పులు లేదా మినహాంపులు లేకుండా, ఆయా సమయములందు సవరించినట్టి సంవిధానపు నిబంధనలన్నియు జమ్మూ మరియు కాశ్మీరు రాజ్యమునకు వర్తించవలెను.''.

(న్యాయ మరియు న్యాయపాలన మంత్రిత్వ శాఖ వారి ఉత్తరువు నెం. సీ.ఓ.273, తేదీ 5 ఆగష్టు, 2019).

1. ఈ అనుచ్ఛేదము ద్వారా ప్రదత్తమైన అధికారములను అమలు వరచుటలో, జమ్మూకాశ్మీరు రాజ్య సంవిధాన సభ సిఫారసు మేరకు, రాష్ట్రపతి సదరు అనుచ్ఛేదము 370ని ఖండము (1)లోని విశదీకరణకు సవరణతో 1952, నవంబరు 17వ తేదీ నుండి సదరు విశదీకరణ అమలు వరచబడుటకు ప్రఖ్యానించబడి దానిని ఈ క్రింది విధంగా చేయడమైనది.

**విశదీకరణ:** ఈ అనుచ్ఛేదము నిమిత్తము ఆ రాజ్య ప్రభుత్వము యొక్క రాజ్య శాసనసభ సిఫారసు మేరకు తత్సమయమున పదవీయందున్న మంత్రి పరిషత్తు సలహాపై వ్యవహరించు, జమ్మూ కాశ్మీరు యొక్క ఇప్పుడు ''గవర్నరు'' ''సదర్-ఎ-రియాసత్‌గా రాష్ట్రపతిచే తత్సమయమున గుర్తించబడిన వ్యక్తి అని అర్థము''.

(ఎ) 238వ అనుచ్ఛేదము యొక్క నిబంధనలు జమ్మూ కాశ్మీరు రాజ్యము విషయమున వర్తించరాదు;

(బి) సదరు రాజ్యము కొరకు శాసనములను చేయుటకు పార్లమెంటుకు గల అధికారము ఈ క్రింది విషయములకు పరిమితమై యుండవలెను:

(i) భారత అధినివేశములో ఆ రాజ్య సంవిలీనమునకు సంబంధించిన సంవిలీన పత్రమునందు, ఏ విషయములను గురించి ఆ రాజ్యము కొరకు అధినివేశ శాసనమండలి శాసనములను చేయవచ్చునని నిర్దిష్టపరచబడెనో ఆ విషయములకు సమరూపమైనవని, రాష్ట్రపతి ఆ రాజ్య ప్రభుత్వముతో సంప్రదించి సంఘసూచి, మరియు ఉభయ సామాన్యసూచిలోని విషయములలో నుండి ప్రఖ్యానించిన విషయములు; మరియు

(ii) రాష్ట్రపతి, ఆ రాజ్య ప్రభుత్వము యొక్క ఏకీభావముతో ఉత్తరువు ద్వారా, సదరు జాబితాలో నుండి నిర్దిష్టపరచు ఇతర విషయములు.

**విశదీకరణ:** ఈ అనుచ్ఛేదము నిమిత్తము రాజ్య ప్రభుత్వము అనగా, 1948, మార్చి అయిదవ తేదీ గల జమ్మూ కాశ్మీరు మహారాజు యొక్క అధిప్రఖ్యానము క్రింద తత్సమయమున పదవియందున్న మంత్రి పరిషత్తు సలహాపై వ్యవహరించు ఆ రాజ్యపు మహారాజుగా రాష్ట్రపతిచే తత్సమయమున గుర్తించబడిన వ్యక్తి అని అర్థము;

(సి) 1వ అనుచ్ఛేదము యొక్కయు, ఈ అనుచ్ఛేదము యొక్కయు నిబంధనలు ఆ రాజ్యము విషయమున వర్తించవలెను;

(డి) రాష్ట్రపతి [1] ఉత్తరువు ద్వారా నిర్దిష్టపరచు ఈ సంవిధానములోని ఇతర నిబంధనలు, అట్లు ఆయన నిర్దిష్టపరచు మినహాయింపులకును, మార్పులకును అధ్యధీనమై ఆ రాజ్యము విషయమున వర్తించవలెను:

అయితే, ఉప-ఖండము (బి) యొక్క పేరా (i)లో నిర్దేశించబడిన ఆ రాజ్య సంవిలీన పత్రమునందు నిర్దిష్టపరచబడిన విషయములకు సంబంధించిన ఉత్తరువేదియు, ఆ రాజ్య ప్రభుత్వముతో సంప్రదించిన మీదటనే తప్ప, జారీ చేయబడరాదు:

అంతేకాక, కట్టకడపటి వినాయింపులో నిర్దేశించబడిన విషయములకన్న అన్యమైన వాటికి సంబంధించిన ఉత్తరువేదియూ, ఆ రాజ్య ప్రభుత్వము ఏకీభవించిననే తప్ప జారీ చేయబడరాదు.

(2) ఖండము (1) యొక్క ఉప-ఖండము (బి)లోని పేరా (ii)లో గాని, ఆ ఖండము యొక్క ఉప-ఖండము (డి)లోని రెండవ వినాయింపులో గాని నిర్దేశించబడినట్లు, ఆ రాజ్య ప్రభుత్వము ఏకీభవించుట ఆ రాజ్య సంవిధానమును రూపొందించు ప్రయోజనము కొరకు సంవిధాన సభను

---

[**] న్యాయ మంత్రిత్వశాఖ ఉత్తరువు నెం.సీ.ఓ.44, తేది: నవంబరు 15, 1952. [*] ఇప్పుడు '' గవర్నరు''.

1. అపెండిక్సు- ప్రకారము ఆయా సమయములందు సవరించదగు సంవిధాన (జమ్మూ మరియు కాశ్మీరునకు వర్తింపు) ఉత్తరువు, 1954 (సీ.ఓ.48) చూడుము.

సమావేశపరచుటకు పూర్వము జరిగియుండినచో, ఆ ఏకీభావముపై అట్టి సభచేయు నిర్ణయమునకై దానిని ఆ సభా సమక్షమున ఉంచవలెను.

(3) ఈ అనుచ్ఛేదము యొక్క పూర్వగామి నిబంధనలలో ఏమి యున్నప్పటికిని, రాష్ట్రపతి బహిరంగ అధిసూచన ద్వారా, ఈ అనుచ్ఛేదము అమలునందుండుట ఆగిపోవలెనని గాని, ఆయన నిర్దిష్టపరచు మినహాయింపులతోను, మార్పులతోనూ, మరియు అట్టి తేదీ నుండి మాత్రమే అది అమలునందుండవలెనని గాని ప్రఖ్యానించవచ్చును:

అయితే, రాష్ట్రపతి, అట్టి అధిసూచనను జారీ చేయుటకు పూర్వము, ఖండము (2)లో నిర్దేశించబడిన, ఆ రాజ్య సంవిధాన సభ యొక్క సిఫారసు ఆవశ్యకమై యుండవలెను.

[1]371. [2][(1) * * * * *]

*****, **మహారాష్ట్ర మరియు గుజరాతులను గూర్చిన విశేష నిబంధనలు.**

(2) ఈ సంవిధానములో ఏమియున్నప్పటికిని రాష్ట్రపతి, [3][మహారాష్ట్ర రాజ్యము, లేక గుజరాతు రాజ్యమును] గూర్చి చేసిన ఉత్తరువు ద్వారా ఈ క్రింది వాటి కొరకు గవర్నరు యొక్క ఏదైన విశేష బాధ్యతను గూర్చి నిబంధన చేయవచ్చును:-

(ఎ) [4][సందర్భానుసారముగ] విదర్భ, మరాఠ్వాడా మరియు [4][తక్కిన మహారాష్ట్రకు], లేక సౌరాష్ట్ర, కచ్, మరియు తక్కిన గుజరాతుకు విడివిడిగా అభివృద్ధి బోర్డులను, అట్టి ప్రతి బోర్డు పనిచేయుచున్న తీరును గూర్చిన రిపోర్టు, రాజ్య శాసనమండలి సమక్షమున ప్రతి సంవత్సరము ఉంచబడవలెనను నిబంధనతో, స్థాపించుట కొరకు;

(బి) యావద్రాజ్యము యొక్క ఆవశ్యకతలకధ్యధీనమై, సదరు ప్రాంతముల అభివృద్ధిని గూర్చిన వ్యయమునకై నిధుల యొక్క న్యాయమైన కేటాయింపు కొరకు; మరియు

(సి) యావద్రాజ్యము యొక్క ఆవశ్యకతలకధ్యధీనమై, సదరు ప్రాంతములన్నింటిని గూర్చి సాంకేతిక విద్య, మరియు వృత్తిపర శిక్షణ కొరకు చాలినన్ని సౌకర్యములను మరియు రాజ్య ప్రభుత్వము యొక్క నియంత్రణ క్రిందనున్న సేవలందు ఉద్యోగములలో చాలినన్ని ఆవకాశములను సమకూర్చునట్టి న్యాయమైన ఏర్పాటు కొరకు.

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 22వ పరిచ్ఛేదము ద్వారా 371వ అనుచ్ఛేదమునకు బదులుగా ఉంచబడినది.
2. సంవిధాన (ముప్పది రెండవ సవరణ) చట్టము, 1971 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 1.7.1974 నుండి ఖండము (1) లుప్తము చేయబడినది.
3. బొంబాయి పునర్ వ్యవస్థీకరణ చట్టము, 1960 (1960లోని 11వది) యొక్క 85వ పరిచ్ఛేదము ద్వారా 1.5.1960 నుండి ''బొంబాయి''కు బదులుగా ఉంచబడినది.
4. బొంబాయి పునర్ వ్యవస్థీకరణ చట్టము, 1960 (1960లోని 11వది) యొక్క 85వ పరిచ్ఛేదము ద్వారా ''తక్కిన మహారాష్ట్రకు'' అనుపదములకు'' బదులుగా 1.5.1960 నుండి ఉంచబడినది.

[1]371ఏ. (1) ఈ సంవిధానమునందేమి యున్నప్పటికిని, ఈ క్రింది వాటిని గూర్చిన పార్లమెంటు యొక్క చట్టమేదియు, అది నాగాల్యాండు రాజ్యమునకు వర్తించవలెనని ఒక తీర్మానము ద్వారా నాగాల్యాండు శాసనసభ నిర్ణయించిననే తప్ప, ఆ రాజ్యమునకు వర్తించరాదు.

**నాగాల్యాండు రాజ్యమును గూర్చిన విశేష నిబంధన.**

(ఎ) (i) నాగుల మత విషయక లేక సాంఘిక ఆచరణలు;

(ii) నాగుల ఆచార శాసనము మరియు ప్రక్రియ;

(iii) నాగుల ఆచార శాసనమునను సరించి నిర్ణయములు చేయవలసిన సివిలు మరియు క్రిమినలు న్యాయ పరిపాలన;

(iv) భూమి యొక్కయు, దాని వనరుల యొక్కయు స్వామ్యము మరియు అంతరణ.

(బి) నాగాల్యాండు రాజ్యము యొక్క స్థాపనకు అవ్యవహిత పూర్వము నాగాకొండలు–ట్యూయన్ సాంగ్ క్షేత్రమునందు సంభవించుచుండిన అంతః కల్లోలములు, నాగాల్యాండు గవర్నరు అభిప్రాయములో ఆ క్షేత్రమునందుగాని, అందలి ఏదేని భాగమునందుగాని, కొనసాగుచున్నంత వరకు నాగాల్యాండు రాజ్యములో శాంతిభద్రతలను గూర్చి, ఆయన విశేష బాధ్యతను వహించవలెను, మరియు అందుకు సంబంధించి తన కృత్యములను నిర్వహించుటలో తీసుకొనవలసిన చర్యను గూర్చి గవర్నరు మంత్రి పరిషత్తుతో సంప్రదించిన పిదప తన వైయక్తిక వివేచనను ఉపయోగించవలెను:

అయితే ఏదేని విషయము ఈ ఉప-ఖండము క్రింద గవర్నరు తన వైయక్తిక వివేచనను ఉపయోగించి వ్యవహరించవలసినట్టిదా, కాదా అను ప్రశ్న ఉత్పన్నమైనచో, గవర్నరు తన వివేచనను బట్టి చేసిన నిర్ణయము అంతిమమై యుండవలెను మరియు గవర్నరుచే చేయబడినట్టి ఏదేని పని యొక్క మాన్యత, ఆయన తన వైయక్తిక వివేచనను ఉపయోగించి వ్యవహరించి యుండవలసినదను లేక వ్యవహరించియుండకూడదను, కారణమునుబట్టి ప్రష్టవ్యము కారాదు:

అంతేకాక గవర్నరు నుండి రిపోర్టు అందిన మీదట గాని, అన్యథాగాని నాగాల్యాండు రాజ్యములోని శాంతిభద్రతలను గూర్చి గవర్నరు విశేష బాధ్యత వహించుట ఆవశ్యకము కాదని రాష్ట్రపతి అభిప్రాయపడినచో, ఆయన ఉత్తరువు ద్వారా, అట్టి ఉత్తరువులో నిర్దిష్టపరచబడు తేదీ నుండి గవర్నరుకు అట్టి బాధ్యత ఇక ఉండరాదని ఆదేశించవచ్చును.

(సి) నాగాల్యాండు గవర్నరు ఏదేని అనుదాన అభ్యర్థనను గూర్చి తన సిఫారసును చేయుటలో, భారత సంచిత నిధి నుండి ఏదేని నిర్దిష్ట సేవకు లేక ప్రయోజనమునకు భారత ప్రభుత్వముచే సమకూర్చబడిన ఏదేని ధనము, ఆ సేవకు లేక ప్రయోజనమునకు సంబంధించిన అనుదానము యొక్క అభ్యర్థనలోనే చేర్చబడునట్లు, ఏ ఇతర అభ్యర్థనలోను చేర్చబడకుండునట్లు, కట్టుదిట్టము చేయవలెను.

1. సంవిధాన (పదమూడవ సవరణ) చట్టము, 1962 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 1.12.1963 నుండి చొప్పించబడినది.

(డి) నాగాల్యాండు గవర్నరు బహిరంగ అధిసూచన ద్వారా ఈ విషయమై నిర్దిష్టపరచు తేదీ నుండి ట్యుయన్‌సాంగు జిల్లాకు ముప్పది ఐదుగురు సభ్యులతో కూడిన ఒక ప్రాంతీయ పరిషత్తును స్థాపించవలెను. గవర్నరు తన వివేచనానుసారము ఈ క్రింది విషయములను గూర్చి నిబంధన చేయు నియమావళిని చేయవలెను:–

(i) ప్రాంతీయ పరిషత్తు యొక్క సంరచన, మరియు ప్రాంతీయ పరిషత్తు యొక్క సభ్యులను ఎంపిక చేయవలసిన రీతి:

అయితే, ట్యూయన్‌సాంగ్ జిల్లా యొక్క డిప్యూటీ కమీషనరు ఆ ప్రాంతీయ పరిషత్తుకు పదవిరీత్యా అధ్యక్షుడుగా నుండవలెను, ప్రాంతీయ పరిషత్తు యొక్క ఉపాధ్యక్షుడు, ఆ పరిషత్తు యొక్క సభ్యులలో నుండి వారిచే ఎన్నుకొనబడవలెను;

(ii) ప్రాంతీయ పరిషత్తు సభ్యులుగా ఎంపిక చేయబడుటకు, మరియు అట్టి సభ్యులుగా నుండుటకు అర్హతలు;

(iii) ప్రాంతీయ పరిషత్తు సభ్యుల యొక్క పదావధి, వారికి చెల్లించవలసిన జీతములు, బత్తెములు, ఏవైన ఉన్నచో అవి;

(iv) ప్రాంతీయ పరిషత్తు యొక్క ప్రక్రియ, మరియు కార్యకలాపముల నిర్వహణ;

(v) ప్రాంతీయ పరిషత్తు అధికారుల యొక్కయు, సిబ్బంది యొక్కయు, నియామకము మరియు వారి సేవా షరతులు; మరియు

(vi) ప్రాంతీయ పరిషత్తు యొక్క సంఘటనమును, మరియు అది సరిగా పని చేయుటను గూర్చి నియమావళిని చేయుటకు ఆవశ్యకమగు ఏదేని ఇతర విషయము.

(2) ఈ సంవిధానములో ఏమియున్నప్పటికిని, నాగాల్యాండు రాజ్యము ఏర్పాటు చేయబడిన తేదీ నుండి పది సంవత్సరముల కాలావధి వరకు, లేక ప్రాంతీయ పరిషత్తు యొక్క సిఫారసుపై గవర్నరు బహిరంగ అధిసూచన ద్వారా ఈ విషయమును నిర్దిష్టపరచు అదనపు కాలావధి వరకు–

(ఎ) ట్యూయన్‌సాంగ్ జిల్లా యొక్క పరిపాలన గవర్నరుచే సాగించబడవలెను;

(బి) యావత్తు నాగాల్యాండు రాజ్యము యొక్క ఆవశ్యకతలను తీర్చుటకుగాను నాగాల్యాండు ప్రభుత్వమునకు భారత ప్రభుత్వముచే ఏదేని ధనము సమకూర్చబడిన యెడల, గవర్నరు తన వివేచనానుసారము ట్యూయన్‌సాంగ్ జిల్లాకు ఆ రాజ్యములోని తక్కిన భాగమునకు మధ్య ఆ ధనమును న్యాయముగా కేటాయించు ఏర్పాటు చేయవలెను;

(సి) నాగాల్యాండు శాసనమండలి యొక్క చట్టమేదియు, అది ట్యూయన్‌సాంగ్ జిల్లాకు వర్తించునని గవర్నరు ప్రాంతీయ పరిషత్తు యొక్క సిఫారసుపై బహిరంగ అధిసూచన ద్వారా ఆదేశించిననే తప్ప, ఆ జిల్లాకు వర్తించరాదు, మరియు గవర్నరు అట్టి ఏదేని చట్టమును గూర్చి ఆదేశమును ఇచ్చునప్పుడు ఆ చట్టము ట్యూన్‌సాంగ్ జిల్లాకుగాని, అందలి ఏదేని భాగమునకుగాని వర్తించుటలో ప్రాంతీయ పరిషత్తు యొక్క సిఫారసుపై గవర్నరు నిర్దిష్టపరచు

మినహాయింపులకును, మార్పులకును, అధ్యధీనమై ప్రభావము కలిగియుండవలెనని ఆదేశించవచ్చును:

అయితే ఈ ఉప-ఖండము క్రింద ఈయబడిన ఏదేని ఆదేశము గత కాలిక ప్రభావము కలిగియుండునట్లుగా ఈయబడవచ్చును;

(డి) గవర్నరు, ట్యూయన్‌సాంగ్ జిల్లాలో శాంతి, ప్రగతి మరియు సువరిపాలన కొరకు వినిమయములను చేయవచ్చును, అట్లు చేయబడిన ఏదేని వినియమము, ఆ జిల్లాకు తత్సమయమున వర్తించు ఏదేని పార్లమెంటు యొక్క చట్టమును, లేక ఇతర శాసనమును ఆవశ్యకమగుచున్నచో గతకాలిక ప్రభావముతో రద్దు, లేక సవరణ చేయవచ్చును;

(ఇ)(i) నాగాల్యాండు శాసనసభలో ట్యూయన్‌సాంగ్ జిల్లాకు ప్రాతినిధ్యము వహించు సభ్యులలో ఒకరు ముఖ్యమంత్రి సలహాపై, ట్యూయన్‌సాంగ్ వ్యవహారముల మంత్రిగా గవర్నరుచే నియమించబడవలెను. ఆ ముఖ్యమంత్రి తన సలహాను ఒసగుటలో పూర్వోక్త సభ్యులలో అధిక సంఖ్యాకుల సిఫారసు ప్రకారము వ్యవహరించవలెను;[1]

(ii) ట్యూయన్‌సాంగ్ వ్యవహారముల మంత్రి, ట్యూయన్‌సాంగ్ జిల్లాకు సంబంధించిన అన్ని విషయములలోను వ్యవహరించవలెను మరియు ఆ జిల్లాకు సంబంధించిన అన్ని విషయములలోను ఆయనకు గవర్నరు వద్ద నేరుగా ప్రవేశ సౌలభ్యము ఉండవలెను. అయితే తద్విషయములను గూర్చి ఆయన ముఖ్యమంత్రికి తెలియజేయు చుండవలెను.

(ఎఫ్) ఈ ఖండము యొక్క పూర్వగామి నిబంధనలలో ఏమి యున్నప్పటికిని, ట్యూయన్‌సాంగ్ జిల్లాకు సంబంధించిన అన్ని విషయముల పైనను అంతిమ నిర్ణయమును గవర్నరు తన వివేచనానుసారము చేయవలెను.

(జి) 54, 55వ అనుచ్ఛేదములలోను, 80వ అనుచ్ఛేదము యొక్క ఖండము (4)లో, రాజ్య శాసన సభకు ఎన్నుకొనబడిన సభ్యులను, లేక అట్టి ప్రతియొక సభ్యుని గూర్చిన నిర్దేశములలో, ఈ అనుచ్ఛేదము క్రింద స్థాపించబడిన ప్రాంతీయ పరిషత్తుచే ఎన్నుకొనబడిన నాగాల్యాండు శాసనసభ యొక్క సభ్యులను లేక సభ్యుని గూర్చిన నిర్దేశములు చేరి యుండవలెను.

(హెచ్) 170వ అనుచ్ఛేదములో-

---

1. సంవిధాన (ఇబ్బందుల తొలగింపు) 10వ ఉత్తరువు యొక్క 2వ పేరాగ్రాఫ్, 1.12.1963 నుండి భారత సంవిధానము యొక్క 371-ఏ అనుచ్ఛేదము దాని ఖండము (2) యొక్క ఉప-ఖండము (ఇ) యొక్క పేరా (i)కి ఈ క్రింది వినాయింపు చేర్చబడునట్లుగా అమలు కలిగి యుండునని నిబంధించుచున్నది.

''అయితే ట్యూయన్ సాంగు జిల్లా కొరకు నాగాల్యాండు శాసన సభలో ప్రత్యేకించబడిన స్థానములను పూరించుటకు శాసనముననుసరించి వ్యక్తులు ఎంపిక చేసుకొనబడు వరకు, ఏ వ్యక్తినైనను, ట్యూయన్‌సాంగు వ్యవహారముల మంత్రిగా వ్యవహరించుటకు, ముఖ్యమంత్రి సలహాపై గవర్నరు నియమింవవచ్చును.''

(i) నాగాల్యాండు శాసనసభకు సంబంధించినంతవరకు ఖండము (1) లేక 'అరువది' అను పదమునకు బదులు 'నలుబదియారు' అను పదము ఉంచబడినట్లు ప్రభావము కలిగియుండవలెను.

(ii) సదరు ఖండములో, రాజ్యములోని ప్రాదేశిక నియోజక వర్గముల నుండి ప్రత్యక్ష ఎన్నికను గూర్చిన నిర్దేశములో ఈ అనుచ్ఛేదము క్రింద స్థాపించబడిన ప్రాంతీయ పరిషత్తు యొక్క సభ్యులచే ఎన్నుకొనబడుట చేరియుండవలెను.

(iii) ఖండములు (2) మరియు (3)లలో ప్రాదేశిక నియోజక వర్గములను గూర్చిన నిర్దేశములనగా, కొహిమా, మొకాక్ చుంగ్, జిల్లాలలోని ప్రాదేశిక, నియోజకవర్గములను గూర్చిన నిర్దేశములని అర్థము.

(3) ఈ అనుచ్ఛేదము యొక్క పూర్వగామి నిబంధనలను అమలుపరచుటలో ఏదేని ఇబ్బంది ఏర్పడినచో, రాష్ట్రపతి, ఉత్తరువు ద్వారా ఆ ఇబ్బందిని తొలగించుటకు ఆవశ్యకమని తనకు తోచిన ఏ పనినైనను (ఏదైన ఇతర అనుచ్ఛేదము యొక్క అనుకూలానుసరణ లేక మార్పుతో సహా) చేయవచ్చును:

అయితే నాగాల్యాండు రాజ్యము ఏర్పాటు చేయబడిన తేదీ నుండి మూడు సంవత్సరములు ముగిసిన పిమ్మట అట్టి ఉత్తరువేదియు చేయబడరాదు.

**విశదీకరణ:–** ఈ అనుచ్ఛేదములో ''కొహిమా, మొకాక్‌చుంగ్ మరియు ట్యూయన్‌సాంగ్ జిల్లాలు'' అను పదములు, నాగాల్యాండు రాజ్య చట్టము, 1962లో ఆ పదములకు ఏ అర్థము కలదో ఆ అర్థమునే కలిగియుండవలెను.

**అస్సాము రాజ్యమును గూర్చి విశేష నిబంధన.**

[1][371బీ. ఈ సంవిధానములో ఏమియున్నప్పటికిని, రాష్ట్రపతి అస్సాము రాజ్యమును గూర్చి చేసిన ఉత్తరువు ద్వారా, ఆరవ అనుసూచి యొక్క పేరా 20కి జతపరచబడిన పట్టిక యొక్క [2][భాగము–1]లో నిర్దిష్టపరచబడిన జనజాతి ప్రాంతముల నుండి ఎన్నుకొనబడిన ఆ రాజ్యము యొక్క శాసనసభ సభ్యులతోను, ఆ ఉత్తరువులో నిర్దిష్టపరచబడునంత మంది ఆ శాసనసభ యొక్క ఇతర సభ్యులతోనూ, కూడియుండు ఆ శాసనసభ యొక్క కమిటీ నొకదానిని సంఘటనము చేయుట కొరకు, దాని కృత్యముల కొరకు మరియు అట్టి కమిటీ సంఘటనమునకును, అది సరిగా పని చేయుటకును ఆ శాసనసభ ప్రక్రియా నియమావళియందు చేయవలసిన మర్పుల కొరకు నిబంధనలను చేయవచ్చును.]

---

1. సంవిధాన (ఇరువది రెండవ సవరణ) చట్టము, 1969 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.
2. ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) ద్వారా ''భాగము–ఏ''కు బదులుగా 21.1.1972 నుండి ఉంచబడినది.

[1][371సీ. (1) ఈ సంవిధానములో ఏమియున్నప్పటికిని, రాష్ట్రపతి మణిపూరు రాజ్యమును గూర్చి చేసిన ఉత్తరువు ద్వారా, ఆ రాజ్యము యొక్క కొండ ప్రాంతముల నుండి ఎన్నుకొనబడిన రాజ్య శాసనసభ సభ్యులతో కూడియుండు, ఆ సభ యొక్క కమిటీ నొకదానిని సంఘటనము చేయుట కొరకు దాని కృత్యముల కొరకు, ప్రభుత్వము యొక్క కార్యకలాప నియమావళియందును, ఆ రాజ్యశాసనసభ యొక్క ప్రక్రియా నియమావళియందును చేయబడవలసిన మార్పుల కొరకు, అట్టి కమిటీ సరిగా పని చేయునట్లు కట్టుదిట్టము చేయుటకు గవర్నరుకుగల ఏదేని విశేష బాధ్యత కొరకు, నిబంధనలు చేయవచ్చును. **మణిపూర్ రాజ్యమును గూర్చిన విశేష నిబంధన.**

(2) గవర్నరు ప్రతి సంవత్సరము, లేక రాష్ట్రపతిచే ఆపేక్షించబడినప్పుడెల్లను, మణిపూర్ రాజ్యములోని కొండ ప్రాంతముల పరిపాలనను గూర్చి రాష్ట్రపతికి రిపోర్టు చేయవలెను మరియు సదరు ప్రాంతముల పరిపాలనను గూర్చి రాజ్యమునకు ఆదేశములనిచ్చుట సంఘము యొక్క కార్యపాలకాధికారములో చేరియుండవలెను.

**విశదీకరణ:** ఈ అనుచ్ఛేదములో ''కొండప్రాంతములు'' అనగా రాష్ట్రపతి ఉత్తరువు ద్వారా కొండప్రాంతములని ప్రఖ్యానించు ప్రాంతము అని అర్థము.]

[2][371డీ. (1) పబ్లికు ఉద్యోగము విషయములోను, విద్యా విషయములోను, [3]ఆంధ్రప్రదేశ్ లేక తెలంగాణ రాజ్యములందలి వేరు వేరు భాగములకు చెందిన ప్రజలకు సమానావకాశములను మరియు సౌకర్యములను కలిగించుటకై, మొత్తము రాజ్యము యొక్క ఆవశ్యకతలను దృష్టియందుంచుకొని రాష్ట్రపతి, ఆ రాజ్యముల విషయమున ఉత్తరువు ద్వారా నిబంధనలను చేయవచ్చును మరియు ఆ రాజ్యములందలి వేరు వేరు భాగములకు వేరు వేరు నిబంధనలను చేయవచ్చును. **ఆంధ్రప్రదేశ్ లేక తెలంగాణ రాజ్యములను గూర్చిన విశేష నిబంధనలు.**

(2) ఖండము (1) క్రింద చేయబడిన ఉత్తరువు, ప్రత్యేకముగా–

(ఎ) రాజ్యము యొక్క సివిలు సేవలో ఏదేని తరగతి, లేక తరగతుల పదస్థానములను, లేక రాజ్యమునకు అధీనమైన ఏదేని తరగతి లేక తరగతుల సివిలు పదస్థానములను రాజ్యమునందలి వేరు వేరు భాగములకు వేరు వేరు స్థానిక కేడర్లుగా ఏర్పాటు చేయవలసినదిగాను, మరియు అట్లు ఏర్పాటు చేయబడిన స్థానిక కేడర్లలో ఆ పదస్థానములందున్న వ్యక్తులను ఉత్తరువులో నిర్దిష్ట పరచబడిన సూత్రములను, మరియు ప్రక్రియను అనుసరించి కేటాయించవలసినదిగాను, రాజ్య ప్రభుత్వమును ఆపేక్షించవచ్చును.

(బి) ఈ క్రింది వాటి కొరకై స్థానిక ప్రాంతముగ ఎంచబడవలసిన రాజ్య భాగమును, లేక భాగములను నిర్దిష్ట పరచవచ్చును;

---

1. సంవిధాన (ఇరువది ఏడవ సవరణ) చట్టము, 1971 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా 15.2.1972 నుండి చొప్పించబడినది.
2. సంవిధాన (ముప్పది రెండవ సవరణ) చట్టము, 1973 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 1.7.1974 నుండి చొప్పించబడినది.
3. ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టము, 2014 97వ పరిచ్ఛేదం ద్వారా ''ఆంధ్రప్రదేశ్ రాజ్యము '' కొరకు 02.06.2014 నుండి బదులుగా ఉంచబడినది.

(i) (ఈ అనుచ్ఛేదము క్రింది ఉత్తర్వును పురస్కరించుకొని ఏర్పాటు చేయబడినవైనను, అన్యథా సంఘటితము చేయబడినవైనను), రాజ్య ప్రభుత్వమునకు అధీనమైన ఏదేని స్థానిక కేడరులోని పదవులను నేరుగా భర్తీ చేయుటకు;

(ii) రాజ్యములోని ఏదేని స్థానిక ప్రాధికారికి అధీనమైన ఏదేని కేడరులోని పదవులను నేరుగా భర్తీ చేయుటకు; మరియు

(iii) రాజ్యములోని ఏదేని విశ్వవిద్యాలయములో లేక రాజ్య ప్రభుత్వ నియంత్రణకు అధ్యధీనమైయున్న ఏదేని ఇతర విద్యా సంస్థలో ప్రవేశము కొరకు;

(సి) ఈ క్రింది వాటి విషయమున, సందర్భానుసారముగ అట్టి కేడరుకు, విశ్వవిద్యాలయమునకు, లేక ఇతర విద్యాసంస్థకు సంబంధించిన స్థానిక ప్రాంతమునందు ఉత్తరువులో నిర్దిష్టపరచబడిన ఏదేని కాలావధి పాటు నివసించిన, లేక చదివిన అభ్యర్థులకు ఎంత మేరకు ఏ రీతిలో మరియు ఏయే షరతులకు అధ్యధీనమై అధిగణ్యత ఈయబడవలెనో, లేక ప్రత్యేకింపు చేయబడవలెనో నిర్దిష్టరచవచ్చును;

(i) ఉప-ఖండము (బి)లో నిర్దేశించబడిన ఏదేని కేడరులోనివైయుండి, ఉత్తరువులో ఈ విషయమున నిర్దిష్టపరచబడిన పదవులను నేరుగా భర్తీ చేయు విషయమున;

(ii) ఉప-ఖండము (బి)లో నిర్దేశించబడినవై యుండి ఉత్తరువులో ఈ విషయమున నిర్దిష్టపరచబడిన ఏదేని విశ్వవిద్యాలయములో లేక ఇతర విద్యాసంస్థలలో ప్రవేశము విషయమున;

(3) ఈ క్రింది విషయములను గూర్చి [(సర్వోన్నత న్యాయస్థానము మినహా) ఏదేని న్యాయస్థానముచేగాని, ఏదేని ట్రిబ్యునల్‌చేగాని, ఇతర ప్రాధికారిచేగాని, సంవిధాన (ముప్పది రెండవ సవరణ) చట్టము, 1973 ప్రారంభమునకు అవ్యవహితపూర్వము వినియోగించబడదగి యుండిన అధికారిత, అధికారము, మరియు ప్రాధికారముతో సహా] ఉత్తరువులో నిర్దిష్టపరచబడు అధికారితను, అధికారములను, మరియు ప్రాధికారమును వినియోగించుటకై [1] [ఆంధ్రప్రదేశ్ రాజ్యమునకు మరియు తెలంగాణ రాజ్యమునకు] పరిపాలక ట్రిబ్యునలు నొకదానిని సంఘటితము చేయుటకై, రాష్ట్రపతి ఉత్తర్వు ద్వారా నిబంధనలు చేయవచ్చును:-

(ఎ) ఉత్తరువులో నిర్దిష్టపరచబడినట్లుగా రాజ్యము యొక్క ఏదేని సివిలు సేవలోని ఏదేని తరగతి, లేక తరగతుల పదవులలో లేక రాజ్యమునకు అధీనమైయున్న ఏదేని తరగతి, లేక తరగతుల సివిలు పదవులలో, లేక రాజ్యమునందలి ఏదేని స్థానిక ప్రాధికారి యొక్క నియంత్రణలోనున్న ఏదేని తరగతి, లేక తరగతుల పదవుల పదవులలో, లేక ఆ పదవులకు నియామకము, కేటాయింపు లేక ప్రమోషను;

---

1. ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టము, 2014 యొక్క 97వ పరిచ్ఛేదము ద్వారా ''ఆంధ్రప్రదేశ్ రాజ్యము కొరకు '' 02.06.2014 నుండి బదులుగా ఉంచబడినది.

(బి) ఉత్తరువులో నిర్దిష్టపరచబడినట్లుగా, రాజ్యము యొక్క ఏదేని సివిలు సేవలోని ఏదేని తరగతి, లేక తరగతుల పదవులకు గాని, రాజ్యమునకు అధీనమైయున్న ఏదేని తరగతి, లేక తరగతుల సివిలు పదవులకుగాని, రాజ్యమునందలి ఏదేని స్థానిక ప్రాధికారి యొక్క నియంత్రణలో నున్న ఏదేని తరగతి, లేక తరగతుల పదవులకుగాని, నియమించబడిన, కేటాయించబడిన, లేక ప్రమోషను ఈయబడిన వ్యక్తుల సీనియారిటీ;

(సి) ఉత్తరువులో నిర్దిష్టపరచబడినట్లుగ, రాజ్యము యొక్క ఏదేని సివిలు సేవలోని ఏదేని తరగతి, లేక తరగతుల పదవులకు గాని, రాజ్యమునకు అధీనమైయున్న ఏదేని తరగతి, లేక తరగతుల సివిలు పదవులకుగాని, రాజ్యమునందలి ఏదేని స్థానిక ప్రాధికారి యొక్క నియంత్రణలోనున్న ఏదేని తరగతి, లేక తరగతుల పదవులకుగాను, నియమించబడిన, కేటాయించబడిన, లేక ప్రమోషను ఈయబడిన వ్యక్తుల యొక్క ఇతర సేవా షరతులు;

(4) ఖండము (3) క్రింద చేయబడిన ఉత్తరువు,–

(ఎ) ఆ ఉత్తరువులో నిర్దిష్టపరచు పరిపాలక ట్రిబ్యునలు యొక్క అధికారితలో చేరియున్న ఏదేని విషయమునకు సంబంధించిన వ్యధల నివారణ కొరకైన విన్నపములను స్వీకరించి, దానిపై పరిపాలక ట్రిబ్యునలు సబబని భావించు ఉత్తరువులనిచ్చుటకు రాష్ట్రపతి ఆ ట్రిబ్యునలుకు ప్రాధికారమొసగవచ్చును;

(బి) పరిపాలక ట్రిబ్యునలును ధిక్కరించినందులకు శిక్షించుటకై ఆ ట్రిబ్యునలు యొక్క అధికారములను గూర్చిన నిబంధనలతో సహా పరిపాలక ట్రిబ్యునలు యొక్క అధికారములను, ప్రాధికారములను మరియు ప్రక్రియను గూర్చి రాష్ట్రపతి ఆవశ్యకమని భావించు నిబంధనలు అందు ఉండవచ్చును;

(సి) పరిపాలక ట్రిబ్యునలు యొక్క అధికారితలోని విషయములకు సంబంధించిన చర్యలై యుండి, అట్టి ఉత్తరువు ప్రారంభమగుటకు అవ్యవహిత పూర్వము (సర్వోన్నత న్యాయస్థానము మినహా) ఏదేని న్యాయస్థానము లేక ట్రిబ్యునలు లేక ఇతర ప్రాధికారి సమక్షమున జరుగుచున్నవై, ఉత్తరువులో నిర్దిష్టపరచబడిన తరగతుల చర్యలను పరిపాలక ట్రిబ్యునలుకు అంతరణ చేయుటకు నిబంధనలను చేయవచ్చును;

(డి) (ఫీజును, మరియు కాలపరిమితిని, సాక్ష్యమును గూర్చిన లేక తత్సమయమున అమలులోనున్న ఏదేని శాసనమును ఏవేని మినహాయింపులకు, లేక మార్పులకు అధ్యధీనమై వర్తింపజేయుట కొరకైన నిబంధనలతో సహా) రాష్ట్రపతి ఆవశ్యకమని భావించు అనుపూరక, ఆనుషంగిక మరియు పారిణామిక నిబంధనలు అందు వుండవచ్చును;

[1](5) ఏదేని కేసును అంతిమముగ పరిష్కారము చేయుచు పరిపాలక ట్రిబ్యునలు చేసిన ఉత్తరువు, రాజ్య ప్రభుత్వముచే ఖాయపరచబడిన మీదట, లేక ఉత్తరువు ఈయబడిన తేదీ నుండి మూడు మాసములు గడచిన మీదట, ఈ రెంటిలో ఏది ముందు జరుగునో అప్పటి నుండి అమలు లోనికి రావలెను:

అయితే, పరిపాలక ట్రిబ్యునలు యొక్క ఏదేని ఉత్తరువు అమలులోనికి వచ్చుటకు పూర్వమే రాజ్య ప్రభుత్వము లిఖితపూర్వకమైన విశేష ఉత్తరువు ద్వారా, కారణములను అందు నిర్దిష్టపరచి ఆ ఉత్తరువులో మార్పు చేయవచ్చును లేక దానిని రద్దు చేయవచ్చును మరియు అట్టి సందర్భములలో పరిపాలక ట్రిబ్యునలు యొక్క ఉత్తరువు అట్లు మార్పు చేయబడిన రూపములో మాత్రమే ప్రభావము కలిగియుండవలెను లేక సందర్భానుసారముగ ఎట్టి ప్రభావమును కలిగియుండదు.

(6) ఖండము (5) యొక్క మినహాయింపు ఖండము క్రింద రాజ్య ప్రభుత్వముచే చేయబడిన ప్రతియొక విశేష ఉత్తరువు, అది చేయబడిన పిమ్మట వీలైనంత త్వరితముగ, రాజ్య శాసనమండలి యొక్క ఉభయ సదనముల సమక్షమున ఉంచబడవలెను.

(7) రాజ్యమునందలి ఉన్నత న్యాయస్థానమునకు పరిపాలక ట్రిబ్యునలుపై యెట్టి అధీక్షణాధికారము వుండరాదు మరియు పరిపాలక ట్రిబ్యునలు యొక్క, లేక దానికి సంబంధించిన అధికారిత, అధికారము లేక ప్రాధికారమునకు అధ్యధీనమై ఏ విషయమును గూర్చియు, (సర్వోన్నత న్యాయస్థానము మినహా) ఏ న్యాయస్థానము లేక ట్రిబ్యునలు ఎట్టి అధికారితనైనను, అధికారమునైనను లేక ప్రాధికారము నైనను వినియోగించరాదు.

(8) పరిపాలక ట్రిబ్యునలు కొనసాగుట ఆవశ్యకముకాదని రాష్ట్రపతి అభిప్రాయపడినచో రాష్ట్రపతి ఉత్తరువు ద్వారా పరిపాలక ట్రిబ్యునలును రద్దు చేయవచ్చును మరియు అట్లు రద్దు చేయుటకు అవ్యవహిత పూర్వము పరిపాలక ట్రిబ్యునలు సమక్షమున జరుగుచున్న కేసుల అంతరణకును, పరిష్కారమునకును, తాను సబబని భావించు నిబంధనలను ఆ ఉత్తరువులో చేయవచ్చును.

(9) ఏదేని న్యాయస్థానము, ట్రిబ్యునలు లేక ఇతర ప్రాధికారి యొక్క తీర్పు, డిక్రీ, లేక ఉత్తరువు ఏదేని ఉన్నప్పటికిని,–

(ఎ)(i) 1956, నవంబరు మొదటి దినమునకు పూర్వము వుండిన హైదరాబాదు రాజ్య ప్రభుత్వమునకు అధీనమైయున్న లేక ఆ రాజ్యములోని ఏదేని స్థానిక ప్రాధికారికి అధీనమైయున్న ఏదేని పదవిలో లేక పదవికి ఆ తేదీకి పూర్వము చేయబడిన; లేక

(ii) సంవిధాన (ముప్పది రెండవ సవరణ) చట్టము, 1973 యొక్క ప్రారంభమునకు పూర్వము, ఆంధ్రప్రదేశ్ రాజ్య ప్రభుత్వమునకు అధీనమై, లేక ఆ రాజ్యమునందలి ఏదేని స్థానిక, లేక ఇతర ప్రాధికారికి అధీనమైయున్న ఏదేని పదవిలో లేక పదవికి

---

1. పి.సాంబమూర్తి మరియు ఇతరులు వర్సెస్ ఆంధ్రప్రదేశ్ రాజ్యము, ఇంకొకరు, ఏ.ఐ.ఆర్. 1987 ఎస్.సీ. పేజీ 663 లో సర్వోన్నత న్యాయస్థానము, 371డీ అనుచ్ఛేదము యొక్క ఖండము (5)నకు వినాయింపుతో సహా ఆ ఖండము సంవిధానమునకు విరుద్ధమైనదిగా మరియు అమాన్యమైనదిగా ప్రఖ్యానించినది.

చేయబడిన ఎవరేని వ్యక్తి యొక్క నియామకము, పదస్థానము, ప్రమోషను లేక బదిలీ ఏదియు; మరియు

(బి) ఉప-ఖండము (ఎ)లో నిర్దేశితుడైన ఎవరేని వ్యక్తిచే, లేక అతని సమక్షమున తీసికొనబడిన చర్య ఏదియు లేక చేయబడిన పని ఏదియు,

అట్టి వ్యక్తి యొక్క నియామకము పదస్థాపన, ప్రమోషను లేక బదిలీ విషయమున, సందర్భానుసారముగ హైదరాబాదు రాజ్యములో లేక ఆంధ్రప్రదేశ్ రాజ్యమునందలి ఏదేని భాగములోగాని, నివాసావశ్యకతను నిబంధించునదై అప్పుడు అమలునందుండిన ఏదేని శాసనముననుసరించి చేయబడలేదను కారణముబట్టి మాత్రమే శాసన విరుద్ధమైనదిగా, లేక ప్రభావ శూన్యమైనదిగా, భావించబడరాదు, లేక ఎప్పుడైనను శాసన విరుద్ధమైయుండినట్లు లేక ప్రభావశూన్యమైయుండినట్లు భావించబడరాదు.

(10) ఈ అనుచ్ఛేదము యొక్కయు, దాని క్రింద రాష్ట్రపతిచే చేయబడిన ఏదేని ఉత్తరువు యొక్కయు, నిబంధనలు ఈ సంవిధానము యొక్క ఏదేని ఇతర నిబంధనలోగాని, తత్సమయమున అమలులోనున్న ఏదేని ఇతర శాసనములోగాని, ఏమి ఉన్నప్పటికిని ప్రభావము కలిగి యుండవలెను.

**ఆంధ్రప్రదేశ్‌లో కేంద్ర విశ్వ విద్యాలయము యొక్క స్థాపన.**

371ఈ. ఆంధ్రప్రదేశ్ రాజ్యములో విశ్వవిద్యాలయమును స్థాపించుటకై పార్లమెంటు శాసనము ద్వారా నిబంధనలను చేయవచ్చును.]

**సిక్కిం రాజ్యము గూర్చిన విశేష నిబంధనలు.**

[1][371ఎఫ్. ఈ సంవిధానములో ఏమియున్నప్పటికిని,-

(ఎ) సిక్కిం రాజ్యము యొక్క శాసనసభ ముప్పది మందికి తక్కువకాని సభ్యులతో కూడియుండవలెను;

(బి) (ఈ అనుచ్ఛేదములో ఇటు పిమ్మట నియత దినము అని నిర్దేశించబడినదగు) సంవిధన (ముప్పది యారవ సవరణ) చట్టము, 1975 యొక్క ప్రారంభపు తేదీ నుండి,--

(i) 1974, ఏప్రిల్‌లో జరిగిన ఎన్నికలలో ఎన్నుకొనబడిన ముప్పది ఇద్దరు (ఇందు ఇటు పిమ్మట వర్తమాన సభ్యులని నిర్దేశించబడిన) సభ్యులతో ఆ ఎన్నికల ఫలితముగ ఏర్పాటు చేయబడిన సిక్కిం శాసనసభ ఈ సంవిధానము క్రింద తగు రీతిగ సంఘటితపరచబడిన సిక్కిం రాజ్య శాసనసభగా భావించబడవలెను;

(ii) వర్తమాన సభ్యులు ఈ సంవిధానము క్రింద తగురీతిగా ఎన్నుకనబడిన సిక్కిం రాజ్య శాసన సభా సభ్యులుగా భావించబడవలెను; మరియు

(iii) సదరు సిక్కిం రాజ్య శాసనసభ ఈ సంవిధానము క్రింద ఒక రాజ్య శాసనసభ యొక్క అధికారములను వినియోగించవలెను; మరియు కృత్యములను నిర్వర్తించవలెను;

---

1. సంవిధాన (ముప్పది యారవ సవరణ) చట్టము, 1975 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 26.4.1975 నుండి చొప్పించబడినది.

(సి) ఖండము (బి) క్రింద సిక్కిం రాజ్యశాసనసభగా భావించబడిన శాసనసభ విషయములో 172వ అనుచ్ఛేదము యొక్క ఖండము (1)లో [1][అయిదు సంవత్సరముల] కాలావధిని గూర్చిన నిర్దేశములు [2][నాలుగు సంవత్సరముల] కాలావధిని గూర్చిన నిర్దేశములుగా అన్వయించబడవలెను మరియు సదరు [3][నాలుగు సంవత్సరముల] కాలావధి నియత తేదీ నుండి ప్రారంభమగునట్లు భావించబడవలెను;

(డి) పార్లమెంటుచే శాసనము ద్వారా ఇతర నిబంధనలు చేయబడువరకు, లోక్‌సభ లో సిక్కిం రాజ్యమునకు ఒక స్థానము కేటాయించబడవలెను, మరియు సిక్కిం రాజ్యము, సిక్కిం పార్లమెంటరీ నియోజకవర్గము అనబడు ఒక పార్లమెంటరీ నియోజక వర్గముగా ఏర్పాటు కావలెను;

(ఇ) నియత దినమున ఉన్నట్టి లోక్‌సభ లో సిక్కిం రాజ్య ప్రతినిధి, సిక్కిం రాజ్యశాసనసభ సభ్యులచే ఎన్నుకొనబడవలెను;

(ఎఫ్) సిక్కిం జనాభాలోని వివిధ శాఖల హక్కులను, మరియు హితములను కాపాడుటకుగాను, సిక్కిం రాజ్య శాసనసభలో అట్టి శాఖలకు చెందిన అభ్యర్థులచే పూరించబడదగునన్ని స్థానములకు సిక్కిం రాజ్య శాసనసభకు ఎన్నికై ఏ నియోజక వర్గము నుండి అట్టి శాఖలకు చెందిన అభ్యర్థులు మాత్రమే నిలుచుచుండవచ్చునో ఆ నియోజక వర్గముల పరిసీమనకు, పార్లమెంటు నిబంధన చేయవచ్చును;

(జి) సిక్కిం గవర్నరు, శాంతిని కాపాడుటకొరకును సిక్కిం జనాభాలోని వివిధ శాఖల సాంఘిక మరియు ఆర్థిక పురోభివృద్ధిని కట్టుదిట్టము చేయుటకై న్యాయమైన ఏర్పాటు చేయుటకొరకును, విశేష బాధ్యత వహించవలెను, మరియు సబబని ఆయా సమయములందు రాష్ట్రపతి జారి చేయుట భావించునట్టి ఆదేశములకు అధ్యధీనమై, ఈ ఖండము క్రింద తన విశేష బాధ్యతను నిర్వహించుటలో సిక్కిం గవర్నరు, తన వివేచనానుసారము వ్యవహరించవలెను;

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 56వ పరిచ్ఛేదము ద్వారా 3.1.1972 నుండి మొదట ఉన్న ''ఐదు సంవత్సరములు'' అను పదములకు బదులుగా ''ఆరు సంవత్సరములు'', అను పదములు ఉంచబడి, తిరిగి సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 43వ పరిచ్ఛేదము ద్వారా ''ఆరు సంవత్సరములు'' అను పదములకు బదులు ''ఐదు సంవత్సరములు'' అను పదములు 6.9.1979 నుండి ఉంచబడినవి.

2. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 56వ పరిచ్ఛేదము ద్వారా 3.1.1972 నుండి మొదలుగా ఉన్న ''నాలుగవ సంవత్సరములు'' అను పదములకు బదులుగా ''ఐదు సంవత్సరములు'' అను పదములు ఉంచబడి, తిరిగి సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 43వ పరిచ్ఛేదము ద్వారా 6.9.1979 నుండి ''ఐదు సంవత్సరములు ''అను పదములకు బదులుగా నాలుగు సంవత్సరములు'' అని ఉంచబడినది.

(హెచ్) నియత దినమునకు అవ్యవహిత పూర్వము సిక్కిం ప్రభుత్వంలోగాని, సిక్కిం ప్రభుత్వ ప్రయోజనములకై ఎవరేని ఇతర ప్రాధికారి లేక వ్యక్తియందుగాని, నిహితమై యుండిన (సిక్కిం రాజ్యములో చేరియున్న రాజ్య క్షేత్రములలో నున్నవైనను లేక వెలుపల ఉన్నవైనను) సకల ఆస్తి మరియు సంవత్తులు, ఆ నియత దినము నుండి సిక్కిం రాజ్య ప్రభుత్వములో నిహితము కావలెను;

(ఐ) సిక్కిం రాజ్యములో చేరియున్న రాజ్య క్షేత్రములలో నియత దినమునకు అవ్యవహిత పూర్వము ఉన్నత న్యాయస్థానముగా పని చేయుచున్నట్టి న్యాయస్థానము, నియత దినమున మరియు ఆ దినము నుండి సిక్కిం రాజ్యపు ఉన్నత న్యాయస్థానముగా భావించబడవలెను;

(జె) సిక్కిం రాజ్యము యొక్క రాజ్యక్షేత్రమునందంతటను సివిలు, క్రిమినలు, మరియు రెవిన్యూ అధికారితగల అన్ని న్యాయస్థానములు, న్యాయిక, కార్యపాలక, మరియు గుమస్తా కోవకు చెందిన అందరు ప్రాధికారులు, అందరు అధికారులు, నియత దినమున మరియు ఆ దినము నుండి, వారి వారి కృత్యములను ఈ సంవిధానము యొక్క నిబంధనలకు అధ్యధీనమై నిర్వర్తించు చుండవలెను;

(కె) సిక్కిం రాజ్యములోగాని, దాని యొక్క ఏదేని భాగములో గాని, చేరియున్న రాజ్యక్షేత్రములలో నియత దినమునకు అవ్యవహిత పూర్వము అమలులోనున్న శాసనములన్నియు, సమర్థ శాసనమండలిచే లేక ఇతర సమర్థ ప్రాధికారిచే సవరించబడువరకు, లేక రద్దు చేయబడువరకు, అమలులో కొనసాగవలెను;

(ఎల్) ఖండము (కె)లో నిర్దేశించబడిన ఏదేని శాసనమును సిక్కిం రాజ్యము యొక్క పరిపాలన విషయమున వర్తింపజేయు సౌకర్యము కలిగించు ప్రయోజనముల కొరకు మరియు అట్టి ఏదేని శాసనము యొక్క నిబంధనలను ఈ సంవిధాన నిబంధనలకు అనురూపమొనర్చు ప్రయోజనము కొరకు రాష్ట్రపతి నియత దినము నుండి రెండు సంవత్సరములలోపల, ఉత్తరువు ద్వారా అట్టి శాసనమును రద్దు లేక సవరణచేయుచు, దానిలో ఆవశ్యకమగు లేక సముచితమగు, అనుకూలానుసరణలను, మరియు మార్పులను చేయవచ్చును, అటుపై అట్టి ప్రతియొక శాసనము అట్లు చేయబడిన అనుకూలానుసరణలకు, మార్పులకును అధ్యధీనమై ప్రభావము కలిగియుండవలెను, అట్టి ఏ అనుకూలానుసరణగాని, మార్పుగాని ఏ న్యాయస్థానములోను ప్రష్టవ్యము కారాదు;

(ఎమ్) సిక్కింనకు సంబంధించినదై, నియత దినమునకు పూర్వమే చేసికొనబడినదై, లేక వ్రాసి ఈయబడినదై, భారత ప్రభుత్వముగాని, దాని పూర్వవర్తి ప్రభుత్వముగాని, ఒక పక్షకారుగా నుండిన ఏదేని సంధి, కరారు, ఒప్పందము లేక తత్సదృశ్యమగు అన్య పత్రము నుండి ఉత్పన్నమగు ఏదేని వివాదము లేక ఇతర విషయమునుగూర్చి ఉన్నత న్యాయస్థానమునకుగాని, మరే ఇతర న్యాయస్థానమునకుగాని, అధికారిత ఉండరాదు కాని 143వ అనుచ్ఛేదము యొక్క నిబంధనలను ఈ ఖండములో నున్న దేదియు న్యూనపరచునదిగా అన్వయించబడరాదు;

(ఎన్) రాష్ట్రపతి బహిరంగ అధిసూచన ద్వారా, ఆ అధిసూచన తేదీన భారతదేశములో ఏదేని రాజ్యములో అమలులోనున్న ఏదేని అనుశాసనమును తాను సబబని తలచు నిర్బంధనలు లేక మార్పులతో సిక్కిం రాజ్యమునకు విస్తరింపజేయవచ్చును;

(ఓ) ఈ అనుచ్ఛేదము యొక్క పూర్వగామి నిబంధనలలో దేనినైనను అమలుపరచుటలో ఏదేని ఇబ్బంది ఏర్పడినచో రాష్ట్రపతి [1] ఉత్తరువు ద్వారా, ఆ ఇబ్బందిని తొలగించుటకు ఆవశ్యకమని తనకు తోచునట్టి (ఏదేని ఇతర అనుచ్ఛేదమును అనుకూలనుసరణ, లేక మార్పు చేయుటతో సహా) ఏదైనను చేయవచ్చును:

అయితే, అట్టి ఉత్తరువేదియు నియతదినము నుండి రెండు సంవత్సరములు గడచిన పిమ్మట చేయబడరాదు.

(పి) నియతదినమున ప్రారంభమై సంవిధాన (ముప్పది యారవ సవరణ) చట్టము, 1975 రాష్ట్రపతి అనుమతిని పొందు తేదీకి అవ్యవహిత పూర్వముతో అంతమగు కాలావధిలో, సిక్కిం రాజ్యంలో గాని అందు చేరియున్న రాజ్యక్షేత్రములలో గాని, లేక ఆ రాజ్యము లేక రాజ్యక్షేత్రముల విషయమునగాని, చేయబడిన పనులన్నియు, తీసికొనబడిన చర్యలన్నియు, అవి సంవిధాన (ముప్పది యారవ సవరణ) చట్టము, 1975చే సవరించబడినట్లు ఈ సంవిధానము యొక్క నిబంధనలకు అనుగుణముగా నున్నంతమేరకు, అన్ని ప్రయోజనములకు అట్లు సవరించబడినట్లు, ఈ సంవిధానము క్రింద మాన్యముగా చేయబడినట్లు, లేక తీసుకొనబడినట్లు, భావించబడవలెను.]

[1][371-జీ. ఈ సంవిధానములో ఏమి ఉన్నప్పటికిని,- **మిజోరం రాజ్యవిషయమున ప్రత్యేక నిబంధన.**

(ఎ) పార్లమెంటుచే ఈ క్రింది విషయములలో అనగా,-

(i) మిజోల మత లేక సాంఘిక ఆచారములు,

(ii) మిజోల సంప్రదాయ శాసనము మరియు కార్య ప్రక్రియ,

(iii) మిజోల సంప్రదాయ శాసనముల ననుసరించి ఈయబడిన నిర్ణయములతో కూడిన సివిలు మరియు క్రిమినలు న్యాయపాలన,

(iv) భూమి యాజమాన్యము మరియు బదిలీకి

సంబంధించి చేయబడిన ఏదేని చట్టము మిజోరం రాజ్య శాసన మండలి తీర్మానము ద్వారా అట్లు నిర్ణయించిననే తప్ప మిజోరం రాజ్యమునకు వర్తించదు:

అయితే ఈ ఖండములో ఉన్నదేదియు సంవిధానపు (యాబది మూడవ సవరణ) చట్టము, 1986 ప్రారంభము కాకముందు మిజోరం సంఘరాజ్య క్షేత్రములో అమలులో ఉన్న ఏదేని కేంద్ర శాసనమునకు వర్తించదు.

---

1. సంవిధాన (ఇబ్బందుల తొలగింపు) 11వ ఉత్తరువు (సి.ఒ.99) చూడుము.

(బి) మిజోరం రాజ్య శాసన సభలో నలభై కంటే తక్కువ మంది సభ్యులువుండరాదు.]

[1][371హెచ్. ఈ సంవిధానములో ఏమియున్నప్పటికిని,- **అరుణాచల్‌ప్రదేశ్ రాజ్య విషయములో ప్రత్యేక నిబంధన.**

(ఎ) అరుణాచల్‌ప్రదేశ్ గవర్నరు, అరుణాచల్ ప్రదేశ్ రాజ్యములో శాంతిభద్రతల విషయములో ప్రత్యేక బాధ్యత వహించవలెను. ఆయన దీనికి సంబంధించి తన విధులను నిర్వహించుటలో, మంత్రిమండలిని సంప్రదించిన మీదట తీసుకొనవలసిన చర్య విషయంలో తన వ్యక్తిగత విచక్షణను వినియోగించవలెను:

అయితే, ఏదేని ఒక విషయము గవర్నరు ఈ ఖండము క్రింద తన వ్యక్తిగత నిర్ణయము వినియోగించి వ్యవహరించదగిన విషయము అవునా కాదా అను ప్రశ్న ఉత్పన్నమైనప్పుడు, దానిపై ఆయన తన విచక్షణానుసారముగా చేయు నిర్ణయము అంతిమమైనదైయుండును. ఆయన తన వ్యక్తిగత నిర్ణయము మేరకు వ్యవహరించి ఉండదగినది లేదా వ్యవహరించి ఉండదగని అను కారణముగా గవర్నరుచే చేయబడిన దేని శాసనమాన్యతనైన ప్రశ్నగతము కారాదు.

అంతేకాకుండా, రాష్ట్రపతి, గవర్నరు నుండి నివేదిక పొందిన మీదటగాని, అన్యథాగాని, అరుణాచల్‌ప్రదేశ్ రాజ్యములో గవర్నరు శాంతి భద్రతల విషయంలో ప్రత్యేక బాధ్యత కలిగియుండవలసిన అవసరం ఇంక ఎంత మాత్రము లేదని భావించినచో, ఆయన ఉత్తరువు ద్వారా ఆ ఉత్తరువులో నిర్దిష్టపరచిన తేదీ నుండి గవర్నరును అట్టి బాధ్యత నుండి విరమించవలెనని ఆదేశించవచ్చును.

(బి) అరుణాచల్‌ప్రదేశ్ రాజ్య శాసనసభ ముప్పైకంటే తక్కువ కాని సభ్యులతో కూడియుండవలెను.]

[2][371-ఐ. ఈ సంవిధానములో ఏమిఉన్నప్పటికినీ, గోవా రాజ్య శాసనసభ ముప్పైకి తక్కువ కాని సభ్యులతో కూడియుండవలెను.] **గోవా రాజ్యము విషయమున ప్రత్యేక నిబంధన.**

[3][371-జే. (1) రాష్ట్రపతి, కర్ణాటక రాజ్యమునకు సంబంధించి చేసిన ఉత్తర్వు ద్వారా ఈ క్రింది వాటికై గవర్నరుకు గల ఏదేని విశేష బాధ్యత కొరకు నిబంధనలు చేయవచ్చును- **కర్ణాటక రాజ్యము విషయమున ప్రత్యేక నిబంధనలు.**

(ఎ) హైదరాబాదు-కర్ణాటక ప్రాంతమునకు వేరుగా అభివృద్ధి బోర్డుని ఏర్పాటు చేస్తూ ఆ బోర్డు పని తీరును గూర్చిన నివేదికను రాష్ట్ర శాసనసభ సమక్షమున ప్రతి సంవత్సరము ఉంచవలెనను నిబంధనతో, స్థాపించుట కొరకు.

---

1. సంవిధాన (యాబది ఐదవ సవరణ) చట్టము, 1986 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 20.2.1987 నుండి చొప్పించబడినది.
2. సంవిధాన (యాబది ఆరవ సవరణ) చట్టము, 1987 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 30.5.1987 నుండి చొప్పించబడినది.
3. సంవిధాన (తొంబై-ఎనిమిదవ సవరణ) చట్టము, 2012 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 01.10.2013 నుండి చొప్పించబడినది.

(బి) యావద్రాజ్య ఆవశ్యకతలకు అధ్యధీనమై, సదరు ప్రాంత అభివృద్ధి వ్యయమునకై సమ వాటాలో నిధుల కేటాయింపు కొరకు మరియు

(సి) యావద్రాజ్య ఆవశ్యకతలకు అధ్యధీనమై, ప్రభుత్వ ఉద్యోగ, విద్య మరియు వృత్తి పరమైన శిక్షణ విషయములలో సదరు ప్రాంతమునకు చెందిన ప్రజలకు సమాన అవకాశముల మరియు వసతుల ఏర్పాటు కొరకు.

(2) ఈ క్రింది వాటి కొరకు ఖండము (1) యొక్క ఉప-ఖండము (సి) క్రింద చేసిన ఉత్తరువులో,-

(ఎ) హైదరాబాదు - కర్ణాటక ప్రాంతములో జననముగాని లేదా నివాసముచే గాని ఆ ప్రాంతమునకు చెందిన విద్యార్థులకు విద్య మరియు వృత్తిపరశిక్షణా సంస్థలలో సీట్లు ప్రత్యేకింపు అనుపాతము కొరకు మరియు

(బి) రాజ్య ప్రభుత్వ లేదా హైదరాబాదు-కర్ణాటక ప్రాంతములో రాజ్య ప్రభుత్వ నియంత్రణ క్రిందనున్న ఏదేని నికాయము లేదా సంస్థలోని పదవులు లేదా పదవుల యొక్క తరగతులను గుర్తించి మరియు జననముచే లేదా నివాసముచే ఆ ప్రాంతమునకు చెందిన వ్యక్తులకు అట్టి పదవులకు చేసిన ప్రత్యేకింపు అనుపాతములో ప్రత్యక్ష నియామకము లేక పదోన్నతి లేదా ఉత్తర్వులో నిర్దిష్టపరచబడినట్టి ఏదేని ఇతర రీతిలో నియామకము కొరకు నిబంధనలు చేయవచ్చును.]

**అస్తిత్వములోనున్న శాసనముల అమలును కొనసాగించుట, మరియు వాటి అనుకూలానుసరణ.**

372. (1) 395వ అనుచ్ఛేదములో నిర్దేశించబడిన శాసనములు ఈ సంవిధానముచే రద్దు చేయబడినప్పటికిని, ఈ సంవిధానము యొక్క ఇతర నిబంధనలకు అధ్యధీనమై, ఈ సంవిధానమునకు అవ్యవహిత పూర్వము భారత రాజ్య క్షేత్రములో అమలులోనున్న సమస్త శాసనములు, సమర్థ శాసనమండలిచే లేక ఇతర సమర్థ ప్రాధికారిచే లేక మార్పు, లేక రద్దు, లేక సవరణ చేయబడునంతవరకు, అట్టి రాజ్యక్షేత్రమందు అమలులో కొనసాగవలెను.

(2) భారత రాజ్యక్షేత్రములో అమలులోనున్న ఏదేని శాసనము యొక్క నిబంధనలను ఈ సంవిధాన నిబంధనలకు అనురూపమొనర్చు నిమిత్తము రాష్ట్రపతి [1] ఉత్తరువు ద్వారా అట్టి శాసనమును

---

1. చూడుము:- 5.6.1950 వ తేదీ నాటి అధసూచన నెం.ఎస్.ఆర్.ఓ.115 ద్వారా సవరించబడినట్లుగా అనుకూలానుసరణ శాసనముల ఉత్తరువు, 1950, తేదీ 26.1.1950, భారత రాజపత్రము, అసాధరణ, పేజి.449, భారత రాజపత్రము, అసాధారణ, భాగము-2, పరిచ్ఛేదము 3, పేజి.51, 4.11.1950వ తేదీ నాటి అధిసూచన నెం.ఎస్.ఆర్.ఓ.870, భారత రాజపత్రము, అసాధారణ భాగము-2, పరిచ్ఛేదము 3, పేజి.903, 4.4.1951 వ తేదీ నాటి అధిసూచన నెం.508, భారత రాజపత్రము, అసాధారణ, భాగము-2, పరిచ్ఛేదము 3, పేజి.287, 2.7.1952వ తేదీ నాటి అధిసూచన నెం.ఎస్.ఆర్.ఓ.1140 బీ, భారత రాజపత్రము, అసాధారణ, భాగము-2, పరిచ్ఛేదము 3, పేజి.616/1, మరియు ట్రావన్‌కోర్-కొచ్చిన్ భూసేకరణ అనుకూలనుసరణ శాసనము ఉత్తరువు, 1952, తేదీ 20.9.1952, భారత రాజపత్రము, అసాధారణ, భాగము-2, పరిచ్ఛేదము 3, పేజి.923.

రద్దు లేక సవరణ చేయుచు దానిలో ఆవశ్యకమగు లేక సముచితమగు అనుకూలానుసరణలను మరియు మార్పులను చేయవచ్చును మరియు ఆ ఉత్తరువులో నిర్దిష్టపరచబడు తేదీ నుండి, ఆ శాసనము అట్లు చేయబడిన అనుకూలానుసరణలకును, మార్పులకు అధ్యధీనమై, ప్రభావము కలిగియుండవలెనని నిబంధన చేయవచ్చును, అట్టి అనుకూలానుసరణగాని, మార్పుగాని, ఏ న్యాయస్థానములోను ప్రష్టవ్యము కారాదు.

(3) ఖండము (2)లో నున్నదేదియు–

(ఎ) ఈ సంవిధాన ప్రారంభము నుండి [1][మూడేండ్లు] ముగిసిన పిమ్మట ఏ శాసనములో గాని, ఎట్టి అను కులానుసరణనైనను లేక మార్పునైనను చేయుటకు రాష్ట్రపతికి అధికారమొసగునట్టిదిగను; లేక

(బి) సదరు ఖండము క్రింద రాష్ట్రపతిచే అనుకూలానుసరణ, లేక మార్పు చేయబడిన ఏదేని శాసనమును రద్దు, లేక సవరణ చేయుట నుండి ఏదేని సమర్థ శాసన మండలినిగాని, ఇతర సమర్థ ప్రాధికారినిగాని, నివారించునట్టిదిగను భావించబడరాదు.

**విశదీకరణ–I:–** ఈ అనుచ్ఛేదములో ''అమలులో నున్న శాసనము అనుపదబంధములో, ఈ సంవిధాన ప్రారంభమునకు పూర్వము భారత రాజ్యక్షేత్రమునందలి ఏదేని శాసనమండలిచే, లేక ఇతర సమర్థ ప్రాధికారిచే పాస్ చేయబడి, లేక కావించబడి, అంతకుముందు రద్దు కాని శాసనము – అట్టి శాసనమైనను, అందలి ఏ భాగములైనను, అప్పుడు పూర్తిగాగాని, కొన్ని ప్రత్యేక ప్రాంతములలోగాని అమలులో లేనప్పటికిని చేరియుండును.

**విశదీకరణ–II:–** ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము భారత రాజ్య క్షేత్రమునందు ప్రభావమును కలిగియుండుటతో పాటు రాజ్యక్షేత్రమునకు వెలుపల కూడా ప్రభావమును కలిగియుండినట్టియు, భారత రాజ్యక్షేత్రమునందలి ఒక శాసన మండలిచే, లేక ఇతర సమర్థ ప్రాధికారిచే పాస్ చేయబడినట్టియు, లేక కావించబడినట్టియు ఏదేని శాసనము పూర్వోక్తమైన ఏవైన అనుకూలానుసరణలకుగాని, మార్పులకుగాని అధ్యధీనమై, అట్టి రాజ్యక్షేత్రమునకు వెలుపలకూడ ప్రభావము కలిగియుండుట కొనసాగవలెను.

**విశదీకరణ–III:–** అమలులోనున్న ఏదేని తాత్కాలిక శాసనమును, అది ముగియుటకు నియతము చేయబడిన తేదీ దాటి గాని, ఈ సంవిధానము అమలులోనికి రాకున్నదో అది ముగిసుయుండెడి తేదీ దాటి గాని, కొనసాగించునదిగా ఈ అనుచ్ఛేదములోనున్న దేదియు అన్వయించబడరాదు.

**విశదీకరణ–IV:–** ఇండియా ప్రభుత్వ చట్టము, 1935, యొక్క 88వ పరిచ్ఛేదము క్రింద ఒక ప్రావిన్సు యొక్క గవర్నరుచే ప్రఖ్యానించబడి, ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము అమలులో నుండిన ఏదేని అధ్యాదేశము, అట్టి ప్రారంభమునకు పిమ్మట 382వ అనుచ్ఛేదము యొక్క

---

1. సంవిధాన (ఒకటవ సవరణ) చట్టము, 1951 యొక్క 12వ పరిచ్ఛేదము ద్వారా ''రెండు సంవత్సరములు''కు బదులుగా 18.06.1951 నుండి ఉంచబడినది.

ఖండము (1) క్రింద వ్యవహరించు రాజ్య శాసనసభ మొదటి సమావేశము నుండి ఆరు వారములు ముగియగనే, అది ఆ ప్రావిన్సు స్థానములో నున్న రాజ్యము యొక్క గవర్నరుచే అంతకుముందే ఉపసంహరించబడిననే తప్ప, అమలులోనుండుట ఆగిపోవలెను, మరియు ఈ అనుచ్ఛేదములోనున్న దేదియు, అట్టి ఏ అధ్యాదేశముననైనను సదరు కాలావధి దాటి అమలులో కొనసాగించునదిగా అన్వయించబడరాదు.

[1][372ఏ. (1) సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము భారతదేశములో గాని, అందలి ఏదేని భాగములో గాని, అమలులోనున్న ఏదేని శాసనము యొక్క నిబంధనలను, ఆ చట్టముచే సవరించబడిన ఈ సంవిధానము యొక్క నిబంధనలకు అనురూపమొనర్చు నిమిత్తము రాష్ట్రపతి, 1957 నవంబరు మొదటి దినమునకు పూర్వము చేయబడిన [2]ఉత్తరువు ద్వారా అట్టి శాసనమును రద్దు లేక సవరణ చేయుచు దానిలో ఆవశ్యకమగు, లేక సముచితమగు అనుకూలానుసరణలను, మరియు మార్పులను చేయవచ్చును, మరియు ఉత్తరువునందు నిర్దిష్టపరచబడు తేదీ నుండి ఆ శాసనము, అట్లు చేయబడిన అనుకూలానుసరణలకును, మార్పులకును, అధ్యధీనమై ప్రభావము కలిగి యుండవలెనని నిబంధన చేయవచ్చును, మరియు అట్టి అనుకూలానుసరణగాని, మార్పుగాని ఏ న్యాయస్థానములోను ప్రష్టవ్యము కారాదు.

(2) ఖండము (1)లో నున్నదేదియు, సదరు ఖండము క్రింద రాష్ట్రపతిచే అనుకూలానుసరణ, లేక మార్పు చేయబడిన ఏదేని శాసనమును రద్దు, లేక సవరణ చేయుట నుండి ఒక సమర్థ శాసనమండలినిగాని, ఇతర సమర్థ ప్రాధికారినిగాని నివారించునదిగ భావించబడరాదు.]

**కొన్ని సందర్భములలో నివారక నిరోధము నందున్న వ్యక్తుల విషయమున ఉత్తరువు ఇచ్చుటకు రాష్ట్రపతికి గల అధికారము.**

373. 22వ అనుచ్ఛేదములోని ఖండము (7) క్రింద పార్లమెంటుచే నిబంధన చేయబడువరకు, లేక ఈ సంవిధాన ప్రారంభమునుండి ఒక సంవత్సరము ముగియువరకు, వీటిలో ఏది ముందు జరుగునో అంతవరకు, సదరు అనుచ్ఛేదము యొక్క ఖండములు (4) మరియు (7)లలో పార్లమెంటును గూర్చిన ఏదేని నిర్దేశమునకు బదులు రాష్ట్రపతిని గూర్చిన నిర్దేశము ఉంచబడినట్లును, ఆ ఖండములందు పార్లమెంటుచే చేయబడిన ఏదేని శాసనమును గూర్చిన నిర్దేశముకు బదులు రాష్ట్రపతిచే చేయబడిన ఉత్తరువును గూర్చిన నిర్దేశము ఉంచబడినట్లు సదరు అనుచ్ఛేదము ప్రభావమును కలిగియుండవలెను.

**ఫెడరల్ న్యాయస్థానపు యొక్క న్యాయాధీశులను గూర్చిన, మరియు ఫెడరల్ న్యాయ స్థానములో గాని, పరిషత్తుతో కూడిన సామ్రాట్టు సమక్షమున గాని జరుగుచున్న చర్యలను గూర్చిన నిబంధనలు.**

374. (1) ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము పదవిలోనుండిన ఫెడరల్ న్యాయస్థానపు న్యాయాధీశులు, వారు అన్యథా కోరుకొని యుండిననే తప్ప, అట్టి ప్రారంభమున, సర్వోన్నత న్యాయస్థానపు న్యాయాధీశులు కావలెను మరియు అటు పైన వారు సర్వోన్నత

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 22వ పరిచ్ఛేదము ద్వారా 01.11.1956 నుండి చొప్పించబడినది.
2. శాసనముల అనుకూలానుసరణ ఉత్తరువులు, 1956 మరియు 1957 చూడుము.

న్యాయస్థానపు న్యాయాధీశుల విషయమున 125వ అనుచ్ఛేదము క్రింద ఏర్పాటు చేయబడిన జీతములను, బత్తెములను గైర్హాజరీ సెలవును, పింఛనును గూర్చిన హక్కులను కలిగియుండవలెను.

(2) ఈ సంవిధాన ప్రారంభమున ఫెడరల్ న్యాయస్థానమునందు జరుగుచున్న అన్ని దావాలు, అప్పీళ్లు మరియు చర్యలు, అవి సివిలువైనను క్రిమినలు వైనను, సర్వోన్నత న్యాయస్థానమునకు మార్చబడినవై యుండవలెను, వాటిని ఆకర్ణించుటకును, నిర్ణయించుటకును, సర్వోన్నత న్యాయస్థానము అధికారిత కలిగియుండవలెను. ఈ సంవిధాన ప్రారంభమునకు పూర్వము ఫెడరల్ న్యాయస్థానముచే ఒసగబడిన తీర్పులకు, లేక ఇవ్వబడిన ఉత్తర్వులకు, అవి సర్వోన్నత న్యాయస్థానముచే ఒసగబడినటులనే లేక ఇవ్వబడినటులనే ప్రాబల్య ప్రభావములను కలిగియుండవలెను.

(3) భారత రాజ్యక్షేత్రములోని ఏదేని న్యాయస్థానము యొక్క తీర్పు, డిక్రీ, లేక ఉత్తర్వుపైగాని, దానిని గూర్చిగాని, చేయబడిన అప్పీళ్ళను మరియు అర్జీలను పరిష్కారము చేయుటకు పరిషత్తుతో కూడిన సామ్రాట్టుకు శాసన రీత్యా ప్రాధికార మొసగబడినంత మేరకు, ఆయన అధికారితను వినియోగించుటను ఈ సంవిధానములో నున్నదేదియు, అమాన్యమొనర్చరాదు, మరియు ఈ సంవిధాన ప్రారంభమునకు పిమ్మట అట్టి ఏ అప్పీలుపై గాని, అర్జీపైగాని పరిషత్తుతో కూడిన సామ్రాట్టుచే ఇవ్వబడిన ఏదేని ఉత్తర్వు అది ఈ సంవిధానము ద్వారా ప్రదత్తమైన అధికారితను వినియోగించు సర్వోన్నత న్యాయస్థానముచే ఇవ్వబడిన ఉత్తర్వు, లేక డిక్రీ అయిన ఎట్లో అట్లే సకల ప్రయోజనముల కొరకు ప్రభావము కలిగియుండవలెను.

(4) ఈ సంవిధాన ప్రారంభమున, మరియు అప్పటి నుండి ఒకటవ అనుసూచి యొక్క భాగము (బీ)లో నిర్దిష్టపరచబడిన ఒక రాజ్యమునందు ప్రివీ కౌన్సిలుగా వ్యవహరించుచున్న ప్రాధికారికి, ఆ రాజ్యములోని ఏదేని న్యాయస్థానము యొక్క ఏదేని తీర్పు, డిక్రీ లేక ఉత్తర్వుపైగాని దానిని గూర్చి గాని అప్పీళ్ళను, అర్జీలను గ్రహించుటకు, మరియు పరిష్కరించుటకుగల అధికారిత అంతము కావలెను. అట్టి ప్రారంభమున సదరు ప్రాధికారి సమక్షమున జరుగుచున్న అన్ని అప్పీళ్లును, ఇతర చర్యలును సర్వోన్నత న్యాయస్థానమునకు మార్చబడి దానిచే పరిష్కరించబడ వలెను.

(5) ఈ అనుచ్ఛేదము యొక్క నిబంధనలను అమలువరచుటకు పార్లమెంటుచే శాసనము ద్వారా ఇంకను నిబంధనలు చేయబడవచ్చును.

**న్యాయస్థానములు, ప్రాధికారులు, అధికారులు తమ తమ కృత్యములను సంవిధాన నిబంధనలకు అధ్యధీనమై కొనసాగించుట.**

375. భారత రాజ్యక్షేత్రమునందంతటను సివిలు, క్రిమినలు, మరియు రెవిన్యూ అధికారితగల అన్ని న్యాయస్థానములు, న్యాయిక, కార్యపాలక, మరియు గుమాస్తా కోవకు చెందిన అందరు ప్రాధికారులు, అధికారులు తమ తమ కృత్యములను ఈ సంవిధాన నిబంధనలకు అధ్యధీనమై కొనసాగించవలెను.

**ఉన్నత న్యాయస్థానముల న్యాయాధీశులను గూర్చిన నిబంధనలు.**

376. (1) 217వ అనుచ్ఛేదము యొక్క ఖండము (2)లో ఏమియున్నప్పటికిని, ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము ఏ ప్రావిన్సులోనైనను పదవిలో నుండిన ఉన్నత న్యాయస్థానపు

న్యాయాధీశులు వారు అన్యథా కోరకొని యుండిననే తప్ప, అట్టి ప్రారంభమున ఆ ప్రావిన్సు స్థానములోనున్న రాజ్యములోని ఉన్నత న్యాయస్థానపు న్యాయాధీశులు కావలెను, మరియు అటుపైన వారు అట్టి ఉన్నత న్యాయస్థానపు న్యాయాధీశుల విషయమున 221వ అనుచ్ఛేదము క్రింద ఏర్పాటు చేయబడిన జీతములను, బత్తెములను, గైరు హాజరీ సెలవును, పింఛనును గూర్చిన హక్కులను కలిగియుండవలెను. [1][అట్టి ఎవరేని న్యాయాధీశుడు భారతేదశ పౌరుడు కానప్పటికిని, అట్టి ఉన్నత న్యాయస్థాన ముఖ్య న్యాయమూర్తిగా గాని, ఏదైన ఇతర ఉన్నత న్యాయస్థాన ముఖ్య న్యాయమూర్తిగాగాని, ఇతర న్యాయాధీశునిగా గాని నియమించబడుటకు పాత్రుడై యుండును.]

(2) ఒకటవ అనుసూచి యొక్క భాగము (బి)లో నిర్దిష్టపరచబడిన ఏదేని రాజ్యము యొక్క న్యాయస్థానమునందుండిన ఇండియాలోని ఏదేని రాజ్యములో ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము పదవిలో నుండిన ఉన్నత న్యాయస్థానపు న్యాయాధీశులు, వారు అన్యథా కోరుకొనియుండిననే తప్ప, అట్టి ప్రారంభమున అట్లు నిర్దిష్టపరచబడిన రాజ్యములోని ఉన్నత న్యాయస్థానపు న్యాయాధీశులు కావలెను, మరియు 217వ అనుచ్ఛేదము యొక్క ఖండములు (1), (2)లలో ఏమి యున్నప్పటికిని, ఆ అనుచ్ఛేదములోని ఖండము (1) యొక్క వినాయింపుకు అధ్యధీనులై, రాష్ట్రపతి ఉత్తరువు ద్వారా నిర్ధారణ చేయు కాలావధి ముగియు వరకు పదవిలో కొనసాగవలెను.

(3) ఈ అనుచ్ఛేదమునందు ''న్యాయాధీశుడు'' అనుపదములో కార్యకారి న్యాయాధీశుడుగాని, అదనపు న్యాయాధీశుడుగాని చేరియుండడు.

**భారతదేశ కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలును గూర్చిన నిబంధనలు.**

377. ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహితపూర్వము పదవిలోనుండిన భారతదేశ ఆడిటరు జనరలు, ఆయన అన్యథా కోరుకొని యుండిననే తప్ప, అట్టి ప్రారంభమున భారతదేశ కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు విషయమున 148వ అనుచ్ఛేదపు ఖండము (3) క్రింద ఏర్పాటు చేయబడిన జీతములను, గైరు హాజరీ సెలవును మరియు పింఛనును గూర్చిన హక్కులను కలిగియుండును మరియు అట్టి ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము ఆయనకు వర్తించుచుండిన నిబంధనల క్రింద నిర్ధారణ చేయబడినట్లు, ఆయన పదావధి ముగియు వరకు పదవిలో కొనసాగుటకు హక్కు కలిగియుండును.

**పబ్లికు సేవా కమీషనులను గూర్చిన నిబంధనలు.**

378. (1) ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము పదవిలోనుండిన భారతదేశ అధినివేశమునకు చెందిన పబ్లికు సేవా కమీషను యొక్క సభ్యులు, వారు అన్యథా కోరుకొని యుండిననే తప్ప, అట్టి ప్రారంభమున, సంఘమునకు చెందిన పబ్లికు సేవా కమీషను యొక్క సభ్యులు కావలెను, మరియు వారు 316వ అనుచ్ఛేదము యొక్క ఖండము (1) మరియు (2)లో ఏమి యున్నప్పటికిని, ఆ అనుచ్ఛేదములోని ఖండము (2)లోని వినాయింపునకు అధ్యధీనులై, అట్టి ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము అట్టి సభ్యులకు వర్తించుచుండిన నియమావళి క్రింద నిర్ధారణ చేయబడినట్లు, వారి పదావది ముగియు వరకు పదవిలో కొనసాగవలెను.

---

1. సంవిధాన (మొదటి సవరణ) చట్టము, 1951 యొక్క 13వ పరిచ్ఛేదం ద్వారా 18.06.1951 నుండి చేర్చబడినది.

(2) ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము పదవిలో నుండిన, ఒక ప్రావిన్సుకు చెందిన పబ్లికు సేవా కమీషను యొక్క సభ్యులైనను, ఒక ప్రావిన్సుల సముదాయము యొక్క అక్కరలను తీర్చుచున్న పబ్లికు సేవా కమీషను యొక్క సభ్యులైనను, వారు అన్యథా కోరుకొనియుండిననే తప్ప, అట్టి ప్రారంభమున, సందర్భానుసారముగ, ఆ ప్రావిన్సు స్థానములోనున్న రాజ్యమునకు చెందిన పబ్లికు సేవా కమీషను యొక్క సభ్యులు, లేక ఆ ప్రావిన్సుల స్థానములోనున్న రాజ్యముల యొక్క అక్కరలను తీర్చుచున్న సంయుక్త రాజ్య పబ్లికు సేవా కమీషను యొక్క సభ్యులు అగుదురు. వారు 316వ అనుచ్ఛేదము యొక్క ఖండము (1) మరియు (2)లో ఏమియున్నప్పటికిని, ఆ అనుచ్ఛేదము యొక్క ఖండము (2)లోని వినాయింపునకు అధ్యధీనమై , అట్టి ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము అట్టి సభ్యులకు వర్తించుచుండిన నియమావళి క్రింద నిర్ధారణ చేయబడినట్లు వారు పదావధి ముగియు వరకు పదవిలో కొనసాగవలెను.

**ఆంధ్రప్రదేశ్ శాసనసభ కాలావధిని గూర్చిన విశేష నిబంధన.**

[1][378ఏ. 172వ అనుచ్ఛేదములో ఏమియున్నప్పటికిని, రాజ్యముల పునర్వ్యవస్థీకరణ చట్టము, 1956, 28 మరియు 29వ పరిచ్ఛేదములలోని నిబంధనల క్రింద సంఘటితమైన ఆంధ్రప్రదేశ్ రాజ్య శాసనసభ, సదరు 29వ పరిచ్ఛేదములో నిర్దేశించబడిన తేదీ నుండి అయిదు సంవత్సరముల కాలావధి వరకు, ఆ లోపున అది విఘటన చేయబడిననే తప్ప, కొనసాగవలెను, అంతకుమించి కొనసాగరాదు, మరియు సదరు కాలావధి ముగింపు, ఆ శాసన మండలి యొక్క విఘటనగా ప్రవర్తితము కావలెను.]

379-391. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా (1-11-1956 నుండి) లుప్తము చేయబడినవి.

**ఇబ్బందులను తొలగించుటకు రాష్ట్రపతికి గల అధికారము.**

392. (1) ప్రత్యేకించి ఇండియా ప్రభుత్వ చట్టము, 1935 యొక్క నిబంధనలు ఈ సంవిధానము యొక్క నిబంధనలుగా పరివర్తన చెందుటకు సంబంధిచినట్టివగు ఏవేని ఇబ్బందులను తొలగించుటకై, రాష్ట్రపతి ఉత్తరువు ద్వారా, ఆ ఉత్తరువులో నిర్దిష్టపరచబడిన కాలావధిలో ఆయన ఆవశ్యకమని, లేక సముచితమని భావించు మార్పు, చేర్పు లేక లుప్తము రూపమున చేసిన అనుకూలానుసరణలకు అధ్యధీనమై ఈ సంవిధానము ప్రభావము కలిగియుండవలెనని ఆదేశించవచ్చును:

అయితే అట్టి ఉత్తరువేదియు భాగము (5) యొక్క 2వ అధ్యాయము క్రింద తగు రీతిగా సంఘటితమైన పార్లమెంటు యొక్క మొదటి సమావేశమునకు పిమ్మట చేయబడరాదు.

(2) ఖండము (1) క్రింద చేయబడిన ప్రతి ఉత్తరువు పార్లమెంటు సమక్షమున ఉంచబడవలెను.

(3) ఈ అనుచ్ఛేదము ద్వారాను, 324వ అనుచ్ఛేదము ద్వారాను, 367వ అనుచ్ఛేదము యొక్క ఖండము (3) ద్వారాను, మరియు 391వ అనుచ్ఛేదము ద్వారాను, రాష్ట్రపతికి ప్రదత్తము చేయబడిన అధికారములు, ఈ సంవిధాన ప్రారంభమునకు పూర్వము, భారతదేశ అధినివేశము యొక్క గవర్నరు జనరలుచే వినియోగించబడదగినవై యుండవలెను.

## భాగము – 22

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము ద్వారా, 1956 యొక్క 24వ పరిచ్ఛేదము ద్వారా 01.11.1956 నుండి చొప్పించబడినది.

## సంగ్రహనామము, ప్రారంభము, [1][హిందీలో ప్రాధీకృత పాఠము] మరియు రద్దులు

393. ఈ సంవిధానములో ''భారత సంవిధానము'' అననగును. **సంగ్రహనామము.**

394. ఈ అనుచ్ఛేదము, మరియు అనుచ్ఛేదములు 5, 6, 7, 8, 9, 60, 324, 366, 367, 379, 380, 388, 391, 392 మరియు 393 వెంటనే అమలులోనికి రావలెను, మరియు ఈ సంవిధానములోని తక్కిన నిబంధనలు ఈ సంవిధానమునందు ఈ సంవిధాన ప్రారంభ దినముగ నిర్దేశించబడిన 1950 జనవరి ఇరువది యారవ దినమున అమలులోనికి రావలెను. **ప్రారంభము.**

[2][394ఏ. (1) అధ్యక్షుడు తన ప్రాధికారము ద్వారా– **హిందీ భాషలో ప్రాధికారిక పాఠము.**

(ఏ) సంవిధానము యొక్క సభ్యులచే సంతకము చేయబడిన ఈ సంవిధానము యొక్క అనువాదమును హిందీ భాషలోని కేంద్ర చట్టముల ప్రాధీకృత పాఠములలో వాడిన భాష, శైలి, పదజాలమును అనుసరించి ఉండునట్లు, అవసరమైనట్టి సవరణలో, మరియు అట్టి ప్రచురణకు ముందు ఈ సంవిధానమునకు చేయబడిన అన్ని సవరణలను చొప్పించుచూ,

(బి) ఇంగ్లీషు భాషలో ఈ సంవిధానమునకు చేయబడిన ప్రతి సవరణకు హిందీ భాషలో అనువాదము ప్రచురించబడినట్లు చేయవలెను.

(2) ఈ సంవిధానము యొక్క అనువాదము మరియు ఖండము (1) క్రింద ప్రచురింపబడిన దాని యొక్క ప్రతి సవరణ దాని యొక్క అసలు అర్థమునే కలిగియున్నట్లు భావించవలెను, మరియు అట్టి అనువాదము యొక్క ఏదేని భాగమును అన్వయించుటలో ఏదేని చిక్కు ఏర్పడినచో, అధ్యక్షుడు దానిని తగు విధముగా మార్పు చేయబడునట్లు చూడవలెను.

(3) ఈ సంవిధానము యొక్క అనువాదము మరియు ఈ అనుచ్ఛేదము క్రింద ప్రచురించబడిన దాని యొక్క ప్రతి సవరణ, అన్ని ప్రయోజనముల దృష్ట్యా, హిందీ భాషలో దాని యొక్క ప్రాధికారిక పాఠము భావించవలెను.]

395. ఇండియా స్వాతంత్ర్య చట్టము, 1947ను మరియు ప్రీవీ కౌన్సిలు అధికారితా ఉత్సాదన చట్టము, 1949 మినహా, ఇండియా ప్రభుత్వ చట్టము, 1935లో సవరణ లేక అనుపూరకము చేయు శాసనములన్నిటితో సహా, ఇండియా ప్రభుత్వ చట్టము, 1935ను ఇందుమూలముగా రద్దు చేయడమైనది. **రద్దులు.**

---

1. సంవిధాన (యాబది ఎనిమిదవ సవరణ) చట్టము, 1987 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 09.12.1987 నుండి చొప్పించబడినది.
2. అదే చట్టపు 3వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.

[1][**ఒకటవ అనుసూచి**

[**అనుచ్ఛేదములు 1 మరియు 4**]

**1. రాజ్యములు**

| **పేరు** | | **రాజ్యక్షేత్రములు** |
|---|---|---|
| 1. ఆంధ్రప్రదేశ్ | : | [2][ఆంధ్రప్రదేశ్ మరియు మద్రాసు (సరిహద్దుల మార్పు) చట్టము, 1959 యొక్క రెండవ అనుసూచిలో నిర్దిష్టపరచబడిన రాజ్య క్షేత్రములను అపవర్జించి, ఆంధ్ర రాజ్య చట్టము, 1953 యొక్క 3వ పరిచ్ఛేదపు (1)వ ఉప-పరిచ్ఛేదములోను, రాజ్యముల పునర్వ్యవస్థీకరణ చట్టము, 1956 యొక్క 3వ పరిచ్ఛేదపు (1)వ ఉప-పరిచ్ఛేదములోను, ఆంధ్రప్రదేశ్ మరియు మద్రాసు (సరి హద్దుల మార్పు) చట్టము, 1959 యొక్క ఒకటవ అనుసూచిలోను, మరియు అంధ్రప్రదేశ్ మరియు మైసూరు (రాజ్య క్షేత్రాంతరణ) చట్టము, 1968 యొక్క అనుసూచిలోను, [3][మరియు ఆంధ్రప్రదేశ్ |

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా మొదటి అనుసూచికి బదులుగా ఉంచబడినది.
2. ఆంధ్రప్రదేశ్ మరియు మైసూరు (రాజ్యక్షేత్రాంతరణ) చట్టము, 1968 (1968లోని 36వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 01.10.1968 నుండి పూర్వాపు నమోదుకు బదులుగా ఉంచబడినది.
3. ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టము, 2014 (2014లోని 6వది) యొక్క 10వ పరిచ్ఛేదము ద్వారా 02.06.2014 నుండి చొప్పించబడినది.

పునర్వ్యవస్థీకరణ చట్టము, 2014 యొక్క 3వ పరిచ్ఛేదములో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు]].

| | | | |
|---|---|---|---|
| 2. | అస్సాము | : | అస్సాము (సరిహద్దుల మార్పు) చట్టము, 1951 యొక్క అనుసూచిలో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములను [1] [మరియు నాగాల్యాండు రాజ్య చట్టము, 1962 యొక్క 3వ పరిచ్ఛేదవు (1)వ ఉప-పరిచ్ఛేదములోను నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములను] [2] [మరియు ఉత్తర-ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 యొక్క 5, 6 మరియు 7వ పరిచ్ఛేదములలో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములను] [3] [మరియు సంవిధాన (తొమ్మిదవ సవరణ) చట్టము, 1960 యొక్క 3వ పరిచ్ఛేదములోని ఖండము (ఎ)లో ఏమి ఉన్నప్పటికినీ సంవిధాన (నూరవ సవరణ) చట్టము, 2015 యొక్క రెండవ అనుసూచిలోని భాగము-1లో నిర్దేశించిన రాజ్య క్షేత్రములకు సంబంధించినంత వరకు సంవిదాన (నూరవ సవరణ) చట్టము, 2015 యొక్క రెండవ అనుసూచిలోని భాగము-1లో నిర్దేశించిన రాజ్య క్షేత్రములను] అపవర్జించి, ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహితపూర్వము, అస్సాము ప్రావిన్సులో, ఖాళీ రాజ్యములలో, మరియు అస్సాము జనజాతి ప్రాంతములలో, చేరియున్న రాజ్యక్షేత్రములు. |
| 3. | బీహారు | : | [4][బీహారు మరియు పశ్చిమబెంగాల్ (రాజ్య క్షేత్రముల అంతరణ) చట్టము, 1956 యొక్క 3వ పరిచ్ఛేదవు (1)వ ఉప-పరిచ్ఛేదములో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములను మరియు, బీహారు మరియు ఉత్తర ప్రదేశ్ (సరిహద్దుల మార్పు) చట్టము, 1968 యొక్క 3వ పరిచ్ఛేదవు (1)వ ఉప-పరిచ్ఛేదము యొక్క ఖండము (బి)లో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములను అపవర్జించి, ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము బీహారు ప్రావిన్సులో చేరియున్న లేక ఆ ప్రావిన్సు యొక్క భాగమై యున్నట్లు పరిపాలించబడుచుండిన రాజ్యక్షేత్రములు, మరియు బీహారు |

1. నాగాల్యాండు రాజ్య చట్టము, 1962 (1962లోని 27వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 01.12.1963 నుండి చేర్చబడినది.
2. ఉత్తర-ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 9వ పరిచ్ఛేదము ద్వారా 21.01.1972 నుండి చేర్చబడినది.
3. సంవిధాన (నూరవ సవరణ) చట్టము, 2015 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 31.7.2015వ తేదీ నుండి చేర్చబడినది.
4. బీహారు మరియు ఉత్తర్‌ప్రదేశ్ (సరిహద్దు మార్పు) చట్టము, 1968 (1968లోని 24వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా పూర్వపు నమోదుకు బదులుగా 10.06.1970 నుండి ఉంచబడినది.

మరియు ఉత్తరప్రదేశ్ (సరిహద్దుల మార్పు) చట్టము, 1968 యొక్క 3వ పరిచ్ఛేదపు ఉప-పరిచ్ఛేదము (1) యొక్క ఖండము (ఎ)లో నిర్దిష్టపరచబడిన రాజ్య క్షేత్రములు] [1][మరియు బీహారు పునర్వ్యస్థీకరణ చట్టము, 2000 యొక్క 3వ పరిచ్ఛేదములో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు.]

[2][4. గుజరాత్ : బొంబాయి పునర్వ్యవస్థీకరణ చట్టము, 1960 యొక్క 3వ పరిచ్ఛేదపు (1)వ ఉప-పరిచ్ఛేదములో నిర్దేశించబడిన రాజ్య క్షేత్రములు.]

5. కేరళ : రాజ్యముల పునర్వ్యవస్థీకరణ చట్టము, 1956 యొక్క 5వ పరిచ్ఛేదపు (1)వ ఉప-పరిచ్ఛేదములో నిర్దిష్టపరచబడిన రాజ్య క్షేత్రములు.

6. మధ్యప్రదేశ్ : [3] [మధ్యప్రదేశ్ పునర్వ్యస్థీకరణ చట్టము, 2000 యొక్క 3వ పరిచ్ఛేదములో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములను అవవర్జించి] రాజ్యముల పునర్వ్యవస్థీకరణ చట్టము, 1956 యొక్క 9వ పరిచ్ఛేదపు, ఉప-పరిచ్ఛేదము (1)లోను, [4] [మరియు రాజస్థాన్ మరియు మధ్యప్రదేశ్ (రాజ్యక్షేత్రముల అంతరణ) చట్టము, 1959 యొక్క ఒకటవ అనుసూచిలోను,] నిర్దిష్టపరచబడిన రాజ్య క్షేత్రములు.

[5][7. తమిళనాడు :] ఆంధ్ర రాజ్య చట్టము, 1953 యొక్క 3వ పరిచ్ఛేదపు (1)వ ఉప-పరిచ్ఛేదములోను, 4వ పరిచ్ఛేదపు (1)వ ఉప-పరిచ్ఛేదము లోను నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములను, మరియు రాజ్యముల పునర్వ్యవస్థీకరణ చట్టము, 1956 యొక్క [6] [5వ పరిచ్ఛేదపు

---

1. బీహారు పునర్వ్యవస్థీకరణ చట్టము, 2000 (2000లోని 30వది) యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా 15.11.2000 నుండి చొప్పించబడినది.
2. బొంబాయి పునర్వ్యవస్థీకరణ చట్టము, 1960 (1960లోని 11వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా, 4వ నమోదుకు బదులుగా 01.05.1960 నుండి ఉంచబడినది.
3. మధ్యప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టము, 2000 (2000లోని 28వది) యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా, 01.11.2000 నుండి చొప్పించబడినది.
4. రాజస్థాన్ మరియు మధ్యప్రదేశ్ (రాజ్య క్షేత్రాంతరణ) చట్టము, 1959 (1959లోని 47వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా, 01.10.1959 నుండి చొప్పించబడినది.
5. మద్రాసు రాజ్యపు (పేరు మార్పు) చట్టము, 1968 (1968లోని 53వది) యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా, ''7.మద్రాసు''కు బదులుగా, 14.01.1969 నుండి ఉంచబడినది.
6. ఆంధ్రప్రదేశ్ మరియు మద్రాసు (సరిహద్దుల మార్పు) చట్టము, 1959 యొక్క 6వ పరిచ్ఛేదము ద్వారా, 01.04.1960 నుండి కొన్ని పదములకు బదులుగా ఉంచబడినది.

ఉప-పరిచ్ఛేదము (1) యొక్క ఖండము (బి)లోను, 6వ పరిచ్ఛేదములోను, మరియు 7వ పరిచ్ఛేదపు ఉప-పరిచ్ఛేదము (1) యొక్క ఖండము (డి)లోను నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములను మరియు ఆంధ్రప్రదేశ్ మరియు మద్రాసు (సరిహద్దుల మార్పు) చట్టము, 1959 యొక్క ఒకటవ అనుసూచిలో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములను] అపవర్జించి, ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము మద్రాసు ప్రావిన్సులో చేరియున్న లేక ఆ ప్రావిన్సు యొక్క భాగమై యున్నట్లు పరిపాలింపబడుచుండిన రాజ్యక్షేత్రములు, మరియు రాజ్యముల పునర్వ్యవస్థీకరణ చట్టము, 1959 యొక్క 4వ పరిచ్ఛేదములో, [1] [మరియు ఆంధ్రప్రదేశ్ మరియు మద్రాసు (సరిహద్దుల మార్పు) చట్టము, 1959 యొక్క రెండవ అనుసూచి]లోను నిర్దిష్టపరచబడిన రాజ్య క్షేత్రములు.

[2][8. మహారాష్ట్ర : బొంబాయి పునర్వ్యవస్థీకరణ చట్టము, 1960 యొక్క 3వ పరిచ్ఛేదపు (1)వ ఉప-పరిచ్ఛేదములో నిర్దేశించబడిన రాజ్య క్షేత్రములను అపవర్జించి, రాజ్యముల పునర్వ్యవస్థీకరణ చట్టము, 1956 యొక్క 8వ పరిచ్ఛేదపు (1)వ ఉప-పరిచ్ఛేదములో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు.]

[3][[4][9.] కర్నాటక:] [5][ఆంధ్రప్రదేశ్ మరియు మైసూరు (రాజ్యక్షేత్రాంతరణ) చట్టము, 1968, యొక్క అనుసూచిలో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రమును అపవర్జించి] రాజ్యముల పునర్వ్యవస్థీకరణ చట్టము, 1956 యొక్క 7వ పరిచ్ఛేదపు ఉప-పరిచ్ఛేదము (1)లో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు.

---

1. ఆంధ్రప్రదేశ్ మరియు మద్రాసు (సరిహద్దుల మార్పు) చట్టము, 1959 (1959లోని 56వది) యొక్క 6వ పరిచ్ఛేదము ద్వారా, 01.04.1960 నుండి చొప్పించబడినది.
2. బొంబాయి పునర్వ్యవస్థీకరణ చట్టము, 1960 (1960లోని 11వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా, 01.05.1960 నుండి చొప్పించబడినది.
3. మైసూరు రాజ్య (పేరు మార్పు) చట్టము, 1973 (1973లోని 31వది) యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా, ‘‘9. మైసూరు’’ కు బదులుగా 01.11.1973 నుండి ఉంచబడినది.
4. బొంబాయి పునర్వ్యవస్థీకరణ చట్టము, 1960 (1960లోని 11వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా, 01.05.1960 నుండి నమోదులు 8 నుండి 14లను, 9 నుండి 15వ నమోదులుగా తిరిగి అంకె వేయబడినవి.
5. ఆంధ్రప్రదేశ్ మరియు మైసూరు (రాజ్య క్షేత్రాంతరణ) చట్టము, 1968 (1968లోని 36వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా, 01.10.1968 నుండి చొప్పించబడినది.

[2][10.] [1][ఒడిషా] : ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము ఒరిస్సా ప్రావిన్సులో చేరియున్న లేక ఆ ప్రావిన్సు యొక్క భాగమై యున్నట్లు పరిపాలించబడుచుండిన రాజ్యక్షేత్రములు.

[2][11.] పంజాబు : [2][సంవిధాన (తొమ్మిదవ సవరణ) చట్టము, 1960 యొక్క 1వ అనుసూచి భాగము 2లో నిర్దేశించబడిన రాజ్యక్షేత్రములను] [3][మరియు పంజాబు పునర్వ్యవస్థీకరణ చట్టము, 1966 యొక్క 3వ పరిచ్ఛేదపు ఉప-పరిచ్ఛేదము (1)లోను, 4వ పరిచ్ఛేదము లోను, మరియు 5వ పరిచ్ఛేదపు, ఉప-పరిచ్ఛేదము(1)లోను, [4][మరియు అధ్యార్జింపబడిన రాజ్యక్షేత్రముల (సంవిలీన) చట్టము, 1960 యొక్క ఒకటవ అనుసూచి, భాగము 2లో నిర్దేశింపబడిన రాజ్య క్షేత్రములను అపవర్జించి] రాజ్యముల పునర్వ్యవస్థీకరణ చట్టము, 1956 యొక్క 11వ పరిచ్ఛేదములో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు.

[5][12.] రాజస్థాన్ : [6] [రాజస్థాన్ మరియు మధ్యప్రదేశ్ (రాజ్యక్షేత్రముల అంతరణ) చట్టము, 1959 యొక్క మొదటి అనుసూచిలో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములను అపవర్జించి] రాజ్యముల పునర్వ్యవస్థీకరణ చట్టము, 1956 యొక్క 10వ పరిచ్ఛేదములో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు.

[1][13.] ఉత్తర ప్రదేశ్ : [7][బీహారు మరియు ఉత్తరప్రదేశ్ (సరిహద్దుల మార్పు) చట్టము, 1968 యొక్క 3వ పరిచ్ఛేదపు ఉప-పరిచ్ఛేదము (1) యొక్క ఖండము (ఎ)లో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములను, హర్యానా

---

1. ఒరిస్సా (పేరు మార్పు) చట్టము, 2011 (2011లోని 15వది) యొక్క 6వ పరిచ్ఛేదము ద్వారా, ''ఒరిస్సా'' అను పదముకు బదులుగా 01.11.2011 నుండి ఉంచబడినది.
2. సంవిధాన (తొమ్మిదవ సవరణ) చట్టము, 1960 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా, 17.01.1961 నుండి చేర్చబడినది.
3. పంజాబు పునర్వ్యవస్థీకరణ చట్టము, 1966 (1966లోని 31వది) యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా, 01.11.1966 నుండి చొప్పించబడినది.
4. అధ్యార్జింపబడిన రాజ్యక్షేత్రముల (సంవిలీన) చట్టము, 1960 (1960లోని 64వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 17.01.1961 నుండి చొప్పించబడినది.
5. బొంబాయి పునర్వ్యవస్థీకరణ చట్టము, 1960 (1960లోని 11వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా, 01.05.1960 నుండి నమోదులు 8 నుండి 14లను, 9 నుండి 15వ నమోదులుగా తిరిగి అంకె వేయబడినవి.
6. రాజస్థాన్ మరియు మధ్యప్రదేశ్ (రాజ్యక్షేత్రాంతరణ) చట్టము, 1959 (1959లోని 47వది) ద్వారా, 01.10.1959 నుంచి చొప్పించబడినది.
7. హర్యానా మరియు ఉత్తరప్రదేశ్ (సరిహద్దుల మార్పు) చట్టము, 1979 (1979లోని 31వది) యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా, 15.09.1983 నుండి ''13.ఉత్తరప్రదేశ్'' నమోదుకు బదులుగా ఉంచబడినది.

మరియు ఉత్తరప్రదేశ్ (సరిహద్దుల మార్పు) చట్టము, 1979 యొక్క 4వ పరిచ్ఛేదవు (1)వ ఉప-పరిచ్ఛేదము యొక్క ఖండము (ఎ)లో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములను [1][మరియు ఉత్తర ప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టము, 2000 యొక్క 3వ పరిచ్ఛేదములో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములను] అవవర్జించి. ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము సంయుక్త ప్రావిన్సులు అని అనబడుచుండిన ప్రావిన్సులో చేరియున్న, లేక ఆ ప్రావిన్సు యొక్క భాగమైయున్నట్లు పరిశీలింపబడుచుండిన రాజ్య క్షేత్రములు, మరియు బీహారు మరియు ఉత్తరప్రదేశ్ (సరిహద్దు మార్పు) చట్టము, 1968 యొక్క 3వ పరిచ్ఛేదము (1) ఉప-పరిచ్ఛేదము యొక్క ఖండము (బి)లో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు.]

[1][14.] పశ్చిమ బెంగాల్ : ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము పశ్చిమ బెంగాల్ ప్రావిన్సులో చేరియున్న లేక ఆ ప్రావిన్సు యొక్క భాగమై యున్నట్లు పరిపాలించబడుచుండిన రాజ్యక్షేత్రములు, మరియు చెందర్‌నాగూర్ (సంవిలీన) చట్టము, 1954 యొక్క 2వ పరిచ్ఛేదవు ఖండము (సి)లో నిర్వచింపబడినట్లు చెందర్‌నాగూర్ రాజ్యక్షేత్రము, మరియు బీహారు మరియు పశ్చిమ బెంగాల్ (రాజ్యక్షేత్రముల అంతరణ) చట్టము, 1956 యొక్క 3వ పరిచ్ఛేదవు ఉప-పరిచ్ఛేదము (1)లో [2][మరియు సంవిధాన (తొమ్మిదవ సవరణ) చట్టము, 1960 యొక్క 3వ పరిచ్ఛేదవు ఖండము (సి)లో ఏమి ఉన్నప్పటికినీ సంవిధాన (నూరవ సవరణ) చట్టము, 2015 యొక్క రెండవ అనుసూచిలోని భాగము-3లో నిర్దేశించిన రాజ్య క్షేత్రములు మినహాయించి అయితే మొదటి అనుసూచి యొక్క భాగము – 3లో నిర్దేశించిన రాజ్యక్షేత్రములు.]

[3][* * * [4][* * * * *] * * * * *]]

[1][2][15.] నాగాల్యాండు : నాగాల్యాండు రాజ్య చట్టము, 1962 యొక్క 3వ పరిచ్ఛేదవు

1. ఉత్తరప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టము, 2000 (2000లోని 29వది) యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా, 09.11.2000 నుండి చొప్పించబడినది.

2. సంవిధాన (నూరవ సవరణ) చట్టము, 2015 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా, 31.07.2015 నుండి చేర్చబడినది.

3. జమ్మూ మరియు కాశ్మీరు పునర్వ్యవస్థీకరణ చట్టము, 2019 (2019లోని 34వది) 6వ పరిచ్ఛేదము ద్వారా 31-10-2019 నుండి జమ్మూ మరియు కాశ్మీరు నమోదు 15 తొలగించబడినది.

4 . బొంబాయి పునర్వ్యవస్థీకరణ చట్టము, 1960 (1960లోని 11వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా, 01.05.1960 నుండి నమోదులు 8 నుండి 14లను, 9 నుండి 15వ నమోదులుగా తిరిగి అంకె వేయబడినవి.

] ఉప–పరిచ్ఛేదము (1)లో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రము.]

[4][[3][16.] హర్యానా : [4][హర్యానా మరియు ఉత్తర ప్రదేశ్ (సరిహద్దుల మార్పు) చట్టము, 1979 యొక్క 4వ పరిచ్ఛేదపు ఉప–పరిచ్ఛేదము (1) యొక్క ఖండము (బి)లో నిర్ధిష్టపరచబడిన రాజ్యక్షేత్రములను అపవర్జించు అదే చట్టము యొక్క 4వ పరిచ్ఛేదపు ఉప–పరిచ్ఛేదము (1) యొక్క ఖండము (ఎ)లో నిర్ధిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు మరియు పునర్వ్యవస్థీకరణ చట్టము, 1968 యొక్క 3వ పరిచ్ఛేదపు (1)వ ఉప–పరిచ్ఛేదములో నిర్ధిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు.]]

[5][[6][17.] హిమాచల్ ప్రదేశ్ : ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము హిమాచల్ ప్రదేశ్ మరియు బిలాస్‌పూర్ అను పేర్లతో అవి ముఖ్య కమీషనరు ప్రావిన్సులై యుండినట్లు పరిపాలించబడుచుండిన రాజ్యక్షేత్రములు, మరియు పంజాబు పునర్వ్యవస్థీకరణ చట్టము, 1966 యొక్క 5వ పరిచ్ఛేదపు ఉప–పరిచ్ఛేదము (1)లో నిర్ధిష్టపరచిన రాజ్యక్షేత్రములు.]

[1][[7][18.] మణిపూర్ : ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము మణిపూర్ అను పేరుతో, అది ఒక ముఖ్య కమీషనరు ప్రావిన్సు అయి యుండినట్లు పరిపాలించబడుచుండిన రాజ్యక్షేత్రము.

[1][19.] త్రిపుర : ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము త్రిపుర అను పేరుతో, అది ఒక ముఖ్య కమీషనరు ప్రావిన్సు అయి యుండినట్లు

---

1. జమ్మూ మరియు కాశ్మీరు పునర్‌వ్యవస్థీకరణ చట్టము, 2019 (2019లోని 34వది) 6వ పరిచ్ఛేదము ద్వారా 31–10–2019 నుండి నమోదులు 16 నుండి 29లను, 15 నుండి 28వ నమోదులుగా తిరిగి అంకెవేయబడినవి.
2. నాగాల్యాండు రాజ్యపు చట్టము, 1962 (1962లోని 27వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా, 01.12.1963 నుండి చొప్పించబడినది.
3. పంజాబు పునర్వ్యవస్థీకరణ చట్టము, 1966 (1966లోని 31వది) యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా, 01.11.1966 నుండి చొప్పించబడినది.
4. హర్యానా మరియు ఉత్తరప్రదేశ్ (సరిహద్దుల మార్పు) చట్టము, 1979 (1979లోని 31వది) యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా, ''17. హర్యానా'' నమోదుకు బదులుగా 15.09.1983 నుండి ఉంచబడినది.
5. జమ్మూ మరియు కాశ్మీరు పునర్‌వ్యవస్థీకరణ చట్టము, 2019 (2019లోని 34వది) 6వ పరిచ్ఛేదము ద్వారా 31–10–2019 నుండి నమోదులు 16 నుండి 29లను, 15 నుండి 28వ నమోదులుగా తిరిగి అంకెవేయబడినవి.
6. హిమాచల్ ప్రదేశ్ రాజ్యపు చట్టము, 1970 (1970లోని 53వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 25.01.1971 నుండి చొప్పించబడినది.
7. ఉత్తర–ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 9వ పరిచ్ఛేదము ద్వారా 21.01.1972 నుండి చొప్పించబడినది.

పరిపాలించబడుచుండిన రాజ్యక్షేత్రము [1][మరియు సంవిధాన (తొమ్మిదవ సవరణ) చట్టము, 1960 యొక్క 3వ పరిచ్ఛేదపు ఖండము (డి)లో ఏమి ఉన్నప్పటికినీ సంవిధాన (నూరవ సవరణ) చట్టము, 2015 యొక్క మొదటి అనుసూచిలోని భాగము–2లో నిర్దేశించిన రాజ్య క్షేత్రములకు సంబంధించినంత వరకు, సంవిధాన (నూరవ సవరణ) చట్టము, 2015 యొక్క మొదటి అనుసూచిలో భాగము–2లో నిర్దేశించిన రాజ్యక్షేత్రములు.]

| | | | |
|---|---|---|---|
| [1][20. ] | మేఘాలయ | : | ఉత్తర–ఈశాన్య క్షేత్రముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 యొక్క 5వ పరిచ్ఛేదములో నిర్ధిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు [4][మరియు సంవిధాన (నూరవ సవరణ) చట్టము, 2015 యొక్క రెండవ అనుసూచిలోని భాగము–2లో నిర్దేశించిన రాజ్య క్షేత్రములు మినహాయించి, అయితే మొదటి అనుసూచి యొక్క భాగము–1లో నిర్దేశించిన రాజ్యక్షేత్రములు.] |
| [1][[2][21. ] | సిక్కిం | : | సంవిధాన (ముప్పది ఆరవ సవరణ) చట్టము 1975 యొక్క ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము సిక్కింలో చేరియున్న రాజ్యక్షేత్రములు.] |
| [3][[4][22. ] ] | మిజోరాం | : | ఉత్తర–ఈశాన్య క్షేత్రముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 యొక్క 6వ పరిచ్ఛేదములో నిర్ధిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు.] |
| [1][[5][23. . | అరుణాచల్ ప్రదేశ్ | : | ఉత్తర–ఈశాన్య క్షేత్రముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 యొక్క 7వ పరిచ్ఛేదములో నిర్ధిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు.] |
| [1][[6][24. . | గోవా | : | గోవా, డామన్ మరియు డయ్యూ పునర్వ్యవస్థీకరణ చట్టము, 1987 యొక్క 3వ పరిచ్ఛేదములో నిర్ధిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు.] |

1. సంవిధాన (నూరవ సవరణ) చట్టము, 2015 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా, 31.07.2015 నుండి చేర్చబడినది.
2 . ఉత్తర–ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 9వ పరిచ్ఛేదము ద్వారా 21.01.1972 నుండి చొప్పించబడినది.
3. జమ్మూ మరియు కాశ్మీరు పునర్వ్యవస్థీకరణ చట్టము, 2019 (2019లోని 34వది) 6వ పరిచ్ఛేదము ద్వారా 31–10–2019 నుండి నమోదులు 16 నుండి 29లను, 15 నుండి 28వ నమోదులుగా తిరిగి అంకెవేయబడినవి.
2. మిజోరాం రాజ్య చట్టము, 1986 (1986లోని 34వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 20.02.1987 నుండి చొప్పించబడినది.
5 .అరుణాచల్ ప్రదేశ్ రాజ్య చట్టము, 1986 (1986లోని 69వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 20.02.1987 నుండి చొప్పించబడినది.
6. గోవా, డామన్ మరియు డయ్యు పునర్వ్యవస్థీకరణ చట్టము, 1987 (1987లోని 18వది) యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా 30.05.1987 నుండి చొప్పించబడినది.

[1][1][25. ఛత్తీస్‌ఘర్ : మధ్య ప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టము, 2000 యొక్క 3వ పరిచ్ఛేదములో నిర్ధిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు.]

[1][2][26. [3][ఉత్తరాఖండ్] : ఉత్తర ప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టము, 2000 యొక్క 3వ పరిచ్ఛేదములో నిర్ధిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు.]

[1][4][27. ఝూర్ఖండ్ : బీహారు పునర్వ్యవస్థీకరణ చట్టము, 2014 యొక్క 3వ పరిచ్ఛేదములో నిర్ధిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు.]

[1][5][28. తెలంగాణ : ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టము, 2000 యొక్క 3వ పరిచ్ఛేదములో నిర్ధిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు.]

## 2. సంఘ రాజ్యక్షేత్రములు

| | పేరు | | విస్తీర్ణము |
|---|---|---|---|
| 1. | ఢిల్లీ | : | ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము ఢిల్లీ ముఖ్య కమీషనరు ప్రావిన్సులో చేరియున్న రాజ్యక్షేత్రము. |
| | [6][***] | | |
| | [7][***] | | |
| [8][2. | అండమాను మరియు నికోబారు దీవులు | : | ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము అండమాను మరియు నికోబారు దీవులు ముఖ్య కమీషనరు యొక్క ప్రావిన్సులో చేరియున్న రాజ్యక్షేత్రము. |

---

1. మధ్యప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టము, 2000 (2000లోని 28వది) యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా 01.11.2000 నుండి చొప్పించబడినది.
2. ఉత్తరప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టము, 2000 (2000లోని 29వది) యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా 09.11.2000 నుండి చొప్పించబడినది.
3. ఉత్తరాంఛల్ (పేరు మార్పు) చట్టము, 2006 (2006లోని 52వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 01.01.2007 నుండి ''ఉత్తరాంచల్'' అను పదమునకు బదులుగా ఉంచబడినది.
4. బీహారు పునర్వ్యవస్థీకరణ చట్టము, 2000 (2000లోని 30వది) యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా 15.11.2000 నుండి చొప్పించబడినది.
5. ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టము, 2014 యొక్క 10వ పరిచ్ఛేదము ద్వారా 02.06.2014 నుండి చొప్పించబడినది.
6. హిమాచల్ ప్రదేశ్ రాజ్యపు చట్టము, 1970 (1970లోని 53వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా, 25.01.1971 నుండి ''హిమాచల్ ప్రదేశ్''కు సంబంధించిన 2వ నమోదు లుప్తము చేయబడినది మరియు నమోదులు 3 నుండి 10లను, 2 నుండి 9వ నమోదులుగా తిరిగి అంకెవేయబడినవి.
7. ఉత్తర-ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 9వ పరిచ్ఛేదము ద్వారా, 21.01.1972 నుండి మణిపూర్ మరియు త్రిపురలకు సంబంధించిన నమోదులు (2 మరియు 3 నమోదులు) వదిలి వేయబడినవి.
8. అదే చట్టము యొక్క 9వ పరిచ్ఛేదము ద్వారా, 4 నుండి 9 వరకు గల నమోదులను 2 నుండి 7 వరకు గల నమోదులుగా 21.01.1972 నుండి తిరిగి అంకె వేయబడినది.

| | | | |
|---|---|---|---|
| [3][3. | [1][లక్షద్వీప్] | : | రాజ్యముల పునర్వ్యవస్థీకరణ చట్టము, 1956 యొక్క 6వ పరిచ్ఛేదములో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రము. |
| [2][3][4.] | దాద్రా మరియు నాగర్ హవేలి మరియు డామన్ మరియు డయ్యూ | : | 1961 ఆగస్టు పదుకొండవ దినమునకు అవ్యవహిత పూర్వము స్వతంత్ర దాద్రా మరియు నాగర్ హవేలిలో చేరియున్న రాజ్యక్షేత్రము మరియు గోవా, డామన్ మరియు డయ్యూ పునర్వ్యవస్థీకరణ చట్టము, 1987 యొక్క 4వ పరిచ్ఛేదములో నిర్ధిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు. |
| [3][3][5.] | * | | * * * *] |
| [4][5][6.] | [6][పుదుచ్చేరి] | : | 1962 ఆగస్టు పదునారవ దినమునకు అవ్యవహిత పూర్వము ఇండియాలోని ఫ్రెంచి స్థావరములో పాండిచ్చేరి, కరికాల్, మాహె మరియు యానాంగా తెలిసియున్న వాటిలో చేరియున్న రాజ్యక్షేత్రములు.] |
| [7][2] [7.] | చండిఘర్ | : | పంజాబు పునర్వ్యవస్థీకరణ చట్టము, 1966 యొక్క 4వ పరిచ్ఛేదములో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు.] |

[1][***]

---

1. లక్కదీవులు, మినికోయ్ మరియు అమిన్‌దీవి దీవుల (పేరు మార్పు) చట్టము, 1973 (1973లోని 34వది) యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా, 01.11.1973 నుండి ''లక్కదీవులు, మినికోయ్ మరియు అమిన్‌దీవి దీవులకు'' బదులుగా ఉంచబడినది.

2. సంవిధాన (పదవ సవరణ) చట్టము, 1961 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.

3. గోవా డామన్ మరియు డయ్యూ పునర్వ్యవస్థీకరణ చట్టము, 1987 (1987లోని 18వది) యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా 30.05.1987 నుండి 5వ నమోదుకు బదులుగా ఉంచబడినది.తరువాత దాద్రా నగర్ హవేలీ డామన్ మరియు డయ్యూ (సంఘ రాజ్యక్షేత్రముల సంవిలీన ) చట్టము, 2019 (2019లోని 44వది) 5వ పరిచ్ఛేదము ద్వారా 19-12-2019 నుండి నమోదులు 4 మరియు 5 కొరకు , నమోదు 4కు బదులుగా ఉంచబడినది.

4. సంవిధాన (పదునాల్గవ సవరణ) చట్టము, 1962 ఉప-పరిచ్ఛేదములు 3 మరియు 7ల ద్వారా 16.08.1962 నుండి చొప్పించబడినది.

5. ఉత్తర-ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 9వ పరిచ్ఛేదము ద్వారా, 4 నుండి 9 వరకు గల నమోదులను 2 నుండి 7 వరకు గల నమోదులుగా తిరిగి అంకె వేయబడినది.

6. పాండిచ్చేరి (పేరు మార్పు) చట్టము, 2006 (2006లోని 44వది) యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా 01.10.2006 నుండి ''పాండిచ్చేరి'' అనుపదమునకు బదులుగా ఉంచబడినది.

7. పంజాబు పునర్వ్యవస్థీకరణ చట్టము, 1966 (1966లోని 31వది) యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా, 1.11.1966 నుండి చొప్పించబడినది.

[5][***]

| | | | |
|---|---|---|---|
| [2][8.] | జమ్మూమరియు కాశ్మీరు | : | జమ్మూ మరియు కాశ్మీరు పునర్వ్యవస్థీకరణ చట్టము,2019 యొక్క 4వ పరిచ్ఛేదములో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు. |
| 9. | లద్దాఖ్ | : | జమ్మూ మరియు కాశ్మీరు పునర్వ్యవస్థీకరణ చట్టము,2019 యొక్క 3వ పరిచ్ఛేదములో నిర్దిష్టపరచబడిన రాజ్యక్షేత్రములు.] |

## రెండవ అనుసూచి

**[అనుచ్ఛేదములు 59 (3), 65 (3), 75 (6), 97, 125, 148 (3), 158 (3), 164 (5), 186 మరియు 221].**

### భాగము – ఏ

### రాష్ట్రపతిని మరియు రాజ్య గవర్నర్లను గూర్చిన నిబంధనలు [3][***]

1. రాష్ట్రపతి మరియు [1][***] రాజ్య గవర్నర్లకు ఈ క్రింది నెలసరి ఉపలబ్ధులు చెల్లించబడవలెను, అవేవనగా–

*రాష్ట్రపతి – 10,000 రూపాయలు

**రాజ్య గవర్నరు – 5,500 రూపాయలు

---

1. మిజోరాం రాజ్య చట్టము, 1986 (1986లోని 34వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 20.02.1987 నుండి మిజోరంకు సంబంధించిన 8వ నమోదు వదలివేయబడినది మరియు అరుణాచల్ ప్రదేశ్‌కు సంబంధించిన 9వ నమోదును 20.02.1987 నుండి 8వ నమోదుగా తిరిగి అంకె వేయబడినది. మరియు అరుణాచల్ ప్రదేశ్ రాజ్య చట్టము, 1986 (1986లోని 69వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 20.02.1987 నుండి అరుణాచల్ ప్రదేశ్‌కు సంబంధించిన 8వ నమోదు వదలివేయబడినది.
2. జమ్మూ మరియు కాశ్మీరు పునర్వ్యవస్థీకరణ చట్టము, 2019 (2019లోని 34వది) 6వ పరిచ్ఛేదము ద్వారా 31.10.2019 నుండి చొప్పించబడినది .
3. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''ఒకటవ అనుసూచి యొక్క భాగము – ఏలో నిర్దిష్టపరచబడిన'' అను పదములు మరియు అక్షరము లుప్తము చేయబడినవి.

* ప్రస్తుతము ఐదు లక్షలు (5,00,000/-) రూపాయలు, విత్తీయ చట్టము, 2018 (2018లోని 13వది) యొక్క 137వ పరిచ్ఛేదము ద్వారా 01.01.2016 నుండి అమలులోనికి వచ్చినది.

2. ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము భారతదేశ అధినివేశ గవర్నరు జనరలుకు మరియు ఆయా రాజ్యముల స్థానమునందుండిన ప్రావిన్సుల గవర్నర్లకు చెల్లించబడదగియుండిన బత్తెములు కూడ క్రమశః రాష్ట్రపతికి, మరియు [1][***] రాజ్య గవర్నర్లకు చెల్లించబడవలెను.

3. ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము గవర్నరు జనరలు మరియు ఆయా రాజ్యముల స్థానములందుండిన ప్రావిన్సుల గవర్నర్లకు హక్కు కలిగియుండిన విశేషాధికారములకు క్రమశః రాష్ట్రపతి మరియు [2][రాజ్యముల] గవర్నర్లు వారి వారి పదావధి పర్యంతము హక్కు కలిగియుందురు.

4. ఉపరాష్ట్రపతి, లేక ఎవరేని ఇతర వ్యక్తి, రాష్ట్రపతి యొక్క కృత్యములను నిర్వహించుచున్నప్పుడు, లేక రాష్ట్రపతిగ వ్యవహరించుచున్నప్పుడు, లేక ఎవరేని వ్యక్తి గవర్నరు యొక్క కృత్యములను నిర్వహించుచున్నప్పుడు, ఆయన ఎవరి కృత్యములను నిర్వహించుచున్నాడో లేక ఎవరిస్థానే వ్యవహరించుచున్నాడో అట్టి రాష్ట్రపతి లేక గవర్నరు పొందు ఉపలబ్దులు, బత్తెములు, మరియు విశేషాధికారములకు హక్కు కలిగియుండును.

[3][***]

## భాగము – సీ

### లోకసభ అధ్యక్షుడు మరియు ఉపాధ్యక్షుడు, రాజ్యసభ సభాపతి మరియు ఉపసభాపతి, [4][***] [5][ఒక రాజ్యము] యొక్క శాసనసభాధ్యక్షుడు మరియు ఉపాధ్యక్షుడు శాసన పరిషత్తు యొక్క సభాపతి మరియు ఉప సభాపతులను గూర్చి నిబంధనలు.

7. ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము భారతదేశ అధినివేశ సంవిధాన సభ యొక్క అధ్యక్షునకు చెల్లించబడదగియుండిన జీతములు మరియు బత్తెములు లోకసభాధ్యక్షునకు మరియు రాజ్యసభ సభాపతికి చెల్లించబడవలెను, మరియు అట్టి ప్రారంభమునకు

---

** ప్రస్తుతము మూడు లక్షల యాభైవేల (3,50,000/-) రూపాయలు, అదే చట్టము యొక్క 161వ పరిచ్ఛేదము ద్వారా 01.01.2016 నుండి అమలులోనికి వచ్చినది.

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''అట్లు నిర్దిష్టపరచబడిన'' అను పదములు లుప్తము చేయబడినవి.
2. అదే చట్టము యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''అట్టి రాజ్యములు''కు బదులుగా ఉంచబడినవి.
3. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా భాగము–బీ లుప్తము చేయబడినది.
4. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు ''ఒకటవ అనుసూచి యొక్క భాగము – ఏ లోని ఒక రాజ్యము యొక్క'' అను పదములు మరియు అక్షరము 1–11–1956 నుండి లుప్తము చేయబడినది.
5. అదే చట్టము యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''ఏదేని అట్టి రాజ్యము''కు బదులుగా ఉంచబడినది.

అవ్యవహితపూర్వము భారతదేశ అధినివేశ సంవిధాన సభ యొక్క ఉపసభాపతికి చెల్లించబడదగియుండిన జీతములు మరియు బత్తెములు లోకసభ యొక్క ఉపాధ్యక్షునకును రాజ్యసభ యొక్క ఉపసభాపతికిని చెల్లించబడవలెను.

8. [1] [***] ఒక రాజ్యము యొక్క స్థానమునందు ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహితపూర్వము ఉండిన ప్రావిన్సు యొక్క శాసనసభాధ్యక్షునకును, ఉపాధ్యక్షునకును, మరియు శాసనపరిషత్తు ప్రెసిడెంటుకును, డిప్యూటి ప్రెసిడెంటుకును చెల్లించబడ దగియుండిన జీతములు మరియు బత్తెములు, క్రమశః [2][ఒక రాజ్యము] యొక్క శాసన సభాధ్యక్షునకును ఉపాధ్యక్షునకును, శాసన పరిషత్తు సభాపతికిని, ఉపసభాపతికిని చెల్లించబడవలెను; మరియు ఏదేని రాజ్యము యొక్క స్థానము నందు అట్టి ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము ఉండిన ప్రావిన్సుకు శాసనపరిషత్తు లేకుండిన యెడల ఆ రాజ్య గవర్నరు నిర్ధారణ చేయు జీతములు మరియు బత్తెములు ఆ రాజ్య శాసనపరిషత్తు యొక్క సభాపతికిని, ఉపసభాపతికిని చెల్లించబడ వలెను.

## భాగము – డీ

## [3][***] సర్వోన్నత న్యాయస్థానము యొక్క మరియు ఉన్నత న్యాయస్థానముల యొక్క న్యాయాధీశులను గూర్చిన నిబంధనలు.

9. (1) సర్వోన్నత న్యాయస్థానపు న్యాయాధీశులకు వారు ప్రస్తుత సేవలో గడిపిన కాలము విషయమున ఈ క్రింది రేట్ల చొప్పున నెలసరి జీతము చెల్లించబడవలెను అవేవనగా:–

ముఖ్య న్యాయమూర్తి .. [4][10,000 రూపాయలు]*

ఇతర న్యాయాధీశుడు .. [1][9,000 రూపాయలు]**

---

1. అదే చట్టము యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''ఒకటవ అనుసూచి యొక్క భాగము–ఏ లో నిర్దిష్టపరచబడిన రాజ్యము యొక్క'' అను పదములు మరియు అక్షరము లుప్తము చేయబడినవి.
2. అదే చట్టము యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''అట్టి రాజ్యము''కు బదులుగా ఉంచబడినది.
3. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము ద్వారా ''ఒకటవ అనుసూచి యొక్క భాగము–ఏ లోని ఒక రాజ్యములో'' అను పదములు, అక్షరము లుప్తము చేయబడినవి.
4. సంవిధాన (యాబది నాలుగవ) (సవరణ) చట్టము, 1986 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా ''5000 రూపాయలు''కు బదులుగా 10,000/– రూపాయలుగా 01.04.1986 నుండి ఉంచబడినది.

* ప్రస్తుతము రెండు లక్షల ఎనభై వేల (2,80,000/–) రూపాయలు, ఉన్నత న్యాయస్థానము మరియు సర్వోన్నత న్యాయస్థానముల న్యాయాధీశులు (జీతము మరియు సేవా షరతులు) (సవరణ) చట్టము, 2018 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 22.9.2017 నుండి ఉంచబడినది.

అయితే, సర్వోన్నత న్యాయస్థానపు ఎవరేని న్యాయాధీశుడు ఆయన నియమింపబడిన సమయమున భారత ప్రభుత్వము క్రింద లేక దాని పూర్వవర్తి ఏదేని ప్రభుత్వము క్రింద లేక ఒక రాజ్య ప్రభుత్వము క్రింద లేక దాని పూర్వవర్తి ఏదేని ప్రభుత్వము క్రింద తాను చేసిన ఏదేని పూర్వ సేవ విషయమున (అశక్తత లేక గాయపు పింఛను మినహా) ఇతర పింఛను పొందుచుండినచో, సర్వోన్నత న్యాయస్థానపు సేవ విషయమున ఆయన జీతము [2][ఈ క్రింది మేరకు తగ్గించబడవలెను–

(ఎ) ఆ పింఛను మొత్తము మేరకు, మరియు

(బి) ఆయన అట్లు నియమించబడుటకు పూర్వము అట్టి పూర్వ సేవ విషయమున ఆయనకు రావలసియుండిన పింఛనులో ఒక భాగమునకు బదులుగా, రాశీకృత మూల్యమును పొంది ఉండినచో పింఛనులో ఆ భాగపు మొత్తము మేరకు, మరియు

(సి) ఆయన అట్లు నియమించబడుటకు పూర్వము అట్టి పూర్వసేవ విషయమున పదవీ విరమణ ఉపదానము పొంది ఉండినచో, ఆ ఉపదానమునకు సమానమగు పింఛను మేరకు.]

(2) సర్వోన్నత న్యాయస్థానము యొక్క ప్రతియొక న్యాయాధీశుడు, అద్దె చెల్లించకుండ అధికారిక నివాస గృహమును ఉపయోగించుకొనుటకు హక్కు కలిగి ఉండను.

(3) ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము–

(ఎ) ఫెడరల్ న్యాయస్థానపు ముఖ్య న్యాయమూర్తిగా పదవియందుండి ఈ సంవిధానము ప్రారంభము కాగానే 374వ అనుచ్ఛేదపు ఖండము (1) క్రింద సర్వోన్నత న్యాయస్థానపు ముఖ్య న్యాయమూర్తి అయినట్టి న్యాయమూర్తికి, అట్లు ముఖ్య న్యాయమూర్తి పదవియందుండు కాలావధిలో; లేక

(బి) ఫెడరల్ న్యాయస్థానపు ఇతర న్యాయాధీశుని పదవి యందుండి ఈ సంవిధానము ప్రారంభము కాగానే (ముఖ్య న్యాయమూర్తి కాకుండా ఇతర) సర్వోన్నత న్యాయస్థానపు న్యాయాధీశుడైనట్టి న్యాయాధీశునికి, అట్లు ఇతర న్యాయాధీశునిగా పదవియందుండు కాలావధిలో;

ఈ పేరా యొక్క ఉపపేరా (2)లో ఉన్నదేదియు వర్తించరాదు; మరియు ఈ రీతిగా సర్వోన్నత న్యాయస్థానపు ముఖ్య న్యాయమూర్తి అయినట్టి, ఇతర న్యాయాధీశుడైనట్టి ప్రతి న్యాయాధీశుడు లేదా సందర్భానుసారముగా ముఖ్య న్యాయమూర్తి లేక ఇతర న్యాయాధీశునిగా ప్రస్తుత సేవలో గడిపిన కాలము విషయమున ఈ పేరా యొక్క ఉపపేరా (1)లో నిర్దిష్టపరచినట్టి జీతమునకు అదనముగా,

---

1. అదే చట్టపు 4వ పరిచ్ఛేదము ద్వారా 4000 రూపాయలకు బదులుగా, 9,000/-లుగా 01.04.1986 నుండి ఉంచబడినది.

** అదే చట్టము యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 22.9.2017 నుండి ప్రస్తుతం రెండు లక్షల ఏబది వేల (2,50,000/-) రూపాయలు.

2. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 25వ పరిచ్ఛేదము ద్వారా ''పెన్షను మొత్తము మేరకు తగ్గింపబడవలెను'' అను పదములకు బదులుగా ఉంచబడినది.

అట్లు నిర్దిష్టపరచిన జీతమునకు ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము అతడు తీసుకొనుచుండిన జీతమునకు గల తేడాకు సమానమగు మొత్తమును ప్రత్యేక వేతనముగా పొందుటకు హక్కు కలిగియుండును.

(4) సర్వోన్నత న్యాయస్థానపు ప్రతీ న్యాయాధీశుడు తన కర్తవ్య నిర్వహణలో భారత రాజ్యక్షేత్రములో చేసిన ప్రయాణపు ఖర్చులను రాబట్టుకొనుటకు ఆయా సమయములందు రాష్ట్రపతి విహితపరచునట్టి ప్రయాణ భత్యములను పొందవలెను మరియు ప్రయాణ విషయమున యుక్తమైన సౌకర్యములను పొందవలెను.

(5) ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము ఫెడరల్ న్యాయస్థానపు న్యాయాధీశులకు వర్తించదగి ఉండిన నిబంధనలే సర్వోన్నత న్యాయస్థానపు న్యాయాధీశుల సెలవు బత్తెములతో సహా గైరు హాజరు సెలవును మరియు పింఛనును గూర్చిన హక్కులకు వర్తించవలెను.

10. [1][(1) ఉన్నత న్యాయస్థానపు న్యాయాధీశులకు వారు అసలు సేవలో గడిపిన కాలమునకు సంబంధించి, ఈ క్రింది రేట్లు చొప్పున నెలసరి జీతము చెల్లించబడవలెను, అదేదనగా

ముఖ్య న్యాయమూర్తి .. [2][9,000 రూపాయలు]*

ఎవరైనా ఇతర న్యాయాధీశుడు .. [3][8,000 రూపాయలు]**

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 25వ పరిచ్ఛేదము ద్వారా ఉపపేరా (1)కి బదులుగా ఉంచబడినది.
2. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1986 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా ''4000 రూపాయలు''కు బదులుగా 01.04.1986 నుండి ఉంచబడినది.

* ప్రస్తుతము రెండు లక్షల యాభై వేల (2,50,000/-) రూపాయలు, ఉన్నత న్యాయస్థానము మరియు సర్వోన్నత న్యాయస్థానపు న్యాయాధీశులు (జీతము మరియు సేవా షరతులు) (సవరణ) చట్టము, 2018లోని 10వది) యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 22.09.2017 నుండి ఉంచబడినది.

3. అదే చట్టపు 4వ పరిచ్ఛేదము ద్వారా ''3,500 రూపాయలు''కు బదులుగా 01.04.1986 నుండి ఉంచబడినది.

** ప్రస్తుతం రెండు లక్షల ఇరువది ఐదు వేల (2,25,000/-) రూపాయలు, అదే చట్టపు 2వ పరిచ్ఛేదము ద్వారా 22.09.2017 నుండి ఉంచబడినది.

అయితే, ఉన్నత న్యాయస్థానపు న్యాయాధీశుడు, అతడు నియమింపబడిన సమయమున భారత ప్రభుత్వము క్రింద లేదా దాని పూర్వవర్తి ఏదేని ప్రభుత్వము క్రింద లేదా ఒక రాజ్య ప్రభుత్వము క్రింద లేదా దాని పూర్వవర్తి ఏదేని ప్రభుత్వము క్రిందద తాను చేసిన ఏదైనా పూర్వ సేవ విషయమున (అశక్తత లేదా గాయపు పింఛను మినహా) పింఛను పొందుచూండినచో, ఉన్నత న్యాయస్థానపు సేవా విషయమున అతని జీతము ఈ క్రింది మేరకు తగ్గించబడవలెను–

(ఎ) ఆ పింఛను మొత్తము మేరకు, మరియు

(బి) ఆయన అట్లు నియమించబడుటకు పూర్వము, అట్టి పూర్వ సేవ విషయమున ఆయనకు రావలసియుండిన పింఛనులో ఒక భాగమునకు బదులుగా, రాశీకృత మూల్యమును పొందియుండినచో, పింఛనులో ఆ భాగపు మొత్తము మేరకు, మరియు

(సి) ఆయన అట్లు నియమించబడుటకు పూర్వము, అట్టి పూర్వ సేవ విషయమున పదవీ విరమణ ఉపదానము పొందియుండినచో, ఆ ఉపదానమునకు సమానమగు పింఛను మేరకు. ]

(2) ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము–

(ఎ) ఏదైనా ప్రావిన్సులోని ఉన్నత న్యాయస్థానపు ముఖ్య న్యాయమూర్తిగా పదవి యందుండి, ఈ సంవిధానము ప్రారంభము కాగానే 376వ అనుచ్ఛేదపు ఖండము (1) క్రింద, ఆ ప్రావిన్సు స్థానములోనున్న రాజ్యములోని ఉన్నత న్యాయస్థానపు న్యాయముర్తి అయినట్టి; లేక

(బి) ఏదైన ప్రావిన్సులోని ఉన్నత న్యాయస్థానపు ఇతర న్యాయాధీశునిగా పదవి యందుండి ఈ సంవిధానము ప్రారంభము కాగానే సదరు ఖండము క్రింద, ఆ ప్రావిన్సులోనున్న రాజ్యములో ఉన్నత న్యాయస్థానపు (ముఖ్య న్యాయమూర్తి మినహా) ఇతర న్యాయాధీశుడైనట్టి;

[1][ప్రతి వ్యక్తియు, ఆయన, ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహితపూర్వము ఈ పేరా యొక్క (1వ) ఉపపేరాలో నిర్దిష్టపరచబడిన రేటు కంటే హెచ్చు జీతమును తీసుకొనుచుండినచో, సందర్భానుసారముగ అట్టి ముఖ్యన్యాయమూర్తిగ లేక ఇతర న్యాయాధీశునిగా ప్రస్తుత సేవలో గడిపిన

---

1. సంవిధాన (ఇబ్బందుల తొలగింపు) 4వ ఉత్తరువు భారత సంవిధానమునకు గల రెండవ అనుసూచి 26వ జనవరి, 1950 నుండి ఈ క్రింది అనుకూలానుసరణకు లోబడి ప్రభావము కలిగియుండునని నిబంధించుచున్నది, అదేదనగా:–

(2) 10వ పేరా యొక్క (2)వ ఉప పేరాలో ఖండము (బి) తరువాత వచ్చు అన్ని పదములకు బదులు క్రిందివి ఉంచబడవలెను:–

''ప్రతి వ్యక్తియు సందర్భానుసారముగా అట్టి ముఖ్య న్యాయమూర్తిగా, లేక ఇతర న్యాయాధీశుని ప్రస్తుతః సేవలో గడిపిన కాలము విషయము, ఈ పేరా యొక్క ఉప పేరా (1)లో నిర్దిష్టపరచబడిన జీతమునకు అదనముగ, ఆ జీతము, అట్టి ప్రారంభమునకు అవ్యవహితపూర్వము ఆ ప్రావిన్సులో ఉన్నతన్యాయాస్థానము యొక్క సందర్భానుసారముగా, ముఖ్య న్యాయమూర్తికి, లేక ఎవరేని ఇతర న్యాయాధీశునికి చెల్లించదగు జీతము కంటే తక్కువ ఉన్నచో అట్లు తక్కువగు మొత్తము విశేష వేతనముగా పొందుటకు హక్కు కలిగియుండును.''

కాలము విషయమున, సదరు ఉపపేరాలో నిర్దిష్టపరచబడిన జీతమునకు అదనముగ, అట్లు నిర్దిష్టపరచబడిన జీతమునకును, ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహితము పూర్వము అతడు తీసుకొనుచుండిన జీతమునకును గల తేడాకు సమానమగు మొత్తమును ప్రత్యేక వేతనముగ పొందుటకు హక్కు కలిగియుండును.]

[1][(3) సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 ప్రారంభమునకు అవ్యవహితపూర్వము, ఒకటవ అనుసూచి యొక్క భాగము 'బీ'లో నిర్ధిష్టపరచబడిన ఒక రాజ్యము యొక్క ఉన్నత న్యాయస్థానపు ముఖ్య న్యాయమూర్తిగా పదవియందుండి ఆ చట్టము ప్రారంభము కాగానే, సదరు చట్టముచే సవరణ చేయబడినట్లు సదరు అనుసూచిలో నిర్ధిష్టపరచబడిన ఒక రాజ్యము యొక్క ఉన్నత న్యాయస్థానపు ముఖ్య న్యాయమూర్తియైనట్టి ఎవరేని వ్యక్తి, ఆయన తన జీతమునకు అదనముగ ఏదైన మొత్తమును అట్టి ప్రారంభమునకు అవ్యవహితపూర్వము బత్తెముగ తీసుకొనుచుండినచో, అట్టి ముఖ్య న్యాయమూర్తిగా ప్రస్తుత సేవలో గడిపిన కాలము విషయమున ఈ పేరా యొక్క 1వ ఉపపేరాలో నిర్ధిష్టపరచబడిన జీతమునకు అదనముగ అదే మొత్తమున బత్తెముగ పొందుటకు హక్కు కలిగియుండును.]

11. సందర్భము అన్యథా అపేక్షించిననే తప్ప, ఈ భాగములో,-(ఎ) 'ముఖ్య న్యాయమూర్తి' అను పదములో కార్యకారి ముఖ్య న్యాయమూర్తి చేరియుండును, మరియు న్యాయాధీశుడు' అను పదములో తదర్థక న్యాయాధీశుడు చేరియుండును;

(బి) 'వాస్తవః సేవ'లో ఈ క్రిందివి చేరియుండును:-

(i) ఒక న్యాయాధీశుడు న్యాయాధీశునిగా కర్తవ్య నిర్వహణలో లేక రాష్ట్రపతి కోరికపై తాను నిర్వహించుటకు పూనుకొనునట్టి ఇతర కృత్యముల నిర్వహణలో గడిపిన కాలము.

(ii) ఆ న్యాయాధీశుడు సెలవుపై గైరుహాజరైన కాలమును అపవర్జించి, విరామ కాలములు; మరియు

(iii) ఉన్నత న్యాయస్థానము నుండి సర్వోన్నత న్యాయస్థానమునకు, లేక ఒక ఉన్నత న్యాయస్థానము నుండి వేరొక దానికి బదిలీ చేయబడినప్పుడు పదవిలో చేరుటకైన వ్యవధి.

## భాగము – ఈ

## భారతదేశ కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలును గూర్చిన నిబంధనలు

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 25వ పరిచ్ఛేదము ద్వారా ఉప పేరాలు (3) మరియు (4)లకు బదులుగా ఉంచబడినది.

12. (1) భారతదేశ కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలుకు *నాలుగు వేల రూపాయలు రేటు చొప్పున నెలసరి జీతము చెల్లించబడవలెను.

(2) ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహితపూర్వము భారతదేశ ఆడిటరు జనరలు పదవి యందుండి, ఈ సంవిధానము ప్రారంభము కాగానే 377వ అనుచ్ఛేదము క్రింద భారతదేశ కంప్ట్రోలరు, మరియు ఆడిటరు జనరలైనట్టి వ్యక్తి, ఈ పేరా యొక్క 1వ ఉప పేరాలో నిర్దిష్టపరచబడిన జీతమునక అదనముగ, అట్లు నిర్దిష్టపరచబడిన జీతమునకును, ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహితపూర్వము భారతదేశ ఆడిటరు జనరలుగా ఆయన తీసుకొనిచుండిన జీతమునకును గల తేడాకు సమముగ మొత్తమును విశేష వేతనముగ పొందుటకు హక్కు కలిగియుండును.

(3) ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహితపూర్వము భారతదేశ ఆడిటరు జనరలుకు వర్తింపదగియుండిన నిబంధనలే, భారతదేశ కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు యొక్క గైరు హాజరీ సెలవును మరియు పింఛనును గూర్చిన హక్కులకును, ఇతర సేవా షరతులకును, సందర్భానుసారముగ, వర్తించవలెను లేక వర్తించుట కొనసాగవలెను, మరియు ఆ నిబంధనలలో గవర్నరు జనరలును గూర్చిన అన్ని నిర్దేశములు రాష్ట్రపతిని గూర్చిన నిర్దేశములుగ అన్వయించ బడ వలెను.

---

* కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు (విధులు, అధికారములు మరియు సేవా షరతులు) చట్టము, 1971, (1971లోని 56వ చట్టము) యొక్క 3వ పరిచ్ఛేదము ప్రకారం కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలుకు సర్వోన్నత న్యాయస్థానపు న్యాయాధీశుల జీతమునకు సమానముగ చెల్లించబడవలెను. అటు తరువాత నెలకు రెండు లక్షల యాభైవేల రూపాయలుగా సర్వోన్నత న్యాయస్థానము యొక్క న్యాయాధీశునికి జీతము ఉన్నత న్యాయస్థానము మరియు సర్వోన్నత న్యాయస్థానపు న్యాయాధీశుల (జీతము మరియు సేవా షరతులు) సవరణ చట్టము, 2018 (2018లోని 10వది) యొక్క 6వ పరిచ్ఛేదము ద్వారా 22.09.2017 నుండి పెంచబడినది.

## మూడవ అనుసూచి

## [అనుచ్ఛేదములు 75 (4), 99, 124 (6), 148 (2), 164 (3), 188 మరియు 219]*

## ప్రమాణముల లేక ప్రతిజ్ఞల ప్రరూపములు

### I

**సంఘము యొక్క మంత్రి పదవీ ప్రమాణ ప్రరూపము:**

''ఎ.బి. అను నేను శాసనము ద్వారా స్థాపితమైయున్న భారత సంవిధానమువట్ల యదార్థమైన శ్రద్ధ నిష్ఠలను కలిగి యుందుననియు, [1][భారతదేశము యొక్క సార్వభౌమతను మరియు ఆఖండతను సమర్థింతుననియు] సంఘము యొక్క మంత్రిగా నా కర్తవ్యములను శ్రద్ధా పూర్వకముగాను, అంతఃకరణ పూర్వకముగాను నిర్వహింతుననియు మరియు భయ, పక్షపాత, రాగ, ద్వేషరహితముగా సంవిధానమునకును, శాసనమునకును అనుగుణముగా సకల జనులకు న్యాయము చేకూర్చుదుననియు దైవసాక్షిగా ప్రమాణము చేయుచున్నాను/సత్యనిష్ఠతో ప్రతిజ్ఞ చేయుచున్నాను.''

### II

**సంఘము యొక్క మంత్రి రహస్య గోపన ప్రమాణ ప్రరూపము:**

''ఎ.బి.అను నేను, సంఘము యొక్క మంత్రిగా నా పర్యాలోచనకై తేబడునట్టి లేక నాకు తెలియవచ్చునట్టి ఏ విషయమునైనను అట్టి మంత్రిగా నా కర్తవ్యముల యథోచిత నిర్వహణ కొరకు ఆవశ్యకమైననే తప్ప, ఏ వ్యక్తికిగాని వ్యక్తులకుగాని ప్రత్యక్షముగగాని పరోక్షముగగాని తెలియపరచనని లేక వెల్లడించనని దైవసాక్షిగా ప్రమాణము చేయుచున్నాను/సత్యనిష్ఠతో ప్రతిజ్ఞ చేయుచున్నాను.''

### [2][III

### 'ఏ'

**పార్లమెంటు ఎన్నికకు అభ్యర్థిచే చేయబడవలసిన ప్రమాణము లేక ప్రతిజ్ఞ యొక్క ప్రరూపము:**

''ఎ.బి.అను నేను, రాజ్యసభలోని (లేక లోకసభలోని) ఒక స్థానమును పూరించుటకు అభ్యర్థిగా నామనిర్దేశము చేయబడినవాడనై, శాసనము ద్వారా స్థాపితమైన భారత సంవిధానమునెడ యధార్థమైన శ్రద్ధానిష్ఠలను కలిగియుందుననియు, భారతదేశము యొక్క సార్వభౌమతను మరియు అఖండతను సమర్థింతుననియు దైవసాక్షిగా ప్రమాణము చేయుచున్నాను/సత్యనిష్ఠతో ప్రతిజ్ఞ చేయుచున్నాను.''

---

* 84(ఎ) మరియు 173(ఎ) అనుచ్ఛేదములను కూడా చూడుము.

1. సంవిధాన (పదునారవ సవరణ) చట్టము, 1963 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.

2. సంవిధాన (పదునారవ సవరణ) చట్టము, 1963, యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా ప్రరూపము – III బదులుగా ఉంచబడినది.

**‘బి’**

**పార్లమెంటు సభ్యునిచే చేయబడవలసిన ప్రమాణము లేక ప్రతిజ్ఞ యొక్క ప్రరూపము:**

‘‘ఎ.బి. అను నేను, రాజ్యసభ యొక్క (లేక లోకసభ యొక్క) సభ్యునిగ ఎన్నుకొనబడిన (లేక నామనిర్దేశము చేయబడిన) వాడనై, శాసనము ద్వారా స్థాపితమైన భారత సంవిధానము నెడ యధార్థమైన శ్రద్ధానిష్టలను కలిగి యుండుననియు, భారతదేశము యొక్క సార్వభౌమతను మరియు అఖండతను సమర్థింతుననియు, నేను చేపట్టనున్న కర్తవ్యమును శ్రద్ధాపూర్వకముగా నిర్వహింతుననియు దైవసాక్షిగా ప్రమాణము చేయుచున్నాను/సత్యనిష్ఠతో ప్రతిజ్ఞ చేయు చున్నాను.’’

**IV**

**సర్వోన్నత న్యాయస్థానపు న్యాయాధీశులచే మరియు భారతదేశ కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలుచే చేయబడవలసిన ప్రమాణము లేక ప్రతిజ్ఞ యొక్క ప్రరూపము:**

‘‘ఎ.బి.అను నేను, భారతదేశ సర్వోన్నత న్యాయస్థానపు ముఖ్య న్యాయామూర్తిగ (లేక న్యాయాధీశునిగా), (లేక భారతేదశ కంప్ట్రోలరు మరియు అడిటరు జనరలుగా) నియమింపబడినవాడనై, శాసనము ద్వారా స్థాపితమైయున్న భారత సంవిధానమునెడ యధార్థమైన శ్రద్ధానిష్ఠలను కలిగియుందుననియు [1][భారతదేశము యొక్క సార్వభౌమతను మరియు అఖండతను సమర్థింతుననియు], నా పదవీ కర్తవ్యములను భయ, పక్షపాత, రాగ, ద్వేష రహితముగా తగురీతిగను శ్రద్ధాపూర్వకముగను నా సమర్ధత, జ్ఞాన, వివేకముల మేరకు నిర్వర్తింతుననియు, సంవిధానమును, శాసనములను సమర్ధింతుననియు, దైవసాక్షిగా ప్రమాణము చేయుచున్నాను/ సత్యనిష్ఠతో ప్రతిజ్ఞ చేయుచున్నాను.’’

**V**

**రాజ్యము యొక్క మంత్రి పదవి ప్రమాణపు ప్రరూపము:**

‘‘ఎ.బి.అను నేను, శాసనము ద్వారా స్థాపితమైన భారత సంవిధానమునెడ యధార్థమైన శ్రద్ధానిష్ఠలను కలిగియుందుననియు, [1][భారతదేశము యొక్క సార్వభౌమతను మరియు అఖండతను సమర్ధింతుననియు] ................ రాజ్యము యొక్క మంత్రిగ నా కర్తవ్యములను శ్రద్ధాపూర్వకముగను మరియు అంతఃకరణ పూర్వకముగను నిర్వహింతుననియు మరియు భయ, పక్షపాత, రాగ, ద్వేష రహితముగా సంవిధానమునకును, శాసనమునకును అనుగుణముగా సకల జనులకు న్యాయమును చేకూర్తుననియు, దైవసాక్షిగా ప్రమాణము చేయుచున్నాను/సత్యనిష్ఠతో ప్రతిజ్ఞ చేయుచున్నాను.’’

**VI**

**రాజ్యము యొక్క మంత్రి రహస్య గోపన ప్రమాణపు ప్రరూపము:**

‘‘ఎ.బి.అను నేను .................................... రాజ్య మంత్రిగ నా పర్యాలోచనకై తేబడునట్టి లేక నాకు తెలియవచ్చునట్టి ఏ విషయమునైనను అట్టి మంత్రిగ నా కర్తవ్యముల యొక్క యథోచిత

1. సంవిధాన (పదునారవ సవరణ) చట్టము, 1963 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.

నిర్వహణ కొరకు ఆవశ్యకమైననే తప్ప ఏ వ్యక్తికిగాని లేక వ్యక్తులకు గాని ప్రత్యక్షముగనైనను, పరోక్షముగనైనను తెలియపరచనని లేక వెల్లడించనని దైవసాక్షిగ ప్రమాణము చేయుచున్నాను/ సత్యనిష్ఠతో ప్రతిజ్ఞ చేయుచున్నాను.''

[1][VII

**'ఏ'**

**రాజ్యము శాసనమండలి ఎన్నికకై నిలుచు అభ్యర్థిచే చేయబడవలసిన ప్రమాణము లేక ప్రతిజ్ఞ యొక్క ప్రరూపము:**

''ఎ.బి., అను నేను శాసనసభలోని (లేక శాసన పరిషత్తులోని) ఒక స్థానమును పూరించుటకు అభ్యర్థిగా నామనిర్దేశము చేయడినవాడనై శాసనము ద్వారా స్థాపితమైన భారత సంవిధానము నెడ యథార్థమైన శ్రద్ధానిష్ఠలను కలిగియుందుననియు, భారతదేశము యొక్క సార్వభౌమతను మరియు అఖండతను సమర్థింతుననియు, దైవసాక్షిగా ప్రమాణము చేయుచున్నాను/సత్యనిష్ఠతో ప్రతిజ్ఞ చేయుచున్నాను.''

**'బి'**

**రాజ్యము శాసనమండలి సభ్యునిచే చేయబడవలసిన ప్రమాణము లేక ప్రతిజ్ఞ యొక్క ప్రరూపము:**

''ఎ.బి., అను నేను శాసనసభ యొక్క (లేక శాసన పరిషత్తు యొక్క) సభ్యునిగ ఎన్నుకొనబడిన (లేక నామనిర్దేశము చేయబడిన) వాడనై, శాసనము ద్వారా స్థాపితమైన భారత సంవిధానము నెడ యదార్థమైన శ్రద్ధా నిష్ఠలను కలిగి యుండుననియు, భారతదేశము యొక్క సార్వభౌమతను మరియు అఖండతను సమర్థింతుననియు నేను చేపట్టనున్న కర్తవ్యమును శ్రద్ధాపూర్వకముగా నిర్వహింతుననియు దైవసాక్షిగా ప్రమాణము చేయుచున్నాను/సత్యనిష్ఠతో ప్రతిజ్ఞ చేయుచున్నాను.'']

**VIII**

**ఉన్నత న్యాయస్థానపు న్యాయాధీశులచే చేయబడవలసిన ప్రమాణము లేక ప్రతిజ్ఞ యొక్క ప్రరూపము:**

''ఎ.బి., అను నేను .................... అందలి (లేక యొక్క) ఉన్నత న్యాయస్థానపు ముఖ్య న్యాయమూర్తిగా (లేక న్యాయాధీశునిగా) నియమింపబడినవాడనై, శాసనము ద్వారా స్థాపితమైయున్న భారత సంవిధానము నెడ యథార్థమైన శ్రద్ధానిష్ఠలను కలిగియుందుననియు, [2][భారతదేశము యొక్క సార్వభౌమతను మరియు అఖండతను సమర్థింతుననియు] నా పదవీ కర్తవ్యములను భయ, పక్షపాత, రాగ, ద్వేష రహితముగా తగు రీతిగను శ్రద్ధాపూర్వకముగను, నా సమర్థత, జ్ఞాన, వివేకముల మేరకు నిర్వర్తింతుననియు, సంవిధానమును, శాసనములను సమర్థింతుననియు దైవసాక్షిగా ప్రమాణము చేయుచున్నాను/సత్యనిష్ఠతో ప్రతిజ్ఞ చేయు చున్నాను.''

---

1. సంవిధాన (పదునారవ సవరణ) చట్టము, 1963 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా ప్రరూపము ΙΙΙఐకు బదులుగా ఉంచబడినది.
2. సంవిధాన (పదునారవ సవరణ) చట్టము, 1963 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.

# [1][**నాలుగవ అనుసూచి**

## [**అనుచ్ఛేదములు 4(1) మరియు 80 (2)**]

## **రాజ్యసభలో స్థానముల కేటాయింపు**

ఈ క్రింది పట్టిక యొక్క ఒకటవ గడిలో నిర్దిష్టపరచబడిన, సందర్భానుసారముగా ప్రతి రాజ్యమునకు, లేక సంఘ రాజ్యక్షేత్రమునకు, దానికి ఎదురుగా రెండవ గడిలో నిర్దిష్ట పరచబడినన్ని స్థానములు కేటాయించబడవలెను.

**పట్టిక**

| | | |
|---|---|---|
| 1. | ఆంధ్రప్రదేశ్ ........................................................................ | [2][11] |
| [3][2. | తెలంగాణ ........................................................................ | 7] |
| [4][3. | అస్సాము........................................................................ | 7 |
| [4][4. | బీహారు. ........................................................................ | [5][16] |
| [6][[4][5.] | ఝార్ఖండ్ ........................................................................ | 6] |
| [7][[8][[4][6.] | గోవా ........................................................................ | 1] |
| [9][[8][[4][7.] | గుజరాతు ........................................................................ | 11] |
| [10][[8][[4][8.] | హర్యానా ........................................................................ | 5] |
| [8][[4][9.] | కేరళ ........................................................................ | 9 |

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా నాలుగవ అనుసూచికి బదులుగా 01.11.1956 నుండి ఉంచబడినది.
2. ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టము, 2014 (2014లోని 6వది) యొక్క 12వ పరిచ్ఛేదము ద్వారా ‘‘18’’కి బదులుగా 02.06.2014 నుండి ఉంచబడినది.
3. అదే చట్టము ద్వారా చొప్పించబడినది.
4. అదే చట్టము ద్వారా 2 నుండి 30 నమోదులను వరుసగా 3 నుండి 31వ నమోదులుగా తిరిగి అంకెలు వేయడమైనది.
5. బీహారు పునర్వ్యవస్థీకరణ చట్టము, 2000 (2000లోని 30వది) యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా 1.11.2000వ తేదీ నుండి ‘‘22’’కు బదులుగా ఉంచబడినది.
6. అదే చట్టపు 7వ పరిచ్ఛేదము ద్వారా 15.01.2000 నుండి చొప్పించబడినది.
7. గోవా, డామన్ మరియు డయ్యూ పునర్వ్యవస్థీకరణ చట్టము, 1987 (1987లోని 18వది) యొక్క 6వ పరిచ్ఛేదము ద్వారా 30.05.1987 నుండి చొప్పించబడినది.
8. బీహారు పునర్వ్యవస్థీకరణ చట్టము, 2000 (2000లోని 30వది) యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా 15.11.2000 నుండి 4 నుండి 29 వరకు గల నమోదు అంకెలను 5 నుండి 30 అంకెలుగా తిరిగి వేయడమైనది.
9. బొంబాయి పునర్వ్యవస్థీకరణ చట్టము, 1960 (1960లోని 11వది) యొక్క 6వ పరిచ్ఛేదము ద్వారా 01.05.1960 నుండి 4వ నమోదు అంకెను 6గా వేయడమైనది.
10. పంజాబు పునర్వ్యవస్థీకరణ చట్టము, 1966 (1966లోని 31వది) యొక్క 9వ పరిచ్ఛేదము ద్వారా 01.11.1966 నుండి చొప్పించబడినది.

| | | |
|---|---|---|
| [1][2][10.] | మధ్యప్రదేశ్ ............................................................................ | [3][11] |
| [4][1][2][11.] | ఛత్తీస్‌ఘర్............................................................................ | 5 |
| [5][1][2][12.] | తమిళనాడు............................................................................ | [6][18] |
| [7][1][2][13.] | మహారాష్ట్ర............................................................................ | 19] |
| [8][1][2][14.] | కర్నాటక ............................................................................ | 12 |
| [1][2][15. | [9][ఒడిషా ............................................................................ | 10 |
| | ............................................................................ | |
| [1][2][16. | పంజాబు ............................................................................ | [10][7] |
| [1][2][17. | రాజస్థాన్............................................................................ | 10 |
| [1][2][18. | ఉత్తరప్రదేశ్ ............................................................................ | [11][31] |
| [12][1][2][19.] | [13][ఉత్తరాఖండ్ ............................................................................ | 3 |

1. బీహారు పునర్వ్యవస్థీకరణ చట్టము, 2000 (2000లోని 30వది) యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా, 15.11.2000 నుండి 4 నుండి 29 వరకు గల నమోదు అంకెలను 5 నుండి 30 అంకెలుగా తిరిగి వేయడమైనది.
2. ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టము, 2014 (2014లోని 6వది) యొక్క 12వ పరిచ్ఛేదము ద్వారా, 2 నుండి 30 నమోదులను వరుసగా 3 నుండి 31వ నమోదులుగా తిరిగి అంకెలు వేయడమైనది.
3. మధ్యప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టము, 2000 (2000లోని 28వది) యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా, 01.11.2000 నుండి ''16''కు బదులుగా ఉంచబడినది.
4. అదే చట్టపు 7వ పరిచ్ఛేదము ద్వారా 01.11.2000 నుండి చొప్పించబడినది.
5. మద్రాసు రాజ్యపు (పేరు మార్పు) చట్టము, 1968 (1968లోని 53వది) యొక్క 54వ పరిచ్ఛేదము ద్వారా, 14.01.1969 నుండి ''మద్రాసు''కు బదులుగా ''తమిళనాడు'' అని ఉంచబడినది.
6. ఆంధ్రప్రదేశ్ మరియు మద్రాసు (సరిహద్దుల మార్పు) చట్టము, 1959 (1959లోని 56వది) యొక్క 8వ పరిచ్ఛేదము ద్వారా, 01.04.1960 నుండి ''17''కు బదులుగా ఉంచబడినది.
7. బొంబాయి పునర్వ్యవస్థీకరణ చట్టము, 1960 (1960లోని 11వది) యొక్క 6వ పరిచ్ఛేదము ద్వారా, 01.05.1960 నుండి చొప్పించబడినది.
8. మైసూరు రాజ్యపు (పేరు మార్పు) చట్టము, 1973 (1973లోని 31వది) యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా, 01.11.1973 నుండి ''10. మైసూరు''కు బదులుగా ''13 కర్నాటక'' అని ఉంచబడినది.
9. ఒరిస్సా రాజ్యపు (పేరు మార్పు) చట్టము, 2011 (2011లోని 15వది) యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా 01.11.2011 నుండి ''ఒరిస్సా'' అను పదమునకు బదులుగా ఉంచబడినది.
10. పంజాబ్ పునర్వ్యవస్థీకరణ చట్టము, 1966 (1966లోని 31వది) యొక్క 9వ పరిచ్ఛేదము ద్వారా, 01.11.1966 నుండి ''11''కు బదులుగా ఉంచబడినది.
11. ఉత్తరప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టము, 2000 (2000లోని 29వది) యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా, 09.11.2000 నుండి ''34''కు బదులుగా ఉంచబడినది.
12. అదే చట్టపు 7వ పరిచ్ఛేదము ద్వారా 09.11.2000 నుండి చొప్పించబడినది.
13. ఉత్తరాంచల్ (పేరు మార్పు) చట్టము, 2006 (2006లోని 52వది) యొక్క 41వ పరిచ్ఛేదము ద్వారా, 01.01.2007 నుండి ''ఉత్తరాంచల్''కు బదులుగా ఉంచబడినది.

| | | |
|---|---|---|
| [1][[2][20. | పశ్చిమబెంగాల్ ........................................................................ | 16 |
| [1][[2][[3][** *] | * * * .............................................................. * ] | 4 |
| [4][[2][[3][[5][21] 1] | నాగాల్యాండు .............................................................. | 1 |
| [6][[3][[2][[5][22 ]] ]] | హిమాచల్‌ప్రదేశ్ ........................................................... | 3 |
| [3][[2][[5][23.]] | మణిపూర్ ..................................................................... | 1 |
| [3][[2][[5][24] | త్రిపుర ....................................................................... | 1 |
| [3][[2][[5][25.] | మేఘాలయ.................................................................... | 1 |
| [7][[3][[2][[5][26] | సిక్కిం........................................................................ | 1 |
| [8][[3][[2][[5][27] | మిజోరాం .................................................................... | 1 |
| [9][[6][[3][[5][28] | అరుణాచల్‌ప్రదేశ్ ........................................................... | 1 |
| [3][[2][[5][29] | ఢిల్లీ ........................................................................... | 3 |
| [3][[2][[5][30.] | [10][పుదుచ్చేరీ] ................................................................ | 1 |
| [1][31.] | జమ్మూ మరియు కాశ్మీరు .................................................. | 4] |

1. జమ్మూ మరియు కాశ్మీరు పునర్‌వ్యవస్థీకరణ చట్టము, 2019 (2019లోని 34వది) 8వ పరిచ్ఛేదము ద్వారా 31-10-2019 నుండి నమోదు 21 (జమ్మూ మరియు కాశ్మీరు) ను తీసి వేయబడినది.

2. బీహారు పునర్వ్యవస్థీకరణ చట్టము, 2000 (2000లోని 30వది) యొక్క 7వ పరిచ్ఛేదము ద్వారా, 15.11.2000 నుండి 4 నుండి 29 వరకు గల నమోదు అంకెలను 5 నుండి 30 అంకెలుగా తిరిగి వేయడమైనది.

3. ఆంధ్రప్రదేశ్ పునర్వ్యవస్థీకరణ చట్టము, 2014 (2014లోని 6వది) యొక్క 12వ పరిచ్ఛేదము ద్వారా, 2 నుండి 30 నమోదులను వరుసగా 3 నుండి 31వ నమోదులుగా తిరిగి అంకెలు వేయడమైనది.

4. నాగాల్యాండు రాజ్య చట్టము, 1962 (1962లోని 27వది) యొక్క 6వ పరిచ్ఛేదము ద్వారా 01.12.1971 నుండి చొప్పించబడినది.

5. జమ్మూ మరియు కాశ్మీరు పునర్‌వ్యవస్థీకరణ చట్టము, 2019 (2019లోని 34వది) 8వ పరిచ్ఛేదము ద్వారా 31-10-2019 నుండి నమోదులు 22 నుండి 31 వరకు సంఖ్యలను 21 నుండి 30 లుగా ఇదే చట్టం ద్వారా తిరిగి అంకెలు వేయబడినది.

6. హిమాచల్ ప్రదేశ్ రాజ్య చట్టము, 1970 (1970లోని 53వది) యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా 25.01.1971 నుండి చొప్పించబడినది.

7. సంవిధాన (ముప్పది ఆరవ సవరణ) చట్టము, 1975 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 26.04.1975 నుండి చొప్పించబడినది.

8. మిజోరాం చట్టము, 1986 (1986లోని 34వది) యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా 20.02.1987 నుండి చొప్పించబడినది.

9. అరుణాచల్ ప్రదేశ్ చట్టము, 1986 (1986లోని 69వది) యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా 20.02.1987 నుండి చొప్పించబడినది.

10. పాండిచ్చేరి (పేరు మార్పు) చట్టము, 2006(2006లోని 44వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 01.10.2006 నుండి ''పాండిచ్చేరి'' అను పదమునకు బదులుగా ఉంచబడినది.

**మొత్తం**.......................................................   [2] [233]

1 . జమ్మూ మరియు కాశ్మీరు పునర్వ్యవస్థీకరణ చట్టము, 2019 (2019లోని 34వది) 8వ పరిచ్ఛేదము ద్వారా (31–10–2019 నుండి) చొప్పించబడినది.

12. గోవా, డామన్ మరియు డయ్యూ పునర్వ్యవస్థీకరణ చట్టము, 1987 (1987లోని 18వది) యొక్క 6వ పరిచ్ఛేదము ద్వారా 30.05.1987 నుండి ''232'' అను అంకెకు బదులుగా ఉంచబడినది.

# అయిదవ అనుసూచి

**[అనుచ్ఛేదము 244 (1)]**

## అనుసూచిత ప్రాంతముల మరియు అనుసూచిత జనజాతుల పరిపాలనను మరియు నియంత్రణను గూర్చిన నిబంధనలు

### భాగము – ఏ

### సాధారణ విషయములు

**1. అర్థాన్వయము:–** ఈ అనుసూచిలో, సందర్భము అన్యథా అపేక్షించిననే తప్ప ''రాజ్యము'' [1][* * *] అను పదము నందు [2][అస్సాము], [3][* * *], [4][మేఘాలయ, త్రిపుర మరియు మిజోరాం] రాజ్యములు చేరియుండవు.

**2. అనుసూచిత ప్రాంతములలో రాజ్యము యొక్క కార్యపాలకాధికారము:–** ఈ అనుసూచిలోని నిబంధనలకు అధ్యధీనమై, ఒక రాజ్యము యొక్క కార్యపాలకాధికారము, ఆ రాజ్యములోని అనుసూచిత ప్రాంతములకు విస్తరించును.

**3. అనుసూచిత ప్రాంతముల పరిపాలనను గూర్చి రాష్ట్రపతికి గవర్నరు [5][* * *] రిపోర్టు చేయుట:–** అనుసూచిత ప్రాంతములు గల ప్రతి రాజ్యము యొక్క గవర్నరు, [5][* * *] ప్రతి సంవత్సరము, లేక రాష్ట్రపతిచే అపేక్షించబడినప్పుడెల్లను, ఆ రాజ్యములోని అనుసూచిత ప్రాంతముల పరిపాలనను గూర్చి రాష్ట్రపతికి రిపోర్టు చేయవలెను మరియు సదరు ప్రాంతముల పరిపాలనను గూర్చి ఆ రాజ్యమునకు ఆదేశముల నిచ్చుట సంఘము యొక్క కార్యపాలకాధికారములో చేరి యుండును.

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''అనగా ఒకటవ అనుసూచి యొక్క భాగము 'ఏ' లేక భాగము 'బీ'లో నిర్దిష్టపరచబడిన అని అర్థము, కాని'' అను పదములు, అక్షరములు 01.11.1956 నుండి లుప్తము చేయబడినవి.
2. ఉత్తర–ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) ద్వారా ''అస్సాము రాజ్యము''కు బదులుగా 21.01.1972 నుండి ఉంచబడినది.
3. సంవిధాన (నలుబది తొమ్మిదవ సవరణ) చట్టము, 1984 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 01.04.1985 నుండి ''మరియు మేఘాలయ'' అను పదమునకు బదులుగా ఉంచబడినది.
4. మిజోరాం రాజ్య చట్టము, 1986 (1986లోని 34వది) యొక్క 39వ పరిచ్ఛేదము ద్వారా 20.02.1987 నుండి ''మేఘాలయ మరియు త్రిపుర'' అను పదములకు బదులుగా ఉంచబడినది.
5. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజ్యప్రముఖ్'' అను పదములు లుప్తముచేయబడినవి.

## భాగము – బీ

## అనుసూచిత ప్రాంతముల మరియు అనుసూచిత జనజాతుల పరిపాలన మరియు నియంత్రణ.

**4. జనజాతుల సలహా పరిషత్తు:–** (1) అనుసూచిత ప్రాంతములు గల ప్రతి రాజ్యమునందు, మరియు రాష్ట్రపతి అట్లు ఆదేశించినచో, అనుసూచిత ప్రాంతములు లేకున్నను అనుసూచిత జనజాతులు గల రాజ్యమునందు కూడా, ఇరువది మందికి మించని సభ్యులతో కూడినట్టియు, వారిలో వీలైనంత దగ్గరి సంఖ్యలో నాలుగింట మూడువంతుల మంది ఆ రాజ్య శాసనసభలోని అనుసూచిత జనజాతుల ప్రతినిధులైనవారు సభ్యులుగా నున్నట్టియు ఒక జనజాతుల సలహా పరిషత్తు స్థాపించబడవలెను:

అయితే ఆ రాజ్య శాసనసభలోని అనుసూచిత జనజాతుల ప్రతినిధుల సంఖ్య, జనజాతుల సలహా పరిషత్తులో అట్టి ప్రతినిధులచే పూరించబడవలసిన స్థానముల సంఖ్య కంటె తక్కువగనున్నచో, మిగిలిన స్థానములు ఆ జనజాతులకు చెందిన ఇతర వ్యక్తులచే పూరించబడ వలెను.

(2) ఆ రాజ్యములోని అనుసూచిత జనజాతుల శ్రేయస్సుకును పురోభివృద్ధికిని సంబంధించి గవర్నరుచే [1][* * *] తమకు నిర్దేశించబడునట్టి విషయములపై సలహా ఇచ్చుట, జనజాతుల సలహా పరిషత్తు యొక్క కర్తవ్యమై యుండును.

(3) గవర్నరు [2][* * *] ఈ క్రింది వాటిని సందర్భానుసారముగ విహిత మొనర్చుచు, లేక క్రమబద్ధ చేయుచు నియమావళిని చేయవచ్చును.

(ఎ) పరిషత్తు యొక్క సభ్యుల సంఖ్య, వారిని నియమించు పద్ధతి, మరియు ఆ పరిషత్తు యొక్క అధ్యక్షుని, అధికారుల మరియు సేవకుల యొక్క నియామకము;

(బి) దాని సమావేశముల నిర్వహణము మరియు దాని సాధారణ ప్రక్రియ; మరియు

(సి) ఇతర ఆనుషంగిక విషయములన్నియు.

**5. అనుసూచిత ప్రాంతములకు వర్తించదగు శాసనము:–** (1) ఈ సంవిధానములో ఏమి యున్నప్పటికిని, గవర్నరు [1][* * *] బహిరంగ అధిసూచన ద్వారా, అందు పేర్కొనబడిన ఏదేని ఒక పార్లమెంటు చట్టము లేక రాజ్య శాసనమండలి చట్టము ఆ రాజ్యములోని అనుసూచిత ప్రాంతమునకు లేక అందలి ఏదేని భాగమునకు వర్తించరాదని లేక ఆ రాజ్యములోని అనుసూచిత ప్రాంతమునకు లేక అందలి ఏదేని భాగమునకు ఆ అధిసూచనలో తాను నిర్దిష్టపరచెడి మినహాయింపుకును, మార్పులకును అధ్యధీనమై వర్తించవలెనని ఆదేశించవచ్చును మరియు ఈ

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక సందర్భానుసారముగా రాజప్రముఖ్'' అను పదములు 01.11.1956 నుండి లుప్తము చేయబడినవి.
2. అదే చట్టము యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజప్రముఖ్'' అను పదములు లుప్తము చేయబడినవి.

ఉప–పేరా క్రింద ఇవ్వబడిన ఏ ఆదేశమైనను గతకాలిక ప్రభావము కలిగి యుండునదిగ ఇవ్వబడవచ్చును.

(2) రాజ్యములో తత్సమయమున అనుసూచిత ప్రాంతముగాను ఏదేని ప్రాంతము యొక్క శాంతి మరియు సుపరిపాలన కొరకు గవర్నరు [1][* * *] వినిమయములను చేయవచ్చును.

పైన చెప్పబడిన అధికారము యొక్క సాధారణతకు భంగము కలుగకుండ అట్టి వినిమయములు ప్రత్యేకముగ,–

(ఎ) అట్టి ప్రాంతములోని అనుసూచిత జనజాతులకు చెందిన వ్యక్తులలో లేక వారి మధ్య భూమ్యంతరణను నిషేధించవచ్చు లేక పరిమితపరచవచ్చును;

(బి) అట్టి ప్రాంతములోని అనుసూచిత జనజాతులకు చెందిన వ్యక్తులకు భూమి కేటాయింపును క్రమబద్ధము చేయవచ్చును;

(సి) అట్టి ప్రాంతములోని అనుసూచిత జనజాతులకు చెందిన వ్యక్తులకు డబ్బును అప్పిచ్చు వ్యక్తులు సాగించు వడ్డీ వ్యాపారమును క్రమబద్ధము చేయవచ్చును.

(3) ఈ పేరా యొక్క (2)వ ఉపపేరాలో నిర్దేశించబడిన ఏదేని వినియమమును చేయుటలో గవర్నరు, [2][* * *] అట్టి ప్రాంతమునకు తత్సమయమున వర్తించు ఏదేని పార్లమెంటు చట్టమును లేక రాజ్య శాసనమండలి చట్టమును లేక అస్తిత్వములోనున్న ఏదేని శాసనమును రద్దు లేక సవరణ చేయవచ్చును.

(4) ఈ పేరా క్రింద చేయబడిన వినియమములన్నియు వెంటనే రాష్ట్రపతికి సమర్పించబడ వలెను మరియు ఆయన అనుమతించు వరకు అవి ఎట్టి ప్రభావమునైనను కలిగి ఉండరాదు.

(5) ఆ రాజ్యములో జనజాతులతో సహా పరిషత్తు ఉండినచో అట్టి పరిషత్తుతో సంప్రదించిననే తప్ప, ఈ పేరా క్రింద గవర్నరు [1][* * *] ఎట్టి వినియమమునైనను చేయరాదు.

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక రాజప్రముఖ్'' అను పదములు వదలివేయబడినవి.
2. సంవిధాన (ఏడవ సవరణ) 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''లేక సందర్భానుసారముగా రాజప్రముఖ్'' అను పదములు వదలివేయబడినవి.

## భాగము – సీ

## అనుసూచిత ప్రాంతములు

**6. అనుసూచిత ప్రాంతములు:** (1) ఈ సంవిధానములో ''అనుసూచిత ప్రాంతములు'' అనగా రాష్ట్రపతిచే [1] ఉత్తరువు ద్వారా అనుసూచిత ప్రాంతములుగా ప్రఖ్యానించబడిన ప్రాంతములని అర్థం.

(2) రాష్ట్రపతి ఎప్పుడైనను [2] ఉత్తరువు ద్వారా:

(ఎ) ఒక అనుసూచిత ప్రాంతమంతయు గాని, అందలి ఏదైన నిర్దిష్ట భాగము గాని అనుసూచిత ప్రాంతముగా, లేక అట్టి ప్రాంతము యొక్క భాగముగా నుండదని ఆదేశించవచ్చును.

[3] [(ఎఎ) రాజ్యములోని ఏదేని అనుసూచిత ప్రాంతము యొక్క విస్తీర్ణమును ఆ రాజ్య గవర్నరుతో సంప్రదించిన పిమ్మట పెంచవచ్చును;]

(బి) ఏదేని అనుసూచిత ప్రాంతమును, సరిహద్దుల సర్దుబాటు రూపమున మాత్రమే మార్చవచ్చును.

(సి) ఒక రాజ్యము యొక్క సరిహద్దులలో ఏదేని మార్పు చేయబడినప్పుడు గాని, ఒక క్రొత్త రాజ్యము సంఘములో చేర్చుకొనబడినప్పుడుగాని, స్థాపించబడినప్పుడుగాని, ఏదేని రాజ్యమునందు అంతకు పూర్వము చేరియుండని ఏదేని ప్రాంతమును ఒక అనుసూచిత ప్రాంతముగా గాని దానిలో భాగముగాగాని ప్రఖ్యానించవచ్చును.

[4] [(డి) ఏదేని రాజ్యము లేక రాజ్యముల విషయమున ఈ పేరా క్రింద చేయబడిన ఏదేని ఉత్తరువును లేక ఉత్తరువులను రద్దు చేసి అందుకు సంబంధించిన రాజ్య గవర్నరుతో సంప్రదించి, అనుసూచిత ప్రాంతములుగా ఉండవలసిన ప్రాంతములను తిరిగి నిశ్చయించుచు క్రొత్త ఉత్తరువులను చేయవచ్చును;]

---

1. చూడుము: (1) అనుసూచిత క్షేత్రముల (భాగము ''ఏ'' రాజ్యములు) ఉత్తరువు, 1950 (సి.ఓ.9)
   (2) అనుసూచిత క్షేత్రముల (భాగము ''బీ'' రాజ్యములు) ఉత్తరువు, 1950 (సి.ఓ.26)
   (3) అనుసూచిత క్షేత్రముల (హిమాచల్ ప్రదేశ్) ఉత్తరువు, 1975 (సి.ఓ.102)
   (4) అనుసూచిత క్షేత్రముల (బీహార్, గుజరాత్, మధ్యప్రదేశ్ మరియు ఒరిస్సా రాజ్యములు) ఉత్తరువు, 1977 (సి.ఓ.109)
2. అనుబంధములోని మదరాసు అనుసూచిత ప్రాంతముల (సరూపన) ఉత్తరువు, 1950 (సి.ఓ.30) మరియు ఆంధ్ర అనుసూచిత ప్రాంతము (సరూపన) ఉత్తరువు, 1955 (సి.ఓ.50).
3. సంవిధాన అయిదవ అనుసూచి (సవరణ) చట్టము,1976 (1976లోని 101వది) యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 7.9.1976 నుండి చొప్పించబడినది.
4. అదే చట్టము ద్వారా 7.9.1976 నుండి చొప్పించబడినది.

మరియు అట్టి ఏ ఉత్తరువైనను, రాష్ట్రపతికి ఆవశ్యకమనియు, సముచితమనియు తోచునట్టి ఆనుషంగిక మరియు పారిణామిక నిబంధనలను కలిగియుండవచ్చును, కాని పైన చెప్పబడినట్లు తప్ప, ఈ పేరాలోని 1వ ఉపపేరా క్రింద చేయబడిన ఉత్తరువు, ఆ తరువాత ఏదేని ఉత్తరువు ద్వారా మార్చబడరాదు.

## భాగము – డీ

## అనుసూచి సవరణ

**7. అనుసూచి సవరణ:–** (1) పార్లమెంటు ఎప్పటికప్పుడు శాసనము ద్వారా చేర్పు రూపమున, మార్పు రూపమున లేక రద్దు రూపమున ఈ అనుసూచిలోని ఏ నిబంధనలనైనను సవరించ వచ్చును. అట్లు సవరించినప్పుడు ఈ సంవిధానమునందు ఈ అనుసూచిని గూర్చిన ఏ నిర్దేశమైనను, అట్లు సవరించబడిన అనుసూచిని గూర్చిన నిర్దేశముగ అన్వయించబడవలెను.

(2) ఈ పేరాలోని (1)వ ఉపపేరాలో పేర్కొనబడియున్న ఏ శాసనముగాని, 368వ అనుచ్ఛేదము నిమిత్తం ఈ సంవిధాన సవరణగా భావించబడరాదు.

## ఆరవ అనుసూచి

## [అనుచ్ఛేదములు 244 (2) మరియు 275 (1)]

## [1][అస్సాము, మేఘాలయ, త్రిపుర మరియు మిజోరం రాజ్యములలోని] జనజాతి ప్రాంతముల పరిపాలనను గూర్చిన నిబంధనలు

[2]**1. స్వాయత్త జిల్లాలు మరియు స్వాయత్త ప్రాంతములు:–** (1) ఈ పేరా యొక్క నిబంధనలకు అధ్యధీనమై, ఈ అనుసూచి యొక్క 20వ పేరాకు జతపరచబడిన పట్టికలోని [3][[4][భాగములు 1, 2 మరియు 2ఏ] యొక్క ప్రతి అంశములోని మరియు భాగము 3లోని] జనజాతి ప్రాంతములు ఒక స్వాయత్త జిల్లాగా నుండవలెను.

(2) ఒక స్వాయత్త జిల్లాలో విభిన్న అనుసూచిత జనజాతులు ఉన్నచో గవర్నరు బహిరంగ అధిసూచన ద్వారా వారు నివసించు ప్రాంతమునుగాని, ప్రాంతములనుగాని స్వాయత్త ప్రాంతములుగా విభజించవచ్చును.

(3) గవర్నరు బహిరంగ అధిసూచన ద్వారా–

(ఎ) సదరు పట్టిక యొక్క [3][ఏ భాగములోనైనను] ఏదేని ప్రాంతమును చేర్చవచ్చును,

(బి) సదరు పట్టిక యొక్క [3][ఏ భాగములోనైనను] ఏదేని ప్రాంతమును అవవర్జించవచ్చును,

(సి) ఒక క్రొత్త స్వాయత్త జిల్లాను సృష్టించవచ్చును,

(డి) ఏదేని స్వాయత్త జిల్లా విస్తీర్ణమును పెంచవచ్చును,

(ఇ) ఏదేని స్వాయత్త జిల్లా విస్తీర్ణమును తగ్గించవచ్చును,

(ఎఫ్) రెండు లేక రెంటికి మించిన స్వాయత్త జిల్లాలను లేక అందలి భాగములను కలిపి ఒక స్వాయత్త జిల్లాగా ఏర్పరచవచ్చును,

---

1. మిజోరాం రాజ్య చట్టము, 1986 (1986లోని 34వది) యొక్క 39వ పరిచ్ఛేదము ద్వారా 20.2.1987 నుండి కొన్ని పదములకు బదులుగా ఉంచబడినది.
2. అస్సాము రాజ్యమునకు వర్తింపజేయుటకై ఉపపేరాగ్రాఫ్ (2) తరువాత ఈ క్రింది వినాయింపును చొప్పించుటకు సంవిధాన (సవరణ) చట్టము, 2003 (2003లోని 44వది) యొక్క 2వ పరిచ్ఛేదము మరియు ఆరవ అనుసూచి ద్వారా 1వ పేరాగ్రాఫ్ సవరించబడినది. అదేదనగా:–
   ''అయితే ఈ ఉప పేరాగ్రాఫ్‌లో ఉన్నదేదీయు బోడోలాండ్ ప్రాదేశిక ప్రాంతముల జిల్లాకు వర్తించదు''.
3. ఉత్తర–ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 71 (జి)వ పరిచ్ఛేదము మరియు ఎనిమిదవ అనుసూచి ద్వారా ''భాగము ఏ'' కు బదులుగా 21.1.1972 నుండి ఉంచబడినది.
4. సంవిధాన (నలుబది తొమ్మిదవ సవరణ) చట్టము, 1984 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా ''భాగములు 1 మరియు 2 కు'' బదులుగా 1.4.1985 నుండి ఉంచబడినది.

[1][(ఎఫ్.ఎఫ్) ఏదేని స్వాయత్త జిల్లా పేరును మార్చవచ్చును,]

(జి) ఏదేని స్వాయత్త జిల్లా సరిహద్దులను పరినిశ్చయించవచ్చును:

అయితే, ఈ అనుసూచి యొక్క 14వ పేరాలోని (1)వ ఉపపేరా క్రింద నియమించబడిన కమీషను యొక్క రిపోర్టును పర్యాలోచించిన పిమ్మట తప్ప, గవర్నరుచే ఈ ఉపపేరా యొక్క ఖండములు (సి), (డి), (ఇ) మరియు (ఎఫ్) క్రింద ఉత్తరువేదియు చేయబడరాదు.

[2][అంతేగాక, ఈ ఉపపేరా క్రింద గవర్నరుచే చేయబడిన ఏ ఉత్తరువులోనైనను, (20వ పేరా యొక్కయు సదరు పట్టిక యొక్క ఏదేని భాగములోని ఏదేని అంశము యొక్కయు సవరణతో సహా) ఆ ఉత్తరువు యొక్క నిబంధనలను అమలుపరచుటకు ఆవశ్యకమని గవర్నరుకు తోచునట్టి ఆనుషంగిక మరియు పారిణామిక నిబంధనలు ఉంచవచ్చును.]

**[3-4-5]2. జిల్లా పరిషత్తుల యొక్కయు ప్రాంతీయ పరిషత్తుల యొక్కయు సంఘటనము:–**

---

1. అస్సాము పునర్వ్యవస్థీకరణ (మేఘాలయ) చట్టము, 1969 (1969లోని 55వది) యొక్క 74వ పరిచ్ఛేదము మరియు నాలుగవ అనుసూచి ద్వారా 2.4.1970 నుండి చొప్పించబడినది.
2. ఉత్తర–ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 71(జి) వ పరిచ్ఛేదము మరియు ఎనిమిదవ అనుసూచి ద్వారా 21.1.1972 నుండి ఉంచబడినది.
3. అస్సాము రాజ్యమునకు వర్తింపజేయుటకై ఉపపేరా (1) తరువాత ఈ క్రింది వినాయింపు చొప్పించుటకు సంవిధాన (సవరణ) చట్టము, 2003 (2003లోని 44వది) యొక్క 2వ పరిచ్ఛేదము, ఆరవ అనుసూచి ద్వారా 2వ పేరా సవరించబడినది, అదేదనగా:–

   ''అయితే బోడోలాండ్ ప్రాంతీయ పరిషత్తు నలుబది ఆరు కంటె ఎక్కువ కానట్టి సభ్యులతో కూడియుండవలెను, వీరిలో నలుబది మంది వయోజన ఓటు హక్కు ప్రాతిపాదికపై ఎన్నికవ్వబడవలెను. వీటిలో అనుసూచిత జనజాతులకు ముప్పది, జనజాతేతరులకు ఐదు, ఇతర అన్ని సముదాయాలకు ఐదు కేటాయించవలెను మరియు మిగిలిన ఆరుగురు బోడోలాండ్ ప్రాదేశిక ప్రాంతముల జిల్లాలో ప్రాతినిధ్యము లేనటువంటి ఓటు చేయు హక్కుతో సహా సమాన హక్కులు మరియు విశేషాధికారములు కలిగియున్న వారి నుండి గవర్నరుచే నామనిర్దేశము చేయబడవలెను. వీరిలో కనీసము ఇద్దరు మహిళలై ఉండవలెను.''
4. అస్సాము రాజ్యమునకు వర్తింపజేయుటకై ఉప పేరా (3) తరువాత ఈ క్రింది వినాయింపు చొప్పించుటకు సంవిధాన (సవరణ) చట్టము, 1995 (1995లోని 42వది) యొక్క 2వ పరిచ్ఛేదము ఆరవ అనుసూచి ద్వారా 2వ పేరా సవరించబడినది, అదేదనగా:–

   ''అయితే ఉత్తర కాచారు కొండల జిల్లా కొరకు ఏర్పాటైన జిల్లా పరిషత్తును ఉత్తరకాచారు కొండల జిల్లా స్వాయత్త పరిషత్తుగాను, కర్బీ అంగ్‌లాంగ్ జిల్లా కొరకు ఏర్పాటైన జిల్లా పరిషత్తును కర్బీ అంగ్‌లాంగ్ స్వాయత్త పరిషత్తుగాను పిలువబడవలెను.''
5. అస్సాము రాజ్యమునకు వర్తింపజేయుటకై ఉపపేరా (3)లోని వినాయింపు తరువాత ఈ క్రింది వినాయింపు చొప్పించుటకు సంవిధాన (సవరణ) చట్టము, 2003 (2003లోని 44వది) యొక్క 2వ పరిచ్ఛేదము ఆరవ అనుసూచి ద్వారా 2వ పేరా సవరించబడినది. అదేదనగా:–

   ''అయితే ఇంకనూ బోడోలాండ్ ప్రాదేశిక ప్రాంతముల జిల్లా కొరకు ఏర్పాటైన జిల్లా పరిషత్తు బోడోలాండ్ ప్రాదేశిక పరిషత్తుగా పిలువబడవలెను.''

[1][(1) ప్రతీ స్వాయత్త జిల్లాకును, ముప్పది మందికి మించని సభ్యులతో కూడిన ఒక జిల్లా పరిషత్తు ఉండవలెను, ఆ సభ్యులలో నలుగురికి మించని వ్యక్తులు గవర్నరుచే నామ నిర్దేశము చేయబడవలెను. తక్కినవారు వయోజన ఓటు హక్కు ప్రాతిపదికపై ఎన్నుకొనబడవలెను.]

(2) ఈ అనుసూచి యొక్క 1వ పేరాలోని (2)వ ఉపపేరా క్రింద స్వాయత్త ప్రాంతముగ ఏర్పరచబడిన ఒక్కొక్క ప్రాంతమునకు ఒక ప్రాంతీయ పరిషత్తు ఉండవలెను.

(3) ప్రతి జిల్లా పరిషత్తు మరియు ప్రతీ ప్రాంతీయ పరిషత్తు ''క్రమశః (జిల్లా పేరు) యొక్క జిల్లా పరిషత్తు'' మరియు ''(ప్రాంతము పేరు) యొక్క ప్రాంతీయ పరిషత్తు'' అను పేరుతో ఒక నిగమనికాయమై యుండవలెను. అది శాశ్వత ఉత్తరాధికారమును, సామాన్య ముద్రను కలిగి యుండవలెను మరియు సదరు పేరుతో అది దావా వేయవచ్చును లేక దానిపై దావా వేయబడ వచ్చును.

(4) ఈ అనుసూచి యొక్క నిబంధనలకు అధ్యధీనమై, ఒక స్వాయత్త జిల్లా యొక్క పరిపాలన, అది ఆ జిల్లాలోని ఏదేని ప్రాంతీయ పరిషత్తులో ఈ అనుసూచి క్రింద నిహితమై యుండని మేరకు అట్టి జిల్లా యొక్క జిల్లా పరిషత్తులో నిహితమై యుండును మరియు ఒక స్వాయత్త ప్రాంతము యొక్క పరిపాలన, అట్టి ప్రాంతము యొక్క ప్రాంతీయ పరిషత్తులో నిహితమై యుండును.

(5) ప్రాంతీయ పరిషత్తులు గల స్వాయత్త జిల్లాలో, ప్రాంతీయ పరిషత్తు యొక్క ప్రాధికారము క్రింద గల ప్రాంతములను గూర్చి, జిల్లా పరిషత్తు, ఈ అనుసూచి ద్వారా దానికి ప్రదత్తము చేయబడిన అధికారములకు అదనముగా, ప్రాంతీయ పరిషత్తుచే దానికి ప్రత్యాయోజనము చేయబడు అధికారములను మాత్రమే కలిగియుండును.

(6) గవర్నరు, జిల్లా పరిషత్తులను మరియు ప్రాంతీయ పరిషత్తులను మొదటిసారి సంఘటితము చేయుట కొరకు, సంబంధిత స్వాయత్త జిల్లాలలోను లేక ప్రాంతములలోను అస్తిత్వమందున్న జనజాతి పరిషత్తులతో లేక ప్రాతినిధ్యము వహించుచున్న ఇతర జనజాతి వ్యవస్థలతో సంప్రదించి నియమావళిని చేయవలెను మరియు అట్టి నియమావళి ఈ క్రింది విషయముల కొరకు నిబంధనచేయవలెను:–

(ఏ) జిల్లా పరిషత్తు యొక్కయు, ప్రాంతీయ పరిషత్తుల యొక్కయు సంరచన మరియు అందలి స్థానముల కేటాయింపు;

(బి) ఆ పరిషత్తుల ఎన్నికల కొరకు ప్రాదేశిక నియోజక వర్గముల పరిసీమన;

(సి) అట్టి ఎన్నికలలో ఓటు చేయుటకు అర్హతలు, మరియు ఆ ఎన్నికల కొరకు ఓటర్ల జాబితాలు తయారు చేయుట;

(డి) అట్టి ఎన్నికలలో అట్టి పరిషత్తుల సభ్యులుగా ఎన్నుకొనబడుటకు అర్హతలు;

---

1. అస్సాము పునర్వ్యవస్థీకరణ (మేఘాలయ) చట్టము, 1969 (1969లోని 55వది) యొక్క 74వ పరిచ్ఛేదము మరియు నాలుగవ అనుసూచి ద్వారా, ఉపపేరా (1)కి బదులుగా 2.4.1970 నుండి ఉంచబడినది.

(ఇ) [1][ప్రాంతీయ పరిషత్తుల] యొక్క సభ్యుల పదావధి;

(ఎఫ్) అట్టి పరిషత్తులకు జరుగు ఎన్నికలకుగాని నామనిర్దేశములకు గాని సంబంధించిన లేక వాటికి చెందిన ఏదైనా ఇతర విషయము.

(జి) జిల్లా పరిషత్తులోను ప్రాంతీయ పరిషత్తులలోను [2][ఏదైనా ఖాళీ ఉన్నప్పటికిని వ్యవహరించు అధికారముతో సహా] ప్రక్రియ మరియు కార్యకలాప నిర్వాహణ;

(హెచ్) జిల్లా పరిషత్తుల మరియు ప్రాంతీయ పరిషత్తుల అధికారుల యొక్కయు, సిబ్బంది యొక్కయు నియామకము.

[1][(6ఏ) జిల్లా పరిషత్తుల యొక్క ఎన్నుకొనబడిన సభ్యులు, ఆ జిల్లా పరిషత్తు 16వ పేరా క్రింద ఆ లోపున విఘటన చేయబడినవే తప్ప, ఆ పరిషత్తు సాధారణ ఎన్నికల తరువాత దాని మొదటి సమావేశమునకై నియతము చేయబడిన తేదీ నుండి అయిదు సంవత్సరముల కాలావధి వరకు పదవియందుండవలెను మరియు నామనిర్దేశము చేయబడిన సభ్యుడు గవర్నరు యొక్క అనుగ్రహముండునంత వరకు పదవియందుండవలెను:

అయితే ఆత్యయికతను గూర్చిన ఒక అధిప్రఖ్యానము అమలులోనున్నప్పుడు లేక ఎన్నికలు జరుపుటకు అసాధ్య మొనర్చు పరిస్థితులు ఉన్నవని గవర్నరు అభిప్రాయపడినచో, ఒక్కొక్కసారి ఒక్కొక్క సంవత్సరమునకు మించకుండునట్లును, ఆత్యయికతను గూర్చిన అధిప్రఖ్యానము అమలులోనున్నప్పుడు ఏ సందర్భములోను అధిప్రఖ్యానము యొక్క అమలు ఆగిపోయిన తరువాత ఆరు నెలలకు మించకుండునట్లును సదరు ఐదు సంవత్సరముల కాలావధిని గవర్నరు పొడిగించవచ్చును:

అంతేగాక, ఆకస్మికముగ ఏర్పడిన ఒక ఖాళీని పూరించుటకు ఎన్నుకొనబడిన సభ్యుడు, తాను ఎవరి స్థానములో ఎన్నుకోనబడెనో అతని పదవీ కాలావధిలో మిగిలియున్న కాలము వరకు మాత్రమే పదవియందుండవలెను.]

(7) జిల్లా పరిషత్తు లేక ప్రాంతీయ పరిషత్తు, మొదటిసారిగా సంఘటితము చేయబడిన తరువాత ఈ పేరా యొక్క 6వ ఉపపేరాలో నిర్దిష్టమైన విషయములను గురించి [3][గవర్నరు యొక్క ఆమోదముతో] నియమములను చేయవచ్చును మరియు [3][అట్టి ఆమోదముతో] ఈ క్రింది వాటిని క్రమబద్ధము చేయు నియమములను కూడా చేయవచ్చును.

---

1. అస్సాము పునర్వ్యవస్థీకరణ (మేఘాలయ) చట్టము, 1969 (1969లోని 55వది) యొక్క 74వ పరిచ్ఛేదము మరియు నాలుగవ అనుసూచి ద్వారా ''అట్టి పరిషత్తులు'' అనుపదములకు బదులుగా 2.4.1970 నుండి చొప్పించబడినది.
2. అస్సాము పునర్వ్యవస్థీకరణ (మేఘాలయ) చట్టము, 1969 (1969లోని 55వది) యొక్క 74వ పరిచ్ఛేదము మరియు నాలుగవ అనుసూచి ద్వారా 2.4.1970 నుండి చొప్పించబడినది.
3. అదే చట్టము యొక్క 74వ పరిచ్ఛేదము మరియు నాలుగవ అనుసూచి ద్వారా 2.4.1970 నుండి చొప్పించబడినది.

(ఎ) అధీనస్థ స్థానిక పరిషత్తుల లేక బోర్డుల ఏర్పాటు మరియు వాటి ప్రక్రియ మరియు వాటి కార్యకలాప నిర్వహణ; మరియు

(బి) సాధారణముగ, జిల్లా యొక్క లేక సందర్భానుసారముగా ప్రాంతము యొక్క పరిపాలనకు చెందిన కార్యకలాప నిర్వహణమునకు సంబంధించిన అన్ని విషయములు:

అయితే, ఈ ఉపపేరా క్రింద జిల్లా పరిషత్తుచే గాని ప్రాంతీయ పరిషత్తుచేగాని నియమావళి చేయబడువరకు ఈ పేరా యొక్క 6వ ఉపపేరా క్రింద గవర్నరుచే చేయబడు నియమములు, అట్టి ప్రతి పరిషత్తు యొక్క ఎన్నికలను గూర్చియు దాని అధికారులను మరియు సిబ్బందిని గూర్చియు మరియు అందలి ప్రక్రియ మరియు కార్యకలాప నిర్వహణమును గూర్చియు ప్రభావము కలిగియుండవలెను.

[1][* * * * *]

[2-3-4]**3. శాసనములను చేయుటకు జిల్లా పరిషత్తుల మరియు ప్రాంతీయ పరిషత్తుల అధికారములు:–** (1) ఒక స్వాయత్త ప్రాంతము యొక్క ప్రాంతీయ పరిషత్తు అట్టి ప్రాంతము నందలి

---

1. అదే చట్టము యొక్క 74వ పరిచ్ఛేదము మరియు నాలుగవ అనుసూచి ద్వారా 2.4.1970 నుండి రెండవ వినాయింపు వదిలి వేయబడినది.

2. అస్సాము రాజ్యమునకు వర్తింపజేయుటకై సంవిధాన (సవరణ) చట్టము, 2003 (2003లోని 44వది) యొక్క 2వ పరిచ్ఛేదము ఆరవ అనుసూచి ద్వారా ఈ క్రింది విధంగా ఉపపేరా (3)ను ఉంచుటకు 3వ పేరా సవరించబడినది. అదేదనగా,–

''(3) పేరా 3ఏ యొక్క ఉపపేరా (2) లేక పేరా 3బీ యొక్క ఉపపేరా (2)లలో అన్యథా నిబంధించబడిననే తప్ప పేరా 3ఏ యొక్క ఉపపేరాలన్నింటిని వెంటనే గవర్నరుకు సమర్పించవలెను మరియు అవి ఆయనచే ఆమోదించబడనంత వరకు ప్రభావము కలిగియుండవు.'';

3. అస్సాము రాజ్యమునకు వర్తింపజేయుటకై సంవిధాన (సవరణ) చట్టము, 1995 (1995లోని 42వది) యొక్క 2వ పరిచ్ఛేదము ఆరవ అనుసూచి ద్వారా, 3వ పేరా తరువాత క్రింది పేరా చొప్పించబడినది. అదేదనగా–

**''3ఏ. శాసనములు చేయుటకు ఉత్తర కాచారు కొండల స్వాయత్త పరిషత్తు మరియు కర్బీ అంగ్‌లాంగ్ స్వాయత్త పరిషత్తులకు గల అదనపు అధికారములు:–** (1) 3వ పేరాలోని నిబంధనలకు భంగము కలుగకుండ తమ జిల్లాలకు సంబంధించినంత వరకు ఈ క్రింది విషయాలకు సంబంధించిన శాసనములు చేసుకొనుటకు ఉత్తర కాచారు కొండల స్వాయత్త పరిషత్తు మరియు కర్బీ అంగ్‌లాంగ్ స్వాయత్త పరిషత్తులకు అధికారము ఉండును, అవేవనగా–

(ఎ) ఏడవ అనుసూచి యొక్క సూచి–1లోని 7 మరియు 52వ నమోదుల యొక్క నిబంధనలకు అధ్యధీనమైన పరిశ్రమలు.

(బి) సంచార మార్గములు అనగా రోడ్లు, వంతెనలు, బల్లకట్లు మరియు ఏడవ అనుసూచి యొక్క సూచి–1లో నిర్దిష్ట పరచబడని ఇతర సంచార సాధనములు, పురపాలక ట్రామ్వేలు, రజ్జు పథకములు, దేశీయ జలమార్గములను గూర్చి సూచి–1 మరియు సూచి–3 యొక్క నిబంధనలకు అధ్యధీనమై దేశీయ జలమార్గములు మరియు వాటిపై రవాణా, యంత్ర చాలిత వాహనములు మినహా ఇతర వాహనములు.

(సి) పశుగణ పరిరక్షణ, రక్షణ మరియు అభివృద్ధి, జంతురోగములు నివారణ, పశువైద్య ప్రశిక్షణమరియు వృత్తి, పశువుల బందెల దొడ్లు;

(డి) ప్రాథమిక మరియు మాథ్యమిక విద్య;

(ఇ) వ్యవసాయ విద్య మరియు పరిశోధన, చీడపురుగుల నుండి రక్షణ మరియు మొక్కల తెగుళ్ళ నివారణతో సహా, వ్యవసాయము;

(ఎఫ్) మత్స్య క్షేత్రములు;

(జి) ఏడవ అనుసూచి యొక్క సూచి–౩లోని 56వ నమోదులోని నిబంధనలకు అధ్యధీనమై జలము అనగా నీటి పారుదల మరియు కాలువలు, మురుగునీటి పారుదల మరియు పోతగట్లు, జల సంచయము మరియు జలశక్తి.

(హెచ్) సామాజిక భద్రత మరియు సామాజిక భీమా; ఉపాధి కల్పన మరియు నిరుద్యోగము;

(ఐ) గ్రామములు, పంట పొలములు, మార్కెట్లు, పట్టణములు (సాంకేతిక స్వభావము కానట్టి) మొదలైనటువంటి వాటి రక్షణ కొరకైన వరద నివారణ పథకములు;

(జె) ఏడవ అనుసూచి యొక్క సూచి–1లో 60వ నమోదులోని నిబంధనలకు అధ్యధీనమై రంగశాలలు మరియు నాటక ప్రదర్శనలు, చలన చిత్రములు, క్రీడలు, వినోదములు మరియు మనోరంజకములు;

(కె) ప్రజారోగ్య మరియు పారిశుధ్యము, వైద్యశాలలు మరియు ఔషధశాలలు;

(ఎల్) చిన్న తరహా నీటిపారుదల;

(ఎమ్) వ్యాపార, వాణిజ్యములు మరియు ఆహార పదార్థములు, పశుగ్రాసం, ముడిప్రత్తి మరియు ముడి జనపనార ఉత్పాదన, సరఫరా మరియు పంపిణీ;

(ఎన్) గ్రంథాలయములు, వస్తు ప్రదర్శనశాలలు మరియు రాజ్యముచే నియంత్రణ చేయబడిన లేక విత్తము సమకూర్చబడిన ఇతర తాదృశ్యా సంస్థలు; పార్లమెంటుచే చేయబడిన శాసనము ద్వారా లేక దాని క్రింద జాతీయ ప్రాముఖ్యము కలవిగా ప్రఖ్యానించబడినవి మినహా ఇతర ప్రాచీన మరియు చారిత్రక స్మారక చిహ్నములు మరియు రికార్డులు; మరియు

(ఒ) భూమి యొక్క అన్యాక్రాంతము.

(2) ఏడవ అనుసూచి యొక్క సూచి–3లో నిర్దిష్టపరచిన విషయములకు సంబంధించినంత వరకు 3వ పేరా క్రింద లేక ఈ పేరా క్రింద, ఉత్తర కాచారు కొండల స్వాయత్త పరిషత్తు మరియు కర్బీ అంగ్‌లాంగ్ స్వాయత్త పరిషత్తులచే చేయబడిన శాసనములన్నింటిని, వెంటనే గవర్నరుకు సమర్పించవలెను మరియు ఆయన వాటిని రాష్ట్రపతి పర్యాలోచనకు ప్రత్యేకించవలెను.

(3) ఒక శాసనమును రాష్ట్రపతి పర్యాలోచనకు ప్రత్యేకించబడినప్పుడు, రాష్ట్రపతి ఆ శాసనమునకు అనుమతినిచ్చుచున్నానని గాని లేక అనుమతి నిలువరించుచున్నానని గాని ప్రఖ్యానించవలెను:

అయితే రాష్ట్రపతి, ఆ శాసనమును గాని, దానిలోని ఏవైనా నిర్దిష్ట నిబంధనలనుగాని పునః పర్యాలోచించవలెననియు, ప్రత్యేకముగా, తన సందేశములో తాను సిఫారసు చేయు ఏవేని సవరణలు ప్రవేశపెట్టుట వాంచనీయమా అని పర్యాలోచించవలెననియు కోరు సందేశముతో సహా ఆ శాసనమును ఉత్త కాచారు కొండ స్వాయత్త పరిషతు లేక సందర్భానుసారము కర్బీ అంగ్‌లాంగ్ స్వాయత్త పరిషత్తుకు త్రిప్పి పంపవలెనని గవర్నరును ఆదేశించవచ్చును మరియు శాసనము అట్లు త్రిప్పి పంపబడినప్పుడు, సదరు పరిషత్తు అట్టి సందేశము అందిన తేదీ నుండి ఆరు మాసముల కాలావధిలో దానిని తదనుసారముగా పున:రాలోచన చేయవలెను మరియు ఆ శాసనము సవరణతో గాని, సవరణ లేకుండాగాని, సదరు పరిషత్తుచే మరల పాస్ చేయబడిన యెడల, రాష్ట్రపతి పర్యాలోచన కొరకు తిరిగి సమర్పించవలెను.''

4. అస్సాము రాజ్యమునకు వర్తింపజేయుటకై సంవిధాన (సవరణ) చట్టము, 2003, (2003లోని 44వది) యొక్క ఆరవ అనుసూచి ద్వారా పేరా 3ఏ తరువాత ఈ క్రింది పేరా చొప్పించబడినది, అదేదనగా,–

**''3బీ. శాసనము చేయుటకై బోడోలాండ్ ప్రాదేశిక పరిషత్తుకు గల అదనపు అధికారములు:–** (1) 3వ పేరాలోని నిబంధనలకు భంగము కలుగకుండ తమ ప్రాంతములలో ఈ క్రింది విషయాలకు సంబంధించిన శాసనములను చేసుకొనుటకు బోడోల్యాండ్ ప్రాదేశిక పరిషత్తుకు అధికారముండును, అవేవనగా:–

(i) వ్యవసాయ విద్య మరియు పరిశోధన, చీడపురుగుల నుండి రక్షణ మరియు మొక్కల తెగుళ్ళ నివారణతో సహా వ్యవసాయము; (ii) పశుసంవర్ధన మరియు పశువైద్యము అనగా పశుగణ పరిరక్షణ, రక్షణ మరియు అభివృద్ధి, జంతురోగముల నివారణ, పశువైద్య ప్రశిక్షణ మరియు వృత్తి, పశువుల బంజెరు దొడ్లు; (iii) సహకారము; (iv) సాంస్కృతిక వ్యవహారములు; (v) విద్య అనగా ప్రాథమిక విద్య, వ్యవసాయిక ప్రశిక్షణతో సహా ఉన్నత మాధ్యమిక విద్య, వయోజన విద్య, కళాశాల విద్య (సాధారణ); (vi) మత్య క్షేత్రములు; (vii) గ్రామములు, పంటపొలములు, మార్కెట్లు, పట్టణములు (సాంకేతిక స్వభావము కానట్టి) మొదలైనటువంటి వాటి రక్షణ కొరకైన వరద నియంత్రణ; (viii) ఆహార మరియు పౌరసరఫరా; (ix) అడవులు (రిజర్వుడు అడవులు కాకుండా); (x) చేనేత మరియు జౌళి; (xi) ఆరోగ్య మరియు కుటుంబ సంక్షేమము; (xii) ఏడవ అనుసూచి యొక్క సూచి-1లోని 84వ నమోదు యొక్క నిబంధనలకు అధ్యధీనమై మత్తు కలిగించు పానీయములు, నల్లమందు మరియు మత్తు పదార్థములు; (xiii) నీటిపారుదల; (xiv) కార్మిక మరియు ఉపాధి; (xv) భూమి మరియు రాబడి; (vi) (రాజ్యముచే నియంత్రించబడ లేక విత్తము సమకూర్చబడు) గ్రంథాలయ సేవలు; (xvii) (ఏడవ అనుసూచి యొక్క సూచి-1లో 40వ నమోదులోని నిబంధనలకు అధ్యధీనమై) లాటరీలు, (ఏడవ అనుసూచి యొక్క-1లో 60వ నమోదులోని నిబంధనలకు అధ్యధీనమై) రంగశాలలు, నాటక ప్రదర్శనలు మరియు చలనచిత్రములు; (xviii) మార్కెట్లు మరియు సంతలు; (xix) పురపాలక కార్పొరేషన్లు, అభివృద్ధి ట్రస్టులు, జిల్లా బోర్డులు మరియు ఇతర స్థానిక ప్రాధికార సంస్థలు; (xx) పార్లమెంటుచే చేయబడిన శాసనము ద్వారా లేక దాని క్రింద జాతీయ ప్రాముఖ్యము గలవిగా ప్రఖ్యానించబడినవి మినహా రాజ్యముచే నియంత్రించబడు లేక విత్తము సమకూర్చబడు పురావస్తు ప్రదర్శనశాలలు మరియు పురాతత్వీయ సంస్థలు, ఇతర ప్రాచీన మరియు చారిత్రక స్మారక చిహ్నములు మరియు రికార్డులు; (xxi) పంచాయతి మరియు గ్రామీణాభివృద్ధి; (xxii) ప్రణాళిక మరియు అభివృద్ధి; (xxiii) ముద్రణ మరియు స్టేషనరీ; (xxiv) ప్రజారోగ్య ఇంజనీరింగ్; (xxv) ప్రజాపనుల శాఖ; (xxvi) ప్రచారము మరియు ప్రజా సంబంధములు; (xxvii) జనన మరియు మరణముల రిజిస్ట్రీకరణ; (xxviii) సహాయ మరియు పునరావాసము; (xxix) పట్టు పరిశ్రమలు; (xxx) ఏడవ అనుసూచి యొక్క సూచి-1లో 7వ మరియు 52వ నమోదులలోని నిబంధనలకు అధ్యధీనమై చిన్న, కుటీర మరియు గ్రామీణ పరిశ్రమ; (xxxi) సాంఘిక సంక్షేమము;(xxxii) భూసార పరిరక్షణ; (xxxiii) క్రీడముల మరియు యువజన సంక్షేమము; (xxxiv) గణాంకములు; (xxxv) పర్యటన; (xxxvi) రవాణా (రోడ్లు, వంతెనలు, బల్లకట్లు మరియు ఏడవ అనుసూచి యొక్క సూచి-1లో నిర్దిష్టపరచబడని ఇతర సంచార సాధనములు, పురపాలక ట్రామ్వేలు, రజ్జు పథకములు, దేశీయ జలమార్గములు గూర్చి ఏడవ అనుసూచి యొక్క సూచి-1 మరియు సూచి-3 యొక్క నిబంధనల కధ్యధీనమై దేశీయ జలమార్గములు మరియు వాటిపై రవాణా, యంత్ర చాలిత వాహనములు మినహా ఇతర వాహనములు) (xxxvii) రాజ్య ప్రభుత్వముచే నియంత్రించబడు మరియు విత్తము సమకూర్చబడు జనజాతి పరిశోధన సంస్థ; (xxxviii) పట్టణాభివృద్ధి - నగర మరియు పట్టణ ప్రణాళిక; (xxxix) ఏడవ అనుసూచి యొక్క సూచి-1లో 50వ నమోదులోని నిబంధనల కధ్యధీనమై తూనికలు మరియు కొలతలు; మరియు (XL) సాధారణ జనజాతులు మరియు వెనుకబడిన తరగతుల సంక్షేమము;

అయితే, అట్టి శాసనములలో నున్నదేదియు-

(ఎ) ఈ చట్టము ప్రారంభమైన తేదీన ఎవరేని పౌరునికి సంబంధించి అతనికి ఉన్న భూమి హక్కులు మరియు విశేషాధికారములను నిర్వాపన చేయవు లేక మార్చవు; మరియు

(బి) వారసత్వము, కేటాయింపు పరిష్కారము లేక ఏదేని ఇతర విధమైన అంతరణ ద్వారా బోడోలాండ్ ప్రాదేశిక ప్రాంతముల జిల్లా లోపల అట్టి భూమి యొక్క అధ్యార్జనకు అట్టి పౌరుడు అర్హుడైనపుడు, అట్టి పౌరుడిని నిరాకరించదు.

(2) ఏడవ అనుసూచి యొక్క సూచీ-3లో నిర్దిష్టపరచబడిన విషయములకు సంబంధించినంత వరకు ఈ పేరా క్రింద చేయబడిన శాసనములన్నింటిని గవర్నరుకు సమర్పించవలెను, ఆయన వాటిని రాష్ట్రపతి పర్యాలోచనకు ప్రత్యేకించవలెను.

(3) ఒక శాసనమును రాష్ట్రపతి పర్యాలోచనకు ప్రత్యేకించబడినపుడు, రాష్ట్రపతి ఆ శాసనమునకు అనుమతినిచ్చుచున్నాడనిగాని లేక అనుమతిని నిలువరించుచున్నాడనిగాని ప్రఖ్యానించవలెను:

అయితే, పరిషత్తు ఆ శాసనమును గాని, దానిలోని ఏవైనా నిర్దిష్ట నిబంధనలను గాని పున:పర్యాలోచించవలెననియు, ప్రత్యేకముగా, తన సందేశములో తాను సిఫారసు చేయు ఏవేని సవరణలు ప్రవేశపెట్టుట వాంఛనీయమా అని పర్యాలోచించవలెననియు కోరు సందేశముతో సహా, ఆ శాసనమును బోడోలాండ్ ప్రాదేశిక పరిషత్తుకు త్రిప్పి పంపవలెనని రాష్ట్రపతి గవర్నరును ఆదేశించవచ్చును; శాసనము అట్లు త్రిప్పి పంపబడినప్పుడు, సదరు పరిషత్తు అట్టి సందేశము అందిన తేదీ నుండి ఆరు మాసముల కాలావధిలో దానిని తదనుసారముగా పున:పర్యాలోచించవలెను మరియు ఆ శాసనము సవరణతోగాని, సవరణ లేకుండాగాని, పరిషత్తుచే మరల చేయబడి రాష్ట్రపతి పర్యాలోచన కొరకు తిరిగి సమర్పించవలెను.''.

అన్ని ప్రాంతములను గూర్చియు, ఒక స్వాయత్త జిల్లా యొక్క జిల్లా పరిషత్తు ఆ జిల్లాలో ప్రాంతీయ పరిషత్తులేవైన ఉన్నచో వాటి ప్రాధికారము క్రిందనున్న ప్రాంతములు మినహా ఆ జిల్లాలోని మిగతా అన్ని ప్రాంతములను గూర్చియు, ఈ క్రింది వాటి విషయమును శాసనములను చేయుటకు అధికారము కలిగియుండును:–

(ఎ) వ్యవసాయమునకు లేక పశువులను మేపుటకు లేక నివాసమునకు లేక అన్య వ్యవసాయేతర ప్రయోజనము కొరకు లేక ఏదేని గ్రామము లేక పట్టణ వాస్తవ్యుల హితమును పెంపొందించగల ఏదేని అన్య ప్రయోజనము కొరకు రిజర్వు అడవి కానట్టి ఏదేని భూమి యొక్క కేటాయింపు, స్వాధీనము లేక ఉపయోగము లేక ప్రత్యేకింపు:

అయితే, స్వాధీనములోనున్నదైనను, లేనిదైనను ఏదేని భూమి సార్వజనిక ప్రయోజనముల కొరకు తత్సమయమునందు అమలులోనున్న శాసనము ననుసరించి [1][సంబంధించిన రాజ్య ప్రభుత్వముచే] నిర్బంధముగా అధ్యార్జన చేయబడుటను అట్టి శాసనములలో నున్నదేదియు నివారించదు.

(బి) రిజర్వు అడవి కానట్టి ఏదేని అడవి యొక్క నిర్వహణ;

(సి) వ్యవసాయము యొక్క ప్రయోజనము కోరకు ఏదేని కాలువ లేక జల ప్రవాహము యొక్క ఉపయోగము;

(డి) ''ఝూం'' లేక అన్యరూపముల ''పోడు'' సేద్యపు పద్ధతిని క్రమబద్ధము చేయుట;

(ఇ) గ్రామ లేక పట్టణ కమిటీల లేక పరిషత్తుల స్థాపన మరియు వాటి అధికారములు;

(ఎఫ్) గ్రామ లేక పట్టణ పోలీసు, ప్రజారోగ్యము మరియు పారిశుద్ధ్యములతో సహా, గ్రామ లేక పట్టణ పరిపాలనకు సంబంధించిన ఏదేని ఇతర విషయము;

(జి) ముఖ్యుల యొక్క లేక గ్రామ పెద్దల యొక్క నియామకము లేక ఉత్తరాధికారము;

(హెచ్) ఆస్తి వారసత్వము;

[2][(ఐ) వివాహము మరియు విడాకులు;

(జె) సాంఘిక ఆచారములు.

---

1. ఉత్తర–ఈశాన్య రాజ్యముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 71(జి)వ పరిచ్ఛేదము మరియు ఎనిమిదవ అనుసూచి ద్వారా 21.1.1972 నుండి కొన్ని పదములకు బదులుగా ఉంచబడినది.
2. అస్సాము పునర్వ్యవస్థీకరణ (మేఘాలయ) చట్టము, 1969 (1969లోని 55వది) యొక్క 74వ పరిచ్ఛేదము మరియు నాలుగవ అనుసూచి ద్వారా ఖండము (ఐ)కు బదులుగా 2.4.1970 నుండి ఉంచబడినది.

(2) ఈ పేరాలో ''రిజర్వు అడవి'' అనగా అస్సాము అటవీ వినిమయము, 1891 క్రిందగాని లేదా అట్టి ప్రాంతమునందు తత్సమయమున అమలునందున్న ఏదేని ఇతర శాసనము క్రిందగాని రిజర్వు అడవిగానున్న ఏదేని ప్రాంతము అని అర్థము.

(3) ఈ పేరా క్రింద చేయబడు శాసనములన్నియు తక్షణమే గవర్నరుకు సమర్పించబడ వలెను, మరియు ఆయనచే అనుమతించబడు వరకు అవి ఎట్టి ప్రభావము కలిగియుండరాదు.

[1]**4. స్వాయత్త జిల్లాలలో మరియు స్వాయత్త ప్రాంతములలో న్యాయ పరిపాలన:–** (1) ఒక స్వాయత్త ప్రాంతము యొక్క ప్రాంతీయ పరిషత్తు, అట్టి ప్రాంతమునందలి ప్రాంతములను గూర్చి, మరియు ఒక స్వాయత్త జిల్లా యొక్క జిల్లా పరిషత్తు, ఆ జిల్లాలో ప్రాంతీయ పరిషత్తులేవైనా ఉన్నచో వాటి ప్రాధికారము క్రిందనున్న ప్రాంతములు మినహా, ఆ జిల్లాలోని ఇతర ప్రాంతములను గూర్చి, ఈ అనుసూచి యొక్క 5వ పేరాలోని 1వ ఉపపేరా యొక్క నిబంధనలు వర్తించు దావాలు, కేసులు కానట్టివియు, అట్టి ప్రాంతములలోని అనుసూచిత జనజాతులకే చెందిన పక్షకారుల మధ్య ఏర్పడినట్టియు అగు అన్య దావాలను, కేసులను విచారణ చేయుటకు రాజ్యములోని ఏ న్యాయస్థానమునైనను అపవర్జించి గ్రామ పరిషత్తులను గాని న్యాయస్థానములను గాని సంఘటితవరచవచ్చును, మరియు అట్టి గ్రామ పరిషత్తుల యొక్క సభ్యులుగా అట్టి న్యాయస్థానములలో అధ్యక్షత వహించు అధికారులుగా ఉండుటకు తగిన వ్యక్తులను నియమించవచ్చును, మరియు ఈ అనుసూచి యొక్క 3వ పేరా క్రింద చేయబడు శాసనములను అమలుపరచుటకు ఆవశ్యకమగు అధికారులను కూడా నియమించవచ్చును.

(2) ఈ సంవిధానములో ఏమియున్నప్పటికిని, ఒక స్వాయత్త ప్రాంతము యొక్క ప్రాంతీయ పరిషత్తు, లేక ప్రాంతము పరిషత్తుచే తద్విషయమై సంఘటితము చేయబడు ఏదేని న్యాయస్థానము లేక స్వాయత్త జిల్లాయందలి ఏ ప్రాంతమునకైనను ప్రాంతీయ పరిషత్తు లేనిచో అట్టి జిల్లా యొక్క జిల్లా పరిషత్తు, లేక జిల్లా పరిషత్తుచే తద్విషయమై సంఘటితము చేయబడు ఏదేని న్యాయస్థానము, ఈ అనుసూచి యొక్క 5వ పేరాలోని 1వ ఉపపేరా యొక్క నిబంధనలు వర్తించునవి మినహా, ఈ పేరా యొక్క 1వ ఉపపేరా క్రింద, సందర్భానుసారముగా అట్టి ప్రాంతములో లేక క్షేత్రములో సంఘటితము చేయబడిన గ్రామ పరిషత్తుచే గాని న్యాయస్థానముచేగాని విచారణ చేయబడదగినట్టి ఇతర దావాలు మరియు కేసులన్నింటి విషయమున అప్పీలు న్యాయస్థానమునకుగల అధికారములను వినియోగించవలెను, మరియు అట్టి దావాలపై లేక కేసులపై ఉన్నత న్యాయస్థానము మరియు సర్వోన్నత న్యాయస్థానము తప్ప ఇతర న్యాయస్థానమేదియు అధికారితను కలిగియుండరాదు.

---

1. అస్సాము రాజ్యమునకు వర్తింపజేయుటకై ఉపపేరా (5) తరువాత ఈ క్రింది ఉపపేరాను చొప్పించుటకు వీలుగా, సంవిధాన (సవరణ) చట్టము, 2003 (2003లోని 44వది) యొక్క 2వ పరిచ్ఛేదము మరియు ఆరవ అనుసూచి ద్వారా 4వ పేరా సవరించబడినది, అదేదనగా:–

''(6) ఈ పేరాలో ఉన్నదేదియూ, ఈ అనుసూచి యొక్క 2వ పేరాలోని ఉపపేరా (3)కు గల వినాయింపు క్రింద సంఘటితము చేయబడిన బోడోలాండ్ ప్రాదేశిక ప్రాంతముల పరిషత్తుకు వర్తించదు.''.

(3) [1][* * * *] ఉన్నత న్యాయస్థానము ఈ పేరా యొక్క 2వ ఉపపేరాలోని నిబంధనలు వర్తించునట్టి దావాలపైనను మరియు కేసులపైనను, గవర్నరు ఉత్తరువు ద్వారా ఆయా సమయములందు నిర్దిష్టపరచునట్టి అధికారితను కలిగియుండవలెను మరియు దానిని వినియోగించవలెను.

(4) ప్రాంతీయ పరిషత్తు లేక సందర్భానుసారముగా జిల్లా పరిషత్తు, గవర్నరు యొక్క పూర్వానుమోదముతో ఈ క్రింది విషయములను క్రమబద్ధము చేయు నియమావళిని చేయవచ్చును,–

(ఎ) గ్రామ పరిషత్తుల యొక్కయు, న్యాయస్థానముల యొక్కయు, సంఘటన మరియు ఈ పేరా క్రింద వాటిచే వినియోగించబడవలసిన అధికారములు;

(బి) ఈ పేరా యొక్క 1వ ఉప-పేరా క్రింద దావాలను మరియు కేసులను విచారణ చేయుటలో గ్రామ పరిషత్తులు లేక న్యాయస్థానములు అనుసరించవలసిన ప్రక్రియ;

(సి) ఈ పేరా యొక్క 2వ ఉప-పేరా క్రింద అపీళ్ళలోను, ఇతర చర్యలలోను ప్రాంతీయ పరిషత్తు లేక జిల్లా పరిషత్తు లేక అట్టి పరిషత్తుచే సంఘటితము చేయబడిన ఏదేని న్యాయ స్థానము అనుసరించవలసిన ప్రక్రియ;

(డి) అట్టి పరిషత్తుల యొక్కయు, న్యాయస్థానము యొక్కయు నిర్ణయములను మరియు ఉత్తరువులను అమలు పరచుట;

(ఇ) ఈ పేరా యొక్క (1)వ మరియు (2)వ ఉప-పేరా నిబంధనలను అమలుపరచుటలో సహాయకమగు ఇతర విషయములన్నియు;

[2][(5) [3][సంబంధించిన రాజ్య ప్రభుత్వముతో సంప్రదించిన పిమ్మట], రాష్ట్రపతి అధిసూచన ద్వారా ఈ విషయమై నియతముచేయు తేదీన మరియు అట్టి తేదీ నుండి, ఆ అధిసూచనలో నిర్దిష్టపరచబడు స్వాయత్త జిల్లాకు లేక ప్రాంతమునకు సంబంధించి ఈ క్రింది మార్పు లేక సవరణ చేయబడినట్లు ఈ పేరా ప్రభావము కలిగియుండవలెను:

(i) (1)వ ఉపపేరాలో ''ఈ అనుసూచి యొక్క 5వ పేరాలోని (1)వ ఉపపేరా యొక్క నిబంధనలు వర్తించు దావాలు, కేసులు కానట్టివియు, అట్టి ప్రాంతములలోని అనుసూచిత జనజాతులకే చెందిన పక్షకారుల మధ్య ఏర్పడినట్టియు ''అగు అన్య'' అను పదబంధమునకు బదులుగా ''ఈ విషయమై గవర్నరు నిర్దిష్టపరచునట్టి, ఈ అనుసూచి యొక్క 5వ పేరాలోని (1)వ

---

1. ఉత్తర-ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 71(i)వ పరిచ్ఛేదము మరియు ఎనిమిదవ అనుసూచి ద్వారా 21.1.1972 నుండి ''అస్సాము'' అను పదము వదిలివేయబడినది.

2. అస్సాము పునర్వ్యవస్థీకరణ (మేఘాలయ) చట్టము, 1969 (1969లోని 55వది) యొక్క 74వ పరిచ్ఛేదము మరియు నాలుగవ అనుసూచి ద్వారా 2.4.1970 నుండి ఉంచబడినది.

3. ఉత్తర-ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 71(i)వ పరిచ్ఛేదము మరియు ఎనిమిదవ అనుసూచి ద్వారా 21.1.1972 నుండి కొన్ని పదములకు బదులుగా ఉంచబడినది.

ఉపపేరాలో నిర్దేశించిన స్వభావము గల దావాలు మరియు కేసులు కానట్టి'' అను పదబంధము ఉంచబడినట్లు;

(ii) (2)వ మరియు (3)వ ఉవ-పేరాలు లుప్తము చేయబడినట్లు;

(iii) (4)వ ఉప-పేరాలో,-

(ఎ) ''ప్రాంతీయ పరిషత్తు లేక సందర్భానుసారముగా జిల్లా పరిషత్తు, గవర్నరు యొక్క పూర్వామోదముతో ఈ క్రింది విషయములను క్రమబద్ధము చేయు నియమావళిని చేయవచ్చును'' అను పదబంధములకు బదులుగా ''గవర్నరు ఈ క్రింది విషయములను క్రమబద్ధము చేయు నియమావళిని చేయవచ్చును'' అను పదబంధము ఉంచబడినట్లు; మరియు

(బి) ఖండము (ఎ)కు బదులుగా ఈ క్రింది ఖండము ఉంచబడినట్లు; అదేదనగా,-

''(ఎ) గ్రామ పరిషత్తుల యొక్కయు, న్యాయస్థానముల యొక్కయు సంఘటనము, ఈ పేరా క్రింద వాటిచే వినియోగించబడవలసిన అధికారములు మరియు గ్రామ పరిషత్తుల మరియు న్యాయస్థానముల నిర్ణయములపై ఏ న్యాయస్థానములకు అప్పీలు చేసికొననగునో ఆ న్యాయస్థానములు''.

(సి) ఖండము (సి)కి బదులు ఈ క్రింది ఖండము ఉంచబడినట్లు; అదేదనగా-

''(సి) ప్రాంతీయ, లేక జిల్లా పరిషత్తు సమక్షమున, లేక అట్టి పరిషత్తుచే సంఘటితము చేయబడిన ఏదైనా న్యాయస్థానము సమక్షమున, (5)వ ఉప-పేరా క్రింద రాష్ట్రపతిచే నియతము చేయబడిన తేదీకి అవ్యవహిత పూర్వము జరుగుచుండిన అప్పీళ్ల యొక్కయు, ఇతర చర్యల యొక్కయు అంతరణ'' మరియు

(డి) ఖండము (ఇ)లో ''(1)వ మరియు (2)వ ఉప-పేరాలు'' అను పదములు బ్రాకెట్లు మరియు అంకెలకు బదులు ''(1)వ ఉప-పేరా'' అను పదము, బ్రాకెటు మరియు అంకె ఉంచబడినట్లు.]

**5. కొన్ని దావాలను కేసులను మరియు అపరాధములను విచారణ చేయు ప్రాంతీయ పరిషత్తులకును జిల్లా పరిషత్తులకును కొన్ని న్యాయస్థానములకును, కొందరు అధికారులకును, సివిలు ప్రక్రియా స్మృతి, 1908 క్రింద మరియు [1] క్రిమినలు ప్రక్రియా స్మృతి, 1898 క్రింది అధికారములను ప్రదత్తము చేయుట:-** (1) ఏదేని స్వాయత్త జిల్లా, లేక ప్రాంతములో అమలునందుండి, తద్విషయమై గవర్నరుచే నిర్దిష్టపరచబడిన ఏదేని శాసనము నుండి ఏర్పడు దావాల యొక్క లేక కేసుల యొక్క విచారణకై లేక భారత శిక్షా స్మృతి క్రిందగాని, అట్టి జిల్లాకు లేక ప్రాంతమునకు తత్సమయమున వర్తించదగిన ఏదేని ఇతర శాసనము క్రింద గాని మరణశిక్ష లేక యావజ్జీవ ద్వీపాంతరవాసము, లేక అయిదు సంవత్సరములకు తక్కువ కాని కారాగారవాసము విధింపబడదగిన అపరాధముల విచారణకై గవర్నరు, అట్టి జిల్లా లేక ప్రాంతముపై ప్రాధికారముగల జిల్లా పరిషత్తుకు లేక ప్రాంతీయ పరిషత్తుకు, లేక అట్టి జిల్లా పరిషత్తుచే సంఘటితము చేయబడిన

---

1. ఇప్పుడు క్రిమినలు ప్రక్రియా స్మృతి, 1973 (1974లోని 2వ చట్టము) చూడుము.

న్యాయస్థానములకు లేక తద్విషయమై గవర్నరుచే నియమించబడిన ఎవరేని అధికారికి సందర్భానుసారముగా సివిలు ప్రక్రియా స్మృతి, 1908 క్రింద లేక [1]క్రిమినల్ ప్రక్రియా స్మృతి, 1898 క్రింద ఆయన సముచితమని భావించు అధికారములను ప్రదత్తము చేయవచ్చును మరియు అటుపై సదరు పరిషత్తు, న్యాయస్థానము లేక అధికారి అట్లు ప్రదత్తము చేయబడిన అధికారములను వినియోగించుచు ఆ దావాలను కేసులను లేక అపరాధములను విచారణ చేయవలెను.

(2) గవర్నరు ఈ పేరా యొక్క (1)వ ఉప-పేరా క్రింద జిల్లా పరిషత్తుకు, ప్రాంతీయ పరిషత్తుకు, న్యాయస్థానమునకు లేక అధికారికి ప్రదత్తము చేయబడిన అధికారములలో దేనినైనను ఉపసంహరించవచ్చును లేక మార్చవచ్చును.

(3) ఈ పేరాలో అభివ్యక్తముగా నిబంధించబడినట్లు తప్ప, ఈ పేరా యొక్క నిబంధనలు వర్తించునట్టి ఏదేని స్వాయత్త జిల్లాలోగాని ఏదేని, స్వాయత్త ప్రాంతములోగాని, దావాల, కేసుల లేక అపరాధముల విచారణకు సివిలు ప్రక్రియా స్మృతి, 1908 మరియు [1]క్రిమినలు ప్రక్రియా స్మృతి, 1898 వర్తించరాదు.

[2][(4) ఏదేని స్వాయత్త జిల్లాకు లేక స్వాయత్త ప్రాంతమునకు సంబంధించి 4వ పేరాలోని (5)వ ఉప-పేరా క్రింద రాష్ట్రపతిచే నియతము చేయబడిన తేదీన మరియు ఆ తేదీ నుండి ఈ పేరాలోనున్నదేదియు, ఆ జిల్లాకు లేక ఆ ప్రాంతమునకు వర్తించుటలో, ఆ జిల్లా పరిషత్తుకు లేక ఆ ప్రాంతీయ పరిషత్తుకు లేక జిల్లా పరిషత్తుచే సంఘటితము చేయబడిన న్యాయస్థానములకు ఈ పేరా యొక్క (1)వ ఉప-పేరాలో నిర్దేశించబడిన ఏ అధికారమును గాని ప్రదత్తము చేయుటకు గవర్నరుకు ప్రాధికారమిచ్చునదిగా భావింపరాదు.]

[3][**6. ప్రాథమిక పాఠశాలలు మున్నగునవి స్థాపించుటకు జిల్లా పరిషత్తుకుగల అధికారములు:-** (1) ఏదేని స్వాయత్త జిల్లా యొక్క జిల్లా పరిషత్తు, ఆ జిల్లాలో ప్రాథమిక పాఠశాలలను, వైద్య శాలలను, మార్కెట్లను, [4][బందెల దొడ్లకు] బల్లకట్లను, మత్స్యక్షేత్రములను, రోడ్లను, రోడ్డు, రవాణాను మరియు జలమార్గములను స్థాపించవచ్చును నిర్మించవచ్చును లేక నిర్వహించవచ్చును, మరియు వాటిని క్రమబద్ధపరచుటకును నియంత్రించుటకును గవర్నరు యొక్క పూర్వనమోదముతో నియమములను చేయవచ్చును మరియు ప్రత్యేకముగా ఆ జిల్లాలోని ప్రాథమిక పాఠశాలలో ప్రాథమిక విద్య ఏ భాషలో మరియు ఏ రీతిగా గరుపబడవలెనో విహితము చేయవచ్చును.

---

1. ఇప్పుడు క్రిమినలు ప్రక్రియా స్మృతి, 1973 (1974లోని 2వ చట్టము) చూడుము.
2. అస్సాము పునర్వ్యవస్థీకరణ (మేఘాలయ) చట్టము, 1969 (1969లోని 55వది) యొక్క 74వ పరిచ్ఛేదము మరియు నాలుగవ అనుసూచి ద్వారా 2.4.1970 నుండి ఉంచబడినది.
3. అదే చట్టము యొక్క 74వ పరిచ్ఛేదము మరియు నాలుగవ అనుసూచి ద్వారా 2.4.1970 నుండి 6వ పేరాకు బదులుగా ఉంచబడినది.
4. రద్దు మరియు సవరణ చట్టము, 1974 (1974లోని 56వది) యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా ''cattle ponds''కు బదులుగా 20.12.1974 నుండి ఉంచబడినది.

(2) వ్యవసాయము, పశుసంవర్ధన, కమ్యూనిటీ ప్రాజెక్టులు, సహకార సంఘములు , సాంఘిక సంక్షేమము, గ్రామ ప్రణాళికా రచన లేక [1][......] రాజ్యము యొక్క కార్యపాలకాధికారములలో చేరియున్న ఏదైన ఇతర విషయమునకు సంబంధించిన కృత్యములను గవర్నరు షరతుగాగాని భేషరతుగాగాని, ఏదేని జిల్లా పరిషత్తు సమ్మతితో దానికి లేక దాని అధికారులకు అప్పగించవచ్చును.]

**7. జిల్లా మరియు ప్రాంతీయ నిధులు:–** (1) ప్రతి స్వాయత్త జిల్లాకు ఒక జిల్లా నిధియు మరియు ప్రతి స్వాయత్త ప్రాంతమునకు ఒక ప్రాంతీయ నిధియు సంఘటితము చేయబడవలెను. అట్టి జిల్లానుగాని, ప్రాంతమునుగాని ఈ సంవిధాన నిబంధనలననుసరించి పరిపాలించుటలో క్రమశః ఆ జిల్లా యొక్క జిల్లా పరిషత్తుచేగాని, ఆ ప్రాంతము యొక్క ప్రాంతీయ పరిషత్తుచేగాని పుచ్చుకొనబడిన ధనవంతయు సందర్భానుసారముగా జిల్లా నిధికి లేక ప్రాంతీయ నిధికి జమకట్టబడవలెను.

[2][(2) సందర్భానుసారముగా జిల్లా నిధి యొక్క లేక ప్రాంతీయ నిధి యొక్క నిర్వహణ కొరకు మరియు సదరు నిధికి ధనమును చెల్లించుటను, దాని నుండి ధనమును తిరిగి తీసుకొనుటను గూర్చి అనుసరించవలసిన ప్రక్రియను, అందలి ధనము, అభిరక్ష మరియు పూర్వోక్త విషయములకు సంబంధించిన లేక సహాయకరమగు ఏదేని విషయమును గూర్చి గవర్నరు నియమములను చేయవచ్చును.]

(3) జిల్లా పరిషత్తు యొక్క లేక సందర్భానుసారముగా ప్రాంతీయ పరిషత్తు యొక్క లెక్కలు, రాష్ట్రపతి యొక్క ఆమోదముతో భారతదేశ కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు విహిత పరచునట్టి ప్రరూపములో వ్రాసి ఉంచబడవలెను.

(4) కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు, జిల్లా మరియు ప్రాంతీయ పరిషత్తుల లెక్కలను తాను సబబని తలచునట్టి రీతిగా ఆడిటు చేయించవలెను మరియు అట్టి లెక్కలకు సంబంధించిన కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు యొక్క రిపోర్టులు గవర్నరుకు సమర్పించబడవలెను, గవర్నరు ఆ రిపోర్టులను పరిషత్తు సమక్షమున ఉంచు ఏర్పాటు చేయించవలెను.]

**8. భూమి శిస్తును నిర్ధారణ చేయుటకును, వసూలు చేయుటకును, మరియు పన్నులను విధించుటకును అధికారము:–** (1) ఒక స్వాయత్త ప్రాంతము యొక్క ప్రాంతీయ పరిషత్తు, ఆ ప్రాంతమునందలి భూములన్నింటిని గూర్చి మరియు ఒక స్వాయత్త జిల్లా యొక్క జిల్లా పరిషత్తు, ఆ జిల్లాలో ప్రాంతీయ పరిషత్తులేవైన ఉన్నచో వాటి ప్రాధికారము క్రింది ప్రాంతములలోని భూములు

---

1. ఉత్తర–ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 71(1)వ పరిచ్ఛేదము మరియు ఎనిమిదవ అనుసూచి ద్వారా, 21.1.1972 నుండి ‘‘సందర్భానుసారముగా అస్సాము లేక మేఘాలయ’’ అను పదములు వదిలి వేయబడినవి.
2. అస్సాము పునర్వ్యవస్థీకరణ (మేఘాలయ) చట్టము, 1969 (1969లోని 55వది) యొక్క 74వ పరిచ్ఛేదము మరియు నాలుగవ అనుసూచి ద్వారా 2.4.1970 నుండి ఉపపేరా (2)కు బదులుగా ఉంచబడినది.

మినహా, ఆ జిల్లాలోని ఇతర భూములన్నింటిని గూర్చియు, [1][సాధారణముగ రాజ్యములో భూమి శిస్తు నిర్ధారణ చేయుటలో రాజ్య ప్రభుత్వముచే] తత్సమయమున అనుసరించబడుచుండిన సూత్రములననుసరించి శిస్తును నిర్ధారణ చేయుటకును వసులు చేయుటకును అధికారము కలిగియుండును.

(2) ఒక స్వాయత్త ప్రాంతము యొక్క ప్రాంతీయ పరిషత్తు, ఆ ప్రాంతమునందలి ప్రాంతములను గూర్చి మరియు ఒక స్వాయత్త జిల్లా యొక్క జిల్లా పరిషత్తు, ఆ జిల్లాలో పరిషత్తులేవైనా ఉన్నచో వాని ప్రాధికారము క్రింది ప్రాంతముల మినహా ఆ జిల్లాలోని ఇతర ప్రాంతీయ ప్రాంతములన్నింటిని గూర్చి భూములపైనను భవనములపైనను, పన్నులను మరియు అట్టి ప్రాంతములందు నివసించుచున్న వ్యక్తులపైన రహదారి పన్నులను విధించుటకును, వసూలు చేయుటకును అధికారము కలిగియుండును.

(3) ఒక స్వాయత్త జిల్లా యొక్క జిల్లా పరిషత్తు అట్టి జిల్లాలో, ఈ క్రింది పన్నులనన్నింటినిగాని వాటిలో వేటినిగాని విధించుటకును, వసూలు చేయుటకును అధికారము కలిగియుండును, అదేదనగా,-

(ఎ) వృత్తులు, వ్యాపారములు, ఆజీవికలు మరియు ఉద్యోగములపై పన్నులు;

(బి) జంతువులు, వాహనములు మరియు పడవలపై పన్నులు;

(సి) సరకులను విక్రయించుట కొరకు మార్కెట్టులోనికి తెచ్చుటపై పన్నులు మరియు బల్లకట్లలో కొనిపోబడు ప్రయాణికులపైనను సరకులపైనను రహదారి పన్నులు; [2][* * *]

(డి) పాఠశాలలు, ఔషధశాలల మరియు రోడ్ల నిర్వహణ కొరకైన పన్నులు; [3][మరియు]

[4][(ఇ) వినోదము మరియు మనోరంజక సాధనములపై పన్ను.]

(4) సందర్భానుసారముగా ప్రాంతీయ పరిషత్తు లేక జిల్లా పరిషత్తు, ఈ పేరా యొక్క (2)వ మరియు (3)వ ఉప-పేరాలలో నిర్దిష్టపరచబడియున్న పన్నులలో వేటినైనను విధించుటను మరియు వసూలు చేయుటను నిబంధించుటకు వినిమయములను చేయవచ్చును [5][మరియు అట్టి ప్రతియొక్క

---

1. ఉత్తర-ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 71 (1)వ పరిచ్ఛేదము మరియు ఎనిమిదవ అనుసూచి ద్వారా 21.1.1972 నుండి కొన్ని పదములకు బదులుగా ఉంచబడినది.
2. సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 16(i)వ పరిచ్ఛేదము ద్వారా,16.9.2016 నుండి వదిలివేయబడినది.
3. అదే చట్టము యొక్క 16(ii)వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.
4. అదే చట్టము యొక్క 16(iii)వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినది.
5. అస్సాము పునర్వ్యవస్థీకరణ (మేఘాలయ) చట్టము, 1969 (1971లోని 55వది) యొక్క 74వ పరిచ్ఛేదము మరియు నాలుగవ అనుసూచి ద్వారా 2.4.1970 నుండి చొప్పించబడినది.

వినిమయము వెంటనే గవర్నరుచే సమర్పించబడవలెను, మరియు ఆయనచే అనుమతి ఈయబడువరకు అది ఎట్టి ప్రభావమును కలిగి యుండరాదు.]

[1]**9. ఖనిజములను కనుగొనుటకును లేక వాటిని వెలికి తీయుటకును లైసెన్సులు లేక కౌళ్లు:–** (1) ఒక స్వాయత్త జిల్లాలోని ఏదేని ప్రాంతమును గూర్చి ఖనిజములను కనుగొనుటకు లేక వాటిని వెలికితీయుటకు [2][రాజ్య ప్రభుత్వము]చే ఇవ్వబడిన లైసెన్సుల నుండి, లేక కౌళ్ళ నుండి ప్రతి సంవత్సరము ప్రాప్తించు రాయల్టీలలో [2][రాజ్య ప్రభుత్వము] మరియు అట్టి జిల్లా యొక్క జిల్లా పరిషత్తు కరారు చేసికొనిన వాటా ఆ జిల్లా పరిషత్తుకు చెల్లించబడవలెను.

(2) అట్టి రాయల్టీలలో జిల్లా పరిషత్తుకు ఈయబడవలసిన వాటాను గూర్చి ఏదేని వివాదము ఉత్పన్నమైనచో, ఆ వివాదము గవర్నరు నిర్ధారణకై నిర్దేశించబడవలెను మరియు గవర్నరు తన వివేచనానుసారము నిర్ధారణ చేసిన మొత్తము, ఈ పేరా యొక్క (1)వ ఉప–పేరా క్రింద జిల్లా పరిషత్తుకు చెల్లించబడవలసిన మొత్తముగ భావించబడవలెను మరియు గవర్నరు యొక్క నిర్ధారణ అంతిమమైనదై యుండవలెను.

[1][(3) ఈ పేరా క్రింద అట్టి రాయల్టీలలో జిల్లా పరిషత్తుకు ఈయబడవలసిన వాటాను ఉపపేరా (1) క్రింది ఏదేని కరారు యొక్క తేదీ నుండి మాసము లేక సందర్భానుసారముగా ఉపపేరా (2) క్రింది ఏదేని నిర్ధారిత కాలావధి లోపుగా ఆ పరిషత్తుకు ఈయవలెనని గవర్నరు ఉత్తరువు ద్వారా ఆదేశించవచ్చును.]

---

1. త్రిపుర మరియు మిజోరాం రాజ్యములకు వర్తింపజేయుటకై సంవిధాన (సవరణ) చట్టము, 1988 (1988లోని 67వది) యొక్క 2వ పరిచ్ఛేదము మరియు ఆరవ అనుసూచి ద్వారా (2)వ ఉపపేరా తరువాత ఈ క్రింది ఉపపేరాను చొప్పించుటకు వీలుగా 9వ పేరా సవరించబడినది. అదేదనగా–
   ''(3) ఈ పేరా క్రింద అట్టి రాయల్టీలలో జిల్లా పరిషత్తుకు ఈయబడవలసిన వాటాను ఉపపేరా (1) క్రింది ఏదేని కరారు యొక్క తేదీ నుండి మాసము లేక సందర్భానుసారముగా ఉపపేరా (2) క్రింది ఏదేని నిర్ధారిత కాలావధి లోపుగా ఆ పరిషత్తుకు ఈయవలెనని గవర్నరు ఉత్తరువు ద్వారా ఆదేశించవచ్చును.''
2. ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 71 (1)వ పరిచ్ఛేదము మరియు ఎనిమిదవ అనుసూచి ద్వారా ''అస్సాము ప్రభుత్వము''కు బదులు 21.1.1972 నుండి ఉంచబడినది.

[1-2]**10. జనజాతులకు చెందిన వారిచే చేయబడు వడ్డీ వ్యాపారము మరియు వ్యాపారము యొక్క నియంత్రణకై వినిమయములు చేయుటకు జిల్లా పరిషత్తుకుగల అధికారము:–** (1) స్వాయత్త జిలా యొక్క జిల్లా పరిషత్తు ఆ జిల్లాలో నివసించు అనుసూచిత జనజాతులు కానటువంటి ఇతర వ్యక్తులచే ఆ జిల్లాలో చేయబడు వడ్డీ వ్యాపారము యొక్క లేక ఇతర వ్యాపారము యొక్క క్రమబద్ధీకరణ మరియు నియంత్రణ కొరకు వినిమయములను చేయవచ్చును.

(2) పైన చెప్పబడిన అధికారము యొక్క సాధారణతకు భంగము కలుగకుండా అట్టి వినిమయములు, ప్రత్యేకముగా,–

(ఎ) తద్విషయమై జారీ చేయబడిన లైసెన్సును కలిగియున్న వ్యక్తి తప్ప మరెవ్వరును వడ్డీ వ్యాపారమును సాగించరాదని విహితపరచవచ్చును.

(బి) ఒక వడ్డీ వ్యాపారస్థునిచే చేయబడదగు లేక వసూలు చేయబడదగు వడ్డీ యొక్క గరిష్ఠ రేటును విహితపరచవచ్చును;

(సి) వడ్డీ వ్యాపారస్థుల లెక్కలను వ్రాసియుంచుటను, అట్టి లెక్కలను జిల్లా పరిషత్తుచే తద్విషయమై నియమించబడిన అధికారుల తనిఖీ చేయుటకును నిబంధించవచ్చును.

(డి) ఆ జిల్లాలో నివసించెడి అనుసూచిత జనజాతులకు చెందిన సభ్యుడు కానటువంటి ఏ వ్యక్తియు తద్విషయమై జిల్లా పరిషత్తుచే జారీ చేయబడిన లైసెన్సు క్రింద తప్ప, ఏ దినుసు యొక్కయు టోకు లేక చిల్లర వర్తకమును సాగించరాదని విహితపరచవచ్చును:

అయితే, జిల్లా పరిషత్తు యొక్క సభ్యుల మొత్తము సంఖ్యలో నాలుగింట మూడు వంతులకు తక్కువకాని అధిక సంఖ్యాకులచే పాస్ చేయబడినవే తప్ప, ఈ పేరా క్రింద ఎట్టి వినిమయములు చేయబడరాదు:

---

1. త్రిపుర మరియు మిజోరాం రాజ్యములకు వర్తింపజేయుటకై, సంవిధానం (సవరణ) చట్టము, 1988 (1988లోని 67వది) యొక్క 2వ పరిచ్ఛేదము, అనుసూచి ద్వారా 10వ పేరా ఈ క్రింది విధముగా సవరించబడినది–

   (ఎ) శీర్షికలోని ''జనజాతులకు చెందని వారిచే'' అను పదములను వదిలి వేయవలెను.

   (బి) ఉప పేరా (1)లోని ''అనుసూచిత జనజాతులు కానటువంటి ఇతర'' అను పదములను వదిలి వేయవలెను.

   (సి) ఉప పేరా (2)లోని ఖండము (డి)కి బదులుగా ఈ క్రింది ఖండమును ఉంచవలెను, అదేదనగా–

   ''(డి) జిల్లాలో నివసించెడి ఏ వ్యక్తియు, తద్విషయమై జిల్లా పరిషత్తుచే జారీ చేయబడిన లైసెన్సు క్రింద తప్ప, టోకు లేక చిల్లర వ్యాపారమేదియును సాగించరాదని విహితపరచవచ్చును.''

2. అస్సాము రాజ్యమునకు వర్తింపజేయుటకై సంవిధాన (సవరణ) చట్టము, 2003 (2003లోని 44వది) యొక్క 2వ పరిచ్ఛేదము, ఆరవ అనుసూచి ద్వారా ఉపపేరా (3) తరువాత ఈ క్రింది ఉపపేరాను చొప్పించుటకు వీలుగా 10వ పేరా సవరించబడినది. అదేదనగా–

   ''(4) ఈ పేరాలో ఉన్నదేదియు, ఈ అనుసూచి యొక్క 2వ పేరాలోని (3)వ ఉపపేరాలోని వినాయింపు క్రింద ఏర్పాటు చేయబడిన బోడోలాండ్ ప్రాదేశిక పరిషత్తుకు వర్తించదు.''

అంతేకాక, అట్టి వినిమయములు చేయబడుటకు పూర్వము నుండియే ఆ జిల్లాలో వ్యాపారము సాగించుచున్న వడ్డీ వ్యాపారస్థునికిగాని, లేక ఇతర వ్యాపారస్థునికిగాని లైసెన్సును నిరాకరించుటకై, అట్టి ఏ వినిమయముల క్రిందను సమర్థత ఉండరాదు.

(3) ఈ పేరా క్రింద చేయబడిన వినిమయములన్నియు తక్షణమే గవర్నరుకు సమర్పించబడవలెను మరియు ఆయనచే అనుమతింపబడు వరకు అవి ఎట్టి ప్రభావమును కలిగి యుండరాదు.

[1][(4) ఈ అనుసూచి యొక్క (2)వ పేరాలోని ఉపపేరా (3)కు గల వినాయింపు క్రింద ఏర్పాటు చేయబడిన బోడోలాండ్ ప్రాదేశిక ప్రాంత పరిషత్తుకు వర్తించదు.]

**11. ఈ అనుసూచి క్రింద చేయబడు శాసనములు, నియమములు మరియు వినిమయముల యొక్క ప్రచురణ:–** జిల్లా పరిషత్తుచే లేక ప్రాంతీయ పరిషత్తుచే ఈ అనుసూచి క్రింద చేయబడు శాసనములు, నియమములు మరియు వినియమములు తక్షణమే రాజ్యము యొక్క అధికారిక గెజెటులో ప్రచురించబడవలెను మరియు అట్లు ప్రచురించబడిన మీదట అవి శాసనమువలె అమలు కలిగియుండును.

[2–3]**12.** [4][**అస్సాము రాజ్యములోని స్వాయత్త జిల్లాకును స్వాయత్త ప్రాంతములకును, పార్లమెంటు యొక్కయు, అస్సాము రాజ్య శాసనమండలి యొక్కయు చట్టముల వర్తింపు**]:– (1) ఈ సంవిధానములో ఏమి యున్నప్పటికిని–

(ఎ) ఏ విషయమును గూర్చి ఒక జిల్లా పరిషత్తు లేక ప్రాంతీయ పరిషత్తు శాసనములు చేయవచ్చునని ఈ అనుసూచి యొక్క 3వ పేరాలో నిర్దిష్టపరచబడినదో అట్టి ఏవేని

---

1. అస్సాము రాజ్యమునకు వర్తింపజేయుటకై సంవిధాన (సవరణ) చట్టము, 2003 (2003లోని 44వది) యొక్క 2వ పరిచ్ఛేదము, ఆరవ అనుసూచి ద్వారా, ఉపపేరా (3) తరువాత ఉపపేరా (4)ను చొప్పించుటకు వీలుగా 10వ పేరా సవరించబడినది.
2. అస్సాము రాజ్యమునకు వర్తింపజేయుటకై సంవిధాన (సవరణ) చట్టము, 1995 (1995లోని 42వది) యొక్క 2వ పరిచ్ఛేదము ఆరవ అనుసూచి ద్వారా 12వ పేరా ఈ క్రింది విధముగా సవరించబడినది.
''12వ పేరాలోని ఉపపేరా (1)లో ''ఈ అనుసూచి యొక్క 3వ పేరాలో నిర్దిష్ట పరచబడిన విషయములు'' అను పదములు మరియు అంకెలకు బదులుగా ''ఈ అనుసూచి యొక్క 3వ పేరా లేక 3ఏ పేరాలో నిర్ధిష్ట పరచబడిన విషయములు'' అను పదములు మరియు అంకెలు ఉంచవలెను.
3. అస్సాము రాజ్యమునకు వర్తింపజేయుటకై సంవిధాన (సవరణ) చట్టము, 2003 (2003లోని 44వది) యొక్క ఆరవ అనుసూచి ద్వారా 12వ పేరా ఈ క్రింది విధముగా సవరించబడినది.
''12వ పేరా యొక్క ఉపపేరా (1)లోని ఖండము (ఎ)లో ''ఈ అనుసూచి యొక్క 3వ పేరా లేక 3ఏ పేరాలో నిర్దిష్టపరచబడిన విషయములు'' అను పదములు మరియు అంకెలను బదులుగా ''ఈ అనుసూచి యొక్క 3వ పేరా లేక 3ఏ పేరా లేక 3బీ పేరాలో నిర్ధిష్టపరచబడిన విషయములు'' అను పదములు మరియు అంకెలను ఉంచవలెను.''
4. ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 71(1)వ పరిచ్ఛేదము మరియు ఎనిమిదవ అనుసూచి ద్వారా 21.1.1972 నుండి అంతకు ముందున్న శీర్షికకు బదులుగా ఉంచబడినది.

విషయములను గూర్చి [1][అస్సాము రాజ్యశాసన మండలి] యొక్క చట్టమేదియు మరియు బట్టీ పట్టని ఆల్కహాలు సారాయిని సేవించుటను నిషేధించు లేక పరిమితవరచు [1][అస్సాము రాజ్య శాసనమండలి] యొక్క చట్టమేదియు, [2][ఆ రాజ్యములోని] ఏ స్వాయత్త జిల్లాకు గాని, ఏ స్వాయత్త ప్రాంతమునకుగాని, అట్టి జిల్లాకు చెందిన లేక అట్టి ప్రాంతముపై అధికారితగల జిల్లా పరిషత్తు, వీటిలో దేని విషయము పైనను బహిరంగ అధిసూచన ద్వారా అట్లు ఆదేశించిననే తప్ప, వర్తించరాదు మరియు అట్టి ఏదేని చట్టమును గూర్చి ఆ జిల్లా పరిషత్తు అట్టి ఆదేశమునిచ్చునప్పుడు ఆ చట్టము అట్టి జిల్లాకు గాని ప్రాంతమునకుగాని అందలి ఏ భాగముకుగాని వర్తించుటలో ఆ పరిషత్తు సబబని తలచు మినహాయింపులకు, మార్పులకు అధ్యధీనమై ప్రభావము కలిగియుండవలెనని ఆదేశించవచ్చును.

(బి) గవర్నరు బహిరంగ అధిసూచన ద్వారా ఈ ఉప-పేరా యొక్క ఖండము (ఎ)లోని నిబంధనలు వర్తించని పార్లమెంటు యొక్క లేక [1][అస్సాము రాజ్య శాసనమండలి] యొక్క ఏదేని చట్టము [2][ఆ రాజ్యములోని] స్వాయత్త జిల్లాకుగాని స్వాయత్త ప్రాంతమునకుగాని వర్తించరాదని, లేని అట్టి జిల్లాకు గాని, ప్రాంతమునకు గాని, అందలి ఏదేని భాగమునకు గాని, ఆ అధిసూచనలో ఆయన నిర్దిష్టవరచు మినహాయింపులకు లేక మార్పులకు అధ్యధీనమై వర్తించవలెనని ఆదేశించవచ్చును.

(2) ఈ పేరా యొక్క (1)వ ఉప-పేరా క్రింద ఈయబడిన ఏ ఆదేశమైనను గత కాలిక ప్రభావము కలిగియుండునట్లు ఈయబడవచ్చును.

[3]**[12ఏ. మేఘాలయ రాజ్యము లోని స్వాయత్త జిల్లాలకును స్వాయత్త ప్రాంతములకును పార్లమెంటు యొక్కయు మేఘాలయ రాజ్య శాసనమండలి యొక్కయు చట్టముల వర్తింపు:–** ఈ సంవిధానములో ఏమియున్నప్పటికిని–

(ఎ) ఈ అనుసూచి యందలి 3వ పేరా యొక్క (1)వ ఉప-పేరాలో నిర్దిష్ట పరచబడిన ఏ విషయమును గూర్చి యైనను, మేఘాలయ రాజ్యములోని ఒక జిల్లా పరిషత్తుచే లేక ప్రాంతీయ పరిషత్తుచే చేయబడిన శాసనము యొక్క ఏదేని నిబంధనగాని, ఈ అనుసూచి యొక్క 8 లేక 10వ పేరా క్రింద ఆ రాజ్యములోని ఒక జిల్లా పరిషత్తుచే లేక ప్రాంతీయ పరిషత్తుచే చేయబడిన ఏదేని వినియమము యొక్క ఏదేని నిబంధనగాని, ఆ విషయమును గూర్చి మేఘాలయ రాజ్య శాసన మండలిచే చేయబడిన శాసనము యొక్క ఏదేని నిబంధనకు

---

1. ఉత్తర-ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 71(1)వ పరిచ్ఛేదము మరియు ఎనిమిదవ అనుసూచి ద్వారా ''రాజ్యము యొక్క శాసన మండలికి'' బదులు 21.1.1972 నుండి ఉంచబడినది.
2. అదే చట్టము యొక్క 71 (i)వ పరిచ్ఛేదము మరియు ఎనిమిదవ అనుసూచి ద్వారా 21.1.1972 నుండి చొప్పించబడినది.
3. ఉత్తర-ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, యొక్క 71 (i)వ పరిచ్ఛేదము మరియు ఎనిమిదవ అనుసూచి ద్వారా 21.1.1972 నుండి 12ఏ పేరాకు బదులుగా ఉంచబడినది.

విరుద్ధముగా నున్నచో, అప్పుడు ఆ జిల్లా పరిషత్తుచే లేక సందర్భానుసారముగ ప్రాంతీయ పరిషత్తుచే చేయబడిన శాసనము, లేక వినియమము, అది మేఘాలయ రాజ్య శాసన మండలిచే చేయబడిన శాసనమునకు పూర్వము చేయబడినను, తరువాత చేయబడినను, అట్లు విరుద్ధముగనున్నంత మేరకు ప్రభావ శూన్యము కావలెను మరియు మేఘాలయ రాజ్యశాసన మండలిచే చేయబడిన శాసనమే చెల్లుబాటు కలిగియుండవలెను;

(బి) పార్లమెంటు యొక్క ఏదేని చట్టమును గూర్చి రాష్ట్రపతి బహిరంగ అధిసూచన ద్వారా ఆ చట్టము మేఘాలయ రాజ్యములోని ఏదేని స్వాయత్త జిల్లాకు లేక ఏదేని స్వాయత్త ప్రాంతమునకు వర్తించరాదనిగాని, అట్టి జిల్లాకు లేక ప్రాంతమునకు లేక అందలి ఏదేని భాగమునకు, తాను ఆ అధిసూచనలో నిర్దిష్టపరచు మినహాయింపులకు లేక మార్పులకు అధ్యధీనమై వర్తించవలెనని గాని ఆదేశించవచ్చును మరియు అట్టి ఏదేని ఆదేశము గత కాలిక ప్రభావము గలిగియుండునట్లుగ ఈయబడవచ్చును.]

[1][12ఏఏ. త్రిపుర రాజ్యములోని స్వాయత్త జిల్లాలకును మరియు స్వాయత్త ప్రాంతములకును పార్లమెంటు యొక్కయు త్రిపుర రాజ్య శాసన మండలి యొక్కయు చట్టముల వర్తింపు:**–** ఈ సంవిధానములో ఏమి యున్నప్పటికిని–

(ఎ) ఏ విషయమును గూర్చి ఒక జిల్లా పరిషత్తు లేక ప్రాంతీయ పరిషత్తు శాసనము చేయవచ్చునని ఈ అనుసూచి యొక్క 3వ పేరాలో నిర్దిష్టపరచబడినదో అట్టి ఏదేని విషయములను గూర్చి, త్రిపుర రాజ్య శాసన మండలి యొక్క చట్టమేదియు మరియు బట్టీ పట్టని ఆల్కహాలు సారాయిని సేవించుటను నిషేధించు లేక పరిమిత పరచు త్రిపుర రాజ్య శాసనమండలి యొక్క చట్టమేదియు, ఆ రాజ్యములోని ఏ స్వాయత్త జిల్లాకుగాని, లేక స్వాయత్త ప్రాంతమునకుగాని, అట్టి జిల్లాకు చెందిన లేక అట్టి ప్రాంతముపై అధికారిత కలిగిన జిల్లా పరిషత్తు, వీటిలో దేని విషయముపైనైనను బహిరంగ అధిసూచన ద్వారా అట్లు ఆదేశించిననే తప్ప వర్తించరాదు మరియు అట్టి ఏదేని చట్టమును గూర్చి ఆ జిల్లా పరిషత్తు అట్టి ఆదేశము నిచ్చునప్పుడు ఆ చట్టము అట్టి జిల్లాకుగాని, ప్రాంతమునకుగాని, అట్టి ఏ భాగమునకుగాని వర్తించుటలో ఆ పరిషత్తు సబబని తలచు మినహాయింపులకు, మార్పులకు అధ్యధీనమై ప్రభావము కలిగియుండవలెనని ఆదేశించ వచ్చును.

(బి) గవర్నరు, బహిరంగ అధిసూచన ద్వారా ఈ ఉప-పేరా యొక్క ఖండము (ఎ)లోని నిబంధనలు వర్తించని త్రిపుర రాజ్య శాసనమండలి యొక్క ఏదేని చట్టము ఆ రాజ్యములోని స్వాయత్త జిల్లాకుగాని లేక స్వాయత్త ప్రాంతమునకు గాని వర్తించరాదని లేక అట్టి జిల్లాకుగాని, ప్రాంతమునకుగాని, అందలి ఏదేని భాగమునకుగాని, ఆ అధిసూచనలో

---

1. సంవిధాన (సవరణ) చట్టము, 1988 (1988లోని 67వది) యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ఆరవ అనుసూచిలో 12ఏఏ మరియు 12బీ పేరాలకు బదులుగా ఉంచడమైనది. సంవిధాన (నలుబది తొమ్మిదవ సవరణ) చట్టము,1984 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా పేరా 12ఏఏ ని 1.4.1985 నుండి చొప్పించడమైనది.

ఆయన నిర్దిష్టపరచు మినహాయింపులకు లేక మార్పులకు అధ్యధీనమై వర్తించవలెనని ఆదేశించవచ్చును.

(సి) పార్లమెంటు యొక్క ఏదేని చట్టమును గూర్చి, రాష్ట్రపతి బహిరంగ అధిసూచన ద్వారా చట్టము త్రిపుర రాజ్యములోని ఏదేని స్వాయత్త జిల్లాకు లేక ఏదేని స్వాయత్త ప్రాంతమునకు వర్తించరాదనిగాని, అట్టి జిల్లాకు లేక ప్రాంతమునకు లేక అందలి ఏదేని భాగమునకు, తాను అధిసూచనలో నిర్దిష్టపరచు మినహాయింపులకు లేక మార్పులకు అధ్యధీనమై వర్తించవలెనని గాని ఆదేశించవచ్చును. అట్టి ఏదేని ఆదేశము గత కాలిక ప్రభావము కలిగియుండునట్లుగా ఈయబడవచ్చును.]

**[12బీ. మిజోరాం సంఘ రాజ్యక్షేత్రములోని స్వాయత్త జిల్లాలకును స్వాయత్త ప్రాంతములకును పార్లమెంటు యొక్కయు మిజోరాం సంఘ రాజ్యక్షేత్ర శాసనమండలి యొక్కయు చట్టముల వర్తింపు:–** ఈ సంవిధానములో ఏమి యున్నప్పటికిని–

(ఎ) ఏ విషయమును గూర్చి ఒక జిల్లా పరిషత్తు లేక ప్రాంతీయ పరిషత్తు శాసనములు చేయవచ్చునని ఈ అనుసూచి యొక్క 3వ పేరాలో నిర్దిష్టపరచబడినదో అట్టి ఏవేని విషయములను గూర్చి మిజోరాం రాజ్య శాసనమండలి యొక్క చట్టమేదియు ఆ రాజ్యములోని ఏ స్వాయత్త జిల్లాకుగాని, లేక స్వాయత్త ప్రాంతమునకుగాని, అట్టి జిల్లాకు చెందిన లేక అట్టి ప్రాంతముపై అధికారిత కలిగిన జిల్లా పరిషత్తు, వీటిలో దేని విషయముపైనైనను బహిరంగ అధిసూచన ద్వారా అట్లు ఆదేశించిననే తప్ప, వర్తించరాదు మరియు అట్టి ఏదేని చట్టమును గూర్చి ఆ జిల్లా పరిషత్తు అట్టి ఆదేశము నిచ్చునప్పుడు ఆ చట్టము అట్టి జిల్లాకుగాని, ప్రాంతమునకుగాని, అట్టి ఏ భాగమునకుగాని వర్తించుటలో ఆ పరిషత్తు సబబని తలచు మినహాయింపులకు, మార్పులకు అధ్యధీనమై ప్రభావము కలిగి యుండవలెనని ఆదేశించవచ్చును.

(బి) గవర్నరు బహిరంగ అధిసూచన ద్వారా ఈ ఉప-పేరా యొక్క ఖండము (ఎ)లోని నిబంధనలు వర్తించని మిజోరాం రాజ్య శాసనమండలి యొక్క ఏదేని చట్టము, ఆ రాజ్యములోని స్వాయత్త జిల్లాకుగాని, ప్రాంతమునకుగాని, అందలి ఏదేని భాగమునకుగాని, ఆ అధిసూచనలో ఆయన నిర్దిష్టపరచు మినహాయింపులకు లేక మార్పులకు అధ్యధీనమై వర్తించవలెనని ఆదేశించవచ్చును.

(సి) పార్లమెంటు యొక్క ఏదేని చట్టమును గూర్చి, రాష్ట్రపతి బహిరంగ అధిసూచన ద్వారా, ఆ చట్టము మిజోరాం సంఘ రాజ్యక్షేత్రములోని ఏదేని స్వాయత్త జిల్లాకు, లేక ఏదేని స్వాయత్త ప్రాంతమునకు వర్తించరాదనిగాని, అట్టి జిల్లాకు లేక ప్రాంతమునకు, లేక అందలి ఏదేని భాగమునకు తాను ఆ అధిసూచనలో నిర్దిష్టపరచు మినహాయింపులకు లేక మార్పులకు అధ్యధీనమై వర్తించవలెనని గాని, ఆదేశించవచ్చును. అట్టి ఏదేని ఆదేశము గతకాలిక ప్రభావము కలిగి యుండునట్లుగా ఈయబడవచ్చును.]

**13. స్వాయత్త జిల్లాలకు సంబంధించి అంచనా వేయబడిన రాబడులను, వ్యయములను వార్షిక విత్తీయ వివరణయందు వేరువేరుగా చూపుట:–** [1][* * *] రాజ్య సంచితనిధికి జమకట్ట వలసినవై లేక దాని నుండి వ్యయరచవలసినవై, ఒక స్వాయత్త జిల్లాకు సంబంధించి అంచనా వేయబడిన రాబడులు మరియు వ్యయము ప్రప్రథమున చర్చకొరకు జిల్లాకొరకు జిల్లాపరిషత్తు సమక్షమున ఉంచబడవలెను మరియు అట్టి చర్చ జరిగిన పిమ్మట 202వ అనుచ్ఛేదము క్రింద ఆ రాజ్యము యొక్క శాసనమండలి సమక్షమున ఉంచవలసిన, ఆ రాజ్యము యొక్క వార్షిక విత్తీయ వివరణమునందు అది వేరుగా చూపబడవలెను.

[2]**14. స్వాయత్త జిల్లాల యొక్కయు స్వాయత్త ప్రాంతముల యొక్కయు పరిపాలనను గూర్చి పరిశీలన చేయుటకును రిపోర్టు ఇచ్చుటకును కమీషనును నియమించుట:–** (1) గవర్నరు ఎప్పుడైనను, ఈ అనుసూచియందలి 1వ పేరా యొక్క (3)వ ఉప–పేరాలోని ఖండములు (సి), (డి), (ఇ) మరియు (యఫ్)లలో నిర్దిష్టపరచబడిన విషయములతో సహా రాజ్యములోని స్వాయత్త జిల్లాల యొక్కయు, స్వాయత్త ప్రాంతముల యొక్కయు పరిపాలనకు సంబంధించి ఆయనచే నిర్దిష్టపరచబడు ఏ విషయమును గూర్చియైనను పరిశీలన చేయుటకు మరియు రిపోర్టు ఇచ్చుటకు ఒక కమీషనును నియమించవచ్చును లేక రాజ్యములో స్వాయత్త జిల్లాల యొక్క మరియు స్వాయత్త ప్రాంతముల యొక్క పరిపాలనను గూర్చి సాధారణముగను, ఈ క్రింది వాటిని గూర్చి ప్రత్యేకముగను, ఆయా సమయములందు విచారణ చేసి నివేదికను ఇచ్చుటకు ఒక కమీషనును నియమించవచ్చును, మరియు అట్టి కమీషను అనుసరించవలసిన ప్రక్రియను నిర్వచించవచ్చును.

(ఎ) అట్టి జిల్లాలలోను మరియు ప్రాంతములలోను విద్యాసౌకర్యములను, వైద్య సౌకర్యములను, మరియు సంచార మార్గములను ఏర్పాటు చేయుట గూర్చి;

(బి) అట్టి జిల్లాల మరియు ప్రాంతముల విషయమున క్రొత్త లేక ప్రత్యేక శాసన నిర్మాణము యొక్క ఆవశ్యకతను గూర్చి; మరియు

(సి) జిల్లా పరిషత్తులచే మరియు ప్రాంతీయ పరిషత్తులచే చేయబడిన శాసనములను, నియమములను, మరియు వినియమములను అమలు పరచుటను గూర్చి;

---

1. ఉత్తర–ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 71(జి)వ పరిచ్ఛేదము మరియు 8వ అనుసూచి ద్వారా 21.1.1972 నుండి ‘‘అస్సాము’’ అను పదములు వదిలివేయబడినది.

2. సంవిధాన (సవరణ) చట్టము, 1995 (1995లోని 42వది) యొక్క ఆరవ అనుసూచిని అస్సాము రాజ్యమునకు వర్తింపజేయుటకు గాను 14వ పేరాలోని (2)వ ఉపపేరాలో ఉన్న ‘‘దానిని గూర్చి గవర్నరు చేయు సిఫారసులతో’’ అను పదములు వదిలి వేయవేయవలెను.

(2) అట్టి కమీషను యొక్క ప్రతీ నివేదికను దానికి సంబంధించి గవర్నరు యొక్క సిఫారసులను, [1][రాజ్య ప్రభుత్వముచే] దానిపై తీసుకొనుటకు ప్రతిపాదించిన చర్యను గూర్చిన వివరణాత్మకమైన పత్రముతో పాటుగా సంబంధిత మంత్రిచే రాజ్య శాసనమండలి సమక్షమున ఉంచవలెను.

(3) రాజ్యము యొక్క ప్రభుత్వ కార్యకలాపమును తన మంత్రులకు కేటాయించునప్పుడు, గవర్నరు, ఆ రాజ్యములోని స్వాయత్త జిల్లాల యొక్కయు, స్వాయత్త ప్రాంతముల యొక్కయు శ్రేయోభారమును ఒక మంత్రికి ప్రత్యేకముగా అప్పగించవచ్చును.

[2]**15. జిల్లా మరియు ప్రాంతీయ పరిషత్తుల కార్యములను, తీర్మానములను శూన్యీకరించుట లేక సస్పెండు చేయుట:–** (1) ఒక జిల్లా లేక ప్రాంతీయ పరిషత్తు యొక్క ఏదేని కార్యము లేక తీర్మానము భారతదేశ భద్రతకు అపాయము కలిగించవచ్చునని, [3] [లేక ప్రజాశాంతికి భంగము కలిగించవచ్చునని], ఎప్పుడైనను గవర్నరు అభిప్రాయపడినచో, ఆయన ఆ కార్యమును లేక తీర్మానమును శూన్యీకరించవచ్చును లేక సస్పెండు చేయవచ్చును మరియు అట్టి కార్యమును చేయుటకు, లేక కొనసాగించుటకు, లేక అట్టి తీర్మానమును అమలు పరచుటకును, నివారించుటకును ఆయన ఆవశ్యకమని తలచు చర్యలను (పరిషత్తును తాత్కాలిక నిలుపుదల చేయుట మరియు ఆ పరిషత్తులో విహితమైన లేక దానిచే వినియోగించబడదగు అధికారములన్నింటినిగాని వాటిలో వేటినిగాని తానే పరిగ్రహించుటతో సహా) తీసికొనవచ్చును.

(2) ఈ పేరా యొక్క (1)వ ఉప–పేరా క్రింద గవర్నరుచే చేయబడిన ఏదేని ఉత్తరువు, దానికిగల కారణములతో సహా, సాధ్యమైనంత త్వరితముగ, ఆ రాజ్య శాసనమండలి సమక్షమున ఉంచబడవలెను మరియు ఆ రాజ్య శాసన మండలిచే ప్రతి సంహరించబడినవే తప్ప, ఆ ఉత్తరువు, అది అట్లు చేయబడిన తేదీ మొదలు పండ్రెండు మాసముల కాలావధి వరకు అమలులో కొనసాగవలెను:

అయితే అట్టి ఉత్తరువును అమలులో కొనసాగించుటను ఆమోదించు ఒక తీర్మానము రాజ్యశాసనమండలిచే పాస్ చేయబడినచో మరియు అట్లు పాస్ చేయబడినప్పుడెల్లను, గవర్నరుచే ప్రతి సంహరించబడిననే తప్ప, ఆ ఉత్తరువు, అట్టి తీర్మానము పాస్ చేయబడకుండిన

---

1. ఉత్తర–ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 71(i)వ పరిచ్ఛేదము ఎనిమిదవ అనుసూచి ద్వారా ''అస్సాము రాజ్యము'' అను పదములకు బదులుగా 21.1.1972 నుండి ఉంచబడినది.
2. త్రిపుర మరియు మిజోరాం రాజ్యములకు వర్తింపజేయుటకై సంవిధాన (సవరణ) చట్టము, 1988 (1988లోని 67వది) యొక్క ఆరవ అనుసూచి ద్వారా 15వ పేరా ఈ క్రింది విధముగా సవరించబడినది. అదేదనగా–
''(ఎ) ప్రారంభపు పేరాలో ''రాజ్య శాసనమండలిచే'' అను పదములకు బదులుగా ''ఆయనచే'' అను పదములను ఉంచవలెను;
(బి) వినాయింపును వదిలివేయవలెను.''
3. అస్సాము పునర్వ్యవస్థీకరణ (మేఘాలయ) చట్టము, 1969 (1969లోని 55వది) యొక్క 74వ పరిచ్ఛేదము మరియు నాలుగవ అనుసూచి ద్వారా 2.4.1970 నుండి చొప్పించబడినది.

యెడల ఈ పేరా క్రింద ఏ తేదీన వాటి అమలు అన్యథా ఆగిపోయియుండెడిదో ఆ తేదీ నుండి ఇంకను పంద్రెండు మాసముల కాలావధి వరకు అది అమలులో కొనసాగవలెను.

[1]**16. ఒక జిల్లా, లేక ప్రాంతీయ పరిషత్తు యొక్క విఘటన:–** [2][(1)] గవర్నరు ఈ అనుసూచి యొక్క 14వ పేరా క్రింద నియమించబడిన కమీషను యొక్క సిఫారసుపై ఒక జిల్లాలేక ప్రాంతీయ పరిషత్తు విఘటన చేయబడవలెనని బహిరంగ అధిసూచన ద్వారా ఉత్తరువు చేయవచ్చును, మరియు

(ఎ) ఆ పరిషత్తు యొక్క పునస్సంఘటనకై మరొక సాధారణ ఎన్నిక వెంటనే జరువబడవలెనని ఆదేశించవచ్చును, లేక

(బి) ఆ రాజ్య శాసనమండలి యొక్క పూర్వామోదమునకు అధ్యధీనమై, ఆ పరిషత్తు యొక్క ప్రాధికారము క్రింద ప్రాంతము యొక్క పరిపాలనను తానే పరిగ్రహించవచ్చును లేక అట్టి ప్రాంతము యొక్క పరిపాలనను, సదరు పేరా క్రింద నియమించబడిన కమీషనుకు లేక అందుకు తగినదని ఆయన తలచు ఏదేని ఇతర నికాయమునకు పంద్రెండు మాసములకు మించని కాలావధి వరకు అప్పగించవచ్చును:

అయితే ఈ పేరా యొక్క ఖండము (ఎ) క్రింద ఉత్తరువు చేయబడినప్పుడు గవర్నరు, మరొక సాధారణ ఎన్నిక తరువాత ఆ పరిషత్తు యొక్క పునస్సంఘటన జరుగు వరకు అట్టి ప్రాంతము యొక్క పరిపాలనను గూర్చి ఈ పేరా యొక్క ఖండము (బి)లో నిర్దేశింపబడిన చర్యను తీసికొనవచ్చును:

అంతేకాక, జిల్లా పరిషత్తు లేక సందర్భానుసారముగా ప్రాంతీయ పరిషత్తునకు తన అభిప్రాయములను ఆ రాజ్య శాసనమండలికి తెలియజేయు ఆవకాశము ఈయకుండ ఈ పేరా యొక్క ఖండము (బి) క్రింద ఎట్టి చర్య తీసుకొనరాదు.

[3][(2) ఒక స్వాయత్త జిల్లా లేక ప్రాంతము యొక్క పరిపాలనను ఈ అనుసూచి యొక్క నిబంధనలననుసరించి జరుపుటకు వీలుకాని పరిస్థితి ఏర్పడినదని ఎప్పుడైనను గవర్నరు అభిప్రాయపడినచో, ఆయన బహిరంగ అధిసూచన ద్వారా జిల్లా పరిషత్తులో లేక

---

1. త్రిపుర మరియు మిజోరాం రాజ్యములకు వర్తింపజేయుటకై సంవిధాన (సవరణ) చట్టము, 1988 (1988లోని 67వది) యొక్క ఆరవ అనుసూచి మరియు 2వ పరిచ్ఛేదము ద్వారా 16వ పేరా ఈ క్రింది విధముగా సవరించబడినది, అదేదనగా–

   (ఎ) ఉప పేరా (1)లోని ఖండము (బి)లో వచ్చిన ''రాజ్య శాసనమండలి యొక్క పూర్వామోదమునకు అధ్యదీనమై'' అను పదములు మరియు రెండవ వినాయింపును వదలివేయవలెను.

   (బి) ఉప పేరా (3)కు బదులుగా ఈ క్రింది ఉపపేరాను ఉంచవలెను. అదేదనగా–

   ''(3) ఈ పేరాలోని ఉపపేరా (1) లేక ఉపపేరా (2) క్రింద చేయబడిన ప్రతి ఉత్తరువు, దానికి గల కారణములతో సహా, రాజ్య శాసనమండలి సమక్షమున ఉంచబడవలెను.''

2. అస్సాము పునర్వ్యవస్థీకరణ (మేఘాలయ) చట్టము, 1969 (1969లోని 55వది) యొక్క 74వ పరిచ్ఛేదము మరియు నాలుగవ అనుసూచి ద్వారా 16వ పేరాను ఉపపేరా (1)గా, 2.4.1970 నుండి తిరిగి అంకెవేయడమైనది.

3. అస్సాము పునర్వ్యవస్థీకరణ (మేఘాలయ) చట్టము, 1969 (1969లోని 55వది) యొక్క 74 పరిచ్ఛేదము మరియు నాలుగవ అనుసూచి ద్వారా 2.4.1970 నుండి చొప్పించబడినది.

సందర్భానుసారముగా ప్రాంతీయ పరిషత్తులో, నిహితమైయున్న లేక ఆ పరిషత్తుచే వినియోగించదగు కృత్యములను లేక అధికారములను అన్నింటినిగాని లేక వాటిలో వేటినిగాని తానే పరిగ్రహింపవచ్చును మరియు అట్టి కృత్యములు లేక అధికారములు, తద్విషయమైతాను నిర్దిష్టపరచు వ్యక్తిచే లేక ప్రాధికారిచే, ఆరు మాసములకు మించని కాలావధి వరకు వినియోగించబడదగునని ప్రఖ్యానించవచ్చును:

అయితే, గవర్నరు అదనపు ఉత్తరువు లేక ఉత్తరువుల ద్వారా ఆరంభిక ఉత్తరువు యొక్క అమలును, ప్రతి తడవ ఆరు మాసములకు మించని కాలావధి వరకు పొడగించవచ్చును.

(3) ఈ పేరా యొక్క (2)వ ఉప-పేరా క్రింద చేయబడిన ప్రతి ఉత్తరువు దానికి గల కారణములతో సహా, రాజ్య శాసనమండలి సమక్షమున ఉంచబడవలెను మరియు ఆ ఉత్తరువు జారీ చేయబడిన పిమ్మట రాజ్య శాసనమండలి మొదటిసారి ఉపవేశనమగు తేదీ నుండి ముప్పది దినములు ముగియుటకు పూర్వము, రాజ్య శాసనమండలి దానిని ఆమోదించిననే తప్ప, ఆ కాలావధి ముగియగానే ఆ ఉత్తరువు యొక్క అమలు ఆగిపోవలెను.]

[1]**17. స్వాయత్త జిల్లాలలో నియోజక వర్గములను ఏర్పరచుటలో అట్టి జిల్లాల నుండి ప్రాంతముల అపవర్జన:–** [2][అస్సాము, లేక మేఘాలయ [3][లేక త్రిపుర] [4][లేక మిజోరాం] యొక్క శాసనసభకు] ఎన్నికల నిమిత్తము గవర్నరు ఉత్తరువు ద్వారా, [5] [అస్సాము లేక మేఘాలయ [3][లేక సందర్భానుసారముగా త్రిపుర] [4][లేక మిజోరాం] రాజ్యమునందలి] ఒక స్వాయత్త జిల్లాలోని ఏదేని ప్రాంతము అట్టి జిల్లాకు ఆ శాసనసభలో ప్రత్యేకించబడిన స్థానమును లేక స్థానములను పూరించుటకైన ఏ నియోజక వర్గమునందును భాగము కారాదనియూ, అటు ప్రత్యేకించబడి యుండక, ఆ ఉత్తరువులో నిర్దిష్టపరచబడిన ఏదేని స్థానమును లేక ఏవేని స్థానములను పూరించుటకైన నియోజక వర్గములో భాగము కావలెననియు ప్రఖ్యానించవచ్చును.

---

1. అస్సాము రాజ్యమునకు వర్తింపజేయుటకై ఈ క్రింది వినాయింపును చొప్పించుటకు వీలుగా సంవిధాన (సవరణ) చట్టము, 2003 (2003లోని 44వది) యొక్క ఆరవ అనుసూచి ద్వారా 17వ పేరా సవరించబడినది. అదేదనగా–

 ''అయితే ఈ పేరాలో నున్నదేదియు బోడోలాండ్ ప్రాదేశిక ప్రాంతముల జిల్లాకు వర్తించదు.''

2. ఉత్తర-ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 71(జి)వ పరిచ్ఛేదము మరియు 8వ అనుసూచి ద్వారా ''అస్సాము శాసనమండలి''కి బదులు 21.1.1972 నుండి ఉంచబడినది.

3. సంవిధాన (నలుబది తొమ్మిదవ సవరణ) చట్టము, 1984 యొక్క నాలుగవ పరిచ్ఛేదము ద్వారా 1.4.1985 నుండి చొప్పించబడినది.

4. మిజోరాం రాజ్య చట్టము, 1986 (1986లోని 34వది) యొక్క 39వ పరిచ్ఛేదము ద్వారా 1.4.1985 నుండి చొప్పించబడినది.

5. ఉత్తర-ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) యొక్క 71(i)వ పరిచ్ఛేదము మరియు 8వ అనుసూచి ద్వారా 21.1.1972 నుండి ఉంచబడినది.

[1]18. [* * * *]

[2]**19. సంధికాలిక నిబంధనలు:–** (1) ఈ సంవిధాన ప్రారంభమునకు పిమ్మట సాధ్యమైనంత త్వరితముగా గవర్నరు రాజ్యములోని ప్రతిస్వాయత్త జిల్లాకును, ఈ అనుసూచి క్రింద ఒక జిల్లా పరిషత్తును సంఘటితము చేయుటకు చర్యలను తీసుకొనవలెను మరియు ఒక స్వాయత్త జిల్లాకు అట్లు జిల్లా పరిషత్తు సంఘటితము చేయబడు వరకు అట్టి జిల్లా యొక్క పరిపాలన గవర్నరు యందు నిహితమైయండవలెను మరియు అట్టి జిల్లాలోని ప్రాంతముల యొక్క పరిపాలనకు, ఈ అనుసూచిలోని పూర్వగామి నిబంధనలకు బదులు ఈ క్రింది నిబంధనలు వర్తించవలెను, అవేవనగా–

(ఎ) పార్లమెంటు యొక్క లేక రాజ్య శాసనమండలి యొక్క చట్టము ఏదియు, అది అట్టి ఏదేని ప్రాంతమునకు వర్తించవలెనని గవర్నరు బహిరంగ అధిసూచన ద్వారా ఆదేశించనవే తప్ప ఆ ప్రాంతమునకు వర్తించరాదు మరియు గవర్నరు ఏదేని చట్టమును గూర్చి అట్టి ఆదేశమును ఇచ్చునప్పుడు ఆ ప్రాంతమునకు లేక నిర్దిష్టపరచబడిన అందలి ఏదేని భాగమునకు ఆ చట్టము యొక్క వర్తింపులో తాను సబబని తలచు మినహాయింపులకు లేక మార్పులకు అధ్యధీనమై అది ప్రభావము కలిగి ఉండవలెనని ఆదేశించవచ్చును.

(బి) అట్టి ఏదేని ప్రాంతము యొక్క శాంతి మరియు సుపరిపాలన కొరకు గవర్నరు వినియమములను చేయవచ్చును మరియు అట్లు చేయబడిన ఏ వినియమములైనను, అట్టి ప్రాంతమునకు తత్సమయమున వర్తించు ఏదేని పార్లమెంటు చట్టమును లేక రాజ్యశాసనమండలి చట్టమును లేక అస్తిత్వములోనున్న ఏదేని శాసనమును రద్దు, లేక సవరణ చేయవచ్చును.

(2) ఈ పేరా యొక్క (1)వ ఉప–పేరాలోని ఖండము (ఎ) క్రింద గవర్నరుచే ఈయబడిన ఏ ఆదేశమైనను గతకాలిక ప్రభావమును కలిగియుండునట్లు ఈయబడవచ్చును.

---

1. ఉత్తర–ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) ద్వారా పేరా 18 వదిలివేయబడినది.

2. అస్సాము రాజ్యమునకు వర్తింపజేయుటకై ఉపపేరా (3) తరువాత క్రింది ఉపపేరాను చొప్పించుటకు సంవిధాన (సవరణ) చట్టము, 2003 (2003లోని 44వది) యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా పేరా 9 సవరించబడినది. అదేదనగా–

''(4) ఈ సంవిధాన ప్రారంభమునకు పిమ్మట సాధ్యమైనంత త్వరితముగా గవర్నరుచే పరిష్కార జ్ఞాపనపై సంతకములు చేసిన వారితో సహా బోడో ఉద్యమము యొక్క నాయకుల నుండి మరియు అస్సాములోని బోడోలాండ్ ప్రాదేశిక ప్రాంతముల జిల్లా కొరకైన మధ్యంతర కార్యపాలక పరిషత్తు రూపొందించబడవలెను మరియు ఆ ప్రాంతములోని జనజాతేతర సముదాయములకు సముచిత ప్రాధాన్యము కల్పించవలెను:

అయితే మధ్యంతర పరిషత్తు యొక్క కాలావధి ఆరు మాసములు, ఆ లోపుగా పరిషత్తుకు ఎన్నికను జరిపించుటకు సన్నాహములను చేయవలెను.

**విశదీకరణ:–** ఈ ఉపపేరా నిమిత్తము ''పరిష్కార జ్ఞాపన'' అను పదబంధమునకు భారత ప్రభుత్వము, అస్సాము ప్రభుత్వము మరియు బోడో లిబరేషన్ టైగర్లకు మధ్య 2003, ఫిబ్రవరి 10వ రోజున సంతకము చేయబడిన జ్ఞాపన పత్రము అని అర్థము.''.

(3) ఈ పేరా యొక్క (1)వ ఉప-పేరాలోని ఖండము (బి) క్రింద చేయబడిన వినియమములన్నియు, తక్షణమే రాష్ట్రపతికి సమర్పించబడవలెను మరియు ఆయనచే అనుమతింపబడు వరకు అవి ఎట్టి ప్రభావము కలిగి యుండరాదు.

[1][**20. జనజాతి ప్రాంతములు:-** (1) ఈ క్రింది పట్టిక యొక్క భాగములు I, II, [2][IIA] మరియు IIIలో నిర్దిష్టపరచబడిన ప్రాంతములు క్రమశః అస్సాము రాజ్యము, మేఘాలయ రాజ్యము, [2][త్రిపుర రాజ్యము] మరియు మిజోరం [3][రాజ్యముల]లోని జనజాతి ప్రాంతములై ఉండవలెను.

(2) [4][ఈ క్రింది పట్టిక యొక్క భాగములు I, II, IIA మరియు IIIలలోని] ఏదేని జిల్లాను గూర్చిన నిర్దేశము, ఉత్తర-ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ), 1971 యొక్క 2వ పరిచ్ఛేదములోని ఖండము (బి) క్రింద నియతము చేయబడిన తేదీకి అవ్యవహిత పూర్వము ఈ పేరుతో ఉండిన స్వాయత్త జిల్లాలో చేరి ఉన్న రాజ్యక్షేత్రములను గూర్చిన నిర్దేశముగా అన్వయించబడవలెను:

అయితే ఈ అనుసూచిలోని 3వ పేరా యొక్క (1)వ ఉప-పేరాలోని ఖండములు (ఇ) మరియు (యఫ్) యొక్కయు, 4వ పేరా, 5వ పేరా మరియు 6 పేరా యొక్క ఉపపేరా (2), 8వ పేరాలోని (2)వ ఉప-పేరా, మరియు (3)వ ఉప-పేరాలోని ఖండములు (ఎ), (బి) మరియు (డి)లు మరియు (4)వ ఉప-పేరా యొక్కయు మరియు 10వ పేరా యొక్క (2)వ ఉప-పేరాలోని ఖండము 'డి' యొక్కయు ప్రయోజనముల కొరకు షిల్లాంగు పురపాలికలో చేరియున్న భాగము యొక్క ఏ ప్రాంతమును [5][ఖాసీ కొండల జిల్లా] లోనిదిగా భావించబడరాదు.

[6][(3) ''త్రిపుర జనజాతి ప్రాంతముల జిల్లా''కు దిగువన గల పట్టికలోని భాగము-2లోని నిర్దేశమును త్రిపుర జనజాతి ప్రాంతముల స్వాయత్త జిల్లా పరిషత్తు చట్టము, 1979నకు గల మొదటి అనుసూచిలో నిర్ధిష్టపరచిన జనజాతి ప్రాంతములను కూడియున్న రాజ్యక్షేత్రమునకైన నిర్దేశముగా భావించవలెను.

---

1. ఈశాన్య ప్రాంతముల (పునర్వ్యవస్థీకరణ) చట్టము, 1971 (1971లోని 81వది) 71(1)వ పరిచ్ఛేదము మరియు 8వ అనుసూచి ద్వారా 20 మరియు 20ఏ పేరాలకు బదులుగా 21.1.1972 నుండి ఉంచబడినది.
2. సంవిధాన (నలుబది తొమ్మిదవ సవరణ) చట్టము, 1984 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 1.4.1985 నుండి చొప్పించబడినది.
3. మిజోరాం రాజ్య చట్టము, 1986 (1986లోని 34వది) యొక్క 39వ పరిచ్ఛేదము ద్వారా ''సంఘరాజ్యక్షేత్రము'' అను దానికి బదులుగా 20.2.1987 నుండి ఉంచబడినది.
4. సంవిధాన (నలుబది తొమ్మిదవ సవరణ) చట్టము, 1984 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 1.4.1985 నుండి ''ఈ క్రింది పట్టికలోని ఏదేని నిర్దేశమునకు'' అను పదములకు బదులుగా ఉంచబడినది.
5. 1973 జూన్ 14వ తేదీ గల మేఘాలయ ప్రభుత్వపు అధిసూచన నెంబరు డిసిఎ 31-72-11, 23.6.1973 తేదీ గల మేఘాలయ గెజెటు, భాగము 5ఎ పుట 200 ద్వారా ప్రతిష్ఠితము చేయబడినది.
6. సంవిధాన (నలుబది తొమ్మిదవ సవరణ) చట్టము, 1984 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా, 01.04.1985 నుండి చొప్పించబడినది.

## పట్టిక

### భాగము – 1

1. ఉత్తర కాచారు కొండల జిల్లా

2. [1][కర్బీ అంగ్‌లాంగ్ జిల్లా]

[2][3.బోడోల్యాండ్ ప్రాదేశిక ప్రాంతముల జిల్లా]

### భాగము – 2

[3][1. ఖాసీ కొండల జిల్లా

2. జైన్‌టియా కొండల జిల్లా]

3. గారోకొండల జిల్లా.

### [4][భాగము – 2ఏ

త్రిపుర జనజాతి ప్రాంతముల జిల్లా]

### భాగము – 3

[5][......................]

[6][1. చక్మా జిల్లా.

[7][2. మరా జిల్లా

3. లాయి జిల్లా.]]

---

1. అస్సాము ప్రభుత్వ అధిసూచన నెం. టీఏడీ/ఆర్/115/74/47 తేదీ 14.10.1976 ద్వారా ''మికీరు కొండ జిల్లా'' అనుదానికి బదులుగా ఉంచబడినది.
2. సంవిధాన (సవరణ) చట్టము, 2003 (2003లోని 44వది) యొక్క 2వ పరిచ్ఛేదము, దానికి గల ఆరవ అనుసూచి ద్వారా అస్సాము ప్రభుత్వముచే చొప్పించబడినది.
3. 1973 జూన్ 14వ తేదీ గల మేఘాలయ ప్రభుత్వపు అధిసూచన నెంబరు డిసిఏ 31–72–11, 23.6.1973 తేదీ గల మేఘాలయ గెజెటు, భాగము 5ఏ పుట 200 ద్వారా ప్రతిష్ఠితము చేయబడినది.
4. సంవిధాన (నలుబది తొమ్మిదవ సవరణ) చట్టము, 1984 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా, 01.04.1985 నుండి చొప్పించబడినది.
5. ప్రభుత్వ సంఘరాజ్యక్షేత్రముల (సవరణ) చట్టము, 1971 (1971లోని 83వది) యొక్క 13వ పరిచ్ఛేదము ద్వారా 29.4.192 నుండి ''మిజో జిల్లా'' అను పదములు వదిలివేయబడినది.
6. మిజోరాం జిల్లా పరిషత్తుల (వివిధ నిబంధనల) ఉత్తరువు, 1972 ద్వారా 29.4.1972 నుండి చొప్పించబడినది. ఈ ఉత్తరువు 5.5.1972వ తేదీ గల మిజోరాం గెజెటు, భాగము – 2 పుట 17 ద్వారా ప్రచురించబడినది.
7. సంవిధాన (సవరణ) చట్టము, 1988 (1988లోని 67వది) యొక్క 2వ పరిచ్ఛేదము దానికి గల ఆరవ అనుసూచి ద్వారా క్రమసంఖ్య 2 మరియు 3 మరియు దానికి సంబంధించిన నమోదులకు బదులుగా ఉంచబడినది.

[1][**20-ఏ. మిజో జిల్లా పరిషత్తు విఘటన:-** (1) ఈ అనుసూచిలో ఏమియున్నప్పటికిని, విహిత తేదీకి అవ్యవహిత పూర్వము అస్థిత్వములో ఉండిన (ఇందు అటు తరువాత మిజో జిల్లా పరిషత్తు అని నిర్దేశించబడిన) మిజో జిల్లా యొక్క జిల్లా పరిషత్తు విఘటితమై యుండును, మరియు అస్తిత్వములో ఉండదు.

(2) మిజోరం సంఘ రాజ్యక్షేత్రము యొక్క పరిపాలకుడు, ఒకటి లేక అంతకెక్కువ ఉత్తరువుల ద్వారా ఈ క్రింది విషయములన్నింటి కొరకు గాని, వానిలో ఏవైనా కొన్నిటి కొరకుగాని నిబంధనలు చేయవచ్చును, అవేవనగా-

(ఎ) మిజో జిల్లా పరిషత్తు యొక్క (దానిచే చేయబడిన ఏదేని కాంట్రాక్టు క్రింది హక్కులు మరియు దాయిత్వములతో సహా) సంపత్తులను, హక్కులను మరియు దాయిత్వములను పూర్ణతఃగాని, భాగతఃగాని సంఘమునకు లేక ఏవరేని ఇతర ప్రాధికారికి అంతరణ చేయుట;

(బి) మిజో జిల్లా పరిషత్తు ఏ శాసనబద్ధ చర్యలకు పక్షకారునిగా ఉన్నదో ఆ పక్షకారుని, సంఘము లేక మిజో జిల్లా పరిషత్తు యొక్క ఎవరేని ఇతర ప్రాధికారికి బదులుగా లేదా సంఘము లేక ఎవరేని ఇతర ప్రాధికారికి అదనముగా చేర్చుట;

(సి) మిజో జిల్లా పరిషత్తు యొక్క ఎవరేని ఉద్యోగులను సంఘమునకు లేక ఎవరేని ఇతర ప్రాధికారికి బదిలీ చేయుట లేక సంఘముచే లేక ఎవరేని ఇతర ప్రాధికారిచే అట్టి ఉద్యోగులు తిరిగి ఉద్యోగములో నియమించబడుట, అట్లు బదిలీ చేయబడిన లేక తిరిగి ఉద్యోగములో నియమించబడిన పిమ్మట అట్టి ఉద్యోగులకు వర్తించదగు సేవా నిబంధనలు మరియు షరతులు;

(డి) విఘటనకు అవ్యవహిత పూర్వము మిజో జిల్లా పరిషత్తుచే చేయబడి అమలులోనున్న ఏవేని శాసనములను, అట్టి శాసనములు సమర్థ శాసనమండలిచేగాని, ఇతర సమర్థ ప్రాధికారిచేగాని మార్చబడువరకు, రద్దు చేయబడు వరకు లేక సవరించబడు వరకు ఈ విషయమై పరిపాలకుడు, రద్దు లేక సవరణ రూపమున చేయు అనుకూలానుసరణలకును, మార్పులకును అధ్యధీనమై కొనసాగించుట;

(ఇ) పరిపాలకుడు ఆవశ్యకమని భావించు ఆనుషంగిక, పారిణామిక మరియు అనుపూరక విషయములు.

**విశదీకరణ:** ఈ పేరాలోని ఈ అనుసూచి యొక్క 20బీ పేరాలోని ''విహిత తేదీ'' అనగా సంఘ రాజ్య క్షేత్రముల ప్రభుత్వ చట్టము, 1963 యొక్క నిబంధనల క్రింద మరియు ఆ నిబంధనల ననుసరించి మిజోరాం సంఘ రాజ్యక్షేత్ర శాసనసభ తగురీతిగా సంఘటితము చేయబడిన తేదీయని అర్థము.

---

1. ప్రభుత్వ సంఘ రాజ్యక్షేత్రముల (సవరణ) చట్టము, 1971 (1971లోని 83వది) యొక్క 13వ పరిచ్ఛేదము ద్వారా పేరా 20ఏ కు బదులుగా ''20ఎ, 20బి మరియు 20సీ'' అను పేరాలు 29.4.1972 నుండి ఉంచబడినవి.

[1-2]**20బీ. మిజోరాం సంఘ రాజ్యక్షేత్రములోని స్వాయత్త ప్రాంతములు స్వాయత్త జిల్లాలుగా నుండుట, తత్పరిణామముగా పరివర్తన కాలిక నిబంధనలు:–** (1) ఈ అనుసూచిలో ఏమియున్నప్పటికినీ,–

(ఎ) విహిత తేదీకి అవ్యవహిత పూర్వము మిజోరాం సంఘ రాజ్యక్షేత్రములో ఉండిన ప్రతి యొక్క స్వాయత్త ప్రాంతము, ఆ తేదీన మరియు ఆ తేదీ నుండి ఆ సంఘరాజ్యక్షేత్రములో (ఇందు ఇటు పిమ్మట దాని స్థానములో క్రొత్త జిల్లా అని నిర్దేశించబడిన) ఒక స్వాయత్త జిల్లాగా ఉండవలెను; మరియు దాని పరిపాలకుడు ఒకటి లేక అంతకెక్కువ ఉత్తరువుల ద్వారా, (ఈ ఖండము యొక్క నిబంధనలను అమలు పరచుటకు ఆవశ్యకమగు పారిణామిక సవరణలు) ఈ అనుసూచికి జతపరచబడిన పట్టిక యొక్క భాగము 3తో సహా ఈ అనుసూచి యొక్క 20వ పేరాలో చేయబడవలెనని ఆదేశించవచ్చును. అటుపై సదరు పేరా మరియు సదరు భాగము 3 తదనుసారముగా సవరించబడినట్లు భావించబడవలెను;

(బి) విహిత తేదీకి అవ్యవహిత పూర్వము మిజోరాం సంఘ రాజ్యక్షేత్రములో ఉండిన (ఇందు ఇటు పిమ్మట అస్తిత్వములోనున్న ప్రాంతీయ పరిషత్తు అని నిర్దేశించబడిన) ప్రతి స్వాయత్త ప్రాంతపు ప్రాంతీయ పరిషత్తు ఆ తేదీన మరియు ఆ తేదీ నుండి మరియు దాని స్థానములోని

---

1. అస్సాము రాజ్యమునకు వర్తింపజేయుటకై, సంవిధాన (సవరణ) చట్టము, 1995 (1995లోని 42వది) యొక్క 2వ పరిచ్ఛేదము ఆరవ అనుసూచి ద్వారా, 20బీ పేరా తరువాత ఈ క్రింది పేరా చొప్పించబడినది, అదేదనగా–

   ''**20బీఏ. గవర్నరు తన కృత్యములను నిర్వర్తించుటలో విచక్షణాధికారముల వినియోగము:–** గవర్నరు ఈ అనుసూచి యొక్క 1వ పేరాలోని ఉపపేరాలు (2) మరియు (3), 2వ పేరా యొక్క ఉపపేరా (1), (6), మొదటి వినాయింపు మినహాయించి ఉపపేరా (6ఏ) మరియు ఉపపేరా (7), 3వ పేరా యొక్క ఉపపేరా (3) 4వ పేరాలోని ఉపపేరా (4), పేరా 5, 6వ పేరాలోని ఉపపేరా (1), 7వ పేరాలోని ఉపపేరా (2), 8వ పేరాలోని ఉపపేరా (4) 9వ పేరాలోని ఉపపేరా (3), 10వ పేరాలోని ఉపపేరా (3), 14వ పేరాలోని ఉపపేరా (1), 15వ పేరా యొక్క ఉపపేరా (1), 15వ పేరాలోని ఉపపేరా (1), మరియు 16వ పేరాలోని ఉపపేరాలు (1), (2)ల క్రింద తన కృత్యమలును నిర్వర్తించునపుడు మంత్రి పరిషత్తు మరియు ఉత్తర కాచారు కొండల స్వాయత్త పరిషత్తు లేక సందర్భానుసారము కర్బీ అంగ్‌లాంగ్ స్వాయత్త పరిషత్తును సంప్రదించిన మీదట తన వివేచనానుసారము తాను అవసరమని భావించినట్టి చర్య తీసుకొనవలెను.''.

2. త్రిపుర మరియు మిజోరాం రాజ్యములకు వర్తింపజేయుటకై, సంవిధాన (సవరణ) చట్టము, 1988 (1988లోని 67వది) యొక్క ఆరవ అనుసూచి ద్వారా పేరా 20బీ తరువాత ఈ క్రింది పేరా చొప్పించబడినది. అదేదనగా–

   ''**20బీబీ. గవర్నరు తన కృత్యములను నిర్వర్తించుటలో విచక్షణాధికారముల వినియోగము:–** గవర్నరు, ఈ అనుసూచి యొక్క 1వ పేరాలోని ఉపపేరాలు (2) మరియు (3), 2వ పేరాలోని ఉపపేరా (1) మరియు (7), 3వ పేరాలోని ఉపపేరా (3), 4వ పేరాలోని ఉపపేరా (4), పేరా 5, 6వ పేరాలోని ఉపపేరా (1), 7వ పేరాలోని ఉపపేరా (2), 9వ పేరాలోని ఉపపేరా (3), 14వ పేరాలోని ఉపపేరా (1), 15వ పేరాలోని ఉపపేరా (1) మరియు 16వ పేరాలోని ఉపపేరా (1) మరియు (2)ల క్రింద తన కృత్యములను నిర్వర్తించునపుడు మంత్రి పరిషత్తును మరియు తాను అవసరమని భావించినచో సంబంధిత జిల్లా పరిషత్తు లేక ప్రాంతీయ పరిషత్తును సంప్రదించిన మీదట తన వివేచనానుసారము తాను అవసరమని భావించినట్టి చర్య తీసుకొనవలెను.''

క్రొత్త జిల్లా కొరకు ఒక జిల్లా పరిషత్తు తగురీతిగా సంఘటితము చేయబడు వరకు ఆ జిల్లా యొక్క (ఇందు ఇటు పిమ్మట దాని స్థానములోని క్రొత్త జిల్లా పరిషత్తు అని నిర్దేశించబడిన) జిల్లా పరిషత్తుగా భావించబడవలెను.

(2) అస్తిత్వములోనున్న ప్రాంతీయ పరిషత్తు యొక్క ప్రతి సభ్యుడు, ఎన్నుకొనబడిన వాడైనను, నామ నిర్దేశము చేయబడినవాడైనను దాని స్థానములోని క్రొత్త జిల్లా పరిషత్తుకు, ఎన్నుకొనబడినట్లు లేక సందర్భానుసారముగ నామ నిర్దేశము చేయబడినట్లు భావించబడవలెను మరియు అతడు ఈ అనుసూచి క్రింద దాని స్థానములోని క్రొత్త జిల్లా కొరకు ఒక జిల్లా పరిషత్తు తగురీతిగా సంఘటితము చేయబడు వరకు పదవి యందుండవలెను.

(3) ఈ అనుసూచిలోని 2వ పేరా యొక్క (7)వ ఉప-పేరా మరియు 4వ పేరా యొక్క (4)వ ఉప-పేరా క్రింద అస్తిత్వములోనున్న ప్రాంతీయ పరిషత్తుచే చేయబడి విహిత తేదీకి అవ్యవహిత పూర్వము అమలులోనున్న నియమములు, దాని స్థానములోనున్న క్రొత్త జిల్లా పరిషత్తుచే సదరు నిబంధనల క్రింద నియమములు చేయబడువరకు మిజోరాం సంఘరాజ్యక్షేత్రము యొక్క పరిపాలకునిచే చేయబడునట్టి అనుకూలానుసరణలకును, మార్పులకును అధ్యధీనమై, దాని స్థానములోనున్న క్రొత్త జిల్లా పరిషత్తు విషయమున ప్రభావము కలిగియుండవలెను.

(4) మిజోరాం సంఘ రాజ్యక్షేత్రము యొక్క పరిపాలకుడు ఒకటి లేక అంతకెక్కువ ఉత్తరువుల ద్వారా ఈ క్రింది విషయములన్నిటి కొరకు గాని, వాటిలో ఏవేని కొన్నిటి కొరకుగాని నిబంధనలు చేయవచ్చును, అవేవనగా,-

(ఎ) అస్తిత్వములోనున్న ప్రాంతీయ పరిషత్తు యొక్క (దానిచే చేయబడిన ఏదేని కాంట్రాక్టు క్రింద హక్కులు మరియు దాయిత్వములతో సహా) సంపత్తులను, హక్కులను మరియు దాయిత్వములను పూర్ణతఃగాని, భాగతఃగాని దాని స్థానములో నున్న క్రొత్త జిల్లా పరిషత్తుకు అంతరణచేయుట;

(బి) అస్తిత్వములోనున్న ప్రాంతీయ పరిషత్తు ఒక పక్షకారుగానున్నట్టి ఏవేని శాసనబద్ధ ప్రొసీడింగులను దాని స్థానములోనున్న క్రొత్త జిల్లా పరిషత్తుకు చేర్చుట;

(సి) అస్తిత్వములోనున్న ప్రాంతీయ పరిషత్తు యొక్క ఉద్యోగులను దాని స్థానములోనున్న క్రొత్త జిల్లా పరిషత్తుకు బదిలిచేయుట లేక అట్టి ఉద్యోగులు అట్టి క్రొత్త జిల్లా పరిషత్తుచే తిరిగి ఉద్యోగములో నియమించబడుట, అట్లు బదిలీ చేయబడిన లేక తిరిగి ఉద్యోగములో నియమించబడిన పిమ్మట అట్టి ఉద్యోగులకు వర్తించదగు సేవా నిబంధనలు మరియు షరతులు.

(డి) అస్తిత్వములోనున్న ప్రాంతీయ పరిషత్తుచే చేయబడి విహితతేదీకి అవ్యవహిత పూర్వము అమలులోనున్న ఏవేని శాసనములను, అట్టి శాసనములు సమర్థ శాసనమండలిచేగాని ఇతర సమర్థ ప్రాధికారిచే గాని మార్చబడువరకు, రద్దు చేయబడువరకు లేక సవరించబడు వరకు ఈ విషయమై పరిపాలకుడు రద్దు రూపమున గాని, సవరణ రూపమున గాని చేయు అనుకూలానుసరణలకును, మార్పులకును అధ్యధీనమై అనుసరించుట.

(ఇ) పరిపాలకుడు ఆవశ్యకమని భావించునట్టి ఆనుషంగిక, పారిణామిక మరియు అనుపూరక విషయములు.

**20సీ. అర్థాన్వయము:–** ఈ విషయమై చేయబడిన ఏదేని నిబంధనకు అధ్యధీనమై, ఈ అనుసూచి యొక్క నిబంధనలు మిజోరాం సంఘ రాజ్య క్షేత్రమునకు వాటి వర్తింపులో ఈ క్రింది మార్పులతో ప్రభావము కలిగియుండవలెను–

(1) రాజ్య గవర్నరును మరియు రాజ్య ప్రభుత్వమును గూర్చిన నిర్దేశములు 239వ అనుచ్ఛేదము క్రింద నియమించబడిన సంఘ రాజ్యక్షేత్ర పరిపాలకుని గూర్చిన నిర్దేశములైన ఎట్లో అట్లే (''రాజ్య ప్రభుత్వము'' అను పదబంధముతో తప్ప) రాజ్యమును గూర్చిన నిర్దేశములు, మిజోరాం సంఘ రాజ్యక్షేత్రమును గూర్చి చేసిన నిర్దేశములు గాను మరియు మిజోరాం సంఘ రాజ్యక్షేత్ర శాసన సభను గూర్చి చేసిన నిర్దేశములు ఆ రాజ్య శాసనమండలిని గూర్చి చేసిన నిర్దేశములుగా ఉండును;

(2)(ఎ) 4వ పేరా యొక్క (5)వ ఉప–పేరాలో, సంబంధించిన రాజ్య ప్రభుత్వముతో సంప్రదించుటకైన నిబంధన వదిలివేయబడినట్లుగాను;

(బి) 6వ పేరా యొక్క (2)వ ఉప–పేరాలో ''రాజ్యము యొక్క కార్యపాలకాధికారము విస్తరించిన'' అను పదబంధమునకు బదులు ''మిజోరాం సంఘ రాజ్యక్షేత్ర శాసనసభ దేనిని గూర్చి శాసనములను చేయుటకు అధికారము కలిగియున్నదో అట్టి'' అను పదబంధము ఉంచబడినట్లుగాను;

(సి) 13వ పేరాలో ''202వ పరిచ్ఛేదము క్రింద'' అను పదములు, అంకెలు లుప్తము చేయబడినట్లుగాను, ప్రభావము కలిగి ఉండును.

**21. అనుసూచి సవరణ:–** (1) పార్లమెంటు ఆయా సమయములందు శాసనము ద్వారా చేర్పు రూపమున, మార్పు రూపమున లేక రద్దు రూపమున ఈ అనుసూచి యొక్క నిబంధనలలో దేనినైనను సవరణ చేయవచ్చును; మరియు అనుసూచి అట్లు సవరణ చేయబడినప్పుడు ఈ సంవిధానమునందు ఈ అనుసూచిని గూర్చిన ఏ నిర్దేశమైనను అట్లు సవరణ చేయబడినట్టి అనుసూచిని గూర్చిన నిర్దేశముగ అన్వయించబడవలెను.

(2) ఈ పేరా యొక్క (1)వ ఉప–పేరాలో పేర్కొనబడిన ఏ శాసనముగాని, 368వ అనుచ్ఛేదము యొక్క ప్రయోజనముల నిమిత్తము, ఈ సంవిధానము యొక్క సవరణగా భావించబడరాదు.

# ఏడవ అనుసూచి

## (అనుచ్ఛేదము – 246)

## సూచి 1 – సంఘసూచి

1. రక్షణ సన్నాహము మరియు యుద్ధ కాలమున యుద్ధమును నడుపుటకును అది అంతమైన పిమ్మట కట్టుదిట్టమైన సైన్యవియోజనమునకు ఉపయుక్తమగు సకల చర్యలతో సహా భారతదేశము యొక్కయు, అందలి ప్రతి భాగము యొక్కయు రక్షణ.

2. నౌకా, సైనిక మరియు వైమానిక బలములు, సంఘము యొక్క ఏవేని ఇతర సాయుధ బలములు.

[1][2ఏ. సంఘము యొక్క ఏదేని సాయుధ బలమును గాని సంఘము యొక్క నియంత్రణలోనున్న ఏదేని ఇతర బలమునుగాని దాని యొక్క దళమునుగాని యూనిటునుగాని ఏదేని రాజ్యములో సివిలు అధికారమునకు తోడ్పడుటకై అభినియోజనము చేయుట, అట్లు అభినియోజితులై యున్నప్పుడు అట్టి బలములకు చెందిన సభ్యుల అధికారములు, అధికారిత విశేషాధికారములు మరియు బాధ్యతలు.]

3. కంటోన్మెంటు ప్రాంతముల పరిసీమన, అట్టి ప్రాంతములందు స్థానిక స్వపరిపాలన, అట్టి ప్రాంతములందు కంటోన్మెంటు ప్రాధికారుల సంఘటనము, వాని అధికారములు, మరియు అట్టి ప్రాంతములందు (అద్దెల నియంత్రణతో సహా) గృహవసతిని క్రమబద్ధము చేయుట.

4. నౌకా, సైనిక మరియు వైమానిక బలములకు సంబంధించిన నిర్మాణములు.

5. ఆయుధములు, ఆగ్న్యాయుధములు, మందుగుండు సామగ్రి మరియు ప్రేలుడు వస్తువులు.

6. అణుశక్తి మరియు దాని ఉత్పాదనకు ఆవశ్యకమగు ఖనిజ వనరులు.

7. రక్షణ నిమిత్తముగాని, యుద్ధమును నడుపుటకు గాని ఆవశ్యకమైనవని పార్లమెంటు శాసనము ద్వారా ప్రఖ్యానించు పరిశ్రమలు.

8. కేంద్ర గుప్త సమాచారముల మరియు దర్యాప్తుల బ్యూరో.

9. రక్షణకు, విదేశ వ్యవహారములకు, లేక భారతదేశ భద్రతకు సంబంధించిన కారణములను బట్టి నివారక నిరోధము, అట్టి నిరోధమునకు గురికావించబడిన వ్యక్తులు.

10. విదేశ వ్యవహారములు, సంఘమునకు ఏ విదేశముతోనైనను సంబంధమును కలిగించు సకల విషయములు.

11. రాజ దౌత్య, వాణిజ్య మరియు వ్యాపారిక ప్రాతినిధ్యము.

12. ఐక్యరాజ్య సమితి.

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 57వ పరిచ్ఛేదము ద్వారా 03.01.1977 నుండి చొప్పించబడినది.

13. అంతర్జాతీయ సమ్మేళనములలోను, అసోసియేషనులలోను ఇతర నియమకాలలోను పాల్గొనుట మరియు అందు చేయబడు నిర్ణయములను అమలు పరచుట.

14. విదేశములతో సంధులను, కరారులను చేసికొనుట మరియు విదేశములతో చేసికొనిన సంధులను, కరారులను, సాముదాయక నిర్ణయములను అమలు పరచుట.

15. యుద్ధము మరియు శాంతి.

16. విదేశీ అధికారిత.

17. పౌరత్వము, పౌరత్వ ప్రధానము మరియు అన్య దేశీయులు.

18. ప్రత్యర్పణ.

19. భారతదేశములోనికి ప్రవేశము మరియు భారతదేశము నుండి వలస వెళ్లుట మరియు భారతదేశము నుండి బహిష్కరణ, పాస్‌పోర్టులు మరియు వీసాలు.

20. భారతదేశము వెలుపలి స్థలములకు తీర్థయాత్రలు.

21. బాహ్య సముద్రములందు లేక విమానయాన మార్గములందు జరుపబడిన దోపిడీలు, నేరములు, భూమి మీద గాని, బాహ్య సముద్రములందుగాని విమానాయాన మార్గమునందు గాని అంతర్జాతీయ శాసనమునకు విరుద్ధముగ చేయబడిన అపరాధములు.

22. రైలు మార్గములు.

23. పార్లమెంటుచే చేయబడిన శాసనము ద్వారా లేక దాని క్రింద గాని జాతీయ రహదారులుగా ప్రఖ్యానించబడిన రహదారులు.

24. పార్లమెంటుచే శాసనము ద్వారా జాతీయ జలమార్గములుగా ప్రఖ్యానించబడిన దేశీయ జల మార్గములపై, యంత్రచాలిత జలయానములకు సంబంధించిన నౌవహనము మరియు నౌపరి వాహనము, అట్టి జలమార్గములలో పథనియమములు.

25. పోటు నీటియందు నౌవహనము మరియు నౌపరి వాహనములతో సహా సముద్ర నౌవహనము మరియు నౌపరివహనములు, వర్తక నావలకు సంబంధించిన విద్య మరియు ప్రశిక్షణ ఏర్పాటు, మరియు రాజ్యములచే మరియు ఇతర ఏజెన్సీలచే ఏర్పాటు చేయబడిన అట్టి విద్యను మరియు ప్రశిక్షణను క్రమబద్ధము చేయుట.

26. దీపపుటోడలు, ఆకాశదీపములతో సహా దీపగృహములు మరియు నౌవహనము యొక్కయు వాయుయానముల యొక్కయు భద్రతకుగాను ఇతర ఏర్పాట్లు.

27. పార్లమెంటుచే చేయబడిన లేక అస్తిత్వములోనున్న శాసనము ద్వారా లేక ఆ శాసనము క్రింద పెద్ద ఓడరేవులని ప్రఖ్యానించబడిన ఓడరేవులు, వాటి పరిసీమనతో సహా అందలి ఓడరేవు ప్రాధికారుల సంఘటనము మరియు అధికారములు.

28. ఓడరేవుల క్వారంటైను, దానికి సంబంధించిన వైద్యశాలలతో సహా, నావికుల మరియు సముద్రీయ వైద్యశాలలు.

29. వాయు మార్గములు, విమానములు మరియు విమాన యానము, విమానాశ్రయముల ఏర్పాటు, వాయు మార్గమున రవాణా యొక్కయు, విమానాశ్రయముల యొక్కయు క్రమబద్ధీకరణ మరియు వ్యవస్థాపన, వైమానిక విద్యకును, ప్రశిక్షణకును ఏర్పాటు మరియు రాజ్యములచే మరియు ఇతర ఏజెన్సీలచే ఏర్పాటు చేయబడిన అట్టి విద్య యొక్కయు, ప్రశిక్షణ యొక్కయు క్రమబద్ధీకరణ.

30. రైలు మార్గమున, సముద్ర లేక వాయు మార్గమున లేక యంత్రచాలిత జలయానములతో జాతీయ జలమార్గములందు ప్రయాణీకులను మరియు సరకులను కొనిపోవుట.

31. తపాలా మరియు తంతి, టెలిఫోనులు, వైర్‌లెసు, రేడియో ప్రసారము మరియు అట్టి ఇతర సందేశ సాధనములు.

32. [1][* * *] ఒక రాజ్యములో స్థితమైయున్న ఆస్తి విషయమున పార్లమెంటు శాసనము ద్వారా అన్యథా నిబంధించునంత మేరకు తప్ప ఆ రాజ్యముచే చేయబడు శాసనములకు అధ్యధీనమై, సంఘము యొక్క ఆస్తి మరియు దాని వలన రెవిన్యూ.

[2][33. * * *]

34. ఇండియాలోని రాజ్యముల రాజ్యాధీశుల ఎస్టేట్లుకు కోర్టు ఆఫ్ వార్డ్సు.

35. సంఘము యొక్క పబ్లికు ఋణము.

36. కరెన్సీ నాణెముల పద్ధతి మరియు శాసన సమ్మత సిక్కా (టెండర్లు), విదేశీ మారకము.

37. విదేశీయ అప్పులు.

38. రిజర్వు బ్యాంకు ఆఫ్ ఇండియా.

39. తపాలాకార్యాలయ పొదుపు బ్యాంకు.

40. భారత ప్రభుత్వముచే గాని, ఏదేని రాజ్యప్రభుత్వముచే గాని నడుపబడు లాటరీలు.

41. విదేశములతో వ్యాపారము మరియు వాణిజ్యము, కస్టమ్స్ సరిహద్దుల మీదుగా దిగుమతి మరియు ఎగుమతి, కస్టమ్స్ సరిహద్దుల పరినిశ్చయము.

42. అంతర్ రాజ్య వ్యాపారము మరియు వాణిజ్యము.

43. సహకార సంఘములు మినహా, బ్యాంకింగు, భీమా మరియు విత్తీయ కార్పొరేషనులతో సహా, వ్యాపార కార్పొరేషనుల నిగమనము, క్రమబద్ధీకరణ మరియు పరిసమాపనము.

---

1. సంవిధాన (ఐదవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా ''మొదటి అనుసూచిలోని భాగము-ఏలో నిర్దిష్టపరచిన'' అనుపదములు మరియు అక్షరము, 01.11.1956 నుండి వదిలివేయబడినది.
2. అదే చట్టము యొక్క 26వ పరిచ్ఛదము ద్వారా 33వ నమోదు లుప్తము చేయబడినది.

44. విశ్వవిద్యాలయములు మినహా, ఒకే రాజ్యమునకు పరిమితము కాని ఉద్దేశములు కలిగియుండి వ్యాపారము చేయునట్టివైనను, కానట్టివైనను, కార్పొరేషనుల నిగమనము, క్రమబద్ధీకరణ మరియు పరిసమాపనము.

45. బ్యాంకింగు.

46. వినిమయ పత్రములు, చెక్కులు, ప్రామిసరి నోట్లు మరియు అట్టి ఇతర పత్రములు.

47. భీమా.

48. స్టాకు వినిమయ విపణులు మరియు సట్టా మార్కెట్లు.

49. పేటెంట్లు, నవకల్పనలు మరియు రూప కల్పనలు, కాపీరైటు వ్యాపార చిహ్నములు మరియు పణ్య చిహ్నములు.

50. తూనికల మరియు కొలతల ప్రమాణముల నిర్ణయము.

51. భారతదేశము నుండి వెలుపలకు ఎగుమతి చేయబడు లేక ఒక రాజ్యము నుండి మరొక రాజ్యమునకు రవాణా చేయబడు సరకుల నాణ్యతా ప్రమాణముల నిర్ణయము.

52. ప్రజాహితము దృష్ట్యా సంఘముచే నియంత్రించబడుట సముచితమని పార్లమెంటుచే శాసనము ద్వారా ప్రఖ్యానించబడినట్టి పరిశ్రమలు.

53. నూనెగనుల యొక్కయు ఖనిజ తైల వనరుల యొక్కయు క్రమబద్ధీకరణ మరియు అభివృద్ధి, పెట్రోలియము మరియు పెట్రోలియము ఉత్పత్తులు, అపాయకరమగు జ్వలనీయములని పార్లమెంటు శాసనము ద్వారా ప్రఖ్యానించు ఇతర ద్రవములు మరియు పదార్థములు.

54. ప్రజాహితము దృష్ట్యా సంఘముచే నియంత్రించబడుట సముచితమని పార్లమెంటుచే శాసనము ద్వారా ప్రఖ్యానించబడునంత మేరకు, గనుల క్రమబద్ధీకరణ, ఖనిజముల అభివృద్ధి.

55. గనులలోను, నూనెగనులలోను శ్రామికుల యొక్క మరియు భద్రత యొక్క క్రమబద్ధీకరణ.

56. ప్రజాహితము దృష్ట్యా సంఘముచే నియంత్రించబడుట సముచితమని పార్లమెంటుచే శాసనము ద్వారా ప్రఖ్యానించబడునంత మేరకు, అంతర్రాజ్య నదుల యొక్కయు నదిలోయల యొక్కయు క్రమబద్ధీకరణ మరియు అభివృద్ధి.

57. జల ప్రాంగణములకు వెలుపల చేపలు పట్టుట మరియు మత్స్యక్షేత్రములు.

58. సంఘము యొక్క ఏజెన్సీలచే ఉప్పు తయారీ, సరఫరా మరియు పంపిణీ, ఇతర ఏజెన్సీలచే ఉప్పు తయారీ సరఫరా మరియు పంపిణీల క్రమబద్ధీకరణ మరియు నియంత్రణ.

59. నల్లమందు సేద్యము, దాని తయారీ మరియు ఎగుమతి కొరకు విక్రయము.

60. ప్రదర్శనార్థము చలన చిత్రముల మంజూరీ.

61. సంఘ ఉద్యోగులకు సంబంధించిన పారిశ్రామిక వివాదములు.

62. ఈ సంవిధాన ప్రారంభమున జాతీయ గ్రంథాలయము, భారతీయ వస్తుప్రదర్శనశాల, సామ్రాజ్య యుద్ధవస్తు ప్రదర్శనశాల, విక్టోరియా స్మారక చిహ్నము మరియు ఇండియా యుద్ధస్మారక చిహ్నములని అనబడుచుండిన సంస్థలు, మరియు భారత ప్రభుత్వముచే పూర్తిగాగాని కొంతవరకుగాని విత్తము సమకూర్చబడిన మరియు జాతీయ ప్రాముఖ్యముగల సంస్థలని పార్లమెంటుచే శాసనముద్వారా, ప్రఖ్యానించబడిన ఇతర తాదృశ సంస్థలు.

63. ఈ సంవిధాన ప్రారంభమున బెనారసు హిందూ విశ్వవిద్యాలయము, ఆలిఘర్ ముస్లిము విశ్వవిద్యాలయము మరియు [1][ఢిల్లీ విశ్వవిద్యాలయము అని అనబడుచుండిన సంస్థలు మరియు 371ఈ ని పురస్కరించుకొని స్థాపించబడిన విశ్వవిద్యాలయము,] జాతీయ ప్రాముఖ్యము గల సంస్థ అని పార్లమెంటుచే శాసనము ద్వారా ప్రఖ్యానించబడిన ఏదేని ఇతర సంస్థ.

64. భారత ప్రభుత్వముచే పూర్తిగా గాని కొంతవరకుగాని విత్తము సమకూర్చబడిన మరియు జాతీయ ప్రాముఖ్యముగల సంస్థలన్ని పార్లమెంటుచే శాసనము ద్వారా ప్రఖ్యానించబడిన, వైజ్ఞానిక లేక సాంకేతిక విద్యాసంస్థలు.

65. ఈ క్రింది వాటికిగాను సంఘము యొక్క ఏజెన్సీలు మరియు సంస్థలు–

(ఎ) పోలీసు అధికారుల ప్రశిక్షణతో సహా, వృత్తిక, వృత్తి సంబంధ లేక సాంకేతిక ప్రశిక్షణ; లేక

(బి) విశేష అధ్యయనములను లేక పరిశోధనలను పెంపొందించుట; లేక

(సి) నేరములను దర్యాప్తు చేయుటలో లేక ఆచూకీ తీయుటలో వైజ్ఞానిక, లేక సాంకేతిక సహాయము.

66. ఉన్నత విద్యా లేక పరిశోధనా సంస్థలలోను, వైజ్ఞానిక మరియు సాంకేతిక సంస్థలోను, ప్రమాణముల సమన్వయము మరియు నిర్ధారణ.

67. జాతీయ ప్రాముఖ్యముగలవని [2][పార్లమెంటుచే చేయబడిన శాసనము ద్వారా లేక దాని క్రింద ప్రఖ్యానించబడిన] ప్రాచీన మరియు చారిత్రక స్మారక చిహ్నములు, రికార్డులు మరియు పురాతత్వీయ స్థలములు మరియు అవశేషములు.

68. భారతదేశము యొక్క సర్వే, భారతదేశము యొక్క భూగర్భ, వృక్ష, జంతు, మానవ విజ్ఞాన సర్వేలు, వాతావరణ శాస్త్ర సంబంధమైన వ్యవస్థలు.

69. జనగణన.

70. సంఘము యొక్క పబ్లిక్ సేవావర్గములు, అఖిల భారత సేవావర్గములు, సంఘపబ్లికు సేవా కమీషను.

---

1. సంవిధాన (ముప్పది రెండవ సవరణ) చట్టము, 1973 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా ''ఢిల్లీ విశ్వవిద్యాలయము మరియు'' అను పదములకు బదులుగా 01.07.1974వ తేదీ నుండి ఉంచబడినది.
2. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 27వ పరిచ్ఛేదము ద్వారా ''పార్లమెంటుచే శాసనము ద్వారా ప్రఖ్యానించబడిన'' అను పదములకు బదులుగా 01.11.1956 నుండి ఉంచబడినది.

71. సంఘము యొక్క పింఛనులు అనగా భారత ప్రభుత్వముచే గాని, భారత సంచిత నిధి నుండి గాని చెల్లించబడవలసిన పింఛనులు.

72. పార్లమెంటుకు, రాజ్య శాసనమండలులకు, మరియు రాష్ట్రపతి, ఉప రాష్ట్రపతి పదవులకు ఎన్నికలు, ఎన్నికల కమీషను.

73. పార్లమెంటు సభ్యుల యొక్కయు, రాజ్యసభ సభాపతి యొక్కయు ఉపసభాపతి యొక్కయు, లోకసభాధ్యక్షుని యొక్కయు ఉపాధ్యక్షుని యొక్కయు, జీతములు మరియు బత్తెములు.

74. పార్లమెంటు ప్రతి సదనము యొక్కయు, ప్రతి సదనపు సభ్యుల యొక్కయు కమిటీల యొక్కయు అధికారములు, విశేషాధికారములు మరియు ఉన్ముక్తతాధికారములు పార్లమెంటు యొక్క కమిటీల సమక్షమునగాని పార్లమెంటుచే నియమింపబడిన కమీషనుల సమక్షమునగాని సాక్ష్యమునిచ్చుటకు లేక వారి సమక్షమున దస్తావేజులను దాఖలు చేయుటకు తప్పనిసరిగా వ్యక్తులను హాజరగునట్లు చేయుట.

75. రాష్ట్రపతి యొక్క మరియు గవర్నర్ల యొక్క ఉపలబ్ధులు, బత్తెములు విశేషాధికారములు మరియు గైరు హాజరీ సెలవును గూర్చిన హక్కులు, సంఘము యొక్క మంత్రుల జీతములు మరియు బత్తెములు, కంప్ట్రోలరు మరియు ఆడిటరు జనరలు జీతములు, బత్తెములు మరియు గైరుహాజరీ సెలవును గూర్చిన హక్కులు మరియు ఇతర సేవా షరతులు.

76. సంఘము యొక్కయు రాజ్యముల యొక్కయు లెక్కల ఆడిటు.

77. సర్వోన్నత న్యాయస్థానము యొక్క సంఘటన, వ్యవస్థాపన, అధికారిత మరియు అధికారములు (అట్టి న్యాయస్థాన ధిక్కారముతో సహా) మరియు అందు తీసికొనబడు ఫీజు; సర్వోన్నత న్యాయస్థానము సమక్షమున న్యాయవాద వృత్తి చేయుటకు హక్కుగల వ్యక్తులు.

78. ఉన్నత న్యాయస్థానముల అధికారులను మరియు సేవకులను గురించిన నిబంధనలు తప్ప, [1][విరామ కాలములలో సహా] ఉన్నత న్యాయస్థానముల సంఘటన మరియు వ్యవస్థాపన, ఉన్నత న్యాయస్థానముల సమక్షమున న్యాయవాద వృత్తి చేయుటకు హక్కుగల వ్యక్తులు.

[2][79. ఉన్నత న్యాయస్థానము యొక్క అధికారితను ఏదేని సంఘ రాజ్యక్షేత్రమునకు విస్తరింపజేయుట లేక ఏదేని సంఘరాజ్యక్షేత్రము నుండి అపవర్జించుట.]

80. ఏదేని రాజ్యమునకు చెందిన పోలీసు బలముల యొక్క సభ్యుల అధికారములను మరియు అధికారితను ఆ రాజ్యమునకు వెలుపల నుండు ఏ ప్రాంతముకైనను విస్తరింపజేయుట, కాని ఈ విస్తరణ ఒక రాజ్యము యొక్క పోలీసుకు, ఆ రాజ్యమునకు వెలుపల నుండు ఏదేని ప్రాంతములో, అట్టి ప్రాంతము ఏ రాజ్యములో స్థితమైయున్నదో ఆ రాజ్యప్రభుత్వము యొక్క సమ్మతి లేకుండ, ఆ

---

1. సంవిధాన (పదిహేనవ సవరణ) చట్టము, 1963 యొక్క 12వ పరిచ్ఛేదము ద్వారా గతకాలిక ప్రభావముతో ఉంచబడినది.

2. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 29వ పరిచ్ఛేదము మరియు అనుసూచి ద్వారా 01.11.1956 నుండి ఉంచబడినది.

అధికారములను మరియు అధికారితను వినియోగించుటకు వీలుకలుగజేయరాదు, ఏదేని రాజ్యమునకు చెందిన పోలీసు బలము యొక్క అధికారములను మరియు అధికారితను ఆ రాజ్యమునకు వెలుపల నుండు రైలు మార్గ ప్రాంతములకు విస్తరింపజేయుట.

81. ఒక రాజ్యము నుండి మరొక రాజ్యమునకు వలసపోవుట, అంతర్రాజ్య క్వారంటైను.

82. వ్యవసాయ రాబడి మినహా ఇతర రాబడిపై పన్నులు.

83. ఎగుమతి సుంకములతో సహా, కస్టమ్సు సుంకములు.

[1][84. భారతదేశములో తయారు చేయబడిన లేక ఉత్పత్తి చేయబడిన ఈ క్రింది వస్తువులపైన క్రూడ్.

(ఎ) పెట్రోలియం క్రూడ్;

(బి) హై స్పీడ్ డీజిల్;

(సి) సాధారణంగా పెట్రోలుగా పిలువబడు మోటారు స్పిరిట్;

(డి) సహజ వాయువు;

(ఇ) వైమానిక టర్బైన్ ఇంధనం; మరియు

(ఎఫ్) పొగాకు మరియు పొగాకు ఉత్పత్తులు.]

85. కార్పొరేషను పన్ను.

86. వ్యవసాయ భూమి మినహా వ్యక్తుల యొక్కయు కంపెనీల యొక్కయు సంపత్తుల పెట్టుబడి విలువపై పన్నులు, కంపెనీల మూలధనముపై పన్నులు.

87. వ్యవసాయ భూమి మినహా ఇతర ఆస్తిని గూర్చిన సంపద సుంకము.

88. వ్యవసాయ భూమి మినహా ఇతర ఆస్తికి ఉత్తరాధికారమును గూర్చిన సంకములు.

89. రైలు, సముద్ర, లేక వాయు మార్గమున కొనిపోబడు సరకులపై లేక ప్రయాణికులపై మార్గాంతపు పన్నులు, ప్రయాణీకులను గురించియు సరకులను గురించియు రైలు కిరాయి పైన పన్నులు.

90. స్టాకు వినిమయ విపణులలోను, సట్టా మార్కెట్లలోను జరుగు వ్యవహారములపై స్టాంపు సుంకములు మినహా ఇతరమైన పన్నులు.

91. వినిమయ పత్రములు, చెక్కులు, ప్రామిసరీనోట్లు, వహన పత్రములు, పరపతి పత్రములు, భీమా పాలసీలు, వాటాల అంతరణ, డిబెంచర్లు, ప్రాతినిధ్యాధికార పత్రములు మరియు రసీదులను గూర్చి స్టాంపు సుంకపు రేట్లు.

---

1. సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 17(ఎ)(i)వ పరిచ్ఛేదము ద్వారా 84వ నమోదుకు బదులుగా 16.9.2016 నుండి ఉంచబడినది.

[1][* * *]

[2][92ఏ. వార్తాపత్రికలు మినహా సరకుల క్రయ విక్రయముల అంతర్రాజ్య వ్యాపార లేక వాణిజ్య సరళిలో జరిగిన యెడల అట్టి క్రయవిక్రయములపై పన్నులు.]

[3][92బీ. సరుకుల రవాణా (రవాణా చేయు వ్యక్తికైనను లేక ఎవరేని ఇతర వ్యక్తికైనను) అంతర్ రాజ్య వ్యాపార లేక వాణిజ్య సరళిలో జరిగిన యెడల అట్టి సరుకుల రవాణాపై పన్నులు.]

[4][* * *]

93. ఈ సూచిలోని ఏదేని విషయమును గూర్చిన శాసనములకు విరుద్ధమైన అపరాధములు.

94. ఈ సూచిలోని ఏదేని విషయము నిమిత్తము పరిశీలనలు, సర్వేలు మరియు గణాంకములు.

95. ఈ సూచిలోని ఏ విషయములు గూర్చియైనను సర్వోన్నత న్యాయస్థానము తప్ప, అన్ని న్యాయస్థానముల అధికారిత మరియు అధికారములు, నౌకాధికరణ విషయక అధికారిత.

96. ఏదేని న్యాయస్థానమునందు తీసుకొనబడు ఫీజు కాకుండ, ఈ సూచిలోని విషయములలో దేనిని గూర్చియైనను ఫీజు.

97. సూచి –2లో లేక సూచి–3లో పేర్కొనబడని ఏదేని పన్నుతో సహా, ఆ రెండు సూచిలలో దేనిలోగాని పేర్కొనబడని ఏదేని ఇతర విషయము.

## సూచి 2 – రాజ్యసూచి

1. ప్రజాశాంతి (కాని సివిలు అధికారులకు సహాయకముగా [5][సంఘము యొక్క ఏదేని నౌకా, సైనిక లేక వైమానిక బలములనుగాని ఏవేని ఇతర సాయుధ బలమునుగాని సంఘము యొక్క నియంత్రణకు లోబడియున్న ఏదేని ఇతర బలముగాని దాని యొక్క ఏదేని దళము లేక యూనిటునుగాని] ఉపయోగించుట మినహా.)

---

1. 92వ నమోదుకు సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 17(ఎ)(ii)వ పరిచ్ఛేదము ద్వారా 16.9.2016 నుండి లుప్తము చేయడమైనది.
2. సంవిధాన (ఆరవ సవరణ) చట్టము, 1956 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 11.9.1956 నుండి చొప్పించబడినది.
3. సంవిధాన (నలభై ఆరవ సవరణ) చట్టము, 1982 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా 2.2.1983 నుండి చొప్పించబడినది.
4. సంవిధాన (ఎనభై ఎనిమిదవ సవరణ) చట్టము, 2003 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా నమోదు 92–సీ (అమలులో లేదు). సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 17(ఎ)(ii)వ పరిచ్ఛేదము ద్వారా 16.9.2016 నుండి లుప్తము చేయబడినది.
5. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 57వ పరిచ్ఛేదము ద్వారా కొన్ని పదములకు బదులుగా 3.1.1977 నుండి ఉంచబడినది.

[1][2. సూచి – 1లోని 2ఏ నమోదులోని నిబంధనలకు అధ్యధీనమై (రైల్వే మరియు గ్రామ పోలీసులతో సహా) పోలీసు.]

3. [2][.........] ఉన్నత న్యాయస్థానము యొక్క అధికారులు మరియు సేవకులు, అద్దె మరియు రెవిన్యూ న్యాయస్థానములలో ప్రక్రియ, సర్వోన్నత న్యాయస్థానము తప్ప అన్ని న్యాయస్థానములలో తీసుకొనబడు ఫీజు.

4. కారాగారములు, సంస్కరణశాలలు, బోర్‌స్టల్ సంస్థలు మరియు తాదృత స్వభావముగల ఇతర సంస్థలు, మరియు వాటియందు నిరోధించబడిన వ్యక్తులు కారాగారములను మరియు ఇతర సంస్థలను ఉపయోగించుటకై ఇతర రాజ్యములతో ఏర్పాట్లు.

5. స్థానిక పరిపాలన అనగా పురపాలక కార్పోరేషన్లు, అబివృద్ధి ట్రస్టులు, జిల్లా బోర్డులు, ఖనిజ ప్రాంతములలో ఆవాస ప్రాధికారులు మరియు స్థానిక స్వపరిపాలన లేక గ్రామ పరిపాలన నిమిత్తము ఇతర స్థానిక ప్రాధికారుల సంఘటన మరియు అధికారములు.

6. ప్రజారోగ్య మరియు పారిశుద్ధ్యము, వైద్య శాలలు మరియు ఔషధశాలలు.

7. భారతదేశము వెలుపలి స్థలములకు కానట్టి తీర్థయాత్రలు.

8. మద్యపానీయములు, అనగా మద్యపానీయముల ఉత్పాదన, తయారీ, స్వాధీనము, రవాణా, క్రయము మరియు విక్రయము.

9. వికలాంగులకును, ఉద్యోగమునకు అయోగ్యులగు వారికిని సహాయము.

10. శవ సమాధి మరియు సమాధి వాటికలు, శవదహనము మరియు శవ దహన వాటికలు.

[3][11. * * *]

12. గ్రంథాలయములు, వస్తుప్రదర్శనశాలలు మరియు రాజ్యముచే నియంత్రణ చేయబడిన లేక విత్తము సమకూర్చబడిన ఇతర తాదృశ సంస్థలు; జాతీయ ప్రాముఖ్యము గలవని [4][పార్లమెంటుచే చేయబడిన శాసనము ద్వారా లేక దాని క్రింద ప్రఖ్యానించబడినవి మినహా], ఇతర ప్రాచీన మరియు చారిత్రక స్మారక చిహ్నములు మరియు రికార్డులు.

13. సంచార మార్గములు, అనగా రోడ్లు, వంతెనలు, బల్లకట్లు మరియు సూచి – 1లో నిర్దిష్టపరచబడని ఇతర సంచార సాధనములు, పురపాలక ట్రామ్వేలు; రజ్జు పథకములు, దేశీయ జలమార్గములను గూర్చి సూచి – 1 యొక్కయు, సూచి – 3 యొక్కయు నిబంధనల కధ్యధీనమై

1. అదే చట్టము ద్వారా నమోదు 2కు బదులుగా ఉంచబడినది.
2. అదే చట్టము ద్వారా కొన్ని పదములు లుప్తము చేయబడినవి.
3. అదే చట్టము యొక్క 57వ పరిచ్ఛేదము ద్వారా నమోదు 11ను లుప్తము చేయబడినది.
4. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 27వ పరిచ్ఛేదము ద్వారా 01.11.1956 నుండి ఉంచబడినది.

దేశీయ జలమార్గములు మరియు వాటిపై రవాణా, యంత్రచాలిత వాహనములు మినహా ఇతర వాహనములు.

14. వ్యవసాయ విద్య మరియు పరిశోధన, చీడపురుగుల నుండి రక్షణ మరియు మొక్కల తెగుళ్ళ నివారణతో సహా, వ్యవసాయము.

15. పశుగణ పరిరక్షణ, రక్షణ మరియు అభివృద్ధి మరియు జంతురోగముల నివారణ, పశువైద్య ప్రశిక్షణ మరియు వృత్తి.

16. బందెలదొడ్లు మరియు పశువుల అక్రమప్రవేశము నివారించుట.

17. సూచి – 1లోని నమోదు 56 యొక్క నిబంధనలకు అధ్యధీనమై జలము అనగా నీటి సరఫరాలు, నీటిపారుదల మరియు కాలువలు, మురుగు నీటి పారుదల మరియు పోతగట్లు, జల సంచయము మరియు జలశక్తి.

18. భూమి, అనగా భూమిలో లేక భూమిపై హక్కులు, భూస్వామికి మరియు కౌలుదారుకు మధ్య సంబంధముతో సహా, భూమి కౌళ్ళు మరియు కౌలు బాడుగ వసూలు, వ్యవసాయ భూమి యొక్క అంతరణ మరియు అన్యాక్రాంతము, భూమి అభివృద్ధి మరియు వ్యవసాయ అప్పులు, ఉపనివేశనము.

[1][19. * * * *

20. * * * *]

21. మత్స్యక్షేత్రములు.

22. సూచి–Iలోని నమోదు 34 యొక్క నిబంధనలకు అధ్యధీనమై, కోర్టు ఆఫ్ వార్డ్స్, భారగ్రస్తమైన మరియు జప్తు చేయబడిన ఎస్టేట్లు.

23. సంఘ నియంత్రణ క్రింద క్రమబద్ధీకరణ మరియు అభివృద్ధిని గూర్చి జాబితా–Iలో గల నిబంధనలకు అధ్యధీనమై, గనుల యొక్క క్రమబద్ధీకరణ మరియు ఖనిజాభివృద్ధి.

24. సూచి –Iలోని 2 [2][నమోదులు 7 మరియు 52] యొక్క నిబంధనలకు అధ్యధీనమైన పరిశ్రమలు.

25. గ్యాసు మరియు గ్యాసు కర్మాగారము.

26. సూచి –IIIలోని నమోదు 33 యొక్క నిబంధనలకు అధ్యధీనమై, రాజ్యము లోపల వ్యాపారము మరియు వాణిజ్యము.

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 57వ పరిచ్ఛేదము ద్వారా 19, 20 మరియు 29వ నమోదులు 3.1.1977 నుండి వదిలివేయబడినవి.
2. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 28వ పరిచ్ఛేదము ద్వారా ''52వ నమోదుకు'' బదులుగా 01.11.1956 నుండి ఉంచబడినది.

27. సూచి –IIIలోని నమోదు 33 యొక్క నిబంధనలకు అధ్యధీనమై, సరకుల ఉత్పాదన, మరియు పంపిణీ.

28. మార్కెట్లు మరియు సంతలు.

[1][29. * * *]

30. వడ్డీ వ్యాపారము మరియు వడ్డీ వ్యాపారస్తులు, వ్యవసాయిక ఋణగ్రస్తత్యా నివారణ.

31. పాంథశాలలు మరియు పాంథశాలల పాలకులు.

32. సూచి –Iలో నిర్దిష్టపరచబడినవి మినహా ఇతర కార్పొరేషనుల విశ్వవిద్యాలయముల నిగమనము క్రమబద్ధీకరణ మరియు పరిసమాపనము, నిగమితముకాని వ్యాపార, సాహిత్య, వైజ్ఞానిక మత మరియు ఇతర సంఘములు మరియు అసోసియేషనులు, సహకార సంఘములు.

33. రంగశాలలు మరియు నాటక ప్రదర్శనములు, సూచి –Iలోని నమోదు 60 యొక్క నిబంధనలకు అధ్యధీనమై సినిమాలు, క్రీడలు, వినోదములు మరియు మనోరంజకములు.

34. పందెములాడుట మరియు జూదము.

35. రాజ్యమునందు నిహితమైన లేక దాని స్వాధీనములోనున్న నిర్మాణములు, భూములు మరియు భవనములు.

[2][36. * * *]

37. పార్లమెంటుచే చేయబడిన ఏదేని శాసనము యొక్క నిబంధనలకు అధ్యధీనమై రాజ్యశాసనమండలికి ఎన్నికలు.

38. రాజ్య శాసనమండలి సభ్యుల యొక్కయు, శాసనసభ అధ్యక్షుని మరియు ఉపాధ్యక్షుని యొక్కయు, శాసన పరిషత్తు ఉన్నచో ఆ పరిషత్తు యొక్క సభాపతి మరియు ఉపసభాపతుల యొక్కయు జీతములు మరియు బత్తెములు.

39. శాసన సభ యొక్కయు, దాని సభ్యుల యొక్కయు, దాని కమిటీల యొక్కయు, మరియు శాసన పరిషత్తు ఉన్నచో ఆ పరిషత్తు యొక్కయు, దాని సభ్యుల యొక్కయు, దాని కమిటీల యొక్కయు అధికారములు, విశేషాధికారములు మరియు ఉన్ముక్తతాధికారములు, రాజ్య శాసన మండలి యొక్క కమిటీల సమక్షమున సాక్ష్యమిచ్చుటకు లేక వాని సమక్షమున దస్తావేజులను దాఖలు చేయుటకు తప్పనిసరిగా వ్యక్తులను హాజరగునట్లు చేయుట.

40. రాజ్యము యొక్క మంత్రుల జీతములు మరియు బత్తెములు.

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 57వ పరిచ్ఛేదము ద్వారా 3.1.1977 నుండి 29వ నమోదు లుప్తము చేయబడినది.
2. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 26వ పరిచ్ఛేదము ద్వారా 1.11.1956 నుండి 36వ నమోదు లుప్తము చేయబడినది.

41. రాజ్యము యొక్క పబ్లికు సేవా వర్గములు, రాజ్య పబ్లికు సేవా కమీషను.

42. రాజ్యపు ఫించనులు అనగా రాజ్యముచే, లేక రాజ్య సంచిత నిధి నుండి చెల్లించబడదగు పింఛనులు.

43. రాజ్యము యొక్క పబ్లికు ఋణము.

44. భూనిక్షిప్తములు.

45. శిస్తు నిర్ధారణ మరియు వసూలు, భూసంబంధ రికార్డుల నిర్వహణ, రెవిన్యూ ప్రయోజనముల కొరకును హక్కుల రికార్డుల కొరకును సర్వే, మరియు శిస్తుల అన్యాక్రాంతముతో సహా భూమిశిస్తు.

46. వ్యవసాయ రాబడిపై పన్నులు.

47. వ్యవసాయ భూమికి ఉత్తరాధికారమును గూర్చిన సుంకములు.

48. వ్యవసాయ భూమిని గూర్చిన సంపద సుంకము.

49. భూముల పైనను భవనముల పైనను పన్నులు.

50. ఖనిజముల అభివృద్ధికి సంబంధించి పార్లమెంటుచే శాసనము ద్వారా విధించబడిన ఏవేని పరిమితులకు అధ్యధీనమై ఖనిజముల హక్కులపై పన్నులు.

51. మద్యముతోగాని, ఈ పద్దు యొక్క ఉప పేరా (బి)లో చేర్చబడిన ఏదేని పదార్థముతోగాని, కూడియున్న ఔషధ మరియు ప్రసాధన పదార్థములు మినహా, రాజ్యములో తయారు చేయబడిన లేక ఉత్పత్తి చేయబడిన ఈ క్రింది సరుకులపై ఎక్సైజు సుంకములు, మరియు భారతదేశములో వేరొకచోట తయారు చేయబడిన లేక ఉత్పత్తి చేయబడిన తాదృశ సరుకులపై అవే రేట్ల ప్రకారము లేక అంతకు తక్కువ రేట్ల ప్రకారము సమానీకరణ సుంకములు,-

(ఎ) మనుష్యులు సేవించుటకు మద్యములు;

(బి) నల్లమందు, గంజాయి మరియు మత్తు కలిగించు ఇతర ఔషధములు మరియు మత్తు పదార్థములు.

[1][52. * * *]

53. విద్యుచ్ఛక్తి వినియోగముపై లేక విక్రయముపై పన్నులు.

[2][54. పెట్రోలియం క్రూడ్, హై స్పీడ్ డీజిలు, (సాధారణంగా పెట్రోలుగా పిలువబడు) మోటారు స్పిరిట్, సహజ వాయువు, విమానయాన టర్బైన్ ఇంధనం మరియు మానవ వినియోగమునకైన మత్తు పానీయముల అమ్మకములపై పన్నులు, అయితే ఇందులో అంతర్‌రాజ్య వాణిజ్యం లేదా వ్యాపారము

---

1. సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 17 (బి) (i) పరిచ్ఛేదము ద్వారా 16.9.2015 నుండి నమోదు 52 లుప్తము చేయబడినది.
2. అదే చట్టము యొక్క 17 (బి) (ii) పరిచ్ఛేదము ద్వారా 16.9.2015 నుండి నమోదు 54కు బదులుగా ఉంచబడినది.

యొక్క సరళిలోని అమ్మకము లేదా అంతర్ జాతీయ వాణిజ్యం లేదా వ్యాపారము యొక్క సరళిలోని అట్టి వస్తువుల అమ్మకము చేరి ఉండవు.]

[1][55. * * *]

56. రోడ్లపైగాని దేశీయ జలమార్గములపైగాని కొనిపోబడు సరకులపైనను ప్రయాణికులపైనను పన్నులు.

57. సూచి –IIIలో నమోదు 35 యొక్క నిబంధనలకు అధ్యధీనమై, ట్రాము కార్లతో సహా, యంత్రచాలితములైనట్టివైనను కానట్టివైనను రోడ్లపై ఉపయోగించుటకు తగిన వాహనములపై పన్నులు.

58. జంతువులపైనను పడవలపైనను పన్నులు.

59. రహదారి పన్నులు.

60. వృత్తులు, వ్యాపారములు, అజీవికలు మరియు ఉద్యోగములపై పన్నులు.

61. తలసరి పన్నులు.

[2][62. ఒక పంచాయతీ లేదా ఒక పురపాలిక లేదా ప్రాంతీయ మండలి లేదా ఒక జిల్లా మండలిచే విధించి, వసూలు చేయు మేరకు వినోదములు, మనోరంజకములపై పన్ను.]

63. స్టాంపు సుంకపు రేట్ల విషయమున, సూచి –Iలో నిర్దిష్టపరచబడినవి మినహా, ఇతర దస్తావేజులకు సంబంధించిన స్టాంపు సుంకపు రేట్లు.

64. ఈ సూచిలోని ఏదేని విషయమును గూర్చిన శాసనములకు విరుద్ధమైన అపరాధములు.

65. ఈ సూచిలోని ఏ విషయమును గూర్చియైనను, సర్వోన్నత న్యాయస్థానము తప్ప, అన్ని న్యాయస్థానముల అధికారితా పరిధి మరియు అధికారములు.

66. ఏదేని న్యాయస్థానమునందు తీసికొనబడు ఫీజు కాకుండ, ఈ జాబితాలోని విషయములలో దేనిని గూర్చియైనను ఫీజు.

**సూచి III – ఉభయసామాన్య సూచి**

1. క్రిమినలు శాసనము, ఈ సంవిధాన ప్రారంభమున భారత శిక్షాస్మృతిలో చేర్చబడియున్న విషయములన్నింటితో సహా, కాని సూచి–Iలో లేక సూచి–IIలో నిర్దిష్టపరచబడిన విషయములలో దేనిని గూర్చిన శాసనములకైనను విరుద్ధమైన అపరాధములను అపవర్జించి, మరియు సివలు అధికారులకు

---

1. అదే చట్టము యొక్క 17 (బి) (iii) పరిచ్ఛేదము ద్వారా 16.9.2015 నుండి నమోదు 55 లుప్తము చేయబడినది.
2. సంవిధాన (నూట ఒకటవ సవరణ) చట్టము, 2016 యొక్క 17 (బి) (iv) పరిచ్ఛేదము ద్వారా 16.9.2016 నుండి 62వ నమోదుకు బదులుగా ఉంచబడినది.

సహాయకముగా సంఘము యొక్క నౌక, సైనిక లేక వైమానిక బలములనుగాని ఏవేని ఇతర సాయుధ బలములనుగాని ఉపయోగించుటను అపవర్జించి.

2. ఈ సంవిధాన ప్రారంభమున క్రిమినల్ ప్రక్రియా స్మృతిలో చేర్చబడియున్న విషయములన్నింటితో సహా, క్రిమినలు ప్రక్రియ.

3. రాజ్య భద్రతకు, ప్రజా శాంతిని కాపాడుటకు, సమాజమునకు అత్యావశ్యకమగు సరఫరాల మరియు సేవల నిర్వహణకు సంబంధించిన కారణములను బట్టి నివారక నిరోధము, అట్టి నిరోధమునకు గురి కావించబడిన వ్యక్తులు.

4. ఖైదీలను, అభియుక్త వ్యక్తులను మరియు ఈ జాబితాలోని పద్దు 3లో నిర్దిష్ట పరచబడిన కారణములను బట్టి నివారక నిరోధమునకు గురి కావింపబడిన వ్యక్తులను, ఒక రాజ్యము నుండి మరొక రాజ్యమునకు పంపుట.

5. వివాహము మరియు విడాకులు, శిశువులు మరియు మైనర్లు, దత్తత, వీలునామాలు, మరణ శాసనము లేకుండుట మరియు ఉత్తరాధికారము; సమిష్టికుటుంబము మరియు పంపకము, ఈ సంవిధాన ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము న్యాయిక చర్యలందలి పక్షకారులు ఏ విషయములను గూర్చి వారి వారి వైయక్తిక శాసనమునకు అధ్యధీనులై యుండిరో ఆ విషయములన్నియు.

6. వ్యవసాయ భూమి కానట్టి ఆస్తి యొక్క అంతరణ విలేఖలు మరియు దస్తావేజుల రిజిస్ట్రేషన్.

7. భాగస్వామ్యము, ఏజెన్సీ, రవాణా కాంట్రాక్టులు మరియు ఇతర విశేష రూపపు కాంట్రాక్టులతో సహా, కాని, వ్యవసాయ భూమికి సంబంధించిన కాంట్రాక్టులు మినహా కాంట్రాక్టులు.

8. చర్యాయోగ్య దోషములు.

9. దివాలా మరియు అప్పులు తీర్చలేని స్థితి.

10. ట్రస్టు మరియు ట్రస్టీలు.

11. అడ్మినిస్ట్రేటర్స్-జనరల్ మరియు అధికారిక ట్రస్టీలు.

[1][11ఏ. న్యాయ పరిపాలన, సర్వోన్నత న్యాయస్థానము మరియు ఉన్నత న్యాయస్థానము తప్ప, అన్ని న్యాయస్థానముల సంఘటన మరియు వ్యవస్థీకరణ.]

12. సాక్ష్యము మరియు ప్రమాణములు, శాసనముల యొక్క పబ్లికు కార్యముల యొక్క రికార్డుల యొక్క మరియు న్యాయిక చర్యల యొక్క గుర్తింపు.

13. ఈ సంవిధాన ప్రారంభమున సివిలు ప్రక్రియా స్మృతిలో చేర్చబడియున్న అన్ని విషయములు, కాలపరిమితి మరియు మధ్యవర్తిత్వముతో సహా సివిలు ప్రక్రియ.

---

1. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 57వ పరిచ్ఛేదపు ఖండము (సి)లోని ఉప-ఖండము (i) ద్వారా 3.1.1977 నుండి చొప్పించబడినది.

14. సర్వోన్నత న్యాయస్థానాధికార ధిక్కారము మినహా న్యాయస్థానాధికారధిక్కారము.

15. దేశదిమ్మరితనము, అస్థిరనివాసులైనట్టియు వలసపోవునట్టియు జనజాతులు.

16. ఉన్మాదుల యొక్కయు మరియు మనోవికలుల యొక్కయు ప్రవేశనము లేక చికిత్స కొరకైన స్థలములతో సహా, ఉన్మత్తత మరియు మనోవైకల్యము.

17. జంతువుల యెడ క్రూరతా నివారణ.

[1][17ఏ. అడవులు.

17బీ. వన్యమృగముల మరియు పక్షుల రక్షణ.]

18. ఆహార పదార్థముల ఇతర సరకుల కల్తీ.

19. నల్లమందును గూర్చి సూచి-Iలోని నమోదు 59 యొక్క నిబంధనలకు అధ్యధీనమై, ఔషధములు మరియు విషములు.

20. ఆర్థిక మరియు సాంఘిక ప్రణాళిక రచన.

[2][20ఏ. జనాభా నియంత్రణ మరియు కుటుంబ నియంత్రణ.]

21. వాణిజ్య మరియు పారిశ్రామిక ఏకాధికారములు, కూటములు మరియు ట్రస్టులు.

22. కార్మిక సంఘములు, పారిశ్రామిక మరియు శ్రామిక వివాదములు.

23. సాంఘిక భద్రత మరియు సాంఘిక భీమా; ఉద్యోగము మరియు నిరుద్యోగము.

24. పని పరిస్థితులు, భవిష్యనిధులు, ఉద్యోక్తల దాయిత్వము, కార్మికులకు నష్ట పరిహారము,అసమర్థత మరియు వార్ధక్య పింఛనులు మరియు ప్రసూతి సౌకర్యములతో సహా శ్రామికుల శ్రేయస్సు.

[3][25. సూచి-Iలోని నమోదులు 63, 64, 65 మరియు 66ల నిబంధనలకు అధ్యధీనమై సాంకేతిక విద్య, వైద్య విద్య మరియు విశ్వవిద్యాలయములతో సహా విద్య, శ్రామికుల వృత్తిపర మరియు సాంకేతిక ప్రశిక్షణ.]

26. న్యాయవాద వృత్తి, వైద్యవృత్తి మరియు ఇతర వృత్తులు.

27. భారతదేశ మరియు పాకిస్తాను అధినివేశముల స్థాపన కారణమున మూల నివాసస్థానములను వదలి నిర్వాసితులైన వ్యక్తులకు సహాయము మరియు పునరావాసము.

---

1. అదే చట్టపు 57వ పరిచ్ఛేదపు ఖండము (సి)లోని ఉప-ఖండము (ii) ద్వారా 3.1.1977 నుండి చొప్పించబడినది.
2. అదే చట్టపు 57వ పరిచ్ఛేదపు ఖండము (సి)లోని ఉప-ఖండము (iii) ద్వారా 3.1.1977 నుండి చొప్పించబడినది.
3. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 57వ పరిచ్ఛేదపు ఖండము (2)లోని ఉప-ఖండమ (iv) ద్వారా ఆదిలో ఉన్న దానికి బదులుగా ఇది ఉంచబడినది.

28. దానధర్మములు మరియు ధార్మిక సంస్థలు, ధర్మాదాయములు, దేవాదాయములు మరియు మత సంస్థలు.

29. మనుష్యులకు, జంతువులకు మరియు వృక్షములకు హాని కలిగించు సాంక్రామిక లేక సాంసర్గిక రోగములు మరియు చీడ పురుగులు ఒక రాజ్యము నుండి మరొక రాజ్యమునకు వ్యాపించుటను నివారించుట.

30. జనన మరణముల రిజిస్ట్రీకరణతో సహా జీవన సంబంధిత గణాంకములు.

31. పార్లమెంటుచే చేయబడిన శాసనము ద్వారా లేక దాని క్రిందగాని లేదా అస్తిత్వములోనున్న శాసనము ద్వారాగాని లేక దాని క్రిందగాని, పెద్ద ఓడరేవులని ప్రఖ్యానించబడినవి మినహా ఇతర ఓడ రేవులు.

32. జాతీయ జలమార్గములను గూర్చి సూచి-Iలో గల నిబంధనలకు అధ్యధీనమై దేశీయ జలమార్గములపై యంత్రచాలిత జలయానములకు సంబంధించిన నౌవహనము మరియు నౌపరివాహనము, మరియు అట్టి జలమార్గములపై పథ నియమములు, మరియు దేశీయ జలమార్గములపై ప్రయాణీకులను మరియు సరకులను కొనిపోవుట.

[1][33. ఈ క్రింద తెలిపిన వాటిలో వ్యాపార వాణిజ్యములు మరియు వాటి ఉత్పాదన, సరఫరా మరియు పంపిణీ,-

(ఎ) ప్రజాహితము దృష్ట్యా సంఘముచే నియంత్రించబడుట సముచితమని పార్లమెంటుచే శాసనము ద్వారా ప్రఖ్యానించబడినట్టి ఏదేని పరిశ్రమ యొక్క ఉత్పత్తులు మరియు అట్టి ఉత్పత్తులకు సమానమైన దిగుమతి సరుకులు;

(బి) తినదగిన నూనె గింజలు, నూనెలతో సహా ఆహార పదార్థములు.

(సి) నూనెకేకులు మరియు ఇతర సారకృతములతో సహా పశుగ్రాసం.

(డి) గింజలు తీసినదైనను తీయనిదైనను ముడి ప్రత్తి మరియు ప్రత్తి గింజలు మరియు;

(ఇ) ముడి జనపనార.]

[2][33ఏ. ప్రమాణముల నిర్ణయము తప్ప, తూనికలు మరియు కొలతలు.]

34. ధరల నియంత్రణ.

35. యంత్రచాలిత వాహనములపై పన్నులు విధించబడవలసిన సూత్రములతో సహా యంత్రచాలిత వాహనములు.

---

1. సంవిధాన (మూడవ సవరణ) చట్టము, 1954 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 22.2.1955 నుండి ఉంచబడినది.
2. సంవిధాన (నలుబది రెండవ సవరణ) చట్టము, 1976 యొక్క 57వ పరిచ్ఛేదవు ఖండము (సి)లోని ఉప-ఖండము (v) ద్వారా 3.1.1977 నుండి చొప్పించబడినది.

36. ఫ్యాక్టరీలు.

37. బాయిలర్లు.

38. విద్యుచ్ఛక్తి.

39. వార్తాపత్రికలు, పుస్తకములు మరియు ముద్రణాలయములు.

40. జాతీయ ప్రాముఖ్యముగలవని [1][పార్లమెంటుచే చేయబడిన శాసనము ద్వారా, లేక దాని క్రింద ప్రఖ్యానించబడినవి] మినహా ఇతర పురాతత్వీయ స్థలములు మరియు అవశేషములు.

41. (వ్యవసాయ భూమితో సహా) కాందిశీకుల ఆస్తియని శాసనము ద్వారా ప్రఖ్యానించబడిన ఆస్తి యొక్క అభిరక్ష, నిర్వహణ మరియు వ్యయనము.

[2][42. ఆస్తి యొక్క అధ్యార్జన మరియు అధిగ్రహణ (అధికారముతో గ్రహించుట).]

43. భూమి శిస్తు బకాయిలు మరియు అట్టి బకాయివలె వసూలు చేయదగిన డబ్బుతో సహా, పన్నులను, ఇతరమైన ప్రభుత్వ అధ్యర్జనలను (డిమాండ్లను) గూర్చి, ఏదేని రాజ్యమునకు వెలుపల ఉత్పన్నమగు క్లెయిములను ఆ రాజ్యములో వసూలు చేయుట.

44. స్టాంపు సుంకపు రేట్లు కాకుండా న్యాయిక స్టాంపుల ద్వారా వసూలు చేయబడు సుంకములు లేక ఫీజులు మినహా ఇతర స్టాంపు సుంకము.

45. సూచి-IIలో లేక సూచి-IIIలో నిర్దిష్టపరచబడిన విషయములలో దేనికొరకైనను పరిశీలనలు మరియు గణాంకము.

46. ఈ జాబితాలోని ఏ విషయమును గూర్చియైనను సర్వోన్నత న్యాయస్థానము తప్ప, అన్ని న్యాయస్థానముల అధికారిత మరియు అధికారములు.

47. ఏదేని న్యాయస్థానమునందు తీసికొనబడు ఫీజు కాకుండా, ఈ జాబితాలోని విషయములలో దేనిని గూర్చియైనను ఫీజు.

---

1. సంవిధాన (ఏడవ సవరణ) చట్టము, 1956 యొక్క 27వ పరిచ్ఛేదము ద్వారా ''పార్లమెంటు శాసనము ద్వారా'' అను పదములకు బదులుగా 01.11.1956 నుండి ఉంచబడినది.

2. అదే చట్టము యొక్క 26వ పరిచ్ఛేదము ద్వారా ఉంచబడినది.

## ఎనిమిదవ అనుసూచి

## [అనుచ్ఛేదములు 344(1) మరియు 351]

### భాషలు

| | |
|---|---|
| 1. | అస్సామీ |
| 2. | బెంగాలీ |
| [1][3. | బోడో |
| 4. | డోగ్రి] |
| [2][5.] | గుజరాతీ |
| [3][6.] | హిందీ |
| [3][7.] | కన్నడము |
| [3][8.] | కాశ్మీరీ |
| [4][[3][9.] | కొంకణి |
| [1][10. | మైథిలి] |
| [5][11.] | మళయాళము |
| [4][[6][12.] | మణిపురి] |
| [5][13.] | మరాఠీ |
| [4][[6][14.] | నేపాలి] |
| [6][15.] | [7][ఒడియా] |
| [6][16.] | పంజాబీ |
| [6][17.] | సంస్కృతము |

---

1. సంవిధాన (తొంబై రెండవ సవరణ) చట్టము, 2003 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 7.1.2004 నుండి చొప్పించబడినది.
2. అదే చట్టము ద్వారా నమోదు 3ను, నమోదు 5గా తిరిగి అంకె వేయడమైనది.
3. అదే చట్టము ద్వారా 4 నుండి 7వ నమోదులను, 6 నుండి 9గా తిరిగి అంకె వేయడమైనది.
4. సంవిధాన (డెబ్బై ఒకటవ సవరణ) చట్టము, 1992 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 31.8.1992 నుండి చొప్పించబడినది.
5. సంవిధాన (తొంబై రెండవ సవరణ) చట్టము, 2003 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 8వ నమోదును 11వ నమోదుగా 7.1.2004 నుండి తిరిగి అంకె వేయడమైనది.
6. అదే చట్టము ద్వారా 9 నుండి 14వ నమోదులను, 12 నుండి 17 నమోదులుగా తిరిగి అంకెవేయడమైనది.
7. సంవిధాన (తొంబై ఆరవ సవరణ) చట్టము, 1967 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా ‘‘ఒరియా’’ అను దానికి బదులుగా 23.9.2011 నుండి ఉంచడమైనది.

[1][18. సంథాలి]

[2][[3][19.] సింధీ]

[4][20. తమిళము

[4][21. తెలుగు

[4][22. ఉర్దు

---

1. సంవిధాన (తొంబై రెండవ సవరణ) చట్టము, 2003 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 7.1.2004 నుండి చొప్పించబడినది.
2. సంవిధాన (ఇరవది ఒకటవ సవరణ) చట్టము, 1967 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 10.4.1967 నుండి ఉంచబడినది.
3. సంవిధాన (తొంబై రెండవ సవరణ) చట్టము, 2003 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 15వ నమోదును 19వ నమోదుగా 7.1.2004 నుండి తిరిగి అంకె వేయడమైనది.
4. అదే చట్టము ద్వారా 16 నుండి 18వ నమోదులను, 20 నుండి 22గా తిరిగి అంకె వేయడమైనది.

## [1][**తొమ్మిదవ అనుసూచి**

## [**అనుచ్ఛేదము 31బీ**]

1. బీహారు భూసంస్కరణల చట్టము,1950 (1950లోని 30వ బీహారు చట్టము).
2. బొంబాయి కౌలుదారీ మరియు వ్యవసాయ భూముల చట్టము, 1948 (1948లోని 67వ బొంబాయి చట్టము).
3. బొంబాయి మలెకి టెన్యూరు ఉత్సాదన చట్టము, 1949 (1949లోని 61వ బొంబాయి చట్టము).
4. బొంబాయి తాలుక్‌దారీ టెన్యూరు ఉత్సాదన చట్టము, 1949 (1949లోని 62వ బొంబాయి చట్టము).
5. పంచ మహోల్ల మెహవాసీ టెన్యూరు ఉత్సాదన చట్టము, 1949 (1949లోని 63వ బొంబాయి చట్టము).
6. బొంబాయి ఖోటి ఉత్సాదన చట్టము, 1959 (1959లోని 6వ బొంబాయి చట్టము).
7. బొంబాయి పరగణా మరియు కుల్కర్ణి వతన్ ఉత్సాదన చట్టము, 1950 (1950లోని 60వ బొంబాయి చట్టము).
8. మధ్యప్రదేశ్ ప్రొప్రయిటరీ హక్కుల (ఎస్టేట్లు, మహోళ్లు, అన్యాక్రాంత భూములు) ఉత్సాదన చట్టము, 1950 (1951లోని 1వ మధ్యప్రదేశ్ చట్టము).
9. మదరాసు ఎస్టేట్ల (ఉత్సాదన మరియు రైత్వారీకి మార్పు) చట్టము, 1948 (1948లోని 26వ మదరాసు చట్టము).
10. మదరాసు ఎస్టేటు (ఉత్సాదన మరియు రైత్వారీకి మార్పు) సవరణ చట్టము, 1950 (1950లోని 1వ మదరాసు చట్టము).
11. ఉత్తరప్రదేశ్ జమీందారీ ఉత్సాదన మరియు భూసంస్కరణల చట్టము, 1950 (1951లోని 1వ ఉత్తరప్రదేశ్ చట్టము).
12. హైదరాబాదు (జాగీర్ల ఉత్సాదన) వినియమము, 1358 ఫ. (1358 ఫసలీల యొక్క సంఖ్య 69).
13. హైదరాబాదు జాగీర్ల (మార్పిడి) వినియమము, 1359 ఫ. (1359 ఫసలీ యొక్క సంఖ్య 25).

---

1. సంవిధాన (మొదటి సవరణ) చట్టము, 1951 యొక్క 14వ పరిచ్ఛేదము ద్వారా 18.6.1951 నుండి చేర్చబడినది.

[1][14. బీహారు నిర్వాసితుల పునరావాస (భూమి అధ్యార్జన) చట్టము, 1950 (1950లోని 38వ బీహారు చట్టము).

15. యునైటెడ్ ప్రావిన్సుల భూమి అధ్యార్జన (శరణార్థుల పునరావాసము) చట్టము, 1948 (1948లోని 26వ చట్టము).

16. నిర్వాసితుల పునరావాసపు (భూమి అధ్యార్జన) చట్టము, 1948 (1948లోని 60వ చట్టము).

17. భీమా (సవరణ) చట్టము, 1950 (1950లోని 47వ చట్టము) యొక్క 42వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినట్లుగా, భీమా చట్టము, 1938 (1938లోని 4వ చట్టము)లో చేర్చబడిన పరిచ్ఛేదములు 52ఏ నుండి 52జీ వరకు.

18. రైల్వే కంపెనీల (అత్యయికతా నిబంధనలు) చట్టము, 1951 (1951లోని 51వ చట్టము).

19. పరిశ్రమల (అభివృద్ధి మరియు క్రమబద్ధీకరణ) సవరణ చట్టము, 1953 (1953లోని 26వ చట్టము) యొక్క 13వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినట్లుగా, పరిశ్రమల (అభివృద్ధి మరియు క్రమబద్ధీకరణ) చట్టము, 1951 (1951లోని 65వ చట్టము)లో చేర్చబడిన అధ్యాయము–3ఏ.

20. 1951లోని 29వ పశ్చిమ బెంగాల్ చట్టము ద్వారా సవరించబడిన, పశ్చిమ బెంగాల్ భూమి అభివృద్ధి మరియు ప్రణాళికా రచన చట్టము, 1948 (1948లోని 21వ పశ్చిమ బెంగాలు చట్టము).]

[2][21. ఆంధ్రప్రదేశ్ వ్యవసాయ కమతముల గరిష్ఠ పరిమితి చట్టము, 1961 (1961లోని 10వ ఆంధ్రప్రదేశ్ చట్టము).]

22. ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా ప్రాంత) కౌలుదారీ మరియు వ్యవసాయ భూముల (మాన్యత కలుగజేయు) చట్టము, 1961 (1961లోని 21వ ఆంధ్రప్రదేశ్ చట్టము).

23. ఆంధ్రప్రదేశ్ (తెలంగాణా ప్రాంత) ఇజారా మరియు కౌలీ భూముల అక్రమపట్టాల రద్దు మరియు రాయితీ శిస్తు ఉత్పాదన చట్టము, 1961 (1961లోని 36వ ఆంధ్రప్రదేశ్ చట్టము).

24. అస్సాము రాజ్య సార్వజనిక స్వభావపు మత లేక ధార్మిక సంస్థలకు చెందిన భూముల అర్జన చట్టము, 1959 (1961లోని 9వ అస్సాము చట్టము).

---

1. సంవిధాన (నాలుగవ సవరణ) చట్టము, 1955 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా 27.4.1955 నుండి చొప్పించబడినవి.
2. సంవిధాన (పదిహేడవ సవరణ) చట్టము, 1964 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 20.6.1964 నుండి చొప్పించబడినవి.

25. బీహారు భూసంస్కరణల (సవరణ) చట్టము, 1953 (1953లోని 20వ బీహారు చట్టము).

26. బీహారు భూసంస్కరణల (గరిష్ట పరిమితి విస్తీర్ణ నియతీకరణ మరియు మిగులు భూముల అధ్యార్జన) చట్టము, 1961 (1962లోని 12వ బీహారు చట్టము), (ఈ చట్టము యొక్క 28వ పరిచ్ఛేదము మినహా).

27. బొంబాయి తాలుక్‌దారీ టెన్యూరు ఉత్సాదన (సవరణ) చట్టమ, 1954 (1955లోని 1వ బొంబాయి చట్టము).

28. బొంబాయి తాలుక్‌దారీ టెన్యూరు ఉత్సాదన (సవరణ) చట్టము, 1957 (1958లోని 18వ బొంబాయి చట్టము).

29. బొంబాయి ఇనాముల (కఛ్ ప్రాంత) ఉత్సాదన చట్టము, 1958 (1958లోని 98వ బొంబాయి చట్టము).

30. బొంబాయి కౌలుదారీ మరియు వ్యవసాయ భూముల (గుజరాత్ సవరణ) చట్టము, 1960 (1960లోని 16వ గుజరాతు చట్టము).

31. గుజరాతు వ్యవసాయ భూముల గరిష్ఠ పరిమితి చట్టము, 1960 (1961లోని 26వ గుజరాతు చట్టము).

32. సగ్బర మరియు మెహవాసి ఎస్టేట్ల (ప్రొప్రయిటరీ హక్కుల ఉత్సాదన మొదలగు వాటి) వినియమము, 1962 (1962లోని 1వ గుజరాతు వినియమము).

33. గుజరాతులోని మిగిలియుండిన అన్యాక్రాంతముల ఉత్సాదన చట్టము, 1963 (1963లోని 33వ గుజరాతు చట్టము) ఈ చట్టములోని 2వ పరిచ్ఛేదము యొక్క ఖండము (3) ఉప–ఖండము (డి)లో నిర్దేశించబడిన అన్యాక్రాంతములకు సంబంధించినంత వరకు తప్ప.

34. మహారాష్ట్ర వ్యవసాయ భూముల (కమతముల గరిష్ఠ పరిమితి) చట్టము, 1961 (1961లోని 27వ మహారాష్ట్ర చట్టము).

35. హైదరాబాదు కౌలుదారీ మరియు వ్యవసాయ భూముల (పునః శాసనము చేయు, మాన్యత కలుగజేయు మరియు ఇంకను సవరించు) చట్టము, 1961 (1961లోని 45వ మహారాష్ట్ర చట్టము).

36. హైదరాబాదు కౌలుదారీ మరియు వ్యవసాయ భూముల చట్టము, 1950 (1950లోని 21వ హైదరాబాదు చట్టము).

37. జన్మీకరము చెల్లింపు (ఉత్సాదన) చట్టము, 1960 (1961లోని 3వ కేరళ చట్టము).

38. కేరళ భూమి పన్ను చట్టము, 1961 (1961లోని 13వ కేరళ చట్టము).

39. కేరళ భూసంస్కరణల చట్టము, 1963 (1964లోని 1వ కేరళ చట్టము).

40. మధ్యప్రదేశ్ భూమి శిస్తు కోడ్, 1959 (1959లోని 20వ మధ్యప్రదేశ్ చట్టము).

41. మధ్యప్రదేశ్ వ్యవసాయ కమతముల గరిష్ఠ పరిమితి చట్టము, 1960 (1960లోని 20వ మధ్యప్రదేశ్ చట్టము).

42. మదరాసు సేద్యపు కౌలుదార్ల రక్షణ చట్టము, 1955 (1955లోని 25వ మదరాసు చట్టము).

43. మదరాసు సేద్యపు కౌలుదార్ల (సముచితమైన కౌలు చెల్లింపు) చట్టము, 1956 (1956లోని 24వ మదరాసు చట్టము).

44. మదరాసు కుడియిరుప్పు ఆక్రమణదారుల (తొలగింపు నుండి రక్షణ) చట్టము, 1961 (1961లోని 38వ మదరాసు చట్టము).

45. మదరాసు పబ్లికు ట్రస్టుల (వ్యవసాయ భూముల నిర్వహణను క్రమబద్ధము చేయు) చట్టము, 1961 (1961లోని 57వ మదరాసు చట్టము).

46. మదరాసు భూసంస్కరణల (గరిష్ఠ భూపరిమితి నియతీకరణ) చట్టము, 1961 (1961లోని 58వ మదరాసు చట్టము).

47. మైసూరు కౌలుదారీ చట్టము, 1952 (1952లోని 13వ మైసూరు చట్టము).

48. కూర్గు కౌలుదార్ల చట్టము, 1957 (1957లోని14వ మైసూరు చట్టము).

49. మైసూరు గ్రామ పదవుల ఉత్సాదన చట్టము, 1961 (1961లోని 14వ మైసూరు చట్టము).

50. హైదరాబాదు కౌలుదారీ మరియు వ్యవసాయ భూముల (మాన్యత కలుగజేయు) చట్టము, 1961 (1961లోని 36వ మైసూరు చట్టము).

51. మైసూరు భూసంస్కరణల చట్టము, 1961 (1962లోని 10వ మైసూరు చట్టము).

52. ఒరిస్సా భూసంస్కరణ చట్టము, 1960 (1960లోని 16వ ఒరిస్సా చట్టము).

53. ఒరిస్సా సంవిలీన రాజ్యక్షేత్రముల (గ్రామ పదవుల ఉత్సాదన) చట్టము, 1963 (1963లోని 10వ ఒరిస్సా చట్టము).

54. పంజాబు భూమి టెన్యూరుల సెక్యూరిటీ చట్టము, 1953 (1953లోని 10వ పంజాబు చట్టము).

55. రాజస్థాన్ కౌలుదారీ చట్టము, 1955 (1955లోని 3వ రాజస్థాన్ చట్టము).

56. రాజస్థాన్ జమిందారీ మరియు బిస్వెదారీ ఉత్సాదన చట్టము, 1959 (1959లోని 8వ రాజస్థాన్ చట్టము).

57. కుమాన్ మరియు ఉత్తరాఖండ్ జమీందారీ ఉత్సాదన మరియు భూసంస్కరణల చట్టము, 1960 (1960లోని 17వ ఉత్తరప్రదేశ్ చట్టము).

58. ఉత్తరప్రదేశ్ భూకమతములపై గరిష్ఠ పరిమితి విధింపు చట్టము, 1960 (1961లోని 1వ ఉత్తరప్రదేశ్ చట్టము).

59. పశ్చిమ బెంగాల్ ఎస్టేట్ల అధ్యార్జన చట్టము, 1953 (1954లోని 1వ పశ్చిమ బెంగాల్ చట్టము).

60. పశ్చిమ బెంగాల్ భూసంస్కరణల చట్టము, 1955 (1956లోని 10వ పశ్చిమ బెంగాల్ చట్టము).

61. ఢిల్లీ భూసంస్కరణల చట్టము, 1954 (1954లోని 8వ ఢిల్లీ చట్టము).

62. ఢిల్లీ భూకమతముల (గరిష్ట పరిమితి) చట్టము, 1960 (1960లోని 24వ కేంద్ర చట్టము).

63. మణిపూర్ భూమిశిస్తు మరియు భూసంస్కరణల చట్టము, 1960 (1960లోని 33వ కేంద్ర చట్టము).

64. త్రిపుర భూమి శిస్తు మరియు భూసంస్కరణల చట్టము, 1960 (1960లోని 43వ కేంద్ర చట్టము).]

[1][65. కేరళ భూసంస్కరణల (సవరణ) చట్టము, 1969 (1969లోని 35వ కేరళ చట్టము).

66. కేరళ భూసంస్కరణల (సవరణ) చట్టము, 1971 (1971లోని 25వ కేరళ చట్టము).]

[2][67. ఆంధ్రప్రదేశ్ భూసంస్కరణల (వ్యవసాయ కమతముల గరిష్ఠ పరిమితి చట్టము, 1973 (1973లోని 1వ ఆంధ్రప్రదేశ్ చట్టము).

68. బీహారు భూసంస్కరణల (గరిష్ఠ పరిమితి విస్తీర్ణ నియతీకరణ మరియు మిగులు భూముల ఆర్జన) (సవరణ) చట్టము, 1973 (1973లోని 1వ బీహారు చట్టము).

69. బీహారు భూసంస్కరణల (గరిష్ఠ పరిమితి విస్తీర్ణ నియతీకరణ మరియు మిగులు భూముల ఆర్జన) (సవరణ) చట్టము, 1973 (1973లోని 9వ బీహారు చట్టము).

70. బీహారు భూసంస్కరణల (సవరణ) చట్టము, 1972 (1972లోని 5వ బీహారు చట్టము).

71. గుజరాతు వ్యవసాయ భూముల గరిష్ఠ పరిమితి (సవరణ) చట్టము, 1972 (1974లోని 2వ గుజరాతు చట్టము).

---

1. సంవిధాన (ఇరవై తొమ్మిదవ సవరణ) చట్టము, 1972 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 9.6.1972 నుండి చొప్పించబడినవి.
2. సంవిధాన (ముప్పై నాలుగవ సవరణ) చట్టము, 1974 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా చొప్పించబడినవి.

72. హర్యానా భూకమతముల గరిష్ట పరిమితి చట్టము, 1972 (1972లోని 26వ హర్యానా చట్టము).

73. హిమాచల్ ప్రదేశ్ భూకమతముల గరిష్ట పరిమితి చట్టము, 1972 (1973లోని 19వ హిమాచల్ ప్రదేశ్ చట్టము).

74. కేరళ భూసంస్కరణల (సవరణ) చట్టము, 1972 (1972లోని 17వ కేరళ చట్టము).

75. మధ్యప్రదేశ్ వ్యవసాయ కమతముల గరిష్ట పరిమితి (సవరణ) చట్టము, 1972 (1974లోని12వ మధ్యప్రదేశ్ చట్టము).

76. మధ్యప్రదేశ్ వ్యవసాయ కమతముల గరిష్ట పరిమితి (రెండవ సవరణ) చట్టము, 1972 (1974లోని 13వ మధ్యప్రదేశ్ చట్టము).

77. మైసూరు భూసంస్కరణల (సవరణ) చట్టము, 1973 (1974లోని 1వ కర్ణాటక చట్టము).

78. పంజాబు భూసంస్కరణల చట్టము, 1972 (1973లోని 10వ పంజాబు చట్టము).

79. రాజస్థాన్ వ్యవసాయ కమతములపై గరిష్ట పరిమితి విధింపు చట్టము, 1973 (1973లోని 11వ రాజస్థాన్ చట్టము).

80. గుడలూరు జన్మం ఎస్టేట్ల (ఉత్సాదన మరియు రైత్వారీకి మార్పిడి) చట్టము, 1969 (1969లోని 24వ తమిళనాడు చట్టము).

81. పశ్చిమ బెంగాల్ భూసంస్కరణల (సవరణ) చట్టము, 1972 (1972లోని 12వ పశ్చిమ బెంగాల్ చట్టము).

82. పశ్చిమ బెంగాల్ ఎస్టేట్ల అధ్యార్జన (సవరణ) చట్టము, 1964 (1964లోని 22వ పశ్చిమ బెంగాల్ చట్టము).

83. పశ్చిమ బెంగాల్ ఎస్టేట్ల అధ్యార్జన (రెండవ సవరణ) చట్టము, 1973 (1973లోని 33వ పశ్చిమ బెంగాల్ చట్టము).

84. బొంబాయి కౌలుదారీ మరియు వ్యవసాయ భూముల (గుజరాతు సవరణ) చట్టము, 1972 (1973లోని 5వ గుజరాతు చట్టము).

85. ఒరిస్సా భూసంస్కరణల (సవరణ) చట్టము, 1974 (1974లోని 9వ ఒరిస్సా చట్టము).

86. త్రిపుర భూమిశిస్తు మరియు భూసంస్కరణల (రెండవ సవరణ) చట్టము, 1974 (1974లోని 7వ త్రిపుర చట్టము).

[1][2][87. * * * *]

88. పరిశ్రమల (అభివృద్ధి మరియు క్రమబద్ధీకరణ) చట్టము, 1951 (1951లోని 65వ కేంద్ర చట్టము).

89. స్థిరాస్తి అధిగ్రహణ మరియు అధ్యార్జన చట్టము, 1952 (1952లోని 30వ కేంద్ర చట్టము).

90. గనులు మరియు ఖనిజముల (క్రమబద్ధీకరణ మరియు అభివృద్ధి) చట్టమ, 1957 (1957లోని 67వ కేంద్ర చట్టము).

[*]91. ఏకాధికారములు మరియు అవరోధక వ్యాపార వ్యవహారముల చట్టము, 1969 (1969లోని 54వ కేంద్ర చట్టము).

[2][92. * * * *]

93. కోకింగు బొగ్గు గనుల (ఆత్యయిక నిబంధనల) చట్టము, 1971 (1971లోని 64వ కేంద్ర చట్టము).

94. కోకింగు బొగ్గు గనుల (జాతీయీకరణ) చట్టము, 1972 (1972లోని 36వ కేంద్ర చట్టము).

95. సాధారణ భీమా వర్తకపు (జాతీయీకరణ) చట్టము, 1972 (1972లోని 57వ కేంద్ర చట్టము).

96. ఇండియన్ కాపర్ కార్పొరేషన్ (సంస్థ అధ్యార్జన) చట్టము, 1972 (1972లోని58వ కేంద్ర చట్టము).

97. కుంటుపడిన జవుళి సంస్థల (నిర్వహణను తీసుకొను) చట్టము, 1972 (1972లోని 72వ కేంద్ర చట్టము).

98. బొగ్గుగనుల (నిర్వహణను తీసుకొను) చట్టము, 1973 (1973లోని 15వ కేంద్ర చట్టము).

99. బొగ్గుగనుల (జాతీయీకరణ) చట్టము, 1973 (1973లోని 26వ కేంద్ర చట్టము).

---

1. సంవిధాన (ముప్పై తొమ్మిదవ సవరణ) చట్టము, 1975 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా 10.8.1975 నుండి చొప్పించబడినది.
2. సంవిధాన (నలభై నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 44వ పరిచ్ఛేదము ద్వారా 87 మరియు 92వ నమోదులు వదిలివేయబడినవి.

[*] పోటీ చట్టము, 2002 (2003లోని 12వది) ద్వారా రద్దు చేయబడినది.

[**]100. విదేశీ మారక ద్రవ్యపు క్రమబద్ధీకరణ చట్టము, 1973 (1973లోని 46వ కేంద్ర చట్టము).

101. ఆల్కోక్ ఆష్ డౌన్ కంపెనీ లిమిటెడ్ (సంస్థల అధ్యార్జన) చట్టము, 1973 (1973లోని 56వ కేంద్ర చట్టము).

102. బొగ్గగనుల (సంరక్షణ మరియు అభివృద్ధి) చట్టము, 1974 (194లోని 28వ కేంద్ర చట్టము).

103. అదనపు ఉపలబ్ధుల (నిర్బంధ డిపాజిటు) చట్టము, 1974 (1974లోని 37వ కేంద్ర చట్టము).

104. విదేశీ మారక ద్రవ్యమును నిలువచేసికొను మరియు స్మగ్లింగు కార్య కలాపములను నివారించు చట్టము, 1974 (1974లోని 52వ కేంద్ర చట్టము).

105. కుంటుపడిన జవుళి సంస్థల (జాతీయీకరణ) చట్టము, 1974 (1974లోని 57వ కేంద్ర చట్టము).

106. మహారాష్ట్ర వ్యవసాయ భూముల (కమతముల గరిష్టపరిమితి) (సవరణ) చట్టము, 1964 (1965లోని 16వ మహారాష్ట్ర చట్టము).

107. మహారాష్ట్ర వ్యవసాయ భూముల (కమతముల గరిష్టపరిమితి) (సవరణ) చట్టము, 1965 (1965లోని 32వ మహారాష్ట్ర చట్టము).

108. మహారాష్ట్ర వ్యవసాయ భూముల (కమతముల గరిష్టపరిమితి) (సవరణ) చట్టము, 1968 (1968లోని 16వ మహారాష్ట్ర చట్టము).

109. మహారాష్ట్ర వ్యవసాయ భూముల (కమతముల గరిష్టపరిమితి) (రెండవ సవరణ) చట్టము, 1968 (1968లోని 33వ మహారాష్ట్ర చట్టము).

110. మహారాష్ట్ర వ్యవసాయ భూముల (కమతముల గరిష్టపరిమితి) (సవరణ) చట్టము, 1969 (1969లోని 37వ మహారాష్ట్ర చట్టము).

111. మహారాష్ట్ర వ్యవసాయ భూముల (కమతముల గరిష్టపరిమితి) (రెండవ సవరణ) చట్టము, 1969 (1969లోని 38వ మహారాష్ట్ర చట్టము).

112. మహారాష్ట్ర వ్యవసాయ భూముల (కమతముల గరిష్టపరిమితి) (సవరణ) చట్టము, 1970 (1970లోని 27వ మహారాష్ట్ర చట్టము).

---

[**] విదేశీ మారక నిర్వహణ చట్టము, 1999 (1999లోని 42వది) ద్వారా 01.06.2000 నుండి రద్దు చేయబడినది.

113. మహారాష్ట్ర వ్యవసాయ భూముల (కమతముల గరిష్టపరిమితి) (సవరణ) చట్టము, 1972 (1972లోని 13వ మహారాష్ట్ర చట్టము).

114. మహారాష్ట్ర వ్యవసాయ భూముల (కమతముల గరిష్టపరిమితి) (సవరణ) చట్టము, 1973 (1973లోని 50వ మహారాష్ట్ర చట్టము).

115. ఒరిస్సా భూసంస్కరణల (సవరణ) చట్టము, 1965 (1965లోని 13వ ఒరిస్సా చట్టము).

116. ఒరిస్సా భూసంస్కరణల (సవరణ) చట్టము, 1966 (1967లోని 8వ ఒరిస్సా చట్టము).

117. ఒరిస్సా భూసంస్కరణల (సవరణ) చట్టము, 1967 (1967లోని 13వ ఒరిస్సా చట్టము).

118. ఒరిస్సా భూసంస్కరణల (సవరణ) చట్టము, 1969 (1969లోని 13వ ఒరిస్సా చట్టము).

119. ఒరిస్సా భూసంస్కరణల (సవరణ) చట్టము, 1970 (1970లోని 18వ ఒరిస్సా చట్టము).

120. ఉత్తరప్రదేశ్ భూకమతములపై గరిష్ట పరిమితి విధింపు (సవరణ) చట్టము, 1972 (1973లోని 18వ ఉత్తరప్రదేశ్ చట్టము).

121. ఉత్తరప్రదేశ్ భూకమతములపై గరిష్ట పరిమితి విధింపు (సవరణ) చట్టము, 1974 (1975లోని 2వ ఉత్తరప్రదేశ్ చట్టము).

122. త్రిపుర భూమిశిస్తు మరియు భూసంస్కరణల (మూడవ సవరణ) చట్టము, 1975 (1975లోపి 3వ త్రిపుర చట్టము).

123. దాద్రా మరియు నాగర్ హవేలీ భూసంస్కరణల వినియమము, 1971 (1971లోని 3వది).

124. దాద్రా మరియు నాగర్ హవేలీ భూసంస్కరణల (సవరణ) వినియమము, 1973 (1973లోని 5వది).

[1][125. మోటారు వాహనముల చట్టము, 1939* (1939లోని 4వ కేంద్ర చట్టము) యొక్క 66ఎ పరిచ్ఛేదము, మరియు 4ఎ అధ్యాయము.]

---

1. సంవిధాప (నలభైయవ సవరణ) చట్టము, 1976 యొక్క 3వ పరిచ్ఛేదము ద్వారా 125 నుండి 188 వరకు నమోదులు 27.5.1976 నుండి చొప్పించబడినవి.

* మోటారు వాహనముల చట్టము, 1988 (1988లోని 59వది) యొక్క ప్రస్తుతమున్న సంబంధిత నిబంధనలను చూడుము.

126. అత్యవసర వస్తువుల చట్టము, 1955 (1955లోని 10వ కేంద్ర చట్టము).

127. స్మగ్లర్ల మరియు విదేశీ మారక ద్రవ్యపు మోసగాళ్ళు (ఆస్తి సమవహరణ) చట్టము, 1976 (1976లోని 13వ కేంద్ర చట్టము).

128. వెట్టి చాకిరి పద్ధతి (ఉత్సాదన) చట్టము, 1976 (1976లోని 19వ కేంద్ర చట్టము).

129. విదేశీ మారక ద్రవ్యమును నిలువచేసికొని మరియు స్మగ్లింగు కార్యకలాపములను నివారించు (సవరణ) చట్టము, 1976 (1976లోని 20వ కేంద్ర చట్టము).

[1][130. * * * *]

131. లెవీ చక్కెర ధర సమానీకరణ నిధి చట్టము, 1976 (1976లోని 31వ కేంద్ర చట్టము).

132. పట్టణ భూమి (గరిష్ట పరిమితి మరియు క్రమబద్ధీకరణ) చట్టము, 1976 (1976లోని 33వ కేంద్ర చట్టము).

133. సంఘ లెక్కల శాఖీయీకరణ (సిబ్బంది బదిలీ) చట్టము, 1976 (1976లోని 59వ కేంద్ర చట్టము).

134. అస్సాము భూకమతముల గరిష్ట పరిమితి నియతీకరణ చట్టము, 1956 (1957లోని 1వ చట్టము).

135. బొంబాయి కౌలుదారీ మరియు వ్యవసాయ భూముల (విదర్భ ప్రాంతపు) చట్టము, 1958 (1958లోని 99వ బొంబాయి చట్టము).

136. గుజరాత్ ప్రయివేటు అడవుల (అధ్యార్జన) చట్టము, 1972 (1973లోని14వ గుజరాతు చట్టము).

137. హర్యానా కమతముల గరిష్ట పరిమితి (సవరణ) చట్టము, 1976 (1976లోని 17వ హర్యానా చట్టము).

138. హిమాచల్‌ప్రదేశ్ కౌలుదారీ మరియు భూసంస్కరణల చట్టము, 1972 (1974లోని 8వ హిమాచల్ ప్రదేశ్ చట్టము).

139. హిమాచల్ ప్రదేశ్ గ్రామ ఉమ్మడి భూములను నిహితము చేయు మరియు ఉపయోగించు చట్టము, 1974 (1974లోని 18వ హిమాచల్ ప్రదేశ్ చట్టము).

140. కర్ణాటక భూసంస్కరణల (రెండవ సవరణ మరియు వివిధ నిబంధనల) చట్టము, 1974 (1974లోని 31వ కర్ణాటక చట్టము).

---

1. సంవిధాన (నలుబది నాలుగవ సవరణ) చట్టము, 1978 యొక్క 44వ పరిచ్ఛేదము ద్వారా 20.6.1979 నుండి వదిలివేయబడినది.

141. కర్ణాటక భూసంస్కరణల (రెండవ సవరణ) చట్టము, 1976 (1976లోని 27వ కర్ణాటక చట్టము).

142. కేరళ తొలగింపు నివారణ చట్టము, 1966 (1966లోని 12వ కేరళ చట్టము).

143. తిరుప్పవరం చెల్లింపు (ఉత్సాదన) చట్టము, 1969 (1969లోని 19వ కేరళ చట్టము).

144. శ్రీపాదం భూముల విడుదల చట్టము, 1969 (1969లోని 20వ కేరళ చట్టము).

145. శ్రీ పండరవాక భూముల (నిహితము మరియు విడుదల చేయు) చట్టము, 1971 (1971లోని 20వ కేరళ చట్టము).

146. కేరళ ప్రయివేటు అడవుల (నిహితము మరియు కేటాయింపు) చట్టము, 1971 (1971లోని 26వ కేరళ చట్టము).

147. కేరళ వ్యవసాయ కార్మికుల చట్టము, 1974 (1974లోని 18వ కేరళ చట్టము).

148. కేరళ జీడిపప్పు ఫ్యాక్టరీల (అధ్యార్జన) చట్టము, 1974 (1974లోని 29వ కేరళ చట్టము).

149. కేరళ చిట్టీల చట్టము, 1975 (1975లోని 23వ కేరళ చట్టము).

150. కేరళ అనుసూచిత జనజాతుల (భూముల అంతరణపై నిర్బంధము మరియు అన్యాక్రాంత భూములను తిరిగి ఇచ్చివేయు) చట్టము, 1975 (1975లోని 31వ కేరళ చట్టము).

151. కేరళ భూసంస్కరణల (సవరణ) చట్టము, 1976 (1976లోని 15వ కేరళ చట్టము).

152. కానం కౌలుదారి ఉత్సాదన చట్టము, 1976 (1976లోని 16వ కేరళ చట్టము).

153. మధ్యప్రదేశ్ భూకమతముల గరిష్ఠ పరిమితి (సవరణ) చట్టము, 1974 (1974లోని 20వ మధ్యప్రదేశ్ చట్టము).

154. మధ్యప్రదేశ్ భూకమతముల గరిష్ఠ పరిమితి (సవరణ) చట్టము, 1975 (1976లోని 2వ మధ్యప్రదేశ్ చట్టము).

155. పశ్చిమ ఖాందేశ్ మెహవస్సీ ఎస్టేట్ల (ప్రొప్రయిటరీ హక్కుల ఉత్సాదన మున్నగువాటి) వినియమము, 1961 (1962లోని 1వ మహారాష్ట్ర వినియమము).

156. మహారాష్ట్ర అనుసూచిత జనజాతులకు భూములను తిరిగి ఇచ్చివేయు చట్టము, 1974 (1975లోని 14వ మహారాష్ట్ర చట్టము).

157. మహారాష్ట్ర వ్యవసాయ భూముల (కమతముల గరిష్ఠ పరిమితి తగ్గింపు) మరియు (సవరణ) చట్టము, 1972 (1975లోని 21వ మహారాష్ట్ర చట్టము).

158. మహారాష్ట్ర ప్రయివేటు అడవుల (అధ్యార్జన) చట్టము, 1975 (1976లోని 29వ మహారాష్ట్ర చట్టము).

159. మహారాష్ట్ర వ్యవసాయ భూముల (కమతముల గరిష్ఠ పరిమితి తగ్గింపు) మరియు (సవరణ) చట్టము, 1975 (1976లోని 47వ మహారాష్ట్ర చట్టము).

160. మహారాష్ట్ర వ్యవసాయ భూముల (కమతముల గరిష్ఠ పరిమితి) (సవరణ) చట్టము, 1975 (1975లోని 2వ మహారాష్ట్ర చట్టము).

161. ఒరిస్సా ఎస్టేటు ఉత్సాదన చట్టము, 1951 (1952లోని 1వ ఒరిస్సా చట్టము).

162. రాజస్థాన్ ఉపనివేశనపు చట్టము, 1954 (1954లోని 27వ రాజస్థాను చట్టము).

163. రాజస్థాన్ భూసంస్కరణల మరియు భూస్వాముల ఎస్టేట్ల అధ్యార్జన చట్టము, 1963 (1964లోని 11వ రాజస్థాన్ చట్టము).

164. రాజస్థాన్ భూకమతముల గరిష్ఠ పరిమితుల విధింపు (సవరణ) చట్టము, 1976 (1976లోని 8వ రాజస్థాన్ చట్టము).

165. రాజస్థాన్ కౌలుదారీ (సవరణ) చట్టము, 1976 (1976లోని 12వ రాజస్థాన్ చట్టము).

166. తమిళనాడు భూసంస్కరణల (భూమి గరిష్ఠ పరిమితి తగ్గింపు) చట్టము, 1970 (1970లోని 17వ తమిళనాడు చట్టము).

167. తమిళనాడు భూసంస్కరణల (భూమి గరిష్ఠ పరిమితి తగ్గింపు) సవరణ చట్టము, 1971 (1971లోని 41వ తమిళనాడు చట్టము).

168. తమిళనాడు భూసంస్కరణల (భూమి గరిష్ఠ పరిమితి తగ్గింపు) సవరణ చట్టము, 1972 (1972లోని 10వ తమిళనాడు చట్టము).

169. తమిళనాడు భూసంస్కరణల (భూమి గరిష్ఠ పరిమితి తగ్గింపు) రెండవ సవరణ చట్టము, 1972 (1972లోని 20వ తమిళనాడు చట్టము).

170. తమిళనాడు భూసంస్కరణల (భూమి గరిష్ఠ పరిమితి తగ్గింపు) మూడవ సవరణ చట్టము, 1972 (1972లోని 37వ తమిళనాడు చట్టము).

171. తమిళనాడు భూసంస్కరణల (భూమి గరిష్ఠ పరిమితి తగ్గింపు) నాలుగవ సవరణ చట్టము, 1972 (1972లోని 39వ తమిళనాడు చట్టము).

172. తమిళనాడు భూసంస్కరణల (భూమి గరిష్ఠ పరిమితి తగ్గింపు) ఆరవ సవరణ చట్టము, 1972 (1974లోని 7వ తమిళనాడు చట్టము).

173. తమిళనాడు భూసంస్కరణల (భూమి గరిష్ఠ పరిమితి తగ్గింపు) అయిదవ సవరణ చట్టము, 1972 (1974లోని 10వ తమిళనాడు చట్టము).

174. తమిళనాడు భూసంస్కరణల (భూమి గరిష్ఠ పరిమితి తగ్గింపు) సవరణ చట్టము, 1974 (1974లోని 15వ తమిళనాడు చట్టము).

175. తమిళనాడు భూసంస్కరణల (భూమి గరిష్ఠ పరిమితి తగ్గింపు) మూడవ సవరణ చట్టము, 1974 (1974లోని 30వ తమిళనాడు చట్టము).

176. తమిళనాడు భూసంస్కరణల (భూమి గరిష్ఠ పరిమితి తగ్గింపు) రెండవ సవరణ చట్టము, 1974 (1974లోని 32వ తమిళనాడు చట్టము).

177. తమిళనాడు భూసంస్కరణల (భూమి గరిష్ఠ పరిమితి తగ్గింపు) సవరణ చట్టము, 1975 (1975లోని 11వ తమిళనాడు చట్టము).

178. తమిళనాడు భూసంస్కరణల (భూమి గరిష్ఠ పరిమితి తగ్గింపు) రెండవ సవరణ చట్టము, 1975 (1975లోని 21వ తమిళనాడు చట్టము).

179. ఉత్తరప్రదేశ్ భూ శాసనముల (సవరణ) చట్టము, 1971 (1971లోని 21వ ఉత్తరప్రదేశ్ చట్టము) మరియు ఉత్తరప్రదేశ్ భూ శాసనముల (సవరణ) చట్టము, 1974 (1974లోని 34వ ఉత్తరప్రదేశ్ చట్టముల) ద్వారా ఉత్తరప్రదేశ్ జమిందారీ ఉత్సాదన మరియు భూసంస్కరణల చట్టము, 1950 (1951లోని 1వ ఉత్తరప్రదేశ్ చట్టము)నకు చేయబడిన సవరణలు.

180. ఉత్తరప్రదేశ్ భూకమతములపై గరిష్ఠ పరిమితి విధింపు (సవరణ) చట్టము, 1976 (1976లోని 20వ ఉత్తరప్రదేశ్ చట్టము).

181. పశ్చిమ బెంగాల్ భూసంస్కరణల (రెండవ సవరణ) చట్టము, 1972 (1972లోని 28వ పశ్చిమ బెంగాల్ చట్టము).

182. పశ్చిమ బెంగాల్ అన్యాక్రాంత భూములను తిరిగి ఇచ్చివేయు చట్టము, 1973 (1973లోని 23వ పశ్చిమ బెంగాల్ చట్టము).

183. పశ్చిమ బెంగాల్ భూసంస్కరణల (సవరణ) చట్టము, 1974 (1974లోని 33వ పశ్చిమ బెంగాల్ చట్టము).

184. పశ్చిమ బెంగాల్ భూసంస్కరణల (సవరణ) చట్టము, 1975 (1975లోని 23వ పశ్చిమ బెంగాల్ చట్టము).

185. పశ్చిమ బెంగాల్ భూసంస్కరణల (సవరణ) చట్టము, 1976 (1976లోని 12వ పశ్చిమ బెంగాల్ చట్టము).

186. ఢిల్లీ భూకమతముల (గరిష్ఠ పరిమిత) (సవరణ) చట్టము, 1976 (1976లోని 15వ కేంద్ర చట్టము).

187. గోవా, డామన్, డయ్యూ ముండ్కార్ల (తొలగింపు నుండి రక్షణ) చట్టము, 1975 (1976లోని 1వ గోవా, డామన్, డయ్యూ చట్టము).

188. పుదుచ్చేరి భూసంస్కరణల (భూమి గరిష్ట పరిమితి నియతీకరణ) చట్టము, 1973 (1973లోని 9వ పుదుచ్చేరి చట్టము).]

[1][189. అస్సాము (తాత్కాలికముగ స్థిరపడిన ప్రాంతముల) కౌలుదారీ చట్టము, 1971 (1971లోని 23వ అస్సాము చట్టము).

190. అస్సాము (తాత్కాలికముగ స్థిరపడిన ప్రాంతముల) కౌలుదారీ (సవరణ) చట్టము, 1974 (1974లోని 18వ అస్సాము చట్టము).

191. బీహారు భూసంస్కరణల (గరిష్ట పరిమితి విస్తీర్ణ నియతీకరణ మరియు మిగులు భూముల అధ్యార్జన) (సవరణ) చట్టము, 1974 (1975లోని 13వ బీహారు చట్టము).

192. బీహారు భూసంస్కరణల (గరిష్ట విస్తీర్ణ నియతీకరణ మరియు మిగులు భూముల అధ్యార్జన (సవరణ) చట్టము, 1976 (1976లోని 22వ బీహారు చట్టము).

193. బీహారు భూసంస్కరణల (గరిష్ట విస్తీర్ణ నియతీకరణ మరియు మిగులు భూముల అధ్యార్జన) (సవరణ) చట్టము, 1978 (1978లోని 7వ బీహారు చట్టము).

194. భూమి అధ్యార్జన (బీహారు సవరణ) చట్టము, 1979 (1980లోని 2వ బీహారు చట్టము).

195. హర్యానా, భూకమతముల గరిష్ట పరిమితి (సవరణ) చట్టము, 1977 (1977లోని 14వ హర్యానా చట్టము).

196. తమిళనాడు భూసంస్కరణల (భూమి గరిష్ట పరిమితి నియతీకరణ) (సవరణ) చట్టము, 1978 (1978లోని 25వ తమిళనాడు చట్టము).

197. తమిళనాడు భూసంస్కరణల (భూమి గరిష్ట పరిమితి నియతీకరణ) (సవరణ) చట్టము, 1979 (1979లోని 11వ తమిళనాడు చట్టము).

198. ఉత్తరప్రదేశ్ జమీందారీ ఉత్సాదన శాసనముల (సవరణ) చట్టము, 1978 (1978లోని 15వ ఉత్తర ప్రదేశ్ చట్టము).

199. పశ్చిమ బెంగాల్ అన్యాక్రాంత భూములను తిరిగి ఇచ్చివేయు (సవరణ) చట్టము, 1978 (1978లోని 24వ పశ్చిమ బెంగాల్ చట్టము).

200. పశ్చిమ బెంగాల్ అన్యాక్రాంత భూములను తిరిగి ఇచ్చివేయు (సవరణ) చట్టము, 1980 (1980లోని 56వ పశ్చిమ బెంగాల్ చట్టము).

---

1. సంవిధాన (నలభై ఏడవ సవరణ) చట్టము, 1984 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 189 నుండి 202 వరకు నమోదులు 26.8.1984 నుండి చొప్పించబడినది.

201. గోవా, డామన్, డయ్యూ, వ్యవసాయ కౌలుదారీ చట్టము, 1964 (1964లోని 7వ గోవా, డామన్, డయ్యూ చట్టము).

202. గోవా, డామన్, డయ్యూ, వ్యవసాయ కౌలుదారీ (ఐదవ సవరణ) చట్టము, 1976 (1976లోని 17వ గోవా, డామన్, డయ్యూ చట్టము).]

[1][203. ఆంధ్రప్రదేశ్ అనుసూచిత ప్రాంతముల భూమి అంతరణ వినియమము, 1959 (1959లోని 1వ ఆంధ్రప్రదేశ్ వినియమము).

204. ఆంధ్రప్రదేశ్ అనుసూచిత ప్రాంత శాసనముల (విస్తరణ, సవరణ) వినియమము, 1963 (1963లోని 2వ ఆంధ్రప్రదేశ్ వినియమము).

205. ఆంధ్రప్రదేశ్ అనుసూచిత ప్రాంతముల భూమి అంతరణ (సవరణ) వినియమము, 1970 (1970లోని 1వ ఆంధ్రప్రదేశ్ వినియమము).

206. ఆంధ్రప్రదేశ్ అనుసూచిత ప్రాంతముల భూమి అంతరణ (సవరణ) వినియమము, 1971 (1971లోని 1వ ఆంధ్రప్రదేశ్ వినియమము).

207. ఆంధ్రప్రదేశ్ అనుసూచిత ప్రాంతముల భూమి అంతరణ (సవరణ) వినియమము, 1978 (1978లోని 1వ ఆంధ్రప్రదేశ్ వినియమము).

208. బీహార్ కౌలుదారీ చట్టము, 1885 (1885లోని 8వ బీహారు చట్టము).

209. ఛోటా నాగ్‌పూర్ కౌలుదారీ చట్టము, 1908 (1908లోని 6వ బెంగాల్ చట్టము) (అధ్యాయము VIII పరిచ్ఛేదములు 46, 47, 48, 48–ఏ, 49; అధ్యాయము X – పరిచ్ఛేదములు 71, 71–ఏ, 71–బీ; మరియు అధ్యాయము XVIII పరిచ్ఛేదములు 240, 241, 242).

210. సంతాల్, పరగణాల కౌలుదారీ (అనుబంధ నిబంధనల) చట్టము, 1949 (1949లోని 14వ బీహార్ చట్టము) ఇందులోని 53వ పరిచ్ఛేదము మినహా.

211. బీహార్ అనుసూచిత ప్రాంతముల వినియమము, 1969 (1969లోని 1వ బీహార్ వినియమము).

212. బీహార్ భూసంస్కరణల (పరిమిత ప్రాంత నిర్ణయము మరియు మిగులు భూములను ఆర్జించు (సవరణ) చట్టము, 1982 (1982లోని 55వ బీహార్ చట్టము).

213. గుజరాత్ దేవస్థానముల ఇనాముల రద్దు చట్టము, 1969 (1969లోని 16వ గుజరాత్ చట్టము).

---

1. సంవిధాన (అరవై ఆరవ సవరణ) చట్టము, 1990 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 203 నుండి 257 వరకు నమోదులు 7.6.1990 నుండి చొప్పించబడినది.

214. గుజరాత్ కౌలుదారీ శాసనముల (సవరణ) చట్టము, 1976 (1976లోని 43వ రాష్ట్రపతి చట్టము).

215. గుజరాత్ వ్యవసాయ భూముల పరిమితి (సవరణ) చట్టము, 1976 (1976లోని 43వ రాష్ట్రపతి చట్టము).

216. గుజరాత్ దేవస్థాన ఇనాముల రద్దు (సవరణ) చట్టము, 1977 (1977లోని 27వ గుజరాత్ చట్టము).

217. గుజరాత్ కౌలుదారీ శాసనముల (సవరణ) చట్టము, 1977 (1977లోని 30వ గుజరాత్ చట్టము).

218. బొంబాయి భూమి శిస్తు (గుజరాత్ రెండవ సవరణ) చట్టము, 1980 (1980లోని 37వ గుజరాత్ చట్టము).

219. బొంబాయి భూమి శిస్తు స్మృతి మరియు భూమి కౌళ్ల రద్దు శాసనాల (గుజరాత్ సవరణ) చట్టము, 1982 (1982లోని 8వ గుజరాత్ చట్టము).

220. హిమాచల్ ప్రదేశ్ భూమి అంతరణ (క్రమబద్ధీకరణ) చట్టము, 1968 (1969లోని 15వ హిమాచల్ ప్రదేశ్ చట్టము).

221. హిమాచల్ ప్రదేశ్ భూమి అంతరణ (క్రమబద్ధీకరణ) (సవరణ) చట్టము, 1986 (1986లోని 16వ హిమాచల్ ప్రదేశ్ చట్టము).

222. కర్నాటక అనుసూచిత కులముల మరియు అనుసూచిత జనజాతుల (కొన్ని భూముల అంతరణపై నిషేధము) చట్టము, 1978 (1979లోని 2వ కర్నాటక చట్టము).

223. కేరళ భూ సంస్కరణల (సవరణ) చట్టము, 1978 (1978లోని 13వ కేరళ చట్టము).

224. కేరళ భూ సంస్కరణల (సవరణ) చట్టము, 1981 (1981లోని 19వ కేరళ చట్టము).

225. మధ్యప్రదేశ్ భూమి శిస్తు స్మృతి (మూడవ సవరణ) చట్టము, 1976 (1976లోని 61వ మధ్యప్రదేశ్ చట్టము).

226. మధ్యప్రదేశ్ భూమి శిస్తు స్మృతి (సవరణ) చట్టము, 1980 (1980లోని 15వ ఆంధ్రప్రదేశ్ చట్టము).

227. మధ్యప్రదేశ్ అక్రిషిక్ జాట్ ఉచ్ఛతం సీమ అధినియమము, 1981 (1981లోని 11వ మధ్యప్రదేశ్ చట్టము).

228. మధ్యప్రదేశ్ వ్యవసాయ కమతములపై పరిమితి (రెండవ సవరణ) చట్టము, 1976 (1984లోని 1వ మధ్యప్రదేశ్ చట్టము).

229. మధ్యప్రదేశ్ వ్యవసాయ కమతములపై పరిమితి (సవరణ) చట్టము, 1984 (1984లోని 14వ మధ్యప్రదేశ్ చట్టము).

230. మధ్యప్రదేశ్ వ్యవసాయ కమతములపై పరిమితి (సవరణ) చట్టము, 1989 (1989లోని 8వ మధ్యప్రదేశ్ చట్టము).

231. మహారాష్ట్ర భూమిశిస్తు స్మృతి, 1966 (1966లోని 41వ మహారాష్ట్ర చట్టము)లోని పరిచ్ఛేదములు 36, 36-ఎ, 36-బీ.

232. మహారాష్ట్ర భూమిశిస్తు స్మృతి మరియు మహారాష్ట్ర అనుసూచిత జనజాతులకు భూముల పునరుద్ధరణ (రెండవ సవరణ) చట్టము, 1976 (1977లోని 30వ మహారాష్ట్ర చట్టము).

233. మహారాష్ట్రలోని కొన్ని భూములలోని గనుల మరియు ఖనిజములలో అమలులో ఉన్న యాజమాన్య హక్కుల రద్దు చట్టము, 1985 (1985లోని 16వ మహారాష్ట్ర చట్టము).

234. ఒరిస్సా అనుసూచిత ప్రాంతాల (అనుసూచిత జనజాతులచే) స్థిరాస్థి బదిలీ వినియమము, 1956 (1956లోని 2వ ఒరిస్సా వినియమము).

235. ఒరిస్సా భూసంస్కరణల (రెండవ సవరణ) చట్టము, 1975 (1976లోని 29వ ఒరిస్సా చట్టము).

236. ఒరిస్సా భూసంస్కరణల (సవరణ) చట్టము, 1976 (1976లోని 30వ ఒరిస్సా చట్టము).

237. ఒరిస్సా భూసంస్కరణల (రెండవ సవరణ) చట్టము, 1976 (1976లోని 44వ ఒరిస్సా చట్టము).

238. రాజస్థాన్ వలస స్థాపన (సవరణ) చట్టము, 1984 (1984లోని 12వ రాజస్థాన్ చట్టము).

239. రాజస్థాన్ కౌలుదారీ (సవరణ) చట్టము, 1984 (1984లోని 13వ రాజస్థాన్ చట్టము).

240. రాజస్థాన్ కౌలుదారీ (సవరణ) చట్టము, 1987 (1987లోని 21వ రాజస్థాన్ చట్టము).

241. తమిళనాడు భూసంస్కరణల (భూ పరిమితి నిర్ణయము) రెండవ సవరణ చట్టము, 1979 (1980లోని 8వ తమిళనాడు చట్టము).

242. తమిళనాడు భూ సంస్కరణల (భూ పరిమితి నిర్ణయము) సవరణ చట్టము, 1980 (1980లోని 21వ తమిళనాడు చట్టము).

243. తమిళనాడు భూ సంస్కరణల (భూ పరిమితి నిర్ణయము) సవరణ చట్టము, 1981 (1981లోని 59వ తమిళనాడు చట్టము).

244. తమిళనాడు భూసంస్కరణల (భూ పరిమితి నిర్ణయము) రెండవ సవరణ చట్టము, 1983 (1984లోని 2వ తమిళనాడు చట్టము).

245. ఉత్తరప్రదేశ్ భూ శాసనముల (సవరణ) చట్టము, 1982 (1982లోని 20వ ఉత్తరప్రదేశ్ చట్టము).

246. పశ్చిమబెంగాల్ భూసంస్కరణల (సవరణ) చట్టము, 1965 (1965లోన 18వ పశ్చిమ బెంగాల్ చట్టము).

247. పశ్చిమబెంగాల్ భూసంస్కరణల (సవరణ) చట్టము, 1966 (1966లోన 11వ పశ్చిమ బెంగాల్ చట్టము).

248. పశ్చిమబెంగాల్ భూసంస్కరణల (రెండవ సవరణ) చట్టము, 1969 (1969లోన 23వ పశ్చిమ బెంగాల్ చట్టము).

249. పశ్చిమబెంగాల్ ఎస్టేట్ల ఆర్జన (సవరణ) చట్టము, 1977 (1977లోన 36వ పశ్చిమ బెంగాల్ చట్టము).

250. పశ్చిమబెంగాల్ భూకమతముల (సవరణ) చట్టము, 1979 (1979లోన 44వ పశ్చిమ బెంగాల్ చట్టము).

251. పశ్చిమబెంగాల్ భూసంస్కరణల (సవరణ) చట్టము, 1980 (1980లోన 41వ పశ్చిమ బెంగాల్ చట్టము).

252. పశ్చిమబెంగాల్ భూకమతముల శిస్తు (సవరణ) చట్టము, 1981 (1981లోన 33వ పశ్చిమ బెంగాల్ చట్టము).

253. కలకత్తా టిక్కా కౌలుదారీ (ఆర్జన మరియు క్రమబద్ధీకరణ) చట్టము, 1981 (1981లోని 37వ పశ్చిమ బెంగాల్ చట్టము).

254. పశ్చిమబెంగాల్ భూకమతముల శిస్తు (సవరణ) చట్టము, 1982 (1982లోన 23వ పశ్చిమ బెంగాల్ చట్టము).

255. కలకత్తా టిక్కా కౌలుదారీ (ఆర్జన మరియు క్రమబద్ధీకరణ) (సవరణ) చట్టము, 1984 (1984లోని 41వ పశ్చిమ బెంగాల్ చట్టము).

256. మహే భూసంస్కరణల చట్టము, 1968 (1968లోని 1వ పాండిచ్చేరి చట్టము).

257. మహే భూసంస్కరణల (సవరణ) చట్టము, 1980 (1980లోని 1వ పాండిచ్చేరి చట్టము).]

[1][257ఏ. తమిళనాడు వెనుకబడిన తరగతుల, అనుసూచిత కులముల, అనుసూచిత జనజాతుల (విద్యాసంస్థలలోని సీట్లు, రాజ్య సర్వీసులలోని నియామకముల లేదా పదవుల రిజర్వేషను) చట్టము, 1993 (1994లోని 45వ తమిళనాడు చట్టము).]

[2][258. బీహారు విశేష హక్కులుగల వ్యక్తుల ఇంటి ఆవరణల కౌలుదారీ చట్టము, 1947 (1948లోని 4వ బీహారు చట్టము).

---

1. సంవిధాన (డెబ్బై ఆరవ సవరణ) చట్టము, 1994 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 31.8.1994 నుండి చొప్పించబడినది.
2. సంవిధాన (డెబ్బై ఎనిమిదవ సవరణ) చట్టము, 1995 యొక్క 2వ పరిచ్ఛేదము ద్వారా 258 నుండి 284 వరకు గల నమోదులు 30.8.1995 నుండి చొప్పించబడినవి.

259. బీహారు కమతముల ఏకీకరణ మరియు విభజనల నివారణ చట్టము, 1956 (1956లోని 22వ బీహారు చట్టము).

260. బీహారు కమతముల ఏకీకరణ మరియు విభజనల నివారణ (సవరణ) చట్టము, 1970 (1970లోని 7వ చట్టము).

261. బీహారు విశేష హక్కులు గల వ్యక్తుల ఇంటి ఆవరణముల కౌలుదారీ (సవరణ) చట్టము, 1970 (1970లోని 9వ బీహారు చట్టము).

262. బీహారు కమతముల ఏకీకరణ, విభజనల నివారణ (సవరణ) చట్టము, 1975 (1975లోని 27వ బీహారు చట్టము).

263. బీహారు కమతముల ఏకీకరణ, విభజనల నివారణ (సవరణ) చట్టము, 1981(1982లోని 35వ బీహారు చట్టము).

264. బీహారు భూ సంస్కరణల (పరిమితి ప్రాంత నిర్ణయము మరియు మిగులు భూమి ఆర్జన) (సవరణ) చట్టము, 1987 (1987లోని 21వ చట్టము).

265. బీహారు విశేష హక్కులుగల వ్యక్తుల ఇంటి ఆవరణల కౌలుదారీ (సవరణ) చట్టము, 1989 (1989లోని 11వ బీహారు చట్టము).

266. బీహారు భూ సంస్కరణల (సవరణ) చట్టము, 1989 (1990లోని 11వ చట్టము).

267. కర్నాటక అనుసూచిత కులముల మరియు అనుసూచిత జనజాతుల (కొన్ని భూముల బదిలీపై నిషేధము) (సవరణ) చట్టము, 1984 (1984లోని 3వ కర్నాటక చట్టము).

268. కేరళ భూ సంస్కరణల (సవరణ) చట్టము, 1989 (1989లోని 16వ కేరళ చట్టము).

269. కేరళ భూ సంస్కరణల (రెండవ సవరణ) చట్టము, 1989 (1990లోని 2వ కేరళ చట్టము).

270. ఒరిస్సా భూ సంస్కరణల (సవరణ) చట్టము, 1989 (1990లోని 9వ ఒరిస్సా చట్టము).

271. రాజస్థాన్ కౌలుదారీ (సవరణ) చట్టము, 1979 (1979లోని 16వ రాజస్థాన్ చట్టము).

272. రాజస్థాన్ వలస స్థాపన (సవరణ) చట్టము, 1987 (1987లోని 2వ రాజస్థాన్ చట్టము).

273. రాజస్థాన్ వలస స్థాపన (సవరణ) చట్టము, 1989 (1989లోని 12వ రాజస్థాన్ చట్టము).

274. తమిళనాడు భూ సంస్కరణల (భూ పరిమితులను నిర్ధారణ) (సవరణ) చట్టము, 1983 (1983లోని 3వ తమిళనాడు చట్టము).

275. తమిళనాడు భూ సంస్కరణల (భూ పరిమితుల నిర్ధారణ) (సవరణ) చట్టము, 1986 (1986లోని 57వ తమిళనాడు చట్టము).

276. తమిళనాడు భూ సంస్కరణల (భూ పరిమితుల నిర్ధారణ) రెండవ సవరణ చట్టము, 1987 (1988లోని 4వ తమిళనాడు చట్టము).

277. తమిళనాడు భూ సంస్కరణల (భూ పరిమితుల నిర్ధారణ) (సవరణ) చట్టము, 1989 (1989లోని 30వ తమిళనాడు చట్టము).

278. పశ్చిమ బెంగాల్ భూ సంస్కరణల (సవరణ) చట్టము, 1981 (1981లోని 50వ పశ్చిమ బెంగాల్ చట్టము).

279. పశ్చిమ బెంగాల్ భూ సంస్కరణల (సవరణ) చట్టము, 1986 (1986లోని 5వ పశ్చిమ బెంగాల్ చట్టము).

280. పశ్చిమ బెంగాల్ భూ సంస్కరణల (రెండవ సవరణ) చట్టము, 1986 (1986లోని 19వ పశ్చిమ బెంగాల్ చట్టము).

281. పశ్చిమ బెంగాల్ భూ సంస్కరణల (మూడవ సవరణ) చట్టము, 1986 (1986లోని 35వ పశ్చిమ బెంగాల్ చట్టము).

282. పశ్చిమ బెంగాల్ భూ సంస్కరణల (సవరణ) చట్టము, 1989 (1989లోని 23వ పశ్చిమ బెంగాల్ చట్టము).

283. పశ్చిమ బెంగాల్ భూ సంస్కరణల (సవరణ) చట్టము, 1990 (1990లోని 24వ పశ్చిమ బెంగాల్ చట్టము).

284. పశ్చిమ బెంగాల్ భూ సంస్కరణల ట్రిబ్యునళ్ల చట్టము, 1991 (1991లోని 12వ పశ్చిమ బెంగాల్ చట్టము).]

**విశదీకరణ :–** అనుచ్ఛేదము 31 ఏ యొక్క ఖండము (1) క్రింద రెండవ వినాయింపును ఉల్లంఘించుచు, రాజస్థాన్ కౌలుదారీ చట్టము, 1955 (1955లోని 3వ రాజస్థాన్ చట్టము) క్రింద చేయబడిన ఏదేని అర్జన, ఆ ఉల్లంఘన మేరకు ప్రభావశూన్యమై యుండవలెను.

# [1][పదవ అనుసూచి

## [అనుచ్ఛేదములు 102 (2) మరియు 191 (2)]

## పార్టీ ఫిరాయింపు కారణముగా అనర్హతకు గురియగు నిబంధనలు

1. **అర్థాన్వయము:–** ఈ అనుసూచిలో, సందర్భము అన్యథా కోరిననే తప్ప,–

(ఎ) ''సదనము'' అనగా పార్లమెంటు ఉభయ సదనములలోని ఒక సదనము లేక సందర్భానుసారముగా ఒక రాజ్యములోని శాసన మండలిలోని ఉభయ సదనములలోని ఏదేని సదనము అని అర్థము.

(బి) పేరాగ్రాఫ్ 2 లేక పేరాగ్రాఫ్ 4 యొక్క [2][* * *] నిబంధనల ననుసరించి ఏదేని రాజకీయ పార్టీకి చెందిన ఒక సదనములోని సభ్యుని విషయమములో ''శాసనమండలి పార్టీ'' అనగా పై నిబంధనల ననుసరించి ఆ రాజకీయ పార్టీకి చెందిన, తత్సమయమున ఆ సదనము యొక్క సభ్యులందరితో కూడియున్న బృందము అని అర్థము;

(సి) సదనము యొక్క సభ్యుని విషయములో ''అసలైన రాజకీయ పార్టీ'' అనగా 2వ పేరాగ్రాఫ్‌లోని ఉప పేరాగ్రాఫ్ (1) ప్రయోజనముల నిమిత్తము అతను చెందియున్న రాజకీయ పార్టీ అని అర్థము.

(డి) ''పేరాగ్రాఫ్'' అనగా ఈ అనుసూచి యొక్క పేరాగ్రాఫ్ అని అర్థము.

2. **పార్టీ ఫిరాయింపు కారణముగా నిరర్హత:–** (1) పేరాగ్రాఫ్‌లు [3][4 మరియు 5] యొక్క నిబంధనలకు లోబడి ఏదేని రాజకీయ పార్టీకి చెందిన ఒక సదనము యొక్క సభ్యుడు –

(ఎ) ఆయన స్వచ్ఛందముగా అట్టి రాజకీయ పార్టీ యొక్క అతని సభ్యత్వమును వదులుకొనినచో; లేక

(బి) అతను ఏ రాజకీయ పార్టీకి చెందునో దానిచే లేదా ఈ విషయంలో ప్రాధికార మొసగబడిన ఎవరేని వ్యక్తి లేదా ప్రాధికారముచే జారీ చేయబడిన ఆదేశమునకు వ్యతిరేకంగా, అట్టి రాజకీయ పార్టీ, వ్యక్తి లేదా ప్రాధికారము యొక్క పూర్వానుమతి లేకుండా అట్టి సదనములో ఓటు చేయుట లేదా ఓటు చేయుట నుండి నిరోధించినపుడు మరియు అట్టి ఓటు చేసిన లేదా చేయుట నుండి నిరోధించిన తేదీ నుండి పదిహేను దినముల లోపల దానిపై అట్టి రాజకీయ పార్టీ లేదా వ్యక్తి లేదా ప్రాధికారము యొక్క క్షమాపణను పొందనపుడు, అతడు సదనము యొక్క సభ్యునిగా ఉండుటకు అనర్హుడగును.

---

1. సంవిధాన (యాబది రెండవ సవరణ) చట్టము, 1985 యొక్క 6వ పరిచ్ఛేదము ద్వారా 01.03.1985 నుండి చేర్చబడినది.
2. సంవిధాన (తొంబది ఒకటవ సవరణ) చట్టము, 2003 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా కొన్ని పదములు లుప్తము చేయబడినవి.
3. అదే చట్టపు 5వ పరిచ్ఛేదము ద్వారా ''పేరాగ్రాఫ్‌లు 3, 4 మరియు 5'' అను దానికి బదులుగా ఉంచబడినవి.

**విశదీకరణ:** ఈ ఉప పేరాగ్రాఫ్ యొక్క ప్రయోజనముల నిమిత్తము ---

(ఎ) ఏదేని రాజకీయ పార్టీచే అట్టి పార్టీ సభ్యునిగా ఎన్నికకు ఒక అభ్యర్థిగా నిలబెట్టబడినప్పుడు, ఆ సదనము యొక్క ఎన్నికైన అట్టి సభ్యుడు, ఆ పార్టీకి చెందిన సభ్యులుగా భావింపబడవలెను;

(బి) ఒక సదనము యొక్క నామనిర్దేశితుడైన సభ్యుడు–

(i) అతని నామనిర్దేశ పత్రము తేదీన అతడు ఏదేని రాజకీయ పార్టీ సభ్యుడైయున్నచో, అతడిని అట్టి రాజకీయ పార్టీకి చెందియున్న సభ్యునిగా భావించవలెను;

(ii) ఏదేని ఇతర సందర్భములో, అనుచ్ఛేదము 99 లేక సందర్భానుసారముగా, అనుచ్ఛేదము 188 యొక్క ఆవశ్యకతలను పాటించిన తరువాత ఒక సభ్యుడు తన స్థానమును స్వీకరించిన తేదీ నుంచి ఆరు నెలలు ముగియక ముందు, అతను ఏ రాజకీయ పార్టీ సభ్యుడుగా ఉండునో లేక సందర్భానుసారముగా మొదటిసారిగా చేరునో, అతడిని ఆ పార్టీకి చెందియున్నట్లుగా భావించవలెను.

(2) ఏదేని రాజకీయ పార్టీచే నెలబెట్టబడిన అభ్యర్థిగా కాకుండా ఒక సదనము యొక్క ఎన్నికైన సభ్యుడు అట్టి ఎన్నిక తరువాత అతడు ఏదేని రాజకీయ పార్టీలో చేరినచో, సదనము యొక్క సభ్యునిగా ఉండుటకు అనర్హుడగును.

(3) ఒక సదనము యొక్క నామనిర్దేశితుడైన సభ్యుడు అనుచ్ఛేదము 99 లేక సందర్భానుసారముగా అనుచ్ఛేదము 188 యొక్క ఆవశ్యకతలను పాటించిన తరువాత అతడు తన స్థానమును స్వీకరించిన తేదీ నుండి ఆరు నెలలు ముగిసిన పిమ్మట ఏదేని రాజకీయ పార్టీలో చేరినచో, అతడు ఆ సదనము యొక్క సభ్యునిగా ఉండుటకు అనర్హుడగును.

(4) ఈ పేరాగ్రాఫ్‌కు పైన పేర్కొనిన నిబంధనలలో ఏమి ఉన్నప్పటికిని, సంవిధాన (యాభై రెండవ సవరణ) చట్టము, 1985 ప్రారంభము (ఎన్నుకొనబడినను లేక నామనిర్దేశితుడైనను) ఒక సదనము యొక్క సభ్యునిగానున్న ఒక వ్యక్తి,–

(i) అట్టి ప్రారంభమునకు అవ్యవహిత పూర్వము అతను ఒక రాజకీయ పార్టీ సభ్యుడై ఉన్నచో, ఈ పేరాగ్రాఫ్ యొక్క ఉప పేరాగ్రాఫ్ (1) నిమిత్తము, అట్టి సదనమునకు అట్టి రాజకీయ పార్టీచే నిలబెట్టబడిన అభ్యర్థిగా ఎన్నుకొబడినట్లు భావించవలెను;

(ii) ఏదేని ఇతర సందర్భములో, ఈ పేరాగ్రాఫ్ యొక్క ఉప పేరాగ్రాఫ్ (2) నిమిత్తము ఏదేని రాజకీయ పార్టీచే నిలబెట్టబడిన అభ్యర్థిగా కాకుండా ఇతర విధంగా అట్లు ఎన్నుకొనబడిన సదనము యొక్క సభ్యునిగా ఉన్నట్లు లేక సందర్భానుసారముగా ఈ పేరాగ్రాఫ్ యొక్క ఉప పేరాగ్రాఫ (3) నిమిత్తము సదనము యొక్క నామనిర్దేశము చేయబడిన సభ్యునిగా ఉన్నట్లు భావించవలెను.

[1][* * *]

4. **విలీనమైన సందర్భములో ఫిరాయింపుగా వర్తించదను కారణముపై అనర్హత:-** (1) ఒక సదనము యొక్క సభ్యుడు, అతని యొక్క అసలు రాజకీయ పార్టీ మరొక రాజకీయ పార్టీతో విలీనమైనప్పుడు, అతడు మరియు అతని యొక్క అసలు రాజకీయ పార్టీ యొక్క ఇతర సభ్యులు-

(ఎ) అట్టి ఇతర రాజకీయ పార్టీ యొక్క సభ్యులుగా లేక సందర్భానుసారముగా అట్టి విలీనమువల్ల ఏర్పడిన కొత్త రాజకీయ పార్టీ యొక్క సభ్యులుగా అయినట్లు; లేదా

(బి) విలీనమును అంగికరించలేదని మరియు ఒక వేరే సమూహముగా పనిచేయుటకు ఎంచుకొనినామని,

క్లెయిము చేసినప్పుడు, పేరాగ్రాఫ్ 2 యొక్క ఉప పేరాగ్రాఫ్ (1) క్రింద అనర్హునిగా చేయరాదు మరియు ఈ ఉపపేరా యొక్క ప్రయోజనముల అట్టి విలీన సమయము నుండి, అట్టి ఇతర రాజకీయ పార్టీ లేక సందర్భానుసారముగా, కొత్త రాజకీయ పార్టీ లేక సమూహమునకు చెందియున్నట్లు గాను మరియు పేరాగ్రాఫ్ 2 యొక్క ఉప పేరాగ్రాఫ్ (1) నిమిత్తము అది అతని అసలు రాజకీయ పార్టీ అయినట్లుగా భావించవలెను.

(2) ఈ పేరాగ్రాఫ్ యొక్క ఉప పేరాగ్రాఫ్ (1) నిమిత్తము, ఒక సదనము యొక్క సభ్యుడి అసలైన రాజకీయ పార్టీ విలీనము, సంబంధిత శాసనమండలి పార్టీ సభ్యులలో మూడింట రెండు వంతులకు తక్కువ కానట్టి సభ్యులు అట్టి విలీనమునకు అంగీకరించినప్పుడు మాత్రమే విలీనము జరిగినట్లు భావించబడవలెను.

5. **మినహాయింపు:-** ఈ అనుసూచిలో ఏమి ఉన్నప్పటికిని లోక్‌సభ అధ్యక్షుడుగా లేక ఉపాధ్యక్షుడుగా, లేక రాజ్యసభ ఉప సభాపతి లేక ఒక రాజ్య శాసన పరిషత్తు యొక్క అధ్యక్షుడు లేక ఉపాధ్యక్షుడు లేక ఒక రాజ్య శాసనసభ యొక్క అధ్యక్షుడు లేక ఉపాధ్యక్షుడు యొక్క పదవికి ఎన్నుకొనబడిన వ్యక్తి,-

(ఎ) అట్టి పదవికి ఎన్నుకొనబడిన కారణమున, అట్టి ఎన్నికకు అవ్యవహిత పూర్వము అతనికి చెందియున్నట్టి రాజకీయ పార్టీ సభ్యత్వమును స్వచ్ఛందముగా వదలుకొనినచో మరియు అటు పిమ్మట అట్టి పదవిని కలిగియున్నంత కాలము ఆ రాజకీయ పార్టీయందు చేరనిచో లేక మరొక రాజకీయ పార్టీ సభ్యుడు కాకుండినచో; లేక

(బి) అతడు అట్టి పదవికి ఎన్నికైన కారణమున, అట్టి ఎన్నికకు అవ్యవహిత పూర్వము అతనికి చెందియున్నట్టి రాజకీయ పార్టీ సభ్యత్వమును వదిలియుండి, అట్టి పదవిని వదలుకొనిన తరువాత ఎటువంటి రాజకీయ పార్టీలో తిరిగి చేరియున్నచో,

ఈ అనుసూచి క్రింద అనర్హుడు కారాదు.

---

1. సంవిధాన (తొంబది ఒకటవ సవరణ) చట్టము, 2003 యొక్క 5వ పరిచ్ఛేదము ద్వారా పేరాగ్రాఫ్ 3 వదలి వేయబడినవి.

6. **ఫిరాయింపు కారణముగా అనర్హతకైన ప్రశ్నలపై నిర్ణయము:–** (1) అనుసూచి క్రింద అనర్హతకు లోబడి ఒక సదనము యొక్క సభ్యుడు, నిరర్హతకు గురి అయినాడా అను దానిపై ప్రశ్న ఉత్పన్నమైనచో, అట్టి సదనము యొక్క సభాపతి లేక సందర్భానుసారముగా అధ్యక్షుని యొక్క నిర్ణయమునకు నిర్దేశించబడవలెను మరియు ఆయన నిర్ణయము అంతిమమైనదై యుండవలెను:

అయితే, ఒక సభ యొక్క సభాపతి లేక అధ్యక్షుడు అట్టి నిరర్హతకు గురియైనాడా అను ప్రశ్న ఉత్పన్నమైనచో, ఈ విషయములో సభ ఎన్నుకొను ఆ సభ యొక్క సభ్యుని నిర్ణయమునకు నిర్దేశించబడవలెను మరియు ఆయన నిర్ణయము అంతిమమైనదై యుండవలెను.

(2) ఈ అనుసూచి క్రింద ఒక సదనము యొక్క సభ్యుని అనర్హతకైన ఏదేని ప్రశ్నకు సంబంధించి ఈ పేరాగ్రాఫ్‌లోని ఉపపేరాగ్రాఫ్ (1) క్రింది అన్ని చర్యలు అనుచ్ఛేదము 122 యొక్క అర్థపరిధిలోని పార్లమెంటు కార్యకలాపములు, మరియు సందర్భానుసారముగా అనుచ్ఛేదము 212 యొక్క అర్థపరిధిలోని ఒక రాజ్య శాసనమండలి యొక్క కార్యకలాపములుగా భావించవలెను.

*7. **న్యాయస్థానముల పరిధికి ప్రతిబంధకము :–** ఈ సంవిధానములో ఏమి యున్నప్పటికినీ, ఈ అనుసూచి క్రింద ఒక సదనము యొక్క సభ్యుని అనర్హతకు సంబంధించిన ఏదేని విషయములో ఏ న్యాయస్థానము అధికారితా పరిధిని కలిగి యుండదు.

8. **నియమములు:–** (1) ఈ పేరాగ్రాఫ్‌లోని ఉప పేరాగ్రాఫ్ (2) యొక్క నిబంధనలకు లోబడి, ఒక సదనము యొక్క సభాపతి లేక అధ్యక్షుడు ఈ అనుసూచిలోని నిబంధనలకు ప్రభావము నిచ్చుటకు, ముఖ్యముగా, పై వాటి సాధరణతకు భంగము కలుగకుండాను, అట్టి నియమములు–

(ఎ) సదనము యొక్క వివిధ సభ్యులు చెందియున్న రాజకీయ పార్టీలు ఏవైనా ఉన్నవో వారి రిజిస్టర్లు లేక ఇతర రికార్డుల నిర్వహణ గురించి;

(బి) ఒక సదనము యొక్క సభ్యుని విషయములో శాసనమండలి పార్టీ నాయకుడు అట్టి సభ్యుడి గురించి పేరాగ్రాఫ్ 2లోని ఉప పేరాగ్రాఫ్ (1)లోని ఖండము (బి)లో నిర్దేశించినటువంటి ఏదేని క్షమావణ గురించిన నివేదికను, అట్టి నివేదికను సదనములోని ఏ అధికారికి ఎంత కాలము లోపల సమర్పించవలెనను దాని గురించి, మరియు

(సి) ఒక రాజకీయ పార్టీ సభ యొక్క ఎవరేని సభ్యులు అట్టి రాజకీయ పార్టీలో చేరుట గురించి నివేదికలను మరియు అట్టి నివేదికలు సభలోని ఏ అధికారికి సమర్పించవలెనను దాని గురించి, మరియు

(డి) పేరాగ్రాఫ్ 6 యొక్క ఉప పేరాగ్రాఫ్ (1)లో పేర్కొన్న ఏదేని ప్రశ్నను, అట్టి ప్రశ్నను నిర్ణయించుటకై చేయబడవల్సిన ఏదేని విచారణ కొరకైన ప్రక్రియతో సహా, నిర్ణయించుటకైన ప్రక్రియ గురించి నిబంధించవచ్చును.

---

* కిహోటో హొల్లోహన్ వర్సెస్ జాచిల్‌హూ మరియు ఇతరులు, ఏఐఆర్ 1993 ఎస్‌సీ 412లోని అధిక సంఖ్యాకుల అభిప్రాయం ప్రకారం 368వ అనుచ్ఛేదవు ఖండము (2)కు గల వినాయింపు ననుసరించి దృవీకరణ నిమిత్తం 7వ పేరాగ్రాఫ్‌ను అమాన్యమైనదిగా ప్రఖ్యానించబడినది.

(2) ఒక సదనము యొక్క సభాపతి లేక అధ్యక్షునిచే చేయబడిన నియమములు, అవి ఈ పేరాగ్రాఫ్‌లోని ఉప పేరాగ్రాఫ్ (1) క్రింద చేయబడిన పిమ్మట వీలైనంత త్వరగా సదనము సమక్షమున మొత్తము ముప్పది దినముల కాలావధిపాటు ఉంచవలెను. ఆ కాలావధి ఒకే అధివేశనములోగాని రెండు లేక అంతకేక్కువ అనుక్రమ అధివేశనములలోగాని చేరియుండవచ్చును. అట్లు దానిని ఉంచిన అధివేశనమునగాని, అవ్యవహితానంతర అధివేశనమునగాని ముగియు లోపల సదనముచే ఆ నియమములు మార్పుతో లేక మార్పులు లేకుండా ఆమోదించబడిననే తప్ప, పైన పేర్కొన్న ముప్పది దినముల కాలావధి ముగిసిన పిమ్మట అవి ఉంచినట్లుగా లేదా మార్పు చేయబడిన రూపంలో ప్రభావము కలిగియుండును, లేక సందర్భానుసారముగా అవి ఆమోదింపబడనిచో, అవి ప్రభావము కలిగియుండవు.

(3) సభ యొక్క ఛైర్మన్ లేక అధ్యక్షుడు, 105వ అనుచ్ఛేదము లేక సందర్భానుసారముగా 194వ అనుచ్ఛేదము యొక్క నిబంధనలు లేక ఈ సంవిధానము క్రింద ఆయన కలిగియుండు ఏదేని ఇతర అధికారమునకు భంగము కలుగకుండా, ఎవరేని వ్యక్తి, ఈ పేరాగ్రాఫ్ క్రింద చేయబడిన నియమములు బుద్ధిపూర్వకముగా ఉల్లంఘించిన మాదిరిగానే వ్యవహరించబడునని ఆదేశించ వచ్చును.]

## [1][పదకొండవ అనుసూచి

## [243 జీ అనుచ్ఛేదము]

1. వ్యవసాయ విస్తరణతో సహా, వ్యవసాయము.
2. భూమి అభివృద్ధి, భూ సంస్కరణల అమలు, భూముల ఏకీకరణ మరియు భూసార పరిరక్షణ.
3. చిన్నతరహా నీటి పారుదల, నీటి నిర్వహణ మరియు వాటర్ షెడ్ అభివృద్ధి.
4. పశుసంవర్ధన, పాడి మరియు కోళ్ల పరిశ్రమ.
5. మత్స్య పరిశ్రమ.
6. సామాజిక అడవులు మరియు వ్యవసాయిక అడవులు.
7. చిన్నతరహా అటవీ ఉత్పత్తులు.
8. ఆహార తయారీ పరిశ్రమతో సహా చిన్నతరహా పరిశ్రమలు.
9. ఖాదీ, గ్రామీణ మరియు కుటీర పరిశ్రమలు.
10. గ్రామీణ గృహ నిర్మాణము.
11. త్రాగునీరు.
12. ఇంధనము మరియు పశుగ్రాసము.
13. రోడ్లు, అలుగువంతెనలు, వంతెనలు, ఫెర్రీలు, నీటి మార్గాలు మరియు ఇతర సమాచార సాధనాలు.
14. విద్యుత్తు పంపిణీతో సహా గ్రామీణ విద్యుద్దీకరణ.
15. సంప్రదాయేతర ఇంధన వనరులు.
16. దారిద్ర్య నిర్మూలన కార్యక్రమము.
17. ప్రాథమిక మరియు మాధ్యమిక పాఠశాల విద్య.
18. సాంకేతిక శిక్షణ మరియు వృత్తి విద్య.
19. వయోజన మరియు అనియత విద్య.
20. గ్రంథాలయములు.
21. సాంస్కృతిక కార్యకలాపాలు.
22. మార్కెట్లు మరియు సంతలు.

---

1. సంవిధాన (డెబ్బది మూడవ సవరణ) చట్టము, 1992 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 24.04.1993 నుండి చేర్చబడినది.

23. అనుపత్రులు, ప్రాథమిక ఆరోగ్య కేంద్రాలు మరియు డిస్పెన్సరీలతో సహా ఆరోగ్యము మరియు పారిశుద్ధ్యము.

24. కుటుంబ సంక్షేమము.

25. స్త్రీ మరియు శిశు అభివృద్ధి.

26. వికలాంగుల మరియు బుద్ధిమాంధ్యముగల వ్యక్తుల సంక్షేమముతో సహా సాంఘిక సంక్షేమము.

27. అనుసూచిత కులములు, అనుసూచిత జనజాతులు మరియు ముఖ్యంగా బలహీన వర్గాల సంక్షేమము.

28. ప్రజా పంపిణీ వ్యవస్థ.

29. సామాజిక ఆస్తుల నిర్వహణ.]

# [1][పన్నెండవ అనుసూచి

## [243 డబ్ల్యు అనుచ్ఛేదము]

1. నగర ప్రణాళికతో సహా పట్టణ ప్రాంతాల ప్రణాళిక.

2. భూ వినియోగ క్రమబద్ధీకరణ మరియు భవనముల నిర్మాణం.

3. ఆర్థిక మరియు సామాజిక అభివృద్ధి ప్రణాళిక.

4. రోడ్లు మరియు వంతెనలు.

5. గృహసంబంధ, పారిశ్రామిక మరియు వాణిజ్య ప్రయోజనముల కొరకు నీటి సరఫరా.

6. ప్రజారోగ్యం, పారిశుద్ధ్య పరిరక్షణ మరియు ఘన వ్యర్థాల నిర్వహణ.

7. అగ్నిమాపక సేవలు.

8. పట్టణ అటవీకరణ, పరిసరాల పరిరక్షణ మరియు పర్యావరణ సంబంధ కార్యక్రమాలను ప్రోత్సహించుట.

9. అంగవైకల్యము మరియు బుద్ధిమాంద్యముగల వారితో సహా సమాజములోని బలహీనవర్గాల ప్రయోజనముల పరిరక్షణ.

10. మురికివాడల అభివృద్ధి మరియు వాటినిపై శ్రేణికి చేర్చుట.

11. పట్టణ పేదరిక నిర్మూలన.

12. పార్కులు, ఉద్యానవనములు, ఆట మైదానములు వంటి పట్టణ సదుపాయములు మరియు సౌకర్యముల ఏర్పాటు.

13. సాంస్కృతిక, విద్యావిషయక మరియు సౌందర్య సంబంధ కార్యక్రమాలను ప్రోత్సహించుట.

14. ఖనన వాటికలు మరియు ఖనన మైదానములు; దహనవాటికలు, దహనవాటిక మైదానము మరియు విద్యుత్ దహనవాటికలు.

15. బందెల దొడ్లు, జంతువులపట్ల క్రూరత్వ నివారణ.

16. జనన, మరణముల రిజిస్ట్రీకరణతో సహా ప్రధాన గణాంక వివరములు.

17. వీధి దీపాలు, పార్కింగ్ స్థలాలు, బస్ స్టాపులు మరియు పబ్లిక్ సౌకర్యాలతో సహా పబ్లిక్ సదుపాయములు.

18. పశువధ గృహములు మరియు తోళ్ళను పదునుచేయు కేంద్రముల క్రమబద్ధీకరణ.]

---

1. సంవిధాన (డెబ్బది నాలుగవ సవరణ) చట్టము, 1992 యొక్క 4వ పరిచ్ఛేదము ద్వారా 01.06.1993 నుండి చేర్చబడినది.

## అనుబంధము – I

## *సంవిధాన (జమ్మూ మరియు కాశ్మీరుకు వర్తింపు) ఉత్తరువు, 2019

## సీ.ఓ.272

రాష్ట్రపతి, జమ్మూ మరియు కాశ్మీరు రాజ్యము యొక్క సమ్మతితో, సంవిధానము యొక్క 370వ అనుచ్ఛేదపు ఖండము (1)చే ఒసగబడిన అధికారములను వినియోగించుచూ ఈ క్రింది ఉత్తరువును చేయుటకు సంతుష్టి చెందినారు.

1. (1) ఈ ఉత్తరువును సంవిధాన (జమ్మూ మరియు కాశ్మీరుకు వర్తింపు) ఉత్తరువు, 2019 అని పేర్కొనవచ్చును.

(2) ఇది వెంటనే అమలులోనికి వచ్చును మరియు అటు మీదట ఆయా సమయములందు సవరించబడిన సంవిధాన (జమ్మూ మరియు కాశ్మీరుకు వర్తింపు) ఉత్తరువు, 1954 రద్దగును.

2. మినహాయింపులు మరియు మార్పులు అట్లు వర్తించుటకు లోబడి మరియు ఈ క్రింది వాటికి సంబంధించి ఆయా సమయములందు సవరించబడినట్లుగా సంవిధానపు నిబంధనలన్నియు జమ్మూ మరియు కాశ్మీరు రాజ్యమునకు వర్తించును:–

367వ అనుచ్ఛేదమునకు, ఈ క్రింది ఖండమును చేర్చవలెను, అదేదనగా:–

‘‘(4) ఈ సంవిధానపు ప్రయోజనముల కొరకు జమ్మూ మరియు కాశ్మీరు రాజ్యమునకు సంబందించి ఇవి వర్తించును–

(ఎ) ఈ సంవిధానము లేదా దానిలోని నిబంధనలకైన నిర్దేశములను సదరు రాజ్యమునకు సంబంధించి వర్తింపజేయు సంవిధానము లేదా దానిలోని నిబంధనలకైన నిర్దేశములుగా అన్వయించబడవలెను;

(బి) తత్సమయమున పదవిలోనున్న రాజ్య మంత్రి పరిషత్తు యొక్క సలహాపై జమ్మూ మరియు కాశ్మీరు యొక్క సదర్–ఎ–రియాసత్‌గా పని చేయుచున్న ఆ రాజ్యపు శాసనసభ సిఫారసుపై తత్సమయమున రాష్ట్రపతిచే గుర్తింపబడిన వ్యక్తికైన నిర్దేశములను జమ్మూ మరియు కాశ్మీరు యొక్క గవర్నరుకైన నిర్దేశములుగా అన్వయించబడవలెను;

(సి) సదరు రాజ్య ప్రభుత్వమునకైన నిర్దేశములలో, మంత్రి పరిషత్తు సలహాపై పనిచేయుచున్న జమ్మూ మరియు కాశ్మీరు యొక్క గవర్నరుకైన నిర్దేశములు చేరి ఉన్నట్లుగా అన్వయించబడవలెను; మరియు

---

*2019 ఆగస్టు 5వ తేదీ నాటి న్యాయ మరియు న్యాయపాలన మంత్రిత్వ శాఖ (శాసనాధికార విభాగము) వారి అధిసూచన నెం.జీ.ఎస్.ఆర్.551 (ఈ), భారత రాజపత్రము, అసాధారణ, భాగము–II, 3వ పరిచ్ఛేదపు ఉప–పరిచ్ఛేదము (i) ప్రచురించబడినది.

(డి) ఈ సంవిధానము యొక్క 370వ అనుచ్ఛేదపు ఖండము (3)నకు గల వినాయింపులో ''ఖండము (2)లో నిర్దేశించబడిన రాజ్యము యొక్క సంవిధాన సభ'' అను పదబంధమును ''రాజ్య శాసనసభ''గా చదువుకొనవలెను.

## అనుబంధము – II

## సంవిధాన (44వ సవరణ) చట్టము, 1978 నుండి ఉదాహరించిన భాగము

*   *   *   *   *

1. (1) *** **సంగ్రహనామము మరియు ప్రారంభము.**

(2) ఇది కేంద్ర ప్రభుత్వము, అధికారిక రాజపత్రములో అధిసూచన ద్వారా నియతము చేయునట్టి తేదీన అమలులోనికి వచ్చును మరియు ఈ చట్టపు వేర్వేరు నిబంధనలకు వేర్వేరు తేదీలు నియతము చేయవచ్చును.

*   *   *   *   *

3. సంవిధానపు 22వ అనుచ్ఛేదములో,– **22వ అనుచ్ఛేదమునకు సవరణ.**

(ఎ) ఖండము (4)కు బదులుగా ఈ క్రింది ఖండమును ఉంచవలెను, అదేదనగా:–

''(4) నివారక నిరోధము కొరకు నిబంధించు శాసనము ఏదియు సముచిత ఉన్నత న్యాయస్థానపు ముఖ్య న్యాయమూర్తి యొక్క సిఫారసులననుసరించి ఏర్పాటు చేయబడిన సలహా మండలి తన అభిప్రాయములో ఒక వ్యక్తిని రెండు మాసములకు మించి నిరోధించుటకు తగినంత కారణము కలదని సదరు కాలావధి ముగియుటకు పూర్వము రిపోర్టు చేసిననే తప్ప, అట్టి రెండు కాలావధికి మించి నిరోధించుటకు ప్రాధికారమునొసగదు:

అయితే, సలహా మండలి ఒక ఛైర్మన్ మరియు ఇద్దరికి తక్కువ కానట్టి ఇతర సభ్యులతో కూడి ఉండవలెను మరియు ఆ ఛైర్మన్ సముచిత ఉన్నత న్యాయస్థానములో పని చేయుచున్న న్యాయాధీశుడై ఉండవలెను మరియు ఇతర సభ్యులు ఏదైనా ఉన్నత న్యాయస్థానములో పనిచేయుచున్న లేదా పదవీ విరమణ చేసిన న్యాయాధీశులై ఉండవలెను:

అంతేకాక, ఈ ఖండములోనున్నదేదియు ఖండము (7) యొక్క ఉప–ఖండము (ఎ) క్రింద పార్లమెంటు చేసిన ఏదైనా శాసనము ద్వారా విహితపరచిన గరిష్ఠ కాలావధిని మించి ఏ వ్యక్తినైననూ నిర్బంధించుటకు ప్రాధికారమునొసగదు.

**విశదీకరణ:** ఈ ఖండములో ''సముచిత ఉన్నత న్యాయస్థానము'' అనగా,–

(i) భారత ప్రభుత్వము లేదా అధికారి లేదా ఆ ప్రభుత్వమునకు అధీనస్థుడైన ప్రాధికారి చేసిన నిరోధపు ఉత్తరువుననుసరించి ఒక వ్యక్తి నిరోధించబడిన సందర్భములో ఢిల్లీ సంఘరాజ్య క్షేత్రపు ఉన్నత న్యాయస్థానము;

(ii) (సంఘరాజ్యక్షేత్రము కానట్టి) ఏదైనా రాష్ట్ర ప్రభుత్వము చేసిన నిరోధపు ఉత్తరువుననుసరించి ఒక వ్యక్తి నిరోధించబడిన సందర్భములో ఆ రాజ్యపు ఉన్నత న్యాయస్థానము;

(iii) సంఘరాజ్యక్షేత్రపు పరిపాలకుడు లేదా అధికారి లేదా అట్టి పరిపాలకునికి అధీనస్థుడైన ప్రాధికారి చేసిన నిరోధపు ఉత్తరువుననుసరించి ఒక వ్యక్తి నిరోధింపబడిన

సందర్భములో ఈ విషయమున పార్లమెంటు చేసిన ఏదైనా శాసనము ద్వారా లేదా దాని క్రింద నిర్దిష్టపరచినట్టి ఉన్నత న్యాయస్థానము అని అర్థము'';

(బి) ఖండము (7)లో,-

(i) ఉప-ఖండము (ఎ)ను లుప్తము చేయవలెను;

(ii) ఉప-ఖండము (బి)ని ఉప-ఖండము (ఎ)గా తిరిగి వ్రాయవలెను; మరియు

(iii) ఉప-ఖండము (సి)ని ఉప-ఖండము (బి)గా తిరిగి వ్రాయవలెను మరియు అట్లు తిరిగి వ్రాసిన ఉప-ఖండములోని ''ఖండము (4) యొక్క ఉప-ఖండము (ఎ)'' అను పదములు, బ్రాకెట్లు, అక్షరము మరియు అంకెకు బదులుగా ''ఖండము (4)'' అను పదము, బ్రాకెట్లు మరియు అంకెను ఉంచవలెను.

## అనుబంధము – III
## సంవిధాన (ఎనభై ఎనిమిదవ సవరణ) చట్టము, 2003

(15 జనవరి, 2004)

భారత సంవిధానమును ఇంకనూ సవరించుటకైన చట్టము.

భారత గణరాజ్యపు యాభై–నాల్గవ సంవత్సరములో పార్లమెంటుచే ఈ క్రింది శాసనము చేయబడినది.

1. (1) ఈ చట్టమును సంవిధాన (ఎనభై–ఎనిమిదవ సవరణ) చట్టము, 2003 అని పేర్కొనవచ్చును. **సంగ్రహనామము మరియు ప్రారంభము.**

(2) ఇది కేంద్ర ప్రభుత్వము, అధికారిక రాజపత్రములో అధిసూచన ద్వారా నియతము చేయునట్టి తేదీన* అమలులోనికి వచ్చును.

2. సంవిధానపు 268వ అనుచ్ఛేదము తరువాత, ఈ క్రింది అనుచ్ఛేదమును చొప్పించవలెను, అదేదనగా:– **268ఏ అను కొత్త అనుచ్ఛేదమును చొప్పించుట.**

''268ఏ. కేంద్రముచే విధించబడిన సేవల పన్నును కేంద్రము మరియు రాజ్యములచే వసూలు చేయబడి మరియు వినియోజనము చేయబడుట. (1) సేవలపై పన్నులు భారత ప్రభుత్వముచే విధించబడవలెను మరియు అట్టి పన్నును ఖండము (2)లో నిబంధించినట్టి రీతిలో భారత ప్రభుత్వము మరియు రాజ్యములచే వసూలు చేయబడి మరియు వినియోజనము చేయబడవలెను.

(2) ఖండము (1) యొక్క నిబంధనలననుసరించి ఏదైనా విత్తీయ సంవత్సరములో విధించినట్టి ఏదైనా అట్టి పన్ను రాబడుల మొత్తమును పార్లమెంటుచే రూపొందించబడిన శాసనము ద్వారా వసూలు మరియు వినియోజనము చేయుటకైనట్టి సూత్రములననుసరించి–

(ఏ) భారత ప్రభుత్వము మరియు రాజ్యములచే వసూలు చేయబడవలెను;

(బి) భారత ప్రభుత్వము మరియు రాజ్యములచే వినియోజనము చేయబడవలెను.''.

3. సంవిధానపు 270వ అనుచ్ఛేదములోని ఖండము (1)లో, ''అనుచ్ఛేదములు 268 మరియు 269'' అను పదములు మరియు అంకెలకు బదులుగా ''అనుచ్ఛేదములు 268, 268ఏ మరియు 269'' అను పదములు, అంకెలు మరియు అక్షరమును ఉంచవలెను. **270వ అనుచ్ఛేదమునకు సవరణ.**

4. సంవిధానపు ఏడవ అనుసూచిలోని జాబితా- I – కేంద్ర జాబితాలో, 92బీ నమోదు తరువాత, ఈ క్రింది నమోదును చొప్పించవలెను, అదేదనగా:– **7వ అనుసూచికి సవరణ.**

''92సీ. సేవలపై పన్నులు.''.

---

* అమలు తేదీ ఇంకా అధిసూచించవలసి ఉన్నది.

# అనుబంధము – IV
## సంవిధాన (నూరవ సవరణ) చట్టము, 2015

(28 మే, 2015)

భారతదేశముచే రాజ్యక్షేత్రములను ఆర్జించుటను అమలు పరచుటకు భారత సంవిధానమును ఇంకనూ సవరించుటకైన చట్టము మరియు భారతప్రభుత్వము మరియు బంగ్లాదేశ్‌ల మధ్య కుదుర్చుకున్న ఒప్పందము మరియు ప్రొటోకాల్‌ను (సంధిపత్రము) పురస్కరించుకుని కొన్ని రాజ్య క్షేత్రములను అంతరణ చేయుటకు.

భారత గణరాజ్యపు అరవై ఆరవ సంవత్సరములో పార్లమెంటుచే ఈ క్రింది శాసనము చేయబడినది.

1. (1) ఈ చట్టమును సంవిధాన (నూరవ సవరణ) చట్టము, 2015 అని పేర్కొనవచ్చును. సంగ్రహనామము

2. ఈ చట్టములో– నిర్వచనములు

(ఎ)'' ఆర్జించిన రాజ్యక్షేత్రము'' అనగా ఖండము (సి)లో నిర్దేశించిన ఒప్పందము మరియు దాని ప్రోటోకాల్ (సంధిపత్రము)ను పురస్కరించుకుని బంగ్లాదేశ్ నుండి భారతదేశము ఆర్జించుటకైన ప్రయోజనము కొరకు సరిహద్దులు నిర్ణయించి మొదటి అనుసూచిలో నిర్దేశించిన మరియు భారత – బంగ్లాదేశ్ ఒప్పందము మరియు దాని ప్రొటోకాల్‌లో పొందుపరచిన అనేక రాజ్యక్షేత్రములు అని అర్థము;

(బి) ''నియతదినము'' అనగా భారత్ – బంగ్లాదేశ్ ఒప్పందము మరియు దాని ప్రోటోకాల్‌ను పురస్కరించుకుని మొదటి అనుసూచి మరియు రెండవ అనుసూచిలలో నిర్దేశించినట్లుగా ఆర్జించుటకు మరియు అంతరణ చేయుటకెకైన రాజ్యక్షేత్రముల సరిహద్దులను నిర్ణయించు ప్రయోజనము కొరకు బంగ్లాదేశ్ నుండి రాజ్యక్షేత్రములను ఆర్జించుటకైన మరియు బంగ్లాదేశ్‌కు రాజ్యక్షేత్రములను అంతరణ చేయుటకైన తేదీని నియతము చేయుటకై కేంద్రప్రభుత్వము అధికారిక రాజపత్రములో అధిసూచన ద్వారా నియతము చేయునట్టి తేదీ అని అర్థము;

(సి) ''భారత్–బంగ్లాదేశ్ ఒప్పందము'' అనగా భారతదేశము మరియు బంగ్లాదేశ్‌ల మధ్య భూమి ఎల్లల యొక్క సరిహద్దుల నిర్ణయము మరియు సంబంధిత విషయములపై 1974 మే 16వ తేదీన భారత గణ రాజ్యపు ప్రభుత్వము మరియు బంగ్లాదేశ్ ప్రజాగణరాజ్యపు ప్రభుత్వముల మధ్య కుదుర్చుకున్న ఒప్పందము, 1974 డిసెంబరు 26, 1974 డిసెంబరు 30, 1982 అక్టోబరు 7, 1992 మార్చి 26వ తేదీ నాటి లేఖలు మార్చుకొనుట మరియు భారత–బంగ్లాదేశ్ ప్రభుత్వముల మధ్య కుదుర్చుకున్న సదరు ఒప్పందములపైన 2011 సెప్టెంబరు 6వ తేదీ నాటి ప్రోటోకాల్ (సంధిపత్రములు), మూడవ అనుసూచిలో పొందుపరిచిన వాటికి సంబంధించిన ఉదాహృతులు అని అర్థము ;

(డి)'' అంతరణ చేయబడిన రాజ్యక్షేత్రము'' అనగా ఖండము (సి)లో నిర్దేశించిన ఒప్పందములు మరియు దాని ప్రోటోకాల్‌ను పురస్కరించుకుని భారతదేశము నుండి బంగ్లాదేశ్‌కు అంతరణ చేయు

ప్రయోజనము కొరకు సరిహద్దు నిర్ణయము చేసిన రెండవ అనుసూచిలో నిర్దేశించబడిన భారత–బంగ్లాదేశ్ ఒప్పందము మరియు దాని ప్రోటోకాల్‌లో పొందుపరచిన అనేక రాజ్యక్షేత్రములు అని అర్థము;

**సంవిధానపు మొదటి అనుసూచికి సవరణ**

3. సంవిధానపు మొదటి అనుసూచిలోని నియతదినము నుండి, –

(ఎ) అస్సాము రాజ్యపు రాజ్యక్షేత్రములు, పదబంధములు, బ్రాకెట్లు మరియు అంకెలకు సంబంధించిన పేరాలో చివరన ''మరియు సంవిధాన (నూరవ సవరణ) చట్టము, 2015కు గల రెండవ అనుసూచి యొక్క భాగము –I లో నిర్దేశించబడిన రాజ్యక్షేత్రములకు సంబంధించినంత వరకు సంవిధాన ( తొమ్మిదవ సవరణ చట్టము), 1960 యొక్క మూడవ పరిచ్ఛేదములోని ఖండము (ఎ)లో ఏమిఉన్నప్పటికినీ సంవిధాన (నూరవ సవరణ) చట్టము, 2015లోని రెండవ అనుసూచి యొక్క భాగము –I లో నిర్దేశించబడిన రాజ్యక్షేత్రములు'' అను దానిని చేర్చవలెను.

(బి) పశ్చిమ బెంగాల్ రాజ్యపు రాజ్యక్షేత్రములు, పదబంధములు, బ్రాకెట్లు మరియు అంకెలకు సంబంధించిన పేరాలో చివరన '' సంవిధాన (నూరవ సవరణ) చట్టము, 2015లోని మొదటి అనుసూచి యొక్క భాగము –III లో నిర్దేశించబడినట్టి రాజ్యక్షేత్రములు మరియు రెండవ అనుసూచి యొక్క భాగము –III లో నిర్దేశించినట్టి రాజ్యక్షేత్రములకు సంబంధించినంతవరకు, మరియు సంవిధాన (తొమ్మిదవ సవరణ) చట్టము, 1960 యొక్క మూడవ పరిచ్ఛేదపు ఖండము(సి)లో ఏమి ఉన్నప్పటికిని సంవిధాన (నూరవ సవరణ) చట్టము, 2015లోని మొదటి అనుసూచి యొక్క భాగము –III లో నిర్దేశించబడినట్టి రాజ్యక్షేత్రములు కూడా, అయితే రెండవ అనుసూచిలోని భాగము –III లో నిర్దేశించిన రాజ్యక్షేత్రములను మినహాయిస్తూ'' అను దానిని చేర్చవలెను.

(సి) మేఘాలయ రాజ్యపు రాజ్యక్షేత్రములు, పదబంధములు, బ్రాకెట్లు మరియు అంకెలకు సంబంధించిన పేరాలో చివరన '' మరియు, సంవిధాన (నూరవ సవరణ) చట్టము, 2015 యొక్క మొదటి అనుసూచిలోని భాగము –I లో నిర్దేశించబడినట్టి రాజ్యక్షేత్రములు అయితే రెండవ అనుసూచి యొక్క భాగము–IIలో నిర్దేశించబడినట్టి రాజ్యక్షేత్రములను మినహాయిస్తూ'' అను దానిని చేర్చవలెను.

(డి) త్రిపుర రాజ్యపు రాజ్యక్షేత్రములు, పదబంధములు, బ్రాకెట్లు మరియు అంకెలకు సంబంధించిన పేరాలో చివరన '' మరియు, సంవిధాన (నూరవ సవరణ) చట్టము, 2015కు గల మొదటి అనుసూచి యొక్క భాగము – IIలో నిర్దేశించబడిన రాజ్యక్షేత్రములకు సంబంధించినంతవరకు సంవిధాన (తొమ్మిదవ సవరణ) చట్టము, 1960 యొక్క మూడవ పరిచ్ఛేదపు ఖండము(డి)లో ఏమి ఉన్నప్పటికిని, సంవిధాన (నూరవ సవరణ) చట్టము, 2015లోని మొదటి అనుసూచి యొక్క భాగము –II లో నిర్దేశించబడినట్టి రాజ్యక్షేత్రములను'' అను దానిని చేర్చవలెను.

## మొదటి అనుసూచి

### [2(ఎ), 2(బి) మరియు 3 పరిచ్ఛేదములను చూడుము ]

### భాగము–I

1974 మే, 16వ తేదీ ఒప్పందములోని రెండవ అనుచ్ఛేదము మరియు 2011 సెప్టెంబరు 6వ తేదీ ప్రోటోకాల్ యొక్క 3 (I)( బి)(ii)(iii)(iv)(v) వ అనుచ్ఛేదములకు సంబంధించి అర్థ్యార్జింపబడిన రాజ్యక్షేత్రము.

### భాగము–II

1974 మే, 16వ తేదీ ఒప్పందములోని రెండవ అనుచ్ఛేదము మరియు 2011 సెప్టెంబరు 6వ తేదీ ప్రోటోకాల్ యొక్క 3(I)(సి)(i) వ అనుచ్ఛేదములకు సంబంధించి అర్థ్యార్జింపబడిన రాజ్యక్షేత్రము.

### భాగము–III

1974 మే, 16వ తేదీ ఒప్పందములోని ఒకటవ అనుచ్ఛేదపు ఖండము (12) మరియు రెండవ అనుచ్ఛేదము మరియు 2011 సెప్టెంబరు 6వ తేదీ ప్రోటోకాల్ యొక్క 2(II), 3(I)(ఎ)(iii)(iv)(v)(vi) వ అనుచ్ఛేదములకు సంబంధించి అర్థ్యార్జింపబడిన రాజ్యక్షేత్రము.

## రెండవ అనుసూచి

### [2(బి), 2(డి) మరియు 3 పరిచ్ఛేదములను చూడుము ]

### భాగము–I

1974 మే, 16వ తేదీ ఒప్పందములోని రెండవ అనుచ్ఛేదము మరియు 2011 సెప్టెంబరు 6వ తేదీ ప్రోటోకాల్ యొక్క 3(I)(డి)(i)(ii) వ అనుచ్ఛేదములకు సంబంధించి అంతరణ చేయబడిన రాజ్యక్షేత్రము.

### భాగము–II

1974 మే, 16వ తేదీ ఒప్పందములోని రెండవ అనుచ్ఛేదము మరియు 2011 సెప్టెంబరు 6వ తేదీ ప్రోటోకాల్ యొక్క 3(I)(బి)(i) వ అనుచ్ఛేదములకు సంబంధించి అంతరణ చేయబడిన రాజ్యక్షేత్రము.

### భాగము–III

1974 మే, 16వ తేదీ ఒప్పందములోని ఒకటవ అనుచ్ఛేదపు ఖండము (12) మరియు రెండవ అనుచ్ఛేదములకు మరియు 2011 సెప్టెంబరు 6వ తేదీ ప్రోటోకాల్ యొక్క 2(II), 3(I)(ఎ)(i)(ii)(vi) వ అనుచ్ఛేదములకు సంబంధించి అంతరణ చేయబడిన రాజ్యక్షేత్రము.

## మూడవ అనుసూచి

## [2(సి) పరిచ్ఛేదమును చూడుము ]

**I. భారతదేశము మరియు బంగ్లాదేశ్ మధ్య భూమి సరిహద్దుల యొక్క హద్దుల నిర్ణయము మరియు 1974 మే 16వ తేదీ సంబంధిత విషయములకు సంబందించి భారణ గణరాజ్య ప్రభుత్వము మరియు బంగ్లాదేశ్ ప్రజల గణ రాజ్యపు ప్రభుత్వముల మధ్య ఒప్పందము నుండి ఉదాహృతులు.**

1(12)వ అనుచ్ఛేదము: విదేశీ అంత:క్షేత్రములు

బంగ్లాదేశ్ వైపుకు వెళుతున్న అదనపు ప్రాంతమునకు నష్టపరిహారం కోరకుండా 14వ పేరాలో పేర్కొనబడిన విదేశీ అంత:క్షేత్రములను మినహాయిస్తూ, బంగ్లాదేశ్‌లోని భారతదేశపు విదేశీ అంత:క్షేత్రములను మరియు భారతదేశంలోని బంగ్లాదేశ్ అంత:క్షేత్రములను త్వరితగతిన మార్పిడి చేసుకొనవలెను.

అనుచ్ఛేదము 2:

భారత మరియు బంగ్లాదేశ్ యొక్క ప్రభుత్వములు ఇంతకుముందే తయారు చేయబడి విడదీయబడిన పటముల విషయములో ఇంతకుముందే సరిహద్దులను నిర్ణయించిన ప్రాంతములలోని ప్రతికూల ఆధీనములోని సంఘరాజ్యక్షేత్రములను సర్వాధికారములు కల్గిన రాయబారులచే ఆ విడదీయబడిన సరిహద్దు పటములపై సంతకమును చేసిన ఆరు మాసములలోపల మార్చుకోవాలని కరారు చేసుకొన్నవి. అవి వీలైనంత తొందరగా సంబంధిత పటములపై ఏ సందర్భములోనైననూ 1974 డిసెంబర్ 31వ తేదీకి ముందు సంతకము చేయవలెను. ఇంతకుముందే సరిహద్దులను నిర్ణయించినట్టి ఇతర ప్రాంతముల విషయములో పటములను ముద్రించుటకు సత్వర చర్యలను చేపట్టాలి. వాటిని 1975 మే 31వ నాటికి ప్రచురించవలెను మరియు 1975, డిసెంబరు 31 నాటికి ఆ ప్రాంతములలో ప్రతికులంగా నిర్వహించిన ఆధీనములను మార్చుకొను ఉద్దేశ్యముతో ఆ తరవాత సర్వాధికారములు కలిగిన రాయబారులచే సంతకము చేయబడవలెను. ఇంకనూ సరిహద్దులను నిర్ణయించు వృత్తఖండములలో (సెక్టరు) సంబందిత విడదీసిన సరిహద్దు పటములపై సర్వాధికారాలు కలిగిన రాయబారులచే సంతకము చేయబడిన ఆరు మాసముల లోపల రాజ్యక్షేత్రముల అధికారతా పరిధి అంతరణ జరుపవచ్చును.

II. భారతదేశము మరియు బంగ్లాదేశము మధ్యన భూమి ఎల్లల యొక్క సరిహద్దులను నిర్ణయించడానికి సంబంధించి మరియు 2011, సెప్టెంబరు 6వ తేదికి సంబంధించిన విషయాలలో భారత గణరాజ్య ప్రభుత్వము మరియు బంగ్లాదేశ్ ప్రజా గణరాజ్యపు ప్రభుత్వము మధ్య చేసుకొన్న ఒప్పందము యొక్క ప్రోటోకాలు నుండి తీసుకొన్న ఉదాహృతులు.

**2వ అనుచ్ఛేదము :**

(II) 1974లోని 1వ అనుచ్ఛేదపు 12వ ఖండపు ఒప్పందమును ఈ క్రింది విధముగా అమలుచేయవలెను.

విదేశీ అంత:క్షేత్రములు

సమిష్టిగా సత్యాపనచేయబడిన భూమిలెక్కల రిజిష్టరు విదేశీ అంత:క్షేత్రవు పటముల ప్రకారము బంగ్లాదేశ్‌లోని 111 భారత విదేశీ అంత:క్షేత్రములు మరియు భారత్‌లోని 51 బంగ్లాదేశవు విదేశీ అంత:క్షేత్రములు మరియు డిజిఎల్ఆర్ అండ్ ఎస్, బంగ్లాదేశ్ మరియు డిఎల్ఆర్ అండ్ ఎస్, పశ్చిమబెంగాల్ (భారతదేశము) స్థాయి సంతకము చేయబడిన వాటిని బంగ్లాదేశ్‌కు వెళ్లుచున్న అదనపు ప్రాంతముల కొరకు నష్టపరిహారమును క్లెయిము చేయకుండా మార్చుకొనవలెను.

**3వ అనుచ్ఛేదము :**

(I) 1974లోని 2వ అనుచ్ఛేదవు ఒప్పందమును ఈ క్రింది విధముగా అమలుచేయవలెను:–

సమిష్టి సర్వే ద్వారా నిర్ధారించబడినట్లుగా ప్రతికూల ఆధీనంలో నిర్వహించబడుచున్న ప్రాదేశిక ప్రాంతముల కొరకు మరియు ఈ క్రింది ఖండము (ఎ) నుండి (డి) లలో పూర్తిగా నిర్వచించబడినట్లుగా 2010 డిసెంబరు మరియు 2011 ఆగస్టు మధ్యన రెండు దేశముల యొక్క భూమి రికార్డులు మరియు సర్వే శాఖలచే తుది రూపము ఈయబడిన సంబధిత ప్రతికూలంగా ఆధీనంలో ఉన్న భూమి ప్రాంత సూచీపటములో (ఏపీఎల్ పటము) పూర్తిగా వర్ణించినట్లు భారత ప్రభుత్వము మరియు బంగ్లాదేశ్ ప్రభుత్వము నిర్ణయించిన సరిహద్దుగా గీసిన హద్దును కరారు చేసుకొనవలెను.

సంబంధిత విడదీయబడిన పటములను ముద్రించవలెను మరియు సర్వాధికారము కల్గిన రాయబారులచే సంతకము చేయవలెను మరియు ప్రాదేశిక అధికారితా పరిధి యొక్క అంతరణను విదేశీ అంత:క్షేత్రముల మార్పుతో ఒకేసారి ముగించవలెను. ఆ సరిహద్దులను నిర్ణయించు హద్దుపైన తెలిపిన సూచిక పటములలో ఈ క్రింద వర్ణించినట్లుగా ఉండవలెను:–

(ఎ) పశ్చిమబెంగాలు వృత్తఖండము (సెక్టరు)

(i) బౌసుమారి – మధుగారి (కుష్టీయ – నాడియా) ప్రాంతము

సమిష్టిగా సర్వే చేయబడినట్లుగా మరియు 2011 జూన్‌లో ఒప్పందము చేసుకొన్నట్లు ఏకీకరణ చేయబడిన 1962 పటములో వర్ణించినట్లుగా మాతాబంగా నది యొక్క పురాతన సరళీ కేంద్రమును అనుసరిస్తూ ప్రస్తుతం ఉన్న సరిహద్దు స్తంభము సంఖ్య 154/5–ఎస్ నుండి సరిహద్దు స్తంబముల సంఖ్య 157/1–ఎస్ వరకు సరిహద్దును గీయవలెను.

(ii) అంధార్‌కోట (కుష్టీయ – నాడియా) ప్రాంతము

సమిష్టిగా సర్వే చేయబడినట్లుగా మరియు 2011 జూన్‌లో ఒప్పందము చేసుకొన్నట్లుగా ప్రస్తుతం ఉన్న మాతాబంగా నది చివరి భాగమును అనుసరిస్తూ ప్రస్తుతం ఉన్న సరిహద్దు స్తంభము సంఖ్య 152/5–ఎస్ నుండి సరిహద్దు స్తంబము సంఖ్య 153/1–ఎస్ వరకు సరిహద్దును గీయవలెను.

(iii) పకూరియా (కుష్టీయ – నాడియా) ప్రాంతము

సమిష్టిగా సర్వే చేయబడినట్లు మరియు 2011 జూన్‌లో ఒప్పందము చేసుకొన్నట్లుగా మాతాబంగా నది చివరి భాగమును అనుసరిస్తూ ప్రస్తుతం ఉన్న సరిహద్దు స్తంబము సంఖ్య 151/1-ఎస్ నుండి సరిహద్దు స్తంబము సంఖ్య 152/2-ఎస్ వరకు సరిహద్దును గీయవలెను.

(iv) చార్‌మహిష్‌కుండి (కుష్టీయ – నాడియా) ప్రాంతము

సమిష్టిగా సర్వే చేయబడినట్లు మరియు 2011 జూన్‌లో ఒప్పందము చేసుకొన్నట్లుగా మాతాబంగా నది చివరి భాగమును అనుసరించుటకు ప్రస్తుతమున్న సరిహద్దు స్తంబముల సంఖ్య 153/1-ఎస్ నుండి 153/9-ఎస్ వరకు సరిహద్దును గీయవలెను.

(v)హరిపాల్/కుటాదహా/బట్టోలి/సాపామెరి/ఎల్ఎన్‌పూర్(పటారి)(నాగోన్-మాల్డా) ప్రాంతము

ప్రస్తుతమున్న సరిహద్దు స్తంబముల సంఖ్య 242/ఎస్/13 నుండి కలిసిపోయిన మార్గముగా అక్కడి నుండి సరిహద్దు స్తంబము సంఖ్య 243/7-ఎస్/5 వరకు మరియు ఉమ్మడిగా సర్వే చేయబడినట్లు మరియు 2011 జూన్‌లో ఒప్పందము చేసుకొన్నట్లుగా సరిహద్దులను గీయవలెను.

(vi)బెరుబారి (పంచాగ్రా-జల్‌పాయిగురి ప్రాంతము)

బంగ్లాదేశ్ మరియు బెరుబారిచే నిర్వహించుటకు ప్రతికూలంగా నిర్వహించబడుచున్న బెరుబారి (పంచాగ్రా-జల్‌పాయిగురి) మరియు భారతదేశముచే ప్రతికూలంగా నిర్వహించబడుచున్న బెరుబారి మరియు సింఘాపారా-ఖుదిపారా (పంచాగ్రా-జల్‌పాయిగురి) సరిహద్దు ప్రాంతమును సమిష్టిగా 1996-1998 కాలావధిలో ఎల్లల సరిహద్దులను గీయవలెను.

**(బి)మేఘాలయ వృత్తఖండము (సెక్టరు)**

(i)లోబాచిరా-నన్‌చిర్రా

లాయిలాంగ్-బాలిచిరాలోని ప్రస్తుతమున్న సరిహద్దు స్తంభము సంఖ్య 1315/4-ఎస్ నుండి సరిహద్దు స్తంభము సంఖ్య 1315/15-ఎస్, లాయిలాంగ్-నూన్‌చిరాలోని సరిహద్దు స్తంభము సంఖ్య 1316/1-ఎస్ నుండి సరిహద్దు స్తంభము సంఖ్య 1316/11-ఎస్, లాయిలాంగ్-లాహిలింగ్‌లోని సరిహద్దు స్తంభము సంఖ్య 1317 నుండి సరిహద్దు స్తంభము సంఖ్య 1317/13-ఎస్ మరియు లాయిలాంగ్-లోబిచిరాలోని సరిహద్దు స్తంభము సంఖ్య 1318/1-ఎస్ నుండి సరిహద్దు స్తంభము సంఖ్య 1318/2-ఎస్ సరిహద్దుగా ఉమ్మడిగా సర్వేచేయబడినట్లు మరియు 2010 డిసెంబరులో ఒప్పందము చేసుకొన్నట్లుగా తేయాకు తోటల చివరి భాగమును అనుసరిస్తూ పటమును గీయవలెను.

(ii)పైరిడివా-పాడువా ప్రాంతము

సరిహద్దు స్తంభము సంఖ్య 1271/1/-టీ మార్గము వరకు ఉమ్మడిగా సర్వేచేయబడినట్లు మరియు పరస్పరం అంగీకరించిన దాని ప్రకారము ప్రస్తుతమున్న సరిహద్దు స్తంభము సంఖ్య 1270/1-ఎస్ నుండి సరిహద్దును గీయవలెను.

(iii) లాయింగ్‌కట్ ప్రాంతము

(ఎఎ) లాయింగ్‌కట్ – I / కులుముచిర్రా మరియు లాయింగ్‌కట్ – II / కులుముచిర్రా

ప్రస్తుతమున్న సరిహద్దు స్తంభము సంఖ్య 1264/4–ఎస్ నుండి సరిహద్దు స్తంభము సంఖ్య 1265 మరియు ఉమ్మడి సర్వేచేయబడినట్లు మరియు పరస్పరము అంగీకరించిన మార్గము ప్రకారము సరిహద్దు స్తంభము సంఖ్య 1265/6–ఎస్ నుండి 1265/9–ఎస్ వరకు సరిహద్దు గీయవలెను.

(ఎబి) లాయింగ్‌కట్– III /సోనార్‌హట్

ప్రస్తుతమున్న సరిహద్దు స్తంభము సంఖ్య 1266/13–ఎస్ తోపాటు దక్షిణ భాగమున ఉన్న నాలా వరకు తూర్పు–పడమరను సూచిస్తూ ఉన్న వేరొక నాలా వరకు చేరునంతవరకు సరిహద్దును గీయవలెను. ఆ తరువాత పడమటి దిశ నాలా యొక్క తూర్పు దిశలోని చివర అది పోవునట్లు అది ప్రస్తుతమున్న అంతర్జాతీయ సరిహద్దు ఉత్తర నిర్దేశము యొక్క స్తంభముల సంఖ్యలు 1267/4–ఆర్–బీ చే మరియు 1267/3–ఆర్–ఐ చేరునట్లు సరిహద్దును గీయవలెను.

(vi) ద్వాకి/ టామాబిల్ ప్రాంతము

ప్రస్తుతమున్న అంతర్జాతీయ సరిహద్దు యొక్క స్తంభముల సంఖ్యలు 1275/1–ఎస్ నుండి సరిహద్దు స్తంభము సంఖ్యలు 1275/7–ఎస్ కలుపుతున్న తిన్నని మార్గముచే సరిహద్దును గీయవలెను. ఆ పక్షకారులు ఈ ప్రాంతములో 'జీరో మార్గము' పైన కంచె వేయుటకు కరారు చేసుకొనెను.

(v) నాల్‌జురి/ శ్రీపూర్ ప్రాంతము

(ఎఎ) నాల్‌జురి– I

ప్రస్తుతమున్న సరిహద్దు స్తంభముల సంఖ్య 1277/2–ఎస్ నుండి దక్షిణ దిశలోని విడదీసిన పటము సంఖ్య 166లో వర్ణించబడినట్లుగా మూడు ప్లాట్ల వరకు సరిహద్దు స్తంభము సంఖ్య 1277/5–టీ నుండి నాలాను అనుసరిస్తూ దానిని చేరునంతవరకు అక్కడి నుండి సరిహద్దు మార్గము ఉండగలదు. తదుపరి బంగ్లాదేశ్ దిక్కు రెండు ప్లాట్ల వరకు దక్షిణ దిశలోని నాలా యొక్క పడమటి చివరి వరకు అది వెళ్లకలదు. తదనంతరము సరిహద్దు స్తంభము సంఖ్య 1277/4–ఎస్ నుండి దక్షిణ దిశలో గీసిన మార్గమును చేరుతూ పడమటి దిశకు వెళ్లునట్లు ఉండవలెను.

(ఎబి) నల్‌జూరీ– III

ప్రస్తుతమున్న సరిహద్దు స్తంభము సంఖ్య 1278/2–ఎస్ నుండి సరిహద్దు స్తంభము సంఖ్య 1279/3–ఎస్ వరకు తిన్నని మార్గముచే సరిహద్దును గీయవలెను.

